శ్రీ హయగ్రీవాయ నమః

# భక్తినివేదన

## (వేదాంత మాసపత్రిక)

సంపాదకులు:
శ్రీ వి. ప్ర. సం. ప్రధానకార్యదర్శి
శ్రీ కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు:
కవిరత్న
గుడిమెళ్ల రామానుజాచార్యః





[illegible]





# శ్రీ బదరీనారాయణముని
## అష్టాక్షరీ మందిరమునకు విరాళములు

—x—

బరంపురం వాస్తవ్యులగు శ్రీమాన్

శ్రీ వైశ్యరాజు బదరీనారాయణరాజుగారు అష్టాక్షరీ మందిరము లోఒక గది నిర్మించుటకుగాను సమర్పించినది. 3501

బదరీ శ్రీనివాసరామానుజ స్వామివార్ల శాశ్వత పూజకు విరాళముల సమర్పించినవార్ల నామధేయములు.

బరంపురం

శ్రీమాన్ రు.

" పరాంకుశం పార్థసారధిగారు (ఆడిటర్) 275
" ఆత్మకూరి వరదరాజశ్రేష్ఠిగారు 75
" చెవ్వా సత్యనారాయణగారు 8
" ఆత్మకూరి సూర్యనారాయణగారు 29
" బరిగడ శ్రీరాములుగారు 29
" గోడూరు వెం...మదాసు పంతులుగారు 29
" కవిదిగ త్రివేణమ్మ, సింగిత సీతమ్మగారు 29
" గండి అన్నపూర్ణమ్మగారు 29
" రావికంటి వెంకుబాయమ్మగారు 29
" ఎస్. వి. సుభద్రమ్మగారు 29
" కాళ్లూరి తిరుమలరావుగారు 29
" పెండాడ సన్యాసి సుబుద్ధిగారు 29
" శిల్లా కృష్ణమూర్తిగారు 11
" సుంకురాజ గోపాలరావుగారు 11
" ఆత్మకూరి రామమూర్తిగారు 11
" శిల్లా లక్ష్మినారాయణగారు 11
" మండా వెంకటరమణయ్యగారు 29
" గాదె వెంకట రమణయ్యగారు 29
" చక్కా పద్మావతమ్మ 29
" రావికంటి వెంకుబాయమ్మగారు 29
" గాదె గోపాలంగారు 29
" బచ్చు నరసింహస్వామిగారు 29
" పరాంకుశం సీతమ్మగారు 29
" బరంపురం యతిరాజ మహిళామండలి 29
" తంగుడు నారాయణమూర్తిగారు 29
" జమ్ముల శ్రీరంగంగారు 29

( తరువాయి 11వ పేజీలో )

శ్రీ హ య గ్రీ వా య న మః



# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)


| సంపుట 10 | హేవిళంబి- చైత్ర మాసము | సంచిక 1 |
|---|---|---|


## ప్రచార విభాగము — సాంఘిక వార్తలు

---o---

## ఆంధ్రదేశములో, శ్రీ జీయర్‌స్వామివారి శ్రీ పాదయాత్ర

---o---

### బరంపురం సమాచారము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాశ్వతాధ్య క్షులగు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారున్ను, వారితో పాటు ప్రధానకార్యదర్శి. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారున్ను, తమ స్వంత మోటారు వ్యానుమీద పూరీ జగన్నాథ క్షేత్రము ల మీదుగా బరంపురమునకు 22-2-57 న తేదీ సాయంకాలమునకు విచ్చేసిరి.

శ్రీవారి శుభాగమనమును విని బరంపురములోని పురప్రముఖులు. శ్రీమాన్ పరాంకుశం పార్థసారథిగారు (ఆడిటర్) శ్రీ ప్రత్తి సత్యనారాయణగారు, శ్రీమాన్ బచ్చునరసింహస్వామిగారు ఆకారం సత్యనారాయణగారు. ఇత్యాది భక్తశిఖామణులు వివిధ మంగళవాద్య పురస్సరముగా అఖండస్వాగత మొసంగిరి.

23, 24, తేదీలలో శ్రీ వైద్యరాజు కాశీ విశ్వనాథరాజుగారి శ్రీకృష్ణ మందిరము లో మకాం చేసిరి.

ఈనాడే నడిగడ్డపాలెం ఆశ్రమంనుండి సంఘ కవిగారైన శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులువారు శ్రీ జీయర్ స్వామివారితోపాటు ఆంధ్రదేశములో పాదయాత్రగా పర్యటించుటకు బరంపురమునకు విచ్చేసిరి.

శ్రీ జీయర్ స్వామివారి నిత్యకార్యక్రమము,

తె॥ గ. 4-30 శ్రీ విష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధిగోష్ఠి.
ఉ॥ గ. 7-30 తీర్థప్రసాదగోష్ఠి.
గ. 8-0 శ్రీ భాష్యకాలక్షేపము.
గ. 8-30 గీతాధ్యాయపారాయణ.
గ. 9- తిరుమంత్రార్థ కాలక్షేపము.
గ. 10- శ్రీ పాదతీర్థ ప్రదానము.
మ॥ గ. 11- భిక్షాస్వీకారము, విశ్రాంతి, ఉత్తర ప్రత్యుత్తర పరిశీలన.
గ. 2- నుండి శ్రీ గోపాలాచార్య స్వామివారి కాలక్షేపగోష్ఠి.
సా॥ గ. 4- నుండి శ్రీ కవిగారి కావ్యగోష్ఠి.
గ. 6- నుండి శ్రీ జీయర్ స్వామివారి గీతోపన్యాసగోష్ఠి.
రా॥ గ. 9- లకు పురప్రముఖులతో ఇష్టాగోష్ఠి విశ్రాంతి

బరంపురములో అనేక ప్రదేశములయందు శ్రీ జీయర్ స్వామివారు వేదాంతోపన్యాసములను కృపచేసి ప్రతివ్యక్తి హృదయములోను, ఆధ్యాత్మికశక్తిని రేకెత్తించిరి.

బరంపురములో శ్రీ జీయర్ స్వామివారు ఉపన్యసించిన విషయములు.

26 2 57 ఆచార్య 'సమాశ్రయణము'
27 2 57 'వైదికధర్మములు'
28 2 57 'దేహాత్మభ్రమ'
1 3 57 'జ్ఞానసాధనము'
2 3 57 'దేహాత్మ వివేకము'
3 3 57 'ముక్తుని గమనవైఖరి'
4 3 57 'అద్వైతము'
5 3 57 'ద్వైతము'
6 3 57 'విశిష్టాద్వైతము'
7 3 57 'ఇతరమత నిరూపణ'
8 3 57 'మనకు మతమేల'
9 3 57 'మతత్రయ సారాంశము'
10 3 57 'గీతావతరణము'
11 3 57 'శీతోష్ణ సుఖదుఃఖములు'
12 3 57 'తత్త్వత్రయము'
13 3 57 'చరమశ్లోకార్థము'

శ్రీమాన్ విద్వాన్ శ్రీ గోపాలాచార్య స్వామివారు 26 వ తేదీనుండి 2-3-57 వరకు ప్రతిదినము మధ్యాహ్నం 2 గంటలనుండి తిరుప్పావులో శ్రుతిశత శిరస్సిద్ధమధ్యాపయంతీ" అను సారస్యమును చక్కగా ఉపన్యసించిరి. ఆమరునాడు సీతాకళ్యాణములో చక్కని సంప్రదాయార్థములను సహృదయరంజకముగా ఉపన్యసించిరి. 2-3-57 వ తేదీనాడు కతిపయ కార్యవ్యగ్రతవల్ల స్వగ్రామం కోరుకొండకు వేంచేసిరి.

ఆ తరువాత శ్రీకవిగారు ప్రతిదినం మధ్యాహ్నం 3 గంటలనుండి ఆలయములో, తమ కావ్యగోష్ఠితో కాలక్షేపము గావించిరి

ఆధ్యాత్మిక వ్యాసములయందు బరంపుర వాస్తవ్యులగు స్త్రీలు పురుషులు చూపించిన భక్తిశ్రద్ధలు వాచామగోచరములు. బరంపురము బ్రహ్మపురము అనుటలో సందియము లేదు బ్రహ్మజ్ఞానము కలిగియున్నది గనుకనే బరంపురం బ్రహ్మపురమైనది

తెల్లవారుఝామున, తిరువీధి గోష్ఠిలో, పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు, కడకు మూడు కాళ్ళు గల ముదుసలులు కూడ అన్వయించి ఇప్పటివరకెట్లే ప్రభాతభేరి నిర్వహించుచున్నారు. శ్రీవారికి వీడ్కోలు ఇచ్చునాటి

దృశ్యము అపూర్వము. దాదాపు 2 మైళ్లవరకు స్త్రీలు పురుషులు అందరు వచ్చి కంటతడితో గద్గదస్వరముతో ఆస్వామిజీ అనుజ్ఞను శిరసావహించిరి. బరంపురం వాస్తవ్యులు చూపిన భక్తిశ్రద్ధలు ఎన్నటికీ మరువరావు.

బరంపురములో శ్రీ స్వామివారు వేంచేసి యుండగా పలువురు వారిచెంత చక్రాంకణమై మంత్రోపదేశమందిరి.

ఒకనాడు శ్రీ స్వామివారియందు అత్యంత భక్తి విశ్వాసములుగల శ్రీ పత్రి సత్యనారాయణగారు శ్రీవారిని స్వస్తివాచక మంగళ వాద్య పూర్వకముగా తమ శ్రీ భవనమునకు వేంచేపు చేసుకొని వెళ్ళి పాదపూజ గావించిరి. రు. 58 అర్థనూటపదహారులు సమర్పించిరి.

ఆ మరునాడు శ్రీమాన్ పరాంకుశం పార్థసారథిగారు (ఆడిటర్) శ్రీవారిని మహా వైభవముగా బ్రాహ్మణస్వస్తివాచకములతో, ఛత్రచమరాదిలాంఛనములతో, బంధుమిత్రాదులలో అఖండవైభవముగా తమ దివ్య ప్రాసాదమునకు వేంచేపు చేసుకొని పాదపూజ గావించి ఆనందించిరి.

(పాదపూజలు రు. 58 అర్థనూటపదారులు సమర్పించిరి.

శ్రీ పార్థసారధివారు ఆసమయములోనే గోల్కొండ శ్రీ వైష్ణవశాఖ సంఘము తరపున 116/ నూటపదారులు సమర్పించిరి.

ఇంతమాత్రమేగాక వారే బదరీ శాశ్వత పూజకుగాను 275/లు సమర్పించిరి.

శ్రీ పార్థసారథిగారు, తమ పలుకుబడిని ఉపయోగించి పలువురకు బదరీ కైంకర్యమును ప్రోత్సహించిరి. బరంపురములో బదరీపూజకు పెక్కుమంది తమ పవిత్ర ద్రవ్యమును సమర్పించిరి.

"అయంవిశేషః" బరంపురములో, ప్రఖ్యాత వైశ్యరత్నము,నిరంతర దానధర్మ పరాయణులు అగు శ్రీ వైశ్యరాజు బదరీనారాయణరాజుగారు తమ తండ్రిగారి స్మృతిచిహ్నముగా అష్టాక్షరీ మందిరములో ఒక గది నిర్మించవలసినదిగా శ్రీ స్వామివారికి వెంటనే 3500/ మూడువేల అయిదువందల రూపాయల చెక్కును వ్రాసి సమర్పించిరి.

తరువాత శ్రీ వెంకటేశ్వర స్వామి వారి ఆలయ వంశపరంపరా ధర్మకర్తలు మేనేజింగ్ ట్రస్టీగారగు శ్రీమాన్ ఆత్మకూరి వరదరాజ శ్రేష్ఠిగారు గీతామంత్రార్థ కాలక్షేపములు స్వామివారు కృపచేయుచుండగా విశేష భోగములు చేయించుటయే గాక బదరీ శాశ్వత పూజకు 275/ లను సమర్పించిరి.

ఆ దేవస్థానం స్థానాచార్యులుగారగు శ్రీమాన్ ఉభయ వేదాంత విద్వాంసులు శ్రీమత్తిరుమలపెద్దింటి రాఘవాచార్య స్వామి వారును వారి సతీమణిగారు శ్రీమతి తిరువేంగడమ్మగారును శ్రీ స్వామివారియందు చూపించిన ఆదరాభిమానములు వాచామగోచరములు. ఆ పుణ్యదంపతులు సంప్రదాయాభి వృద్ధికి, ఎంతయో శ్రమపడి వన్నెదెచ్చిరి. శ్రీయఃపతి శ్రీరాఘవాచార్య స్వామివారికి సర్వదా ఆరోగ్యభాగ్యమును ప్రసాదించవలసినదిగా ప్రార్థించుచున్నాము.

మరియొక్క గొప్ప విశేషము - శ్రీ స్వామివారు ఇచట వేంచేసి యుండగానే విజయవాడలో జ్యేష్ఠమాసములో జరుగబోవు కృష్ణాపుష్కర సందర్భములో బ్రహ్మయజ్ఞము చేయ సంకల్పము గలిగినది. ఆ యజ్ఞములో రోజు 1కి పదివేలమందికి అన్నదానమున్ను ఒక వేయిమంది శిశువులకు క్షీరదానమున్ను ఇందుకు ఒక్కొక్కరోజు ఒక గ్రామం భరించవలసినదని ఒకనాడు బరంపురము సభలో శ్రీ స్వామివారు

మంత్రానుసంధానముతో బయలుదేరుచుండగా శ్రీయుత పార్థసారథిగారున్ను, శ్రీ బచ్చు నరసింహస్వామిగారున్ను, శ్రీ ప్రత్తి సత్యనారాయణగారున్ను వీరు ముగ్గురు 4 మైళ్ళదూరము దాక నడచివచ్చి శ్రీ స్వామివారిని 'హాళిదియాపురం' అనుచోట బస ఏర్పాటుచేసి తిరిగి బరంపురము వేంచేసిరి.

14-3-57 హాళిదియాపురం

ఇచ్చట బరంపురమునుండి కాలినడకతో వచ్చి శ్రీ స్వామివారు మకాంచేసిరి. ఇచ్చట శ్రీ ఈపరి లక్ష్మీనారాయణగారి తోటలో బస చేసిరి, వారే ఆతిథ్యమిచ్చిరి. వాతావరణము చాలా ప్రశాంతముగానున్నది. చల్లని మామిడి తోట, కోనేరు, చక్కని భవనము. తిరువారాధనచేసుకొని సాయంత్రమునకు వీరు బదరిలో తల్లి స్మృతిచిహ్నముగా బదరీనారాయణములో ఒక గది కట్టించుటకు ఆలోచించుచున్నారని తెలిసినది.

15-3-57 గొళింతర

అనే గ్రామమునకు చేరుకొనిరి. మార్గమధ్యములో, శ్రీ అంబటిపూడి అప్పారావు పంతులుగారున్ను, శ్రీ తురగా సత్యనారాయణపంతులుగారున్ను శ్రీ స్వామివారి పాదయాత్రలో అన్వయించి గొళింతర రైల్వేస్టేషనుచెంత చక్కని వసతికల్పించిరి. ఆ రాత్రి అచ్చట గడిపి ఉదయము తిరువారాధన ముగించుకొని పగలు 9 గంటలకు బయలుదేరిరి. ఇచ్చటుండగా రైల్వేమేష్టరుగారు శ్రీ న్యాపతి పార్థసారథి శ్రీనివాసరావుగారు శ్రీ స్వామివారికి భక్తిపూర్వకముగా ఆతిధ్యవసతి గల్పించిరి. ఇచ్చటి నుండి సాయంకాలమునకు ఇచ్ఛాపురం చేరుకొంటిమి

ఇచ్ఛాపురం 16-3-57, 17-3-57, 18-3-57

ఇచ్చట మూడు రోజులు శ్రీ స్వామివారు మకాంచేసిరి. యథాప్రకారముగా తెల్లవారుఝామున శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధి గోష్ఠి జరిగెను. ఒకరోజు సాయంకాలము హైస్కూలులో శ్రీ స్వామివారు ఉపన్యసించిరి. ఉదయం సాయంత్రం శ్రీ జగన్నాథస్వామివారి కోవెలలో గీతాపారాయణ ఉపన్యాసములు జరిగెను అచ్చటకూడ శ్రీ స్వామివారు మహిళామండలిని స్థాపించి శుక్రవార పూజోత్సవవిధానమును బోధించిరి. ఒక శుక్రవారము నాడు ఆ విధానమును దగ్గరయుండి చేయించిరి. పెక్కురు స్త్రీలీ ఉత్సవములో పాల్గొని శాశ్వతముగా జరిపింతుమని వాగ్దానము గావించిరి మరియు ఇచ్చట స్థానాచార్యులవారి కుమారులు హైస్కూలులో తెలుగు పండితులు వ్యాకరణ శిరోమణి శ్రీమాన్ కందా వెంకట కృష్ణమాచార్యులుగారు ఇచ్ఛాపురములో మాకు వసతియు ఏర్పాటుచేయుటయేగాక మాతోకూడ పాదయాత్రగా బయలుదేరి ప్రతి మకామున ముందువెళ్ళి అచ్చట సౌకర్యములు కలిగించిరి. వీరు చేసిన సేవ అత్యద్భుతము. వీరు సోంపేటవరకు మాతో విచ్చేసిరి. వీరి సౌశీల్యము వాచామగోచరము, వీరితోపాటుగా ఇచ్ఛాపురమునుండి పాదయాత్రగా శ్రీ రావి వేంకట యజ్ఞేశ్వర సూర్యనారాయణమూర్తిగారు ఇప్పటికి మాతో వచ్చుచునేయున్నారు. ఇదియేదియో జననాంతర సౌహృదము.

19-3-57 ఖొజ్జియాకోడ్

ఇచ్ఛాపురంనుండి 19 వ తేదీ ఉదయము బయలుదేరి ఖొజ్జియాకోడ్ గ్రామమునకు వచ్చుచుండగా దారిలో శ్రీ ఆళి నీలాద్రిరెడ్డిగారు మాజీ M. L. A. గారు శ్రీ స్వామివారితోపాటు 2 మైళ్ళు నడచి వచ్చి ఆధ్యాత్మిక, రాజకీయ సామరస్యము గురించి ఎన్నియో ప్రశ్నలు వేసి సంతృప్తికరమగు సమాధానము బడసి

ఆనందించిరి. మధ్యాహ్నం ఖొజ్జియాకోడ్‌లో తిరువారాధన గావించికొని రాత్రికి రాజపురం గ్రామమునకు చేరుకొంటిమి.

రా జ పు ర ం

ఆరాత్రి అచ్చటగడిపి వేకువజామున 4 గంటలకే లేచి శ్రీ విష్ణు సహస్రనామ పారాయణతో తెల్లవారుసరికి 'కవిటి' గ్రామం చేరుకొంటిమి.

20-3-57 'కవిటి' గ్రామం.

ఈనాడు ఈ గ్రామంలో మకాం చేసితిమి. ఇచ్చట శ్రీ బెందాళం పట్టాభిరామయ్యగారను ఒక భక్తశిఖామణి శ్రీ స్వామివారికి ఆతిథేయ సత్కారములను చేసిరి. సాయంకాలము వారు స్వయముగా కట్టించిన దేవాలయములో శ్రీ స్వామివారు మనమెవ్వరము? అనే విషయమును గురించి ఉపన్యసించిరి. వీరు బదరీ కైంకర్యము చేసిరి.

సాయంకాలము 4 గంటలవేళ శ్రీ కవిగారు కవిటనుండి "రామయ్య పుట్టుక" గ్రామం వెళ్లి అచ్చట శ్రీ బెందాళం లచ్చయ్యనాయుడు గారిని చూడగా వారు బ్రహ్మయజ్ఞములకు కించిత్కార కైంకర్యములను గావించిరి.

ఈ కవిటిగ్రామంలో దృశ్యం అపూర్వము ఫర్లాంగుదూరములో ప్రశాంత గంభీరమైన సముద్రము, చల్లని కొబ్బరితోటలు మామిడితోపులు, అరటిచెట్లు, మొగలిపొదలు, ఇసుకప్రదేశములు, చక్కని మాగాణిభూములు, జీడిమామిడి తోటలు కనుకనే ఈ ప్రాంతమునకు "ఉద్యానం" అనేపేరు వచ్చినది.

దారిపొడుగున మేమీ ప్రకృతిశోభను చూచుచూ మైమరచిపోతిమి. ఆహా జడ స్వరూపమైన ప్రకృతికే ఇంతటి సౌందర్యమున్నదే. అజడ స్వరూపమైన పరమాత్మకింకెంతెంతసౌందర్యముండునో ఆ సౌందర్యము మనవంటి చర్మ చక్షుస్సులకు కానిపింపదు కాబోలు. ఈ రెండింటికి సృష్టికర్తయైన ఆ పరమాత్మ సౌందర్యమును గురించి ఇంకేమి అనగలము. కనుకనే "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహి"

21-3-57 బొరివంకగ్రామం.

కవిటగ్రామమునుండి ఉదయమే బయలుదేరి బొరివంక గ్రామమునకు శ్రీవారు విచ్చేసిరి. ఇచ్చట భక్తులు, శ్రీ వైష్ణవ సంప్రదాయజ్ఞులు అగు శ్రీ బెందాళం వెంకటనరసయ్యశర్మగారు శ్రీ స్వామివారికి హృదయపూర్వకముగా చక్కని ఆతిథ్యమిచ్చిరి, బదరీ శాశ్వతపూజకు సమర్పించిరి

రాత్రికి - మాణిక్యపురం - చేరుకొంటిమి మరునాడు.

22-3-57 "అమ్మవారి పుట్టుక" గ్రామం

అమ్మవారి పుట్టుక గ్రామం చేరుకొంటిమి. ఇచ్చట వేంచేసియున్న శ్రీ వైష్ణవస్వాములు శ్రీ స్వామివారిని అత్యంత శ్రద్ధాపూర్వకముగా ఆదరించిరి. మధ్యాహ్నం తిరువారాధన గావించుకొని సాయంకాలమునకు సోంపేటకు చేరుకొంటిమి.

23-3-57 24-3-57 25-3-57 సోంపేట.

ఈ గ్రామంలో రెండు రోజుల పూట మాత్రమే యుంటిమి. ఇచ్చట ఆలయములో మకాం చేసితిమి ప్రతిరోజు సాయంత్రం 6 గంటలకు దివ్యజ్ఞాన సమాజములో శ్రీ కవిగారున్ను శ్రీ స్వామివారున్ను ఉపన్యసించిరి. ఇచ్చట శ్రీ డిస్ట్రిక్టుమున్సబుగారొకరు బదరీ పూజ గావించిరి 25 వ తేదీ మధ్యాహ్నం బయలుదేరి బారువ సాయంత్రం చేరుకొంటిమి.

"బారువ"

ఈ బారువగ్రామంలో ఈరాత్రి జగన్నాథస్వామివారి ఆలయములో గడిపితిమి. ఇచ్చట

శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల వెంకట చక్రవర్తులాచార్యులుగారు తెలుగు పండితులు శ్రీ స్వామివారికి వలయు ఏర్పాట్లు ఆరాత్రి గావించిరి.

26-3-57 "కొర్లాం"

ఈరోజు ఉదయం నాలుగుమైళ్లు నడచి ఈ గ్రామం ప్రాంతంలో ఒక చక్కని ఏటిగట్టున మామిడితోటలో ఆగి శ్రీ స్వామివారు తిరువారాధన గావించిరి. సాయంత్రము నకు 6 మైళ్లు నడచి మందసా గ్రామం చేరుకొంటిమి

27-3-57, 28-3-57 "మందసా"

మందసా గ్రామంలో 27, 28 తేదీలలో శ్రీ స్వామివారు మకాం చేసిరి. ఈ గ్రామంలో దాదాపు 25 సంవత్సరముల పూర్వము ఈమన జీయర్‌స్వామివారున్ను శ్రీ గోపాలాచార్య స్వామివారున్ను శ్రీభాష్యం కాలక్షేపం చేసి శాత్తు జరిపిరి. ఆనాడు ఈ రాజాస్థానములో శ్రీమాన్ న్యాయవేందాతపతి తె. సం. రామానుజాచార్య స్వామివారు సంస్థాన పండితులుగానున్నారు. ఆ శ్రీభాష్యము సేవించిన పవిత్ర స్థలముగదా యని కృతజ్ఞతా సూచకముగా యీ మందసా గ్రామం విచ్చేసిరి. ఆనాటి ఇల్లు శిధిలావస్థలో నున్నది. ఆప్రాంతమునకు అంజలి గావించి శ్రీవారు శ్రీ వాసుదేవస్వామి దేవాలయమునకు విచ్చేసి స్వామిని సేవించిరి. ఆనాడు ఏకాదశి. శ్రీ స్వామివారికి ఏకాదశి దీక్ష నియత్రవలము. నిర్జలైకాదశిగా నుందురు. ఆనాడు ఎచటకి పయనించరు ఆ మరునాడు ద్వాదశి ౪ గంటలకు పూర్తి గావించుకొని బయలుదేరబోవుచుండగా ఒకస్వామి బలవంతము చేయగా ఆగవలసి వచ్చినది. ఇచ్చటున్న ఆ రెండు దినములు శ్రీ ఎర్రిగుంట్ల రామమూర్తి గారు శ్రీ స్వామివారికి అన్నివిధముల ఆతిథ్య సత్కార సౌకర్యములను ఏర్పాటు చేసిరి. వీరికి సహచరులుగా శ్రీ కొమ్మాజోస్యుల అప్పల సూర్యనారాయణగారున్ను ఎంతయో భక్తిశ్రద్ధలు చూపిరి

29, 30. 31 తేదీలలో "పలాసా"

ఈ మూడురోజులు పలాసాలో శ్రీ స్వామివారు మకాం చేసినారు. 29 వ తేదినాడు ఒక కొండదారి బట్టి 7 మైళ్లు నడచి పలాసా చేరుకొంటిమి ఆ అడవి చాలా భయంకరముగానే యున్నది దారి చూపుటకు ఒక కూలి మనిషిని మందసానుండి వెంట తీసుకొని వచ్చితిమి

పలాసాలో శ్రీ రామకృష్ణ సేవాసంఘము వారు ఆరోజున శ్రీ స్వామివారికి చక్కని ఆతిథ్య మిచ్చిరి. సాయంకాలము ఆలయములో ~~బహిరంగసభ జరిగెను శ్రీ స్వామివారు భగ~~ వన్మతమును గురించి ఉపన్యసించిరి. ఆమరునాడు పురజనులు బలవంతము చేయగా శ్రీ స్వామివారి గ్రామంలో నున్న సత్రములో మకాం చేసిరి. ఈనాడు శుక్రవారమగుటచే ఇచ్చట మహిళా మండలిని ఏర్పాటుచేసి శ్రీ స్వామివారు శుక్రవార పూజోత్సవమును స్త్రీలచే చేయించిరి. స్త్రీలు అందరు శాశ్వతముగా చేయుదుమని వాగ్దానము గావించిరి, ప్రతిదినము ఉదయం రాత్రి ఉపన్యాసములు జరిగినవి. శ్రీ కవిగారు కూడ ప్రతిరోజు కవితా గానము చేయుచుండిరి. నిన్నటిదినము హైస్కూలులో గురుభక్తిని గురించి శ్రీ స్వామివారు ఉపన్యసించిరి.

రేపు ఉగాది. ఇంతవరకు దుర్ముఖినామ సంవత్సర అమావాస్యనాటివరకు జరిగిన స్వామివారిపాదయాత్రా వార్తావిశేషములు.

పత్రికానుబంధము




**Sri Visishtadwaitha Pracharaka Sangham,**
**NIDUMUKKALAVARI RAMANUJAKUTAM,**
**VIJAYAWADA-1. (Krishna Dt.)**

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము, నిడుముక్కలవారి రామానుజకూటము, విజయవాడ-1.

అధ్యక్షులు : శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి

కార్యదర్శి : శ్రీ విద్వాన్. తె. కం. గోపాలాచార్యస్వామి

# శ్రీ కృష్ణానదిపుష్కరములు, "బ్రహ్మయజ్ఞము", "కోటితులసీపూజ"

విజయవాడలో ప్రారంభము తేది 23—6—1957 లగాయతు తేది 4—7—1957 వరకు; మొత్తం పన్నెండు రోజులు

విశ్వశాంతి నిమిత్తమై, విజయవాడ పట్టణమున కృష్ణానది పుష్కరములు జరుగు సందర్భమున స్వస్తిశ్రీ హేవిళంబినామ సంవత్సర జ్యేష్ఠ బ ౧౧ ఆదివారము తే 23-6-57 దీ లగాయతు, ఈ ఆషాఢ శు॥ సప్తమి 4-7-57 వరకు-మొత్తం 12 రోజులు చతుర్వేద స్వాధ్యాయాత్మక జ్ఞానయజ్ఞరూప "బ్రహ్మయజ్ఞము" జరుపుటకు నిర్ణయించడమైనది.

అ) ఈ యజ్ఞమునకు, యావత్ భారతదేశమందలి సంపూర్ణస్వాధ్యాయవేత్తలగు (పరీక్షనిచ్చి పట్టాలనుపొందినట్టిగాని, ప్రమాణపత్రములు చూపగలయట్టిగాని) వేదపండితులను, అవకాశ మున్నంత హెచ్చుమందిని, ఆహ్వానించవలయును.

ఆ) మొదటిదినమున, అంకురార్పణయు, పదిరోజులు యజ్ఞమును, ఆఖరిరోజున అవభృథస్నానోత్సవమును జరుపవలయును.

ఈ యజ్ఞమునకు రాష్ట్రపతిని లేక ఉపరాష్ట్రపతిని, శ్రీ ఆంధ్రదేశ గవర్నరు శ్రీ త్రివేదిగారిని, కేరళదేశ గవర్నరు శ్రీ రామకృష్ణారావుగారిని, ఉత్తర ప్రదేశ గవర్నరు శ్రీ మున్షీగారినిగాని, ఆహ్వానించవలయును.

ఇ) ఈ యజ్ఞమున రోజు 1కి సుమారు పదివేలమందికి చొప్పున మొత్తము ఒక లక్ష మందికి అన్నదానము జరుపవలయును. రోజు 1కి సుమారు ఒక వెయ్యిమంది శిశువులకు చొప్పున మొత్తము పదివేలమంది శిశువులకు పాలను పంచిపెట్టవలెను.

## ప్రతి కా ను బ ం ధ ము

ఈ) అలోపతి, ఆయుర్వేదపతి, హోమియోపతి వైద్యులను, ఔషధశాలలను ఏర్పాటుచేసి. వైద్యసహాయమును చేయవలసినది.

ఉ) ప్రతిదినము ఉదయము గం॥ 4½ లగాయతు 5½ వరకు విష్ణుసహస్రనామ పారాయణముతో ప్రభాతభేరి ఉత్సవము; గం 6½ లకు తీర్థగోష్ఠి గం॥ 7 లు లగాయతు గం॥ 8 ల వరకు వేదపారాయణముతో తిరువీధి ఉత్సవము; గం॥ 8 లగాయతు గం॥ 10 ల వరకు నాలుగువేదములు అఖండపారాయణము. (విష్ణు సహస్ర నామములతో. శ్రీ తులసి లక్షార్చన, దీపారాధన, కుంకుమతో లక్ష్మి అర్చన, హవనము; గం॥ 10-30 లకు నిత్యపూర్ణాహుతియు జరుపుచుండవలయును.

ఊ) శ్రీ యతిరాజ సేవా మహిళామండలియొక్క విరాట్ సమావేశమును ఏర్పాటుచేసి, ప్రతినిత్యము మధ్యాహ్నము, 1 గంట లగాయతు 2½ గంటల వరకు విదుషీమణుల ఉపన్యాసములను ఏర్పాటు చేయవలసినది.

ఋ) శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘముయొక్క విరాట్ సమావేశమును, ఏర్పాటుచేసి, ప్రతినిత్యము సా॥ గం॥ 2½ లగాయతు గం॥ 4½ వరకు పండితోపన్యాసములు ఏర్పాటు చేయవలసినది.

ౠ) ప్రతి నిత్యము సా॥ గం॥ 4½ లగాయతు 6½ గం॥ వరకు వేదసభలు ఏర్పాటుచేసి, వేద వేదార్థోపన్యాసముల నేర్పాటు చేయవలసినది.

ఌ) రాత్రి గం॥ 7 లగాయతు శాంతిపాఠము, గం॥ 9 లు మొదలు భజన సంకీర్తనలు కథాకాలక్షేపములు జరుపించవలసినది.

ఎ) ఈ కార్యక్రమములో మీరందరు పాల్గొనవలసినదిగను, దీనియొక్క వైభవోపేత సక్రమ నిర్వాహణమునకై అన్నివిధములను తోడ్పడవలసినదిగను, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్కయు, శ్రీ యతిరాజ సేవా మహిళామండలియొక్కయు, సభ్యుల నందరును, సానుభూతిపరులను, శాఖాసంఘ సభ్యులను, సంబద్ధ సంస్థా సభ్యులను, ధార్మికపురుషులను ఇందుమూలముగా కోరడమైనది.

పత్రికానుబంధము

## శ్రీ కృష్ణానది పుష్కరములు— బ్రహ్మయజ్ఞము, కోటితులసి పూజ

వీనికి కావలసినవి.

సుమారు 1008, ఋత్విక్కులు మున్నగువారికి రాకపోకల ఖర్చులు.

... ... ... ... యజ్ఞదక్షిణలు

... ... ... ... దీక్షావస్త్రాదికములు.

యజ్ఞశాల-పాకశాల-వసతిశాలల నిర్మాణమునకై తాటియాకు, వెదురు,
బొజులు, నార, అలంకారములు, లైటింగు వగైరాలు.
యజ్ఞసంభారములు-ఆహుతి ద్రవ్యములు, ఆవునేయి వగైరాలు
పాచకకైంకర్యపరులు -వీరలకు సంభావనాదికములు—

వడ్డనకైంకర్యపరులు—

స్వయం సేవకులు—

పాలపాడి—

అలోపతి - ఆయుర్వేద - హోమియోపతి మందులు—

ఈ ద్రవ్యములలో మీకుచితమని తోచినవాటిని, మీయవకాశానుసారముగ సమర్పింపవచ్చును

మరియు

భక్తులారా! మీ తోటలలోను, దొడ్లలోను, పొలములలోను, లేక కుండీలలోను, తులసిమొక్కలను యిప్పటినుండియు శ్రద్ధగా పెంచి, ఆ తులసిదళములను ఈ పుష్కర పుణ్య దినములలో కోటి తులసిపూజకై సమర్పింపుడు. తులసి విత్తనములు కావలసినచో మావద్దనుండి తెప్పించుకొనుడు.

అధ్యక్ష కార్యదర్శులు సంచారములో యుండుటచేత పై కార్యక్రమమునకు వలయు ధనమునుగాని బియ్యము పప్పు వగైరా అన్నశాంతి సామగ్రినిగాని విరాళములు వసూలు పరచుటకు వీలులేకున్నది. గాన తాము దయయుంచి తాము వచ్చునపుడు తమ కవకాశ మున్నంతవరకు స్వయముగను, తమ ప్రాంతములయందు వసూలుపరచియును బియ్యము, పప్పు నేయి కూరలు వగైరాలను విజయవాడకు తెచ్చి యిచ్చి ఈ కార్యక్రమమును నిర్వహింప గోరుచున్నాము. పుష్కర పుణ్యదినములలో యజ్ఞసమయమున ప్రతివ్యక్తియు శక్తికొలదియు తదీయారాధనము సలుపుట అత్యంత విశేషముగదా.

# పత్రికానుబంధము

## —: అన్నశాంతికి కావలసిన ద్రవ్యములు :—

| | ఒకరోజుకి కావలసినవి. | | | | | 12 రోజులకు కావలసినవి. | |
|---|---|---|---|---|---|---|---|
| బియ్యం | బ. | 25 | × | 12 | = | 300 | బస్తాలు. |
| కందిపప్పు | బ. | 3 | × | 12 | = | 36 | బ |
| పెసరపప్పు | బ. | 1 | × | 12 | = | 12 | బ. |
| మినపపప్పు | బ. | ½ | × | 12 | = | 6 | బ. |
| శనగపప్పు | బ. | 1 | × | 12 | = | 12 | బ. |
| బెల్లం | మణుగులు | 3 | × | 12 | = | 36 | మణుగులు |
| చింతపండు | ,, | 25 | × | 12 | = | 300 | ,, |
| మిరపకాయలు | ,, | 5 | × | 12 | = | 60 | ,, |
| ఆవాలు | ,, | 1½ | × | 12 | = | 18 | ,, |
| మెంతులు | ,, | 1 | × | 12 | = | 12 | ,, |
| జీలకఱ్ఱ | ,, | 1 | × | 12 | = | 12 | ,, |
| ధనియాలు | ,, | 1½ | × | 12 | = | 18 | ,, |
| పసుపు | ,, | 1 | × | 12 | = | 12 | ,, |
| ఉప్పు | ,, | 6 | × | 12 | = | 72 | ,, |
| ఇంగువ | వీ | 2 | × | 12 | = | ;3 | ,, |
| నూనె | డ. | 4 | × | 12 | = | 48 | డబ్బాలు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| నేయి | డ. | 2 | × | 12 | = | 24 | డబ్బాలు |
| గుమ్మిడికాయలు | | 100 | × | 12 | = | 1200 | |
| విస్తరాకులు | | 12500 | × | 12 | = | 1,50,000, | |
| తట్టలు | | 10 | × | 12 | = | 120. | |
| బుట్టలు | | 10 | × | 12 | = | 120. | |
| చాపలు | | 10 | × | 12 | = | 120. | |
| దుప్పట్లు | | | | | | 6 | |
| సన్న గోనెగుడ్డలు | | 10 | × | 12 | = | 120. | |
| అంగవస్త్రములు | | — | | — | | 12 | |
| లైటింగు | | | | | | | |
| పాలపొడి | | 64 పా | × | 12 | = | 768 | పా, |
| పంచదార | | 16 ,, | × | 12 | = | 192 | ,, |

వక్కలు — లవంగాలు — తమలపాకులు — చందనం హారతికర్పూరం — సాంబ్రాణికడ్డీలు — శొంఠి — కొబ్బరికాయలు — పెరుగు — పాలు — కంద — పెండలము — పచ్చిమిర్చి — గుంపలు — వంకాయలు అరటికాయలు — దోసకాయలు — దోసవరుగు — వంగవరుగు — వంటచెరకు.

పై పదార్థములలో ఏవి ఎంతవరకు లభ్యమగునో వాటితో కార్యక్రమము నిర్వహించుటకు నిర్ణయించడమైనది. గావున, ఓ భక్తులారా! ఈ పుష్కర దినములలో యజ్ఞసమయమున మీ శక్తి ఉత్సాహముల ననుసరించి, బియ్యము, పప్పు, నేయి, వగైరా పదార్థముల తెచ్చి సమర్పించి తదీయారాధన మొనరింపుడు. ఈ తదీయారాధనము ద్వారా మీ పితృదేవతలకు కూడా తృప్తి కలుగగలదు.

కార్యదర్శి, ఇట్లు, అధ్యక్షులు.

తె. కం. గోపాలాచార్యులు. శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ స్వామి:

విజయవాడ-1 (కృష్ణాజిల్లా)లో తేది 23-6-57 లగాయతు 4-7-57 వరకు 12 రోజులు

(శ్రీ సత్యనారాయణ ప్రింటింగు వర్కు్సు, (ఫోను నెం. 506) విజయవాడ.

( 2వ పేజీనుండి )

,, జమ్మాల తరణిరాజుగారు 29
,, బీరక పోతరాజుగారు 29
,, ఈపరి రఘునాధంగారు 29
,, ఈపరి లక్ష్మినారాయణగారు 11
,, కాళ్లా సూర్యారావుగారు 58
,, పంపాన సూర్యనారాయణగారు 29
,, పైడిశెట్టి శ్రీరంగంగారు 29
,, ఆత్మకూరి సుబ్బారావుగారు 275
,, తంగుడు మహాలక్ష్మమ్మగారు 29
,, ఇందుపూరి శ్రీరామమూర్తిగారు 29
,, వైశ్యరాజు బదరీనారాయణరాజుగారు 11
,, అవసరాల సుభద్రమ్మగారు 11

కలకత్తా

,, గోదాదేవి, రామాజదాస్‌జీ C/o ముకుందలాల్ గనేర్‌లాల్‌జీ ధనచంద్ ధీవన్‌చంద్ 275
,, దుర్గాబాయి, రామానుజదాస్‌జీ C/o శ్రీ మహావీరదాస్‌జీ 31
,, నళినీరంజన్ సేన్‌జీ (నరసింహరామానుజదాస్) 29
,, అనసరంజన్ సేన్‌జీ (అచ్యుతరామానుజదాస్) 29
,, బహూరియా పులపతి ఆర్. రాణీగారి ద్వారా 29

పట్నా సిటి

,, శ్రీరామసింగ్ రిజీ కేరాఫ్. శ్రీహరినారాయణచౌదరి కామకాన్ 29
,, అంబికాదేవిజీ (భ క్తి శే.) బాబు హరినారాయణ చౌదరి 9

చప్రా.

,, బహూరియాపులపతికౌఆర్ రాణీగారు 116
,, బహూరియా పులపతికౌఅర్ రాణీగారు పితృపక్షములో భాద్రపద బ. చతుర్దశినాడు ఈమె భర్తపేరుతో సింహప్రదానము చేయుటకు 1000
,, అంబికాదేవిగారు (భర్త కీ. శే. బాబు హరినారాయణబాబ్ చౌదరి) 1000
,, పితృపక్షమున భాద్రపద చతుర్దశినాడు భర్తగారి పేరుతో వీరితండ్రి శివప్రసాద్ వీరితండ్రి లక్ష్మిచౌదరిజీ వీరి పేర్లతో. పిండ ప్రదానము కూడ చేయుచుండవలయును. 1000
,, బహూరియా పులపతికౌఅర్ రాణీజీ ఈమె జన్మోత్సవ ప్రయుక్త భగవతారాధన చేయుటకై సమర్పించినది పుష్య బ ౧౨ లు 1000
,, బహూరియాపులపతి కౌఅర్. రాణీజీ ఈమె ఆచార్యులగు కీ. శే. ఉ. వే. శ్రీమాన్ ప్రతివాద భయంకరంగాడె అనంతాచార్యస్వామివారి పేరుతో పిండప్రదానముతో సహా శ్రావణశుద్ధ తదియా తిథినాడు జరుపుటకై 1000

—రఘునాధపురం—

,, కాదా ధనంజయరావుగారు 29

బొరివంక

,, బెందాళం వెంకటనరసయ్యగారు 29

ముక్తిపల్లి అగ్రహారం

తాత్కాలిక పూజా వివరములు.

,, తట్టా సీతారామాచార్యులుగారు 11

కవిటి గ్రామం.

,, బెందాళం పట్టాభి రామయ్యగారు 11
,, గరిమెళ్ల నీలయ్యశాస్త్రిగారు 11

సోంపేట.

వివాహ కట్నం.

,, బరంపురం వాస్తవ్యులగు శ్రీ కాదా సత్యనారాయణగారు తమ కుమార్తె వివాహ మహోత్సవ సందర్భములో సంఘమునకు సమర్పించిన కట్నము. 11



## ముఖ్యగమనిక

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాశ్వతాధ్యక్షులగు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు బరంపురము నుండి పాదయాత్రగా, ఆంధ్రదేశపర్యటన గావించుచున్నారు. వీరివెంట పరిస్తుతము శ్రీ కవిగారున్నారు. రోజుకు ఉదయము సాయంత్రము కూడ కనీసము పదిమైళ్ళు నడచి దారిలో కనిపించు ప్రతిగ్రామములోను మత ప్రచారము గావించుచున్నారు.

ఆనాడు శ్రీ భగవద్రామానుజులవారు మతాభివృద్ధికి ఇట్లెగదా శ్రమపడిరను విషయము తోచుచున్నది.

విజయవాడలో కృష్ణాపుష్కరములకు బ్రహ్మాండమగు బ్రహ్మయజ్ఞమును తలపెట్టిరి రోజుకు పదివేలమందికి అన్నదానము చేయనలెను. వేయిమంది శిశువులకు క్షీరదానము చేయనలెను.

ఈ విషయముకూడ ప్రచారములో తెలియ జేయుచు బదరీపూజా నిర్వహణమును గురించి సూచించుచూ మతప్రచారము గావించుచూ క్షణమైన విశ్రాంతిలేక శ్రీ స్వామివారు మతాభివృద్ధికి పాటుబడుచున్నారు. ఇటీవల వీరి ఆరోగ్యముకూడ అంత తృప్తికరముగా లేదు అయినను పాదయాత్రలో అందరిని చూడవలెనను అపేక్ష గలిగినది అపరిచితులు కనిపించినను వీరు పూర్వపరిచితులవలె మాటాడుచుందురు చైత్రవైశాఖ మాసములవరకు ఈ ప్రాంతము పర్యటించి జ్యేష్ఠమాసప్రారంభమునకు విజయవాడకు. శ్రీవారు వేంచేయుదురు ఆ 15 రోజులు అచ్చట వేంచేసి బ్రహ్మయజ్ఞమును పూర్తిగావించి శేషించిన ఆంధ్రదేశ పర్యటన మరల ప్రారంభింతురు.

దుర్ముఖిసంవత్సర అమావాస్యనాటికి శ్రీ స్వామివారు పలాసా గ్రామంలో వేంచేసి యున్నారు.

## BOOK-POST.

"భక్తనివేదన" శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం. (వయా) చుండూరు గుంటూరుజిల్లా

వేదాంత మాస పత్రిక సాలు చందా 5 0 0

To

[illegible]



Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Sri Satyanarayana Printing Works, Vijayawada for Sriman Press Nadigaddapalem.

# ఆహ్వాన పత్రిక

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పండిత పరిషత్

వైశాఖమాస సమావేశము

శ్రీ కూర్మక్షేత్రము

స్వస్తిశ్రీ హేవిళంబి నామసంవత్సర వైశాఖ శు 3 గురువారం (2-5-1957) తేదీ మొదలు వరుసగా మూడు రోజులు శ్రీకాకుళంజిల్లా శ్రీ కూర్మ దివ్యక్షేత్రమున శ్రీశ్రీశ్రీ శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్‌స్వామివారి అధ్వర్యమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పండిత పరిషత్ వైశాఖమాస సమావేశమును శ్రీ కూర్మనాథుని సన్నిధానమందు జరుపుటకు నిశ్చయింపబడినది.

తాము ఈ సమావేశమున 30 నిమిషకాలము ఏదైన ఒక మన సంప్రదాయ విషయమును గూర్చి యుపన్యసింపవలసినదిగ ప్రార్థించుచున్నాము ఈ ప్రాంతమందు చేయబడుచున్న పండిత పరిషత్సమావేశములో ఇదే మొదటిది అగుటచేతను ఇకమీద నుండి ప్రతిపక్షమునందును ఈ ప్రాంతమందు ఇట్టి పండితపరిషత్సమావేశముల నేర్పాటు చేసి ప్రచారము చేయుటకు తగు కార్యక్రమమును రూపొందించు కొనవలసియుండుట చేతను తాము తప్పక యీ సమావేశమునకు విచ్చేయ మిక్కిలి ప్రార్థించుచున్నాము.

## కార్యక్రమము

2-5-57 శ్రీ కూర్మనాథుని సన్నిధియందు శ్రీ ఎంబెరుమానారుల మంత్రాసన సంధానోత్సవము సభాధ్యక్షులు శ్రీమదిత్యాది శ్రీమాన్ ఉ. వే. ప్ర॥ మాడి రామానుజాచార్యస్వామివారు (శ్రీరామతీర్థం)

3-5-57 సభాధ్యక్షులు, శ్రీమదిత్యాది శ్రీమాన్ మహేంద్రవాడ వెంకటరామ నరసింహాచార్యులుగారు (కళింగపట్నం)

ఎంబెరుమానార్ల ఢిల్లీ విజయోత్సవము శుక్రవార పూజోత్సవము.

4-5-57 సభాధ్యక్షులు, శ్రీమదిత్యాది శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులువారు (నశీగడ్డపాలెం)

ఇట్లు,

ఆహ్వాన సంఘము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ పండిత వైశాఖమాస సమావేశము

అధ్యక్షులు:— శ్రీమాన్ తి. పె. అప్పలాచార్యులుగారు

కార్యదర్శులు:— శ్రీమాన్ శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులుగారు

సభానిర్వాహకులు :

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు

శ్రీ కూర్మం. 29-4-57

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ ప్రధానకార్యదర్శి :

శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు

శ్రీ హయగ్రీవాయనమః.

# సృష్టిరహస్యము

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే॥
గీ. 4 అ. 14శ్లో.

తాత్పర్యము- నాకు సృష్ట్యాదివ్యాపారఫలము నందుగాని, కర్మఫలమునందుగాని ఆశ లేకుండు టచే విచిత్రసృష్ట్యాదికర్మలు నన్ను బంధింపవు. ఇట్లు నన్నెఱుంగువాడు కర్మయోగారంభమున కాటంకములగు ప్రాచీనకర్మలచే బద్ధుడుకాడు!

అర్జునుడు:—

కర్మయోగము మోక్షసౌధాదిరోహణము నకు సులభమగు ప్రథమసోపానమైనను అట్టి కర్మయోగులేల లోకమున దుర్లభముగా గాన్పిం చుచున్నారు!

శ్రీకృష్ణుడు:—

శ్లో॥ కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః॥
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥
గీ. 4అ. 12శ్లో.

లోకమున ప్రాయికముగ సకల పురుషులును తా మాచరించు ప్రతి కర్మకును ఫలము నాశిం చుచున్నవారై ఇంద్రాదిదేవతలను మాత్రమే ఆరాధింతురు గాని ఒక్కడును సంసారోద్విగ్నుడై మోక్షము నపేక్షించి నా యారాధనగా పర్యవ సించు నట్టి కర్మలను ధనాశను వీడి ఇంద్రాదుల కంతర్యామిగానుండి సమస్తయజ్ఞములకునుభోక్త నగు నన్నారాధించువాడు లేడు.

అర్జు:-సర్వోత్కృష్టఫలమును వీడి క్షుద్రఫలముల నేల ఆశించుచున్నారు!

కృష్ణ:-'వర మద్య కాకః శ్వో మయూరాత్'
(రేపులభించు నెమలికంటె నేడుచేజిక్కు- కాకి యే శ్రేష్ఠము.)

అను న్యాయము ననుసరించి క్షుద్రమని సశ్వ రమని దుఃఖప్రదమనియు జూడక ఈ లోకమున నీశరీరముతో నుండగనే వెంటనే లభించునుగదా యని పుత్ర పశ్వ న్నాది క్షుద్రఫలముల నాశించి వాటికై విధింపబడిన క్షుద్రకామ్యకర్మలనే యా చరింతురు. ఇందులకు కారణ మవివేకమే. అం దులకు మూల మనాది కాలమునుండియు తరు గక పెరుగుచున్న అనంతపాపరాశియే.

అర్జు:- అయినచో నీ పాపరాశినుండి తరించినవా డీలోకమున నెవ్వడున్నాడు! కాబట్టి యంద రును అవివేకులే! కావుననే అందరును క్షుద్ర మైనను వెంటనే ఫలమును కోరువారలేకదా. ఇంక మోక్షాపేక్ష కలవా రలెవ్వరు! వారు లేనిచో మోక్షోపాయశాస్త్ర మెవ్వరికి! నిర ర్థకమేకదా! అప్రమాణికమేకదా!

కృష్ణ:- కాదు ఈవిషయమును—

శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః.
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం॥
గీ. 4అ. 13శ్లో.

శ్లో. న మాం కర్మాణి లింపంతి । న మే కర్మఫలే స్పృహా॥
(4అ. 14శ్లో.)

అనెడు శ్లోకములలో చెప్పినట్లు బ్రహ్మ మొదలు స్తంభ (గడ్డిపరక) పర్యంతము గల జగత్తు నంతను సత్వరజస్తమోగుణ విభాగము తోను దానికి తగిన శమదమాదికర్మ విభాగము తోను విభజింపబడి నాచే సృష్టింపబడుచు రక్షింపబడుచు ఉపసంహరింపబడుచు ఉన్నది. ఇట్లు నేనే సృష్టించుచున్నను ఆ విచిత్ర సృష్టికి మాత్రము నేను కర్తను కానని ఊహింపుము.

అర్జు:- కృష్ణా! అయినచో నీపై నొక పెద్ద అభియోగము నా పాదింపవలసినదే! లోకమును నీవే సృష్టించుచున్నట్లు నీవే యంగీకరించుచున్నావు కదా!

కృష్ణ :- ఔను నిర్భయముగా—

అర్జు:- లోకమున నొకడు నీరోగి ఒకడు రోగి ఒకడు ధనికుడు ఒకడు దరిద్రుడు. ఒకడు బహుసంతానవంతుడు, ఒకడు నిస్సంతానవంతుడు, ఒకడు జ్ఞాని, ఒకడజ్ఞాని, ఇట్లు విషమముగా సృష్టించు బాధ్యతయు నీయందే గలదు గాన నీవు పక్షపాతివి నిర్దయుడవని నే నేల యనరాదు?

కృష్ణ :- ఇంత మాత్రమేకదా నీ నేరారోపణము. దానికి నా జవాబు వినుము.

శ్లో. న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా॥
(గీ. 4అ. 14శ్లో.)

ఒక కృషీవలుడు ఒకే మడియందు కొన్ని పెసలు కొన్ని మినుములు కొన్ని కందులు జల్లి సమానదోహదములనే చేయును. ఆ బీజముల నుండి సమానాంకురములే వెలువడునా? వేరు వేరుగానుండునా?

అర్జు:- ఆబీజములకు సజాతీయాంకురములే జనించును. క్షితిజలాదులేకమైనను బీజములు వేరువేరుగదా!

కృష్ణః:- అట్లే నేను సామాన్యసృష్టికి కారణమైనవాడనే గాని నీవు చెప్పిన విషమ సృష్టికి నేను కారణము కాదు. ఆవైషమ్యము సృజింపబడు చేతనుల పుణ్యాపాప రూపమగు కర్మకృతమే కాని నేనాపుణ్యాపాపానుగుణముగనే ఫలము నిత్తును గాని నాయిష్టమువచ్చినట్లీయను. స్వతంత్రుడను కదా యని ఆపుణ్యాపాపములకు విపరీతముగా ఫలమునీయను, నాలీలకై నేను పరులనుపీడించు కిరాతుడను కాను. సృష్టింపబడిన చేతనాలుతమకు లభించిన కరణకళేబరములతో తామాచరించిన కర్మలకు యోగ్యమగు భోగ్యజాతమును ఆకర్మానుగుణముగ ననుభవింతురు. సృష్ట్యాదిఫలమునగాని కర్మఫలమునందుకాని వారికేయపేక్షకలదుకాని నాకెంతమాత్రమును లేదు. ఈవిషయమునుబలపరచుటకు నాకు ఘనమగు సాక్షులు ఇరువురు కలరు. వారి నడిగి తెలిసికొని నాసమర్థన నంగీకరించి నీసంశయమును బాపుకొనుము.

అర్జు:- వారెవరు?

కృష్ణ :- ఒకరు పుస్త్యబ్రహ్మవరములచేతను శ్రీవశిష్ఠమహర్షి యామోదముచేతను సకలధర్మములను కరతలామలకముగా గాంచి పురాణరత్నమని ప్రసిద్ధిగాంచిన శ్రీవిష్ణుపురాణకర్త, వశిష్ఠునిమనుమడును, శక్తితండ్రియు, శ్రీవ్యాసునితాతయు నగు శ్రీపరాశరమహర్షి.

రెండవవాడు పరాశరపుత్రుడును, శ్రీశుకునితండ్రియు 'సహోవాచవ్యాసః పారాశర్య' అని అపౌరుషేయ నిత్యనిర్దుష్ట వేదప్రమాణముచే ప్రశంసింపబడి అష్టాదశపురాణములను బ్రహ్మసూత్రమును రచించి ప్రసిద్ధిగాంచిన వ్యాసమహర్షియు.

అర్జు:- వారేమందురు?

కృష్ణ :- ఈ కేసునాపై యిదివరకే మోపబడెను. కాని పరాశరమహర్షి నాపక్షమును బలపరచ చూచెను. అది శ్రీవిష్ణుపురాణమున రికార్డుచేయబడెను. చూడుము.

శ్లో. నిమిత్తమాత్రమేవాయం సృజ్యానాం సర్గకర్మణి ।
ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః॥
నిమిత్తమాత్రం ముక్త్వైదం నాన్యత్ కించి దపేక్షతే॥
నీయతే తపతాం.

ఈపరమపురుషుడు సృజింపబడు దేవాది క్షేత్రజ్ఞుల సృష్టికికారణము మాత్రమేకాని దేవాదికివైషమ్యమున కితడు కారణము కాదు. అందులకు ముఖ్యకారణ మాసృజింపబడు జీవుల ప్రాచీనకర్మశక్తులే. కావున క్షేత్రజ్ఞులు సర్వేశ్వరుని తమసృష్టిం నిమిత్తమాత్రమే కర్తనుగాపరిగ్రహింతురు గాని దేవాదివైచిత్ర్యములో తనప్రాచీనకర్మశక్తులను తప్ప వేరొండు కారణము నపేక్షింపరు. అని చెప్పెను.

అర్జు:- బ్రహ్మసూత్రములలో వ్యాసుడేమి చెప్పెను?

కృష్ణ :- నీవలెనే సాంఖ్యులు నాపైనేరములు మోపగా నీమహనీయుడు 'వైషమ్య నిర్ఘృణ్యేన సాపేక్షత్వాత్' అను సూత్రముచే పరమపురుషుడు ఆయాచేతనుల కర్మలను పురస్కరించుకొని విషమసృష్టిని గావించునుగాన యాతనికి పక్షపాతము గాని నిర్దయత్వముకాని లేదనిచెప్పెను. అర్జునా! ఈసృష్ట్యాదివ్యాపారములేకాదు. నేనీయవతారమున జేయు కృత్యములన్నియు నేనొక కోరికతో చేయుటలేదు. అన్నియును లోకసంగ్రహమునకే చేయుదును. ఈవిషయమునకు నీకొక గోపాలోత్తరతాపఉపనిషద్వృత్తాంతమును ప్రమాణముగా చూపుదును. సావధానముగా వినుము.

ఒకప్పుడు గోపస్త్రీలు నాయందువ్యామోహముకలవారై ఒకరాత్రియంతయు నాతో నుండి తెల్లవారినతోడనే యమునకావలయొడ్డున తపస్సు చేయుచున్న దూర్వాసమహర్షి ని దర్శించగోరి నాతో "శ్రీకృష్ణా! దూర్వాసమహర్షికి ఇష్టాన్న మిడగోరుచున్నాము. నది కూలంకషముగా ప్రవహించుచున్నది. దాటిపోవుట కేదైన

మంత్రమునో తంత్రమునో ఉపదేశింపవలెనని ప్రార్థించిరి. అంతనాతడు వారితో వెంటనే దాని కేమున్నది!

బ్రహ్మచారీ త్యక్త్వా మార్గం వో దాస్యతి
యన్మాం స్మృత్వా ఽగాధా గాధా భవంతి॥

అస్ఖలితబ్రహ్మచారియగు శ్రీకృష్ణుడు దారి యిమ్మనుచున్నాడనుడు. నన్ను తలంచినంతనేఎంత లోతున్నను మెరకయగునంటిని. వారదివిశ్వసించి యామంత్రముతో నా యమునను దాటిదుర్వాసుని పుణ్యాశ్రమము జేరి ఆయనకు నమస్కరించి తాము తీసికొనివెళ్లిన క్షీరములు ఘృతములు మిష్టాన్నములసర్పించ నాఋషి సంతసించి స్నానము గావించి పూర్తిగా వాని నారగించి యాశీర్వదించి సెలవొసంగెను. అంత నాస్త్రీలు మేము యమునను దాటుట యెట్లని ప్రశ్నించిరి. దుర్వాసమహర్షి! దారియిమ్మనుచున్నాడనిన మీకానది సులభముగా దారినిచ్చునని నెను. అంత నాగోపికలలో గాంధర్వియను ధైర్యసాహసములుగల యొకగోపిక "మహాత్మా! మాకీ వింత సంశయమును తీర్చుడు. అష్టోత్తరషోడశ సహస్రభార్యాపరివృతుడగు శ్రీకృష్ణుడు తాను బ్రహ్మచారినని చెప్పిన దారి యిచ్చునని నెను, అల్లెజరిగెను.

మేమొసంగిన మిష్టాన్నములన్నిటిని భుజించి తివి. దుర్వాసుడని చెప్పిన దారి యిచ్చునను చున్నావు. ఆతడెట్లుబ్రహ్మచారియో, నీవెట్లు దుర్వామాతాశివో తెలియజెప్పుమని ప్రార్థించెను. అతడది విని నవ్వి

'యోహవై కామేన కామాన్ కామయతే స కామీ భవతి
యోహవై త్వకామేన కామాన్ కామయతే సోఽ కామీ భవతి॥'

అనగా నెవడు కోరి విషయములననుభవించునో వాడు కామిగాన తత్ప్రయుక్తమైనపుణ్యా పాపములకు భాద్యుడగును. ఎవడు కోరికలేకయే అయాచితవృత్తిచే విషయములననుభవించునో వాడు అకామిగాన వానికితత్ప్రయుక్తములైన పుణ్యాపాపములంటవు అని సమాధానమిచ్చెను. ఇది యందరకునుసమానమైనన్యాయ మేకాని ఒకరి సొత్తుమాత్రముకాదు.

ఈవిషయమునే శ్రీమద్భాగవతమందును గాంచవచ్చును. నేను నరకాసురుని సంహరించి యాతనిభవనమున ప్రవేశించుసరి కచ్చట నాతనిచే బందీకృతులైన రాచకన్యలు పదహారువేల మంది నన్ను జూచి

'తం ప్రవిష్టం స్త్రియో వీక్ష్య నరవీరం విమోహితాః।
మనసా వవ్రిరేఽ భీష్టం పతిం దైవోపసాదితం॥

59అ. 34శ్లో.

భూయాత్పతిరయం మహ్యం ధాతా తదనుమోదతాం।
ఇతిసర్వాః పృథక్ కృష్ణే భావేన హృదయం దధుః॥

11 35శ్లో.

తాః ప్రాహిణోత్ ద్వారవతీం సుమృష్టవిరజోఽమ్బరాః
అథో ముహూర్త ఏకస్మిన్ నానాగారేషు తాస్స్త్రియః।
యథోపయేమే భగవాం స్తావద్రూపధరో ఽవ్యయః॥

ఇట్లు ప్రవేశించిన నన్ను రాచకన్యలుగాంచి మోహించి। అందరు తమమనస్సులలో మన యదృష్టమున నేతెంచిన ఈనరవీరుడు మనకభీష్టమైన భర్తకావలెను. నాకీతడు భర్త కావలెను.

నాకీతడు భర్త కావలెను. నా కోరికను బ్రహ్మ యామోదించవలెను. అని ప్రతిస్త్రీయును ప్రత్యేకప్రత్యేకముగానను వరించిరి. "యే యథా మాం" అని నాప్రతిజ్ఞగాన నేను వారినందరను మజ్జనమాడించి నూతనవస్త్రములతో నలంకరింప జేసి పల్లకీలలో ద్వారకకుపంపించి దేవేంద్రునితో కలసివచ్చినపిదప నొక శుభముహూర్తమున నానాదేహములధరించి ఆకన్యకలనందర పెండ్లాడి వారినొక్కొక్కరి నొక్కొకగృహమున నుంచి

పు॥ఒక దేవీభవనంబు మున్నుచొర వేరొక్కర్తె లోగుందునో
సుకరాలాపము లాడదో సొలయునో సుప్రీతినీక్షింపదో
వికలత్వంబున నుండునో యనుచు నవ్వేళన్ వధూ
గేహముల్ ప్రకటాశ్చర్యవిభూతిజొచ్చె బహురూపవ్యక్తుడై
భార్గవా॥

పు॥ పతి నాయింటికి మున్ను వచ్చె నిదె నాప్రాణేశు
డస్మద్గృహా । గతుడయ్యెన్ మును, చేరెబో తొలుత
మత్కాంతుండు నాశాలకేనితరాలభ్య సుఖంబుకంటి
నని తారింటింట నర్చించిరయ్యతివల్ నూరుపదారువేల
యొనమండ్రవ్వేళ నాత్మేశ్వరున్॥

అని కాలముగడుపుచుండగా ఒకనాడు నారద మహర్షి —

'నరకం నిహతం శ్రుత్వా తథో ద్వాహం చ యోషితాం।
కృష్ణేనైకేన బహ్వీనాం తద్దిదృక్షుఃస్మ నారదః॥
చిత్రం బతైతదేకేన వపుషా యుగపత్ పృథక్।
గృహేషు ద్వ్యష్టసాహస్రం స్త్రియ ఏక ఉదావహత్॥

నరకాసురునిసంహారించి నేను షోడశసహస్రరాచకన్యల వివాహములుగావించుకొనినవార్త విని ఒక్కకృష్ణుడొక్కశరీరముతో నొక్కేసారి పదహారువేలమంది స్త్రీలను వివాహమాడి తన గృహస్థాశ్రమము నెట్లుగడుపుచున్నాడో యీ చిత్రమును చూడవలెనని ద్వారకకేతెంచెను. నేనొకయింట నాతనికి దర్శనమిచ్చి అతిథిసత్కారములను స్వక్రమముగా జరిపి "ప్రభో! భగవతే కరవామ కిం" అని సాదరముగా ప్రశ్నించితిని. మహాత్మా! ఏమున్నది నీపాదారవిందసేవలభించినది. నీగుణములుపాడుకొనుచు తిరుగు మాకు పనియేముండునని చెప్పి మరియొకయింట కేగెను. నేనప్పుడాతనికి నామాయను జూపనెంచి ఒకయింటనొకభార్యతోను, ఉద్ధవునితోను పాచికలాడుచు గాన్పించి ఏమియునెఱుంగనివానివలె 'మహాత్ములెప్పుడువిచ్చేసిరి? దయచేయుడ'నియాదరించితిని. అతడాగృహమువిడచి యొక్కొక్క ఇంటికిక్రమముగనేగదొడంగెను. నేనును ఒకఇంట నాబిడ్డలనాడించుచును, ఒకయింట స్నానమునకు పక్రమించుచు, ఒకయింటపంచమహాయజ్ఞముల నాచరించుచును, ఒకయింట బ్రాహ్మణుల భుజింపజేయుచును, ఒకయింటసంధ్యావందనమునాచరించుచును, ఒకయింటమంత్రమును జపించుచును, ఒకయింట కత్తిసాముచేయుచును, ఒకయింట అశ్వగజాద్యధిరోహణమును గావించుచును, ఒకయింట మంత్రులతో నాలోచనము చేయుచును, ఒకయింట అలంకరింపబడిన గోవులను దానముచేయుచును, ఒకయింట నితిహాసపురాణములు వినినచో ఒకచోధ్యాననిర్మగ్నుడనయ్యు ఒకచో గురుశుశ్రూషచేయునట్లు త్రమ గృహస్థు నిత్యమాచరింపవలసిన ధర్మములన్నిటినాచరించుచుగాన్పించితిని. అదిచూచి ఆశ్చర్యచకితుడై నారదుడు—

శ్లో. అథోవాచ హృషీకేశం నారదః ప్రహసన్నివ।
యోగమాయోదయం వీక్ష్య మానుషీ మీయుషోగతిమ్॥
విదామ యోగమాయాస్తే దుర్దర్శా అపి మాయినాం
యోగేశ్వరాత్మన్ నిర్భాతా భవత్పాదనిషేవయా॥

నన్నుచు శ్రీకృష్ణా! మానుషవేషధారివై నీవుగావించుచున్న ఆశ్చర్యచేష్ట లితరులకగోచరములైనను నీపాదారవింద సేవామహత్వముచే నేను సాక్షాత్కరించగల్గితిని. అని నమస్కరించగా నేను—

శ్లో. బ్రహ్మన్ ధర్మస్య వక్తాహం కర్తా తదనుమోదితా।
తచ్ఛిక్షయం ల్లోక మిమ మాస్థితః పుత్ర మా! ఖిదః॥

బిడ్డా! నేనుధర్మసంస్థాపనచేయుటకై యవతరించితిని. కాముకుడనై యీస్త్రీలను పెండ్లాడలేదు. వీరు నన్ను భర్తనుగా వరించుటచే "యే యథా మాం ప్రపద్యంతే" అను న్యాయానుసారముగ భర్తనైతిని. ఈమిషతో గృహస్థాశ్రమ ధర్మములును లోకమునకు బోధించనెంచితిని. నేనుధర్మమునుపదేశింతును, ఆచరింతును, ఆమోదింతును.

ఇత్యాచరన్తం సద్ధర్మాన్ పావనాన్ గృహమేధినాం।
తమేవ సర్వగేహేషు సన్తమేకః దదర్శహా॥

ఈయుపదేశమునువిని చూచి సదానికాశ్చర్యపడుచు నాచేసన్మానింపబడి నారదుడేగెను. ఇట్లు నాకృత్యములన్నియు లోకశిక్షలే దానివలన నేను పొందదగిన ఫలమేమియు లేదు.

శ్లో. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥

కావున ఇట్లు సృష్ట్యాదులకు కర్తనైనను కర్తనుకాననియు అందులకు కారణ మాకర్మఫలమున నాకాశ లేకుండుటయేయనియు, ఇట్లెఱుంగనివాడు కర్మయోగమాచరించకుండ తన నాటంకపరచుచు కామ్యకర్మలలో ప్రవర్తింపచేయునట్టి సమస్త ప్రాచీనకర్మలనుండి విముక్తుడై కర్మయోగమును నిర్విఘ్నముగా నాచరించి తరించునని యెఱుంగుము.

—0—

°°ooooo°°

శ్రీ హయగ్రీవాయనమః.

# రాజవిద్యా

భగవద్గీతయందలి తొమ్మిదవఅధ్యాయమునకు "రాజవిద్యారాజగుహ్యయోగ"మని పేరుంచ బడెను. అనగా నాయధ్యాయమున నావిషయము ప్రధానముగ జెప్పబడియుండవలెను. ఈరాజ విద్యా, రాజగుహ్యమనుపేరు ఒకే యోగము నకు సంబంధించినది. అదియే 'భక్తియోగము' ఈయధ్యాయమునకది యెట్లు ముఖ్యతాత్పర్య మైనదియు నీవ్యాసమున వివరింపబడును.

ఒక గ్రంథకర్తయొక్క తాత్పర్యమును నిర్ణ యించుటకు శాస్త్రకారులు ఆరువిధములైన తాత్పర్యలింగముల చేర్పరచియున్నారు. అవి—

శ్లో. ఉపక్రమోపసంహారా వభ్యాసో పూర్వతా ఫలం।
అర్థవాదోపపత్తీచ లిఙ్గం తాత్పర్యనిర్ణయే॥

అనగా— ఉపక్రమోపసంహారౌ = ఆది, అవ సానములు.

అభ్యాసః= పదేపదే చెప్పబడుట.

అపూర్వతా = ఇదివరకెఱుకపరచబడని దానిని జెప్పుట.

ఫలం = ప్రధానపురుషార్థము.

అర్థవాదః = ప్రశంస.

ఉపపత్తిః = దానివలన ఆఫలముకలుగుటలో యుక్తులనుజూపుట.

ఈయారులింగములు దేనిపట్ల సమన్వయమ గునో అదియే యాగ్రంథమున కాగ్రంథకారుని ముఖ్యతాత్పర్యవిషయమగును.

ప్రస్తుత మీయధ్యాయమున నీలింగములా రును భక్తిపట్ల నెట్లు సమన్వయించుచున్నవో చూతము.

ఈతొమ్మిదవ యధ్యాయప్రారంభమున.

'ఇదంతు తే గుహ్యతమం, ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం,యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

అనెడు మొదటి శ్లోకములో తాను జ్ఞానవిజ్ఞా నములను గూర్చి చెప్పెదనని శ్రీకృష్ణుడు ప్రతి జ్ఞను కావించెను. ఇచ్చట జ్ఞానవిజ్ఞానములనగా నేమి? ఈపదములకు శ్రీభాష్యకారులు—

జ్ఞానం = భక్తిరూపం ఉపాసనాఖ్యం అనియు,

విజ్ఞానం = ఉపాసనగతవిశేషజ్ఞానం,

అని వ్యాఖ్యానమును గావించిరి.

అనగా — భక్తియనబడు ఉపాసనను (ధ్యా నమును) గూర్చియు, (జ్ఞానము)

ఉపాసింపబడు (ధ్యానింపబడు) పరమపురుషుని గూర్చియు, ఉపాసనయందలి విశేషములను గూర్చియు ఉపాసనరీతినిగూర్చియు తెలుపగలనని భావము. (విజ్ఞానము)

ఏతావతా జ్ఞానవిజ్ఞానశబ్దములచే నుపక్రమిం చినది భక్తియోగమునేకదా!

భక్తియోగోపదేశమునకు ప్రారంభమగు సప్త మాధ్యాయప్రారంభమున రెండవశ్లోకములో

తెలుపబడిన జ్ఞానవిజ్ఞానములకును, యీజ్ఞానవిజ్ఞానములకుగల తారతమ్యము గీతోపదేశహారము మొదటిభాగమున జూపబడెను.

ఈశ్లోకమున "అనసూయవే" యని యర్జునుని శ్రవణయోగ్యత సూచింపబడినది. అసూయలేదుగాన నీకు **నేను** చెప్పగలననెను. అసూయ యనగా- 'అసూయాతుదోషారోపో గుణేష్వపి' అనెడు కోశానుసారముగ ఒకని సద్గుణములను విని సహించనేరక వాటిని దోషములుగనే పరిగణించుట, అదియెట్లనిన—

శ్లో. జాడ్యం హ్రీమతి గణ్యతే, వ్రతరతే దంభ, శ్శుచే
కైతవం। శూరే నిర్ఘృణతా, మునౌ విమతితా, దైన్యం
ప్రియాలాపిని । తేజస్విన్యవలిప్తతా, ముఖరతా వక్తర్యశ
క్తిస్స్థిరే । తత్కోనామ భవే త్సగుణినాం యో దుర్జ
నై ర్నాఙ్కితః॥

ప్రమాదవశమున తటస్థించు నకార్యములకు సిగ్గుపడు స్వభావముకలవానిని జడుడందురు. శ్రద్ధతో వ్రతోపవాసాదులను గావించువానిని దాంభికుడందురు. ఇతరస్పర్శను పరిహరించుచు సదా శుచిగానుండువానిని ధూర్తుడందురు. శూరుని నిర్దయుడందురు. మితభాషిని అజ్ఞుడందురు. అందరకు నిష్టముగామాటలాడు వానిని దీనుడందురు. అధర్మము నెదుర్కొనుటలో నిర్భీకుని గర్విష్ఠియందురు. వాక్చతురుని వాచాటుడందురు. దూరమాలోచించి సావధానముగ పనులుచేయువానిని అశక్తుడందురు. ఇంక దుర్జనులచే దోషముగపరిగణింపబడిన సజ్జనుని గుణమేదియో కానరాదు. అనగా — తాను ఉపాస్యుడగు తనగుణములను చెప్పగలననియు, వాటిని విని ఆదరించు యోగ్యత యర్జునునకు కలదనియేగదా! దీనిభావము. "ఆదరాలోపః" బ్ర. సూ. 393. అను సూత్రవ్యాఖ్యానమున శ్రీభాష్యకారులు "మోక్షార్థోపాస్య బ్రహ్మగుణత్వేన సాదర ముపదేశాదేషా మలోపః. అపితూపసంహార ఏక కార్యః' అని గుణము నుపదేశించుట యుపాసనసౌకర్యమునకే గాన వాటినిలోపించక గ్రహించవలెనని నాయించిరి.

ఇక నుపసంహారము నారయుదము.

ఈ యధ్యాయమునకంతిమశ్లోకము—

శ్లో. మన్మనాభవ, మద్భక్తో, మద్యాజీ, మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥
34 శ్లో.

శ్లోకార్థోపన్యాసము ప్రత్యేక మొక శీర్షిక క్రిందగావింపబడును.

ఇందు "మద్భక్తః, మన్మనాభవ' యనుటచే భక్తి యోగమే ప్రసంగింపబడినదనుట నిర్వివాదము.

అభ్యాసము:—

అధ్యాయమధ్యభాగమున—

శ్లో. మహాత్మానస్తు మాంపార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజన్త్యనన్యమనసో, జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్।
13శ్లో.

తాము గావించిన పుణ్యకర్మలచే పాపములను పోగొట్టుకొనిన దైవీసంపన్నులగు మహానుభావులు నన్ను సర్వభూతములకు నాదికారణమై నిర్వికారుడనై వాక్కులకుగాని మనస్సునకుగాని గోచరించనివాడనయ్యు దయామయుడనగుటచే

సాధుపరిత్రాణమునకై యవతరించితినని యెఱింగి నన్ను భజించక బ్రతుకలేనివారై భజించుటయే ఫలముగ భజింతురు. అనియు—

శ్లో. సతతం కీర్తయన్తో మాం, యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా, నిత్యయుక్తా ఉపాసతే॥
14శ్లో.

నాయందపారమగు ప్రీతికలవారగుటచే నానా నామములను నిరంతరము కీర్తించుచును, నాయారాధన కుపకరించు పనులలో దృఢసంకల్పముకలవారయ్యును భక్తిభారముచే వంగిన యష్టాంగములతో నమస్కరించువారై నాతోడి నిత్యసంబంధము నపేక్షించి నన్ను ధ్యానింతురు, అనియు

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం, యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం, అశ్నామి ప్రయతాత్మనః॥

సర్వసులభమగు పత్ర, పుష్ప, ఫల తోయములలో దేనినైన నొకదానిని నాయందలి ప్రేమచే నాకు సమర్పింపక నిలనజాలనివారై సమర్పించుటయే ఫలముగ భక్తితో సమర్పించుచున్నారో—అటు భక్తితో సమర్పింపబడిన నాపత్రాదులను నేనెన్నడును కనివినియెఱుంగని యపూర్వ ప్రియవస్తువులను సమర్పించినంత యానందముతో నను భవింతును. (ఈవిషయమును ముందు సుదాముని చరిత్రలో చూడనగును.)

శ్లో. సమోఽహం సర్వభూతేషు, న మే ద్వేష్యో స్తి న ప్రియః
యే భజంతితు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం॥

దేవతిర్యఙ్మనుష్యస్థావరములలో నెవ్వరైనను నన్నాశ్రయించుచో దేవత్వ మనుష్యత్వ బ్రాహ్మణత్వాదిజాతిచే గాని, సుందరమగుస్త్రీలు, పురుషులు, సుందరాంగులు, వికలాంగులనెడు, ఆకారములచేగాని, సాత్విక రాజసాదిస్వభావములచేగాని, జ్ఞానముచేగాని గొప్పవారు తక్కువవారను తారతమ్యములేక ఒకేరీతినాదరింతును. ఉండవలసినది భక్తియే. అనగా నన్ను భజించకయుండలేని యార్తియుండవలెను అదియున్నచో వారు నా పారమేశ్వరత్వాది స్వభావములకు భయపడక సుఖముగ నన్ను సేవింతురు. నాకంటెగొప్పవారిఁవోవలె నేను వారిఁవో వర్తింతును.

శ్లో. అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్।
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః॥

ఎవడు తన వర్ణాశ్రమాచారములనాచరింపక కూడనివాటినాచరించువాడైనను, ఫలాంతరములను కోరక భజించుటయే ఫలముగా నన్ను భజించుచున్నాడో వాడు వైష్ణవాగ్రేసురుడనియే ఆదరింపదగినవాడు. ఏలనన— వాడు నన్నే సర్వేశ్వరుడనియు, తనకు గురువనియు, హితైషియనియు భోగ్యమనియు నిశ్చయముగభావించును. ఇట్టి భావన అందరకును దుర్లభముగదా?

శ్లో. కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.
31శ్లో.

అర్జునా! నన్ను భజించుటకుద్యమించినవాడు విపరీతాచారయుక్తుడైనను చెడడు. నా భక్తిమహిమచే నాటంకములనతిక్రమించి వెంటనే పరిపూర్ణ భక్తుడగునని ప్రతిజ్ఞసేయుము.

ఇచ్చట శ్రీరామచంద్రుడు "అభయం సర్వ భూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ" అనినట్లు "నాభక్తుని నేను చెడనీయన'ని తానే ప్రతిజ్ఞచేయవలసియుండగ,

అర్జునా! నాభక్తుడుచెడడని నీవు ప్రతిజ్ఞసేయుమనుట విపరీతముగ తోచుచున్నను ఇందొక గొప్పరహస్య మిమిడియున్నది. ఏమనగా—

"రామో ద్విర్నా భిభాషతే" 'అనృతం నోక్త పూర్వం మే న చ వక్ష్యే కదాచన' అను శ్రీరామచంద్రునివంటివాడు కాడు శ్రీకృష్ణుడు. భక్త పరాధీనుడు.—

"జానీమ స్త్వ సత్య మర్జునకృతే భీష్మ ప్రహారోద్యమాత్" అనినటుల ఆయుధమును పట్ట ననెడు తన ప్రతిజ్ఞను విడచియైనను ఆయుధమును పట్టించెదననెడు భీష్మ ప్రతిజ్ఞను పాలించుటకై ఆయుధమును చేబూనెను. కావున భీష్మ పితామహులు శ్రీకృష్ణుని సేవించి

శ్లో. స్వ నిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం ఋత మధికర్తు మవప్లుతో రథస్థః। ధృతరథచరణోఽభ్యయా చ్చలద్గు ర్హరి రివ హన్తు మిభం గతో త్తరీయః॥

తండ్రీ! నా ప్రతిజ్ఞను సత్యపరచుటకై నీ ప్రతిజ్ఞనైనను వీడి

సీ॥ కుప్పించి యెగసిన కుండలంబులకాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
నుఱికిననోర్వక నుదరంబులోనున్న
జగములవ్రేగున జగతికదల
చక్రంబుచేపట్టిచనుదెంచురయమున
పైనున్న పచ్చనిపటము జార
నమ్మితినాలావు నగుబాటుసేయకు
మన్నింపుమని క్రీడి మరల దిగువ
తే.గీ. కరికి లంఘించు సింగంబుకరణి మెరసి
నేడు భీష్ముని చంపుదు నిన్ను గాతు
విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి
తెరలి చనుదెంచు దేవుండె దిక్కునాకు॥

అని స్తుతించెను.

నృసింహావతారమునందును హిరణ్యాకశ్యపుడు ప్రహ్లాదునితో

శ్లో. య స్త్వయా మన్దభాగ్యోక్తో మదన్యో జగదీశ్వరః। క్వాసౌ?

ఎక్కడున్నాడురా? నీవు నాకంటె వేరుగనున్నాడని పరిపరినడరుచున్న ఆమంధభాగ్యుడు? అని ప్రశ్నింపగా ప్రహ్లాదుడు ఆస్తికుడుగాన- "అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" "ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కిఞ్చజగత్యాం జగ" త్తనెడు శ్రుత్యర్థములను నమ్మి—

శ్లో. ఉర్వ్యాం మస్త్వ దకేషు చాస్త్యు డుపతౌ వస్త్వ స్తి చోష్ణద్యుతౌ
వహ్నౌ దిక్షు విదిక్షు వాయు నభసో స్త్వ ర్యక్ష్వ తిర్యక్షు చ॥
అస్త్యన్త ర్బహి రస్తి సత్యసతి వాసా శేష్వసాశేషువా।
సర్వత్రాస్తి సదాస్తి కింబహుగిరా త్వయ్యస్తి మయ్యస్తిచ॥

తండ్రీ! ఆజగదీశ్వరుడు భూమియందు నీటియందు చంద్రునియందు, సూర్యునియందు, నిప్పునందు, దిక్కులయందు, విదిక్కులయందు, గాలియందు, ఆకసమునందు, పశుపక్ష్యాదులయందు తరుగుల్మలతాదులయందు, లోపల, బయట ఇట్లుసకలసజీవనిర్జీవపదార్థములయందును, రసపూ

ర్ణపదార్థములయందు, నిస్సారవస్తువులయందు, అంతటను అన్ని వేళలయందును కలడు. వేయేల? ద్వేషించునీయందు ప్రేమించునాయందునుకూడ కలడని ప్రతినయొనరించగ హిరణ్యుడు "యది స సర్వత్ర కస్మాత్ స్తమ్భే న దృశ్యతే" అంత టనున్నచో నీ స్తంభమున గాన్పించడేమి? అని స్తంభమునుతట్టుసరికి శ్రియఃపతి—

శ్లో. సత్యంవిధాతుం నిజభృత్య భాషితం
వ్యాప్తించ భూతేష్వఖిలేషుచాత్మనః।
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహన్।
స్తమ్భే సభాయాం న మృగం న మానుషం॥

పైనచెప్పినట్లు తనభక్తుడగుప్రహ్లాదునిమాటను పాలించుటకును, సమస్త భూతములయందును తానువ్యాపించియుండుటను బుజువుపరచుటకును, హిరణ్యకశ్యపుని చంపుటకేర్పరచుకొనిన అద్భుత మగు నరిసింహరూపముతో సభయందలి స్తంభ మునందు కాన్పించెను.

కావున తనప్రతిజ్ఞనుభంగపరచుకొనినైనను, అఘటితఘటనలచేనైనను తనభక్తుల ప్రతినను గాపాడుట శ్రీకృష్ణపరమాత్మ స్వభావముగాన "నాభక్తులను చెడనీయనని" తాను ప్రతిజ్ఞచేసి నచో తాను కాపాడుకొనగలనో లేనోయను సం దేహముతో అర్జుననిచే నాప్రతిజ్ఞచేయించినచో నిశ్చయముగ కాపాడితీరవలసివచ్చునని 'కౌన్తేయ ప్రతిజానీహి న మేభక్తఃప్రణశ్యతి' అనెను. ఇట్లు అభ్యాసమనెడులింగము భక్తియోగమునందే సమన్వితమగుచున్నది.

అ పూ ర్వ త:-

భక్తి ముక్తికి సాధనమని తెలుపు శ్రుతిస్మృ తీతి హాసపురాణాగమాది పెక్కు ప్రమాణగ్రంథ ములున్నను -ఇది ప్రత్యక్షరూపమైనదనియు, నిర తిశయప్రియమైనదనియు, కీర్తనయతననమస్కార రూపమైనదనియు, ఇతరప్రమాణములలో గాన్పిం చని భక్తిస్వరూపములో చేరునట్టి రీతులీ యధ్యా యమున దెలుపబడుచున్నవిగాన నీలింగములచే భక్తియోగమే యిందు ప్రతిపాదింపబడుచున్నదని తెలియుచున్నది.

అవి తెలుపబడినశ్లోకములేవియనగా—

భక్తిస్వరూపమును నిర్ణయించు శాస్త్రప్రణా లికలో—

'తమేవవిదిత్వాఽతిమృత్యుమేతి నాన్యఃపన్థావిద్యతే ఽయనాయ' మొదలగు శ్రుతులచేతను
'నాహంవేదై ర్నతపసా న దానే న న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధో ఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥

మొదలగు స్మృతివాక్యములచేతను భక్తియే ముక్తికి సాధనమని నిశ్చయించి-

ఈభక్తియనగా వేదనము, ఉపాసనము, అను పర్యాయనామములుగల నిరంతరధ్యానమని "ఆ వృత్తిరసకృత్, ఉపదేశాత్" అనెడు బ్రహ్మ సూత్రమునను, "ఆహారశుద్ధౌ, సత్త్వశుద్ధిః, సత్త్వ శుద్ధౌ ధ్రువాస్మృతిః స్మృతిలంభే సర్వగ్రంథీ నాం విప్రమోక్షః" జాతి, ఆశ్రయ, నిమిత్తదోష ములులేని యాహారమువలన అంతఃకరణశుద్ధియు,

దాని వలన పీటముడివలె మనస్సునందు మిక్కిలి దృఢముగ బట్టియున్న రాగద్వేషాదులున్ను పూర్తిగ నశించిపోవును' అనెడు ఉపనిషద్వాక్యమున ధ్రువాస్మృతిః" అనుపదములచేతను తెలుపబడి పిమ్మట 'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" సర్వశేషియగుసర్వేశ్వరుడు సాక్షాత్కరింపబడెనేని జీవుని ప్రకృతిబంధము ఛుల్లిపోవును. ఆతని సంశయములన్నియు పటాపంచలైపోవును. ఆతని పుణ్యాపాపకర్మలన్నియు నడుగంటుననుటచే నాభక్తి ప్రత్యక్షసమానాకారము ప్రత్యక్షరూపమైనది కావలెననియు తెలుపబడినది.

పిమ్మట "యమేవైషవృణుతే తేనైవ లభ్యః, తస్యైషఆత్మా వివృణుతే తనూం స్వాం" అనగా తనను ప్రేమించినవానినే తాను ప్రేమించుట లోకరివాజుగాన నట్లుతనను మిక్కిలిప్రేమించుటచే తనప్రేమకు పాత్రమగు భక్తునకు తాను తన నిజస్వరూపమును జూపుననుటచే నా భక్తి ప్రీతిరూపమైనదియు కావలెనని తెలియుచున్నది.

ఈ రెండు విషయములీయధ్యాయమందలి—

శ్లో. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమం
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయం॥
2 శ్లో.

అనెడు రెండవశ్లోకమున "ప్రత్యక్షావగమం సుసుఖంకర్తుం' అనెడు రెండుపదములచేతను తెలుపబడుచున్నవి.

ఇందు 'ప్రత్యక్షావగమం' అను పదమునకు భాష్యకారులు -అవగమ్యతే ఇత్యవగమః= విషయః, ప్రత్యక్షభూతః అవగమః =విషయః యస్య జ్ఞానస్య తత్ప్రత్యక్షావగమం, భక్తిరూపేణోపాసనేన ఉపాస్యమానోఽహం తదానీమేవోపాసితుః ప్రత్యక్షతాంఉపగతో భవామీత్యర్థః"అని వివరించిరి.

అనగా-అవగమమనగ- ధ్యానింపబడువస్తువు. అది యే జ్ఞానమునకు ప్రత్యక్షముగ గోచరించునో ఆజ్ఞానము "ప్రత్యక్షావగమం" అనబడును. నేను భక్తియనబడు ఉపాసనచే నుపాసింపబడువాడనై వెంటనే ఉపాసనచేయువానికి (ధ్యానించువానికి) కంటికి గాన్పింతును. కావున భక్తి పరమపురుషుని సాక్షాత్కరింపజేయునదిగాన దానికి 'ప్రత్యక్షావగమం' అని విశేషణముంచబడినది.

అట్లే 'సుసుఖంకర్తుం'అను పదములకు భాష్యకారులు 'అతఏవ' 'సుసుఖంకర్తుం'= సుసుఖోపాదానం= అత్యర్థప్రియత్వేనోపాదేయం' అని వ్రాయించిరి. అతఏవ .. అనగా దీనికి పూర్వము, "స్వరూపేణైవాత్యర్థప్రియత్వేన తదానీమేవ మద్దర్శనాపాదనతయా చ స్వయం నిశ్రేయసరూపమపి నిరతిశయ నిశ్శ్రేయస రూపాత్యంతిక మత్ప్రాప్తి సాధనం" అని వ్రాయించుటచే నీభక్తి నన్నుధ్యానించుటకాన నేను వానికత్యంతప్రియుడనగుటచే కాముకునకు కామినీధ్యానమువలె నిరతిశయప్రియమైనదగుటచేతను, ఆధ్యానము పరినిష్పన్నమైన వెంటనే మారీచుడు""వృక్షేవృక్షేచపశ్యామి"యని

నట్లు నన్ను జూపుటయు, నిరతిశయ సుఖస్వరూప మగు నన్ను పొందించునదియు అగుటచేతను'అని యర్థము. దీనివలన "నిరతిశయప్రియత్వము" తెలుపబడినది.

అట్లు 'సతతంకీర్తయంతో మాం' అనుశ్లోకమున కీర్తన యతన నమస్కారరూపమైనది యని సూచింపబడినది. ముందువివరంపబడు 'పత్రంపుష్పం' "మన్మనాభవ" అను శ్లోకముల చేతను కొన్నిభక్తిప్రధానాంగములు వివరింపబడెను.

ఇట్లుప్రమాణాంతరములచే తెలియబడని భక్తిక్రిసు లిందు తెలుపబడుటచే నపూర్వమను లింగ మీభక్తికి సమన్వితమగుచున్నది.

ఇక ఫలమనెడు నాల్గవతాత్పర్యలింగమును పరిశీలింతము. "ప్రియో హి జ్ఞానినోత్యర్థ మహం" అనినట్లు భక్తునకు భగవంతునియందలిప్రేమ సర్వజ్ఞునకును చెప్పశక్యముకానిదికాన అట్టి భగవంతునిధ్యానరూపమైన ఈభక్తియు తనంతనే ఆనందరూపమగుటచే నదియే ఫలము. ఇదిగాక పరమపురుషార్థమగు మోక్షానందమునకు సాధనమగుటయుకలదు. ఈవిషయ మీక్రిందిశ్లోకములలో సూచింపబడెను.

మొదటిశ్లోకమునందే 'యత్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్' ఈభక్తినిగూర్చి తెలిసికొని యనుష్ఠించిన మోక్షవిరోధులగు సకలపాపములవారినుండియు విడువబడుదురనియు

'అనన్యాశ్చింతయంతో మాం। యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహం॥

ఇతరఫలములకోఱకుగాక నన్నుధ్యానించనియొజ్జ్యక్షణము "సాహానిః తన్మహాచ్ఛిద్రం సా భ్రాన్తి స్సాచ విక్రియా' అనినట్లు మహాపత్తుగా భావించి "దస్యుభి ర్ముషి తేనేవ యుక్త మాక్రందితుం భృశమ్॥" అనునట్లు దొంగలచేదోచబడిన వానివలె మిక్కిలి విలపించుచు నాతో నిత్యసంబంధమునాసించు మహాత్ములయొక్క యోగక్షేమములను నేనే వహింతును. ఇచ్చట యోగమనగా పొందనిదానిని పొందించుటగాన భగవంతుని పొందించుటయనియు, క్షేమమనగా- పొందిన దానిని పోకుండకాపాడుట, అనగా-

ఆమోక్షము నుండి తిరిగిసంసారమునకురాకుండకాపాడుట. ఈరెండుపనులను నేనే చేతునని ప్రకరణానుగుణమైనభగవదభిప్రాయము. ఇచ్చట "యోగక్షేమంవహామ్యహం" అనుచో "వహామి' అనుపదమునకు మోయుదునని ముఖ్యార్థమైనను లక్షణముగా "ఇచ్చెదను" అని అర్థమును చెప్పవలెను 'దదామి' అనయేచెప్పరాదా? లక్ష్యార్థమునకవకాశమిచ్చు "వహామి"శబ్ద మేల ప్రయోగింపబడెననునది యొక రహస్యవిషయము అదియేమనగా- తాను ప్రసన్నుడై ప్రసాదించిన దానిని మోసితీసికొనిపోవలసిన భారమునుకూడా తనభక్తునకు భగవంతుడు సహింపక తానే మోసికొనిపోయి చేరవలసినచోట చేర్తునని దాని భావము. దీనికి శ్రీసుదామ (కుచేల) చరిత్రయే మనకు తార్కాణము.

శ్రీకృష్ణుని దైవముగానమ్మిన సుదాముడు తన భార్యావరోధముచే నాతనిదర్శింపగోరి 'రిక్తహస్తే

న నో పేయాత్త్”ని స్మరించి తన భాగ్యనాలు గిండ్లలో ముష్టిమెత్తి తెచ్చిన నాలుగుపిడికెల యటుకులను చినిగిన యుత్తరీయమున కట్టుకొని పోయి శ్రీకృష్ణుని దర్శించియు, ‘పత్రం పుష్పం ఫలం తోయం ...అశ్నామి ప్రియతాత్మనః” అనెడు భగవత్స్వభావము నెఱిగించునాతని యై శ్వర్యమును, తనకు చేయు మర్యాదలజూచి తన ముష్టియటుకుల నీయ సిగ్గిలి యూరకున్నను, శ్రీకృష్ణుడే స్వయముగ నామూటనువిప్పి ఆయ టుకుల నొక పిడికెడెత్తి

“నన్వేతదుపనీతం మే పరమ ప్రీణనం సఖే ।
తర్పయన్త్యఙ్గ! మాం విశ్వ మేతే పృథుకతండులాః॥

ఆహా! ఈయటుకులను తెచ్చితివా మిత్రమా! ఈయటుకులు నాకు మిక్కిలి ఇష్టమైనవిసుమా! ఇవి విశ్వశరీరకుడనగు నన్ను తృప్తునిగావించును.

అనగా-వీటిచే జగత్తంతయు తృప్తినిచెందునని భావము. అనిప్రశంశించుచు నోటనిడుకొని రెం డవపిడికిలి నెత్తి తినబోవుచుండగ శ్రీరుక్మిణీదేవి తటాలునచేయిపట్టుకొని—

“ఏతావతాలంవిశ్వాత్మన్, సర్వసంపత్సమృద్ధయే।
అస్మిన్లోకేఽథవాముష్మిన్, పుంస స్త్వత్తోషకారణమ్।

నాథా! నీవొక్కపిడికెడటుకులు తినుటచే జగ త్తులన్నియు తృప్తినిచెందినవి. ఈబాపనికి ఐహిక సకలసంపదలనొసంగుట కివి చాలును. రెండవ పిడికిలి తిననుద్యమించు చున్నావే. నన్నుగూడ నీతనియధీనముగావించ నెంచుచున్నావా? చాలు చాలుననివారించెను.

సుదాముడు శ్రీకృష్ణునినుండి యింత ఆద రమును లభించెనేగానీ ఒకకాసైన నాతడీతని చేతి లో నుంచలేదు. సిగ్గుచే నీతడడుగనులేదు. ఇవ్వ లేదనివిచారించనూలేదు.

శ్లో. అధనోఽయం ధనం ప్రాప్య । మాద్యన్నుచ్చైః న్న మాం స్మరేత్॥ ఇతి కారుణికోనూనం ధనం మే భూరి నాదదాత్॥

సర్వేశ్వరుడు దయామయుడు “వీడు దరిద్రుడు ధనమొసంగిన మదించి నన్ను స్మరింపడ’ని తలంచి నాకు ధనమీయలేదనితలంచి తనకు గావించిన ఆదరాతిశయమున కుప్పొంగిపోవుచు తనగ్రామము చేరెను. తనకుటీరమచ్చటగాన్పించలేదు. దాని స్థానమున రాజాధిరాజుయొక్క దివ్యప్రాసాద మొక్కటి రాజిల్లుచుండుట జూచి ‘ఆహా! భగవ ల్లీల ఉన్నగుడిశెగూడ నూడిపోయెనే. ఏమిచి త్రమనివిచారించుచుండగ తనభార్యయెదురేతెంచి నమస్కరింప—

శ్లో. పత్నీం వీక్ష్య విస్ఫురన్తీం, దేవీం వైమానికీ మివ।
దాసీనాం నిష్కకణ్ఠీనాం। మధ్యే భాన్తీం సవిస్మితః॥

సువర్ణాభరణభూషితయై, అనేకాభరణము లతో నలంకరింపబడిన దాసీజనమధ్యభాగమున విమానము నధిరోహించిన దేవకాంతవలెనున్న ఆమెనుజూచి అత్యాశ్చర్యనిమగ్నుడయ్యెను.

చూచితిరా! ‘వహామ్యహం” అనుపదప్రయో గస్వారస్యము ఈపదము భక్తులపట్ల భగవంతు నకుగల ప్రేమాతిశయము నెట్లుసూచించుచున్న దో! ఇచ్చినచో మోయవలసినభారమొకటి తన భక్తునకు కల్పించవలసియుండునని ఆభారమును

తానే వహించెనుగదా! ఇది భక్తికొక ఫలము కాదా!

"యాంతి మద్యాజినోఽపిమాం' శ్లో. 25

నాయందలి భక్తిలోనేకదేశమగు యోగమునకు గల ఫలవిశేషమును చూడుము. ఇతరదేవతల నర్చించువారు వారిలోకములకేగి వారితోపాట చ్చటి పరిమితభోగముల ననుభవించి వారి పుణ్య ముక్షీణించగనే వారునశించునప్పుడు వారితో పాటుగనే వీరు నశింతురు. కాని నన్నారాధించు వారు నన్ను పొంది తిరిగి యెన్నడును సంసార మునకు రారు. (పుట్టరు)

శ్లో. శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్యాసయోగయుక్తాత్మా। విముక్తో మా ముపైష్యసి।
28 శ్లో.

(వెనుకటిశ్లోకమున 'నీవు చేయునట్టి లౌకిక వైదిక సమస్తకర్మలను భక్తితో నాకర్పింపుమని ఉపదేశించి యీశ్లోకమున దానికిఫలమును జెప్పు చున్నాడు) "నీవు నాకు దాసుడవనియు, నాచే నియమింపబడువాడవనియు, కావున నీవు చేయు ప్రతికర్మయు నాయారాధనయేయనియు తలంచి చేయుచున్నచో నన్నుపొందుటకాటంకములగు ప్రాచీనకర్మలనెడు సమస్తబంధములనుండియు విముక్తుడవై నన్నే పొందగలవు.

"యే భజంతి తు మాం భక్త్యా, మయి తే తేషు చాప్యహం'
29శ్లో

భక్తితో నన్నుభజించువారు నీచులుగానిమ్ము మహాత్ములుగానిమ్ము, నాతోసమానులు నాపట్ల నెట్లువర్తింతురో అట్లేనేనును వారిపట్ల నాకంటె గొప్పవారియందువలెనే వర్తింతును.

శ్లో. అపిచేత్సుదురాచారో। భజతే మా మనన్యభాక్।
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహి సః।
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి॥
30, 31 శ్లో.

మిక్కిలి దురాచారుడైనను నన్ను భజించు చో వైష్ణవాగ్రేసరుడుగా భావింపబడును. ఆభక్తి చేతనే పాపములకుకారణమగు రజస్తమోగుణ ములు మొదలంటనశింపజేయబడుటచే నాభక్తి పరిపక్వమగును. దానిచే పునరావృత్తిలేని ముక్తిని పొందును.

శ్లో. మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

ప్రేమతో నన్నుధ్యానించుచు, ఆరాధించుచు, నమస్కరించుచు నన్నే గమ్యస్థానముగా నమ్మి యున్నచో నన్నే పొందగలవు.

ఇట్లు భక్తికి నిరతిశయపురుషార్థమగు మోక్ష మును ఫలముగాజెప్పుటచే ఫలమనెడు తాత్పర్య లింగము భక్తియందే సమన్వయమగుచున్నది.

అర్థవాదము — అనగా ప్రశంస.

ఇది ప్రశంసారూపముగగాని నిందారూప ముగగాని ఉభయరూపములుగగాని యుండును. ప్రశంస సాక్షాత్తుగసాధనమునుగూర్చిగాని దానినవలంబించినవారినిగూర్చిగాని యుండును. నిందా.. తద్వ్యతిరిక్తసాధనములవిషయములో గాని దీని నాదరించనివారివిషయమునగానియుం డును.

ఇందుప్రశంసయునిందయుగూడగాననగును.

మొదటిశ్లో. మునందే 'గుహ్యాతమ'మని దీనిని ప్రశంసించెను.

మరియు

శ్లో. "రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్॥
ప్రత్యక్షావగమం ధర్మ్యం, సుసుఖం కర్తు మవ్యయమ్॥
గీత 9అ. 2శ్లో.

అనెడుశ్లోకమున ఎనిమిదివిశేషణములచే నీ భక్తి ప్రశంసింపబడినది. ఆవిశేషములొక్కొక్కటినే విమర్శింతము.

(1) ఈభక్తి రాజవిద్యా= అనగా రాజులవిద్య యనిగాని, విద్యలలో రాజనిగాని, రాజైన, విద్యయనిగాని యర్థము.

ఇచ్చట రాజనగా -శ్రేష్ఠము, "విస్తీర్ణాగాధమనస్కులు" అని అజహల్లక్షణ్యార్థము గానిగౌణార్థముగాని గ్రహించవలెను.

విద్యయనగా- ఉపాసన.

రాజశబ్దములకు క్షత్రియులర్థమైనచో బ్రాహ్మణాదుల కీభక్తియోగమునందధికారము లేకపోవును. కావున రాజశబ్దమునకు గౌణముగా విశాలమగు లోతైన మనస్సుకలవారని చెప్పబడెను. అట్టిమనస్సుకలవారు "బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులలో) ఎవరైన నీభక్తియోగమున కధికారులను భావ మేర్పడినది. ఏలనన- వారే దాచదగిన రహస్యార్థములను దాచగల సమర్థులగుదురు.

అట్లే రత్నశబ్దమునకువలెనే రాజ శబ్దమునకు శ్రేష్ఠమని యర్థమును జెప్పినచో భగవత్ప్రాప్తి సాధనములలో నిది శ్రేష్ఠమైనదని యర్థము సిద్ధించును

రాజగుహ్యం- ఇచ్చటను పైవలెనే విగ్రహమును పైవలెనే అర్థమును చెప్పవలెను. గుహ్యమనగా దాచదగిన రహస్యము.

అనగా- అనర్హులకు తెలుపదగనది.

ఉత్తమం, పవిత్రం = పవిత్రమనగా దోషములను పోగొట్టునది. ఉత్తమమనుటచే అన్నిటివలె గాక భగవంతుని పొందుటకు ఆటంకములైనిలచిన సకలపాపములను పోగొట్టునదీభక్తియోగమని భావము. కర్మజ్ఞానయోగములు భక్తికి ఆటంకములగు పాపములనుమాత్రమే పోగొట్టును గాన వానికంటె నీభక్తియోగము ఉత్తమపవిత్రమైనది.

ప్రత్యక్షావగమం=అవగమమనగా విషయము కాబట్టి భక్తియనబడు ఉపాసనచే నుపాసింపబడినవాడై పరమాత్మ వెంటనే యాఉపాసకునకు సాక్షాత్కరించును.

ఇదియేయితరసాధనములకును లేని యతిశయము,

ధర్మ్యం= ధర్మమును విడువనిది.

ధర్మ మనగా మోక్షసాధనము.

ఈభక్తి నిరతిశయ ప్రియుడగు భగవద్ధ్యానము గాన స్వయముగ మహదానందరూపమగుటయే గాక, ఆనందకందమగు భగవద్దర్శనము నప్పుడే కలుగజేయునదగుటచే నిరతిశయపురుషార్థమగు భగవత్ప్రాప్తికి సాధనముగూడ నగుచున్నది.

సుసుఖంకర్తుం= ఇట్లు స్వరూపమును బట్టియు

విషయమును బట్టియు, మిక్కిలి యనుకూలమైన దగుటవలన నీభక్తి ప్రీతితో పరిగ్రహించదగి యుండును.

అవ్యయం= లోకమున సాధనములన్నియు ఫలము లభించువరకే నిలుచును. ఈభక్తి యట్లు గాక తనకు ఫలమగు భగవత్ప్రాప్తిని కలుగ జేసియు తాను క్షీణించదుగాన అవ్యయము.

ఇట్టిభక్తునకు నన్ను స్వాధీనపరచినను నేనీతని కింకను ఏమియుచేయనట్లే నాకు తోచును.

అని యిట్లు భక్తియోగమును స్వతఃప్రశం సించి

శ్లో. అశ్రద్ధధానాః పురుషాః। ధర్మస్యాస్య పరంతప।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥

ఇట్లు సహజముగ తాను నిరతిశయప్రియరూపమై నిరతిశయపురుషార్థమునకు సాధనమై యల రారుచున్న నీభక్తియోగము నవలంబించుటకు యోగ్యులైయుండియు దీనియందు విశ్వాసము లేక దీనిననుష్ఠింపత్వరపడనివారు నన్నెన్నటికిని పొందజాలక జనన మరణ ప్రవాహరూపమగు నీసంసారమున నిరంతరము నిలిచిపోవుచున్నారు. ఆహా! దుష్కర్మప్రభావమెంత ఆశ్చర్యకరమైనది! (ఇచ్చట పరన్తప! యని సర్వేశ్వరుడు సాభిప్రాయముగ సంబోధించెను. అర్జునా! ఇట్టి అశ్రద్ధకు కారణమైన ఆన్తరశత్రువులనుకూడ నీవు జయిం చవలెనుసుమా! అని యీసంబోధనయొక్క అభిప్రాయము.)

ఇట్లు ప్రశంసానిందాత్మకమగు నర్థవాదరూపమైన లింగముకూడ నీభక్తియోగమునకే యను కూలము.

ఇక ఉపపత్తిదీనికెట్లనుకూలించు చున్నదో చూతము.

ఈభక్తియోగమనగా భగవద్ధ్యానము భగవ దుపాసనము. దీనిచే ప్రసన్నుడగువాడు తానే ప్రసన్నుడై తానిచ్చుఫలము నిరతిశయపురుషార్థ మగు మోక్షము. దానినిచ్చుటకు తనసామర్థ్య మును దెలుపవలసియున్నది. దానిచే విశ్వాసము కలిగి యీఫలమునుపొందుట కాతనిని ప్రీతితో ధ్యానింతురు. కావున నీక్రింది శ్లోకములచే తన మహిమ నెఱింగించుచున్నాడు.

ఈఅధ్యాయమున నర్థభాగమీభగవన్మహిమవర్ణనమే గాన్పించును. ఇతరావతారముల కంటె శ్రీకృష్ణావతారమున తన పరత్వప్రకాశన మతిశయముగ గాన్పించును.

అందులకు కారణము తాను సౌలభ్యపరా కాష్ఠతోనవతరించుటయే. కావుననే—

శ్లో అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం
పరంభావ మజానంతో మమ భూతమహేశ్వరం॥
9అ. 11శ్లో.

స్వతః సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారకుడయ్యును పరమకారుణికు డగుటచే, తనసందరాశ్రయించి తరించవలెననెడు సంకల్పముతో మనకు సజాతీయమగు మానవ శరీరము పరిగ్రహించి యవతరించినను తమ పాప రాశిచే పెరిగిన రాజసతామసస్వభావములచే హిరణ్మయ మృణ్మయ ఘటములేకాకారపరిమాణాదులతో కూడియున్నను ద్రవ్యవైజాత్యమును

పట్టి ఆదరానాదరముల నెఱుంగని మూర్ఖునట్లు మానవశరీరమును చూచినంతమాత్రమున ననాదరించుచున్నారు.

అది యూరకబోవునా? దానివలన వారికోరికలన్నియు నిష్ఫలమగుచున్నవి. వారు గావించు కర్మలన్నియు బూడిదనుబోసిన పన్నీరగుచున్నవి. వారార్జించిన జ్ఞానమంతయు నడవినిగాసిన వెన్నెలయగుచున్నది. కావున నీయాపదనుండి ప్రాజ్ఞులైన నెఱింగి తరింతురు గదాయని యడుగడుగునకును తన పరత్వమును ఆటలచే మాటలచే (ప్రకటించుచునేయుండెను.)

శ్లో. మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥
న చ మత్స్థానిసర్వ భూతాని పశ్య మే యోగ మైశ్వరం।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥

ఈచేతనాచేతనాత్మక ప్రపంచము నంతను నేను దానిని ధరించుటకును, నియమించినడుపుటకును, శేషినై వినియోగించుకొనుటకును నారూపమును జూపకనే వ్యాపించియుందును. నేనట్లుండుటచేతనే ప్రపంచ మాగియున్నది.

నాయునికికి వాటియుపకారమేమియు లేదు. వాటినైనను నేను నాసంకల్పముచేతనేపుట్టింతును, నడిపింతును, నిలిపియుంచుదును. చూచితివా నా సంకల్పమహిమ ఈభూతములన్నియు బ్రహ్మాయువునకంతమున నాసంకల్పముచే నామరూపములు లేనివై తమస్సనబడు నాశరీరమున విలీనమగుచు తిరిగి కల్పారంభమున నాచే విడువబడుచున్నవి. ఇట్లుచేసినను సృష్టిలోనితారతమ్యములు నాకు పక్షపాతమునుగాని నిర్దయత్వమునుగాని యాపాదించవు. అందులకు కారణమునేనైనగదా! ఆకారణము వారివారికర్మలే. నాకేమి? అయినచో నీకెందులకందువా? నేనుసర్వజ్ఞుడనుగాన జీవుల కర్మానుగుణముగ సంకల్పించిననే యచేతనమగు ప్రకృతి చరాచరప్రపంచమును పుట్టించకలుగును. అయస్కాంతము లేకయే యినుము చలించునా?

ప్రపంచమంతయు నాకు శరీరమే. చూడుము. జ్యోతిష్టోమాదిక్రతువును నేను. పంచమహాయజ్ఞములు నేను. పితృగణమునకు పుష్టినిచ్చు స్వధను నేను. అగ్నియందు వేల్చబడు హవిస్సును నేను. ఆసమయమున నుచ్చరింపబడు మంత్రము నేను. ఆహవనీయాది అగ్నిత్రయమును నేనే. హోమము నేనే. ఈపైననింకను మూడుశ్లోకములలో తన విశ్వశరీరముతోపాటు—

శ్లో. పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో (రమాపతిః)
స్వామ్యాధారో మమాత్మాచ భోక్తా (చాద్యమనూదితః)

అనుశ్లోకమున చెప్పబడిన నవవిధసంబంధములను సూచించెను

నన్నీ స్థావరజంగమాత్మక ప్రపంచమునకు తండ్రిగను, తల్లిగను, తాతగను, ధాతగను, వేదముచే నెఱుంగదగిన పావనవస్తువుగను, వేదమునకు బీజమగు ఓమ్కారముగను, మూడువేదములుగను స్వర్గాదిప్రాప్యస్థానముగను, ధరించువాడనుగను, శాసించువాడనుగను, స్వయముగ చూచువాడనుగను, హర్మ్య ప్రాసాద భవన ప్రభృతి నివాసస్థానముగను, అనిష్టమును పోద్రోలి యి

ష్టము నొసంగు రక్షకునిగను, హితైషినిగను, ఉత్పత్తి వినాశ స్థానముగను (విత్తనముగాని భూమ్యాదులుగాని) పుట్టునట్టియు, గిట్టునట్టియు పదార్థములుగాను నాశములేని బీజముగాను (కారణమాత్రము లేక భూమ్యాదులు) తాపము నొసంగు నిప్పు సూర్యుడు మొదలగు పదార్థముగను, గ్రీష్మాదులలో వర్షము నరికట్టు వానినిగను, వర్షఋతువున వర్షమునొసంగువానినిగాను, జీవనాధారముగను, వినాశసాధనముగను, భూత భవిష్యద్వర్తమాన సమస్తపదార్థములుగను ఎఱుంగుము. నేనొక్కడనయ్యు ఇట్లు వేరువేరుగా గాన్పించు పదార్థజాతమునకంతకు నంతర్యామిగా నుండి వాటిని నాశరీరమునువలె యథేష్టముగా సంచరింపజేయుదును.

ఈయుపపాదనలో—

పితా— అనుటచే పితాపుత్ర సంబంధము
శరణమ్— అనుటచే రక్ష్య రక్షకభావసంబంధము
పితామహః— అనుటచే శేష శేషిభావసంబంధము
భర్తా— అనుటచే భార్యాభర్తృసంబంధము
వేద్యం— అనుటచే జ్ఞాతృ జ్ఞేయసంబంధము
ప్రభుః— అనుటచే స్వ స్వామిభావసంబంధము
నిధానం— అనుటచే ఆధారాధేయభావ సంబంధము
సదసచ్చఅహం— అనుటచే శరీరాత్మభావసంబంధము

ముందు 24వ శ్లోకమున— అహం— భోక్తా— యనుటచే భోక్తృభోగ్యసంబంధము.

ఇట్లుమనకు తనతోగల నవవిధసంబంధములను సూచించి, కావున తానే ఉపాస్యుడనని ఋజువుపరచెను.

భక్తియనగా ప్రీతితో ధ్యానించుట ఈప్రీతికి పరస్పర సంబంధజ్ఞాన మెంతయో అవశ్యకము. కుమారుడు తల్లిగర్భమునందుండగనే తండ్రి ద్వీపాంతరమునకు రత్నవ్యాపారమునకేగి పదునెనిమిదేండ్లు రాకుండెను. కుమారుడు మేజరై తల్లి పంపున ద్వీపాంతరమేగి తెచ్చినసరకును తన తండ్రి వాడుకరేవున దింపెను. అదేసమయమునకు దైవవశమున తండ్రియు తన సరకుతో వచ్చి దింపదలంచెను. పరస్పరమాస్థలమున వివాదము పెరిగెను. వారికొకరి కొకరి సంబంధజ్ఞానములేదు. చంపుకొనువరకావివాద పెరిగెను. ఉభయుల సంబంధము నెఱింగిన నొక నాగరికుడాసంబంధము నెఱుకపరచెను. అంత తండ్రిబిడ్డలాయుధములపారవైచి యాలింగనముగావించుకొని యానందాశ్రువులు వెడలించి సంతసించి సుఖించిరి. చూచితిరా సంబంధజ్ఞానము ప్రీతికెంతయవసరమో? కావున భగవంతునితో మనకుగల నవవిధసంబంధముల నెఱుంగుట భక్తికి ముఖ్యావసరముకాదా!

ఇట్లు తనపరత్వమును ప్రకటించుటచే సర్వకారణమైనవానినిగను, కావుననే ధ్యానింపతగిన వానినిగను కావుననే పరమపురుషార్థప్రదునిగను లోకమునకెఱుకపరచెనుగాన ఉపపత్తియు నీభక్తియోగమునకే యుపపన్నమగుచున్నది.

ఇట్లీయధ్యాయమున "రాజవిద్యా"యనెడు శ్లోకముచే భక్తియోగమును ప్రశంసించెను.

'మయాతత'మిత్యాదిశ్లోకములచే నాభక్తిఁ బొందబడు తనయొక్క వైభవమును ప్రశంసించి తద్ద్వారా భక్తివైభవమును కొనియాడెను.

"అశ్రద్ధధానాః పురుషాః" అనుశ్లోకముచే నీభక్తియోగము నవలంబించిన వారిని నిందించి ఆవిధముగ భక్తియోగవైభవము నెఱుంగజేసెను.

అట్లవలంబించనివారు కేవల మూఢులు, ఫలాంతరదేవతాంతర పరులనియు 'అవజానంతి మాం మూఢాః' 'త్రైవిద్యా మాం సోమపాః' "యాన్తి దేవవ్రతాః" "యేత్వన్యదేవతా భక్తాః"అనెడు శ్లోకములచే సూచించెను.

ఇట్లితరనిందాముఖముగ భక్తియోగమును ప్రశంసించి "మహాత్మానస్తు" "అనన్యాశ్చింతయంతో మాం"అనెడు శ్లోకములచే భక్తియోగులను ప్రశంసించి ఆరూపముగను భక్తియోగముయొక్క అతిశయమును సూచించెను. పత్రం పుష్పం, యత్కరోషి, యనుశ్లోకములచే తన సౌలభ్యమును తెలిపి భక్తియోగులకు గల ఆరాధనాసౌకర్యమును బోధించి తద్ద్వారా భక్తియోగవైభవమును కొనియాడెను.

'సమోహం'అనెడు శ్లోకముచే తాను తన భక్తుల జాత్యాకారాదితారతమ్యముల నాదరించననుటచే తన సౌశీల్యమును జూపి యావిధముగను భక్తియోగవైభవమును చాటెను.

ఇట్లు తన భక్తుల జాత్యపకర్షనేకాదు, వృత్తాపకర్షను (ఆచారవైకల్యమును) కూడ పాటించనని 'అపిచేత్సుదురాచారో' అనెడు శ్లోకముచే నెఱింగించెను.

ఇట్లీయధ్యాయమున పెక్కురీతుల భక్తియోగమునే వర్ణించుటచే నిది ఆమూలచూడము భక్తియోగపరమనుట నిస్సంశయము. దీనినే రాజవిద్యయని విలక్షణ నామకరణమును • పరమాత్మయే స్వయముగ జేసెను ఇక నంతిమ శ్లోకముచే గావించిన భక్తిస్వరూపనిష్కర్షను వేరొక వ్యాసమున గాంచగలము.

—0—

పాలుసరి చందా రు 1-4-0

# భక్తినివేదన

# ప్రచారవిభాగము

సంపుటం ౧౦ | హేవిళంబి - వైశాఖ | సంచిక ౨

## గీతాపరీక్షలు

28-4-57 వ తేదీని జరుగవలసిన గీతాపరీక్షలు కారణాంతరములచే 26-5-57 వ తేదీ ఆదివారమునకు మార్చబడినవి.

### గీతాప్రచారము

మన సంఘ కార్యదర్శులైన తె.కం. గోపాలాచార్యులుగారు విశాఖపట్టణమునందలి మైన్ వీధిలో నున్న రీడింగు రూములో 6-3-57 వ తేదీనుండి 16-3-57 వ తేదీవరకు 11 రోజులు గీత 18 అధ్యాయముల సారమును ఉపన్యసించిరి పెక్కుమంది ఉద్యోగులు, పండితులు, స్త్రీలు విని ఆనందించిరి. 12 వ తేదీ ఏకాదశి నాడు వారిచే శ్రీ సీతారామస్వామివారి ఆలయములో గీతాప్రకాహమును జరుపబడి మరు నాడు బీదలకు అన్నదానము విరివిగా జరిపించ బడెను.

12-3-57 వ తేదీ మొదలు 21-4-57 వ తేదీ వరకు రాజమండ్రి ట్రైనింగు కాలేజీ సందులో నున్న శ్రీ తులసీ రామానుజకూటములో కూడా గీత 18 అధ్యాయముల సారార్థములను పండిత పామర రంజకముగా నుపన్యసించిరి. ఈ దినములలోనే మధ్య విక్రమహాలులో 2-4-57 వ తేదీ మొదలు 8-4-57 వరకు రామాయణ షట్కాండ సారార్థములను 9వ తేదీని రామాయణ రామరాజ్యమును గురించియు ఉపన్యసించిరి. 21-3-57 ఏకాదశీ బుధవారం రామానుజకూటములో దినమంతయు గీతా సమిష్టి పారాయణ అత్యంత వైభవముతో జరుపబడెను. మరునాడు సుమారు 800 మంది బీదలకు అన్నదానము గావింపబడెను.

### గీతాజాంతి మహోత్సవము

21-4-57 వ తేదీ ఆదివారం ఉదయం గం. 6 లకు సుమారు 4 వందలమంది స్త్రీలు పురుషులు రామానుజకూటమునుండి రెండులైన్లలో గీతా 18 వ అధ్యాయ పారాయణతో నగర సంకీర్తన గావించుకొనుచు శ్రీ వేణుగోపాలస్వామి పెరుమాళ్లను సేవించి రామానుజ కూటమునకువచ్చి అచ్చటి పెరుమాళ్ళకు సమిష్టిగా సహస్ర నామార్చన గావించి చరమశ్లోకార్థోపన్యాసమును విని ఆనందించిరి.

తిరిగి సాయంకాలము గం. 4 లకు రామానుజకూటమునందే పెరుమాళ్ళ ఎదుట శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర రత్న పారాయణములు గావింపబడెను. సరిగా గం. 5 లకు ప్రారంభించి గం 8 ల వరకు తె. కం. గోపాలాచార్యులు గారు గీత 18 అధ్యాయముల ముఖ్యార్థము లన్నియు పూసగుచ్చినట్లు హృదయంగముగా నుపన్యసించి పెక్కుమంది ప్రజల నాకర్షించి పునీతుల గావించిరి.

శ్రీమతే రామానుజాయనమః

# రాజమహేంద్రవరము శ్రీ తులసీ రామానుజకూటము, నిర్వహణ సంఘము

## ఆశయములు — నిబంధనావళి

1 ఇది "తులసీ రామానుజకూటము, నిర్వహణసంఘము" అని పిలువబడవలెను.

ఈ దిగువ నిబంధనావళిలో "రామానుజకూటము" అనిమాత్రము వాడబడినవి.

2. "రామానుజకూటము" కార్యస్థానము, రాజమండ్రి మ్యునిసిపల్ డోరు 18/283 గల 'రామానుజకూటము'లో నెలకొల్పబడినది.

3. శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘముయొక్క సొత్తైన, రామానుజకూటము"యొక్క నిర్వహణకైన్ని, అట్టి నిర్వహణకవసరమగు ఆస్తులను చేకూర్చుటకైన్ని, ఆర్థిక స్వాతంత్ర్యముగల నిర్వహణసంఘము అవుసరమగుటచేత, ఈ దిగువ ఆశయములు, నిబంధనావళితో ఈసంఘమువిజిష్టరుచేయబడుచున్నది.

4. ముఖ్య ఆశయములు :—

(ఎ) ఆగంతుక శ్రీవైష్ణవులకు తాత్కాలిక వసతికొరకై, ఈ"రామానుజకూటము" ప్రధానముగ వినియోగింపబడుట మూడు దినములకు మించకుండ (ఉచిత వసతి యొసంగవచ్చును)

(బి) విశిష్టాద్వైత ప్రచారక కాలక్షేపములు. సంస్కృత, ద్రావిడవేదాంత పాఠప్రవచనములు నిత్యము జరుపుట

(సి) విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారేర్పరచు అన్నిప్రచారక సభలకున్ను, వారి ఆశయములకు భిన్నము కాని ద్రావిడ వేదాంత విజ్ఞానసమావేశములకు, సభలకు, (ఎ), బి) ఆశయములకు ఎట్టి అవరోధము లేకుండ, వసతివగైరా సౌకర్యముల నొసంగుట;

(డి) శ్రీవైష్ణవ విద్యార్థులకు వసతిగృహ ఏర్పాట్లు గావించుట

(ఇ) శ్రీవైష్ణవ ఆగంతుకులకు, విద్యార్థులకు, ఉచిత భోజనసౌకర్యములు కలుగజేయుటకు ప్రయత్నించుట;

(ఎఫ్) ఈ పై ఆశయములు నెరవేర్చుటకై తగు చందాలు, విరాళములు, ఇతర ఆర్థిక సహాయములు, సంపాదించుట

(జి) ఈ పై ఆశయములకు అనువగు ఇతర అనుబంధ ఆశయముల నేర్పరచుట;

4. (ఎ) ఈ "రామానుజకూటము" శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క అనుబంధసంస్థగా వ్యవహరించవలెను.

5. సభ్యత్వము :—

18 సం॥రముల వయస్సుదాటిన శ్రీవైష్ణవ మతాభిమానులెల్లరు సభ్యులగుట కర్హులు.

సాలువారీ సభ్యత్వచందా రు 1-0-0 ఇది వార్షిక ప్రథమ మాసములో చెల్లించవలెను. సభ్యులెల్లరు సర్వసభ్య సమావేశము లన్నింటిలోను, ఎన్నికలలోను పాల్గొన నర్హులు.

6. నిర్వహణ :—

(ఎ) "రామానుజకూటము" నిర్వహణ యావత్తున్ను.

(1) అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు:

(2) కార్యదర్శి, ఒక సహకారకార్యదర్శి;

(3) కోశాధిపతి;

(4) మరి పదిమందికి మించకుండ ఇతర సభ్యులుగల కార్యనిర్వాహక వర్గము,

(తరువాయి సైటిలు 3 పేజీలో)

రైటిలు 2 వ పేజీ నుండి

నిర్వహించవలెను. 3 సం॥ల కొకసారి తెలుగు యుగాదినాడు జరుపబడు వార్షిక సర్వ సభ్య సమావేశములో, సభ్యులచే నెన్నుకొనబడవలెను

(సి) ఈ దిగువ పేర్కొనబడిన సభ్యులుగల కార్యనిర్వాహక వర్గము శార్వరినామ సం॥ర ॥ చైత్రశుద్ధ పాడ్యమినాడు జరుపబడు ప్రథమ వార్షిక సర్వసభ్య సమావేశ ఎన్నికలవరకు వ్యవహరించవలెను.

(డి) కార్యనిర్వాహకవర్గము, 3 మాసముల కొకసారి అయినను, కార్యదర్శుల చేత గాని, వారు తప్పినచో ఏయిద్దరు కార్య నిర్వాహకవర్గ సభ్యులచేగాని, రామానుజకూట నిర్వహణ సమీక్షకునూ, ఇతర కార్యక్రమ నిర్వహణకునూ, సమావేశము జరపబడవలెను.

సర్వసభ్య సమావేశము, సంవత్సరమున కొకసారి సమావేశపరుపబడవలెను.

7. (ఎ) రామానుజకూటము యొక్క సొత్తులు యావత్తు కోశాధిపతిచే, రొక్కము బ్యాంకిలోను, తదితరములు ఇతర విధములుగను లెక్క జమా ఖర్చులతో, జాగ్రత్త పరుపబడవలెను.

(బి) సమావేశ నిర్ణయములకు వ్రాతలు, చందాలు, విరాళములు వసూళ్ళు, ఉత్తర ప్రత్యుత్తరములు నిత్య నిర్వహణ, రు 1౦-౦-౦ లకు మించని వ్యయము మున్నగు పనులు యావత్తు కార్యదర్శులు నిర్వర్తించుచు, కార్య నిర్వాహకవర్గ సమావేశములు,సర్వసభ్య సమావేశములు, సకాలములో జరుపుచుండవలెను.సమావేశములలో అధిక సంఖ్యాకుల నిర్ణయమే తుది నిర్ణయము

కార్యనిర్వాహకవర్గ సమావేశమునకు 5గురును, సర్వసభ్యసమావేశమునకు 15గురును కోరముగా నుండవలెను.

8. ఈ నిబంధనల నిర్వహణకు ఆవసరమగు అనుబంధ నిబంధనలను, నిర్ణయించుటకు కార్యనిర్వాహకవర్గమునకు అధికార మీయబడినది. అట్టి అనుబంధ నిబంధనలు, ఈనిబంధనలవలెనే అమలు జరుపబడవలెను

9. ఈ నిబంధనలు మార్చుకొనుటకు సర్వసభ్య సమావేశమునకు అధికారముకలదు.

10. కార్యనిర్వాహక సభ్యులు :-

(1) శ్రీ ముత్తంగి జగ్గారావు, (అధ్యక్షులు)
(2) శ్రీ మాన్ M. V. R. అణహరాచార్యులుగారు, (ఉపాధ్యక్షులు)
(3) శ్రీ మాన్ M. V. నరసింహాచార్యులుగారు, (కార్యదర్శి)
(4) శ్రీమాన్ తిరుమలపురిఘళ వెంకటాచార్యులుగారు,(సహాయకార్యకార్యదర్శి
(5) శ్రీ గ్రంధి లక్ష్మీనారాయణగారు, (కోశాధిపతి)
(6) శ్రీమాన్ వోలేటి వెంకట జగన్నాథాచార్యులుగారు, B. A B. L
(7) శ్రీ వానరాసి సోమరాజుగారు,
(8) శ్రీమాన్ అ. చి కృష్ణమాచార్యులుగారు, L. I. M.
(9) శ్రీ బలభద్ర వెంకటారాజుగారు,
(10) శ్రీ ఆత్మూరి సూర్యారావుగారు,
(11) శ్రీ వెలుమూరి వెంకటసత్యనారాయణగారు,
(12) శ్రీ తోట సూర్యంగారు,

# రాజమండ్రి శ్రీ తులసీ రామానుజకూటము,

దీనిని 1892 వ సంవత్సరములో పలువురు భక్తుల ద్రవ్యసహాయముతో కీ. శే. కొప్పర్తి నరసింహం పంతులుగారు ఆగంతుక శ్రీవైష్ణవోపయోగార్థమై నిర్మించి యొసంగిరి. ఇది పెక్కు సంవత్సరముల నుండియు దాతల ఆశయముల కనుకూలముగా వినియోగింపబడకున్నను సుమారు 6 మాసములక్రిందట స్థానిక వైష్ణవ మతాభిమానుల కృషివలన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ యాజమాన్యము క్రిందకు వచ్చినది. అప్పటినుండియు శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమలపురిఘళ్ళ వెంకటాచార్యుల అయ్యవార్లంగారు మొదలగువారు నిరంతరకృషిచే సలిపి భక్తులను ప్రోత్సహించి యీ క్రిందివిధముగ ద్రవ్యసహాయముతో సంస్కరించి చక్కని స్థితిలోనికి తెచ్చి శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రచార కార్యక్రమములను నిరంతరము జరిపించుచున్నారు. ఈ సంస్కరణలోను ప్రచారములోను శ్రీ వేంకటాచార్యుల అయ్యవార్లంగారు చూపుచున్న శ్రద్ధ వాచామగోచరము. ఇందు ద్రవ్యసహాయము చేసినవారిలో హెచ్చుమంది వారిశిష్యులే.

మరియు శ్రీ యతిరాజ సేవా మహిళామండలీకార్యదర్శిని యగు శ్రీమతి మరంగంటి రంగనాయకమ్మగారు స్వాధీనమైనచాటి నుండియు రామానుజకూటమునందే యుండి సమస్త సాధకబాధకములను సహించుచు స్త్రీలకు వేదాంత గ్రంథ ప్రవచనము గీతా హిందీపాఠములు శుక్రవార ఏకాదశీ ఉత్సవములు పండితుల ఉపన్యాసములు జరిపించుచు వచ్చిన ఆగంత శ్రీ వైష్ణవులను పెక్కురీతుల ఆదరించుచు నిర్వహించుచున్నారు.

18-3-57 వ తేదీనుండి శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారు ఇచ్చట ఉదయం శ్రీవిష్ణు సహస్రనామ భాష్యమునున్ను సాయంకాలము గీతోపన్యాసములను గావించుచు పెక్కు పురప్రముఖులగు పురుషులను స్త్రీలను ఆనందింప చేసిరి. శాంతి మహోత్సవ మత్యంత వైభవముతో జరిగినది. ఆ ఉత్సాహముతో శ్రీమాన్ చేబ్రోలు నారాయణ గుప్తగారు శ్రీమాన్ ముత్తంగి జగ్గారావుగారు, శ్రీ గ్రంధి వెంకటరాజు అండ్ సన్సువారు మొదలగు పురప్రముఖులు చందాల మూలమున యీ రామానుజకూటమున గీతామందిరమనుపేరుతో పెద్ద హాలును నిర్మించి అందొక చలువరాతి శ్రీకృష్ణ విగ్రహమును ప్రతిష్ఠింపజేసి నిరంతర గీతా ప్రచారమును జరిపించ సంకల్పించిరి. శ్రియఃపతి వారి యుద్యమమునకు తోడ్పడి సఫలపరచుగాక.

ఈ రామానుజకూట కార్య నిర్వహణకై యీ క్రింది ప్రముఖులతో నొక సంఘ మేర్పరచబడి రిజిష్టరు గావింపబడెను. శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తిరుమలపురిగళ్ళ వెంకటాచార్యుల అయ్యవార్లంగారియాదిచ్చటి వైష్ణవ మతాభిమానులందరికిని మిక్కిలి శ్రద్ధాభక్తులుండుటచే వారిని స్థిరముగా నీ రామానుజకూటమునందుంచి కాలక్షేపములు సాయించుచుండునట్లేర్పాటు చేయించమని కమిటీని కోరుటచే కమిటీవారిని ప్రార్థించగా వారందుల కంగీకరించిరి. ఇచ్చటి ప్రముఖులగు స్త్రీలు, స్త్రీలలో ప్రచారమును చేయుటకును, గీతా, ద్రావిడము, మొదలగు పాఠములను చెప్పుటకును, శ్రీమతి మరంగటి రంగనాయకమ్మగారిని యిందే కొంతకాల ముండుటకున్ను శ్రీయతి రాజసేవామహిళామండలి కార్యక్రమములు నన్నిటిని వేరుగా నొకస్థల మేర్పడువరకు యీ రామానుజకూటమునందే జరిపించుకొను

చూచుటకును కమిటీవారివలన అ ను మ తి ని పొందిరి.

శ్రీ తులసీ రామానుజకూటం కమిటీ

కార్యనిర్వాహక సభ్యులు

శ్రీమాన్ ముత్తంగి జగ్గారావుగారు- రాజమండ్రి (అధ్యక్షులు)

,, M. V. R. అణాహారాచార్యులుగారు, (ఉపాధ్యక్షులు)

,, M. V. నరసింహాచార్యులుగారు, (కార్యదర్శి)

,, శ్రీమత్తిరుమలపురిగళ్ళ వెంకటా చార్యుల అయ్యావార్లంగారు, (సహాయకార్యదర్శి)

,, గ్రంధి లక్ష్మీనారాయణగారు, (కోశాధ్యక్షులు)

,, వోలేటి వెంకటజగన్నాథా చార్యులుగారు, B. A. B. L. (సభ్యులు)

,, వానరాసి సోమరాజుగారు, L. I. M.

,, ఆ. చి. కృష్ణమాచార్యులుగారు,

,, బలభద్ర వెంకట్రాజుగారు.

,, ఆత్మూరి సూర్యారావుగారు,

శ్రీ వెలుమూరి వెంకట సత్యనారాయణగారు, రాజమండ్రి

శ్రీ తోట సూర్యంగారు, ,,

రాజమండ్రి శ్రీ తులసీ రామానుజకూట జీర్ణోద్ధరణకై విరాళములొసంగినవారి పేర్లు.

శ్రీ మానేపల్లి వీరభద్రంగారు, రు. (గచ్చునకై) 55 0 0

,, తోట సూర్యంగారు, 28 0 0

,, గ్రంధి లక్ష్మీనారాయణగారు, 116 0 0

,, మరంగంటి రంగనాయకమ్మగారు, 50 0 0

,, న. చ. పేరిందేవి తాయారమ్మ గారు, (పెరుమాళ్ళ గదిని) 100 0 0

,, ముడుంబై మహాలక్ష్మీనరసింహాచార్యులుగారు, 120 0 0

,, కొత్త సుబ్బారావుగారి సోదరి సీతాదేవిగారు (గచ్చునకై) 10 0 0

,, పెరుమాళ్ల సూర్యాకాంతంగారు, 5 0 0

,, కందాళం రంగమ్మగారు, (మాధవరం) 45 0 0

కొందరు భక్తులు- 7 0 0

,, ఉదుత్త కామేశ్వరమ్మగారు, (కోళాయినిమిత్తం) 167 0 0

,, ఒక మార్వాడీ సోదరులు, 25 0 0

లైట్లనిమిత్తం విరాళము లొసంగినవారి పేర్లు.

శ్రీ కుసుమంచి రామకోటయ్య గారు.

,, రామిసీడి రాయలమ్మగారు, 25 0 0

,, పట్టా నారాయణమ్మగారు, 25 0 0

,, ఉదుత్త కామేశ్వరమ్మగారు, 25 0 0

,, చోడిశెట్టి వీరాజుగారు, 25 0 0

,, మండపల్లి పైడెమ్మగారు, 25 0 0

,, గ్రంధి సోమరాజుగారు, 25 0 0

,, గ్రంధి సుబ్రహ్మణ్యంగారు, 25 0 0

,, మానేపల్లి వీరభద్రరావుగారు, 25 0 0

,, కడించర్ల వెంకట్రాజుగారిభార్య బుచ్చిరాజుగారు, 35 0 0

,, అనంతపల్లి చూడమ్మగారు, 12 8 0

,, మట్టుపల్లి తాయారమ్మగారు, 12 0 0

,, బలభద్రం సుబ్బమ్మగారు, 25 0 0

,, చామర్తి పాపారత్నంగారు, 12 8 0

,, కందాళం వెంకటకృష్ణమాచార్యులుగారు, (మాధవరం) 25 0 0

,, కాకి లచ్చమ్మగారు, 50 0 0

,, జూపూడి వెంకటేశ్వరమ్మగారు, 25 0 0

శ్రీ హయగ్రీవాయనమః

# చిరస్మరణీయులు - రామదాసు

## శ్రీమాన్, కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారి

# రేడియో ప్రసంగము

( ప్రాథమిక పాఠశాలా విద్యార్థి కార్యక్రమములో - 9-11-56 వ తేది
ఆల్ ఇండియా రేడియో విజయవాడ కేంద్రమునుండి )

మనకు చిరస్మరణీయులు కొందఱున్నారు. వారు ఎప్పుడూ మనకుమరుపురారు. వారుచేసిన సేవ ప్రపంచములో శాశ్వతంగానిలిచిపోయింది. ఆసేవ చూసినప్పుడల్లా వారు మనకు స్మరణకు వస్తూనే ఉంటారు. దేశానికి సేవచేసిన తిలక్, గాంధి, పటేల్, మొదలైన నాయకులను మనము మరచిపోగలమా? కాంగ్రెసు జెండా కదులుతున్నంతవరకూ వారు జ్ఞప్తికి వస్తూనే ఉంటారు. దేశానికి సేవజేసినట్లుగానే దేవునికి కూడా సేవజేసినవారు కొందఱున్నారు. వీరు చేసిన సేవకూడా ప్రపంచంలో చిరస్మరణీయంగా, చిరస్థాయిగా, నిలిచిపోయింది. మానవులకు సేవచేసినా, మాధవునకు సేవ చేసినా వారందరు మనకు మరవరాని మహాత్ములే. మానవులకు సేవచేస్తే మంత్రులౌవుతారు, దైవానికి సేవచేస్తే దాసులౌవుతారు.

అట్లే మన రామదాసు చరిత్రకూడా చిరస్మరణీయమైంది.

రామదాసంటే, ఎవరో, పలకపట్టి బడికిపోయే ప్రతి బాలవిద్యార్థికి తెలుసుననుకొంటాను. ప్రతిదినము బడిలో దాశరథీ శతకం తప్పకుండా చదివిస్తుంటారు గనుక, ఆ అదృష్టానికి నోచుకొనని పిల్లలెవరైనా యుంటే వాళ్ళ పెద్దవాళ్ళు హరికథలకు వెళ్ళినా, భద్రాచలయాత్ర వెళ్ళినా, ఈ రామదాసు చరిత్ర ఇంట్లో చెప్పుకొన్నప్పుడైనా వినియుంటారు. అందాక రామదాసంటే ఎవరో, ఆయనను ఎందుకు స్మరించాలో వినండి చెపుతాను.

అసలు రామదాసంటే ఎవరు? రామునకు దాసుడు. రామునకు దాసులు ఎందఱు లేరు? ఎందఱున్నా రామదాసంటే గోపన్నయనే ఒక మహాభక్తుడు మనకు గుర్తునకు వస్తాడు. ఎవరా గోపన్నంటే?

అది క్రీ. శ. 1725 అనగా ఇప్పటికి 231 సంవత్సరాలనాటిమాట.

నైజాం ఖమ్మంమెట్టు జిల్లాలో నేలకొండపల్లె అనే గ్రామముంది. అ గ్రామంలో కంచర్ల లింగమంత్రి అనే నియోగిబ్రాహ్మణుడున్నాడు. ఆయనిది ప్రథమశాఖ. ఆత్రేయస గోత్రం. ఆయనకు కామాంబ అనే భార్య ఉంది. ఆ దంపతులకు పూర్వపుణ్యవశాత్ ఒక మొగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడికి 'గోపన్న' అనే పేరుపెట్టారు. ఆ గోపన్నకు విద్యాబుద్ధులు చెప్పించి, క్రమంగా పెరిగి పెద్దవాడైన తరువాత కమలమ్మ అనే పిల్లనుతెచ్చి పెండ్లి చేశారు. కొన్నాళ్ళకు 'గోపన్నకు' కుమారుడు కూడా కలిగాడు. ఇంతవరకు గోపన్నలో చెప్పుకోతగిన గొప్ప గుణమంటూ ఏమీలేదు.

ఇట్లుండగా ఉన్నట్లుండి, గోపన్నగారిలో గొప్ప మార్పువచ్చింది. అతనిలో ఏదో ఆధ్యాత్మికశక్తి ఆవేశించింది. అతను అనుకోకుండానే సత్సాంగత్యములభించింది. ఒకనాడు గోపన్నగారికి రఘునాథ భట్టరాచార్యులనే గురుస్వాములు కనిపించారు. వెంటనే వారి శ్రీపాదములాశ్రయించి నాజన్మ తరించటానికి ఏదైనా మంత్రముపదేశించమని ప్రార్థించాడు గోపన్నగారి కోరిక నెరవేరింది. భట్టరువారు పరమ కృపతో గోపన్నకు తిరుమంత్రముపదేశించారు. అదే మంత్రరాజమంటే. గోపన్నగారికి ముఖంమీద ఊర్ధ్వపుండ్రాలు (అంటే నామాలు) పెట్టించారు. ఇకనుండి "రామదాసు"వన్నారు.

ఇక్కడ ఒక చిన్న రహస్యము చెప్పుతున్నాను వినండి. శ్రీవైష్ణవస్వాములు శిష్యులకు తిరుమంత్రం ఉపదేశించేటప్పుడు అయిదు సంస్కారాలు చేస్తారు. 1. భుజాలమీద ముద్రలు వేస్తారు. 2. ముఖంమీద నామాలు పెట్టిస్తారు. 3. తిరుమంత్రం చెవులో చెప్తారు. 4. దాసుడని పేరు పెట్టుతారు 5. ప్రతిరోజు దేవుణ్ని పూజించి తీర్థం ప్రసాదం తీసుకోమంటారు. అట్లాగా భట్టరుగారు కూడా గోపన్నగారికి ముఖంమీద నామాలు పెట్టించి చెవులో మంత్రరాజం ఉపదేశించి, దాసుడని పేరు పెట్టి రాముని పూజించుకోమన్నారు.

కొందరు గోపన్నకు కబీరు తారకమంత్రం ఉపదేశించాడని అంటారు. కాని ఇది నమ్మదగిన మాటకాదు. దీనికి ఆధారం ఏమీ లేదు. అసలు గోపన్న కబీరు సమకాలికులే కారని చరిత్ర సిద్ధాంతము. గోపన్న తనకు మంత్రప్రదానముచేసిన గురువులు రఘునాథ భట్టరాచార్యులనియే గట్టిగా ఒకసారికే మరియొకసారి దాశరథి శతకంలో చెప్పుకొన్నాడు. నండి.

"ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుడనై రఘునాథ భట్టరాచార్యుల కంజలెత్తి" - అని ఒకసారి.

"పట్టితి భట్టరార్యగురుపాదము లిమ్ముగ నూర్ధ్వపుండ్రముల్ పెట్టితి - మంత్రరాజ మొడిఁగట్టితి"-నని మరియొకసారి, విషయమిట్లుండగా కబీరు గోపన్న గురువనటం కూడని మాటేగదా?

దాసుడని చెప్పుకోవటం నీచంకాదా? అని కొందఱనవచ్చును అసలు దాసోహ మనటంలోనే తత్త్వముందని గోపన్న గుర్తించాడు. హనుమంతుడంతవాణ్ణి నీ వెవరయ్యా అని అడిగితే "దాసోహం కోసలేంద్రస్య"- నేను రామునకు దాసుడనన్నాడు. లక్ష్మణుని జూచి నీవు రామున కేమగుతావయ్యా యంటే

"సుహృద్దాస్యముపాగతః" రామునకు దాస్యం చేస్తున్నా నన్నాడు.

'దాస' శబ్దమంటే గోపన్నకు ఎంత ప్రాణమో, తనదాశరథీశతకంలో ఈ దాసశబ్దం ఎన్నిసార్లు వాడినాడో చూడండి-

(1) నీ దాసుడనయ్య (49-ప) (2) నీ దాసులలోన నేనొకడ (58-ప) (3) బంటుకు బంటునంటి (58-ప) (4) నీకుబంటునై (60-ప) (5) నీ దాసుల భాగ్యమెట్టిదియొ (64-ప) (6) నీ దాసునిగాగ నేలుకొను (67-ప) (7) కల్గకుండునే దాసులకీప్సితార్థములు (89-పద్యము) చిట్టచివర దాశరథి శతకాన్ని ముగిస్తూ "జగద్వల్లభ! నీకు దాసుడనని" చెప్పి మరీ ముగించినాడు.

ఈవిధంగా గోపన్న 'దాసు' డనని చెప్పుకుంటూ, దాస్యచిహ్నాలు ధరించి తనకు ప్రభువగు రామప్రభావాన్ని తరతరాలవారు విని తరించేటట్లుగా "రామమూర్తికిన్ రెండవసాటి దైవమిక లేడనుచున్ గడకట్టి భేరికా దాండద

రాండ రాండనినదంబు లజాండమునిండ, మత్త వేదండము నెక్కి" దండోరా వేశాడు. "రాముడు ఘోర పాతక విరాముడని" చాటాడు. "మ్రొక్కిన నీకె మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవె యీయవలెన్ దక్కిన మాటలేటికని" తత్వాన్ని తేల్చాడు. "రామ నామ మధురామృతపాన మారుటకంటే సౌఖ్యమేమున్నదని ప్రశ్నించాడు "రామ కథామృతము" జుఱ్ఱు జుఱ్ఱుగా జూఱాడు. నీ కరుణామృతసారం నాపై ప్రోక్షించమని అడిగాడు. బోయదాని ఎంగిలితిన్నావు. ఉడుత నాదరించావు. స్వామీ నీ సేవలో సత్కుల జన్మాలు ఏం లెఖలేయని చప్పరించాడు.

తరువాత కొన్నాళ్ళకు గోపన్న ప్రారబ్ధ కర్మం అనుభవించాల్సి వచ్చింది. "గోపన్న" పూర్వజన్మలో పుణ్యం చేసినట్లుగానే పాపం కూడా ఒకటి చేసాడు, ఆపాపం ఈజన్మలో ఇప్పుడు అనుభవించాలసి వచ్చింది పుణ్యం చేస్తేపాపముపోతుంది అంటారే అదేపొరబాటు పుణ్యం పుణ్యమే. పాపము పాపమే. దేనిదారి దానిదే, దేని ఫలితం దానిదే! ప్రారబ్ధమనే పాపం ఎంత మహాత్ములైనాసరే అనుభవించి తీరాలిసిందే.

ఉన్నట్లుండి గోపన్న గారికి ఉద్యోగం చేయాలని కోరిక కలిగింది తన మేనమామలు "అక్కన్న మాదన్నలు" గోల్కొండ నవాబు చెంత మంత్రులుగా నున్నట్లు తెలిసికొని అక్కడకు వెళ్ళాడు. మేనమామలు, మేనల్లుని పట్టె నామాలు, మెళ్ళోతులసిపేర్లు, చంకలో రామాయణం, బిళ్ళగోచి, నెత్తిన పిలక ఇవన్నిచూచి నీవు గోపన్నవేనా యని అడిగారు "రామదాసు" నన్నాడు. పరవాలేదు పరువ్రగానే బ్రతుకుతాడని మేనమామలు తానీషాతో చెప్పి తాశీలుదారుద్యోగ మిప్పించారు. తాశీలు దారుద్యోగమంటే త్రాచుపాముతో చెరలాట. అంటే డబ్బుతో పని.

ప్రపంచంలో మనిషిని చెడగొట్టేవి రెండు, అర్థము ఆడది. ఈరెండింటిని జయించిన వాడే అదృష్టవంతుడు. ఈ అర్థంతో రామదాసు కీవిషమ పరీక్షరానే వచ్చింది తాశీల్దారుద్యోగంలో రామదాసు భద్రాచల ప్రాంతానికి వెళ్ళాడు. బకాయి పడిన పన్నులన్నీ బాకీలేకుండా పైసలతో వసూలుచేసి లక్షలు నిలవ చేసాడు.

ఒకనాడెవరో భద్రగిరి గుట్టమీద స్వామి వెలిసాడు అని చెప్పగా పోయిచూచాడు. ఆ స్వామి ఎవ్వరైనది రామదాసు పోల్చుకోలేక సంశయించాడు. కొందరు రాముడన్నారు. రాముడైతే రెండు చేతులే ఉండాలిగాని నాల్గుచేతులు ఎందుకుంటాయి అన్నాడు. పోనీ విష్ణువేమో అన్నారు కొందరు. విష్ణువైతే కుడిచేతిలో చక్రము ఎడమచేతిలో ఎందుకుంటుందన్నాడు. చివరకు ఇదొక అవతారం శ్రీ విష్ణువే శ్రీరాముడుగా వెలిసాడని సిద్ధాంతము చేసారు అప్పుడు చెప్పినవే ఈపద్యాలు:-

"శ్రీరమ సీతగాగ నిజసేవక బృందము
వీరవైష్ణవా
చార జనంబుగాగ, విరజానది గౌతమిగా,
వికుంఠము
న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాగ
వసించుచేత నోద్ధారకుడైన విష్ణువు"

అన్నాడు మళ్ళీ వెంటనే

"కంటినదీతటంబు పొడగంటిని భద్రనగాధి
వాసమున్
గంటినిలాతనూజ గురుకార్ముకమార్గణ
శంఖ చక్రముల్
గంటిని మిమ్ము లక్ష్మణుని గంటి కృతార్థు
నైతి" నన్నాడు. ఇక్కడొక చిన్నమాట.

భద్రాచలములో రామునకు నాల్గుచేతు లున్నాయి. అంతేగాకుండా కుడిచేతిలో శంఖము ఎడమచేతిలో చక్రమున్నది. ఇదే భగద్విలాసమంటే. శ్రీరామునకు సేవచేయవలెనని చిత్తమువ్విళ్ళూరింది. ఎండలో నున్న తన స్వామిని నీడకు రమ్మన్నాడు. రాజాను మతి లేకుండానే రాజద్రవ్యాన్ని రామదాసు లక్షలు ఖర్చుపెట్టి గుడులు. గోపురాలు కట్టిచాడు. వెంటనే రాజద్రవ్యాపహారి యని రామదాసును తానీషా నరకంలాంటి జైలులో బంధించి నానాయాతనలు పెట్టాడు. భగవంతు డెంత దయగలవాడైనా పాపానికి తగిన శిక్ష వేయించక మానడు. రామదాసు రాజాజ్ఞ లేక రాజద్రవ్యాన్ని లక్షలు ఖర్చుపెట్టాడు. ఇది తప్పు. ఈ తప్పునకు శిక్ష వేయించకపోయినచో భగవద్భక్తులు ఏమిచేసినా భగవంతుడు ప్రసన్నుడౌతాడను ప్రవాదు లోకంలో ప్రాకిపోతుంది.

శిక్ష తప్పించమని శ్రీ రా ము ణ్ణి ఎంతో ప్రార్థించాడు. రామదాసు ఏడ్చాడు. ఏడ్చినా లాభం లేకపోయింది

ఇంతలో జగన్మాత జానకి జ్ఞప్తికి వచ్చింది. అమ్మా అని ఒక్క కేక వేసాడు అంతే. తల్లి చెంత తనయులకు తప్పులులేవు. తప్పులకు తగిన దండనలు లేవు. కుమారుని గోడుచూస్తే తల్లి హృదయం కు మి లి పోతుంది. సీతలేని రాముణ్ణిసేవించరాదు. ఈఅర్థాన్నే భట్టరువారు మంత్రరాజంలో రామదాసు కుపదేశించాడు. కాకాసురుని కాపాడిన కరుణామయి - హనుమంతుని తోకకున్న అగ్నిని చల్లార్చిన అమృత హృదయ - నాబాధ తీర్చదా యని నమ్ముకున్నాడు.

రామదాసు కేకతో రాముని శుద్ధాంతంలో ఏమి రాద్ధాంతం జరిగిందో తెలియదుకాని, భళ్ళున తెల్లవారేటప్పటికి బాకీతీరింది. బైటికి రమ్మని తానీషా తాఖీదు పంపాడు. రాహువు కోరలనుండి తప్పించుకొన్న రాకాచంద్రుడి వలె - ప్రారబ్ధకర్మానుభవంనుండి రామదాసు బైటపడ్డాడు. ఈవిధంగా కంచర్ల గోపన్న రామదాసని ప్రఖ్యాతి వహించి భద్రాద్రిలో చిరస్థాయిగా గుడికట్టించి త ర త రా లవారు తరించేటట్లుగా, దాశరథి శతకాన్ని రచించి, జరామరణాలు లేని కీర్తి శరీరంతో - ఇప్పటికి యా వ దాం ధ్రు ల కు చిరస్మరణీయుడై యున్నాడు



# ఆంధ్ర దేశములో శ్రీ జీయర్ స్వామివారి పాదయాత్ర

(గత సంచిక తరువాయి)

ఆంధ్రదేశములో, బరం పురమునుండి శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు కాలినడకతో ప్రతిగ్రామమునకు, ప్రతి పల్లెకు ప్రయాణము చేయుచు మత ప్రచారము గావించుచున్నారు.

వీరివెంట సంఘ కవిగారైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు అన్వయించి యున్నారు.

మన సంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీమాన్ ఉ. వే. తె. కం. గోపాలాచార్య స్వామివారు అత్యంత ప్రధానకరములైన కొన్ని సాంఘిక కార్యముల నిర్వహణార్థమై మదరాసు, హైదరాబాద్ ప్రాంతములకు వేంచేసి యున్నారు

1-4-57 "పలాసా"

ఈనాడు ఉగాదిపండుగ, పండుగనాడు పలాసానుండి బయలుదేరుట భావ్యముకాదని పలాసా భక్తులు కోరుటచే శ్రీ స్వామివారు ఈనాడు పలాసాలోనే వేంచేసి యుండవలసి వచ్చినది.

యథారీతిగా తెల్లవారుఝామున గం. 4-30 లకు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణతో తిరువీథిగోష్ఠి జరిగినది తిరువీథిగోష్ఠి పారాయణలో పలాసా గ్రామభక్తులు పలువురు పాల్గొనిరి. తరువాత స్నానసంధ్యాది నిర్వహణ తదుపరి తీర్థప్రసాద గోష్ఠి పిమ్మట గీతాసమిష్ఠి పారాయణ, ఆ తరువాత శ్రీ భావ్యకాలక్షేపము ఏవంరీతిగా ప్రాభాతిక కార్యక్రమము సంతృప్తిగా జరిగెను.

సాయంకాలము బహిరంగసభ జరిగెను. శ్రీ స్వామివారి అధ్యక్షతతో శ్రీరామ కృష్ణ సేవాసంఘమువారు తమ వార్షికోత్సవకార్యక్రమమును నిర్వహించిరి. తరువాత శ్రీ స్వామివారు శ్రీ రామకృష్ణ సేవా సంఘమువారి కార్య విధానమును ప్రశంసించుచూ ఆదర్శకపూర్వమైన ఆచరణ మీలో నున్నదని సంతసించిరి. అన్నిటికన్న ఈ సేవాసంఘమువారు నిర్వహించుచున్న అనాథప్రేత సంస్కారము, అనాథులకు వస్త్రదానము బీదలకు అన్న సంతర్పణ ఇవి బాగున్నవని ప్రశంసించిరి, ఇంత మాత్రమే గాక ఈ అనాథులకు ఆధ్యాత్మిక శక్తిని కలుగునట్లు ప్రోత్సహించవలసినదని సలహా యిచ్చిరి. ఇట్టి పవిత్రమైన సేవాసంఘమును స్థాపించి నడిపించుచున్న శ్రీ ముత్తింటి గురునాథ వెంకట జగన్నాథ సత్యనారాయణ మూర్తిగారు నిజముగా ఆదర్శపురుషులు. వారు హైస్కూలులో ఉపాధ్యాయులుగా నుండి కూడా ఇట్టి సంఘసేవా దీక్షలో అన్వయించుట విశిష్టమైన విషయమని వ్రాయక తప్పదు. తరువాత శ్రీ కవిగారి కావ్యగోష్ఠి జరిగెను. ఆ పిదప శ్రీ స్వామివారు, మానవసేవ, మాధవసేవ యెట్లయ్యెనో ఆవాక్యమున కర్థమేమో సేవయన నేమో విపులాతి విపులముగా విమర్శించి. తత్వమును ద్రాక్షపండువలె చేసి

చేతి కందించిరి. మానవసేవయే మాధవసేవ యని కేవల శుష్కవాక్య ప్రయోగము గాక ఈ సూక్తిని సార్థకము చేయుచున్న పలాసా భక్తులను బహుధా శ్రీ స్వామివారు ప్రశంసించిరి.

3-4-57 "బ్రాహ్మణతర్ల"

ఈనాడు వేకువఝామున లేచి శ్రీ స్వామివారు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణమును అనుసంధానము చేయుచు బయలుదేరుచుండగా పలాసా గ్రామభక్తులు పలువురు శ్రీస్వామివారి వెంట దాదాపు రెండుమైళ్ళవరకు విచ్చేసిరి. ఇంతలో పనిమీదను పలాసాకు వచ్చుచున్న బ్రాహ్మణతర్ల గ్రామవాస్తవ్యులగు శ్రీ వైశ్య రాజు రామస్వామి రాజుగారు త్రోవలో శ్రీ స్వామివారిని సేవించి వారి గ్రామమునకు వేంచేయవలసినదిగా ప్రార్థించిరి. సరేయని బయలుదేరుచుండగా శ్రీ రామస్వామి రాజుగారు ముందుగా వెళ్ళి గ్రామంలోనున్న భజనసెట్టుతోను, ప్రముఖులతోను, ఎదురుగా వచ్చి అఖండ హరినామ భజనతో అత్యానందముగా స్వాగత మిచ్చి వలయు ఏర్పాట్లు గావించిరి. మాసమునుండి హరికథా కాలక్షేపము జరిపి తత్సాంతికి అన్నదానము ఆనాడే జరుపుచుండిరి. బజారులో పెద్దపందిరి, పచ్చటి తోరణములతో మాకు స్వాగత మిచ్చిరి. మాకు స్వాగత మిచ్చినవారిలో నొక విద్వద్బ్రాహ్మణోత్తము లుండిరి. వీరు మంచి సదాచార సంపన్నులు. మంచి పౌరాణికులు, శాస్త్రజ్ఞులు వీరిసామనస్యమునకు మేమెంతయో సంతసించితిమి ఆనాటిరాత్రి పెద్ద సభజరిగెను. బ్రాహ్మణతర్లలో నున్న ఆబాల గోపాలమా సభకు విచ్చేసెను ముందు శ్రీ కవిగారు, "మన మొన్నారము" మన కర్తవ్య మేమి! అను విషయమును గూర్చి ఉపన్యసించిరి. తరువాత శ్రీ స్వామివారు గంటన్నరకాలము అమృతమువంటి ఆధ్యాత్మికతత్వమును అందరకు అర్థమగు భాషలో ఉపన్యసించిరి. ఈ సభకు పలాసానుండి రాత్రియని సందేహింపక 4 మైళ్ళు నడచి బ్రాహ్మణతర్లకు బారువ మేష్టగారు పలాసా గ్రామపురోహితులు మరి కొందరు వైశ్యభక్తులు విచ్చేసిరి. సభలో శ్రీ స్వామివారిని రేపుకూడ వేంచేసి యుండుడని పలువురు ప్రార్థించుటనే మరునాడుకూడ నుండవలసి వచ్చినది. ఈ గ్రామములో శ్రీ పైలా శివాజియను ఒక యువకుడుండెను. ఇతడు మంచి ఉత్సాహముకల వ్యక్తి. కొన్ని నాళ్ళు రాజకీయరంగములో పర్యటించి ఇప్పుడు అనాథులకు సేవ చేయుచుండెను.

4-3-57 వ తేదీ కూడ బ్రాహ్మణతర్లలోనే యుంటిమి.

ఈనాడు ఈ గ్రామములో శ్రీ స్వామివారు మహిళా మండలిని ఏర్పాటు చేసి శుక్రవార పూజా విధానమును చేయించి చూపిరి. ఈ పూజ ప్రతి శుక్రవారము జరిగేటట్లుగా తగిన ఏర్పాటు అప్పుడే స్త్రీలచే శ్రీ స్వామివారు చేయించిరి. రాత్రి మరల పెద్ద బహిరంగసభ జరిగెను. ఈ సభకు పరిసర ప్రాంతములనుండి పలువురు భక్తులు విచ్చేసిరి. శ్రీ కవిగారి కావ్యగానానంతరము శ్రీ స్వామివారి యుపన్యాసము జరిగెను. ఉపన్యాస మధ్యలో శ్రీవారు విజయవాడ కృష్ణాపుష్కర సందర్భములో మేము జరిపింపబోవు బ్రహ్మయజ్ఞములో ఒకరోజు తదీయరాధన, మీరున్ను పలాసా గ్రామవాసులున్ను జరుపవలసినదగ సూచింపగా వెంటనే బ్రాహ్మణతర్లవారు పలాసావారున్ను ఆమోదము చూపిరి. పుష్కరములో 1 రోజు తదీయారాధన జరుపుట యనగా రోజుకు 10000 మందికి అన్నదానము 1000

మంది శిష్యులకు క్షీరదానమున్ను జరుపవలెను. వీరి సంకల్పమునకు శ్రీయఃపతి చేదోడు వాదోడుగా నుండగలడని ఆశించుచున్నాము. అప్పుడే సభలో కొన్ని విరాళాలు కొన్ని బస్తాల బియ్యం చందాపట్టీ పడినది.

4-4-57 సుబ్బమ్మపేట.

ఈనాడుదయము బ్రాహ్మణ తర్లనుండి భగవద్గుణానుసంధానముతో బయలుదేరి దాదాపు 10 మైళ్ళు నడచి మధ్యాహ్నం గం, 11 లకు సుబ్బమ్మపేట అను గ్రామమునకు చేరుకొంటిమి. ఇచట శ్రీమాన్ కోయిల్ కందాడై రంగాచార్యులను స్వామివారు ధర్మకర్తలు శ్రీ స్వామివారిని అత్యంత సౌహార్ద పూర్వకముగా సత్కారముజరిపిరి. ఇచటి ప్రశాంత వాతావరణ దృశ్యము మాకెంతయో హాయి యనిపించినది. చక్కని కోవెల, ఆ ప్రక్క చల్లని కోనేరు. కోనేరుచుట్టూ మనోహరమైన తోట, ఇదియంతయు ఒక ఋష్యాశ్రమము వలెనున్నది. శ్రీ స్వామివారు ఈనాటి జపానుష్ఠానమంతయు ఫలభార శోభితమగు పనసచెట్టు క్రింద వేంచేసి పూర్తిగావించిరి. సాయంత్రం నందిగాం గ్రామమునుండి కొందరు పెద్దలు వేంచేసి శ్రీ స్వామివారిని సేవించిరి రాత్రి సన్నిధిలో విశేష భోగములతో తీర్థప్రసాద గోష్ఠి జరిగినది ఒకగంటన్నరకాలము. ఉపన్యాస కార్యక్రమము జరిగినది. రాత్రి యుపన్యాసము జరుగుచుండగా కోటిపల్లి అగ్రహారమునుండి కొందరు స్వాములు విచ్చేసి కోటిపల్లి వేంచేయవలసినదిగా శ్రీస్వామివారిని కోరిరి.

5-4-57 కోటిపల్లి అగ్రహారము

ఈనాడుదయమే బయలుదేరి శ్రీసహస్రనామ పారాయణతో కోటిపల్లికి బయలు దేరితిమి మాతో సుబ్బమ్మపేట వాస్తవ్యులగు శ్రీమాన్ రంగాచార్యస్వామివారు తమ అనారోగ్యమును కూడ లక్ష్యపెట్టక కాలినడకతో కోటిపల్లి దాక నడచివచ్చిరి. కోటిపల్లిలో శ్రీమత్తిరుమల పెద్దింటి అనంతపద్మనాభస్వామిగారు శ్రీస్వామివారికి అఖండ సత్కారము గావించిరి. శ్రీ స్వామివారు యువకులయ్యును పరమ విలక్షణమైన జ్ఞానానుష్ఠానరేఖతో విరాజిల్లుచుండిరి. రాత్రి సభాగోష్ఠి జరిగెను. విలక్షణమైన తదీయారాధన జరిపించిరి బదరీ పూజకు బెజవాడ బ్రహ్మయజ్ఞమునకు యధాశక్తి సహాయము చేయుదునని వాగ్దానము గావించిరి

6-4-57 ఉక్కలి.

ఈనాడు వేకువజామునలేచి కోటిపల్లినుండి శ్రీవిష్ణు సహస్రనామ పారాయణానుసంధానముతో 7 మైళ్లు నడచి పగలు గం 9 లకు ఉక్కలికి చేరుకొంటిమి. శ్రీ జియ్యర్ స్వామివారి రాకకై వారము రోజులనుండి బరంపురమునుండి విచ్చేసిన శ్రీ లక్ష్మీ నృసింహస్వామివారి సన్నిధి వంశపరంపరా ధర్మకర్తలగు శ్రీ బచ్చు నరసింహస్వామిగారు శ్రీస్వామివారి ఆగమవార్తను విని ఎదురుగా విచ్చేసి సన్నిధి లాంఛనములలో స్వాగత సత్కారము గావించిరి.

ఈగ్రామములో 6, 7, 8,9,10,11, ఈ తేదీలలో ఆరు రోజులుంటిమి. ప్రతిదినము యధాప్రకారముగా తెల్లవారుజామున గం 4-30 లకు శ్రీ విష్ణుసహస్రనామ పారాయణతో తిరువీధి గోష్ఠి జరిపితిమి. వచ్చిన రోజు ఉక్కలి హైస్కూలులో సభ ఏర్పాటు గావింపబడెను. ఆసభలో శ్రీకవిగారు భక్తి యోగమునుగురించి పద్యరూపముగా ఉపన్యసించిరి. పిదప శ్రీ వారు వేదాంతమెవ్వరికి ? అను విషయమును గురించి గంటకాలముపన్యసించి వేదాంతము ముఖ్యముగా కావలసినది గృహస్థులకే నని విశదీకరించిరి.

ఆమరునాటినుండి సాయంకాలసభలు శ్రీ నృసింహస్వామివారి ఆలయంముందు జరిగెను. ఇంతలో శ్రీరామనవమి ఉత్సవములు వచ్చుటచే శ్రీజియ్యర్ స్వామివారున్ను, శ్రీ కవిగారున్ను శ్రీరామాయణమును గురించియే ఉపన్యసించిరి.

ఒకనాడిచ్చట దేవాలయములో శ్రీమహిళా మండలిని సమావేశపరచి శ్రీస్వామివారు శుక్రవార పూజోత్సవ కార్యక్రమమును ఏర్పాటు చేసిరి. ఇచ్చటున్న ఆరురోజులు శ్రీమాన్ బచ్చు నరసింహస్వామిగారు మాకు మిక్కిలి హార్ద పూర్వకమైన సత్కారమును చేసిరి. ఒకనాటి సభలో శ్రీస్వామివారికి శ్రీమాన్ సాతులూరి వెంకట నరసింహాచార్యులుగారు అభివందన పద్యములు సమర్పించిరి. మరియు ఆలయ ట్రస్టీలలో ఒకరగు శ్రీరావి నరసింహామూర్తిగారు బదరీపూజలను ప్రోత్సహించి ఆసత్కార్యములో మాకు విశేషముగా సాయపడిరి. ఆలయ మేనేజింగ్ ట్రస్టీగారగు శ్రీ టంకాల జగన్నాథమూర్తి శ్రేష్ఠిగారు శ్రీస్వామివారి కెంతయో ఆదరపూర్వక సత్కారమొనర్చిరి. బ్రహ్మయజ్ఞమునకు బదరీ పూజకు యథాశక్తి తోడ్పడిరి. మరియు హైస్కూలులో తెలుగు పండితులుగాయున్న శ్రీమాన్ కందాడై వెంకటాచార్యులుగారు ఈ సభానిర్వహణములో మిక్కిలి శ్రద్ధాభక్తులు చూపించిరి. శ్రీవారిచ్చట వేంచేసి యుండగా బరంపురమునుండి శ్రీపార్థసారధిగారు శ్రీస్వామి సేవార్థమైవచ్చి సేవించి వెళ్లిరి.

## 12–4–57 వ తేది కొటబొమ్మాళి

ఈనాడు ద్వాదశి పారయణ పూర్తి కావించుకొని సహస్రనామాను సంధానముతో శ్రీవారు బయలుదేరిరి. వెంట రెండు మైళ్ళవరకు శ్రీబచ్చు నరసింహస్వామిగారు శ్రీ P. పార్థసారధిగారు తెలుగు పండితులు శ్రీ కందాడై వెంకటాచార్యులుగారు మరికొందరు భక్తులు శ్రీస్వామివారితో విచ్చేసి వెళ్లలేక వెళ్లలేక తిరిగి వెళ్లిరి. మేము త్రోవలో 10 గంటలకు ఒక మామిడితోట లో ఎం డ ధా టి కి విశ్రమించితిమి. ఆనాటి ఎండ మదనదహనవేళా సముద్భూత ధృడానీపతితారీయక విలోచనాగ్నిజ్వాలవలె సుదస్సహమై పోయెను. అట్లు పగలు 3. గంటలవరకు ఆ చెట్లక్రింద యుండి 3 గంటలకు బయలుదేరి సాయంత్రమునకు కొటబొమ్మాళి గ్రామమునకు చేరుకొంటిమి. అచ్చట బస ఊరిచివర ఒక మామిడితోటలో దొరికినది. ఆరాత్రి అచ్చట బసచేసి హైస్కూలులో శ్రీ స్వామివారుపన్యసించిరి. ఆరాత్రి ఆ మామిడితోటల్లో ఎలుగుబంట్లు విచ్చల విడిగా తిరుగును. ఎలుగుబంట్లు వచ్చును. జాగ్రత్తగా యుండుడని తోటమాలి హెచ్చరించి వాడు రాత్రి అచ్చటుండకయే వెళ్ళి పోయెను, మేమారాత్రి గ్లాసులైటు వెలిగించి, సుఖముగా నిర్భయముగా ఆ చెట్లక్రింద కాలక్షేపము చేసితిమి. ఉదయము స్నానమాడి తిరువారాధన చేసుకొని ఉదయం 6 గంటలకు మరల దారిపట్టితిమి. ఇచ్చటికి నరసన్నపేట 10 మైళ్ళు - మధ్య న. 10 గంటలకు ఒక తోటలో విశ్రాంతికి చేరుకొంటిమి. ఆ తోటలోనే ఎండ తగ్గినదాక యుండి మరల 3 గంటలకు బాటపట్టి సాయంకాలము 5 గం. లకు నరసన్నపేటకు చేరుకొంటిమి.

## 13-4-57 నరసన్నపేట

నరసన్నపేటలో ఇచ్చట ఆలయస్థానాచార్యులుగారు, అర్చకస్వాములు, హైస్కూలులో తెలుగుపండితులుగాయున్న స్వాములువారలందరు శ్రీస్వామివారిని వివిధ మంగళవాద్య పురస్సరముగా సన్నిధిలాంఛనములతో అఖండ స్వాగత సత్కారముల చేసిరి. కోవెలలో రాత్రి సభ

జరిగెను. శ్రీజియర్ స్వామివారున్ను శ్రీకవి గారున్ను ఉపన్యసించిరి.

ఇచ్చట నరసన్నపేటలో 14, 15, 16, తేదీలలో 3 రోజులుంటిమి. ఈ మూడు రోజులు దేవాలయములో సభలు, వేసవ జా మున తిరువీధి గోష్ఠివగైరా కార్యక్రమములు జరిగెను. బదరీ పూజలకు కొందరు అన్వయించిరి.

17-4-57 కళింగపట్నం.

ఈనాడుదయం నరసన్నపేటలో బయలుదేరి కళింగపట్నం చేరుకొంటిమి. ఇచ్చట గీతా మండలి స్థాపకులు, ఆయుర్వేదవైద్య విద్యా విశారదులు గీతా పరీక్షా నిర్వాహకులు, మంచి మతప్రచారకులు అగు శ్రీమాన్ మహేంద్రవాడ వెంకటరామ నరసింహాచార్యులుగారు శ్రీస్వామివారికి రెండుమైళ్ల దూరములో ఎదురుగా వచ్చి అత్యంత భక్తి శ్రద్ధలలో అఖండ స్వాగతమిచ్చి తమ గీతామందిరములో విడిదిని ఏర్పాటు చేసిరి. ఈగీతామందిరము శ్రీస్వామివారికి చాలా ప్రశాంతిగా సంతృప్తికరముగా యుండెను ఇచ్చట 17, 18, 19, తేదీలలో 3 రోజులుంటిమి. ఈ 3 దినములు బజారులో నున్న శ్రీరామ నవమి పందిరిలో బహిరంగ సభలుజరిగినవి శ్రీజియర్ స్వామివారు శ్రీకవిగారు వేదాంత విషయములను విశదముగా ప్రసంగించిరి.

కళింగపట్నంలో దృశ్యము హృదయంగముగా యున్నది. ఇచ్చట వంశధారానది దాదాపుమైలువెడల్పున ప్రవహించుచున్నను. సముద్రము మైలుదూరము మాత్రమే. ఇచ్చట వంశధారానదీ సముద్ర సంగమ స్థలమున్నది. ఒకనాడు ప్రభాతకాలములో ఈ సాగరసంగమ స్థలమున శ్రీజియర్ స్వామివారుతమ అనుచరులతో స్నానమాడిరి.

ఈ వంశధారానది పూర్వ వృత్తాంతము చాల విచిత్రముగానున్నది. ఈ కళింగపట్నము నకు 4 మైళ్ళలో గనికొండఅను పేరుగలపర్వతమున్నది. ఒకనాడది గొప్ప పట్టణమట. ఆ పట్టణపు పట్టమహిషి మహాప్రతివ్రత. ఏకాదశివ్రతమును సర్వదా నియమముగా ఆచరించెడిదట. ఒకనాడు రాణి ఏకాదశీవ్రతములో నుండగా రాజు ఆవిషయమెఱుంగక అంతఃపురమునకు తాను వచ్చుచున్నటుల కబురుచేసెనట. రాణి ఆ కబురునకు ఏమి సమాధాన మిచ్చుటకు కుదరక, మౌనముగా యుండిపోయెనట. మౌన మర్ధాంగీకారముగదా యని దాసి యీ విషయమును రాజున కెఱిగింపగా నతడు సంతసించి రాత్రి అంతఃపుర ప్రయాణోన్ముఖ్యుడయ్యెను రాణి తన ఏకాదశివ్రతము భగ్నము కాకుండ చూడమని శ్రీయఃపతిని మనసార ధ్యానించెను. ఆ ధ్యానము పంచభూతములలో నొక భూతమగు జలాధిష్ఠానదేవత యాలకించెను. ఇంత మాత్రమునకు శ్రీయఃపతి రావలెనా యని అప్పటి కప్పుడే వంశములోనుండి (వెదురు పొదలోనుండి) ఒక మహానదిగా ఆవిర్భవించి రాణివాసమునకు, రాజ ప్రాసాదమునకు, మధ్యగా నీరు ప్రవహింపసాగెను. ఆ ప్రవాహోద్వేగమును జూచి రాజు ఆశ్చర్యపడి ఆరాత్రి రాణి శుద్ధాంతమునకు చేరుకొనలేక పోయెను. రాణి సంతసించెను. మరునాడు యీ విషయము తెలుసుకొని రాణి భక్తి ప్రభావమును మెచ్చుకొని సంసారమందు విరక్తుడయ్యెనని యందురు. ఇప్పటికి ఏటికి యివతల గట్టు వనితా మండలమనియు అవతలది గని కొండ యనియు అందురు. ఇప్పటికిని మాఘ శుద్ధ ఏకాదశినాడు ఇచ్చట పెద్ద ఉత్సవము జరుగును. ఆనదియె వంశధారానదీ ఖ్యాతితో విరాజిల్లుచున్నది. ఈ వంశధారను మేము

కళింగపట్నంలో దర్శించి స్నానమాడితిమి ఈ నదియొడ్డుననే శ్రీ సీతాస్వామివారి సన్నిధి యున్నది. కనుచూపుమేరలో సముద్రము కనుపించును. ఈ కళింగపట్నమునుండి ఒక నాడు ప్రాతఃకాలమున వంశధారానది కావలి గట్టున నున్న డోలా అనే గ్రామమునకు బయలుదేరితిమి. వెంట గీతామండలి యువకులు అత్యంతోత్సాహముతో భజన సేయుచుండగా స్వాములు సహస్రనామానుసంధాను చేయుచుండగా ఆ డోలాగ్రామమునకు చేరితిమి. ఆ డోలాగ్రామ వాస్తవ్యులు శ్రీ స్వామి వారిని సత్కరించిరి. ఈ కళింగపట్టణ వాసులున్న డోలాగ్రామ వాసులున్ను కలసి ఒక రోజ తదీయారాధన బ్రహ్మయజ్ఞములో చేయుదుమని వాగ్దానము చేసిరి. ఈ కళింగపట్నములో కూడ మహిళామండలిచే శ్రీ స్వామివారు శుక్రవారపూజ గావింపజేసిరి.

20-4-57 కోర్ని గ్రామం

ఈనాడు కళింగపట్నంనుండి బయలుదేరి కోర్ని గ్రామం చేరుకొంటిమి ఈ కోర్ని గ్రామస్థులు అందరు ఎదురుగా వచ్చి శ్రీస్వామి వారికి భక్తిపూర్వకమైన స్వాగత మిచ్చిరి. రాత్రి సభ జరిగెను. శ్రీ జియర్ వారున్ను శ్రీ కవిగారున్ను ఉపన్యసించిరి.

21-4-57 శ్రీ కూర్మం

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాన్త ప్రవర్తకులైన శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యరువారు 21-4-57 తేదీ ఉదయం 10 గంటలకు శ్రీ కూర్మనాథుని దర్శించుటకై వేంచేయగా శ్రీయఃపతి దేవాలయోద్యోగుల కాజ్ఞాపించి శ్రీ శఠారిపరివేష్టముల్తో శ్రీమాలై వారు బసగా నేర్పాటు గావించుకొనిన సత్రమునకు వాద్యవిశేషములతోను స్వస్తివాచకులు అధ్యాపకులతోను తమ యుద్యోగులచే నంపిరి. వారు శ్రీ రామానుజ జియ్యర్ స్వామివారికి శ్రీ కూర్మనాథుని వారి యాజ్ఞానుసారముగా మర్యాదలను జరిపించి సన్నిధికి వేంచేపు చేసుకొని వెళ్ళిరి. శ్రీవారు మంగళవాద్యాది అధ్యాపకాది భాగవతబృందముతో సన్నిధికి వేంచేసి ప్రదక్షిణ పూర్వకముగా శ్రీ చతుర్భుజతాయార్ల సన్నిధిని దాస్యము సమర్పించి, శ్రీ దేవి వారి పురుషకారమును గైకొని శ్రీ కూర్మనాథుని సన్నిధికి వేంచేసిరి. అచ్చట అర్చకులు శ్రీ కూర్మనాథులకు తిరుత్తుళాయి పుష్పములతో నర్చన గావించి శ్రీ జియ్యరుస్వామి వారికి తీర్థము తోళ్మాలై శ్రీ శఠగోపము సమర్పించిరి. అచ్చటినుండి చతుర్భుజ తాయారు శ్రీ కూర్మనాథుని సన్నిధికి స్వామి వేంచేసియుండ నచ్చటర్చకులు తాయార్ల కష్టోత్తర నామపూజ గావించి శఠారికటాక్షించిరి. అటుపిమ్మట ప్రదక్షిణపూర్వకముగా దేవాలయమున కుత్తరభాగమున వేంచేసియున్న శ్రీ కూర్మనాథ ప్రకాశకులగు భగవద్రామానుజులవారిని శ్రీ స్వామివారు సేవించుకొని శ్రీ కూర్మనాథుని ప్రసాదమును గొని తమకై యేర్పాటు గావింపబడిన బసకు వేంచేసిరి. ఆనాడు శ్రీ స్వామి బసకు చేరుసరికి సుమారు 12 గంటలకు పైగా నైనది వీరిని సభకు పురజనులందరు సాగనంపిరి. ఆనాటి నుండి శ్రీ కూర్మ గ్రామనివాసులున్ను ఆచార్య పీఠాలంకృతులగు శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులుగారు వీరి యనుజులు శ్రీమాన్ కూర్మాచార్యులువారు శ్రీ స్వామివారికి భిక్షాదికములు తామే నిర్వర్తింతుమని శ్రీ స్వామి వారికి విన్నవించి కైంకర్యము గావించుచుండిరి. ఆనాటి సాయంకాలము 6 గం॥ లు లగాయతు శ్రీ స్వామివారు శ్రీ కూర్మనాథుని

సన్నిధి వేదా దక్షిణ ద్వారమువద్ద వేంచేసి
సుఖాసీనులై వారితోపాటు పాదయాత్రతో
వచ్చియున్న కవిశేఖరులగు గుడిమెళ్ళ
వంశజలధి సోములగు శ్రీమాన్ రామానుజా
చార్యులవారు తాము రచించిన కూర్మాండవి
యను గ్రంధరాజమును సభాసదులకు వినిపించి
సభికుల నానంద సుధాబ్ధి నోలలాడించిరి. తదు
పరి శ్రీ స్వామివారు చిరునగవులతో సభికుల
నానంద వీచికల నోలలాడించు సుధాసూక్తుల
తో నుపన్యాసము కటాక్షించిరి. రాత్రి 9 గం॥
లకు సభను ముగించిరి. మరచటి దినముదయ
ముననే అనగా 4½ గంటలకే గ్రామములోని
స్వాములతో శ్రీవారు నగరసంకీర్తనగా సహ
స్రనామములు పాడిరి. ఉదయము 8 గం॥
లగాయతు గీతాపారాయణ గోష్ఠి తదుపరి
శ్రీ భాష్యగోష్ఠి జరిగినది. ఈ విధముగనే ప్రతి
దినము జరిగించుచుందుమని శ్రీ స్వామి యాన
తీయ భాగవతబృంద మాయా సమయములను
వృధాబుచ్చక సాయంకాల పర్యంతము
వారిని విడనాడక సాయంకాలమున కవి గోష్ఠి
శ్రీవారి యుపన్యాసగోష్ఠి ననుభవించుచుండిరి.
ఇట్లుండ శ్రీ స్వామివారు శ్రీ కూర్మనాధుడు
పశ్చిమ ముఖముగా వేంచేసి శ్రీ విశిష్టాద్వైత
సిద్ధాంత మతస్థాపకుల వాక్యము నన్యధాగావింప
కుండుటచే నానాడు శ్రీ భగవద్రామానుజుల
వారు శ్రీ కూర్మనాధుని భక్తపరాధీనతను
తెలియజేయుటకై యొక ధ్వజమును పశ్చిమ
మున స్థాపించిరి. అది కాలక్రమేణ శిధిలమై
భగ్నమైనట్లుగా శ్రీ జీయరుస్వామి వారెరింగి
దానికి చింతాకుల స్వాంతులై యాభక్తపరా
ధీనధ్వజమును జీర్ణోద్ధారణ గావించ బద్ధకంక
ణులై ఏకాదశీ రోజున శ్రీ కూర్మగ్రామమున
భిక్షాటనగావించి యా యర్థముచే భగవంతుని
యాలయపు జీర్ణధ్వజోద్ధారణ గావింతుమని
గ్రామస్తులకెల్ల తెలియజేసి, యా ప్రకారమే
శ్రీ స్వామివారు భాగవత బృందముతో కూర్మ
నాధుని వేయినామముల స్తోత్రము గావించుచు
భిక్షాటన గావింప శ్రీ కూర్మనాధుని గ్రామ
స్థుల హృత్కమలముల వికసింపజేసి యీ భా
గ్యమును గ్రామస్థుల కందచేసిరి. ఆనాడు
శ్రీ స్వామివారి భిక్షాపాత్రమున సహస్రాధిక
రూప్యంబు లుల్లసిల్లినవి.

ఆ దివముననే శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాప
నాచార్యోభయవేదాన్త ప్రవర్తకులును విశి
ష్టాద్వైత సిద్ధాన్త స్థాపకులగు శ్రీ భగవద్రా
మానుజులవారి తిరునక్షత్రోత్సవ ప్రారంభ
మును శ్రీమాన్ శ్రీ భాష్యం రాఘవాచా
చార్యులవారి పుత్రరత్నములు శ్రీ రామానుజ
కూర్మనాధాచార్య స్వాములచే ప్రారంభము
చేయబడినది. ఆదినముదయమున శ్రీ కూర్మ
నాధుని యాలయోత్తర భాగమున వేంచేసి
యున్న భగవద్రామానుజుల వారికి యుత్సవు
లకు తిరుమంజనము రామానుజ సహస్రనామ
పూజ జరిపించబడి శ్రీ కూర్మనాధుని నిత్యమం
గళాశాసనాంతరము శ్రీ భగవద్రామానుజుల
వారి యర్చనామూర్తి కేశవాపరనామిక శ్రీ
గోవిన్దరాజస్వామివారిని దేవిమార్గతో సహా
నాస్థానమంటపమున భూషణంబు లలంకరించి
వేంచేపుచేసియుండ శ్రీ భగవద్రామానుజుల
వారికి ముత్యాలపాలకీలో వేంచేపుచేసి భాగవ
తోత్తములందరు ధాటీ పంచక పారాయణ
పూర్వకముగా శ్రీ గోవిన్దరాజుల సన్నిధి వేం
చేపుచేసుకొని వెళ్ళిరి. అచ్చట రామానుజులు
వారు తమ తిరునక్షత్రమునకు శ్రీ స్వామి
వారిని వేంచేయ ప్రార్థించు ప్రార్థన శ్రీ కూర్మ
క్షేత్రమహాత్మ్యములో దాశరథీ విన్నపము
పేరుతో శ్రీమాన్ నిడవర్తి వంద్యాడై రామా
నుజాచార్యులవారిచే విన్నవించబడిన మాలిక

ఆనాడు కార్యనిర్వాహకులగు రామానుజాచార్యుల యాదేశమున శ్రీరామతీర్థ వాస్తవ్యులును ఉభయవేదాన్త ప్రవర్తకులగు శ్రీమాన్ పండిత తిరుమల పల్లేర్లమూడి రామానుజాచార్యులువారా దాశరథీ విన్నప కైంకర్యము జరిగించిరి. అటు పిమ్మట శ్రీస్వామి వేదాసేవతో శ్రీభగవద్రామానుజుల సన్నిధికి వేంచేసి ప్రబంధానుసంధానము భగవద్విషయ శ్రీభాష్యానుసంధానము భాగవతోత్తములు ప్రతి నిత్యము గావింప తిరువళపట్టుచుండిరి. ఇట్లు ప్రతినిత్యముదయము శ్రీ భాష్యగ్రంథమును శ్రీమాన్ తి॥ ప॥ రామానుజాచార్యులువారున్ను శ్రీ భగవద్విషయమును నాలాయిర దివ్య ప్రబంధమును శ్రీమాన్ తిరుమల పల్లేర్లమూడి వెంకటాచార్యులువారున్ను నాలాయిర దివ్య ప్రబంధమును శ్రీభాష్యం వెంకటాచార్యులు వార్లును విన్నవించుచుండిరి.

ప్రథమ దివసమున సాయంకాల కార్యక్రమమందు శ్రీ జియ్యరుస్వామివారు కవి పండిత సమేతులై శ్రీస్వామివారి యాలయమున శ్రీ కవిగారిచే రచింపబడిన రామానుజ చరిత్రాంతర్భాగమగు ధనుర్దారు చరిత్రను శ్రీరామానుజుల సన్నిధిని విన్నవించవలయునని కటాక్షించ కవిగారు శ్రోతలకు శ్రోత్రజడిమను సడలింప వీనుల విందుగావించిరి. అటుపిమ్మట విజయనగర సంస్కృత కళాశాలోపాధ్యాయులగు శ్రీ భాష్యం వెంకటనరసింహ భాష్యకారాచార్యులువారిని విశిష్టాద్వైత సిద్ధాన్తముగానే విషయమైన నుపన్యసించవలసినదిగా శ్రీ జియ్యరుస్వామి వారాజ్ఞాపింప వారుపన్యసించిరి. అటు పిమ్మట శ్రీజియ్యరుస్వామి వారా బాలగోపాలము విని ముదంబునొందునట్లుపన్యసించి కవిగారికి పండితులకు సంఘమువారి ప్రార్థనవలన సన్మాన శాలువులను కటాక్షించి సభచాలించిరి. రెండవ దినమున యథా ప్రకారము శ్రీ కూర్మనాథుని సన్నిధి కాబాలగోపాల మేతెంచెను ఆనాడు శుక్రవారమగుటచే గ్రామమందలి మహిళలచే శ్రీ జియ్యరుస్వామివారు శుక్రవారోత్సవము దివ్యముగా జరుగునట్లాజ్ఞాపించిరి. అట్లుగనే గ్రామమందలి మహిళలందరు భక్తి విశ్వాసములను చూపుచు తమ కాజ్ఞాపించిన ప్రకారముగా పూజాద్రవ్యాదికములతో నాలయమునకేతెంచిరి. శ్రీగోవిన్దరాజస్వామివార్కి కానాటి సాయంసమయ వుత్సవ సందర్భమున జగన్మోహినీయలంకారము సమర్పించి భక్తుల నంతరిని భక్తి భావంబుల నోలలాడింపజేసిరి. ఆనాడు సాయంసమయమున శ్రీ జియ్యరు స్వామివారు లక్ష్మీపూజా విధానమునుపదేసింప మహిళలందరు బహుశ్రద్ధాళులై యుచ్చరించిరి, స్త్రీలందరు చాలమంది మహిళామండలి సభ్యులుగా జేరిరి. పిమ్మట కవిగారిచే కొంతవరకూ గోష్ఠిగావింపబడినది. పిమ్మట శ్రీ జియ్యరుస్వామివా రుపన్యాసముచే నాబాలగోపాలము నానందాబ్ధి నోలలాడింపజేసి సభను ముగించిరి.

మూడవదినమున యథాసమయమునకే శ్రీ జియ్యరువా రుపన్యాసమంటపము నలంకరించిరి. ప్రతినిత్యమూ సభామంటపమునందు శ్రీ యతిరాజులను వేంచెపుచేసియుండ వారి యాస్థానమునందే యీ యుపన్యాసాదులు జరుగుచుండెను నేటిదినపు కార్యక్రమము నందు సభవారి యంగీకారముగా వేంచేసిన రెలిజియస్ ప్రోపగాండిస్టు శ్రీమాన్ నండూరి అప్పలాచార్యస్వామివారి నేదేని విషయమును గూర్చి యుపన్యసింప శ్రీ జియ్యరుగారనుగ్రహింపవారుపరతత్త్వ నిర్ధారణకై భట్టరు సాయించిన

ముక్తకముల నుపన్యసించిరి. పిమ్మట కవిరత్న రామానుజాచార్య స్వామివారు తామత్యంత ప్రేమతో రచించిన రామానుజ విజయమను రగడ (బుఱ్ఱకథ) గాన మమృతముగా వినిపించిరి. పిదప శ్రీ స్వామివారంతోపన్యాసమునిచ్చి శ్రోతల నానందింప జేసి సభాంతమందు శ్రీ భగవద్రామానుజుల సన్నిధిని సింహాచలక్షేత్ర నివాసులును రెలిజయస్ ప్రోపగాండిస్టుగారైన నంబూరి అప్పలాచార్యులుగారిని సభవారి తరపున శ్రీ స్వామివారు పండిత శాలువను బహూకరించిరి.

నాల్గవదినమున యథాక్రమముగా సభికులందరూ శ్రీ భగవద్రామానుజస్వామివారి యుత్సవ సభామంటపమునుండి కిక్కిరుసుకొని యుపన్యాసముకై చూచుచుండ శ్రీ జియ్యరు స్వామివారు ప్రథమమున భజయతిరాజ సంకీర్తనగావించి యాపైని శ్రీరామతీర్థక్షేత్ర నివాసులును పండితులునగు శ్రీమాన్ తిరుమల పల్లేర్లమూడి రామానుజాచార్యుల వారిని సభవారి ప్రార్థనచే శ్రీ జియ్యరుస్వామి యుపన్యసించగోరినారు. ఆపైని శ్రీస్వామివారియందు తమకు గల భక్తి శ్రద్ధలను వెలిబుచ్చుచు రామానుజాచార్యస్వామివారు ముక్తపురుషు నిత్యైశ్వర్యమనే విషయమును చక్కని ప్రతిపాదనలతో సకల సభాసదులకు తెలసి యానందించునట్లుపన్యసించిరి. పిదప కవిరత్న రామాజాచార్యస్వామివారు శ్రీ భగవద్రామానుజ చరిత్రమును గద్యరూపమున విన్నవించి శ్రోతల నానందింపజేసిరి. పిదప శ్రీస్వామివారు చక్కగానుపన్యసించి శ్రోతల నా న ం దా బ్ధి నోలలాడించిరి.

అయిదవరోజున కార్యక్రమమునకు యథాసమయమునకు శ్రీ స్వామివారు సభామండపము నలంకరించిరి. శ్రోత లత్యుత్సాహముతో తమ స్థానములకై యత్యుత్సాహముగవచ్చి యాసీనులై వీనుల రిక్కించుకొనియుండ శ్రీస్వామివారు భజయతిరాజ సంకీర్తనతో సభాకార్యక్రమము ప్రారంభింపచేసిరి. పిమ్మట సభవారి ప్రార్థన స్వామి నియమింప శ్రీ రామతీర్థ వాస్తవ్యులు హరికథా చతురానన శ్రీమాన్ కరి నారాయణాచార్యులువా రుపన్యసించిరి. వీనుల విందు గావించిరి. శ్రోతల నానంద మగ్నులగావించిరి. పిదప శ్రీ స్వామివారి యాదేశమున శ్రీమాన్ కవిరత్న రామానుజాచార్యస్వామివారు శరణాగతిని సాయించి శ్రోతల నానందవార్ధి నోలలాడించిరి. పిదప శ్రీ జియ్యర్‌స్వామివా రుపన్యసించి యాబాలగోపాలము సంతోషవీచికల తేల్చి లాలించిరి ఇంతటితో శ్రీ స్వామివారి పర్యటనలో హేవళంబి సం॥ర చైత్ర బ॥అమావాస్యగతించెను



# నూతనముగ ఏర్పాటుచేయబడిన
# శ్రీ యతిరాజ సేవా మహిళామండలి సభ్యురాండ్రు

శుక్రవారపూజ బ్రాహ్మణేతర్ల మహిళామండలి

1. శ్రీమతి పూనా రత్తమ్మ
2. ,, ,, వరహాలమ్మ
3. ,, ,, బంగారమ్మ
4. ,, ,, ముత్యాలమ్మ
5. ,, ,, నారాయణమ్మ
6. ,, ,, ద్రౌపతిఅమ్మ
7. ,, ,, యశోదమ్మ
8. ,, ,, వెంగలింగం భార్య నారాయణమ్మ
9. ,, ,, శాంతమ్మ
10. ,, ,, కాంతమ్మ
11. ,, ,, పార్వతమ్మ
12. ,, ,, వజ్రిమమ్మ
13. ,, ,, రత్నాలమ్మ
14. ,, ,, కౌసల్యమ్మ
15. ,, ,, చిట్టెమ్మ
16. ,, ,, వజ్రమ్మ భర్త రాములు
17. ,, ,, దమయంతి
18. ,, ,, సరస్వతమ్మ
19. ,, ,, అన్నపూర్ణమ్మ
20. ,, ,, నారాయణమ్మ
21. ,, డోకి సుందరమ్మ
22. ,, పమ్మిన అమ్మన్నమ్మ
23. ,, శాసనపురి జగ్గమ్మ
24. ,, కోయిన నారాయణమ్మ
25. ,, జామి అన్నపూర్ణమ్మ
26. ,, డోకి సీతారామమ్మ
27. ,, కోరాడ సరస్వతమ్మ
28. ,, డోకి ముత్యాలమ్మ
29. ,, తంగుడు సీతమ్మ
30. ,, జామి వజ్రమ్మ
31. ,, వైశ్యరాజు రాముడమ్మ
32. ,, కోకిల బంగారమ్మ
33. ,, తంగుడు మాణిక్యం
34. ,, జామి దమయంతి
35. ,, లోకనాథం వజ్రమ్మ
36. శ్రీమతి కోరాడ సరస్వతమ్మ
37. ,, డోకి మాణిక్యమ్మ
38. ,, పట్నాన కాంతమ్మ
39. ,, ,, అమ్మన్నమ్మ
40. ,, వైశ్యరాజు పార్వతమ్మ
41. ,, బరాటం బంగారమ్మ
42. ,, శాసనపురి సుందరమ్మ
43. ,, మద్ది సుందరమ్మ
44. ,, డోకి బంగారమ్మ

శుక్రవారపూజ పెక్కిగ్రామ మహిళామండలి

1. శ్రీమతి టంకాల కనకమ్మ
2. ,, కంబాల చిత్రానీళ
3. ,, కాశం శ్యామామణి
4 ,, విశ్వనాథం అలివేలమ్మ
5. ,, మామిడన్న విజయలక్ష్మి
6. ,, టంకాల ఈశ్వరమ్మ
7. ,, ,, నరసమ్మ
8. ,, ,, నారాయణమ్మ
9. ,, ,, భారతీ
10. ,, ,, శాంతమ్మ
11. ,, ,, అమ్మాయమ్మ
12. ,, ఖజానా జానకిరామమ్మ
13. ,, బారిగె లక్ష్మికాంతమ్మ
14. ,, ,, సరస్వతమ్మ
15. ,, మన్యాల రాజేశ్వరమ్మ
16. ,, కొల్లూరి రాజేశ్వరమ్మ
17. ,, దోనేపూడి రాధమ్మ
18 ,, అంథవరపు అన్నపూర్ణమ్మ
19. ,, తంగుడు రాముడమ్మ
20. ,, కోరాడ ముత్యాలమ్మ
21. ,, ,, నరసింహులు
22. ,, ,, సరస్వతమ్మ
23. ,, ,, అమ్మడమ్మ
24. ,, కోలా కర్రెమ్మ
25. ,, మండా అన్నపూర్ణమ్మ
26. ,, బోయిన అమ్మాయమ్మ

27. శ్రీమతి లాజే పార్వతమ్మ
28. ,, ఉపద్రష్ట అన్నపూర్ణమ్మ
29. ,, ఊన లక్ష్మీకాంతమ్మ
30. ,, సాన సావిత్రమ్మ
31. ,, వైశ్యరాజు నారాయణమ్మ
32. ,, కొండవలస వెంకటరత్నం
33. ,, చందనాల సింహాచలం
34. ,, నారాయణశెట్టి లక్ష్మీకాంతం
35. ,, బోయిన అన్నపూర్ణమ్మ
36. ,, ,, పెదవజ్రం
37. ,, ,, చినవజ్రం
38. ,, ,, కాంతమ్మ
39. ,, ,, వజ్రమ్మ
40. ,, మొరళి చిన్నమ్మ
41. ,, కొప్పుశెట్టి చిట్టెమ్మ
42. ,, టంకాల నరసమ్మ
43. ,, ప్రగడ కృష్ణవేణమ్మ
44. ,, బొనిశెంటి సుమిత్ర
45. ,, జాజుల గౌరమ్మ
46. ,, మల్లా నారాయణమ్మ
47. ,, రాజాన అప్పలనరసమ్మ
48. ,, రడగ నారాయణమ్మ
49. ,, దుంపా సరస్వతమ్మ
50. ,, పేరిశెట్టి కాంతమ్మ
51. ,, ,, సత్యవతమ్మ
52. ,, తాళాసు కౌసల్యమ్మ
53. ,, రాజాన జానకమ్మ
54. ,, పూర్ణశెట్టి రత్నాలమ్మ
55. ,, కల్లండ్ల అన్నపూర్ణమ్మ
56. ,, పాతులూరి లక్ష్మీనరసమ్మ
57. ,, గుండాల లక్ష్మీనరసమ్మ
58. ,, తుల్లై కమలమ్మ
59. ,, లాతపండ సున్నమ్మ
60. ,, ఊన మీనాక్షి
61. ,, సాన వరసమ్మ
62. ,, రామాపంతుల బంగారమ్మ
63. ,, రాజాన అప్పలనరసమ్మ
64. ,, కోరాడ అమడమ్మ
65. ,, అంపోలు సూర్యతమ్మ

## నరసన్నపేటలో మహిళామండలి

1 శ్రీమతి పొట్నూరి రమణమ్మ
2 ,, ,, సరోజమ్మ
3 ,, ,, లక్ష్మీకాంతమ్మ
4 ,, ,, కామేశ్వరమ్మ
5 ,, గుడ్ల సీతమ్మ
6 ,, జామి వీరమ్మ
7 ,, వైశ్యరాజు ఆదెమ్మ
8 ,, పైడిశెట్టి లత్నాలమ్మ
9 ,, ,, చినరత్నాలమ్మ
10 ,, ,, అప్పన్నమ్మ
11 ,, ,, గడ్డెమ్మ
12 ,, ,, కాయమ్మ
13 ,, ,, కుసుమమ్మ
14 ,, ,, చినరత్నాలమ్మ
15 ,, గుడ్ల సరోజమ్మ
16 ,, కింతలి దేవతమ్మ
17 ,, ,, పంకజమ్మ
18 ,, ,, ప్రభావతి
19 ,, తంగుడు ముత్యాలమ్మ
20 ,, ,, వెంకటమ్మ
21 ,, కోటన్న కామేశ్వరమ్మ
22 ,, తంగుడు అన్నపూర్ణమ్మ
23 ,, కోరాడ వెంకటలక్ష్మమ్మ
24 ,, కురువాడ ఆండాళమ్మ
25 ,, అంధవరపు అమ్మన్నమ్మ
26 ,, వడ్డి ముత్యాలమ్మ
27 ,, వారణాసి రమణమ్మ
28 ,, వైశ్యరాజు సరస్వతమ్మ
29 ,, వట్టి అమ్మడమ్మ
30 ,, కలివీపు అన్నాజి
31 ,, మరువాడ అమృతమాల్యద

## కళింగపట్నం మహిళామండలి

1 శ్రీమతి కప్పగంతుల భారతమ్మ
2 ,, దుంపా సూరమ్మ
3 ,, ,, వెంకటసింహన్న
4 ,, కప్పగంతుల రాధారుక్మిణి
5 ,, నూడవల్లి సీతమ్మ
6 ,, కింతల సరస్వతమ్మ

7 శ్రీమతి కింతల సావిత్రమ్మ
8 ,, ,, రత్నాలమ్మ
9 ,, ,, రత్నాలమ్మ (వాడపాలెం)
10 ,, కప్పగంతుల ఆదిలక్ష్మి
11 ,, కల్లి మాలక్ష్మమ్మ
12 ,, ,, రాధమ్మ
13 ,, ఉల్లాకుల గడ్డమ్మ
14 ,, పొట్నూరు నరసమ్మ
15 ,, ,, మాణిక్యం
16 ,, ,, అన్నపూర్ణమ్మ
17 ,, ,, మాణిక్యం, గురుమూర్తిభార్య
18 ,, ,, మహాలక్ష్మమ్మ
19 ,, ,, నారాయణమ్మ
20 ,, ,, అన్నపూర్ణమ్మ
21 ,, ,, మాణిక్యమ్మ
22 ,, ,, వెంకమ్మ
23 ,, ,, సరస్వతమ్మ
24 ,, ,, చెన్నమ్మ
25 ,, ,, సీతారామమ్మ
26 ,, ,, విశ్వేశ్వరమ్మ
27 ,, రాడి వరాలు
28 ,, జమ్మా చిట్టెమ్మ
29 ,, మోకం నరసమ్మ
30 ,, అంధవరపు త్రివేది
31 ,, కుప్పిల పాపమ్మ
32 ,, బంటుపల్లి పాపమ్మ
33 ,, వడ్డెబోయిన కన్నమ్మ
34 ,, మలేడు వెంకమ్మ
35 ,, కోటిని అనసూయమ్మ
36 ,, పొట్నూరు సావిత్రమ్మ
37 ,, వెంపాడ తాటమ్మ
38 ,, కోరాడ సావిత్రమ్మ
39 ,, ముడియా వరప్రసాదమ్మ
40 ,, గాలి రత్తమ్మ
41 ,, లాడె నరసమ్మ
42 ,, గంటా అచ్చమ్మ
43 ,, సున్నపిలి నరసమ్మ
44 ,, లాడ సరస్వతమ్మ
45 ,, ,, తవిటమ్మ
46 ,, ,, కాంతమ్మ
47 ,, ,, సీతారత్నం
48 శ్రీమతి మహేంద్రవాడ లక్ష్మినరసమ్మ
49 ,, కందాళై సీతారామమ్మ
50 ,, పరపటి లక్ష్మినారాయణమ్మ
51 ,, నూడవల్లి అమ్మాజమ్మ
52 ,, కామినేని అప్పలనరసమ్మ

## శ్రీ కూర్మం మహిళా మండలి

1 శ్రీమతి శిరిభాష్యం జగ్గమ్మ
2 ,, ,, తిరువేంగళమ్మ
3 ,, కందాళ సుభద్రమ్మ
4 ,, తిరుమల పెద్దింటి తిరువేంగళమ్మ
5 ,, ,, లక్ష్మమ్మ
6 ,, కందాళ లక్ష్మమ్మ
7 ,, ప్రభాష్యం లక్ష్మినరసమ్మ
8 ,, తిరుమల పెద్దింటి సింహాద్రమ్మ
9 ,, రంగరాజు వెంకటసుభద్రతాయారమ్మ
10 ,, బచ్చు లక్ష్మమ్మ
11 ,, కోరాడ సూరమ్మ
12 ,, వద్దిరాజు సత్యవతమ్మ
13 ,, రాపోలు వెంకటచలమమ్మ
14 ,, కోరాడ సావిత్రమ్మ
15 ,, ,, రాజేశ్వరమ్మ
16 ,, ,, తవిటమ్మ
17 ,, వడ్డె ఆసుద్రమ్మ
18 ,, సింహాద్రి గడ్డెమ్మ
19 ,, కోరాడ పద్మావతమ్మ
20 ,, బోయిన జోగులమ్మ
21 ,, కోరాడ రమణమ్మ
22 ,, బరాటు రత్నాలమ్మ
23 ,, కోరాడ సుభద్రమ్మ
24 ,, అంధవరపు అన్నపూర్ణమ్మ
25 ,, ,, సీతమ్మ
26 ,, ,, రత్నాలమ్మ
27 ,, కండ్యాన మహాలక్ష్మమ్మ
28 ,, పొట్నూరు ముత్యాలమ్మ
29 ,, అంధవరపు చిన్నమ్మ
30 ,, నారాయణశెట్టి అమ్మలమ్మ
31 ,, కోరాడ కామేశ్వరమ్మ

32 శ్రీమతి అంధవరపు నారాయణమ్మ
33 ,, ,, పెద్దఅన్నపూర్ణమ్మ
34 ,, ,, ప్రబలాంబ
35 ,, పొట్నూరు ముత్యాలమ్మ
36 ,, సింహాద్రి జానకమ్మ
37 ,, కోరాడ సరస్వతమ్మ
38 ,, ,, వెంకటరత్నాలమ్మ
39 ,, సింహాద్రి లక్ష్మీదేవి
40 ,, అంధవరపు రాజాలమ్మ
41 ,, సూరి దమయంతి
42 ,, సింహాద్రి ఆదెమ్మ
43 ,, కోరాడ అన్నపూర్ణమ్మ
44 ,, కోరాడ కనకరత్నం
45 ,, సింహాద్రి శేషమ్మ
46 ,, కోరాడ సావిత్రమ్మ
47 ,, సింహాద్రి లచ్చన్నమ్మ
48 ,, కోరాడ తవిటమ్మ
49 ,, వడ్డి అమ్మన్న
50 ,, అంధవరపు చంద్రమాణిక్యం
51 ,, బరాటం గంగమ్మ
52 ,, అంధవరపు నారమ్మ
53 ,, కోరాడ అప్పలనరసమ్మ
54 ,, కోరాడ నూకమ్మ
55 ,, కోరాడ సరోజనమ్మ
56 ,, కోరాడ గరాన్నలమ
57 ,, సింహాద్రి విజయలక్ష్మీదేవి
58 ,, పోతాబత్తుల చిన్నమ్మి
59 ,, కోరాడ కౌసల్య
60 ,, అంధవరపు వెంకటరత్నం
61 ,, సింహాద్రి ముత్యాలమ్మ
62 ,, బరాటం అమ్మన్న
63 ,, బరాటం నారాయణమ్మ
64 ,, శిల్లా కామమ్మ
65 ,, కోరాడ రాజులమ్మ
66 ,, కోరాడ వెంకటరత్నం
67 ,, కోరాడ రమణమ్మ
68 ,, శృంగారం నారాయణమ్మ

# బదరీ శ్రీనివాస రామానుజ శాశ్వత పూజలవసూళ్లు

1. శ్రీమల్లా భద్రయ్య అంతు సన్సు, పలాసా 29-0-0
2. శ్రీఅంధవరపు కొండలరావుగారు, పలాసా 29-0-0
3. శ్రీఊన చినసత్యనారాయణగారు, పలాసా 29-0-0
4. శ్రీ అంధవరపు కామరాజాగారు కుమారులు శ్రీ సన్యాసిరాజు 29-0-0
5. శ్రీ పెంటా పెద్ద కృష్ణమూర్తిగారు, పలాసా 29-0-0
6. శ్రీ ఖజానా వెంకటరావుగారు, సోంపేట 29-0-0
7. శ్రీ ఖజానా వెంకటరావుగారు, పురఫ్ క్రిష్ణప్పగారు, సోంపేట 29-0-0
8. శ్రీ ఖజానా వెంకటరావుపంతులుగారికుమార్తె నీలాచలంగారు, సోంపేట 29-0-0
9. శ్రీ టంకాల జగన్నాధమూర్తిగారు వాగ్దానం 58లులో జమ ఇచ్చినది టెక్కలి 29-0-0
10 శ్రీ ఖజానా కృష్ణారావుగారు (కేర్) క. అన్నపూర్ణమ్మగారు, బరంపురం 29-0-0
11. శ్రీ గాదేరాజ గోపాలరావుగారు (అడ్వకేటు బరంపురం) 29-0-0
12. శ్రీ ఖజానా కోదండరావుగారు అడ్వకేటు టెక్కలి 29-0-0
13. శ్రీ పొలాకి శ్రీరంగంగారు, (బరంపురం) వాగ్దానం275లలో జమచేచ్చినది శ్రీ. పి. పార్థసారథిగారి ద్వారా 100-0-0
14. శ్రీ ఎమ్. వెంకటాచార్యులుగారు, నేడుదువర్ల లోగడ ఎమ్. ఒ. లలో 10 ఇప్పుడు ఎమ్. ఒ. ద్వారా 19-0-0
15. శ్రీ గుడిశె వెంకటరామమూర్తిగారు, బరంపురం 58-0-0
16. శ్రీ మరింగంటి శేషాచార్యులు గారి భార్య శ్రీ రంగమ్మగారు, నూర్యాపేట 29-0-0
17. శ్రీ దేవులపల్లి వరసింహారావుగారు వాగ్దానం 275 లలో జమ ఇచ్చినది 10-0-0
18. బెల్లాల నారాయణమూర్తిగారు నరసన్నపేట, తాత్కాలికపూజ 11-0-0
19. శ్రీ పొట్నూరు వెంకట జోగులయ్యగారు నరసన్నపేట, శాశ్వతపూజ 29-0-0

## వి షా ద వా ర్త

మునగాల పరగణా వేణుగోపాలపురం శ్రీ కొల్లి పాపయ్య చౌదరిగారు దుర్ముఖి సం॥ ఫాల్గుణ శుద్ధ ౧౦ మంగళవారము 11.25 నిమిషములకు పగలు పరమ పదించినారు. వీరు గొప్ప లక్ష్మీ సంపన్నులు, మంచి భగవద్భక్తులు, వితరణగుణము వీరి సొమ్ము. బదరీ నారాయణములో అష్టాక్షరీ నిలయములో ఒక గది కట్టించుటకు 3500 వాగ్దానము గావించి రెండువేల రూపాయ లిచ్చియున్నారు. మరియు బదరీ నారాయణములో సత్సంగ

భవన నిర్మాణమునకు పది వేల రూపాయి లిచ్చుటకు సంకల్పించుకొనిరి. స్వగ్రామములో ఆలయము నిర్మించి పోషించుచున్నారు. వీరు పరమదించిన సందర్భములో వీరికుమారులు శ్రీ వెంకట రామనరసయ్యగారు ఔర్ధ్వ దేహిక క్రియలు యథావిధిగా జరిపించి పరమపదోత్సవ సందర్భములో భక్తి నివేదన పత్రికకు 10-0-0లు కట్నం సమర్పించిరి వీరికుమారులు తండ్రిగారి వాగ్దానములను అష్టాక్షరీ మందిర నిర్మాణములోని గదిని సత్సంగ భవన మున్న పూర్తి చేయింతురుగాక.

ఈ సమయములో వీరిచరమ శ్లోకములను శ్రీమాన్ మరింగంట సీతారామానుజచార్యులు రచించినవి. యిందు పొందు పరుచుచున్నాము.

శ్లో॥ కోదండపాణే శ్రీరామ । భవతే స్వార్జితార్థతః
కారయితాలయాదన్యః । తంవరం ప్రాపయప్రభో

శ్లో॥ కోదండపాణినం సీతా । లక్ష్మణాభ్యాంయుతంభజే
యత్ప్రసాదాత్పరం ప్రాప్తః । కొల్లు పాపయ్య
నామకః

శ్లో॥ శ్రీమన్నారాణాచార్య త్రిదండినమహం భజే
యంస్మరన్ పరమంప్రాప్తః । కొల్లు పాపయ్య
నామకః

శ్లో॥ దుర్ముఖ్యబ్దే తపస్యేశుక్లేకాదశ్యాం పరంగతః
కొల్లు పాపయ్యనామా త్స్వాత్ వ్యక్తా
దత్యక్త చేతనః

శ్రీయఃపతి వీరియాత్మకు శాంతిని ప్రసాదించుగాక.

# బరంపురం శుక్రవారపూజా సమాచారం మహిళామండలి

మార్చి 1వ తేదీ శుక్రవారము బ్రహ్మపురంలో వేంచేసిన శ్రీశ్రీశ్రీ తిరువేఙ్గడముడయాన్ సన్నిధిని శ్రీమద్వేద మార్గప్రతిష్టాపనాచార్యులును పరమహంస పరివ్రాజక శ్రీవిశిష్టాద్వైత సంఘ నిర్వాహకులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ స్వామివారు, పరివారసమేతముగా వేంచేసి శుక్రవారోత్సవ కైంకర్యమును 'వర్ధతామభివర్ధతా' మనిమఙ్గళాశాసనముచేసిరి. ఆ శుక్రవారము కైంకర్యమునంతయు శ్రీశ్రీశ్రీ స్వామివారే నియమించి ఆచరింపచేసిరి. శ్రీ పెరుమాళ్లకు పిరాట్టిమార్లకు నూతన వస్త్రాలంకారమును భోగమును సమర్పించిరి. యీ శుక్రవారమునుండి ప్రతి శుక్రవారము వుంజలి వుత్సవము 'శిరియ తిరుమడల్' సేవాకాలము జరుగనట్లాజ్ఞాపించిరి ఆరు సంవత్సరములుగా జరుగుచున్న మహిళా మండలిని బహుళీకృతముచేసిరి. ఆశుక్రవారమె చాలామంది పురమహిళలు కైంకర్యమందన్వయించుకొనిరి గాదె లక్ష్మీనరసమ్మగారు ప్రసాద కైంకర్యము సమర్పించిరి.

శ్రీమాన్ జియ్యరు స్వామివారు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులువారు శ్రీమాన్ గుడిమెళ్ల రామానుజాచార్యులుగారు కోవెల పరివారము, ప్రముఖులతో మఙ్గళాసన పురస్సరముగ తీర్థ ప్రసాదోజ్జీవనము జరిగినది.

మార్చి 8వ తారీకు శుక్రవారముకూడా ద్వితీయ విఘ్నములేకుండ శ్రీశ్రీశ్రీ జియ్యరుస్వామివారి పురస్సరముగానె జరుప బడినది. నియమిత కాలమునకే మహిళలందరు బంధు మిత్రాదులతోవచ్చి అన్వయించుకొనిరి. యీశుక్రవారము యిచ్చటి మహిళామండలి అధ్యక్షులును యిచ్చనైనమందరకు, స్తోత్రపాఠములను దివ్య ప్రబంధములను సుశిక్షితముగా సాయించుచున్న శ్రీ పిరాట్టి సమానులగు శ్రీమత్తిరుమల పెద్దింటి తిరువేఙ్గడతాయరమ్మగారు కైంకర్యము సమర్పించిరి. ఆనాడు శ్రీమాన్ కవిగారు ద్వయ మన్త్రార్థము సాయించిరి. శ్రీ శ్రీ శ్రీ జియ్యరు స్వామివారుపన్యసించి పురజనులందరను ఆనందమున నోలలాడించిరి.

మార్చి 15వ తారీకు శుక్రవారము శ్రీశ్రీశ్రీ స్వామివారు పర్యటనకు వేంచేసినది పదే పదే ధ్యానించుచువారి 'శ్రీ వచన' ప్రకారము సన్నిధి స్థలాచార్యులుగా వేంచేసియున్న ద్రావిడ ప్రబంధవ్యాఖ్యాన కాలక్షేపముల సాయించుచుండు శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులు వారు 'శిరియతిరుమడల్' సేవాకాలము సాయించిరి. ఆనాటి కైంకర్యము చి॥ స॥ గాదె యశోదా లలితమ్మ శ్రీమతి గాదె సత్యవతమ్మగారు సమర్పించిరి. సత్యవతమ్మ నూతన వస్త్రములు సమర్పించిరి. గోష్టిగాందరు సమిష్టిగా పెరుమాళ్ళ సన్నిధిని 'శెన్నియోఙ్గ' పిరాట్టి సన్నిధిని శ్రీగుణరత్నకోశము అనుసన్ధానముచేయ క్రమ పద్ధతిని పూజాదికమును సమర్పించిరి.

మార్చి 22వ తేదీ శుక్రవారము శ్రీమతి గాదె జానకిరాముడమ్మగారు శ్రీమతి పున్నిన లలితమ్మగారు కైంకర్యము సమర్పించిరి. శుక్రవారోత్సవ క్రమ ప్రకారము "వుంజలి వుత్సవము" శిరియతి తిరుమడల్ సేవాకాలము "శెన్నియోఙ్గ" శ్రీ గుణరత్న కోశానుసన్ధానాంతరము మఙ్గళాశాసనము తీర్థ ప్రసాదోజ్జీవనము జరిగినవి.

మార్చి 29వ తేదీ శుక్రవారము శ్రీమతి న్యాయపతి వెంకట జగ్గమ్మగారు శ్రీమతి న్యాయపతి లక్ష్మీనరసమ్మగారును కైంకర్యము సమర్పించిరి. పురమహిళలందరకు, క్రమ ప్రకారము వుంజలిలో వేంచేసి అమ్మగారు కైంకర్యము తిరుపుళ్ళపట్టి దాసజనుల కైంకర్యము పరిగ్రహించిరి.

ఇట్లు, కార్యదర్శిని, "సుగుణ."

## ముఖ్యగమనిక

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు శ్రీ భగవద్రామానుజులవారి తిరునక్షత్ర చాత్ మొరవరకు శ్రీ కూర్మములో వేంచేసియుందురు.

సంఘ ప్రధానకార్యదర్శులగు శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు బదరిలో జరుపబడిన అష్టాక్షరీమంత్ర నిర్మాణ కార్యక్రమములో అన్వయించు యత్నములో నున్నారు.

శ్రీ జియ్యర్ స్వామివారి వెంట సంఘకార్యనిర్వాహకులైన శ్రీమాన్ గడ్డె కృష్ణ నరసింహ రామానుజాచార్యులవారు అన్వయించియున్నారు. శ్రీ కూర్మం వైష్ణవపండితుల సభలు 2-5-57 మొదలు 4-5-57 వరకు జరుపబడుటకు నిశ్చయింపబడినవి మూడు రోజులు ఉదయం, సాయంత్రము పండిత సభలు మధ్యాహ్నము స్త్రీల సభలు జరుగును. ఈ సభలకు సింహాచలం, శ్రీరామతీర్థం, బొబ్బిలి, విజయనగరం, శ్రీకాకుళం, పలాసా, ఇచ్ఛాపురం, కళింగపట్నం, బరంపురం, ప్రాంతీయ విద్వాంసులకు ఆహ్వానములు పంపబడినవి.

సభలు 3 రోజులు ముగిసిన తరువాత శ్రీవారు కాలినడకతో శ్రీకాకుళం మకామునకు వేంచేయుదురు. జూన్ మొదటివారములో విజయవాడకు శ్రీ జియర్ స్వామివారు విచ్చేసి బ్రహ్మయజ్ఞ కార్యక్రమమున నుపక్రమింతురు.

**BOOK—POST**

"భక్తినివేదన" శ్రీ వానమామలై మఠం. నడిగడ్డపాలెం. (వయా, తాడేపల్లిగూడెం)

సాలు చందా **5—0—0** వేదాంత మాసపత్రిక ప్రచారకులకు **1-4-0**

To

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Sri Satyanarayana Printing Works, Vijayawada for Sriman Press Nadigaddapalem.

శ్రీ హయగ్రీవాయ నమః




# భక్తినివేదన

## (వేదాంత మాసపత్రిక)




సంపాదకులు :
శ్రీ వి. ప్ర. సం. ప్రధానకార్యదర్శి
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెల్ల రామానుజాచార్యులు


సంపుటం ౧౦ | హేవిళంబి - జ్యేష్ఠమాసము | సంచిక 3

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీరామతీర్థంలో - వేసంగిపాఠశాల

## "శ్రీ యతిరాజ శిక్షాశిబిరము"

ప్రారంభకులు :- శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘ శాశ్వతాధ్యక్షులు
శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు.

స్థలము :- శ్రీమాన్ అయ్యవార్లంగారి "సంపత్కుమారభవన" మను తిరునామముగల
మహోన్నత ప్రాసాదరూపనుగు తిరుమాళిగలో.

ప్రారంభసమయము :- వైశాఖబహుళ ఏకాదశీ స్థిరవారము (25-5-57)

పాఠ్యగ్రంథములు :-(1) ముముక్షుప్పడి 2) గీతాభాష్యము.

కార్యక్రమము :-ఉదయం గం. 7-ల మొదలు గం. 10-ల వరకు "ముముక్షుప్పడి"
మధ్యాహ్నం గం. 3-ల మొదలు గం. 6-ల వరకు "గీతాభాష్యము"

అధ్యాపకులు :- శ్రీమాన్ ఉ. వే. పండిత తిరుమల పల్లెమూడి రామానుజస్వామిగారు.

కైంకర్యపరులు :- (1) శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారు (అధ్యక్షులు శ్రీ జియ్యర్ స్వామి
వారు) 116-0-0 లు విలువగల గీతాపుస్తకములు, ముముక్షుప్పడి శ్రీకోశములు
విద్యార్థులకు ఉచితముగా నొసగిరి.
(2) శ్రీమదిత్యాది శ్రీమాన్ శ్రీ మన్నింగుల పెద్దింటి సంపత్కుమార వేంకటా
చార్యుల అయ్యవార్లంగారు శిక్షాశిబిరనిర్వహణకు 116-0-0 లు సమర్పించిరి.

### విద్యార్థులు

1 శ్రీమాన్ కందాడ అనంత పద్మనాభాచార్యులు గారు.
2 ,, తి. పె. సం జ. అనంతవెంకటాచార్యులు గారు.
3 ,, తి ప. నరసింహాచార్యులు గారు
4 ,, పా. కం. వీరరాఘవ అప్పలాచార్యులు గారు.
5 ,, వి. కం. రా. భాష్యకారాచార్యులు గారు.
7 ,, పా. కం. పద్మనాభాచార్యులుగారు.
6 ,, కరి నారాయణాచార్యులుగారు.
8 ,, కో. కం. జ. రాఘవాచార్యులు గారు.
9 ,, గొడవర్తి రంగాచార్యులు గారు.
10 ,, కల్వపూడి వెం. వీరరాఘవాచార్యులు గారు.
11 ,, కో. కం. కోదండ రామాచార్యులుగారు.
12 ,, గొడవర్తి కృష్ణమాచార్యులుగారు.
13 ,, గొడవర్తి అనంతాచార్యులుగారు.
14 ,, కల్వపూడి తిరుమలాచార్యులు గారు.
15 ,, కందాడ రామాచార్యులుగారు.
16 ,, ములుగు రామాచార్యులుగారు.
17 ,, కల్వపూడి శరణ్యాచార్యులుగారు.
18 ,, తి. ప. రామానుజాచార్యస్వామిగారు.
19 ,, గొల్లకల్వ కం. వెం. నరసింహాచార్యులు గారు.
20 ,, శ్రీభాష్యం వీరరాఘవాచార్యులుగారు.
21 శ్రీమాన్ కందాళ అప్పలాచార్యులుగారు.
22 ,, తూపురాణి నరసింహాచార్యులుగారు.
23 ,, తి. ప. పద్మనాభాచార్యులుగారు.
24 ,, తి. ప. జగన్నాథాచార్యులుగారు.

### స్త్రీ విద్యార్థినులు

25 శ్రీమతి ప. రామప్రియలక్ష్మీనరసమ్మగారు.
26 ,, గొడవర్తి రంగమ్మ గారు.
27 ,, న్యాయపతి రంగనాయకమ్మ గారు.
28 ,, ప. చూడమ్మ గారు,
29 ,, గొడవర్తి ఆండాళమ్మ గారు
30 ,, గొడవర్తి రాగమ్మ గారు.
31 ,, కందాళ శ్రీతమ్మ గారు.

ఇట్లు
శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘకార్యదర్శి
విద్వాన్. తె. కం. గోపాలాచార్యులు.



శ్రీహయగ్రీవాయనమః

# శ్రీ రామ రాజ్యము

న్యాయవేదాంత విద్వాన్ శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు.

గాంధీమహాత్ముడు మొదలు మన దేశీయ నాయక ప్రముఖులందరును మనకు రామరాజ్య ముండవలెనని కలలు గనుచుండిరి. ఇప్పటికిని నాయక ప్రముఖులా రాజ్యమునే తమ యాదర్శముగా నుంచుకొని కృషి సలుపుచున్నట్లుగడించుచున్నారు. ప్రజలందరు నా రాజ్యమునకే యాశించి యనేక త్యాగముల నొనరించుచున్నారు. ఇట్లందరి చెవులలో మారుమ్రోగుచున్న రామరాజ్యమనగా నెట్లుండవలయునో యెరుంగు వారల్ప సంఖ్యాకులు మాత్రమే యుందురని తలంతును. ఎవరికి తోచిన రీతిగా వారీ రామరాజ్యమును నిర్వచించుచున్నారు. కాని వాస్తవముగా రామరాజ్య మెట్లుండవలెననెడు నిర్వచన మింతవరకు ప్రజానీకములో ప్రచారమున లేనందున శ్రీరామ చరిత్రకు ముఖ్యప్రమాణ గ్రంధమగు శ్రీ వాల్మీకి రామాయణము నవలంబించి శ్రీరామునకభిమత మగు రాజ్య మెట్లుండవలెననెడు నిర్ణయమును నేనీ వ్యాసమూలమున జిజ్ఞాసువుల కందజేయ సమకట్టుచున్నాను.

## రామరాజ్యమున ప్రజలయనుభవము

శ్రీరామచంద్రుడు రాజ్యమేలుచున్నప్పుడు ప్రజలెల్ల సుఖించుచుండిరను విషయమును శ్రీ వాల్మీకి మహర్షి యుద్ధకాండమునందలి 131 వ సర్గయందలి 93 వ శ్లోకమునుండి 100 వ శ్లోకము వఱకు 8 శ్లోకములలో నీ క్రింది కనపఱచిన రీతిగా వర్ణించెను.

శ్రీరాముడు రాజ్యమేలుచుండగా వితంతువుల యాక్రందన మెచ్చటను వినరాకుండెను. పాము కాటుచే మృతినొందుట మృగ్యమై యుండెను. రోగపీడితులెచ్చటను కానరాకుండిరి. (శ్లో 93) లోకమున నెవ్వరును బందిపోటుల బారికి గురి గాకుండిరి. ఏరికి గాని యనర్థస్పర్శయే లేదనుట యతిశయోక్తిగాదు. పెద్దలు పిన్నలకు ప్రేతకార్యములొనర్చుట నెఱుగరు. (శ్లో 94) అందఱును ధర్మపరులే యగుటచే నిత్యసంతుష్టులై మనుచుండిరి. ఒకరి నొకరు నిర్మూలింపదగిన విరోధము లున్నను శ్రీరామచంద్రుని ముఖము వాడునను భయముచే పరస్పరము బాధించకుండిరి. శ్రీరామచంద్రుని తలంచుకొని తమ విరోధముల మఱచుచుండిరి (శ్లో 95) ఒక్కొక్కరు కొన్ని వేల సంవత్సరములు సుఖముగా జీవించుచు పెక్కు సంతాన వంతులగుచుండిరి. రోగ గంధమే లేకుండుటచే దుఃఖగంధమునే యెరుంగరైరి. (శ్లో 96) ఎచ్చట జూచినను రామనామమే మారుమ్రోగుచు ప్రపంచమంతయు రామ మయమయ్యెను. (శ్లో 97) వృక్షములు విచ్చలవిడిగా పెరిగి నిత్యమును పువ్వులతోను ఫలములతోను అలరారుచుండెను. మేఘుడు సకాలమున సరిపడినంత వర్షించుచుండెను. వాయువు సుఖ స్పర్శతో వీచుచుండెనేగాని సుడిగాడ్పులు లేకుండెను. (శ్లో 98) అధర్మాచరణమునకు నిదానమైన లోభము దూరమగుటచే నాలుగు వర్ణములును తమ విధ్యుక్త ధర్మములను గీటువాసియైనను తప్పక

నాటివలన లభించుదానిచే తృప్తినిచెంది యానందించుచుండిరి. (శ్లో 99) ప్రజలు ధర్మనిరతులై యసత్యము నాడరింపకైరి. వర్ణాశ్రమ చిహ్నలను తప్పక పాలించుచుండిరి

ఇట్టి సర్వసుఖములకును నిదానము రామరాజ్య విధానమే. కాన దాని నెఱుంగుట మనకు ముఖ్య కర్తవ్యముగదా!

## ఇట్టియనుభవమునకు కారణమేమి?

శాస్త్రజ్ఞులు "యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిస్స ధర్మః" అని ధర్మ లక్షణము నుగ్గడించిరి. అనగా నెట్టి యాచరణవలన యిహలోక పరలోక సౌఖ్యములున్ను, పరమ పురుషార్థమగు మోక్షమున్ను లభించునో యది యేధర్మము. ఈ ధర్మమెంతగ పాటింప బడుచుండునో సౌఖ్యమంత సన్నిహితమై యుండును. ఇట్టి ధర్మ రక్షణ భారము రాజుపై నుండును. రాజు భారము పురోహితులు, మంత్రులు, అమాత్యుల పైనను నాధారపడి యుండును. తన కుమారుని బ్రతికింపుమని రామరాజ్యమున బ్రాహ్మణుని నిర్బంధమున్ను, తనకు సంతానావరోధమును తొలగింపుమని దిలీపుని వశిష్ఠ నిర్బంధమున్ను యీ సత్యమున కాధారములు. కావుననే దశరథ చక్రవర్తి తన లౌకిక రాజ కార్య నిర్వహణము నంతను సర్వలక్షణ లక్షితులగు ధృష్టి, జయంత, విజయ, సిద్ధార్థ, అర్థసాధక, అశోక, మంత్రపాల, సుమంత్రులనబడు అమాత్య శేఖరుల యందును, యితర మంత్రిపుంగవుల యందును (బాల 7 స. 3 శ్లో), వైదిక కార్య నిర్వహణము నంతను ప్రధానముగ వశిష్ఠ, వామదేవులును (శ్లో 4) మఱియు సుయజ్ఞ, జాబాలి, కాశ్యప ప్రభృతుల యందును (స 8. శ్లో 6) ఉంచి వారియాను మీరక సంచరించుచుండెను. శ్రీరామచంద్రుడున పూర్వుల పాదచ్ఛాయలలో సంచరించు స్వభావము కలవాడు కావున నామర్యాదలను గీటువాసియైనను దాటిన పాపమున పోడయ్యె!

రంజింపజేయువాడు రాజు కావున రాముడు ధర్మముచే ప్రజల రంజింప జేయుచుండెను. (ప్రజాధర్మేణ రంజయన్)

"ప్రజానాం పాలనం కుర్వన్ అధర్మం పరివర్జయన్"

రాజకార్య నిర్వహణమసిధారాతుల్యమైనను ఆ కష్టములను పాటింపక ధర్మమున కెన్నడును గ్లాని రానీయకుండెను. కావుననే యాతని గుణముల నుగ్గడించుచు నారదమహర్షి వాల్మీకితో

"రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య రక్షితా"
(బాల. 1. స. 13. 14. శ్లో)

అని ప్రధానముగా వేర్కొనెను.

ధర్మ రక్షణమే ప్రజారక్షణముగా రాజ్యమేలెను. ఇచ్చట ధర్మమనగా పితృ మాతృ వాక్య పరిపాలనము, సౌభ్రాత్రము, గురుభక్తి, శరణాగత త్రాణము, సత్యనిరతి, ఏకపత్నీవ్రత ప్రభృతి సామాన్య ధర్మములు. స్వధర్మముగా రాజున కసాధారణ మయిన

"శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం
యుద్ధేచాప్యపలాయనమ్
దానమీశ్వర భావశ్చ"

అనెడి ధర్మములను తానాదర్శప్రాయముగా నాచరించుచు తన సజాతీయోత్తమ క్షత్రియులకు 'యద్యదాచరతి' న్యాయముగా ప్రమాణమై యుండెను.

ధర్మ రక్షణమనగా 'అధీతి బోధాచరణ ప్రచారణైః' అని శ్రీహర్షుడు తెలిపినటుల ధర్మ గ్రంథములను సదాచార్యముఖతః అధ్యయనము చేయుట, అర్థము నెఱుంగుట, తానాచరించుట, పిదప నితరులచే నాచరింప జేయుటయును.

## రాజునకావశ్యమైనరాజధర్మములెవ్వి?

భరతుడు తన నయోధ్యకు విచ్చేసి రాజ్య భారమును స్వీకరింపుమని ప్రార్థింప నేతెంచిన తరి శ్రీరామచంద్రుడు ఇతర ప్రసంగములు వేటికిని అవకాశ మొసంగక మునుముందుగనే యాతనిని తన నడెయందిడుకొని రాజ్య ధర్మములను ప్రశ్న రూపముగా నుపదేశించెను. (అయో. 100 స 3 శ్లో) ఆ సమయమున నా ప్రశ్నల కెంతమాత్ర మవకాశములేదు. ఐనను పదునాలుగు సంవత్సరము లాతడు రాజ్యమేలవలసి యుండుట తథ్యమగుటచే నాతని కెల్లనను తన కభిమతమగు రాజ్య నిర్వహణ విధానమును బోధించవలసియున్నది. నాటకీయముగా బోధించినచో భరతునకు న్యూనతగా తోచవచ్చును. కావున "నిక్కముగదా నీవు పాలించుచున్నా"వని యనువాద రూపముగా నుపదేశించెను. ఇందలి చాతుర్య మెంతయో కొనియాడ దగియున్నది.

## పురోహితు డెట్లుండవలెను?

(వైదిక మంత్రులు)

రాజునకు లౌకిక వ్యాపారములలో సలహాల నిచ్చుటకు మంత్రులును, అమాత్యులును ఉండవలసినట్లే వైదిక కార్యములను నిర్వహించుటకై సలహాల నిచ్చి నడిపించుటకు పురోహితు లుండుట ముఖ్యావసరము. ప్రజలను వర్ణాశ్రమ ధర్మములు తప్పనటులు నడిపించు భారము రాజుపై నున్నట్లే, రాజు నట్లు నడిపించవలసిన భారము పురోహితునిపై కలదు. కావుననే శాస్త్రకారులు:

శ్లో. "రాజా రాష్ట్రకృతం పాపం రాజపాపం పురోహితః।
భర్తా చ స్త్రీకృతం పాపం శిష్యపాపం గురుస్త్వజేత్॥"

ప్రజ లొనరించిన పాపములు రాజును, రాజొనరించిన పాపము పురోహితుని బాధించును. అటులనే భార్య పాపమునకు భర్తయు శిష్యుని పాపమునకు గురువును బాధ్యులై యుందురు. కావున పరినిష్ఠితులగు పురోహితు లెంతయు రాజునకు ముఖ్యులు. వారెట్లుండవలెను? అహంకారము లేనివారును, సత్కుల ప్రసూతులును, పెక్కు శాస్త్ర పరిచయము కలవారును, తనుకంటె పెద్దల యాదేశములను పాటించువారును (అయో. 100 స. 11 శ్లో) అగ్నిష్టోమాది పనులను, నిత్యాగ్ని హోత్రము మొదలు అశ్వమేధాంత వైదిక కర్మల నిర్వహించగల దక్షులును, ఊహాపోహాది కల్పన నిపుణులును, ఎదుటను చాటునను ఒకేరీతిగ సంచరించువారును, మనోవాక్కాయ వ్యాపారములపట్ల నొకేరీతిగ నుండువారును -అయి యుండవలయును. రాజుచే నా యా సమయములయందా యా కర్మల నాచరింప జేయుటలో నేమరక యుండవలెను. (12 శ్లో)

ఇట్టి పురోహితులను రాజు దైవమువలె నాదరించవలయును.

## మంత్రు లెట్లుండవలయును?

(Ministery)

దండనీతి, అర్థశాస్త్రము, నీతిశాస్త్రము మొదలగువాటిని బాగుగ నెఱింగినవారును, కూడని పనులను చేయుటకు సిగ్గుపడువారును, నీతి నిపుణులును, నియతేంద్రియులును, సహజము

నాథ్యులును, ఉదారాశయులును, నిరాఘాటగ మైన పరాక్రమము కలవారును, కీర్తి కాములును రాజకార్యముల యందప్రమత్తులును. తలంచినట్లు చెప్పి చెప్పినట్లు చేయువారును, ఓర్పుకలవారును మాత్సర్యము లేనివారును, కోపముచేగాని కామముచేగాని ధనసంగ్రహణార్థమై గాని అసత్యమాడని వారును, స్వరాష్ట్రమునగాని పరరాష్ట్రముల యందుగాని ప్రజలచే చేయబడినది చేయబడుచున్నది చేయబడునది గూఢచారుల మూలమున బాగుగ నెఱుంగువారును, వ్యవహార కౌశలము కలవారును, అపరాధమొనరించిన పుత్రులనైనను ప్రేమించక దండించువారును, అపరాధము లేక శత్రువునైనను దండింపనివారును, ధనసంపాదనమునందును.హ స్త్యశ్వరథపదాతిసైన్య సంపాదనమునందు జాగరూకులై తమరాజును శత్రువులబారినుండి నిర్వ్యోత్సాహ సమన్వితులును, నీతి శాస్త్రమును చదివి యర్థమెఱింగి యనుష్ఠించువారును, తమ రాష్ట్రమున నివసించు సజ్జనుల రక్షించి దుర్జనుల శిక్షించువారును, బ్రాహ్మణులను నిష్కారణము హింసించి వారి ధనముల నపహరింపని వారును, అపరాధుల అపరాధ తారతమ్యమును బలాబలములను లెస్సగ నాలోచించి మృదుపరుష దండనలు విధించి కోశాగారములను నింపువారును, శుభ్రవస్త్రములను ధరించి సుందర వేషములతో సదాచార సంపన్నులై నీతి శాస్త్రమున దృష్టినుంచి తమ ప్రభువును కాపాడువారును, తమ గురువులపట్ల ప్రామాదిక దోషమున్నను లక్ష్యపెట్టక గుణములనే గ్రహించువారును, దేశ కాలముల నరసి సంధికలహముల నొనరించువారును, సహజముగ సంపన్నులగుటచే ధనార్జనకై పెడదారులు త్రొక్కని వారును, సభా రహస్యముల గుట్టును బట్టబయలు చేయనివారును, సూక్ష్మకార్య సమాలోచనలయందు సమయస్ఫూర్తి కలవారును, నమ్మదగినవారును, శత్రువుల ప్రలోభములకు లోబడని జితేంద్రియులును, ఉన్నతమగు ప్రామాణిక వంశములలో జన్మించిన వారును, చేష్టలను జూచి హృదయము నెఱుంగు వారును, మంత్రులుగా నుండదగిన వారు (అయో. సర్గ. 100. శ్లో. 15) రాజు ఇట్టి మంత్రులలో నాయాకార్య గౌరవమును బట్టి కొలదిమందితో మాత్రమె కర్తవ్యమును నిర్ణయించుకొను చుండవలెను. తానొక్కడును విచారించి యేవిషయమును నిర్ణయించరాదు. ఆ కర్తవ్య నిర్ణయము కార్యరూపమును దాల్చువఱకు సదస్యము కారాదు. (శ్లో. 18) ఇట్లాలోచించి మహాఫల ప్రాప్తికై యల్పసాధనములను నిశ్చయించియు నాచరణలో నాలస్యము చేయరాదు. (శ్లో 19) మూర్ఖులను వేయిమందినైనను విడిచి విమర్శించి పనిచేయునట్టి పండితునొక్కనినైనను పరిగ్రహించినచో సార్థకమగు నుపాయముల నుపదేశించి సంరక్షించును. (22 శ్లో) ఇట్టి మంత్రులను లెస్సగ పరీక్షించి పరిగ్రహించిన పిమ్మట వారి వారి యోగ్యతల నెఱింగి ఉత్తమ, మధ్య, అధమ కార్యములలో వినియోగించుచుండవలెను. (శ్లో. 26)

ఇట్టి మంత్రులు అపరాధమునకు మించి దండించుటచే తమ ప్రభువును ప్రజ లసహ్యించుకొనకుండ చూచు చుండవలెను. (27. శ్లో.) శిక్షింపతగని వారిని శిక్షించి వారినుండి ధనార్జన చేయకుండ కాపాడవలెను. అన్యాయముగ ప్రజలను పీడించి పన్నులను పరిగ్రహించకుండ చూడవలెను. (28. శ్లో). ఈ మంత్రులు అంతరంగ

భృత్యులపై లేనిపోని నేరముల నారోపించి వారిని వెళ్ళగొట్టుటకు ప్రయత్నించినను నిర్భయముగ రాజునే హింసింపనెంచినను క్రమశః రాజైశ్వర్య మునంతను అపహరింప నెంచినను అట్టివారిని వెంటనే రాజ్యమునుండి బహిష్కరింప వలెను. (శ్లో. 29)

## సేనాధిపతి యెట్లుండవలెను?
[Commander-in-chief]

తనకు రాజుగావించిన సత్కారములతో సంతుష్టి చెందువాడును, వ్యవహారములలో నేర్పు గలవారును శత్రువులను నిగ్రహించుటలో చాతు ర్యము కలవాడును, ఆ యా సమయానుకూల ముగ తనసేనను వ్యూహముగాపన్ని నడిపించుట లోనుశత్రువ్యూహములను భేదించుటలోనుచాతు ర్యము కలవాడును, ఆపదలు హెచ్చిన కొలదియు హెచ్చుధైర్యము నవలంబించువాడును, ఆంతర బాహ్యశుద్ధికలవాడును సత్కుల ప్రసూతుడును, కార్యనిర్వహణ చతురుడును, ప్రభువునందు విశ్వా సము కలవాడును, సేనాధిపతిగా నుండవలెను. (అయో. 100.స. 30 శ్లో).

## సైనికులెట్లుండవలెను?
[Warriors]

అత్యంత బలాఢ్యులును, యుద్ధసమర్థులును ఇదివరకు పూర్వము కొన్నియుద్ధములలో తమ పౌరుషము చూపి సత్కరింప బడినవారును, శూరులును అయి యుండవలెను. వీరు ప్రాయశః క్షత్రియకుల ప్రసూతులగుట ఉత్తమము. (అయో 100. స. 31. శ్లో.)

రాజిట్టి సేనాధిపతులను, సైనికులను, పారితోషికముల నొసంగి బహూకరించుచుండ వలెను. సకాలమున సాదరముగ భోజన మిడు చుండవలెను. మాసిక వేతనము నాలసింపక యొసం గుచుండవలెను. (32 శ్లో) అట్లుగావింపని వో నాథులు కోపింతురు. అది రాజునకు మహానర్థ దాయకమగును. (33. శ్లో).

## రాయబారులెట్లుండవలెను?
[Embassador]

తన రాజ్యమునందే పుట్టినవాడై యుండ వలెను. మఱియొక దేశముపై పక్షపాతమును గావిం చును. కొద్దిమాటలలోనే పరుల యభిప్రాయ మును తెలిసుకొన సమర్థుడై యుండవలెను. ఇత రుల మాటలకు వెను వెంటనే తగిన సమాధానము నెఱింగినవాడై యుండవలెను. తనకు తన యజ మాని యాదేశించిన పని కనుకూలముగా పెక్కు మాటలాడుచున్నను, తన యజమాని చెప్పిన దానిని మరువక నుడువువాడై యుండవలెను. సమస్త రాజకీయవ్యవహారములలోను పండితుడై యుండవలయును. (అయో. 100. స. 35. శ్లో.)

## గూఢచారి [C. I. D.] విభాగము

(అయో.100.స. 36.శ్లో) శత్రుపక్షమునకు చెందిన మంత్రి, పురోహితుడు, యువరాజు, సేనా ధిపతి, అంతఃపుర ద్వారరక్షకులపై యధికారి అంతఃపురకార్య నిర్వాహకులు, కారాగారాధి కారులు, కోశాధికారులు, రాజాజ్ఞను లోకమున ప్రచారముచేయు అధికారులు, న్యాయాధికారులు (Judges) సేనకు ఆహార వేతనాదుల నొసంగు అధికారులు, రాత్రులయందు నగరద్వారములు

ప్రాకారములు మొదలైనవాటిని కాపాడుటకు రక్షకుల నేర్పాటుచేయు అధికారులు, సైనికులకు గాక మిగిలిన యుద్యోగులకు వేతనములనిచ్చు యధికారులు, సభ నలంకరించుట, సభికుల కుచితములగు నాసనముల నొసంగుట, నాగరికులను సభలో ప్రవేశపెట్టుట, అనాగరికులను సభ నుంచి వెడలగొట్టుట, సభలో నిశ్శబ్దముగా నుంచుట మొదలగుపనులను నిర్వహించు అధికారులు, దాయభాగాదులలో కలహించువారల వివాదమును విని ధర్మశాస్త్రపద్ధతిని పరిష్కరించు నుద్యోగులు (Civil officers), ఇతరుల సొత్తుల నపహరించుట మొదలగు నేరముల గావించిన వారిని రాజాజ్ఞ ననుసరించి కాళ్ళను చేతులను ఖండించుట మొదలగు శిక్షలనొసంగు అధికారులు (Criminal officers) పర్వత, జల, వనాది దుర్గ రక్షణాధి కారులు (P. W. D. and Forest officers), రాష్ట్రపరిహద్దులలో నంతతను శత్రురాజుల యాక్రమణ నరికట్టునట్టి అధికారులు (Boundry Military Officers) వీరి చర్యలను పరిశీలించుటకును, తనకుసంబంధించిన మంత్రి, పురోహిత, యువరాజులుగాక మిగిలిన పదునైదు వర్గాధికారుల పరిశీలనకును, వారితో వారికిగాని, పనులకుగాని తెలియకుండునటుల హెచ్చువేతనములతో గూఢచారులను నియమించి వారిని తాను గుప్తవేషముతో నిరీక్షించుచుండవలెను.

తన మంత్రి, పురోహితులు, యువరాజు సర్వదా తన సమీపముననే యుండుటు గానవారి స్వభావనటులు తనకెప్పుడును గోచరించుచునే యుండును. కావున వారి కొఱకు గూఢచారులను నియమింప నవసరములేదు. మిగిలిన పదునైదు వర్గములకును పైవలెనేగూఢచారుల నేర్పరచి వారి చర్యలను పరిశీలించుచుండవలెను.

## రాజు గమనించవలసిన ముఖ్య విషయములు

దురాచారపరులగుటచే తన రాష్ట్రము నుండి వెడలగొట్టబడి తిరిగి కాలాంతరమున తన రాష్ట్రమునకు వచ్చిచేరిన శత్రువులెంత దుర్బలులైనను నిర్లక్ష్యముచేయక వారి చర్యల నెల్లప్పుడు గమనించవలెను. (అయో. 100స. 37. శ్లో)నాస్తికులగు బౌద్ధులు, చార్వాకులునగు బ్రాహ్మణులు, ధర్మానుష్ఠానమున శ్రద్ధలేనివారై తత్త్వజ్ఞానమును కలుగనీయని అజ్ఞానముకలవారై తమను పండితులుగ భావించుచు వేదమార్గములను దూషించుచుందురు. (38 శ్లో) వేదార్థముల నతిక్రమించు మహర్షి ప్రణీతమై సజ్జనులచే నాదరింపబడు ధర్మశాస్త్రములున్నను వాటినానరించి శుష్కతర్కములతో ప్రజలకు దుర్బోధలను గావించుచు సజ్జనులను బహిష్కరించుచు అనర్థములకు పాలగుచుందురు. రాజట్టివారిని బొత్తిగా దరిజేరనీయరాదు. (39. శ్లో) దేవ, పితృ, మాతృ, గురు, పితృసమ, వృద్ధ, వైద్య, బ్రాహ్మణాదులపట్ల గౌరవమునుంచి యాదరముగా ప్రవర్తించవలయును. అనగా దేవతలను యజ్ఞాదులచే నారాధించుట, తల్లి దండ్రులకు శుశ్రూష జేయుచు వారి యాజ్ఞలను శిరసావహించ వలయును. గురువుల ననువర్తించి వారికభీష్టములైన వాటి నాచరించవలయును. బ్రహ్మజ్ఞానముగల పండితులను సేవించి శుశ్రూషలు సలుపవలెను. పితృతుల్యులగు జ్ఞానులను ధనప్రదానాదులచే నాదరించవలయును. జ్ఞానశీలవయస్సులచే వృద్ధులగువారికి నమస్క

రించవలెను. వైద్యులను పుష్కలధనాదులతో తనుపవలెను. (13. శ్లో) సకాలమున నిద్రాజాగర ణలుండవలెను. అపరరాత్రులయందు ధనలాభో పాయముల నాలోచించవలయును. (అయో. 100 స. 17. శ్లో) చేయనిశ్చయించిన కర్మలను చేయక మునుపే సామంతు లెఱుంగకుండునట్లు భద్రపరచ వలెను. వృద్ధులను, బాలులను, వైద్యులను ఇష్టమైన వస్తువులనిచ్చియు, మనసార ప్రేమిం చియు, వాచా ఓదార్చియు స్వాధీన పరచుకొన వలయును. (60. శ్లో) నాలుగువీధులు కలియు చున్న స్థానమందున్న దేవతావాసములగు మహా వృక్షములకును, యజ్ఞయాగాదుల నాచరించి లబ్ధప్రతిష్ఠులగు బ్రాహ్మణులకును, గురువులకును. వృద్ధులకును, తాపసులకును, దేవతలకును,అతిథు లకును, నమస్కరింపవలెను. (61. శ్లో)

వేదత్రయము, కృషి, గోరక్ష- వాణిజ్య ములు, నీతిశాస్త్రమున నీమూడును రాజు లకు మూడువిద్యలుగా పరిగణింపబడినవి. రాజు వీటియందు నిపుణుడై యుండవలెను. ఇంద్రియ ములు స్వాధీనము నందుండవలెను.(అయో. 100. స. 68 శ్లో)

శత్రువులతో సంధిచేసుకొనుట, యుద్ధము చేయుట, దండెత్తుట, సమయమును నిరీక్షించుట మిత్రభేదము, ప్రఖ్యాత బలాఢ్యుని ఆశ్రయించి యుండుట, శత్రువునకు వశమగుట-అనునివి షడ్గు ణములనబడును. వీటిని లెస్సగ నెఱింగి యథోచిత ముగ వీనినుపయోగించ వలయును. (అయో100స. 69. శ్లో.) యజమానిపలన సరియగు వేతనము లభింపనివాడు, అవమానింపబడినవాడు, కోపింప బడినవాడు, భయపెట్టబడినవాడు, రాజుపై కక్ష వహించియుందురు. ఇట్టి వారి కభిమతములగు ధనాదులనిచ్చియు, మిత్రభేదము గావించియు స్వాధీనపరచు కొనవలయును.

రాజునకు యాత్రావిధాన మెఱుంగుట ముఖ్యావసరము. ఇది యైదు విధములు. (అయో 100. స. 70 శ్లో)

1 పార్ష్ణిగ్రాహులనబడు పృష్ఠ భాగమునం దుండు రాజులతో కలహించి ప్రధాన శత్రువుపై దండెత్తుట. ఇది 'విగృహ్యయాన' మనబడును.

2 పార్ష్ణి గ్రాహులతో సంధి గావించుకొని ప్రధాన శత్రువుపై దండెత్తుట 'సంధాయయానము'

3 సామంతులతో కలసి దండెత్తుట 'సంభూయ యానము'

4 ఒకనిపై దాడివెడలునట్లు ప్రసంగించి మరి యొకరిపై దాడివెడలుట 'ప్రసంగయానము'

5 ఒకనిపై దాడి వెడల సంకల్పించి యాతడు బలవంతుడని యెఱింగి దానిని విరమించి యాతని మిత్రునిపై దాడివెడలుట 'ఉపేక్షయానము'

రాజు సేనావ్యూహ విభేదములను చక్కగ నెఱింగియుండవలెను.

వేదముల నధిగమించి వాటిని అగ్ని హోత్రాద్యనుష్ఠానములచే సఫల పరచవలెను. న్యాయముగా సంపాదించిన ధనములనుదానముల చేతను సఫలపరచవలెను. శాస్త్రోక్తముగా వివా హమాడిన భార్యలను సంతానముతో సార్థకపరచ వలయును. పెద్దలవలన విన్న శాస్త్రార్థములను సత్స్వభావ సదాచారములచే సమాచరించ వల యును. పితృ పితామహులచే త్యజింపబడు మార్గ మును లేశమైనను తప్పరాదు.భోగ్యములగు పదా ర్థములను ఒంటరిగా తినరాదు. (అయో. 100. స. 72. శ్లో)

రాజు ముఖ్యముగా జాగ్రత్త వహించ వలసిన పదునాలుగు దోషములు. (అయో.100. స. 65, 66, 67, శ్లో)

(1) పరలోకము లేదని నమ్ముట. (2) అబద్ధములాడుట. (3) తల్లి, తండ్రి, గురువు, బ్రహ్మజ్ఞులు, దుర్బలులు — తప్పుచేసిరని కోపించుట. (4) అజాగ్రత్త (5) ముఖ్యకర్తవ్యకర్మలకు ఆలసించుట. (6) నిఖిలశ్రేయోనిదానములగు సజ్జనులను దర్శించకుండుట (7) మత్తునొసంగు పదార్థములను సేవించి నిత్యకృత్యములను నిర్వహింపజాలకుండుట. (8) పంచేంద్రియములకు పరవశుడగుట (9) మంత్రి సహకారము లేక తనంతనే రాజ్యకార్యముల నాలోచించుట. (10) విరుద్ధాభిప్రాయములు గలవారితో నాలోచించుట. (11) తీర్మానించిన ముఖ్యాంశముల నాచరణలో బెట్టకుండుట. (12) రహస్యములను సదస్యమొనర్చుట (13) నిదురలేవగనే ప్రాతఃకాలమున మంగళద్రవ్యముల నవలోకింపకుండుట. (14) నీచులను లేచి యాదరించుట. నానాదిశలయందున్న శత్రువుల నొక్కసారిగా ముట్టడించుట. ఈ పదునాలుగు దోషముల కెన్నడును తావీయరాదు.

అగ్ని, జలము, వ్యాధి, కరవు, మరణము అను నీయైదును దైవిక వ్యసనములు. దుష్టులు, దొంగలు, శత్రువులు, రాజ బంధువులు, లుబ్ధుడగురాజు,— అను నీయైదు గురి వలనను సంభవించు వ్యసనము మానుషమనబడును. ఇవి రాకుండుటకై దైవిక లౌకిక విధానము లాచరించుచుండవలెను.

## దశవర్గాదిపాలనము
(అయో॥ 100 స. 68, 69, 70 శ్లో)

రాజులకు పరిగ్రహించుటకును, పరిత్యజించుటకును సర్వమగు పెక్కువర్గములు గలవు. వాటి విషయమై రాజు మిక్కిలి జాగ్రత్తను వహించవలసి యున్నది. అవి త్రివర్గములు, చతుర్వర్గములు, పంచవర్గములు, సప్తవర్గములు, అష్టవర్గములు, దశవర్గములు, వింశతివర్గములు నని పెక్కువిధములుగా నున్నవి. వాటి నీ క్రింద వివరించుచున్నాను.

త్రివర్గము:— ధర్మార్థకామములు త్రివర్గములని కొందఱును, ఉత్సాహ ప్రభుమంత్రశక్తులు త్రివర్గముల మరికొందఱును, శత్రువుల యొక్క క్షయ స్థానవృద్ధులు త్రివర్గములని మఱికొందఱును, తాను చేయజాలని పనుల నారంభించుట చేయగలవాటి నుపేక్షించుట, వాటినైనను వేళగాని వేళ చేయుట కుద్యమించుట త్రివర్గమని కొందఱును చెప్పుచున్నారు,

చతుర్వర్గము:— సామదాన భేద దండములు చతుర్వర్గమనియు, గర్భసంబంధము చేతను, వివాహ సంబంధము చేతను, దుర్వ్యసన విమోక్షణముచేతను తటస్థించిన మిత్రులే చతుర్వర్గమనియు, న్యాయముగా ధనము నార్జించుట, దానిని కాపాడుట, పెంపొందించుటసత్పాత్రులకై వినియోగించుట చతుర్వర్గమనియు చెప్పుదురు.

పంచవర్గములు:—

జలస్థానములు [Irrigation]

పర్వత ప్రాంతములు (Hill tracks)

అడవులు(Forests ) మాదక పదార్థ విక్రయ

శాఖలు (Excise departments) ఆయుధాగారములు (Armory) పంచవర్గములనిగాని, జ్ఞాతి శత్రువులు, వస్తుసంబంధి విరోధులు, స్త్రీ సంబంధి విరోధులు అపకారమువలన నేర్పడిన శత్రువులు పంచవర్గమనిగాని చెప్పుదురు.

సప్తవర్గము:-

ప్రభువు, మంత్రులు, రాష్ట్రము, దుర్గము కోశము, బలము, మిత్రులు - అనెడు పరస్పర సహకారమొనరించు సప్తాంగములకును సప్తవర్గమని పేరు. ఆప్తబంధువు, మిత్రుడు, ఆశ్రితుడు, ఆప్తబంధు సంబంధి కార్యవశమున దరిజేరినవాడు భృత్యుడు, వివిధోపచారములచే నారాధింపబడి పరిగ్రహింప బడినవాడు సప్తవర్గమనియు చెప్పుచున్నారు.

అష్టవర్గము:-

వ్యవసాయము, వ్యాపారము దుర్గములు, వంతెనలు, గజబంధనములు, ఖనిజములు, గనుల స్థానములు, పన్నుల వసూళ్ళు, శూన్యగృహ సంరక్షణము—అనునవి యష్టవర్గ మనబడును,

చాడీలుచెప్పుట, అక్రమ సాహసము, ద్రోహము, ఈర్ష్య, అసూయ, వృథాధనవ్యయము, కఠినోక్తులు, అపరాధమునకు మించిన శిక్ష అనునవియు అష్టవర్గమనబడును.

దశవర్గము:- దశవేటలు

వేట, ద్యూతము, పగటినిద్ర, దెప్పుట స్త్రీ వ్యామోహము, నృత్యగీతవాద్యాసక్తి వ్యర్థ పర్యటనము, ధనాశ—అను నీ పదియు దశవర్గమనబడును.

కామందకుడు లోభము, క్రోధము, బద్ధకము, అసత్యము, ప్రమాదము, పిరికితనము,—అస్థిరత్వము, మూర్ఖత, అన్యాయము, అవమానము అను పదింటిని దశవర్గముగా పరిగణించెను.

వింశతివర్గము:-

బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి. జ్ఞాతులచే బహిష్కరింపబడినవాడు, పిరికివాడు, పిరికివారగు మంత్రి సేనాధిపతియోధులు కలవాడు, ధనాశాపరులగు సేవకులు కలవాడు, లోభి, విషయలంపటుడు, రహస్యమును గుప్తపరచజాలనివాడు, దేవతలను బ్రాహ్మణులను నిందించువాడు శాపగ్రస్తుడు, అదృష్టముపై భారముంచి పురుష వ్యాపారమును విడచి కూర్చుండువాడు, కరువులకు కారణమగు దుర్వ్యసనములు కలవాడు, నశించిన సైనికులు కలవాడు, స్వదేశమును విడచినవాడు, మిక్కిలి శత్రువులుకలవాడు, క్రూరగ్రహదశపాటు గలవాడు, సత్యమును తప్పినవాడు, ధర్మమును తప్పినవాడు—అను నీయిరువదిమందితో నెన్నడును సంధిచేసుకొనరాదు. వారితో కలహించి వారిని స్వాధీనపరచుకొనుటయే కర్తవ్యము.

## రాజు రాజధాని నెట్లుంచవలెను ?

(అయో. 100. 40 శ్లో. మొ 52 శ్లో)

—రాజధానిని వీరులచే నిరంతరము కాపాడుచుండవలెను. గజ తురగ రథ పదాతులనెడు చతురంగ బలములతో నింపియుంచవలెను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులు తమతమ వర్ణాశ్రమ ధర్మములను గీటువాసియైనను దాటకుండ చూడవలయును. పూజ్యులును, ఉత్సాహవంతులును, జితేంద్రియులునగు ననేక మహాత్ముల నాదరించి యుంచవలయును. సుప్రసిద్ధులగు

వైద్యుల నాసరించవలెను. మహా యజ్ఞాది పవిత్రమైన వైదికకర్మలను జరుపుటకు వీలైన గొప్ప భవనములను నిర్మించి యుంచవలెను. రాజు మంచివాడగుటచేతను, అనుకూలవర్షములచే నీరు పాడి పంటలకు లోటు లేకుండుటచేతను, ఆరోగ్య వంతముగుట చేతను, యుక్తమగు వెలకు పదార్థములు లభించుట చేతను, ఇంకను ఇట్టి పెక్కునవతులుండుటచే, ప్రజలాకృష్టచిత్తులై యీ దేశమును విడచి మఱియొక దేశమునకు పోకుండ నుండునట్లు చేయవలెను. దేవాలయముల పవిత్రత చెడకుండ కాపాడవలెను. మార్గములయందంతటను నీటి సౌకర్యములకై చలివేందరముల నేర్పరచవలెను. సస్యములు చక్కగ ఫలించుటకాధారములగు గొప్పచెఱువులను కాలువలను త్రవ్వించి కాపాడుచుండవలెను. సుప్రసిద్ధులగు పండిత ప్రకాండులచే ధర్మనిర్ణయసభలు గావించుచుండవలయును. నదీతటాకాది తీరములయందు నియతములగు వారములలో సర్వజన విదితమగు నట్లు సమస్త వస్తు విక్రయ సౌకర్యములతో సంత లేర్పరచ వలయును. వ్యవసాయమునకు యోగ్యమగు భూముల నన్నింటిని చక్కగ సాగుచేయించుచుండవలయును. గోవులు మేకలు మొదలగు పశువులను సమృద్ధిగా పోషించవలెను. అతివృష్టి అనావృష్టి, ఎలుకలు, మిడతలు, పక్షులు మొదలగు ఈతిబాధలు లేకుండ చేయవలెను. ప్రజలొకరి నొకరు హింసించుకొనకుండ చూడవలయును. సామాన్యముగ భూములన్నియు నదీజలములతోనే ఫలించునట్లు చేయవలయును. అక్కటచ్చట ఆరామముల (Parks) నిర్మించి రమణీయముగా నుంచవలయును. క్రూరజంతువులవలన ప్రజలను కాపాడుచుండవలెను. దేశమునందు దెచ్చటను దొంగ భయములేకుండ కాపాడవలెను. రత్న సువర్ణ లోహాది గనులను కనిపెట్టి జాగ్రత్తగా కాపాడవలెను. వెతికి వెతికి పాపాత్ములను పారద్రోలవలయును. వ్యవసాయము, గోరక్షణము, వర్తకములకు సౌకర్యముల నేర్పరచి ప్రజల యభిమానము చూరగొనవలయును. దొంగ వ్యాపారము (Black markets) ల నరికట్టవలయును. నిగూఢమార్గములచే ప్రజల యిష్టానిష్టముల నెఱింగి వారిని కాపాడు చుండవలెను. ఆపన్నులగు స్త్రీలను కాపాడవలెను. వారు పరపురుషుల పాలి పడకుండ చూడవలయును. స్త్రీల భాషణములను యదార్థములని నమ్మరాదు. వారితో రహస్యాలోచనములను సలుపరాదు. ఏనుగులు, గుఱ్ఱములు పుట్టునట్టి ముఖ్య స్థానములను భద్రపఱచు చుండవలెను. వాటిని సంపాదించుటలో తృప్తిని చెందరాదు. రాజు తనయొక్క ఆరోగ్యమునుగూర్చి ప్రజలకు శంకజనింపకుండుటకై ప్రతినిత్యము ఉదయమున నలంకరించుకొని సభలో దర్శనమిచ్చుచుండవలెను సేవకుల కన ర్గళముగా దర్శనమిచ్చుచున్నచో గర్వముచే ననాదరము ప్రబలును. లోపిగ దర్శనమీయ నిచో వారి పనులు తెలుపుకొన నవకాశము లేకుండుటచే వారు కోపగింతురు. రాజ కార్యము చెడును. కావున రాజు మధ్యమరీతి నవలంబించవలెను. అనగా యథోచిత్త సమయములలో వారికి దర్శన మొసంగుచుండవలెను. (అయోధ్యా 100 స 52 శ్లో)

## దుర్గరక్షణ విధానము

దుర్గములనగా జలనిర్గమ స్థానములు (Projects) పర్వతమార్గములు Hill tracks

అటవీసలములు (Forest ranges) మత్తుపదార్థములు (Excise) ఆయుధాగారములు (Armory) మొదలగునవి. వీటిని ధనము, ధాన్యము మొదలగు ఆహారపదార్థములు నీటి వసతులు, ఆయుధములు, యంత్రములు, శిల్పులు వీరులగు యోధులు మొదలగు వాటిచే నింపి సర్వదా భద్రపఱచుచుండవలెను. (అయో 100. స. 53 శ్లో.

ఆదాయవ్యయములు

ప్రజల కధికమగు నొత్తిడి నీయకయే తగిన్ని విధములుగా మధుమక్షికా న్యాయముతో నాదాయమును పెంపొందించనలయును. ఆదాయమునకు మించిన వ్యయమును చేయరాదు, (53 శ్లో) దేవాలయములందలి పూజా విధానములకు, శ్రాద్ధవిధానములకు, బ్రహ్మజ్ఞాన సంపన్నులకు, అతిథులకు, యోధులకు, వైద్య వసతులు, విద్యావసతులు, ప్రయాణ వసతులు, వ్యాపారవసతులు మొదలగు వాటికై చేయువ్యయము సద్వ్యయముగా పరిగణింపబడును. కరణత్రయములచే పరిశుద్ధుడగు నొకానొక సజ్జనుడు నిష్కారణముగా చౌర్యాది నేరములు మోపబడి పట్టుకొనబడిన యో శాస్త్రకుశలులగు ప్రాడ్వివాకులచే లెస్సగా పరీక్షింపబడవలెను. గాని ధనాశచే నిష్కారణముగా శిక్షించరాదు. (56 శ్లో) దొంగ సొత్తుతో పట్టుకొనబడిన దుర్జనుడు తాను దొంగిలించిన ధనమునంతను ఇచ్చెదననుటచే లోభించి యాధనమును గ్రహించి శిక్షింపక యాతని విడువరాదు (57 శ్లో) ధనికునకును దరిద్రునకును వివాదము తటస్థించినచో ధనాశలేని శాస్త్రకుశలులగు మంత్రివర్యులచే పరిష్కరింప జేయవలెను. (58 శ్లో) కేవలభోగానుభవమునకై రాజ్యమును పాలించుచు న్యాయాన్యాయములను విచారింపక నిష్కారణముగ నిరపరాధులను శిక్షించినచో వారి కన్నీరు రాజుయొక్క పుత్ర పశు ప్రభృతులను నశింపజేయును. రాజునకు ప్రాతః కాలమున ధర్మము నాచరింపవలెననియు, మధ్యాహ్నమున ధనము నార్జింపవలెననియు, సాయంకాలమున కామోపభోగము ననుభవింపవలెననియు నియమము కలదు. ఈ నియమముల నుల్లంఘించి యా యా కార్యములను బాధించరాదు. (62 శ్లో) ధర్మమునువిడచి ధనము నార్జింపరాదు. ధర్మమును పురస్కరించుకొని కుటుంబనిర్వాహణమున కవసరమగు ధనమును బాధింపరాదు. వేశ్యాలంపటుడై ధర్మార్థములను నశింపజేయరాదు. (63వ శ్లో.) సకలశాస్త్ర పారంగతులగు బ్రాహ్మణులకును, మహాప్రాజ్ఞులకును తగిన దక్షిణలనిచ్చి తన క్షేమమునకై దేవతా ప్రార్థనల చేయునట్లు ప్రవర్తింప జేయవలెను.

## నాస్తికులవిషయమై శ్రీరామచంద్రుని యభిప్రాయము ?

భరతునకనేక రాజధర్మములను బోధించుచు శ్రీరామచంద్రుడు

"కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే !
అనర్థ కుశలా హ్యేతే బాలాః పండితమానినః
ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదన్తితే॥
(అయో॥ 100 స. 38, 39 శ్లో.)

లోకాయతికులనగా నాస్తికులగు బౌద్ధ చార్వాకాదులు. వారు తత్త్వార్థముల నెరుంగరు.

అనర్థములలో జాగరూకులై యుందురు. తమకు ధర్మానుష్ఠానమున విశ్వాసము లేకుండుటయే గాక సజ్జనులను బహిష్కరించుటకు తమ చాతుర్యమునువినియోగించుచుందురు. తత్త్వజ్ఞాన విమూఢాత్ములయ్యును తమను పండితులమని ప్రశంసించుకొందురు. వేదమార్గ విపరీతబుద్ధికల వారగుటచే సాత్త్విక మహర్షి ప్రణీతములై సజ్జనాదరణీయములై పరంపరగా నాదరింపబడుచు వచ్చుచున్న పెక్కు ధర్మశాస్త్రములున్నను శుష్కతర్కవాదములతో నవిచున్నియు విఫలము లని యందురు. ఇట్టి వారి నాదరించకుండుటయేగాక తన రాష్ట్రమునుండి వెడలగొట్ట వలయునని శ్రీరామచంద్రుడు భరతునకు సెలవిచ్చెను.

రాజు పరిత్యజించవలసిన చతుర్దశ దోష ములలో "నాస్తిక్య మనృతం క్రోధ" మ్మని ప్రథమముగ నాస్తికత్వమునే యుటంకించెను. తన వైదిక మంత్రులలో నొకడగు జాబాలి భరతుని సంకల్పమును సాధించుటకై

"సనాస్తి పరమిత్యేవ కురు బుద్ధిం మహామతే!
ప్రత్యక్షం యత్ తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు"

అని యుపదేశించినపుడు రాముడుగ్రుడై

"నిందామ్యహం కర్మపితుః కృతం తత్
యస్త్వామగృహ్ణాత్ విషమస్థ బుద్ధిం।
బుద్ధ్యానయైవంవిధయా చరంతం
సునాస్తికం ధర్మపథాదపేతమ్॥"

అనగా "అవైదికమార్గ నిష్ఠాతుడవై నీవు చెడుటయే గాక యిట్టి బుద్ధిని పరులకుపదేశించి వారిని చెడ గొట్టినట్టియు వైదిక వేషముతో చార్వాకమత ప్రవర్తకుడవగు నిన్ను వైదికకర్మల నుపదేశించు మంత్రిగా పరిగ్రహించిన నాతండ్రి చేసిన అవివేక కృత్యమును నేను నిందించుచున్నాను.

"యథాహి చోరః తథాహి బుద్ధః
తథాగతం నాస్తికమత్ర విద్ధి॥
తస్మాద్ధి యశ్శంక్యతమః ప్రజానాం
న నాస్తికేనాభిముఖో బుధస్స్యాత్॥"

అనగా బుద్ధుడు నాస్తికుడు. దొంగనువలెనే యట్టి నాస్తికుని దేశమునుండి బహిష్కరింపవలెను. కావున ప్రజలెవ్వని నాస్తికునిగా శంకింతురో బుద్ధిమంతుడు వానిముఖమునైనను చూడరాదు." అని హుంకరించెను. అదివిని జాబాలి "శ్రీరామ చంద్రా! నన్ను మన్నింపుము. నేను నిజముగ నాస్తికుడనుకాను. నే నాస్తికాగ్రేసరుడను. నీవేవిధముగనైనను పట్టణమునకు విచ్చేసి సింహాసనము నలంకరించి భరతునితోబాటు ప్రజలదుఃఖమును బాపుదువనియు నీయొక్క యవిచాల్యమగు వేదమార్గనిరతి లోకమునకు తెలియవలెననియు భరతుడానందించవలెననియు నిట్లు నాస్తికమతోపన్యాసము గావించితిని. నన్ను మన్నింపు" మని వేడుకొనెను.

## ముగింపు

శ్రీరామచంద్రుడిట్లు భరతుని తన వడి యందిడుకొని యాదరముతో నుపదేశించిన రాజ ధర్మములను శ్రద్ధగా నాదరించి గురుయానుకూల ముగ కర్తవ్యములను పాలించుచు, అకర్తవ్యము లను పరిత్యజించుచు రాజ్యమును నడిపించె నదియే రామరాజ్యమనుటలో నేమి సంశయము? ఇట్టి యుద్ధనేత లేల శ్రీరామచంద్రుని ఆశీస్సులకు పాత్రులుకారు? ఆనాటి ప్రజలవలెనే నీనాటి ప్రజలేల సకల సుఖముల బడయజాలరు?



# ఆంధ్రదేశములో శ్రీ జీయర్ స్వామివారి పాదయాత్ర

( గత సంచిక తరువాయి )

వైశాఖ మాసము ప్రారంభము
30-4-57 శ్రీకూర్మము

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజ జీయర్ స్వామివారు శ్రీకూర్మములోనే యీనాడు వేంచేసియుండిరి. వీరివెంట శ్రీకవిగారు అన్వయించి యుండిరి.

ఈ శ్రీకూర్మ క్షేత్రములో 4, 5 దినములుండి శ్రీకూర్మనాథుని, శ్రీవైష్ణవ భాగవతగోష్ఠిని సేవించుకొని శ్రీకాకుళము వెళ్ళ నిశ్చయించుకొంటిమి. కాని యిచ్చట దాదాపు 15 రోజులు పట్టినది.

ఏమి విశేషమందురా!

ఈ శ్రీకూర్మక్షేత్రమును శ్రీభగవద్రామానుజులు చాల శ్రమపడి సంపాదించిన దివ్యదేశము. ఆనాడు ఈ క్షేత్రము శైవులు మాదియనియు శ్రీ వైష్ణవులు మాది యనియు కలహింపసాగిరి. అప్పుడు శ్రీరామానుజులు విచ్చేయుట చూచి, శైవులు ఈ దేవుడు మీవాడైనచో తూర్పు దిక్కుగా నున్న శ్రీ కూర్మనాథుడు పశ్చిమ ముఖముగా దిరిగినచో మేము యీ క్షేత్రమును మీకిచ్చి శ్రీకాకుళమువరకు లేచిపోదుమనిరి. సరేయని విమమ పరీక్ష వచ్చినది. ఆ పరీక్షలో నెగ్గినవారు మన యతిరాజులు. యతిరాజు ప్రార్థనతో తూర్పుకు దిక్కుగా నున్న శ్రీ కూర్మనాథుడు పశ్చిమ దిక్కుగా తిరిగెను. అది మొదలు ఈ క్షేత్రము శ్రీవైష్ణవ క్షేత్రమయ్యెను. ఇట్టి మహోపకారము నొనరించిన శ్రీ రామానుజులవారి తిరునక్షత్ర మహోత్సవము పదిరోజులు జరుపుటకు శ్రీమాన్ శ్రీభాష్యంతిరుమల రామానుజాచార్య, శ్రీకూర్మాచార్యులుగారు మహావైభవముగా ప్రారంభించినారు. ఈ ఉత్సవ గోష్ఠి విడిచి వెళ్ళుటకు మనసు సమ్మతించినది కాదు. అందువల్ల చాత్ మొరవరకిందే యుండ నిశ్చయించుకొంటిమి మరియొక విశేషము. ఇచ్చట ధ్వజస్తంభ జీర్ణోద్ధరణకై శ్రీ స్వామివారు సంకల్పించిరి. ఇందుకుగాను ఒకనాడు శ్రీ స్వామివారు గ్రామములో భిక్షపట్టిరి. దాదాపు 1200 లరూపాయలు ప్రోగైనది. ఇంకను 400 లు కావలసి యున్నది. ఆ కైంకర్యం పెంకిటి శ్రీ కూర్మనాయకుడు శ్రీ స్వామివారికి కృపచేసినాడు. ఆ ప్రయత్నములో కూడ శ్రీస్వామివారు నిమగ్నులై యున్నారు. కొంత, ఇచ్చట ఉదయవరుల చాత్ మొర 3 రోజులు పండిత సభలు పెట్టించుటకు సంకల్పించిరి. శ్రీగామతీర్థం, సింహాచలం, పద్మనాభం, బరంపురం, ఇచ్ఛాపురం, సోంపేట, పలాస టెక్కలి, కోటిపల్లి, సుబ్బమ్మపేట, నరసన్నపేట, కళింగపట్నం, శ్రీకాకుళం, శ్రీకూర్మం, విజయనగరం, బొబ్బిలి, ఇత్యాది గ్రామములలో వేంచేసియున్న శ్రీవైష్ణవ విద్వాంసులను ఆహ్వానించి వీరిని యొక కమిటీగా ఏర్పాటు చేసి ప్రతిమాసము వీరిచే నొక్కొక్క గ్రామములో పండిత సభలు పెట్టించుటకు తగిన ఏర్పాట్లు చేయుచుండిరి. ఈ సభలోనే మహిళా సభలుకూడ జరిపించుటకు వలయు యత్నములు జరిగినవి. ఇన్ని సంకల్పములు శ్రీకూర్మములో సాఫల్యము చెందవలసి యున్నది. తదర్థమై యిన్ని రోజులందు యుండవలసి వచ్చినది.

ఈ నాటి సాయంకాలము గరికొండ, వసంత మండలి. మనమొక యపూర్వమైన స్థలమునకు వెళ్ళితిమి. ఆ కొండయెక్కితిమి. ఆకొండమీద మహోన్నత రాజసౌధమున్నట్లు శిథిలదృశ్యములు కానిపించినవి. ఒకనాడిచ్చట శృంగార వైరాగ్యములకు పోరు జరిగినది. తుదకు వైరాగ్యమే విజయధ్వజ మెత్తినది. ఈ గరికొండ ఒకనాడు పెద్దరాజాస్థానము, ఆస్థానములో రాణి ఏకాదశివ్రతములో నుండగా రాజు వాంఛించుట జరిగినది. ఈరేయి ఎట్లైనను తప్పించి ఏకాదశి వ్రతమును కాపాడుమని రాణి ప్రార్థింపగా ఆ యిరువురి మేడల మధ్యగా వంశధారానది ప్రవహించినది. రాజు యారాత్రి రాణీ యంతఃపురమునకు వెళ్ళలేక పోయెను. ఇది నిజమ, యబద్ధమా యని శ్రీజీయర్ స్వామివారితో పాటు ఆస్థల

మునకేగి చూచితిమి. సత్యముగా కనిపించినది. ఆ శిథిలమైన రాజ ప్రాసాదము వంశధారానదిలో లీనమై శిలాప్రాయముగా కనిపించిన యా రాణీశుద్ధాంతము, అ పరిసర ప్రాంతమంతయు చూచితిమి. ఒక అరమైలు వరకు కొండ నెక్కితిమి. కొన్నాళ్ళకీ ప్రదేశ బౌద్ధభిక్షువులకు నివాసస్థానమై పోయెను. ఇటీవల గవర్నమెంటువారు బౌద్ధదృశ్యాలను కొన్నిటినితీసి భద్రపరచినారు. ఇవి యన్నియుచూచి సాయంకాలమునకు తిరిగి శ్రీకూర్మమునకు చేరుకొంటిమి. ఈ గనికొండ వెళ్ళునపుడు బూరగవల్లి వెళ్ళుట తటస్థించినది. అచ్చట శ్రీమాన్ ఆరవిల్లి కన్న బాజగి పాలాచార్యులుగారు మమ్ము ప్రీతి పూర్వకముగా ఆదరించి కమ్మని టెంకాయనీరుతో విందుచేసి మాతో గనికొండ వచ్చి ఆ దృశ్యములన్నియు మాకు చూపినారు. రాత్రి యథాప్రకారముగా శ్రీకూర్మనాథుని సన్నిధిలో యతిరాజులవారి తిరునక్షత్ర మహోత్సవ గోష్ఠితో సభ ప్రారంభమైనది. శ్రీకవిగారు హనుమద్రామ సమావేశమును కావ్యగానము చేసిరి. తదుపరి శ్రీస్వామివారు మృధుమధురముగా "దర్పోదగ్రదశానన" అనే శ్లోకమెత్తుకొని మనము లంకలోనున్న సీతాదేవి పరిస్థితిలో నున్నామనియు సీత రాముని వీడి లేడిని కోరుట, భాగవతోత్తముడైన లక్ష్మణుని నిందించుట. ఈ భగవద్భాగవత నిరాకరణతో పదితలలుగల రావణుడువచ్చి లంకలో బంధింపగా, రామ రామ, యని యేడ్చుచుండగా హనుమంతుడువచ్చి శుభవార్త నెరింగించి క్రమముగా భగవత్సంబంధము కలిగించినట్లు మనముకూడ అసహ్యములైన భగవద్భాగవతాప చారములతో బద్ధులమై యుండగా పదియింద్రియములుగల మనస్సనే రావణుడు పట్టుకొను దేహమనేలంకలో బంధించినారు. ఇప్పుడు మనమేమి చేయవలెను. ఆసనములు వేయవలెనా, శ్వాసాలు బిగపట్టవలెనా కర్మయోగము చేయవలెనా! యజ్ఞ యాగములు చేయవలెనా! ఏమిచేయవలెను. సీత రామ రామయని ఏడ్చినట్లే వానిని గూర్చి ప్రార్థించవలెను. అప్పుడు హనుమంతుడువంటి ఆచార్యుడువచ్చి భగవన్ముద్రను జూపి చల్లని సందేశమిచ్చును. ఆ ముద్రియే సుదర్శన ముద్ర. ఆ ముద్రను ధరించి ఆయాచార్యుని మాటలు నమ్మియుంటే నేని రాముడు వచ్చి సీతను విడిపించినట్లుగా మనలను గూడ భగవంతుడే ప్రకృతి బంధమును విడిపించును. ఈ పవిత్ర సందేశమును ఒక గంట కాలము స్వామివారుపన్యసించి సభ్యుల నానందపరచిరి. తరువాత తీర్థప్రసాద గోష్ఠి జరిగెను.

1—5—57 శ్రీకూర్మం

ఈ నాడు వేగుఝామున తిరువీధి గోష్ఠితో జరుపవలసిన సహస్రనామ పారాయణ. శ్రీ స్వామివారికి తిరుమేనిలో అనారోగ్యముచేత బసలోనే జరిగినది. జ్వరము బాగా వచ్చినది. అట్లైలేచి ఉష్ణోదకములో స్నానమాడి శ్రీస్వామివారు తిరువారాధన గావించి సన్నిధికి వేంచేసి వచ్చిరి. ఇంతలో గుంటూరు నుండి శ్రీరామ నామక్షేత్రభక్తసమాజమువారుప్రచారార్థమై శ్రీకూర్మమునకు విచ్చేసిన బసలో శ్రీ స్వామివారిని దర్శించి అరగంట కాలము, భగవద్గుణానుభవము గావించిరి. యథారీతిగా ప్రాభాతిక కార్యక్రమము జరిగిపోయినది. మరల సాయంకాలము సన్నిధిలో సభ ప్రారంభమయ్యెను. శ్రీస్వామివారు తిరుమేనిలో కొంచెమనారోగ్య మున్నందున సభకు వేంచేయలేదు. శ్రీ కవి నారాయణగారు శ్రీరామానుజ శబ్దార్థమును విశదీకరించిరి. ఆ పిదప కవిగారు ఋష్యమూకావ్యగానము చేసిరి. తదుపరి తీర్థప్రసాద గోష్ఠిజరిగెను.

2—5—57

ఈ నాడుదయం ప్రాభాతిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణాత్మక తిరువీధిగోష్ఠి బసలోనే జరిగినది. శ్రీ స్వామివారికి జ్వరముతగ్గి నీరసముగా నుండుటచే శ్రీవారి బసయందే పారాయణ జరిగినది. తరువాత బసలో తీర్థప్రసాదగోష్ఠిని నిర్వర్తించి సభామండపమునకు వేంచేసిరి. పండిత సభా కార్యక్రమము ప్రారంభింప బడెను. వైదిక వ్యక్తితో సభ ప్రారంభ మయ్యెను. అధ్యక్ష స్థానము శ్రీమాన్ ఉ. వె. తి. పల్లెర్లమూడి రామానుజ స్వామివారు వహించిరి. శ్రీమాన్ శ్రీ భాష్యం రామానుజాచార్యులుగారు వచ్చిన పండితులకు స్వాగతసత్కారముగా నుపన్యసించిరి. పిదప శ్రీ కవిగారు విశిష్టాద్వైత ప్రచారక సంఘమునుగూర్చి గత చరిత్ర నంతయు సింహావలోకన సేయుచు నుపన్యసించిరి. ఆ పిదప శ్రీమాన్ హరికథాచతురానన కవితావతంస, కవినారాయణాచార్యులుగారు ఆళ్వారాచార్య గుణకీర్తన కమ్మనికంఠముతో గానముచేసిరి. ఆపిదప అధ్యక్షులవారు విశిష్టాద్వైత వైభవమును అత్యంత మృదుశైలిలో నుపన్యసించిరి. ఇంతటితో పగలు ఉపన్యాసగోష్ఠి పూర్తి అయినది.

మధ్యాహ్నం 2 గంటలకు మహిళాసభలు ప్రారంభమయ్యెను. [illegible] శ్రీమతి కరణాడ [illegible]

రమ్మగారు అధ్యక్షత వహించిరి. శ్రీమతి బచ్చు లక్ష్మమ్మ శ్రీ తి. ప. వేంకట లక్ష్మమ్మ, శ్రీ తి. ప. తిరువెంగడమ్మ, శ్రీభాష్యం లక్ష్మీనరసమ్మగారు. వీరుపన్యసించిరి. 3-30 లకు మహిళాసభ ముగిసెను, తర్వాత గం. 4 0 గంటలకు తిరిగి పండితసభ ప్రారంభమయ్యెను. శ్రీమాన్ ఉ. వె. కందాడ వరాహమన్నాధాచార్యులుగారు భగవదహూరమను విషయమును గూర్చియు నుపన్యసించిరి. తరువాత శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు ద్వయమంత్రార్థములను గురించి పద్యరూపముగా నుపన్యసించిరి. ఆ పిదప శ్రీయధ్యక్షులవారు భగవదపచార్యమును గురించియు, ద్వయమంత్రార్థమును గురించియు విపులీకరించి విషయమును విశదముగా నందరకు బోధమగునట్లుగా యుపన్యసించిరి, "పితేవత్వత్రేయాన్" అను శ్లోకమును చదివి తత్ప్రతిపాదితార్థము ద్వయమంత్రార్థమే యనియు నుపన్యసించిరి. యీ యుపన్యాసముతో నాటి సభాకార్యక్రమము సమాప్తి గావింపబడెను. తరువాత శ్రీమాన్ కవినారాయణగారు కొన్ని యతిరాజ కీర్తనలు గానముచేసిరి. మరునాడు

### 3—5—57 శ్రీ కూర్మము

ఈనాడుదయం బరంపురము నుండి శ్రీ పరాంకుశం పార్థసారధిగారు, శ్రీ బచ్చు నరసింహంగారు, శ్రీరామదాసుగారు, శ్రీమతి వక్కలంక సుగుణ, ఇత్యాదులు రెండవనాటి సభ కందుకొనిరి. తెల్లవారుఝామున గం. 4-30 లకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధి గోష్ఠి జరిగినది. శ్రీస్వామి వారానాడు కొంచె మారోగ్యముగా నున్నారు. ఉష్ణోదకముతో తీర్థమాడి తిరువారాధన గావించినారు, కళింగపట్నం నుండి, నరసన్నపేట నుండి విద్వాంసులు విచ్చేసిరి. వచ్చిన విద్వాంసులకు, శ్రోతలకు చక్కని వసతులు, సాపాటు సౌకర్యములు శ్రీభాష్యం రామానుజాచార్య, కూర్మాచార్య సోదరులు అత్యంత ప్రీతిపూర్వకము గావించిరి.

ఉదయము గం 8 లకు సభ ప్రారంభమయ్యెను. వైదిక స్వస్తి వాచకము జరిగెను. తరువాత ఆళ్వారాచార్య ప్రార్థన జరిగెను. తదుపరి కళింగపట్నం వాస్తవ్యులగు శ్రీమాన్ ఉ. వె. మహేంద్రవాడ వేంకటరామనరసింహాచార్యులుగారు అధ్యక్షపదవి స్వీకరించిరి. శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరస్వామివారు విశిష్టాద్వైత సిద్ధాంతమునకు. వేదము ప్రమాణమనియు. [illegible] సలు రెండు ఆవశ్యకములనియు ప్రమాణ నిరూపణము చేసి. తరువాత ఇచ్చట ఒక పండిత పరిషత్తు స్థాపించుచున్నామనియు. ఈ పరిషత్తు పక్షమున కొకసారిగాని మాసమున కొకసారిగాని, ఒక్కొక్క జిల్లాలోగాని. తాలూకాలోగాని సభపెట్టి తద్వారా ఆస్తిక్యమును, భక్తిమతమును, ప్రచారము చేయవలసినదనియు ప్రోత్సహించిరి. తరువాత శ్రీమాన్ తిరుమల పల్లెర్లమూడి వెంకటాచార్యులుగారు శ్రీమద్రామాయణములో నొక విషయమును గురించి యుపన్యసించిరి. తరువాత శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు చరమశ్లోకార్థమును గురించి పద్యరూపముగ నుపన్యసించిరి. తరువాత అధ్యక్షులవారు శ్రీరామానుజుల అవతార ప్రయోజనమును గురించి మృదుమధురముగా సర్వమతములను విమర్శించుచూ చక్కగా ఉపన్యసించిరి. అప్పటికే పగలు గం 11 లగుటచే సభ ముగింపబడినది.

మధ్యాహ్నం 2 గంటలకు మహిళాసభ ప్రారంభమయ్యెను. సభకు శ్రీమతి తిరుమలపల్లెర్లమూడి లక్ష్మీనరసమ్మగారుఅధ్యక్షతవహించిరి. పురుషకార వైభవమును గురించి చక్కగా ఉపన్యసించిరి. పిమ్మట బరంపురం నుండి విచ్చేసిన శ్రీమతి వక్కలంక సుగుణమ్మగారు. ఫిరాట్టి వైభవమును గురించి వివరముగా మధురశైలిలో ఉపన్యసించిరి. తరువాత శుక్రవారము గావున. శుక్రవారపూజ జరుపబడెను. ఈ నాటి శుక్రవారపూజ శ్రీమతి భాష్యం తిరువెంగడమ్మగారు గావించిరి. ఈ గోష్ఠిలో శ్రీజియ్యరు స్వామివారు అన్వయించి సంతృప్తికరముగ చేయించిరి. మహిళామండలివారు శ్రావ్య శైలిలో శ్రీగుణరత్న కోశమును సమిష్టిగా అనుసంధానము చేసిరి. పూజానంతరము సాయంత్రము 4-30 గంటలకు శ్రీ భగవద్రామానుజులవారి ఢిల్లీ విజయోత్సవము ప్రారంభింపబడెను. సాయంత్రం గం 5 లకు భగవద్భాష్యకారుల ఢిల్లీయాత్ర మహావైభవముగా జరిగెను. ముందు శ్రీ త్రిదండి జియ్యరుస్వామివారు భాగవత్ శ్రీ వైష్ణవగోష్ఠితో సహస్రనామ పారాయణ చేయుచు వేంచేయుచుండగా, శ్రీ గోవిందరాజస్వామి గరుడవాహనా రూఢులై, ఛత్రచామరాది లాంఛనముల తోను, శ్రీ రామానుజులు బంగారు పల్లకిలోను సేవసాయించుచు గ్రామమునకు 3 ఫర్లాంగుల దూరములో నున్న మంటపమునకు వేంచేసిరి. గ్రామములోనున్న ఉబాల గోపాలమచ్చటికి వేంచేసిరి. అచ్చట ఢిల్లీ విజయ ప్రసంగమును శ్రీమాన్ తి. పల్లెర్లమూడి రామానుజస్వామిగారు అరగంటకాలము గానముచేసిరి. తదుపరి శ్రీ [illegible]

రచించిన రామానుజచరిత్ర బుర్రకథలోనుండి ఢిల్లీ విజయ ఘట్టమును చదివి వినిపించిరి. తరువాత పూజలు, చందన తాంబూలగోష్ఠి జరిగినది. శ్రీ జియ్యరు స్వామివారు తిరిగి బసకు వేంచేయునప్పటికి రాత్రి దాదాపు గం 9-30 లైనది.

4-5-57 వ తేది ఉదయము యథాప్రకారముగా శ్రీ జియ్యరు స్వామివారు వేకువజామున 4-30లకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధిగోష్ఠి గావించిరి. ఉదయము 7 గంటలకు సన్నిధిలో భగవద్రామానుజుల అవతారోత్సవము మహావైభవముగాజరిపింపబడెను. పరమ విలక్షణముగా తిరురంజనోత్సవము జరిగెను. శ్రీ భాష్య పారాయణ, వేదపారాయణ, గీతాభాష్యపారాయణ, భగవద్విషయ పారాయణం, అన్నియు చక్కగా శాత్తుమొద గావింపబడెను. మధ్యాహ్నం 1 గంటకు మహిళామండలి వారి సభ ప్రారంభింపబడెను. ఈనాటి మహిళాసభకు బరంపురం వాస్తవ్యురాలగు శ్రీమతి వక్కలంక సుగుణమ్మగారు అధ్యక్షత వహించిరి. పలువురు విదుషీమణు లుపన్యసించిరి. (తాయారమ్మగారు తిరుప్పాణాళ్వార్ల వైభవము నతి మధురముగ పాడించిరి.

తరువాత మధ్యాహ్నం గం. 3 లకు పండితసభ ప్రారంభమయ్యెను. శ్రీమాన్ కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులుగారు ఈనాటిసభకు అధ్యక్షత వహించిరి. పలువురు పండితు లుపన్యసించిరి.

శ్రీమాన్ పాలకొండ కందాడ వీరరాఘవ అప్పలాచార్యులుగారు, మతత్రయమును గురించి యుపన్యసించిరి. శ్రీమాన్ శ్రీ భాష్యం అనంత అప్పలాచార్యులుగారు, రామ, కృష్ణ, రామానుజులవారి అవతార ప్రయోజనము లను గురించి యుపన్యసించిరి. శ్రీమాన్ శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులుగారు శరణాగతి. గజేంద్ర మోక్ష పరమార్థములను గురించి విశదీకరించిరి. శ్రీమాన్ చామర్తి సీతారామాచార్యులుగారు, శ్రీ జియ్యర్ స్వామివారికి పద్యాంజలి సమర్పించిరి. శ్రీమాన్ పలుకూరి వెంకట రమణయ్యగారు రామానుజ గోదాదేవి కూర్మనాథ స్తుతులను కృతిసమర్పణ గావించిరి. తదుపరి శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీ కూర్మనాథస్వామి వారి అవతార రహస్యమును గురించి ముక్తసరిగా ముచ్చటించి సభ్యులను ముగ్ధుల గావించిరి. తరువాత శ్రీ కవిగారి అధ్యక్షస్థానమును ముగించుచు గీతాభక్తిని గురించి పద్యరూపముగా యుపన్యసించి సభచాలించిరి. అటుపిమ్మట శ్రీ స్వామివారి సన్నిధిలో పండితులకు పండిత శాలువలు శ్రీమాన్ భాష్యం రామానుజ కూర్మనాథ సోదరులు అత్యంత ప్రేమపూర్వకముగా సమర్పించిరి. మహా వైభవముగా శ్రీ భగవద్భాష్యకారుల తిరునక్షత్రోత్సాహము పదిరోజులు పరమవైభవముగా జరిగినది. ఇంతకు ముందీ సన్నిధిలో ఇంతగోష్ఠి ఎప్పుడు జరుగలేదనిరి. మహావైభవముగా రాత్రి 9 గంటలకు శ్రీ భగవద్రామానుజుల ఉత్సవము, పండితసభలు, మహిళాసభలు, సంపూర్తి అయ్యెను.

5-5-57 శ్రీ కూర్మం పిమ్మ పేట (ఆదర్శ పేట)

ఈనాడుదయము యథాప్రకారముగా తిరువీధిగోష్ఠి జరిగినది. మధ్యాహ్నం గం. 3 లకు శ్రీ త్రిదండి జియ్యర్ స్వామివారు కాలినడకతో శ్రీకాకుళమునకు ప్రయాణమైరి. శ్రీకూర్మములోనున్న ఆబాలగోపాలమూ స్వామి వెంట బయలుదేరిరి. సన్నాయిమేళముతో భజయతి రాజ స్తోత్రపాఠములతో బయలుదేరిరి స్వామివారు కాని శ్రీ స్వామీజి శ్రీకూర్మమునుండి బయలుదేరుచుండగా కంట తడిపెట్టని ఆత్మబంధువు శ్రీకూర్మములో లేడు. శ్రీ స్వామివారి తిరువీధిలో బయలుదేరుచుండగా అడుగడుగునకు నమస్కారములతోను, సాశ్రుదృష్టులతోను, బాష్పగద్గకంఠోక్తులతోను శ్రీకూర్మవాసులు శ్రీ స్వామి వారికి వీడ్కోలు ఇచ్చిరి. మావెంట సర్పంచిగారు, గ్రామమున్సబ్ గారు శ్రీకం నారాయణాచార్యులు గారు శ్రీ వరాహమన్నాథాచార్యులుగారు ఇత్యాదులు దాదాపు 50 మంది స్వాములు వెన్నంటి శ్రీ స్వామి వారితో సిమ్మపేటవరకు విచ్చేసిరి. ఆరాత్రి ఆపేటలో మకాం చేసితిమి. రాత్రికి విలక్షణముగా తిరువారాధన జరిగెను. గ్రామీణులు కొందరు స్వామివారి సందర్శనార్థమై రాగా జన్మసాఫల్యము అను విషయమును గురించి యుపన్యసించిరి. ఆరాత్రి అచ్చట సుఖముగా గడిపితిమి. మాతో శ్రీ కూర్మమునుండి పాదయాత్రతో శ్రీ బచ్చు నరసింహస్వామిగారు అన్వయించి వచ్చిరి. వీరు బరంపురములో శ్రీ స్వామివారిని సేవించినది మొదలు విడచి యుండలేక ప్రతిమకాముునకు విచ్చేయుచుండిరి వీరు. ఢిల్లీ సుప్రీంకోర్టు జడ్జీగారగు శ్రీ బచ్చు జగన్నాథదాసు గారిసోదరులు, వీరుకూడా గొప్పవకీలుగా విఖ్యాతిగాంచి నిష్కళంక దేశసేవకులై రాజకీయరంగంలో సేవచేసిన ప్రముఖ కాంగ్రెసువాది ఇప్పుడు అధ్యాత్మికచింత విశేషముగా విజృంభించుటచే శ్రీ స్వామివారివెంట విచ్చేయుచుండిరి. వేగుజామున గం. 4 లకు మెల్కొని శ్రీవిష్ణు సహస్రనామాను సంధానము చేయుచు 3 మైళ్ళలోనున్న అరసవిల్లి ఆనేగ్రామం చేరుకొంటిమి.

శ్రీ స్వామివారు శ్రీ కూర్మ యాత్ర ముగించుకొని తే 6-5-17 న ప్రభాతవేళకు అరసవెల్లి విచ్చేసిరి. అరసవెల్లి శ్రీకాకుళమునకు మైలుదూరమున గలదు. శ్రీకాకుళము పురపాలక సంఘములోనిది. త్రిమూర్త్యాత్మకుడగు శ్రీ సూర్యభగవానుడు వెలసిన దివ్యక్షేత్రము, హర్షవల్లి శ్రీ కూర్మమునుండి శ్రీ వైష్ణవ బృందమనుసరింపగా శ్రీ జియ్యర్ స్వామివారు అరసవెల్లి పొలిమేరకు రాగానే శ్రీ శ్రీ శ్రీ సూర్యనారాయణస్వామివారి ఆలయ ధర్మకర్త లగు శ్రీ ఇప్పిలి వెంకటరామశర్మ (విద్యాభాస్కర శ్రీ ఇప్పిలి జోగారావుగారును, వైదికబృందముతో, శ్రీకాకుళమునుండి వచ్చిన శ్రీ అరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు, శ్రీ మేడేపల్లి రామారావు శ్రీ అప్పలాచార్యులు, తదితర పురప్రముఖులతో మంగళ వాద్యములతో నెదురేగి శ్రీ స్వామివారికి స్వాగతము చెప్పి, స్వస్తివాచకములతో బసకై ఏర్పాటుచేసిన శ్రీ సూర్యదేవ ధర్మసత్రమునకు వేంచేపు చేసిరి.

శ్రీ స్వామివారు తిరువారాధనానంతరము వైదిక బృందము స్వస్తివాచకములతో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణముతో నగర సంకీర్తనమైన పిదప శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీ శ్రీ శ్రీ సూర్యనారాయణస్వామివారి దేవాలయమున కేగి శ్రీ స్వామిని సేవించుకొనిరి. శ్రీ జియ్యర్ స్వామివారు దేవాలయమునకు వేంచేయగానే గోపురద్వారములో ఆలయ ధర్మకర్తలగు శ్రీ ఇప్పిలి జోగారావుగారు ఆలయమర్యాదలతో శ్రీ స్వామివారిని దేవాలయము లోనికి తోడ్కొని వెళ్ళిరి. నేటి సాయంకాలం అరసవెల్లి భజనసమాజమువారు శ్రీ స్వామివారి బసలో 1 గంట సంకీర్తన మొనరించిరి. తరువాత సాయంకాలం 4 గంటలకు శ్రీ జియ్యర్ స్వామివారి వీడ్కోలు సందర్భమున ఛాయాచిత్రము తీయబడెను. అరసవెల్లి పురజనులు 5 ది మంది రామనామ సంకీర్తనముతో శ్రీ శ్రీ శ్రీ జియ్యర్ స్వామివారిని శ్రీకాకుళ పరిసరములకు వీడ్కోలు నొసగిరి. మహావైభవముగా శ్రీ స్వామివారి అరసవెల్లి యాత్ర ముగిసినది. నేను శ్రీ స్వామివారితో పాటు శ్రీ వైష్ణవబృందమునకు తదీయారాధనమును - దేవాలయ ధర్మకర్తలు, విద్యాభాస్కర, శ్రీ ఇప్పిలి వెంకటరామ శర్మగారు గావించిరి.

నేటి సాయంకాలం 5 గంటలకు శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీ కాకుళ పరిసరములకు రాగానే శ్రీకాకుళంనుండి శ్రీ శ్రీ శ్రీ కోదండరామ స్వామివారి ఆలయమునుండి స్వామివారి శఠారిని పల్లకీలో వేంచేపు చేసుకొని శ్రీమాన్ మహేంద్రవాడ వెంకట జగన్నాథాచార్యులుగారు శ్రీమాన్ శ్రీ భాష్యం వెంకటరామానుజాచార్యులుగారు, శ్రీమాన్ అరవెల్లి అప్పల కొండమాచార్యులుగారు (అర్చకస్వాములు) శ్రీమాన్ బాలకృష్ణమూర్తి పంతులుగారి అధ్యక్షత నేర్పడిన ఆహ్వానసంఘమువారు, పత్రికా విలేఖరులు శ్రీ శివరావు, శ్రీ సుబ్బారావు శ్రీ ఆచార్య మున్నగువారును - పురప్రముఖులును మంగళ వాద్యములతో శ్రీ జియ్యర్ స్వామివారి కెదురేగి, తోమాల, పరివేష్టములు సమర్పించి విష్ణుసహస్రనామ పారాయణముతో శ్రీకాకుళ పట్టణమునకు తీసుకొని వచ్చిరి. శ్రీ స్వామివారికి స్వాగత సత్కారములు జరుపు సందర్భమున ఛాయాచిత్రములు తీయబడినవి. నిర్ణీత కార్యక్రమము ప్రకారము శ్రీ జియ్యర్ స్వాములవారు 6-30 లకే శ్రీ శ్రీ శ్రీ కోదండరామస్వామివారి సన్నిధికి విచ్చేసి, సభలో ప్రసంగించవలసి యున్నది. కాని శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీకాకుళ పట్టణములో ప్రవేశించుసరికి ఆహ్వానసంఘమువారి యేర్పాట్ల ననుసరించి వారివెంట సుమారు వేయిమంది స్త్రీ పురుషులు సహస్ర నామ పారాయణముతో వచ్చుచుండగా యింటింట కర్పూర నీరాజనము లిచ్చి పురపురంధ్రీమణులు - దంపతులు శ్రీ స్వామివారియెడ తమకుగల భక్తి - ప్రపత్తులను వ్యక్తము చేసిరి. నాడు గౌతమబుద్ధుడు కపిలవస్తు నగరమునకు విచ్చేయునపు డింటింట వారిని సత్కరించి నట్లు కావ్యములలో వర్ణింపబడినది. కాని నేడు శ్రీకాకుళ పట్టణములో ప్రత్యక్షముగ శ్రీ స్వాములవారి నట్టి సత్కారముల జరుపు వైభవము చూడగా హృదయానందమున కవధి లేకనిపించినది. సుమారొక మైలు దూరము పట్టణములో శ్రీ స్వామివారు తిరువీధి వేంచేయుటకు 2 గంటల కాలము పట్టినది.

శ్రీ శ్రీ శ్రీ కోదండరామస్వామివారి ఆలయములో పెద్ద సభ జరిగెను. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు శ్రీమద్భగవద్గీతయందలి భక్తియోగమును గూర్చి పద్యరూపమున నుపన్యసించిరి. ఆహ్వాన సంఘమువారొసగిన స్వాగతపత్రమునకు శ్రీ స్వాములవారు రుచిరరీతిని సమాధాన మిచ్చుచు, వేదాంతము గృహస్థులకే ఎక్కువ కావలయునని నిరూపించుచు, ఉపన్యసించిరి. శ్రీ స్వాములవా రుపన్యసించుచుండగా 2 మాసములనుండి శ్రీకాకుళమున వేదాంతోపన్యాసముల నిచ్చుచున్న శ్రీ అవధూత శ్రీ శివస్వాములవారు విచ్చేసిరి. శ్రీ జియ్యర్ స్వాములవారు కోరగా వారును ఉపన్యాస వేదికనధిష్ఠించి, విచ్చేసి, అరునిముషముల కాలము అమృతోపమానమగు నుపన్యాసము గావించిరి.

ఈ యిరువురు స్వాములవారును, వేదికపై సమాసీనులై యుండగా చూచు భాగ్యము శ్రీకాకుళ పట్టణమునకు లభించినది. ఇట్టి సమ్మేళనము జరుగుట అపూర్వము. శ్రీ స్వాములవారి ముగింపుమాటలతో రాత్రి 9 గంటలకు సభ ముగిసినది. అప్పుడు శ్రీ జియ్యర్ స్వామివారు తమ విడిదకై ర్పాటుచేయబడిన శ్రీ పుల్లెల సీతారామయ్య పంతులు గారి గృహమునకు వేంచేసిరి.

7—5—57

ఈనాడుదయము 4-30 లకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణముతో తిరువీధిగోష్ఠి జరిగెను. పెక్కురు పుర ప్రముఖులు మహిళలు, శ్రీ వైష్ణవస్వాములును అన్వయించిరి. ఉదయము 7-30 లకు తీర్థ ప్రసాదగోష్ఠియు, పిమ్మట భగద్గీత సమష్ఠి పారాయణము జరిగెను. సుమారు 200 మంది స్త్రీ పురుషులగు భక్తులీ గోష్ఠిలో నన్వయించిరి. సాయంకాలము దేవాలయములో సభ జరిగెను. శ్రీ కవిగారి కార్యగోష్ఠి జరిగినది. పిమ్మట శ్రీ జియ్యర్ స్వాములవారు కర్మయోగమును గూర్చి యుపన్యసించిరి. ఆతరువాత అవధూత శ్రీ శివస్వాములవారు భగవంతుని భక్తితో పూజించుటయే పరమార్థమని ఉపదేశించిరి.

8—5—57

ఈనాడును యథాప్రకారము నగరసంకీర్తనము, సమిష్ఠి గీతాపారాయణమును జరిగెను. శ్రీ జియ్యర్ స్వామివారీనాడు పారాయణ మొనర్చిన అధ్యాయగత విషయములను ప్రవచించిరి సమిష్ఠి పారాయణమున పురప్రముఖులు నిన్నటికంటె ఎక్కువమంది సమన్వయించిరి. సాయంకాలము శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో సభ జరిగెను. శ్రీమాన్ కవిరత్నగారు శరణాగతిని గూర్చి పద్యోపన్యాసము గావించిరి. ఆపిమ్మట శ్రీ జియ్యర్ స్వామివారు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకార్థమును వివరముగ నుపన్యసించిరి తరువాత శ్రీ అవధూత శివస్వాములవారు ఆధ్యాత్మిక విషయమును గూర్చి యుపన్యసించిరి.

9—5—57

ఈనాడును ప్రాతఃకాలమున 4-30 లకు నగర సంకీర్తనము, గీతాపారాయణాది కార్యక్రమము జరిగెను. సాయంకాలము ఉపషన్మందిరమువారి ఆధ్వర్యమున శ్రీ శంకరభగవత్పాదుల అవతారోత్సవము జరిగెను. మన శ్రీ జియ్యర్ స్వాములవారు అద్వైతమనగా నేమి? అను విషయమునుగూర్చి సుమారు 1½ గంట లుపన్యసించిరి. శ్రీ అవధూత శివస్వాములవా రధ్యక్షత వహించిరి. అద్వైత విశిష్టాద్వైత స్వాము లిరువురును సౌమనస్యపూర్వస్వకముగ ఏకాసీనులై సభను జయప్రద మొనర్చుట చూడ ముచ్చటైనది. శ్రీ కవిగారు శ్రీస్వాము లిరువురనుగూర్చి ఆశువుగ క్రిందిపద్యములను చెప్పిరి.

(1) శ్రీమదాధ్యాత్మికం తేజః ద్విథాభూత్వా విరాజతే.
అవధూత శివస్వామీ శ్రీమన్నారాయణోయతిః॥

2 ఇదమద్వైత విజ్ఞానం విశిష్టాద్వైత మీదృశం
అహో శ్రీకాకుళస్యేదం భాగ్యం కిమితివర్ణ్యతే॥

10—5—57

ఈదినమునను వేకువనే శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధిగోష్ఠి దివ్యాగరముగ జరిగినది. సాయంకాలం శ్రీ జియ్యర్ స్వామివారి అధ్యక్షతను ఉపనిషన్మందిరసంస్కృత పాఠశాలలో బాల బాలికల విద్యాపరిదర్శనము జరిగెను. విద్యార్థినీ విద్యార్థులకు బహుమాన ప్రదానము జరిగెను. 5, 6 పండితులు సంస్కృత భాషా ప్రశస్తిని గూర్చి ముచ్చటించిరి. మన శ్రీ కవిగారు "విద్యావిలాసము" అను తమ కావ్యములో నొక మధుర ఘట్టమును గానము చేసిరి. తరువాత అధ్యక్షులగు శ్రీ జియ్యర్ స్వామివారు సంస్కృత భాషాప్రచారమును గూర్చి ముచ్చటించిరి. ఆపిమ్మట సభ్యుల కోరికపై అద్వైత సిద్ధాంత స్వరూపము నుపన్యసించిరి.

11—5—57

ఈనాడు నిత్య తిరువీధిగోష్ఠి, పారాయణగోష్ఠి జరిగిన పిమ్మట ద్వాదశీ పారణ జరిగెను. శ్రీమాన్ న్యాయప బాలకృష్ణమూర్తి పంతులు గారి యైదుదినములు తదీయారాధన మొనర్చిరి. శ్రీ శ్రీ కోదండరామ స్వామివారి సన్నిధిని దివ్యస్థలముగ చేయుటకును. ధ్వజ స్తంభమును ప్రతిష్ఠించుటకును శ్రీ స్వామివారు సంకల్పించిరి. వెంటనే తత్ప్రయత్నము నారంభించిరి. సాయంకాలము శ్రీ జీయర్ స్వామివారి బసలోనే సభ యేర్పాటు గావించబడెను. శ్రీ కవిగారు ధనుర్దాసు కావ్యములో రెండుసర్గలు గానము చేసిరి తరువాత శ్రీ జీయర్ స్వామివారు ముక్తినిగూర్చి యుపన్యసించిరి.

12—5—57

ఉదయమును యథాప్రకారము తిరువీధిగోష్ఠి జరిగినది. శ్రీ గీతా పారాయణము, తదర్థ ప్రవచనము గావింపబడెను. రాత్రి 6-30 లకు ఆలయములో సభ జరిగెను. శ్రీ కవిరత్నగారు ధనుర్దాసుకావ్యములో నొక సర్గకావ్య గానము చేసిరి. శ్రీ జీయర్ స్వామివారు మోక్షమునుగూర్చి యుపన్యసించిరి. ఆపిమ్మట శ్రీకాకుళం బుఱ్ఱకథదళము (చి॥ కఱ్ఱా సుబ్రహ్మణ్యం చి॥ దూసి కూర్మనాథరావు చి॥ గరిమెళ్ల) చే శ్రీ కవిగారు రచించిన యతిరాజ విజయము ప్రదర్శింపబడెను. శ్రీ శ్రీ శ్రీ అవధూత శివస్వాములవారును మోక్షమునుగూర్చి యుపన్యసించిరి.

13—5—57

ఈనాటినుండి శ్రీ శ్రీ శ్రీ కోదండరామస్వామివారి దేవాలయాభివృద్ధికై (ధ్వజస్తంభప్రతిష్ఠ, రాజ్యలక్ష్మీ, ఉపయవరుల ప్రతిష్ఠ) శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జియ్యర్‌స్వామివారు, శ్రీ శ్రీ శ్రీ అవధూత శివస్వామివారును భిక్షచేయుటకు సంకల్పించిరి. 7 గంటలకు భిక్షాకార్యక్రమము ప్రారంభమయ్యెను. శ్రీజియ్యర్ స్వామివారు మంగళవాద్యములతో శ్రీ సహస్రనామ పారాయణతో శ్రీ కోదండరామస్వామివార సన్నిధికి విచ్చేసి, పెరుమాళ్ళకు తమ సంకల్పమును మనవిచేసి భిక్షకు బయల్దేరిరి. శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ పక్షమున 116 రు లను శ్రీ జియ్యర్‌స్వామివారు మొదట భిక్షావందనము వేసిరి. పిమ్మట శ్రీ ధూత శివస్వామివారట్ల భిక్ష పెట్టిరి. తరువాత సన్నిధి స్వాముల భిక్షమైన పిమ్మట గ్రామములో 9-30 వఱకు భిక్షాటన చేయగా వాగ్దానములు గాక 600/- రూప్యలు భిక్షాపాత్రలో లభించెను.

శ్రీ శ్రీ అవధూత శివస్వాములవారు శ్రీ జీయ్యర్ స్వామివారి కోరులకి, శ్రీ ఇప్పిలి జోగారావు, శ్రీ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు, శ్రీ. కె. నరసింహం శ్రీ జగన్నాథాచార్యులు శ్రీ రంగనాథం శ్రీ రాఘవాచార్యులు శ్రీ కూర్మాచార్యులు శ్రీ దామెర వెంకటసీతారామస్వామి వార్లతో కలిసి అరసవెల్లి వెళ్ళిరి శ్రీ సూర్యక్షేత్ర ధర్మకర్తలు శ్రీ శివస్వాములవారికి ఆలయమర్యాదలతో గౌరవించిరి. శ్రీ శివస్వాములవారు శ్రీ శ్రీ శ్రీ సూర్యనారాయణ స్వామిని సేవించుకొన్న పిమ్మట ఛాయాచిత్రము తీయబడెను. శ్రీ కూర్మక్షేత్రమునకు శ్రీ శివస్వాములవారు రాగానే దేవాలయాధికారులు పంచాయతీ సభ్యులు, పురప్రముఖులు ఎదురువచ్చి మంగళవాద్యములతో పంచాయతీభవనమునకు, పిమ్మట దేవాలయమునకు తోడ్కొని పోయిరి. శ్రీకాకుళమున శ్రీ జియ్యర్‌స్వామివారికి జరిగిన రీతిగనే శ్రీ కూర్మమున శ్రీవైష్ణవ స్వాములందఱును - నీరాజనమిచ్చి, ఆలయలాంఛనములతో శ్రీ శివ స్వాములవారిని దేవాలయమునకు తోడ్కొని వెళ్ళిరి. తోమాల, పరివెట్ట లాంఛనములైన పిమ్మట - శ్రీ శివస్వాములవారు శ్రీ కూర్మనాథుని సేవించుకొనిరి. పిమ్మట ప్రసాదగోష్ఠి జరిగెను. శ్రీకూర్మదేవాలయమున శ్రీస్వామివారికి ఛాయాచిత్రములు తీయబడెను.

అతర్వాత సాలెహుండం వెళ్ళి పర్వతముపైకెక్కి బుద్ధసంస్మరణఉత్సవము జరుపుకొని బూరవల్లిలో శ్రీమాన్ ఆరవెల్లి నరసింహాచార్యులుగారి ఆతిథ్య సత్కారముల నంది సాయంకాలమునకు తిరిగి శ్రీకాకుళమునకు చేరుకొనడమైనది. నేటిసాయంకాలం సభలో శ్రీ శ్రియానంద నాథుల(ఈశ్వర సత్యనారాయణ శర్మగారు) సత్య-నారాయణశర్మ సాధనము గ్రంథము శ్రీ శ్రీ శ్రీ జియ్యర్ స్వామివారి సన్నిధిని పఠింపబడెను. పిమ్మట శ్రీ జియ్యర్ స్వాములవారు శర్మగారి గ్రంథము నుద్దేశించి ప్రసంగించిరి.

14 —5—57

ఈదినమునను భిక్షాకార్యక్రమము 9-30 వఱకు జరిగినది గీతాపారాయణగోష్ఠి ప్రసాద వినియోగగోష్ఠియు మహావైభవముగ జరిగినవి. సాయంకాలము సభలో శ్రీ దేవాలయసాన కవిగారి కావ్యగానమైన పిమ్మట స్వామి తిరుపురను ప్రబోధమును గావించిరి.

సభాప్రారంభమున స్వస్తివాచన మొనర్చిన వైదిక బృందమును శ్రీ జియ్యర్‌స్వాములవారు సంభావన మొసగి సత్కరించిరి.

15—5—57

ఈరోజున భిక్షా కార్యక్రమాదికములు జరిగినవి. సాయంకాలం సభలో శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు విశిష్టాద్వైత వైభవమును గూర్చి గంభీరముగ నుపన్యసించిరి. ఆపిమ్మట శ్రీ జియ్యర్‌స్వామివారు కర్మసన్యాస యోగమునుగూర్చి ప్రసంగించిరి.

16—5—57

నిత్య కాలక్షేపగోష్ఠి. తిరువీధిగోష్ఠి జరిగినవి. సాయంకాలం 8 గంటలకు శ్రీ జియ్యర్‌స్వామివారి బసలో శ్రీ గోపాలాచార్య స్వామివారు యతిరాజసేవామహిళా మండలివారికి భగవద్విషయమును వివరించిరి. శ్రీ స్వామివారి ఆలయమున సభ జరిగెను. శ్రీ కవిగారి కావ్యగానము జరిగెను. వారి కావ్యమునకు ముగ్ధులై ఎపుడెపుడు కవిగారు వత్తురా ! యని శ్రోతలు నిరీక్షించుట పరిపాటియైనది. శ్రీ జియ్యర్‌స్వామివారి అమృతవాక్కులకై చెవులొగ్గి ప్రతిమాత్వమును పొందగల్గుట శ్రీకాకుళ సభలపై శిష్ట్యమెయున్నది. నేటిరాత్రి 10 గంటలకు శ్రీ కవిరత్నగారి కావ్యము నాలకించుటకై శ్రీమాన్ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు శ్రీ బెండి కూర్మన్న శ్రీ తిమ్మరాజు వెంకటశివరావు శ్రీ ఇప్పిలి జోగారావు శ్రీ కె ఎల్. నరసింహారావు శ్రీ శ్రీ భాష్యం రాఘవాచార్యులు శ్రీ శివరావుగారి నుపశోదయప్రెస్సు ఆవరణలో ప్రశాంతవాతావరణములో సుప్రసిద్ధ చిత్రలేఖకులు శ్రీ వడ్డాది పాపయ్యగారి నాహ్వానించి శబరీ, మాండవీ, శత్రుఘ్నులనుండి కొన్ని ఘట్టములను శ్రీ కవిగారు విన్పింపగా పరమానందము నందిరి. శ్రీ వడ్డాది పాపయ్యగారు కవిగారి గ్రంథములలో కొన్ని రసవత్తర సన్నివేశములకు చిత్రములను వ్రాయుదుమనిరి. శ్రీ బెండి

కూర్మన్న గారు శ్రీ శివరావు గారు శ్రీ జోగారావుగారు శ్రీ లక్ష్మీ నారాయణాచార్యులును శ్రీ కవిగారిని నవంబరు సెప్టెంబరు నెలలో ఘనముగ సత్కరించుటకు నిశ్చయించిరి. రాత్రి 12.30 లకు కావ్యగోష్ఠి ముగిసినది.

17—5—57

నేడుదయము భిక్షా కార్యక్రమునకై స్వాము లిరువురును శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో అరసవెల్లి బయలుదేరిరి. శ్రీ సూర్యదేవుని సన్నిధి కేగి ప్రథమభిక్ష నందుకొని అరసవెల్లిలో భిక్షాటనను పూర్తిచేసుకొని, కార్లపైన, బస్సు, జీపులపైన, భక్తబృందముతో తిరిగి బసకు విచ్చేసిరి. నేటి సాయంకాలం శ్రీ జియ్యర్ స్వాములవారి బసలో శ్రీ కె. నరసింహం గారు శ్రీ స్వాములవారి ఛాయాచిత్రముల దీసిరి. పిమ్మట 4 గంటలకు ఆలయమున శ్రీ జియ్యర్ స్వామివారి సముఖములో శుక్రవార పూజలను శ్రీ తె. కం. గోపాలాచార్యులువారు జరిపించిరి. శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి శ్రీ స్వాములవారి యాజ్ఞప్రకారం ప్రారంభించి 1 వారమే ఐనప్పటికి అత్యుత్సాహముతో సుమారు 100 మంది మండలిలో సభ్యత్వమును స్వీకరించిరి. శుక్రవారోత్సవముల యనంతరము సభ ప్రారంభింపబడెను. శ్రీమాన్ కవిరత్న, శ్రీమాన్, గోపాలాచార్య స్వామి శ్రీ జియ్యర్ స్వామివారును భక్తితత్త్వమును గూర్చి ప్రసంగించిరి. దేవాలయ ధ్వజస్తంభమునకై నివగాం గ్రామస్థులు కఱ్ఱనిచ్చుటకు అంగీకరించుచు, స్వీకరింపవలసినదిగా శ్రీ జియ్యర్ స్వాములవారి న భ్యర్థించిరి. శ్రీ స్వామివా రామోదించిరి.

18—5—57

నేడు సామాన్య కార్యక్రమానంతరము సమిష్టి పారాయణగోష్ఠి జరిగినది. శ్రీ శ్రీ శ్రీ జియ్యర్ స్వాములవారి సంకల్పబలముచే ప్రతిష్ఠాది కార్యక్రమములు నిశ్చయముగ కొనసాగగలవని భక్తుల హృదయములలో దృఢముగ నాటుకొన్నవి. సాయంకాలం 3 గంటలకు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు మహిళా మండలివారి కోరికపై గీతా పరీక్షల నేర్పాటు చేయుటకును, గీతాక్లాసుల నేర్పాటు చేయుటకును శ్రీమాన్ అరసవెల్లి లక్ష్మీనారాయణాచార్యులుగారి నాదేశించిరి. శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో గీతాక్లాసుల నడుపుటకు నిశ్చయింపబడినది. సాయంకాలం సభలో శ్రీ కవిరత్న గారు తమ రచనలనుండి కొన్ని ఘట్టములను గానముచేసిరి. పిమ్మట శ్రీ అవధూత శివస్వాములవారును, శ్రీ జియ్యర్ స్వామివారును ప్రసంగించిరి.

19—5—57

నేడు సామాన్య కార్యక్రమము జరిగినది. సాయంకాలం దేవాలయమున సభలో శ్రీ అవధూత శివస్వాములవారును, శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారును, శ్రీ శ్రీ శ్రీ జియ్యర్ స్వామివారును ఉపన్యసించిరి. శ్రీ శ్రీ శ్రీ త్రిదండి నారాయణ రామానుజ జియ్యర్ స్వామివారి శ్రీకాకుళ కార్యక్రమము నేటితో ముగిసినది. సుమారు ముప్పది వేల విలువగల భిక్ష శ్రీ శ్రీ శ్రీ కోదండరామస్వామివారి ఆలయాభివృద్ధికై శ్రీ జియ్యర్ స్వామివారి సంకల్పబలముచే లభించినది. కృతజ్ఞతా వందనములతో సభ ముగిసినది.

20—5—57

నేడు ప్రాతఃకాలమున సంకీర్తనము, గీతాపారాయణ, ప్రవచనము, ప్రసాదగోష్ఠి జరిగినవి. నేడు శ్రీ బాలకృష్ణమూర్తి పంతులుగారు తిరువారాధన జరిపిరి. సాయంకాలము 4 గంటలకు శ్రీ జియ్యర్ స్వామివారు దేవాలయమున కేతెంచి పెరుమాళ్ళవద్ద, శ్రీ శివస్వాములవారియొద్ద సెలవు పుచ్చుకొని బయలుదేరిరి. నేటి రాత్రి నాగోలు గ్రామమునందుండి రేపుదయం ఆముదాలవలసకు చేయుట కార్యక్రమము.

శ్రీ శ్రీ శ్రీ నారాయణ జియ్యర్ స్వాములవారు నేడు వేద - సంస్కృత పండితులను - శాలువలిచ్చి సత్కరించిరి. ఆలయాభివృద్ధికై స్థానికులలో నొక సంఘము నేర్పాటు చేసిరి. సాయంకాలము శ్రీ జియ్యర్ స్వామివారిని మంగళ వాద్యములతో హరినామ సంకీర్తనముతో భారములైన హృదయములతో సుమారు 500 మంది వీడ్కోలు చెప్పిరి. నేటి యీదృశ్యము శ్రీకృష్ణుని మధురానగరయాత్రను గుర్తుకు తెచ్చినది. శ్రీ స్వామివారిని వీడ్కోలు చెప్పుటకై వారిసేవను విడువలేక స్త్రీ పురుష బాలవృద్ధు లెందరో శ్రీకాకుళమును దాటి రెండు మైళ్ళవరకు అనుసరించిరి, రాత్రి నాగోలు గ్రామములో మకాం చేసిరి.

21—5—57

ఉదయం స్నాన సంధ్యాది తిరువారాధన కార్యక్రమము ముగించుకొని శ్రీ జియ్యర్ స్వామివారు తమ వెంట శ్రీమాన్ విద్వాన్ గోపాలాచార్య స్వామివారు, శ్రీమాన్ కవిరత్న గారు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణము చేయుచుండగా కతిపయభక్తులు వెంటరాగ గం. 9లకు ఆముదాలవలస చేరుకొనిరి.

ఆముదాలవలసలో సన్నిధిలాంఛనములతో ఆలయ సన్నిధిస్వాములు కొందరు భక్తులు ఎదురువచ్చి శ్రీ జియ్యర్ స్వామివారికి తీర్థ శఠగోప పుష్పమాలాది

# నూతనముగ ఏర్పాటుచేయబడిన
# శ్రీ యతిరాజసేవా మహిళామండలి సభ్యురాండ్రు

(గత సంచిక తరువాయి)

---

శ్రీకాకుళం

1 శ్రీమతి రంగరాజు వేంకటలక్ష్మమ్మగారు
2 ,, న్యాయపతి కనవల్లి తాయమ్మ
3 ,, ,, రంగనాయకమ్మ
4 ,, ,, జానకీరామమ్మ
5 ,, ,, చూడామణి
6 ,, పరాంకుశం రంగనాయకమ్మ
7 ,, రంగరాజు సీతారామమ్మ
8 ,, ,, తాయారమ్మ
9 ,, మంగు తాయారమ్మ
10 ,, ,, సుభద్రమ్మ
11 ,, గుడివాడ సూర్యకాంతం
12 ,, N. హేమలత
13 ,, శ్రీభాష్యం తిరువేంగళమ్మ
14 ,, బలిజేపల్లి అన్నపూర్ణమ్మ
15 ,, పిలకా సుభద్రమ్మ
16 ,, పూసల రాజరత్నము
17 ,, చక్రవర్తుల ఆండాళు
18 ,, ప్రసాదు జయలక్ష్మి
19 ,, న్యాయపతి బాలకృష్ణలక్ష్మమ్మ
20 ,, పన్యాల శారద
21 ,, నారం కృష్ణవేణి
22 ,, అడపా వెంకటరత్నమ్మ
23 ,, ,, సుసీలమ్మ
24 ,, ,, లక్ష్మీజగన్నాథమ్మ
25 ,, ,, బాలరత్నమ్మ
26 ,, ,, రాధాకృష్ణమ్మ
27 ,, ,, అమ్మాడు
28 ,, బోగవల్లి వెంకటసత్యవతి
29 ,, మఠాడం మహాలక్ష్మమ్మ
30 ,, పూటూరు లక్ష్మీనరసమ్మ
31 ,, బోడి వెంకుబాయి
32 ,, అడసాలం వెంకటరత్నమ్మ
33 ,, వెలంపూడి జగన్నాథమ్మ
34 ,, బరాటం జగ్గారావు పద్మావతి
35 ,, ,, మాణిక్యం
36 ,, ,, వెంకటరత్నమ్మ
37 ,, ,, సీతమ్మ
38 ,, ,, కామేశ్వరమ్మ
39 ,, ,, సావిత్రి
40 ,, ,, లక్ష్మీనరసమ్మ
41 ,, ,, శ్యామలాంబ
42 ,, ,, సరస్వతమ్మ
43 ,, ,, రమణమ్మ
44 ,, తిమ్మరాజు మహాలక్ష్మమ్మ
45 ,, కుమూరు సత్యవమ్మ
46 ,, మాదిరెడ్డి తెలుపులమ్మ
47 ,, మేడపల్లి జగ్గమ్మ
48 ,, గురువుగారు సీతాలక్ష్మిగారు
49 ,, తరికప్పల సుందరమ్మ
50 ,, మొగిలినేని సత్యవతి
51 ,, భార్గుల వెంకటలక్ష్మీనారాయణమ్మ
52 ,, కొండుపర్తి తాయారమ్మ
53 ,, రామవరపు కాసులమ్మ
54 ,, ,, పుష్పవతి
55 ,, చవులపల్లి అలివేలు

56 ,, మగుడపిల్లి లక్ష్మీనారాయణమ్మ
57 ,, కందుకూరి గౌరీరాజు
58 ,, గుడ్ల సీతమ్మ
59 ,, మైకాపు రాజేశ్వరమ్మ
60 ,, మండా సుభద్రమ్మ
61 ,, బరాటం శశిరేఖమ్మ
62 ,, ,, పగడాలమ్మ
63 ,, బలివాడ సరోజని
64 ,, వైశ్యరాజు కామేశ్వరమ్మ
65 ,, పేర్ల గౌరీరాజు గుండాలు
66 ,, పొట్నూరు అమ్మాయమ్మ
67 ,, బర్లెమూడి అన్నపూర్ణమ్మ
68 ,, పంతుల అన్నపూర్ణమ్మ
69 ,, దూసి సీతారామమ్మ
70 ,, నారాయణశెట్టి వజ్రమ్మ
71 ,, ,, కనకరత్నం
72 ,, వైశ్యరాజు శాంతమ్మ
73 ,, గోనెల లక్ష్మీనరసమ్మ
74 ,, తురుమళ్ల సరోజనమ్మ
75 ,, కరి తాయారమ్మ
76 ,, బలివాడ అన్నపూర్ణమ్మ
77 ,, కళ్ళేపల్లి రమణమ్మ
78 ,, బరంపురం సుందరమ్మ
79 ,, కాసా నారాయణమ్మ
80 ,, గురుపాప నారాయణమ్మ
81 ,, మగుడపిల్లి వెంకటరాజు
82 ,, ,, నారాయణమూర్తి
83 ,, తిమ్మన నరసమ్మ
84 ,, కుప్పిలి వెంకటరత్నమాంబ
85 ,, బలభద్రుని లక్ష్మీకొండ
86 ,, శిల్లాల లక్ష్మీదేవి
87 ,, పురటి విజయలక్ష్మి
88 ,, కుప్పిలి నారాయణమ్మ
89 ,, నేరెళ్ల సూర్యకాంతమ్మ
90 ,, జగ్గం మహంతి వెంకటరత్నం
91 ,, కళ్ళేపల్లి రంగనాయకమ్మ
92 ,, కాసు అన్నపూర్ణమ్మ
93 ,, మాచెర్ల అమ్మడమ్మ
84 ,, అయితం సత్యనారాయణమ్మ
95 ,, మైకాపు హైమవతమ్మ

**ఆముదాలవలస**

1 శ్రీమతి వైశ్యరాజు ముత్యాలమ్మ
2 ,, ,, సుభద్రమ్మ
3 ,, ,, కమలమ్మ
4 ,, ,, పెదసుభద్రమ్మ
5 ,, ,, అమ్మడు
6 ,, పాలడుగు సూరమ్మ
7 ,, ఉప్పల అమ్మాజమ్మ
8 ,, విశ్నాకుల సూర్యకాంతం
9 ,, పొట్నూరి శాయమ్మ
10 ,, పాతాబత్తుల మహాలక్ష్మమ్మ
11 ,, కందుల నారాయణమ్మ
12 ,, ,, సన్యాసమ్మ
13 ,, శిల్లా మాణిక్యమ్మ
14 ,, ,, సరోజనమ్మ
15 ,, గంగి సీతమ్మ
16 ,, పొట్నూరి వరలక్ష్మమ్మ
17 ,, లలితాంబ
18 ,, కాంతమ్మ
19 ,, అన్నపూర్ణమ్మ
20 ,, బాయమ్మ
21 ,, కామేశ్వరమ్మ
22 ,, లక్ష్మి
23 ,, పార్వతమ్మ
24 ,, సావిత్రమ్మ
25 ,, బోయిన లక్ష్మీదేవి
26 ,, ,, చంద్రమ్మ
27 ,, ,, రత్నాలమ్మ

28 తెంగున రమణమ్మ
29 „ „ దమయంతి
30 „ „ నరసమ్మ
31 „ „ సూర్యకాంతమ్మ
32 „ „ పార్వతమ్మ
33 వైద్యరాజు లక్ష్మీనారాయణమ్మ
34 „ చేబోలు బంగారమ్మ
35 „ శిరసాని గురమ్మ
36 కురుచేటి సీతారత్నం
37 „ బోగి అప్పలనరసమ్మ
38 „ పార్వతమ్మ
39 పొడుగు శాంతమ్మ
40 „ కామేశ్వరమ్మ
41 „ సింహాద్రి అమ్మన్న
42 „ గుడ్ల గడ్డెమ్మ
43 „ శిల్లా అమ్మాయమ్మ
44 „ మాణిక్యమ్మ
45 „ దేవుడుపాటి లక్ష్మీకాంతమ్మ
46 „ మోణంగి లక్ష్మీనరసమ్మ
47 „ జలుమూరి లక్ష్మీకాంతమ్మ
48 „ మహాలక్ష్మి
49 „ కందుల సన్యాసమ్మ
50 „ పార్వతమ్మ
51 „ అందవరపు కామేశ్వరమ్మ
52 „ వాండ్రాసి అన్నపూర్ణమ్మ
53 „ జగ్గరపు మాణిక్యం
54 „ గుడ్ల వరలక్ష్మి

శ్రీ రామ తీర్థం

1 శ్రీమతి శ్రీ. తి. వె. లక్ష్మీనరసమ్మ అమ్మవార్లంగారు
2 పట్లోరమాడిరామప్రియలక్ష్మీనరసమ్మ
3 „ లక్ష్మీనరసమ్మ
4 „ లక్ష్మీనరసమ్మ
5 „ „ కృష్ణవేణమ్మ
6 „ శ్రీ. తి. వె. వైదేహమ్మగారు
7 „ „ తిరువేంగళమ్మ
8 „ „ లక్ష్మమ్మ
9 „ నిడవర్తి కందాడై లక్ష్మీనరసమ్మ
10 „ „ తాయారమ్మగారు
11 „ „ జగన్మోహినిఅమ్మగారు
12 „ „ తాయారమ్మ
13 „ గొడవర్తి రంగమ్మ
14 „ „ శ్రీనివాసమ్మ
15 „ „ పద్మావతమ్మ
16 „ „ అండాళ్లమ్మ
17 „ „ రాఘవమ్మ
18 „ „ వరహాలక్ష్మీఅమ్మగారు
19 „ „ తాయారమ్మ
20 „ „ తిరువేంగళమ్మ
21 „ మొలుగు జగ్గమ్మగారు
22 „ కల్వపూడి లక్ష్మీనరసమ్మ
23 „ „ సీతమ్మ
24 „ „ సుభద్రమ్మ
25 „ కందాళ సీతమ్మ
26 „ „ సీతమ్మ
27 „ గొడవర్తి కోనమ్మగారు
28 „ ఆవంతుల లక్ష్మమ్మ
29 „ సామవేదుల చంచమ్మ
30 „ శ్రీభాష్యం సుభద్రమ్మ
31 „ „ అండాళమ్మ
32 „ „ రాజ్యలక్ష్మి
33 „ „ వేంకటసీతమ్మ
34 „ తూపురాణి వేంకటలక్ష్మీఅమ్మగారు
35 „ లక్ష్మీఅమ్మగారు
36 „ పూసర్ల సన్యాసమ్మ
37 „ బర్ల సత్యవతమ్మ
38 „ పూసర్ల చల్లమ్మ
39 „ పులఖండం వరాలమ్మ

40 ,, భర్లమూడి సుగుణమ్మ
41 ,, ఖాండవిల్లి సుబ్బలక్ష్మి
42 ,, పూసర్ల కామమ్మ
43 ,, ,, లక్ష్మీకాంతం
44 ,, కోయిల్‌కందాళ సుశీలమ్మ
45 ,, పాలకొండ కందాళ వేదవల్లి
46 ,, పల్లేర్లమూడి చూడమ్మ
47 ,, గొలుగువల్స కందాళ లక్ష్మమ్మ
46 ,, కోయిల్ కందాళ వెంకటరమణమ్మ
49 ,, ,, కృష్ణవేణమ్మ
50 ,, ,, తాయారమ్మ.
51 ,, కరి వరాహలక్ష్మీనరసమ్మ
52 ,, పులే వేంకటగారీ రమణారాజు
రాజేశ్వరి అమ్మగారు

# సవరణ

రాజమండ్రి తులసీ రామానుజకూటమును మునుముందు సంఘము స్వాధీనముచేసుకొని ఏర్పరచిన కమిటీకి అధ్యక్షులగు శ్రీమాన్ ముత్తంగి జగ్గారావుగారు శిధిలావస్థలోగున్న యీ రామానుజకూట కట్టడమును షుమారు వేయిరూపాయలు తమ స్వంతసొమ్ముమ ఖర్చు పెట్టి ఉద్ధరించిరి.

"రామానుజకూట మంతయు సర్వసుందరముగా పరిష్కరింపబడిన పిమ్మట శ్రీ బోడా వెంకట్రాజుగారి భార్య సత్యవతమ్మగారు రూ 116-0-0 ఖర్చు పెట్టి పెరుమాళ్ళగదికి తలుపుల నేర్పాటుచేసిరి."

20 వ పేజీ తరువాయి

సహస్రనామములతో వాద్యవిశేషములతో తిరువీధిగోష్ఠి కార్యక్రమమును పూర్తిగావించి బసకు చేరుకొనిరి.

రాత్రి గం. 7 లకు బహిరంగసభ జరిగెను. శ్రీ గోపాలాచార్యులుగారు, శ్రీకవిగారు గీతనుగురించి యుపన్యసించిరి. తరువాత శ్రీ జియ్యర్‌స్వామివారు సేవాభాగ్యమును గురించి యుపన్యసించిరి.

ఈనాటితో అనగా ఆముదాలవలస పర్యటనలో శ్రీ జియ్యర్‌స్వామివారి శ్రీ పాదయాత్ర ముగిసినది.

(విజయవాడ బ్రహ్మయజ్ఞమునకు వెళ్ళవలసియుండుటచే ఇంతటితో ఈ పాదయాత్ర పర్యటన ముగించి స్వంత మోటారువానుమీద వారందినములలో విజయవాడకు శ్రీజియ్యర్‌స్వామివారు వేంచేయనున్నారు.)

బరంపురం

(1) ఇచ్చటి శ్రీ వెంకటేశ్వరాలయ ధర్మకర్తలు శ్రీ ఆత్మకూరి వరదరాజశ్రేష్ఠిగారి భార్య మహాలక్ష్మమ్మగారు యిద్దరుకుమార్తెలకు ఏకైక పుత్రుని భర్తనువదలి భర్తృ సాన్నిధ్యములో అనాయాసముగా 30—4—57 తేదీని మరణించిరి. కుమార్తెలు, కుమారుడుకూడ ఆసమయములో దగ్గరయున్నారు. పదకొండవరోజు (10–5–57) తిరువధ్యయనకొదికములను సక్రమముగా జరిపించి ఆసందర్భములో శ్రేష్ఠిగారు మన సంఘమునకు రు. 5-0-0 లు కట్నముగా సమర్పించిరి.

(2) విజ్జపు నారాయణరావుగారు రు. 1-0-0 సంఘమునకు సమర్పించినారు.

(3) ఇచ్చట తిరువేంగడసామియాన్ సన్నిధి శ్రీ యెంబెరుమానార్ల తిరునక్షత్ర సందర్భమున తే 2–5–57 దీని కవిరత్న శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్య విరచితము "యతిరాజ విజయము" జి. న్యా, సరోజిని కా. విజయలక్ష్మి రా. పద్మావతి సౌవ్వురును కలసి గానము చేసిరి. మరునాడు శక్రివారోత్సవము తరువాత సన్నిధి స్థానాచార్యులవారు "భక్తివిజయము"ను సుబోధకముగా శాయించిరి. తే 4—5–57 దీని మహిళామండలి అధ్యక్షురాలగు తిరువేంగడ తాయారమ్మగారు "యతిరాజ వింశతి" ధాటీ పంచకములను సన్నిధియందు అన్నసంతానము చేసిరి. చి॥ గౌ. మంగమ్మ, చి॥గౌ. లక్ష్మీ నరసమ్మ కలసి తిరిగి యతిరాజ విజయము గానముచేసిరి



శ్రీ రస్తు.

శ్రీమతే రామానుజాయ నమః



# బ్రహ్మయజ్ఞము - కోటి తులసిపూజ

## ఆహ్వాన పత్రిక

**ప్రియమహాశయా !**

విశ్వకళ్యాణమునకై విజయవాడయందలి క్రొత్తగుళ్లలో స్వస్తిశ్రీ హేవిళంబినామ సంవత్సర జ్యేష్ట బ ౧౨ శ్రీ సోమవారము (ది 24-6-1957) లగాయతు వరుసగ పదిదినములు బ్రహ్మయజ్ఞము జరుగును. ఇందు ప్రతిదినము ఉదయమున గం. 8 లగాయతు గం. 9 వరకు శ్రీవిష్ణు సహస్రనామములతో కోటితులసి పూజయు, ప్రతిదినము సాయంకాలమున గం. 7 లగాయతు గం. 8 వరకు శ్రీ చూర్ణముతో శ్రీ మహాలక్ష్మికి అష్టోత్తర శతనామార్చనయు జరుగును. మరియు నాలుగువేదముల పారాయణయు, వేదాంతోపన్యాసములు, పంచాగ్ని గుండములయందును హోమమున్ను తర్పణమున్ను

రోజు 1కి 10.000 మందికి అన్నశాంతియుజరుప నిశ్చయింపబడినది.

(ది 23-6-57 తేది సాయంకాలమున అంకురార్పణయు, తే 4-7-57 దీ ఉదయమున షుమారు గ. 10-లకు అవభృదోత్సవము జరుగును. కావున తాము బంధుమిత్రులతో సహా విచ్చేసి ఈ కార్యక్రమమున పాల్గొని శ్రియఃపతి కటాక్షపాత్రులగుదురుగాక !

కార్యాలయము :
కొత్తగుళ్లు,
విజయవాడ.

ఇట్లు,

**బ్రహ్మయజ్ఞము కోటితులసిపూజా నిర్వహణసమితి**

## ప్రతిదినము వరుసగా జరుగు కార్యక్రమ వివరము

ఉద. గం. 4 లగాయతు 5 వరకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో తిరువీధ్యుత్సవము.

ఉద. గం.6 -30 లగాయతు గం. 7 వరకు బసవద్ద తీర్థగోష్ఠి.

ఉద. గం. 7 లగాయతు గం. 8 వరకు వేదపారాయణముతో తిరువీధిగోష్ఠి.

ఉద. గం. 8 లగాయతు గం. 10 వరకు అధ్యయనశాలలో చతుర్వేద పారాయణము.

పూజాశాలలో శ్రీవిష్ణు సహస్రనామార్చనము యజ్ఞశాలలో హవనము తర్పణము ఇత్యాదులు.

మధ్యా. గం. 1 లగాయతు గం. 2-30 వరకు స్త్రీలకై విదూషీమణులచే ప్రత్యేకోపన్యాసములు.

సాయం. గం. 2-30 లగాయతు గం. 6 వరకు పండితోపన్యాసములు,

రాత్రి. గం. 7 లగాయతు గం. 9 వరకు శ్రీ మహాలక్ష్మిపూజలు, శాంతిపాఠము ఇత్యాదులు.

రాత్రి. గం. 9 లగాయతు - భజనలు - సంకీర్తనలు - కథాకాలక్షేపాదులు - వగైరా.





శ్రీరస్తు.

# కోటితులసి పూజా వివరములు



ప్రియ మహాశయా!

ఈ పరమ పవిత్ర కృష్ణా పుష్కర పుణ్యదినములలో చతుర్వేద పారాయణములతో జరుగు బ్రహ్మయజ్ఞములో, అక్షయ శాశ్వత పుణ్యదాయి యగు కోటితులసిపూజలో; మీ గోత్రనామములతో మీరే స్వయముగ శ్రీ విష్ణు సహస్రనామముల నుచ్చరించుచు స్వయముగ తులసిపూజను గావించవలసినదిగా గోరుచున్నాము.

పూజాశాలలో ప్రతినిత్యము ఉదయమున గం 8 లగాయతు గం. 9 వరకు తులసితో శ్రీవిష్ణు సహస్రనామార్చన జరుగును. అందు మీరు కూర్చొని మీ గోత్రనామములతో సంకల్పము చేసుకొని, శ్రీ జీయర్‌స్వామివారు శ్రీవిష్ణు సహస్రనామములను చెప్పుచుండగా, ఆ నామములను తిరిగి ఉచ్చరించుచు, మీకు సప్లై చేయబడిన ప్రాణప్రతిష్ఠితమైన యంత్రమునకు మీరే స్వయముగ తులసితో సహస్రనామార్చనను చేయవలసినది.

ఇందులకుగాను మీరు ప్రాణప్రతిష్ఠ చేయబడిన యంత్రపథక మొకటియున్ను, వేయి ఎనిమిది తులసిదళములున్ను, అవసరపూజా సంబారములున్ను సప్లైచేసినందులకుగాను శ్రీవిష్ణు సహస్రనామార్చనకు తచ్ఛాంతిరూప హవన - తర్పణ - అన్నశాంత్యాదుల నన్నిటిని జరుపుటకు అన్నింటికిని కలిపి శ్రీవిష్ణు సహస్రనామార్చనయొక్కంటికి 11-0-0 చొప్పున మాత్రము మీరు చెల్లించవలసియుండును. ఇటులనే పదిదినములు పది శ్రీవిష్ణు సహస్రనామ పూజలను స్వయముగ మీరు మీ గోత్రనామములతో తచ్ఛాంతిరూప హవన - తర్పణ - అన్నశాంత్యాదులతో సహా జరుపుటకు మొత్తము రు. 100|- చొప్పున మాత్రము చెల్లించవలసియుండును. ఇటుల పూజచేసినవారికి ఆ పూజానంతరమున, వారు పూజచేసిన యంత్రపథకము, తులసి నిర్మాల్యము, నివేదితమైన కొబ్బరిప్రసాదము, యజ్ఞాంతమున హోమభస్మము ఈయబడును.

లేక

ఒక్కొక్క తులసిదళమునకు హవన - తర్పణ - అన్నశాంత్యాది శాంతులతో సహా కలసి ఒక్కొక్క నయాపైస చొప్పున మీకు తోచినన్నిటినిగాని లేక 12 తులసిదళములకు రు. 0-2-0 చొప్పునగాని లేక 24 తులసిదళములకు రు 0-4-0 చొప్పునగాని 36 తులసిదళములకు రు. 0-6-0 చొప్పునగాని లేక 108 తులసిదళములకు రు. 1-2-0 చొప్పునగాని మీ గోత్రనామముతో వ్రాసిన కాగితముతోసహా సమర్పించినచో పెరుమాళ్ళవద్ద అర్చకులచే సమర్పింప చేయబడును.

ఇందు 108 తులసిదళములకై రు. 1-2-0 చొప్పున సమర్పించినవారి గోత్రనామములు మాత్రమే పెరుమాళ్లవద్ద ఒకపర్యాయము విన్నపింపబడును.

శుభమస్తు.



# సాయంకాలమున శ్రీ మహాలక్ష్మి పూజ

ప్రతి నిత్యము సాయంకాలమున గం 7-0 లగాయతు గం 8-0 లోపున శ్రీ చూర్ణముతో శ్రీమహాలక్ష్మిపూజ జరుపబడును. అందు మీరుకూర్చొని మీగోత్ర నామములతో సంకల్పము చేసుకొని, శ్రీజీయరు స్వామివారు శ్రీకృష్ణాష్టకము- పంచాయుధస్తోత్రములు పురస్సరముగ శ్రీ లక్ష్మి- అష్టోత్తర శత నామములను చెప్పుచుండగా వాటిని మీరు తిరిగి నుచ్చరించుచు మీకు సప్లైచేయబడిన ప్రాణప్రతిష్ఠితమైన చిన్న యంత్రపథకమునకు మీరే స్వయముగ షోడశోపచారములను చేయుచు. శ్రీచూర్ణముతో అష్టోత్తరశత నామార్చనను చేయవలసినది.

ఇందులకు గాను మీకు ప్రాణప్రతిష్ట చేయబడిన యంత్రపథకము ఒకటియున్ను, ఒక తులము మంచి శ్రీచూర్ణమున్ను అవసరపూజా సంభారములను సప్లైచేసి నందులకు తచ్ఛాంతికిని కలిపి ఒకొక్క- శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామార్చనమునకై రూ 2/- చొప్పున మాత్రము మీరు చెల్లించవలసియుండును.

ఇటులనే పది దినములు పది లక్ష్మి అష్టోత్తరశతనామార్చనలను స్వయముగ మీరు మీ గోత్రనామములతో; తచ్ఛాంతులతోసహా జరుపుటకు మొత్తము రూ 20/- చొప్పున చెల్లించవలసియుండును. ఇటుల పూజల చేసినవారికి ఆపూజానంతరమున వారు పూజచేసినవారికి వారు పూజచేసిన యంత్రపథకము, తులసి నిర్మాల్యము, నివేదితమైన కొబ్బరిప్రసాదము. యజ్ఞాంతమున హోమ భస్మము ఈయబడును-

అనగా

ఒకరోజు ఉదయమున తులసితో శ్రీ విష్ణుసహస్రనామార్చనయును, సాయంకాలమున శ్రీచూర్ణముతో శ్రీలక్ష్మిఅష్టోత్తరశత నామార్చనయును, మీ గోత్రనామములతో మీరే స్వయముగా ఈ యజ్ఞమున నిగిపసలమున, నిర్ణిత విధానమున జరుపుటకు (రూ 11 రూ 2) మొత్తము రూ 13-0-0 చొప్పునను;

ఇటులనే ఈ యజ్ఞమున 19రోజులలో జరుపుటకు మొత్తము రూ 130/- న్ను మీరు చెల్లింపవలసియుండును. గావున, భక్తులారా మీమీ ఉత్సాహ అవకాశముల ననుసరించి ఈ పూజలను చేసుకొని శ్రియః పతి కటాక్ష పాత్రులగుదురుగాక.

# కట్నములు

గాదె రామయ్యంగారు (విజయనగరం) రు 275 0 0

శ్రీ మహారాజశ్రీ గంగవల్లి ప్రకాశమ్మగారు C/o శ్రీ రాజా కందిమళ్ళ వెంకటరామారావుగారు (అశ్వారావుపాలెం) 200 0 0

గ్రంధి లక్ష్మీనరసింహంగారు (రాజమండ్రి) 116 0 0

ముడుంబై వెంకటసత్యవతమ్మగారు (రాజమండ్రి) 116 0 0

పట్టాల నారాయణమ్మగారు (రాజమండ్రి) 58 0 0

పసుమర్తి పుష్పావతమ్మగారు 29 0 0

కొండుపర్తి శీతారామమోహనరావు 29 0 0

గ్రంధి దుర్గారావుగారు 29 0 0

గుండాల బదరీనారాయణమూర్తి పంతులు బి. ఏ బి. యల్ 29 0 0

అవసరాల వేదవల్లి తాయారమ్మగారు (విజయనగరం) 29 0 0

శ్రీ నారాయణం సూర్యారావుగారు 29 0 0

పుదుకోట ఈశ్వరసుబ్రహ్మణ్యశాస్త్రిగారు (విశాఖపట్నం) 29 0 0

రామినేడి వెంకటరాయుడుగారు 29 0 0

శ్రీ త్రైవర్ణిక వైష్ణవరామానుజకూటం C/o దాసరి యతిరాజ సంపత్కుమారులు (విజయనగరం) 29 0 0

మంచుకొండ అరుంధతిగారు 29 0 0

నాగులకొండ వేదం దేవితాయారమ్మ 29 0 0

వెంకటసూర్యనారాయణమూర్తిగారు 29 0 0

వెంకటసుబ్బారావుగారు 29 0 0

శీతమ్మగారు 29 0 0

వెంకటనరసయ్యగారి భార్య శేషమ్మ 29 0 0

మట్టుపల్లి శాంతమ్మగారు 29 0 0

శ్రీ వెంకటలక్ష్మీనారాయణకుమారి 29 0 0

శ్రీ లక్ష్మీనరసమ్మమ్మగారు 29 0 0

బి. రామలమ్మగారు 29 0 0

దాసరి రామానుజంగారి భార్య రంగనాయకమ్మగారు 29 0 0

శిరంజీవులగారి శ్రీరాములుగారు 29 0 0

శ్రీరాములుగారి భార్య నాంచారమ్మ 29 0 0

మంచుకొండ డిల్లెమ్మగారు 29 0 0

గూడూరి రామారావుగారి భార్య వెంకటచలమ్మగారు 29 0 0

సిద్దా తులశమ్మగారు (విజయవాడ) 18 0 0

బదరినారాయణం తాత్కాలిక పూజలు

శ్రీమతి కడారినాగమ్మగారు (విజయనగరం) 11 0 0

శ్రీమతి దామెరలక్ష్మీరామాయమ్మగారు (విజయవాడ) 11 0 0

---

## శ్రీ జీయర్‌స్వామివారి భిక్షానిధి

శ్రీమతి మైలవరం 3వ రాణీగారు సూ. వరమంగయమ్మారావుబహద్దూరుగారు ఒకరోజు భిక్ష 11 0 0

శ్రీమతి గుదేటి సీతారామమ్మగారు (చుండూరు) 11 0 0

శ్రీమతి మోదుగుల సీతారామమ్మ (చుండూరు) 11 0 0

శ్రీ వేదాల కోనాచార్యులుగారివదినె గారైన కొండూరి కనకవల్లి తాయారమ్మగారు పరమపద సందర్భమున మనసంఘమునకు సమర్పించిన రు. 2-0-0 లు మణిఆర్డరు కెలవు 0-2-0 పోను 1-14-0 కోలవెన్ను

2-0-0 చెలసాని రాఘవేంద్రరావు జనన కట్నముకుగాను

2-0-0 పండుపాపమ్ వివాహకట్నమునకుగాను

1-0-0 బి. రంగాచార్యులుగారు పత్రికకు బహుమతి

2-0-0 గాజులవెంకటసుబ్బారావుగారు శ్రీ రామానుజ తిరునక్షత్రం చాత్మురి సందర్భమున కట్నం.

3-0-0 శ్రీ గురుశఠగోపాలాచార్యులుగారు కుమారుని వివాహకట్నముకు గాను

5-0-0 బరంపుర్గం వెంకటేశ్వర స్వామివారి ధర్మకర్త ఆత్మకూరి వరదరాజ శ్రేష్ఠిగార్లు పరమపద సందర్భమున

1-0-0 విజ్ఞపు నారాయణరావుగారు

2-0-0 మహిళామందలి తరపున తిరువెంగడం తాయారమ్మగారు

25-0-0 తెలికచర్ల కందాళకుమారరామానుజ చార్యులుగారు తాడిపత్రిపత్రికకు శాశ్వతచందాకుగాను

11-0-0 కె. యస్. గుండప్పగారు బదరీపూజకు

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ నిడుముక్కల సుబ్బారాయుడు రంగవల్లి తాయారమ్మ ధర్మరామానుజ కూటం తరపున ని. శ్రీరామమూర్తిగారు నమ్మాళ్వారి తిరునక్షత్రం సందర్భమున మన సంఘమునకు సమర్పించిన సంభావన రు 2 0 0

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులుగారి తిరుకుమారులు శ్రీవెంకట రమణాచార్యులుగారు B.S.E.లో మొదటితరగతిలో ప్యాసైనందులకు (బరంపురం) సంఘమున కిచ్చిన కట్నం 1-0-0

శ్రీరామతీర్థం శ్రీ యతిరాజసేవా మహిళా మండలివారు బదరీపూజకిచ్చిన కట్నం 51-0-0

మద్రాసు కోట సులోచనమ్మగారు గీతోపదేశం రెండవభాగము ముద్రణకు సమర్పించిన కట్నం 40-0-0

## వి శే ష వా ర్త

బంపురంలో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధికి వేంచేసినప్పుడు ఆలయముల సన్నిధి లాంచనములతో ఆస్వామివారిని సత్కరించి ఆలయ ధర్మకర్తలు సమర్పించినదీ 58-0-0

యీ సమయమున శ్రీయతిరాజసేవా మహిళామండలివారు శ్రీమతి తి, వె. తిరువెంగడమ్మగారి ద్వారా శ్రీ స్వామి వారికి సమర్పించినది. 41-0-0

శ్రియఃపతి వీరికి సమస్త శుభములు ప్రసాదించుగాక.

ఈ కైంకర్యాభివృద్ధిని మంగళశాసనసాను కోరుచూ మహిళామండలి (బరంపురం) వారి తరపున తిరువేంగడమ్మగారు మనసంఘమునకు రు. 2-0-0 కట్నముగా సమర్పించిరి.

బూరగపల్లి వాస్తవ్యులు, విద్వాన్ శ్రీమాన్ అరవల్లి లక్ష్మణాచార్యులుగారు తమ ప్రథమపుత్రికకు సీతారామలక్ష్మి అని నామకరణసాచేసిన ముసందర్భలో సంఘమునకు సమర్పించిన కట్నం. 2-0-0

బరంపురం శ్రీ గాడె యశోదాలలితాదేవి శుక్రవార పూజ సందర్భములో సమర్పించిన కట్నం. 1-0-0

బరంపురం శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు శ్రీ జియ్యర్ స్వామివారికి సమర్పించిన కట్నం. 58-0-0

శ్రీమతే రామానుజాయనమః.







# శ్రీయతిరాజ సేవామహిళామండలులకు వార్షికవిరాట్ - సమావేశమునకు

అమ్మా !

స్వస్తిశ్రీ హేవిళంబి నామసంవత్సర జ్యేష్ఠ బ ౧౨ శ్రీ సోమవారము (ది 24-6-57 లగాయతు వరుసగ పదిదినములును శ్రీయతిరాజ సేవామహిళామండలి యొక్క వార్షికవిరాట్ సమావేశమును శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి ఆదేశానుసారముగ విజయవాడలో జరుపుటకు ఏర్పాట్లు చేయబడినవి.

గాన యీ సమావేశమునకు మీమండలి తరఫున ప్రతినిధులను ఇందులకు పంపించి యిందుపాల్గొని దీనిని సఫలము చేయగోరుచున్నాము. మరియు మీ మండలితరఫున స్త్రీ సభ్యురాండ్రను సాంప్రదాయ విషయముల నుపన్యసించువారిని, భగవద్గీతాపఠన మొనర్చువారిని, స్తోత్రపాఠముల సేవించువారిని, ద్రావిడ ప్రబంధముల నధ్యయనమొనర్చువారిని, కవిత్వమొనర్చువారిని సంస్కృతభాషా భ్యాసకులను, పురాణ ప్రవక్త్రులను పంపించ గోరుచున్నాము.

మరియు సంప్రదాయాభివృద్ధికై తగు సలహాలను, సూచనలను, సహాయమును, తీర్మానములను పంపగోరుచున్నాము.

ఎవరెవరు ఎప్పుడు విజయవాడకు వచ్చునదియు, ఏయే కార్యక్రమములలో పాల్గొనదలచునదియు మరియు ఏయే ఏర్పాటుల చేయగోరునదియు ముందుగ మాకార్యాలయమునకు తెలుపగోరుచున్నాము.

ఆహ్వానసంఘ అధ్యక్షురాలు :
సూరానేని శ్రీ వరమంగయ్యమ్మారావు
(మైలవరం మూడవరాణి)

ఇట్లు,-
శ్రీ అమరవాది లక్ష్మీనరసమ్మ
కార్యదర్శిని

సూచన:- ఇది శ్రీ కృష్ణానదీ పుష్కరదినములలో జరుగుచున్నది. ఈ విషయములను మీకు పరిచయమున్న మహిళలందరికిని తెలుపవలసినది. ఈ సమయమున మన సంఘము తరఫున బ్రహ్మయజ్ఞము, "కోటితులసిపూజ" విద్వత్సభలుకూడ జరుగనున్నవి. ప్రస్తుతమున శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారీ ప్రాంతమున లేరు దూరదేశమున ప్రచారములోనున్నారు. వారి కార్యక్రమములకు కొలదిరోజులు ముందుగమాత్రమే యిచ్చుటకి విచ్చేయుదుమనిరి. ఈ కార్యక్రమము యొక్క నిర్వహణ భారమంతయు పూర్తిగ మనమీదనే ఆధారపడియున్నది. కావున మీరుస్వహస్త పరహస్తముల ద్వారా ఈ కార్యనిర్వహణమునకై కావలసిన ధనము, బియ్యము, పప్పులు, నేయి, కూరలు, పాలు, పెరుగు వగైరా వస్తువులను యథాశక్తిగ సమర్పించి దీనిని సఫల పరుపగోరుచున్నాము.



శ్రీమతే రామానుజాయనమః.





# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి
# వార్షిక విరాట్ సమావేశము విజయవాడ

శ్రీ

అమ్మా!

స్వస్తిశ్రీ హేవిళంబినామసంవత్సర జ్యేష్ఠ బ ౧౨శీ సోమవారము (ది 24-6-57) లగాయతు వరుసగ పదిదినములు శ్రీ యతిరాజ సేవామహిళామండలి వార్షిక విరాట్‌సమావేశమును శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామి వారి ఆదేశానుసారముగ విజయవాడలో జరుపుటకు ఏర్పాటుచేయబడినది. శ్రీ జీయర్‌స్వామివారుదగ్గరయుండి దీనిని నడిపించుట కంగీకరించిరి. కాన తాము దయయుంచి యిందులకువిచ్చేసి ఇందు పాల్గొన గోరుచున్నాము. (ఇది శ్రీకృష్ణానదియొక్క పుష్కర పుణ్యకాలమును నైయున్నది.

ఈ రోజులలోనే మన సంఘాధ్వర్యమున బ్రహ్మయజ్ఞము కోటి తులసి పూజయుగూడ జరుగును గాన దానిని గూడ తాము సందర్శించి ఆనందించ గోరుచున్నాము

ఈ విరాట్ సమావేశమున సాంప్రదాయ విషయముల ఉపన్యాసములు, భగవద్గీతా పఠనము, స్తోత్రపాఠముల యను సంధానము; ద్రావిడ ప్రబంధాధ్యయనము, కవితాగోష్ఠి సంస్కృతభాషా ప్రబోధము, పురాణపఠనము, పెద్దలకు, ప్రచారకురాండ్రకుసన్మాన పత్రి సమర్పణము - ఇత్యాదులు జరుపుటకు నిశ్చయింపబడినది.

వీనిలో మీరు ఏదో విషయమున స్వయముగ పాల్గొందురో, లేక మీ ప్రాంతీయులు పాల్గొందురో దయయుంచి మాకు ముందుగ తెలుపగోరుచున్నాము.

(ఒక్కొక్క రోజున ఒక్కొక్కరిని అధ్యక్షులుగను, మరొక్కరిని సభాప్రారంభకులుగను, ఇద్దరేసి ఉపన్యాసకులుగను అహ్వానించియున్నాము. చాలమంది వద్దనుండి అంగీకార పత్రములు వచ్చినవి. మీరుకూడ ఏమైన ఉపన్యసించుటకుగాని, తీర్మానములు ప్రవేశపెట్టుటకుగాని కోరినచో ముందుగ తెలుపగోరుచున్నాము

కార్యాలయము
కొత్తగుళ్ళు విజయవాడ
15-5-57

ఇట్లు,
ఆహ్వాన సంఘము.

## కార్యక్రమము

ప్రతినిత్యము ఉద॥ గం. 4-0 మొదలు గం. 5-0 వరకు శ్రీ విష్ణుసహస్రనామపారాయణముతో
ప్రతినిత్యము ఉద॥ గం. 8-0 మొదలు గం. 9-0 వరకు శ్రీవిష్ణుసహస్రనామార్చన. [తిరువీధిగోష్ఠి
ప్రతినిత్యము మధ్యా గం. 1-30 మొదలు గం. 3-0వరకు సభలు (ఉపన్యాసాదులు)
ప్రతినిత్యము సాయం గం. 7-0 మొదలు గం. 8-0వరకు శ్రీమహాలక్ష్మిపూజలు
శ్రీ స్తవ శ్రీగుణరత్నకోశ, శాయతిరు-మడల్ మొదలగు గ్రంథానుసంధానము

శ్రీమతే రామానుజాయనమః



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి

# తృతీయ శ్రీహరినామ సంకీర్తన మహాక్రతువు

ప్రారంభము:- శ్రీహేవిళంబినామ సంవత్సర ఆషాఢశుద్ధ ద్వాదశీ సోమవారము (8-7-1957)

సమాప్తి:- శ్రీహేవిళంబి నామసంవత్సర కార్తీక శుద్ధద్వాదశీ సోమవారము (4-11-57

అర్హత:- భగవంతునియందు భక్తిగల మానవమాత్రులందరును అన్నివర్ణముల వారును, అన్ని ఆశ్రమములో నున్నవారును, అగు స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులును ఇందు పాల్గొన నర్హత కలిగియున్నారు.

ఉద్దేశ్యము:- లోకకళ్యాణము     స్థలము:- భక్తులందరి గృహములలోను

రుసుము, లేక దక్షిణ } ప్రతిదినము, దినమునకు 108 పర్యాయములకు తక్కువ గాకుండగ తమశక్తి ఉత్సాహావకాశముల ననుసరించి చేయగలిగినంత హెచ్చుగ నిష్కామముగా భగవదర్పణ బుద్ధితో భగవత్ప్రీతి కొరకై

హరేరామ, హరేరామ, రామ, రామ, హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

అను 32 అక్షరములు గల మంత్రమును జపించి చివర "శ్రీకృష్ణార్పణమస్తు" అని భగవంతుని కర్పణ చేయుటయే

ఫలితము:- భగవత్కటాక్ష పాత్రులగుటయే.

ప్రియభక్తులారా !

దుర్లభమైన మానవ జన్మ మెత్తినందులకు ఫలితము భగవంతుని గుణసంకీర్తన మొనరించ గలుగుటయేకదా. ఇది భుక్తిముక్తిదాయకము. సర్వపాపహారము సర్వసంపత్సిద్ధి కరము. అనంతమగు భగవంతుని కళ్యాణ గుణగణములలో

"హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే"

అను నామ సంకీర్తనము అత్యంత వైభవోపేతమైనది. మరియు కలియుగమున ప్రత్యేకము దీనియొక్క ప్రభావము వర్ణించ శక్యముకానిది.

గాన బుభుక్షువులుగాని ముముక్షువులుగాని దీనిని సదా జపించు చుండుట సర్వశ్రేయోదాయకమైయున్నది. సంవత్సరములో నతిపవిత్రమై పుణ్యవంతమై శ్రీహరికతి ప్రీతికరమైన మాసము చాతుర్మాసము. చాతుర్మాస్య మనగా, ఆషాఢ శుద్ధ ద్వాదశి మొదలు కార్తీక శుద్ధ ద్వాదశి వరకు గల నాలుగు మాసములున్ను. ఈ 120 రోజులున్ను తప్పక ప్రతి మానవుడున్ను, నిష్ఠలో శ్రీవారి నామములను స్మరించు చుండవలెను. ఇదియే చాతుర్మాస్య వ్రతము. వ్రతము లన్నింటిలోను, సార్వత్రికమై శాశ్వత పదవినీయగల వ్రతరాజ మీచాతుర్మాస్యమే. దీనిని మానవ మాత్రులందరు చేయవచ్చును. చేయవలెను.

భక్తాగ్రేసరులారా !

మీరుకూడ యీ వ్రత దీక్షను వహించి 120 దినములు శ్రీ హరినామ సంకీర్తన మొనరించి, యీ క్రతువున

పాల్గొని ధన్యులు కావలెను. మీ బంధు మిత్రులను పరిచితులను యిందులకు ప్రోత్సహించవలెను.

ఈ క్రతువున పాల్గొని యీ మంత్రమును జపించుచుండు నంతమాత్రమున మీ రిదివరలో అనుష్ఠించుచుండు మంత్ర జపముల వేటిని వదల నలదు. వాటితో పాటుగ దీనిని గూడ భగవద్గుణాను భవరూపముగ జపించుచుండ వలెను.

ఈ క్రతువున పాల్గొన దలచినవారు అనుసరించ వలసిన నియమములు.

## విశేష విధి

హెచ్చునిష్ఠలో విశేషవిధిని అనుసరించ దలచినవారు.

(1) శ్రీ నారాయణ అష్టాక్షరీ మంత్రోప దేశమును బడ యనివారు యీ మంత్రమును మంత్రసిద్ధి గల బ్రాహ్మ ణుని వలన యుపదేశము పొందవలెను. (ఇదివరలోనే సక్రమముగ ఉపదేశమును పొందియున్న గాని, నారా యణాక్షరీ ఉపదేశమును పొందియున్న గాని తిరిగి యుపదేశమును పొందనవసరము లేదు.

(2) ప్రతి దినము ఉదయముననే స్నానమాచరించి [సుఖా సీనులైనచో పర్వదినములు కానప్పుడు జుట్టుముడి విప్పి పసుపునీరు చల్లుకొని కంఠస్నాన మాచరించిన చాలును. పర్వదినములలో శిరస్నానము చేయవలెను.) ఆరవైచిన మడిబట్టలను ధరించి తమ సాంప్రదాయాను గుణమైన బొట్టును పెట్టుకొని తమతమ నిత్యకర్మాను ష్ఠాన నంతయు క్రమప్రకారముగా చేసుకొని తమ అవ కాశము ననుసరించి ఏకాంత స్థలమున మౌనముగ కూర్చుండి కళ్లుమూసుకొని మనస్సున శ్రీమన్నారా యణుని ధ్యానించుచు దినము ఒక్కంటికి 108 పర్యా యములు తక్కువగాకుండగ (ఇంతకంటే హెచ్చైనను మంచిదిరమే) దీనిని జపించవలెను. 1008 పర్యాయములు చేయుచుండుట విశేషము.

మధ్యలో విఘ్నము కలిగినచో ఆ లోటుమిగతా కాలములో పూర్తిచేసుకొన వచ్చును.

3) సాత్వికాహారము, సత్సహవాసము, సద్గ్రంథ పఠనము, భగవద్భాగవత సేవ, బ్రహ్మచర్యము, వీటిని పాటించ వలెను.

(4) అవకాశమున్నచో ప్రతిదినము జపాంతమున ఒక గుప్పెడు బియ్యమును ఒక కానిడబ్బును తీసి, కృష్ణా ర్పణమని వేరేయుంచి జాగ్రత్త పెట్టుచుండ వలెను. వ్రతసమాప్తమున ఈ బియ్యము డబ్బులతో తదీయా రాధనమును ఇంకను శక్తికొలది బీదలకు అన్నదానము, గోపూజ సలుపవలసినది.

ఆ శౌచకాలములందు మానసిక ధ్యానమే గాని పైకి ఉచ్చరించరాదు.

పురుడు, మైలలు వచ్చినపుడు జపమును మాన నవ సరము లేదు. జపము మానసికముగ చేయుచుండ వచ్చును.

స్త్రీలు బహిష్ఠు అయిన రోజులలోకూడ జపమును మానవలసినది లేదు. మానసికముగ జపము చేయుచుండ వచ్చును. (గాని పురుడు, మైల, బహిష్ఠు ఇత్యాది అశౌచ సమయముల యందు తులసిమాలను లెక్కకై వాడరాదు.

పై సమయములందలి జపసంఖ్యను దీక్షానిర్ణీత సం ఖ్యలో గణించకుండుట మంచిది.

ఇంటిలో ఎంత మందియున్న అంతమందియు ఈ జపమును చేయవచ్చును. విద్యార్థులు, ఉద్యోగస్థులు, అందరు చేయవచ్చును.

దీనికి హోమముగాని, తర్పణముగాని లేదు. కాని జపమంతయు పూర్తియయిన పిమ్మట తులసితో గాని, పుష్పములతోగాని భగవంతునికి సహస్ర నామార్చనము చేయవలసినది. ఇదిగాక తమశక్తి, ఉత్సాహ అవకాశముల ననుసరించి బీదలకు అన్నసంతర్పణము భూతబలియు (పశు వులకు, పక్షులకు, జంతువులకు ఆహారమిడుట) జరిపించ వలసినది.

ఆఖరిదినమున జపము పూర్తియయిన పిమ్మట బంధు మిత్రాదులతోకలిసి గోపూజను గావించి సమిష్టి భజనను, అవబృథోత్సవమును జరిపించవలసినది.

ఇట్లు

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజజీయర్ స్వామివారు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ అధ్యక్షులు.

ప్రధాన కార్యదర్శి :
శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు
కార్యాలయము: శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం, చుండూరు (పో) గుంటూరు(జి)

ఈ కాగితమును మీ బంధుమిత్రాదులకు కూడ అందచేయుడు. మీ గ్రామములో శ్రీ హరినామ సంకీర్తన మహామండలిని స్థాపించి ప్రతి సంవత్సరమున ఈ కార్యక్రమమును శృతముగ జరుగు నేర్పాటు గావింపుడు మీకు ఇట్టి కాగితములు కావలసియున్నచో మీరే స్వయముగా నచ్చు వేయించుకొనుడు.

శ్రీ రస్తు.





శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ వార్షిక విరాట్ సమావేశము

# ఆహ్వానపత్రిక

విజయవాడలో ది 24-5-57 మొదలు 3-7-57 వరకు

ప్రియ మహాశయా!

స్వస్తిశ్రీ హేవిళంబినామసంవత్సర జ్యేష్ఠబహుళ ౧౨ ది 24-6-57 మొదలు వరుసగా పదిదినములు విజయవాడలోని క్రొత్తగుళ్లలో శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ వార్షిక విరాట్ సమావేశము జరుగును. తాము బంధుమిత్రాదులతో వచ్చి పాల్గొన గోరుచున్నాము.

ఈ సమావేశము జరుగుకాలములోనే ఈ సంఘయాజమాన్యమున అచ్చటనే బ్రహ్మయజ్ఞము కోటితులసీ పూజయు కూడ జరుగును. వాటియందును తాము అన్వయించి యానందింప గోరుచున్నాము.

మీరు ఈ సమావేశమున సంప్రదాయాభివృద్ధికి సంబంధించిన తీర్మానముల నేవియైన ప్రవేశపెట్టదలచినచో వాటిని ఒక వారమురోజులు ముందుగానే కార్యాలయమునకు పంపగోరుచున్నాము. మరియు తాము స్వయముగాగాని తమశాఖా సంఘపు తరపున ప్రతినిధులు ద్వారాగాని, ఈ సమావేశమున, కవితాగానమునుగాని, ఉపన్యాసమునుగాని లేక సంప్రదాయాభివృద్ధి కరములైన యితర కార్యక్రమములనుగాని జరుపదలచినచో అట్టి వివరణములన్నింటిని యీసమావేశమునకు 10 రోజులు ముందుగ తామే యీ కార్యాలయమునకు దయయుంచి తెలుపగోరుచున్నాము.

ఈ ఆహ్వాన పత్రికను తమ బంధుమిత్రులకును మీ ప్రాంతీయులకును జూపి వారిని గూడ ఈ సమావేశమునకు ఆహ్వానించి తీసుకొని రాగోరుచున్నాము

బ్రహ్మయజ్ఞ, కోటితులసీపూజ కాగితములను గూడ యిందుతో పంపుచున్నాము. ఈ విషయములో మీ స్వహస్త పరహస్తముల ద్వారా మీకుత్సాహము, అవకాశమున్నంత వరకు కైంకర్యమును జేసి వీని నిర్వహణమునకై తోడ్పడ గోరుచున్నాము.

ఆహ్వాన సమితి
కార్యాలయము: క్రొత్తగుళ్ళు
విజయవాడ-1

ఇట్లు,
తె. కం. గోపాలాచార్యులు
కార్యదర్శి

# ముఖ్య గమనిక

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు శ్రీకాకుళములో శ్రీ సీతారామస్వామివారి ఆలయమును దివ్యస్థలము చేయుటకు దీక్ష వహించి భిక్షా పాత్రతో తిరువీధులన్నియు పర్యటించి షుమారు 30000 ముప్పైవేల రూపాయిలు కమ్మతుగల మూలనిధిని సేకరించిరి.

శ్రీ కూర్మములో శ్రీ జీయర్ స్వామివారు శ్రీ కూర్మనాధుని దేవాలయములో శిథిలమైన తూర్పు ధ్వజస్తంభమును క్రొత్తగా ప్రతిష్ఠించుటకు సంకల్పించి భిక్షాపాత్రతో తిరువీధికి వేంచేయగా 1500 పదిహేను వందల రూపాయిలతో పాత్ర నిండిపోయెను.

శ్రీ కాకుళము లోను, శ్రీ కూర్మములోను ప్రతిష్ఠా కార్యక్రమమును రాబోవు మాఘ మాసములో జరుపుటకు నిశ్చయించి శ్రీకాకుళంనుండి కాలినడకతో ఆముదాలవలసకు విచ్చేసిరి.

శ్రీ జీయర్ స్వామివారి వెంట శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారున్ను శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులుగారు అన్వయించి యున్నారు.

ఆముదాలవలసలో పాదయాత్ర పర్యటన చాలించి శ్రీవారు స్వంత మోటారు వ్యాను మీద విజయవాడ బ్రహ్మయజ్ఞ నిర్వహణకు బయలుదేరినారు.

త్రోవలో శ్రీరామతీర్థం, విజయనగరం, బొబ్బిలి, పద్మనాభం, సింహాచలం, అనకాపల్లి, తుని, అన్నవరం, విశాఖపట్నం, రాజమండ్రి, పాలకొల్లు, నరసాపురం, భీమవరం, గుడివాడ గ్రామాలలో ఆగుచూ విజయవాడకు వేంచేసియున్నారు.

**BOOK—POST**

"భక్తినివేదన" శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం. (వయా) చుండూరు గుంటూరుజిల్లా

సాలు చందా **5—0—0** వేదాంత మాసపత్రిక ప్రచారవిభాగం **1-4-0**

To

[illegible]



[illegible]

[illegible]

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Sri Satyanarayana Printing Works, Vijayawada for Sriman Press Nadigaddapalem,

శ్రీ హయగ్రీవాయ నమః

# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]

సంపాదకులు :
శ్రీ వి.ప్ర.సం ప్రధానకార్యదర్శి
తి. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ల రామానుజాచార్యులు

సంపుటం ౧౦ | హేవిళంబి - ఆషాఢము | సంచిక ౪



# ముఖ్యగమనిక

విజయవాడలో విశ్వకళ్యాణార్థమై విజయవంతముగా బ్రహ్మయజ్ఞమును పూర్తి గావించి శ్రీత్రిదండి శ్రీమన్నారాయణరామానుజ జీయర్ స్వామివారు శ్రీమాన్ తె. కం. విద్వాన్ గోపాలాచార్యస్వామివారితోను, శ్రీమాన్ కవి రత్న గుదిమెళ్ళ రామానుజాచార్యుల వారితోను కలిసి నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమమునకు 6-7-57వ తేదీనాడు విచ్చేసిరి.

ఇది మొదలు శ్రీజియ్యర్ స్వామివారు రెండుమాసములు ఆశ్రమమందే వేంచేసి యుందురు. ఆషాఢ శుద్ధ ద్వాదశినాడు ఆస్వామివారు చాతుర్మాస్య దీక్ష స్వీకరింతు

శ్రీమాన్. విద్వాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు బదరి కాశ్రమమునకు వేంచేసి అచ్చట అష్టాక్షరీ మందిర నిర్మాణ యత్నములో నుందురు. శ్రీకవిగారు, ఆశ్రమమందేయుండి పత్రికావ్యవహారములు చూచు చుందురు.

శ్రీ జియ్యర్ స్వామివారికి జవాబు వ్రాయువారు. నడిగడ్డపాలెం ఆశ్రమం చుండూరు పోస్టు గుంటూరు జిల్లా అనియు

శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యుల వారికి జవాబు వ్రాయువారు. బదరీనాథ్. గర్వాలజిల్లా అనియు వ్రాయవలెను.

శ్రీ హయగ్రీవాయ నమః



# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)

సంపాదకులు :
శ్రీ వి. ప్ర. సం ప్రధానకార్యదర్శి
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుడిమెళ్ల రామానుజాచార్యులు

సంపుటం ౧౦ | హేవిళంబి - ఆషాఢము | సంచిక ౪

# అర్చావతార వైభవము

(విగ్రహారాధన వైభవము)

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః॥గీత 4 అ. శ్లో॥

తా. ఎవరు నన్నాశ్రయించగోరి నన్నే విధముగ సంకల్పించి యాశ్రయించుచున్నారో వారికి వారి సంకల్పాను సారముగనే నా రూప మును జూపుచున్నాను. వేయేల, సకల మాన వులును నా యభిమానమును సంపాదింపగోరి నా స్వభావమును తమ ఇంద్రియములతో తా మపేక్షించిన సమస్తరీతులతోను అనుభ వించుచున్నారు.

భగవద్గీతయందలి నాల్గవ యధ్యాయము భగవదవతార రహస్యము, అర్చావతార రహ స్యము, సృష్టి రహస్యము, కర్మాకర్మ రహ స్యము, కర్మజ్ఞానాకార రహస్యము, కర్మభేద రహస్యమనెడు పెక్కు రహస్యార్థములతో నలరారుచున్నది. ఇందవతార రహస్యము, కర్మాకర్మ రహస్యము మొదలగునవి వెను కటి గీతోపదేశహారములో ప్రకటింపబడినవి.

ఇప్పుడు సృష్టిరహస్య మీభాగముననే ప్రక టింపబడెను. అర్చావతార రహస్యము ప్రకటింప బడు చున్నది.

ఈ యధ్యాయ ప్రారంభమున శ్రీకృష్ణ భగ

వానుడు 'అవరం భవతో జన్మ' అనెడు అర్జునుని ప్రశ్నవ్యాజమున "బహూని మే వ్యతీతాని" యనెడు 5వ శ్లోకమునుండి 'పరిత్రాణాయ' యనెడు శ్లోకమువరకు నాలుగు శ్లోకములచే తన యవతార రహస్యమును, 9, 10 శ్లోకములచే నట్టి యవతార రహస్య విజ్ఞానమునకు ఫలమును సోదాహరణముగ వివరించెను.

ఇట్లు సాధుపరిత్రాణాదుల కొఱకై తన సంకల్పముచే దేవమనుష్యాది రూపములతో నవతరించుటను తెలుపుటవలన ఉపాసనకు ముఖ్యమగు; భగవత్సౌలభ్యము చెప్పబడెను. ఇప్పు డీవ్యాసమునకు శీర్షికగా నుదహరింపబడిన "యే యథా మాం ప్రపద్యన్తే" యను శ్లోకమున 'కృష్ణావతార వృత్తాన్తముతోపాటు అర్చావతార వృత్తాంతమున్ను సంగ్రహింపబడినది. గాన నా సౌలభ్యమునకు చివరహద్దు చూపపడిన'దని శ్రీ దేశికులువారు తమ తాత్పర్యచంద్రికా వ్యాఖ్యానమున సాయించిరి.

"అత్ర కృష్ణావతార వృత్తాన్తేన సహ అర్చావతార వృత్తాన్తోఽపి సఙ్గృహీతః" అని.

ఆళ్వారులందరును యీడుపడిన దీ యర్చావతారమునందే గదా!

ఈ శ్లోకమున కర్చావతారపరముగ శ్రీ భాష్యకారులు సాయించిన గంభీర భాష్య శ్రీసూక్తులకు శ్రీ దేశికులు వివరించిన యర్థవిశేషములున్ను గీతలో పెక్కుస్థలములలో జూపబడిన అర్చారాధనావిధానమున్ను వ్యాసావసానమున వ్రాయబడును. మునుముం దర్చావతార సంప్రదాయ విశేషములను మన పూర్వాచార్య శ్రీసూక్తిప్రమాణములతో ననుసంధింతము-

మన సిద్ధాంతమునకు ప్రమాణ శిరస్కమన దగిన దివ్యప్రబంధము శ్రీ వచనభూషణము. ఇందు దేశకాల ప్రకారాధి కార్యాదినియమములచే నియతాధికారకమగు కర్మజ్ఞాన భక్తుల కంటె నవి యొక్కటియు లేని ప్రపత్తి ముఖ్యమగు మోక్షోపాయముగ నిర్ణయింపబడెను. ఈ విషయమును శ్రీ వచనభూషణమునందలి మొదటి ప్రకరణములోని 23వ సూత్రమున

"ప్రపత్తిక్కు దేశనియమముం కాలనియమముం ప్రకార నియమముం, అధికారినియమముం, ఫలనియమము మిల్లై" యని ప్రతిజ్ఞను గావించి క్రమముగ ననేక ప్రమాణములతో నీ యర్థములను సమర్థించిరి.

ప్రపత్తి యనగా-"భగవచ్చరణ వరణమ్" "ఎమ్బెరుమానై యే ఉపాయమాక పత్తుగై" అనగా ఇతరోపాయములను విడిచి షడ్గుణపూర్ణుడగు శ్రియఃపతినే ఉపాయముగ నధ్యవసించుట యని దాని భావము. దీనినే "భగవత్ప్రవృత్తి ప్రతిబన్ధక స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః అని" చక్కగ వివరించిరి. దీని భావ మేమనగా-భగవంతు డెప్పుడును చేతనుల నుద్ధరించుటకై తన చేతిని చాచియే యుంచును.

శ్లో. పాతు ప్రణతరక్షాయై విలమ్బ మసహన్నివ
సదా పఞ్చాయుధీం బిభ్రత్స న శ్రీరఙ్గనాయకః"

ప్రపన్నుల గాచుటకై ఆలస్యము కాకుండుటకు సర్వదా పంచాయుధములను ధరించి యుండు శ్రీరంగనాథుడు బ్రోచుగాక యని యభియుక్తోక్తిగదా

అట్లగుచో మనకీ దుఃఖానుభవ మేల? యనినచో మన మాతని చేతిని యుపేక్షించి మన రక్షణను మనమే గావించుకొనుచున్నాము. అది యాతడు సహింపనేరడు ద్రౌపది తన మాన సంరక్షణభార మితరులయందును చివరకు తనయందు నుంచుకొనినంతవరకు భగవంతు డుపేక్షించెను. గజేంద్రుడు తన రక్షణభారమును

తనయం దుంచుకొనిన వేయిసంవత్సరములున్ను భగవంతు డుపేక్షించెను. వారు చివర కాభారము "శఙ్ఖచక్రగదాపాణే...రక్షమాం శరణాగతా" మ్మని ద్రౌపదియు "నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ రావే ఈశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా" యని గజేంద్రుడును భగవంతుని యందుంచి నప్పుడే ఆత డొక్కపెట్టున పరుగిడివచ్చి వారల గాపాడెను. కావున భగవంతుడు మనల గాచుటకై చేయు కృషికి మనమే మనలను కాపాడుకొనుటకై చేయు ప్రయత్నము లాటంకములు గాన వాటిని విడుచుటయే ప్రపత్తికి ముఖ్యతాత్పర్యము.

దీనికి కర్మల కున్నట్లుగ కాలనియమము గాని దేశనియమము గాని లేదు ఈవిషయమును విభీషణశరణాగతి సందర్భమున వానరప్రముఖుల వాదముల నన్నిటిని పూర్వపక్షము గావించి శ్రీరామచంద్రునకు తన మతమును వినిపించిన శ్రీ హనుమానుని శ్రీ సూక్తులలో గాంచనగును.

మరియు నధికారులకు నిరంతరానుసంధాన యోగ్యమగు మంత్రరత్నమున శ్రీ, నారాయణులకు నిత్యసంబంధమును బోధించు 'మన్' అనెడు 'మతుప్' ప్రత్యయముచే నీ విషయము సూచింపబడినది. లక్ష్మీ దేవి నారాయణునియొక్క క్షణమైనను విడువకుండుట వ్యామోహకృత్యము కాదు. సర్వేశ్వరుడు హితచింతకుడు కావున కలితీ బంగారమును మంచిబంగారముతో కలుపుటకు దానిని మూసలోనుంచి పుటమువేసి శుద్ధిచేసినటుల జీవులు చేసినపుణ్యాపాపము లనెడు దోషములను పోద్రోలి వీరిని నిత్యముక్తగోష్ఠిలో చేర్చుకొనుటకై దోషములను పోగొట్టవలెను గాన వీరిని శరీరము లనెడు మూసలలో నుంచి తాపత్రయము లనెడు తీవ్రతాగ్నులచే నిరంతరము తపింప చేయుచుండును. బిడ్డలవంటి తన భక్తుల కీ మాత్రమైనను దుఃఖమును సహింపనేరని ప్రేమయే ప్రధానముగా గల యా తల్లి సర్వేశ్వరునియొక్క యీ శిక్షనుండి తనభక్తులను తప్పించుటకొఱకై నిత్య మాతని సాన్నిధ్యమును విడువక యుండును. నిత్య మట్లుండుటకు కారణము – శరణాగతికి దేశకాల నియమములు లేకుండుటచే భక్తు లెప్పుడు సత్వగుణము తలయెత్తి సర్వేశ్వరుని ప్రపత్తిచేయుదురో అప్పుడు తా నాతని చెంత నుండనిచో నాతడు వీరల నేమిచేయునో యని ప్రియమైన తల్లివలె నెల్లవేళల నాతని చెంతనే యుండును. ఈ విషయమును శ్రీ భట్టరువారు శ్రీగుణరత్నకోశము నందలి

శ్లో. పితేవ త్వత్ప్రేయాన్ జనని పరిపూర్ణాగసి జనే|
హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచి త్కలుషధీః|
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వ ముచితై రుపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః|

అను శ్లోకమున స్పష్టపరచిరి. కావున నిత్యయోగమును బోధించు మంత్రరత్నమునందలి 'మతుప్' ప్రత్యయముచే ప్రపత్తికి దేశకాల నియమములు లేవని తెల్లమయ్యెను.

మరియు నచేతనమగు కర్మయోగాదుల నుపాయముగ పరిగ్రహించినచో వాటికి దేశకాలముల ఉత్కర్షాపకర్షలనుబట్టి అతిశయానతిశయము లుండును గాని పరమచేతనుడైన సిద్ధోపాయమగు సర్వేశ్వరు నుపాయముగ నధ్యవసించినచో నాతనికి దేశకాలము లకించిత్కరములే కదా! గంగా కావేరీ మొదలగు పుణ్య

నదులు స్వతస్సిద్ధముగనే పవిత్రతములు లగుటచే శుద్ధాశుద్ధ విభాగము నారయకనే యవగాహించదగి యుండును గదా! ప్రపత్తియు నట్టిదే కావుననే దీనికి ప్రకార నియమము అనగా సంగక్రియాకలాపము (ఫలమున కుపయోగించు వ్యాపారవిశేషము) లేదు.

జీవు డనన్య శరణ్య స్వరూపుడు అనగా - భగవంతుడు తప్ప వేరొక రక్షణోపాయము లేనివాడు) కావున నాతనినే ఉపాయముగా నమ్మియుండుట యనెడు నీ ప్రపత్తి జీవునకు స్వరూపాను రూపమగుటచే దీని కేనియమముల తోను పనిలేదు. కావున జీవసామాన్య మీ ప్రపత్తి కధికారు లగుటచే దీనికధికారి నియమ మున్ను లేదు. కావుననే భారద్వాజ సంహిత యందు-

శ్లో. న జాతిభేదం న కులం న లిఙ్గం న గుణ
క్రియాః
న దేశకాలౌ నావస్థాం యోగో హ్యయ
మపేక్షతే॥
బ్రహ్మక్షత్రవిశ శ్శూద్రాః స్త్రియశ్చాన్తర
జాతయః
సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వధాతార
మచ్యుతమ్॥
ప్రపత్తేః క్వచి దప్యేషా పరాపేక్షా న
విద్యతే।
సా హి సర్వత్ర సర్వేషాం సర్వకామ-
ఫలప్రదా॥

ఈ ప్రపత్తికి జాతిభేద, కులభేద, స్త్రీపురుష భేద, గుణక్రియాదిభేద దేశభేద కాలభేద అవస్థాభేదాదు లేమియు లేవు. నాలుగు వర్ణముల స్త్రీలు, సంకరవర్ణములు, అందరును సకల ఫలప్రదుడగు సర్వేశ్వరుని శరణజొచ్చవచ్చును. ప్రపత్తి కేవిధమగు పరాపేక్షయు లేదు. అది స్వయముగ నంతట నందర కన్ని కోరికల నీయగలదు.

కాని దీని కొక ముఖ్య నియమము కలదు.

సూ. విషయ నియమమేయుళ్ళదు, శ్రీ. భూ. 24సూ.

ఎవరివిషయములో శరణాగతి చేయవలె ననెడు నియమము మాత్రమీ ప్రపత్తి కని వార్యము.

సూ. విషయ నియమమావదు గుణపూర్తియుళ్ళ
విడమే విషయమాకై.
పూర్తియుళ్ళదు మర్చావతారత్తిలే॥
శ్రీ. భూ. 25 సూ.

విషయనియమ మనగా గుణము లెవ్వని యందు పుష్కలముగ నుండునో నాతనినే ప్రపత్తి చేయవలెను. అట్టి పూర్తి యర్చావతారమునందు మాత్రమే కలదు. ఈ విషయము పాద్మసంహితలో భగవానుడే స్వయముగ నానతిచ్చెను.

శ్లో. అర్చావతారవిషయే మయా ప్యుద్దేశత
స్తథా।
ఉక్తా గుణా న శక్యన్తే వక్తుం వర్షశతైరపి॥

నే నర్చాగుణముల నిప్పుడు సంగ్రహముగ చెప్పితిని. కాని పూర్ణముగ జెప్పవలెననిన కొన్నివందల వత్సరములు చెప్పినను తరుగవు,

అర్చావతార మననేమి ?-

ఈ విషయము విష్ణుసంహితయందు-

శ్లో ఏవంపఞ్చ ప్రకారోఽహమాత్మనాం పతతా
మధః
పూర్వస్మా దపి పూర్వస్మాత్ జ్యాయాం
శ్చైవోత్తరోత్తరః॥
సౌలభ్యతో జగత్స్వామీ సులభో హ్యుత్త
రోత్తరః

నేను సంసారకూపమునబడి మగ్గుచున్నచేత

నోద్ధారణకై పర, వ్యూహ, విభవా, న్తర్యా మ్యర్చలనెడు ఐదు విధములుగ నుండును.

మొదటి రూపముకంటె రెండవది దానికంటె మూడవది యిట్లొకదానికంటె నొకటి యధిక సౌలభ్యముతో కూడియుండును అని చెప్ప బడెను.

దీని నాధారము గొనియే శ్రీ పరాంకుశ మునీశ్వరులు తిరువాయ్మొళ్ళి దివ్యప్రబంధ మున,

పాసు. విణ్మీదిరుప్పాయ్ మలైమేల్ నిఱ్ఱాయ్।
కడల్ శేఱ్ఱాయ్॥
మణ్మిళ్ళాయ్. ఇవత్తు శిళ్ళుం మఱైన్దు
ఱైప్పాయ్।
ఎణ్ మీదియన్ద పుఱఅణ్డత్తాన్ ఎనదావి।
ఉణ్మీదాడి యురుక్కాట్టాదేయొళిప్పాయో॥
తిరు. 6ప. 9 తి. 5 పా.

అనెడు పాశురమున-

'విణ్మీదిరుప్పాయ్' అనుటచే - పరత్వమును 'మలైమేల్ నిఱ్ఱాయ్' అనుటచే అర్చారూప మును 'కడల్ శేఱ్ఱాయ్' అనుటచే వ్యూహమును 'మణ్మీదువల్ వాయ్ అనుటచే విభవమును 'ఇవత్తు శిళ్ళుం' మఱైన్దు 'ఱైప్పాయ్'

అనుటచే అంతర్యామిత్వమును తెలిపిరి.

ఈ శ్రీ సూక్తి నాధారముగా గొనియే శ్రీ వచన భూషణమున 29 వ సూత్రములో -

భూగతజలమ్పోలే అన్తర్యామిత్వమ్
ఆవరణ జలమ్పోలే పరత్వమ్
పాఱ్కడల్పోలే వ్యూహమ్
పెరుక్కాఱుపోలే విభవమ్
అతిలే తేఙ్గిన మడుక్కళ్ పోలేఅర్చావతారమ్
అని సాయించిరి అనగా-

విపరీత దాహమును గొన్నవానికి భూమిని త్రవ్వి నీరును గోలుట వంటిది అష్టాంగ యోగముచే గ్రహింపదగిన అన్తర్యామి స్వరూపము.

బ్రహ్మాండ కటాహము నావరించి యున్న జలమువలె దుర్లభమైనది పరస్వరూపము.

పాలసముద్రమువలె శబ్దప్రమాణైక సమధి గమ్యము వ్యూహము,

వర్షఋతువునందు వచ్చి శరదృతువులో నస్తమించు నది వలె సమకాలికులకు మాత్రమే వినియోగించునది విభవస్వరూపము.

కాని యర్చావతారము మాత్రము మానదిలో తీయబడిన చలమలవలె నెల్లవేళల నందర కుపకరించునది యగుచున్నది, అని యిట్లర్చావ తార సౌలభ్యమును వర్ణించిరి.

పై నాలుగవతారములకంటె దీనివలన చేతనులకు కలుగునట్టి యుపకార పరంపర నీ క్రిందవిధముగ నుపన్యసించిరి. శ్రీ. వ. భూ. 40 సూ:

"ఇతుదాన్ శాస్త్రఙ్గళాల్ తిరుత్తవొణ్ణాతే విషయాన్తరఙ్గళిలే మణ్డి విముఖరాయ్ పోరుం చేతనర్కు వైముఖ్యత్తై మాత్తి రుచియై విళైక్కక్కడవతాయ్,
రుచిపిఱన్దాల్ ఉపాయమాయ్,
ఉపాయపరిగ్రహంపణ్ణినాల్ భోగ్యమాయ్ యిరుక్కుమ్

అనగా-శ్లో. జన్మాన్తరసహస్రేషు యా బుద్ధి ర్భావితా నృణామ్
తా మేవ లభతే జన్తుః ఉపదేశో నిరర్థకః॥

అనేకవేల జన్మలనుండి చేతను డెట్టి సంస్కా రముల కలవడియుండెనో అట్టి బుద్ధియే ఉత్త రజన్మలలో ననువర్తించును గాన నట్టివారి కు

దేశమువలన నేమిఫలము? ఇందులకు రావణుడు చెప్పిన

'ఏష మే సహజో దోషః స్వభావో దురతి క్రమః' అనెడు మాటయే ప్రమాణము

ఇట్లు ఎన్ని ప్రమాణములు జూపినను బుద్ధి మారక విషయసుఖ లంపటులై వర్తించు చేతనుల కానై ముఖ్యమును బోగొట్టి రుచిని బుట్టించుట కీయర్చావతార మొక్కటియే చాలియున్నది ఇందులకు శ్రీరంగనాథుని సేవించు తన భార్యకు ఛత్రి సేవను గావించుచున్న ధనుర్దాసు చరిత్రియే తార్కాణము. అతడు 'ఇదియేమి? లోకవిరుద్ధ వ్యాపారమును చేయుచున్నావు' అని తననడిగిన శ్రీ యెంబెరుమానార్లకు తన భార్య నేత్రసౌందర్యము వాడిన తాను సహించలేనని ఉత్తరమొసంగ వారు పరమకృపతో నాతనికి శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహమును కర్ణాంత లోలేక్షణ సౌందర్యమును సేవింపజేసిరి. అంత నాత డెట్టి భక్తు డయ్యెనో యిప్పటికిని శ్రీరంగమున ఆ వంశజుల యనుష్ఠానమే ప్రమాణము.

అట్లు రుచి బుట్టిన వారి కీ యర్చావతారమే ఉపాయ మగును. కావుననే ఆళ్వారులు తిరువాయ్ మొళ్ళి దివ్యప్రబంధమున-

పాశు. ఆఱెనక్కు నిన్పాదమే శరణాగ తన్దొళిన్దాయ్।

ఉన క్కోర్ కైమ్మా్మఱు నా నొన్ఱిలేన్।
ఎనదావియు మునదే॥

స్వామీ! ఉపాయస్వీకార కాలమున నీ దివ్య తిరువడినే నా కుపాయముగా ప్రసాదించితివి. నీకు నేనేమి ప్రత్యుపకారము చేయ గలను?

శ్లో. రత్నాకరో నిజగృహం గృహిణీ చ లక్ష్మీః।
కిం దేయ మస్తి భవతే జగదీశ్వరాయ।
రాధాగృహీత మనసస్తు న తే మనోఽద్య।
దత్తంమయా మమ మనః కృపయా గృహాణ॥

ఓ శ్రియఃపతీ! నీకు నేనేమి సమర్పించ గలను? రత్నముల కాకరమగు సముద్రమే నీకు నివాసస్థానముగదా! తన క్రీగంటి పాతముచే దరిద్రుని దేవేంద్రుని చేయునట్టి విభవముగల లక్ష్మీదేవి నీ కనుసన్నను మెలంగు ధర్మపత్నిగదా! నీవు స్వయముగా జగదీశ్వరుడవు కదా! నీకు లేని దే మున్నది? లేని దిచ్చినగదా యాదరింతువు. అని యాలోచించి ఆ తెలిసినది. నీకు లేనివస్తువును నే నెఱింగితిని. నీ మనస్సు రాధ (భక్తుడు) హరించెను. అది నీలో లేదు. ఉన్నచో నా మొగ నేల యాలకించవు? కావున నేను నీకు నా మనస్సును సమర్పించుచున్నాను. దయతో స్వీకరింపుమనినట్లు నేను నీకు నా యాత్మను సమర్పింతమనినను "ఎనదావియు మునదే" నా యాత్మయు నీదే" అని పాయించిరి.

ఇట్లుపాయముగా పరిగ్రహించినచో నత్యంత భోగ్యమై యొప్పును. చూడుడు-

అర్చావతార స్థలములలో ప్రధానమగు శ్రీరంగమున వేంచేసియున్న రంగనాథుని యందు ప్రావణ్యముగల మహాత్ముల యనుభవ మెట్లున్నదో చూడుడు-

తిరుప్పాణియాళ్వారులు శ్రీలోక సారంగ మునుల భుజముపై నుండి శ్రీరంగనాథుని విషయముగా 'అమలనాథపిరాన్' అను ప్రబంధమును పాయించుటలో-

పాశు. కొణ్డల్ వణ్ణనై కోవలనాయ్వెణ్ణె
యుణ్డవాయన్ ఎన్నుళ్ల ఙ్గవర్న్దానై।

అణ్డర్కోన్ అణియరఙ్గ నెన్నముదనై।
కణ్డకణ్గళ్ మత్తొన్ఱినైక్కాణావే॥

మేఘవర్ణుడును, వెన్న నారగించిన నోరుకల వాడును, గోపాలుడును నా మనస్సును దొంగిలినవాడును, నిత్యసూరి నిర్వాహకుడును, నా యమృతరసమయుడును నగు శ్రీ రంగ ధాముని సేవించిన నా నేత్రములు మరియొకరిని దర్శించునా ? యని సాయించిరి.

తిరువాయ్మొళి దివ్యప్రబంధమున నమ్మాళ్వార్లు–

పాశు. తానేయాగినిఱైన్దెల్లావులగుముయిరుం తానేయాయ్।
తానేయానెన్బానాగి తన్నైత్తానే తుదిత్తు ఎనక్కు।
తేనే పాలే కన్నలే యముదే తిరుమాలిరుఞ్జోలై।
క్కోనే యాగి నిన్ఱొళిన్దాన్ ఎన్నై ముత్తుమ్ ముయిరున్డే।

తిరు, 10. 7 2.

సమస్తలోకములును, సమస్తాత్మలును తానే యనునట్లు సర్వాత్మమిగా నుండు శ్రియఃపతి తానే నేనై నా నోటితో తనను తానే స్తుతించుకొని నాకు తేనె, పాలు, బెల్లము, అమృతము కలియబోసినటుల రస్యుడైన శ్రియఃపతి తిరుమాలిరుంశోలై యనెడు దివ్యదేశమునకు రాజై నిలిచెను అనియు–

శ్రీ భట్టరువారు.

శ్లో. దివి వసతి మానుష స్స చ తితద్విభూష త్యసా।
శశిర్విషతి సర్వదా వివిధయిష్యతే తేన చ!
ముముక్షిషతి తత్యగత్యవగతే స్స నిస్సంశయమ్।
వినిత్యషతి నిత్యశ స్స చ రిరఙ్గభిక్షూషతే॥

మానవుడు దేవుడు కాగోరును. దేవుడిందుడు కాగోరును. ఇందుడు శంకరుడు కాగోరును. శంకరుడు చతుర్ముఖుడు కాగోరును. చతుర్ముఖుడు ముక్తుడు కాగోరును. ముక్తుడు నిత్యుడు కాగోరును. అంతటితో తనివి తీరునా ? ఆ నిత్యుడు తిరిగి శ్రీరంగమున భిక్షువుగానైనను పుట్టగోరునని భిక్షుకై వేంచేయు శ్రీ యతిరాజులను సేవించి సాయించిరట. అనగా శ్రీరంగనాథుని సేవ నిత్యులకు కూడా నాశింపదగినదని భావము. కావుననే వారే తమ శ్రీరంగరాజస్తవమున–

శ్లో. అహ్నాతసహజదాస్యా స్సూరయ స్స్రస్తబన్ధాః।
విమలచరమదేహా ఇత్యమీ రఙ్గధామన్।
మహితమనుజ తిర్యక్ స్థావరత్వాశ్రయన్తే।
సునియత మితి యే స్మ ప్రాహు రేభ్యో నమస్తాత్॥

'రంగనాథా! నిత్యసూరులును, ముక్తులును, చరమదేహులగు ముముక్షువులును నీ దివ్యనగరమున పూజనీయమగు మానవ పశు తరు గుల్మాది దేహములు ధరించి వశించుచున్నారనుట నిశ్చయ మని సాయించిన ప్రాజ్ఞులకు పరశ్శత ప్రణామము లర్పించుచున్నాడ' నని సాయించిరి.

అట్లే శ్రీ శంకరాచార్యులవారు శ్రీరంగమును సేవించి యీ క్రింది శ్లోకమును సెలవిచ్చినట్లు ఐతిహ్యము.

శ్లో. ఇదం హి రఙ్గం త్యజతా మహాఙ్గమ్।
పున ర్న చాఙ్గం యది చాఙ్గమేతి।
పాణౌ రథాఙ్గం శయనే భుజఙ్గం।
యానే విహఙ్గం చరణే ఉమ్బుగాఙ్గమ్॥

శ్రీరంగమనగ నిదియా ! ఇచ్చట శరీరమును

విడిచినవారి కిక ప్రాకృతదేహ ముండునా? దేహ ముండవలసినచో చేతిలో చక్రము, పడకకాది శేషువు, పయనమునకు పతగరాజు, పాదమున గంగాజలము గల దేహమే (శ్రియఃపతి సారూప్యము) ప్రాప్తించును.

శ్రీ విశ్వగుణాదర్శకారులును-

శ్లో. శ్రీరఙ్గే శోభతే యస్య శ్రీరఙ్గే శోభతే చ యః।

నమోహం కలయే తస్మై న మోహం కలయే తతః

ఎవ్వాని దేహమున శ్రీలక్ష్మీదేవి ప్రకాశించుచుండగా తాను శ్రీరంగమున వెలుగుచున్నాడో వానికి నేను నమోవాకముల నర్పించుచున్నాను. ఇక నాకజ్ఞాన మెక్కడిది? అని దాని మహిమ నుగ్గడించిరి.

పెద్దల కిట్టి ప్రావణ్యమునకు కారణ మచ్చటి గుణపూర్తియే కావుననే-

"పూర్ణ మెన్గైయాలే ఎల్లాగుణఙ్గళుం పుష్కలమ్"

గుణఙ్గళ్ ఆశ్రయణ సౌకర్యాపాదకఙ్గళ్ ఆశ్రితకార్యాపాదఙ్గళ్ -

శ్రీ వ. భూ. 1 ప్ర. 33 సూ

ఈ క్రింద కనపరచిన ఉపనిషద్వాక్యములలో పూర్ణమని చెప్పబడుటచేసి యర్చావతారమున సమస్త గుణములున్ను పూర్ణముగ కలవు.

ఆ గుణములు ఆశ్రయణ సౌకర్యాపాదకములనియు అనగా సుఖముగ నాశ్రయించుటకు అవకాశమును తెలుపునవి అనగా ఆశ్రయించినవారి పనులు చేయగల శక్తిని తెలుపునవి అనియు ఆశ్రితకార్యాపాదకము లనియు రెండువిధములు-అందు వాత్సల్యము సౌశీల్యము మొదలగునవి మొదటికోటికిని, జ్ఞానశక్తి ప్రభృతులు రెండవ కోటికిని చెందినవి.

కఠవల్లిలో ద్వయమంత్ర గర్భితమైన నీ మంత్రము గలదు-

శ్రు. తదేషా భ్యుక్తా త దేవ భూతం త

దుపాసితవ్యం సత్యం తద్ద్వయం.

శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే।

ఇదం పూర్ణ మదః పూర్ణం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే

పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే

సర్వం పూర్ణం సహోమ్

శ్రీమతే నారాయణాయ నమః

వేదేయం బ్రహ్మ విదుః వేదే నానేన వేదితవ్యం।

యఏవం వేద, ఇత్యుపనిషత్।

'ఇయంశ్రుతి రర్చావతార విషయమ్॥'

ఈ వేదవాక్య మర్చావతారమును గూర్చి బోధించుచున్నది.

సూ (1) ఇదిల్ 'ఇదం పూర్ణ మెన్ను తొడఙ్గి' 'సహోమ్'

ఎన్నుమళవాన వాక్యం ద్వయమధ్యగత మాకైయాలే।

ద్వయోక్త ఉపాయోపేయత్వాపేక్షిత సౌలభ్యాది గుణపూర్తియై శొల్లుకిఱదు.

(ఇందు 'ఇదంపూర్ణ'ము మొదలుకొని 'సహోమ్' వరకు గల మంత్రము ద్వయమంత్ర పూర్వోత్తర వాక్యములకు మధ్యయం దుండుటచే ద్వయమంత్ర సమానార్థకము కావలెను గాన ఉపాయోపేయత్వమును అందుల కవసరమగు సౌలభ్యాది గుణపూర్తినిన్ని చెప్పుచున్నది.)

(2) 'ఉక్తా, గుణా న శక్యన్తే' ఎన్గిఱపడియే పూర్ణ। శబ్ద ప్రసఙ్కోచస్థితియుమ్॥

(భగవానుడు "అర్చావతార గుణములను

సంగ్రహముగ జెప్పితిని గాని పూర్తిగ జెప్ప వలెనన్న కొన్నివందల సంవత్సరములు చెప్పిననుపూర్తికా"దని చెప్పుటచే పూర్ణశబ్దమున కర్థసంకోచమును చేయ వీలులేకపోవుట చేతను)

(3) 'పఞ్చ ప్రకారో உహం' ఎన్గిఱ సంఖ్యా ప్రత్యభిజ్ఞైయాలుమ్।

(నే నైదువిధములుగ నుందు నని సంఖ్యను జ్ఞాపకముచేయుట చేతను)

(4) 'పూర్వస్మాదపి పూర్వస్మాత్ సులభో హ్యుత్తరోత్తరః' ఎన్ను ఉత్తరోత్తరాధిక్య ప్రతిపాద నత్తాలుమ్॥

(వెనుకటి రూపములకంటె ముందు ముందు రూపములకు సౌలభ్యము చెప్పబడుట చేతను ఈ 'ఇదం పూర్ణ మదః పూర్ణ' మ్మను శ్రుతి అర్చావైభవ పరమనుట నిర్వివాదము-

ఈ శ్రుత్యర్థ మీ క్రింద పొందుపరచబడు చున్నది-

ఇదం పూర్ణం 'ఇదం' అనుటచే సన్నిహిత తమమగు అన్తర్యామి రూపము చెప్పబడు చున్నది.

అది కళ్యాణగుణములచే పుష్కలముగా నుండును.

అదః పూర్ణం 'అదః' అనుటచే మిక్కిలి దూరముగ పరమపదమందున్న పరస్వరూపము. అది గుణములచే పూర్ణముగా నున్నది.

పూర్ణాత్ - ఈ పరస్వరూపమునుండి అభివ్యక్తమైన-

పూర్ణం - వ్యూహస్వరూపము-

ఉదిచ్యతే - రెండు రెండు జంటగుణము లచే యనేకవిధములుగా నున్నది.

పూర్ణస్య - అవతారకందమగు నీ వ్యూహాత్మక పూర్ణమునకు సంబంధించిన-

పూర్ణం - మత్స్యకూర్మాది విభవరూపమును -

ఆదాయ - తనకు కారణముగా పరిగ్రహించి-

పూర్ణమేవ - కల్యాణగుణములతో నిండిన యర్చావతారమే-

అవశిష్యతే - నిత్య మాశ్రయించుటకు వీలుగ నిత్య సన్నిహితమై సౌలభ్యాది గుణముల కాలవాలమై పరత్వాదులకు చరమ సీమయై యలరారు చున్నది.

ఓమ్ - రక్షకత్వ ప్రాప్యత్వాది గుణవిశిష్ట మగు నీ యవతారమునందే-

సర్వమ్ - సమస్త ఆశ్రయణ సౌకర్యాపాదక ఆశ్రిత కార్యాపాదక గుణములున్ను-

సహ పూర్ణమ్ - పరస్పరము కలసి పుష్కలముగా నున్నవి-

కావుననే అర్చావతారము ప్రపత్తికి ముఖ్య మగు ప్రాప్తవిషయ మగుచున్నది. కావుననే ఆళ్వారు లందరును పెక్కు స్థలములలో ప్రపత్తి చేసిన దీ యర్చావతారమునందే. అనేకసారులు ప్రపత్తిచేయుట విశ్వాస సంకోచముచే గాదు. భగవద్విషయ వైలక్షణము ననుభవించుటచే కలుగు త్వరాతిశయ మట్లు గావించును.

ఈ విషయమును మనస్సులో నుంచుకొని యే శ్రీవచనభూషణ దివ్యప్రబంధమున మొదటి ప్రకరణము నందలి 37వ సూత్రమున-

ప్రపత్తి క్కపేక్షితజ్ఞళాన సౌలభ్యాదిగళ్ ఇరుట్టఱై యిలే విళక్కుప్పోలే ప్రకాశిప్ప దిఙ్గే.

సౌలభ్యం-కణ్ణుపతు గెక్కురుప్పు. కణ్ణుక్కుత్తోత్తుగై.

సౌశీల్యం = మేన్మైక్కణ్ణ గలామైక్కు అుప్పు

స్వామిత్వం - కార్యం శెయ్యు మెన్ఱు విశ్వసిక్కైక్కు-అుప్పు।

వాత్సల్యం - కుత్తజ్కణ్ణు వెరువామైక్కు అుప్పు,

పూ ర్తియైయుం స్వాతంత్ర్యత్తైయుం
కులైత్తుక్కొణ్డు।
తన్నై యనాదరిక్కి-అవర్గళై తానాద
రిత్తు నిఱ్కి-అవిడమ్।
పూర్తి- అవాప్తసమస్తకామత్వం.
స్వాతంత్ర్యం స్వాధీన స్వరూపాదిమత్వం.

అనగా- శరణాగతి కవసరమైన సౌలభ్యాది గుణ సమూహ మంతయు చీకటియింట దీపమువలె ప్రకాశించున దీ యర్చావతారమునందే.

సౌలభ్యము- చూచి ఆశ్రయించుటకు వీలుగా జూపును.

సౌశీల్యము పరత్వమునుజూచి పారిపో నవసరములేకుండ దరిజేరుట కుపయోగించును.

స్వామిత్వము- మన యపేక్షితముల నొసంగి రక్షించునని విశ్వసించుట కుపయోగించును.

వాత్సల్యము- మన దోషములను తలంచి దరి జేరుటకు జంక నవసరము లేకుండ జేయుట కుపయోగించును.

ఈ యర్చావతారమున తన కసాధారణమైన అవాప్తసమస్తకామత్వమును, నిఖిలచేతనా చేత నముల స్వరూపస్థితిప్రవృత్త్యాదులు తన యధీ నమై యుండునట్టి స్వాతంత్ర్యమును మరుగు పర చుకొని తన ననాదరించు వారిని కూడా తా నాదరించుచు నుండును. ఈ విషయమునే శ్రీ విష్వక్సేనసంహితయందు-

శ్లో॥ తదిచ్ఛయా మహాతేజా భుఙ్క్తేవై భక్త
వత్సలః
స్నానం పానం తథా యాత్రాం కురుతే వై
జగత్పతిః॥
స్వతంత్ర స్స జగన్నాథో ప్యస్వతంత్రో యథా
తథా।
సర్వశక్తి ర్జగద్ధాతా ప్యశక్త ఇవ చేష్టతే।

అనగా - భక్తవత్సలుడగు భగవానుడు తనకు ఆరాధకుడగు భక్తుడు పెట్టినప్పుడే పెట్టి నదే తినుచు వాడు, చేయించినప్పుడే స్నాన మును జేయుచు వాడు త్రాగించినప్పుడే త్రాగుచు వాడూరేగించు నప్పుడే ఊరేగుచు తాను స్వతంత్రుడయ్యును అస్వతంత్రుని వలెను, సర్వశక్తికలవాడయ్యును అశక్తునివలెను ప్రవర్తించుచుండును.

ఈ విషయమునే శ్రీ భట్టరువారు కూడా శ్రీ రంగరాజస్తవమునందలి ఉత్తరశతకమున 74వ శ్లోకమున

శ్లో॥ ఆస్తాం తే గుణరాశివ ద్గుణపరీవాహా
త్మనాం జన్మనాం।
సంఖ్యా భౌమనికేతనేష్వపి కుటీకుక్షేషు
రఙ్గేశ్వర।
అర్చ్య స్సర్వసహిష్ణు రర్చకపరాధీనాఖి
లాత్మస్థితిః।
ప్రీణీషే హృదయాళుభి స్తవ తత శ్శీలా
జడీభూయతే॥

శ్రీ రంగనాథా! నీ గుణము లెట్లు లెక్కకు మిక్కుటమై యున్నవో అట్లే యాగుణ ప్రకా శక ద్వారములనదగు నీ యవతార సంఖ్యకును ఒక యవధి లేదు. దివ్యప్రాసాదములలో నీవు. హర్మ్యములలో నీవు. సామాన్య సంసారి గృహ ములలో నీవు. కుటీరములలో నీవు. ఋషిపుం గవు లేర్పరచుకొనిన పొదరిండ్లలో నీవు ఆహా! ఏమి నీయర్చావతారసౌలభ్యము! చేతనాచేతన ముల స్వరూపస్థిత్యాదు లెట్లు నీ యధీనమో నీ స్వరూపస్థిత్యాదు లట్లే నీ భక్తుల యధీనము గావించితివిగదా! ఈ విషయము నాళ్వార్లు ఒక పాశురమున పాయించిరి.

పా. తమ రుకన్ద దెవ్వారువు మవ్వురువుం తానే
తమ రుకన్ద దెప్పేర్ మ త్తప్పేర్
తమరుగన్ద దెవ్వణ్ణం శిన్దిత్తిమ్మె యాదిరుప్పారే
అవ్వణ్ణ మాళ్గియా నామ్॥
ప్రీణిషే హృదయాళుభి స్తవ తత శ్శీలా
జడీభూ యతే॥

అను నీ చరమ చరణమునకు సుందరమగు వ్యాఖ్యానము గావింపబడినది-

పరమపదనాథస్య సమస్తకల్యాణ గుణామృతోద। ధిత్వా త్తదవతారాణాం గుణపరీవాహతాయు క్తేతిభావః॥

పరమపదనాథుడగు పరవాసుదేవుడు సకల కల్యాణ గుణ సముద్రుడు గాన నాతని యొక్కొక్క యవతార మొక్కొక్క గుణము ప్రకాశించుట కొక తూముగా నున్నదనుట యుక్తమే. కాని-

విభవావతార సౌశీల్యానుసన్ధానేన మోహం
భజతాం మహతాం అర్చావతార సౌశీ
ల్యాను సన్ధానం ప్రేమాన్ధ్యావహ మితి
కిము వక్తవ్యమ్॥

అనగా – రామకృష్ణాది విభవావతారముల యందలి సౌశీల్యము ననుసంధించి యే మోహించు మహాత్ములను అర్చావతార సౌశీల్యానుసంధానము ప్రేమవివశులను గావించు నని వేరుగా చెప్పవలెనా ?

ఇచ్చట తిరువాయ్ మొళిలోని మొదటిపది తృతీయదశక ఆద్యగాథ యగు "పత్తుడై" పాశురమును మనస్సున నిడుకొని యీ విషయమును సాయించిరి.

శ్లో॥ త్వామన్యగోపగృహగవ్యముషంయశోదా।
గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా।
ప్రేమ్నా థ దామ పరిణామ జుషా బబన్ధ।
తాదృ జ్ఞ తే చరిత మార్యజనాస్సహ న్తే॥
(అతి. స్త. 40 శ్లో॥

ఈ విషయమును శ్రీ కూరేశులు అతిమానుష స్తవమున నిట్లు సాయించిరి.

నీవు నీ చిన్నతనమున ఒకయింట దొంగతనము చేసితివని ఋజువు కాగానే నీ తల్లి,

సీ బాలు డీతండని భావింతునందునా
యే పెద్దలును నేర, రీక్రమంబు
వెఱపెరుంగుటకునై వెఱపింతునందునా
కలిగిలే కొక్కడునుకాని లేడు
హెఱిపుత్రో నాబుద్ధి వినిపింతునందునా
తనదానమై బుద్ధి తప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
చొచ్చిచూడని దొక చోటులేదు
ఆ॥ తన్ను నెవ్వరైన దలపోయబాఱడి
యోజలేదు భీతియొకటి యెఱుగ
డేలమి నూరకుండ డెక్కసక్కెముఱాడు
బట్టి శాస్తి చేయు భంగి యెట్లు?

అని యాలోచించి త్రాడును చే బూనిన తోడనే నీవు-

శ్లో॥ వదనే నవనీతగంధవాహం,
వచనే తస్కరచాతురీధురీణం।
నయనే కుహనాశ్రు మాశ్రయేథాః
చరణే కోమలతాణ్డవం కుమారమ్॥

నోరంతయు వెన్నవాసనతో మాటలతో చోరవచన నైపుణ్యమును నెరపుచు కండ్లలో దొంగనీరు కార్చుచు కాళ్ళతో చిందులు ద్రొక్కుచు, కన్నులు కాటుక మయము గావించుకొని భయముట్టిపడునట్లు ముఖమును జూపుచు నిలచిన నీ నటన నార్యు లెట్లు సహింతురు తండ్రీ!

ఈ విషయమునకు నిదర్శనముగా ఆళ్వారులు 'పతుడై' పాశురమును సాయించి ఆరు మాసములు మూర్ఛపడిరట. ఇట్టి ఆర్ద్రహృదయులకు నీ యర్చావతార సౌశీల్యానుసంధానము ప్రేమాంధ్యము నాపాదించు నని వేరుగా చెప్పవలెనా?

ఆత్మ మనుష్యుడుగా బుట్టినచో నందులకు తగిన సుఖదుఃఖముల ననుభవించుటకు జీవుడు మనుష్యశరీరమున ప్రవేశించె నన్నట్లే- అర్చయు భక్తానుగ్రహార్థమై పరమాత్మ పరిగ్రహించిన బింబ విశిష్టస్వరూపమే యని యంగీకరించవలెను. అంతటనుండువా డచ్చట లేకుండునా? అయినను నచ్చటనే యారాధింపబడుట రాజు రాజధానిలో సేవింపబడునట్లే. సూర్యకిరణములలో వెలుగునిచ్చుట, కాల్చుట యను రెండు శక్తు లున్నను వెలుగునిచ్చుట నంతటను సహజముగనే చూచుచున్నాము గాని దాహకత్వమంత సులభముగ గోచరించుట లేదు. దాని నెఱుంగుటకై యొక భూత యద్దమును దెచ్చి దానిలో నొకేస్థలమున నా రశ్మలను కేంద్రీకరింపజేసినచో క్రిందనున్న పదార్థములను కాల్చుట మనము ప్రత్యక్షముగా చూడగలుగుదుము. అట్లే భగవంతుని యందును సర్వవ్యాపకత్వము, ఆశ్రితపాపనాశకత్వ మనెడు రెండు శక్తులున్నవి. మొదటి శక్తి శాస్త్రైకసమధిగమ్య మని యందఱంగీకరించుచున్నారు. ప్రహ్లాదాదిచరిత్ర లాసత్యమును స్పష్టపఱచుచున్నవి. కాని పాపదాహకత్వశక్తిని చూచుటకీయర్చావిగ్రహములే సాధనములు. ఇందు ప్రతిష్ఠ, ఆరాధనల యందలి మంత్రతంత్రములచే నాశక్తి కేంద్రీకరింపజేయబడును. దానిచే నీ విగ్రహములను విధి విధానముగ సేవించువారల పాపములు నశించునని శాస్త్రములు చాటుచున్నవి. పురాణాదులలో ఋషుల ఆశ్రమములను వర్ణించునప్పుడచ్చట జన్మశత్రువులగు జంతువులను స్నేహముతో వర్తించునట్లు వర్ణింపబడును. అందులకు కారణ మా స్థానమంతయు నా మునిపుంగవుని రేణు విసర్జన ప్రభావముచే సత్వమయ మగుటయే గదా! (కావుననే రాజసతామస స్పర్శ పరిహారమునకై సచేలస్నాన మేర్పరచబడినది) అట్లే సత్వగుణ ప్రధానుడగు శ్రీ మహావిష్ణువు మంత్రములచేతను తంత్రములచేతను ఆ విగ్రహములో ప్రవేశపెట్టబడుటచే నా మూర్తి కభిషేకించిన తీర్థము పూజించిన తులసి నివేదించిన ప్రసాదమున్ను సత్వమయమై వాటిని స్వీకరించినవారికి సత్వగుణమును పెంపొందించును. దానిని పెంపొందించిన 'రజస్తమ శ్చాభిభూయ సత్వం భవతి భారత' యనినట్లు రజస్తమస్సు లడుగంటును. అందుచే పాపములు నశించును. గీతలోని 3వ అధ్యాయమున-

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం
చరతి పూరుషః

అనెడు అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణ భగవానుడు-

'కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః

అని పాపమునకు కారణము రజస్తమస్సుల వలన బుట్టునట్టి కామ క్రోధములే యని చెప్పెను గదా ఇక సంశయమేల?

శ్రాద్ధమున దర్భలయందును భోక్తలయందును పితరు లాహ్వానింపబడి ఆవేశించునటులను యజ్ఞములలో దేవత లాహ్వానింపబడి తమ హవిర్భాగములను పరిగ్రహించుటకు విచ్చేయునటులను పరమాత్మయు మంత్రతంత్రములచే నాహ్వానింపబడి ప్రతిమలయం దావేశించునని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆ విధా

నములు సక్రమముగ నడచిన రోజులలో నామూర్తులాభక్తులతో మాట్లాడినట్లెన్నియో యుదాహరణములు మనము వినుచున్నాము. ప్రహ్లాదుడు స్తంభమున బ్రార్థించి సేవించ లేదా? విశ్వాసము ప్రధానముగదా! ఏకలవ్యున కంత విద్యను నేర్పినది విగ్రహమేకదా! లోకమున చిత్తరువులందును చిత్రపటములయందును గావించు ఆదర మావ్యక్తులకును తత్సంబంధులకును అనుగ్రహమును కలిగించుటయును, అనాదరము వారికి నిగ్రహమును కలిగించుటయును జూచుచున్నాముకదా! ఇక సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని విషయమై చెప్పనేల? కావుననే సంహితాగ్రంథములలో.

శ్లో॥ ప్రతిష్ఠాయాం సార్వభౌమం సద్మనా భువనత్రయం।
పూజాదినా బ్రహ్మలోకం, త్రిభి ర్మత్స మతా మియాత్।
భక్తియోగం స లభతే।
ఏవం యః పూజయేత మామ్॥

భగవద్విగ్రహములను ప్రతిష్ఠించిన చక్రవర్తి యగును. ఆలయమును నిర్మించిన ముల్లోకాధిపతి యగును పూజించిన బ్రహ్మలోకప్రాప్తి కలుగును. ఆలయ నిర్మాణ మూర్తిప్రతిష్ఠ ఆరాధనలనెడు మూడు కైంకర్యములన్ను చేసినచో భగవత్సాయుజ్యమును బడయును.

'య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే।
హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః హిరణ్యనఖః
ఆప్రణఖా త్సర్వ ఏవ సువర్ణః. తస్య యథా
కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ॥

ఇత్యాది శ్రుతిచే మనచే నర్చామూర్తియందు గాంచబడు పరమపురుషుడు సూర్యమణ్డలాన్తర్వర్తియని ప్రతిపాదింపబడెను.

పురుషసూక్తమునందలి-

"అద్భ్యస్సంభూతః। అను మంత్రముచే సాలగ్రామమూర్తియు 'పృథివ్యై' యనుటచే శిలారూపమగు నర్చామూర్తియు, 'రసాచ్చ'- యనుటచే లోహమయ అర్చామూర్తియు, 'విశ్వకర్మణః' యనుటచే దేవశిల్పి నిర్మిత అర్చామూర్తియు, 'తస్యత్వష్టా - యనుటచే నా మూర్తిని నిర్మించు శిల్పికి ఫలము పరమపురుషప్రాప్తియే యనియు, 'ప్రజాపతి శ్చరతి గర్భేఽన్తః' యనుటచే గర్భగృహములయందు ప్రతిష్ఠింపబడు అర్చామూర్తియు తెలుపబడుచున్నవనియు ఇట్లర్చావిగ్రహములు పురుషసూక్తముచే నెఱుంగదగియున్నవి. గాన యాతని నీ పురుషసూక్తముతోనే యర్చించు యాచార మేర్పడిన దని కొందరు సమర్థించుచున్నారు. తైత్తరీయ నారాయణానువాకమునందును- "అద్భ్యస్సంభూతః" అనుటచే వ్యూహమూర్తియు 'భువనస్య మధ్యే' యనుటచే విభవమూర్తియు 'నాకస్య పృష్ఠే'-యనుటచే పరవాసుదేవమూర్తియు 'ప్రజాపతి శ్చరతి గర్భేఽన్తః-అనుటచే హృదయకుహరమందుండు అన్తర్యామియు 'జ్యోతీంగ్‌షి' యనుటచే పరిశేషన్యాయమున (ఇక మిగిలినదని నిశ్చయించుట) లోహమయ విగ్రహవిశిష్టమగు నర్చామూర్తియు తెలుపబడుచున్నవి.

అగస్త్యసంహితయందును-

"శ్లో॥ అహం సన్నిహిత స్తత్ర పాషాణ ప్రతిమాదిషు" అని యగస్త్యునితో పరమపురుషుడు తనను సేవించువారల కందరకును ముక్తి నొసంగుటకై యర్చారూపమున వేంచేసి యుండుదునని సెలవిచ్చినట్లు గాంచనగును.

శ్రీమద్రామాయణమున అయోధ్యాకాండ మునందు శ్రీరామచంద్రుడు తన పట్టాభిషేక ముహూర్తమునకు పూర్వదివసమున-

శ్లో॥ గతే పురోహితే రామః స్నాతో నియత మానసః।
సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్॥
శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః॥

అనగా - ఇట్లాజ్ఞాపించి పురోహితుడగు వశిష్ఠ మహర్షి వేంచేయగనే శ్రీ రామ చంద్రుడు స్నానమాచరించి స్వస్థచిత్తుడై సీతాపిరాట్టితో తన ప్రాకారాన్తరమున దివ్యభవనమున వేంచేసియున్న శ్రీరంగనాథుని మందిరమున స్వామిని సేవించి ఆ రాత్రియంతయు బ్రహ్మచర్యదీక్షతో నచ్చటనే పవళించెను. అని యుండుటచే "యద్యదాచరతి" న్యాయముగా మన కట్టిమూర్తి యారాధ్యుడని స్పష్టమగు చున్నది.

ఈ మూర్తినే తన విశ్లేషమును సహించలేని విభీషణుని కొసంగినటుల-

శ్లో॥ లబ్ధ్వా కులధనం రాజా, లఙ్కాం ప్రాయా ద్విభీషణః

అని శ్రీమద్రామాయణమున యుద్ధకాణ్డలో గలదు. ఈ విషయమే పద్మ పురాణములో నింకను స్పష్టముగ గోచరించుచున్నది-

శ్లో॥ కిఞ్చి న్య ద్వక్తు మిచ్ఛామి రాక్షసేన్ద్ర మహాబల!
ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకుకుల దైవతమ్॥
ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై స్వవిశ్లేషా సహిష్ణవే।
శ్రీరఙ్గశాయినం స్వస్థం, ఇక్ష్వాకుకుల దైవతం।
రఙ్గం విమాన మాదాయ లఙ్కాం ప్రాయా ద్విభీషణః॥

'విభీషణా! మరియొకమాట. ఇక్ష్వాకుల దైవతమగు నారాయణు నర్చింపుము' అని చెప్పి తన యడబాటును సహింపనేరక పరితపించు విభీషణునకు ఇక్ష్వాకుకుల దైవమైన శ్రీరంగ నాథు నొసంగెను. శ్రీరంగవిమానమును గొని విభీషణుడు లంకకు పయనమయ్యెను.

శ్రీమద్భాగవతమున నవమస్కన్ధములోని అంబరీషోపాఖ్యానమునందును ఆతని నిత్య కాలక్షేపవిధానము వర్ణించుచు-

కరౌ హరే ర్మన్దిరమార్జనాదిషు॥
... ... ...
ముకున్ద లిఙ్గాలయదర్శనే దృశౌ।
పాదౌ హరేః క్షేత్రపదానుసర్పణే॥

అనగా-

కరములు విష్ణుమందిర మార్జనములందును,
చూపులు గోవింద చక్రచిహ్నిత మందిర దర్శము నందును
పదము లీశ్వర గేహపరిసర్పణములందును-

అని చెప్పబడుటచే నాతడును అర్చారాధన ప్రియుడని తెలియుచున్నది.

ఇట్లు కృత త్రేత ద్వాపరాది సకలయుగములయందు నుండు నీ యర్చారాధనావిధానము సనాతనమనుట నిస్సంశయము. ఇక వైదికప్రమాణము లపారములుగా కలవు. కావున నిది వైదికముకూడ నగుచున్నది

ఇక "యే యథా మాం" అనెడు శ్రీగీతా శ్లోకమునకు ఈ యర్చావతారపరమగు శ్రీభాష్యకారుల వ్యాఖ్యానమునకు శ్రీ దేశికమహాశయుల వివరమును విచారింతము-

'న కేవలం దేవమనుష్యాదిరూపేణా వతీర్య మత్సమాశ్రియణాపేక్షాణా మేవ పరిత్రాణం కరోమి అపితు॥

(1) యే - మత్సమాశ్రియణాపేక్షాః।

(2) యథా - యేన ప్రకారేణ స్వాపేక్షానురూపం పతిత్వ పుత్రత్వ సారథిత్వ వారాహ నృసింహాది ప్రక్రియయా।

(3) మాం సంకల్ప్య - మనోరథవిషయం కృత్వా।

(4) ప్రపద్యన్తే - సమాశ్రయన్తే।

(5) తాన్ - ప్రతి।

(6) తథైవ - తన్మనీషితప్రకారేణైవ॥

(7) భజామి - మాం దర్శయామి॥

అనగా దేవమనుష్యాది రూపములతో వామన, రామకృష్ణాదులుగా నవతరించి యా సమయముననే నన్నాశ్రయింపగోరిన వారిని మాత్రమే రక్షింతు ననుకొనకుము. నన్నాశ్రయించగోరి తాము సంకల్పించిన పతి పుత్ర సారథి వరాహ నరసింహాది యే యే రూపములతో నన్ను ప్రార్థించుచున్నారో నేను వారి కాయా రూపములతోనే దర్శన మిచ్చుచున్నాను.

కిం బహునా - సర్వేమనుష్యాః - మదనువర్తనైకమనోరథాః-
మమ వర్త్మ - స్వాసాధారణవిగ్రహచేష్టా సౌశీల్యప్రభృతిస్వభావసముదాయం-
మత్స్వభావం సర్వం యోగినాం వాఙ్మనసా ఽగోచర మపి స్వకీయై శ్చక్షురాదికరణైః-
సర్వశః -స్వాపేక్షితైః ప్రియతమ పితృ పుత్ర సుహృత్ భ్రాతృ భృత్య సారథిత్వాది రూపాణి అర్చావతార రూపాణి చ సర్వ ప్రకారైః అనుభూయ-
అనువర్తన్తే - అనుభవన్తో వర్తన్తే - అలఙ్కరణ యాత్రోత్సవ సేవాదిద్వారా॥

వేయేల - నా యసాధారణ దివ్యమఙ్గళ విగ్రహముగాని, దివ్యాతిమానుష చేష్టితములు గాని సౌశీల్యాది గుణసముదాయముగాని, యోగులకైనను వాక్కునకుగాని మనస్సునకు గాని గోచరించని గుహ్యమైనదైనను నన్ను ప్రసన్నుని గావించుకొను కోరికగల నా భక్తులందరును తా మభిలషించు పితృ, పుత్ర, మిత్ర, భ్రాతృ, భృత్య, సారథి రూపములతోగాని రామకృష్ణాద్యర్చారూపములతో గాని నన్ను తమ కన్నులతో గాంచి తాము చేయదలంచిన అలంకారములు, తిరువీధులు, ఉత్సవములు సేవలు మొదలైనవి చేయుచు తమ యిష్టము వచ్చినటుల అనుభవించుచు ఆనందించుచుందురు అని సాయించిరి.

ఇట్లు వ్యాఖ్యానము చేయుటకు గీతలో నెన్నియో ఉపపత్తులు గలవు. భగవద్గీతలోని పెక్కుస్థలములలో భక్తుడు చేయవలసినవిగా విధింపబడిన కైంకర్యము లన్నియు నర్చావిగ్రహమునకే ఘటించును. ఏలయన - గీత కేవల మర్జునునిచే యుద్ధమును చేయించ నెంచి యుపదేశింపబడిన ప్రబంధము కాదనియు అది యర్జునవ్యాజమున లోకోద్ధరణకై ధర్మసంస్థాపన గావించ నెంచి పరమాత్మ ఉపదేశించిన ఆధ్యాత్మిక దివ్యశాస్త్ర మనియు నిర్వివాదాంశము గదా! అట్టితరి-

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ గీ 9అ. 14 శ్లో.

పత్రం పుష్పం ఫలం తోయం।

యో మే భక్త్యా ప్రయచ్ఛతి
గీ. 9. అ. శ్లో.

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు॥
గీ. 9 అ. 34 శ్లో.

అభ్యాసే ప్యసమర్థో ఽసి।
మత్కర్మపరమో భవ।
గీ. 12 అ. 10 శ్లో.

మత్కర్మకృ న్మత్పరమో।
మద్భక్త స్సఙ్గవర్జితః॥ గీ. 11 అ. 55 శ్లో.
యత్కరోషి యదశ్నాసి।
తత్కురుష్వ మదర్పణమ్ గీ. 9 అ. 27 శ్లో.

మొదలగు శ్లోకములలోనున్న అస్మచ్ఛబ్ధమున కర్థము కేవలము విభవరూపములోనున్న శ్రీకృష్ణుడే యైనచో మనకీ యుపదేశము నిరర్థకమేగదా! ఆ సేవల కిప్పు డాకృష్ణుడేడి? అస్మచ్ఛబ్దమునకు 'నా యర్చారూప' మని యర్థము చెప్పిననే మన కాయుపదేశము సార్థకమగును శ్రీకృష్ణుని ఆశయము నెరవేరును. కావుననే శ్రీ భాష్యకారు లీస్థలములన్నిటిలోను అర్చాసాధారణమగు నర్థములనే సాయించిరి. చూడుడు.

"సతతం కీర్తయన్తో మాం, అనెడు శ్లోకమునకు అత్యర్థమత్ప్రియత్వేన మత్కీర్తన యతన నమస్కారై ర్వినా క్షణాణుమాత్రే ప్యాత్మధారణ మలభమానాః మద్గుణవిశేషవాచీని మన్నామాని స్మృత్వా పులకాఞ్చిత సర్వాఙ్గాః హర్ష గద్గదకణ్ఠాః – నారాయణ! కృష్ణ! వాసుదేవే త్యేవమాదీని సతతం కీర్తయన్తః త_వ యతనః మత్కర్మ స్వర్చనాదికేషు తదుపకారకేషు భవన వన్దన వనకరణాదికేషు చ దృఢసఙ్కల్పాః యతమానాః భక్తిభారావనమిత మనోబుద్ధ్యభిమానకరద్వయ పదద్వయశిరోభి రష్టాఙ్గై రచిన్తితపాంసుకర్దమ శర్కరాదికే ధరాతలే దణ్డవత్ప్రణిపతన్తః సతతం మాం నిత్యయుక్తాః ఆత్మానం మద్దాస్యవ్యవసాయినః ఉపాసతే॥

అనగా – నాభక్తులు నాయందు నేనుకూడ చెప్పజాలనంత ప్రేమకలవారై నాగుణములను కీర్తించుట, నన్నారాధింపయత్నించుట, నాకు నమస్కరించుట, మొదలగు పనులు చేయనిచో నల్పకాలమైనను బ్రతుకజాలనివారై నా గుణ విశేషములను తెలిపెడు నా నామములను తలంచుకొని ఆపాదమస్తకము గగుర్పాటొంద రింప ఆనందనిర్భరులై గద్గదకంఠములతో నారాయణా! కృష్ణా! వాసుదేవా! యని యుచ్చైస్స్వరముతో నిరంతరము కీర్తించుచు నా యారాధనకును, దాని కుపకరించు ఆలయ నిర్మాణ ఉద్యానవనారోపణాదులకును గట్టి పట్టుదలతో నుద్యమించుచు భక్తిభారముచే నేలకంటిన మనస్సు బుద్ధి అభిమానము రెండు నేతులు రెండుపాదములు తల యనెడు అష్టాంగములు కలవారై దుమ్ము బురద రాయి రప్ప యని చూడక భూమిపై కర్రవలె పడి నమస్కరించుచున్నవారై శరీరమున్నంతవర కిట్లు నన్నుపాసించుచుందురు.

ఇట్లే – మత్కర్మకృ న్మత్పరమో
మద్భక్త స్సఙ్గవర్జితః గీ. 11 అ. 55 శ్లో.
గీ. 18 అ. 65 శ్లో.

అభ్యాసే ప్యసమర్థోఽసి।
మత్కర్మపరమో భవ. గీ. అ. 12 శ్లో.

అను శ్లోకములలోని 'మత్కర్మ' పదములకు–

"మదీయాని కర్మాణి – ఆలయనిర్మాణ, ఉద్యానకరణ ప్రదీపారోపణ, మార్జన, అభ్యుక్షణ, ఉపలేపన పుష్పాహరణ పూజాప్రవర్తన

నామసఙ్కీర్తన ప్రదక్షిణ స్తుతి, నమస్కారాదీని తాన్యత్యర్థప్రియత్వేన ఆచర''

నా కర్మలనగా - నా కాలయముల నిర్మించుట నాపూజకుపయోగించు పూదోటల నాటుట నా మందిరమున దీపమును పెట్టుట నా మందిరమును తుడిచి నీళ్ళు జల్లిముగ్గులిడుట, అలుకుట, పుష్పములను తెచ్చియిచ్చుట స్వయముగ పూజించుట నానామములను కీర్తించుట, ప్రదక్షిణములు చేయుట స్తోత్రములు పఠించుట నమస్కరించుట మొదలగు పనులను మిక్కిలి ప్రేమతో జేయును.''

మద్యాజీ - అనవధికాతిశయప్రియ మదనుభవ కారిత మద్యజనపరో భవ-

యజనం నామ - పరిపూర్ణశేషవృత్తిః (కైంకర్యం)

ఔపచారిక సాంస్పర్శిక ఆభ్యవహారిక సాందృష్టికాది సకల భోగప్రదానరూపో హి యాగ

యజ - దేవపూజాయాం, దేవతా ముద్దిశ్యామె ద్రవ్యత్యాగః॥

అనగా - నీ కపరిమితానంద ప్రదమగు ప్రియమైన నా యనుభవముచే ప్రేరితుడవై నన్నారాధింపుము. ఆరాధన యనగా సంపూర్ణశేషవృత్తి. అనగా సర్వదేశ, సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధ కైంకర్యములను సర్వేశ్వరునకు చేయుట ఆ కైంకర్యములు ఔపచారికములనగా నీరాజనాదులిచ్చుట సాంస్పర్శికములు అనగా - చందన పుష్పమాలాదులను సమర్పించుట. ఆభ్యవహారికములనగా - ప్రసాదాములు నివేదించుట. సాందృష్టికములనగా - దీపాదులు ఇవి మొదలుగాగల సకల భోగములర్పించుట యే యాగము. యజధాతువునకు దేవపూజయని యర్థము పూజయనగాదేవతనుద్దేశించి ద్రవ్యము లర్పించుటయే.

ఇట్టి కైంకర్యములన్నియు అర్చామూర్తికే చేయదగినవి గాన అర్చారాధనకా శ్రీకృష్ణ పరమాత్మ కభిప్రేతమనుట నిర్వివాదముగదా!



శ్రీమతే రామానుజాయనమః



# శ్రీ వాసుదాసస్వామివారి పరమపదోత్సవ ఆహ్వానపత్రిక

శ్రీ వాసుదాసాశ్రమము - నడిగడ్డపాలెం.
వయా: చుండూరు — (గుంటూరు జిల్లా)

స్వస్తిశ్రీ హేవిళంబినామ సంవత్సర శ్రావణ శు ౧౪ శుక్రవారమున (ది 9-8-1957 తేదిని) శ్రీశ్రీశ్రీ వాసుదాసస్వామివారి పరమపదోత్సవము శ్రీ వాసుదాసాశ్రమమున శ్రీ కోదండరామస్వామివారి సన్నిధియందుజరుగును గాన భక్తులెల్లరు విచ్చేసి ఇందు పాల్గొన గోరుచున్నాము.

శ్రీవాసుదాసాశ్రమం 15-7-57

ఇట్లు
కూనంనేని వెంకటప్పదాసు

## కట్ణములు

చి. ము. వరాహ నరసింహాచార్యులు తనకుమార్తె చి॥సౌ పేరుందేవి తాయారును సికిందాబాదు వాస్తవ్యులు శ్రీమాన్ చిలకమర్రి అప్పలాచార్యులుగారి 3 వ కుమారుడు లక్ష్మణాచార్యుల కిచ్చి వివాహము జరిపించిన సందర్భములో మన సంఘమున కిచ్చిన కట్నం రు 20-0-0 లు

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రచారవిభాగము

## శ్రీ జీయర్ స్వామివారి యాత్రశేషము

( గత సంచిక తరువాయి )

22-5-57 వ తేదీ మధ్యాహ్నము ఆముదాలవలస నుండి స్వంత మోటారువ్యాను మీాద శ్రీ స్వామివారు కొంతమంది పరిజనముతో కొత్తూరు గ్రామమునకు వేంచేసిరి. అచ్చట శ్రీ వైశ్యరాజు శ్రీ రామరాజు వగైరా కొందరు భక్తులు శ్రీ జియ్యర్‌స్వామివారికి అత్యంత భక్తిశ్రద్ధలతో అఖండ స్వాగత సత్కారముల గావించిరి. అచ్చటనుండి సాయంకాలము నివగాం చేరి అచ్చట శ్రీ కూర్మ, శ్రీకాకుళ దేవాలయముల ధ్వజస్థంభములకుగా నిర్దేశింపబడిన వృక్షములను చూచి రాత్రికి ఆముదాలవలస మరల చేరుకొనిరి. మరునాడు

23-5-57 వ తేది బయలుదేరి శ్రీ రామతీర్థం గ్రామమునకు వేంచేసిరి. అచ్చట శ్రీ వైష్ణవస్వాములు శ్రీ స్వామివారికి అఖండ స్వాగత మిచ్చిరి. రాత్రి సన్నిధి లాంఛనములతో సత్కరించిరి.

24-5-57 వ తేదికూడ అచ్చటనే వేంచేసి శ్రీ అయ్యావార్లంగారి తిరుమాళిఘలో ఉపన్యసించిరి.

25-5-57 వ తేదినాడు అచ్చటనే శ్రీ యతిరాజ శిక్షాశిబిరములను ఏర్పాటు చేసిరి.

26-5-57 ఈనాడుకూడ ఇచ్చటనే యుండిరి. శ్రీ గోపాలాచార్యస్వామివారు గీతను గురించి యుపన్యసించిరి. శ్రీ కవిగారు కావ్యగోష్ఠిని జరిపిరి. సాయంకాలము శ్రీ రామతీర్థములో గుట్టపైకెక్కి శ్రీ జియ్యర్ స్వామివారు అచ్చటి విశేషము లన్నియు రాత్రి 9 ల వరకు సందర్శించిరి. గ్లాసులైటు వెలిగించి శ్రీ వైష్ణవ స్వాములు పెక్కురు వారికి సహాయులుగా వచ్చిరి ఆ దృశ్యములలో ప్రధానమైన దపలుకురాయి. చాలా అద్భుతముగా నున్నది.

27-5-57 వ తేదికి విజయనగరం చేరుకొంటిమి. అచ్చట శ్రీ గాదె రామయ్యంగారున్నూ శ్రీమాన్ పార్థసారధిగారున్నూ శ్రీస్వామివారికి అఖండ స్వాగత మిచ్చిరి. సాయంకాలము పెద్ద సభ జరిగెను.

28-5-57 వ తేదీకూడ విజయనగరములోనే శ్రీ స్వామివారు వేంచేసియుండిరి. ఈనాడుదయం శ్రీ త్రైవర్ణికులు శ్రీ స్వామివారిని ఛత్రి చామరాది లాంఛనములతో తమ రామానుజకూటమునకు వేంచేపు చేసుకొని బ్రహ్మయజ్ఞమునకు, బదరీ పూజలకు తగురీతిగా కైంకర్యములు గావించుకొనిరి. సాయంకాలము సభ జరిగెను.

30-5-57 వ తేది బొబ్బిలికి వేంచేసిరి. అచ్చట చెలికాని వెంకట రావుగారు, వా

సతీమణీ శ్రీమతి సీతాయమ్మ వగైరాలు శ్రీ స్వామివారిని మంచి భక్తితో ఆదరించిరి.

31-5-57 వ తేదీకూడ బొబ్బిలిలోనే యుండి సన్నిధిలో శుక్రవారపూజ చేయించి ఉపన్యసించిరి.

1-6-57 తేది బొబ్బిలినుండి బయలుదేరి దారిలో పద్మనాభంలో దిగి అనంతపద్మనాభ స్వామిని కొండఎక్కి సేవించిరి. మధ్యాహ్నం పద్మనాభంలో శ్రీ వైష్ణవ గోష్ఠి శ్రీ స్వామివారికి ఆనందము కలిగించెను. తరువాత సాయంకాలము గం. 6 లకు సింహాచలమునకు శ్రీవారు వేంచేసిరి. శ్రీ స్వామివారిని దేవస్థానం పరివారము పండితబృందములు అఖండస్వాగతముతో బసకు వేంచేపు చేసుకొని వెళ్ళిరి. రాత్రి సభ జరిగెను.

2-6-57 ఈనాడు కొండ ఎక్కి శ్రీ స్వామివారిని శ్రీ జియ్యర్ స్వామివారు సేవించిరి. దేవస్థానంవారు శ్రీ స్వామివారికి అర్ధకూట పదార్థ సత్కరించిరి. అర్చకసంఘమువారు కూడ 58/లతో సత్కరించిరి. తరువాత శ్రీ స్వామివారు వెండిపళ్ళెరములలో రూపాయిలు పోయించి శ్రీ సింహాచలం దేవస్థానం పరివారమున కంతయు సత్కారము గావించిరి. ఆలయం ఆఫీసరుగారు దేవస్థానంపై చూపుచున్న భక్తి శ్రద్ధలకు శ్రీ స్వామివారు సంతసించి శ్రీ ఆఫీసరుగార్కి శ్రీ స్వామివారు మంగళాశాసన పూర్వకముగా ఒక శాటిని బహూకరించిరి. సాయంకాలమునకు విశాఖపట్నం చేరిరి. అచ్చట రామానుజకూటం వారు శ్రీ స్వామివారికి స్వాగత మిచ్చిరి. రాత్రి సభ బ్రహ్మాండముగా జరిగెను.

3-6-57 ఈనాడుదయం విశాఖపట్నములోనే గడిపి సాయంకాలమునకు తుని వేంచేసిరి. రాత్రి తునిలో పాండురంగ స్వామిని సేవించుకొని. తెల్లవారి గం 6 గంటలకు వడిశవేరు చేరుకొని అచ్చట భజేనారాయణ స్వామిని సేవించిరి.

4-6-57 అచ్చటనే తిరువారాధన గావించుకొని మధ్యాహ్నం రాజానగరం వేంచేసిరి. అచ్చట శ్రీమాన్ వేదాల వెంకటాచార్యులుగారు వారి సతీమణిగారు శ్రీ స్వామివారిని చాల భక్తి శ్రద్ధలతో పూజించిరి. అచ్చట నుండి బయలుదేరి సాయంకాలము రాజమండ్రి శ్రీ తులసీ రామానుజకూటమునకు శ్రీ వారు వేంచేసిరి. రాత్రి పురప్రముఖులు పెక్కురు శ్రీ స్వామివారి సందర్శనార్థమై విచ్చేసిరి. సభ జరిగెను. సభలో శ్రీ స్వామివారు రామానుజ కూట యభివృద్ధికి చాల సంతసించిరి. జూపూడి వెంకటేశ్వరమ్మగారు బదరిలో గదికి 3500/లు సమర్పించుకొందుమనిరి.

5-6-57 వ తేదీ రాజమండ్రిలో మధ్యాహ్నం కార్యకలాపములను పూర్తి గావించుకొని సాయంకాలమునకు నరసాపురంనకు వేంచేసిరి ఆరాత్రి తమ పూర్వాశ్రమాచార్యులైన శ్రీమాన్ రామానుజాచార్య స్వామివారిని సేవించిరి. తరువాత శ్రీ ఎంబారుమానార్‌ను దర్శించిరి. 6-6-57 వ తేది ఉదయము నరసాపురంలో బయలుదేరి భీమవరంలో తిరువారాధన పూర్తి గావించుకొని రాత్రి గం. 10-లకు విజయవాడకు శ్రీ స్వామివారు విచ్చేసిరి. 7-6-57 మొదలు 22-6-57 తేదీ వరకు శ్రీవారు బ్రహ్మయజ్ఞ నిర్వహణ ప్రయత్నములో విజయవాడ శ్రీ నిడుముక్కలవారి రామానుజకూటమందే బస గావించుకొని వేంచేసియుండిరి.

# బ్రహ్మయజ్ఞము - కోటితులసి పూజలు

బ్రహ్మయజ్ఞ నిర్వహణార్థమై కొత్తగుళ్లలో బ్రిహ్మాండమైన పందిళ్ళు వేయబడెను. శ్రీ కోదండ రామస్వామివారి సన్నిధి ప్రాంగణములో హేమగుండములు ఏర్పాటు చేయబడెను. శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో పూజలు సభలు జరుగుటకు ఏర్పాట్లు గావింపబడెను. బసలకు అన్నదానమునకు పాలదానమునకు హిందూహైస్కూలులో అన్నివిధముల వసతులు ఏర్పాట్లు విలక్షణముగా జరిపింపబడెను. ఈ యజ్ఞ నిర్వహణములో శ్రీ శివకోటి లక్ష్మీనరసింహంగారు, శ్రీ ఉదయగిరి కృష్ణారావుగారు, శ్రీ మాతంశెట్టి సీతారామయ్యగారు, శ్రీ గోపు శేషావతారంగారు, శ్రీ నందిపాటి రామయ్యగారు, శ్రీ నిడుముక్కల శ్రీరామమూర్తిగారు కూరపాటి రామారావు సహాయకులుగా శ్రీ నందిపాటి జగన్నాయకులు, శ్రీ తేలుకుంట్ల విశ్వనాథంగార్లు మున్నగువారు అత్యంత భక్తిశ్రద్ధపూర్వకముగా నిలవబడిరి.

22-6-57 వ తేదీనాటికే అన్నిజిల్లాలనుండి వేదవిద్వాంసులు, పండితులు కార్యనిర్వాహకులు, విదూషీమణులు విచ్చేసిరి. 23-6-57 వ తేదీ సాయంకాలము శ్రీ స్వామివారు హిందూహైస్కూలునుండి ఆలయమునకు అంకురారోపణకుగా బయలుదేరిరి. శ్రీవారు త్రిదండ కాషాయధారులై ప్రసన్నవదనులై కార్యదీక్షకనులంకు తొణికిసలాడుచుండగా గంభీరగమనములో ముందు సాగుచుండ వెంట శ్రీ గోపాలాచార్య స్వామివారున్నూ శ్రీ కవిగారు సహాయోప సహాయులుగా నిలువబడియుండగా, వెంట వేదవిద్వాంసులు స్వస్తివాచకములు అనుసంధించుచుండగా అసంఖ్యాకులైన అనుయాయికులు హరేరామ యని కరతాళములతో భజనగావించుచుండగా అతి విలక్షణమైన ఆధ్యాత్మిక సంపదతో ఆలయమునకు విచ్చేసిరి. అంకురారోపణము అయంముహూర్తో స్సుముహూర్తో అస్తు అని భట్టాచార్యులవారు ప్రారంభించిరి. వేదవిద్వాంసులకు కైంకర్యపరులకు పెరుమాళ్ళకు యాజ్ఞికులకు అందరకు హార్ద్రదవస్త్రములతో దీక్షాకంకణములు ధరింపజేసిరి యాగశాలలో ప్రధాన పాత్రులైన శ్రీ పోరంకి వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు యజ్ఞాచార్యత్వము వహించిరి. శ్రీ భట్టాచార్యులవారికి శ్రీ స్వామివారు మంచి విలువగల శాలిని బహూకరించిరి. తదనంతరం సన్నిధిలో తీర్థప్రసాదగోష్ఠి జ్యరిగినది.

## దైనందిన కార్యక్రమము

వేగుజామున - శ్రీవిష్ణు సహస్రనామపారాయణ

ప్రతినిత్యము తెల్లవారుఝామున గం 4లకు శ్రీ జియ్యర్‌స్వామివారు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో వందలకొలది భక్తబృందము గుణానుభవము చేయుచు వెన్నంటి నడుచుండగా కృష్ణానదికేగి స్నానమాడిరి. తరువాత గం. 7 లకు బసలో తీర్థప్రసాదగోష్ఠి వందలకొలది వచ్చి శ్రీవారివద్ద శ్రీపాద తీర్థప్రసాదములను స్వీకరించి యుజ్జీవించిరి.

## శ్రీవారి భిక్షా కార్యక్రమము

ఉదయము గం. 7 ల నుండి శ్రీవారు భిక్షాపాత్రధరించి తిరువీధికి. బయలుదేరుట శ్రీవారి వెంట వేద విద్వాంసులు; నాలాయిర ప్రబంధ

వేత్తలు, పండితులు, భక్తులు, ప్రేక్షకులు, వందలకొలది వెంటరా బ్రహ్మయజ్ఞ నిర్వహణార్థమై శ్రీ స్వామివారు భిక్షాపాత్ర ధరించి బయలుదేరిరి. స్వస్తివాచకములతో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణలలో గోష్ఠి చూచుటకు వినుటకు అత్యంతవిలక్షణముగానున్నది శ్రీ జియ్యర్ స్వామివారు వాకిటిముందు వేంచేయగనే పురంధ్రీమణులు శ్రీ పాదములకు పూర్ణకుంభముతో పాద్యమిచ్చి పుష్పములతో పూజించి కర్పూర నీరాజనమిచ్చి చందన కుసుమ ఫలతాంబూల సమర్పణ పూర్వకముగా రొఖముగానో బంగారు వస్తురూపము గానో సమర్పించిరి. తరువాత 9 గంటలకు ఆలయము చేరుకొనిరి.

## వేదపారాయణ

ఈబ్రహ్మయజ్ఞములో ఉదయం గం 7 లకే వేద విద్వాంసులు ఆలయమునకు విచ్చేసి వేదపారాయణ ప్రారంభించి ఈ వేదపారాయణకు శ్రీకాకుళం సింహాచలం రాజమండ్రి తూ॥ పశ్చిమగోదావరిజిల్లాలనుండి గుంటూరు కృష్ణాజిల్లాలనుండి దాదాపు 40 మంది పట్టాగల వేద విద్వాంసులు విచ్చేసి బ్రహ్మయజ్ఞములో దీక్ష స్వీకంచిరి. వీరు ఉదయం 7 ల మొదలు గం 10 ల వరకును సాయింత్రం గం 7 ల మొదలు 9 గంటలవరకు వేదపారాయణము గావించిరి.

## నాలాయిరగోష్ఠి

ఒకచోట ద్రావిడవేదగోష్ఠి నాలాయిర విద్వాంసులు వచ్చి పారాయణర గావించిరి. వీరు కాంచి, తిరుపతి ప్రాంతములనుండి విచ్చేసిరి. వీరు ద్రావిడ పాశురములను అనుసంధించుచుండ వీనుల విందుగా నుండెను.

## సహస్రనామపూజలు

తరువాత గం. 8 ల మొదలు శ్రీ వెంకటేశ్వరస్వామి సన్నిధిముందు పెద్ద పందిరిలో విలక్షణముగా సహస్రనామపూజలు జరిగినవి. కొందరు దంపతులుగాను, విడిగా కొందరు కూర్చొని సమిష్టిగా సంఘమువారు ప్రాణ ప్రతిష్ఠచేసిన పటంమీద తులసితో శ్రీజియర్ స్వామివారు మైకు ముందు నామం చెప్పుచుండగా అందరు నోట ఆనామాను సంధానము చేయుచు తులసితో పూజగావించిరి పూజానంతరము పూజాపరులకు పతకములతోపాటు లడ్డూరా ప్రసాదంపంచి యివ్వటమైనది ప్రతిదినము తులసి మద్రాసునుండి వ్యాగెనుమీద సమృద్ధిగా తెప్పింపబడినది.

## హోమములు

శ్రీ కోదండరామస్వామి ముఖ మంటపములో హోమగుండములు వేయబడినవి అందు 6 గాయత్రి మంత్రములతో హోమములు గావింపబడెను. ఉదయం, రాత్రి యీ హోమములు సంతృప్తికరముగా జరిపింపబడెను.

## ప్రసాదములు

దేవాలయమున ద్వారమువద్ద పెద్ద గంగాళమునిండ ప్రసాదములు చేయించియుంచి యాత్రికులకు, భక్తుల కందరకు భగవత్ప్రసాదములు పంచిపెట్టబడెను.

## పాలదానములు

పసిపిల్లలకు రోజుకి 500 వందల మందికి పాలదానములు విరివిగాపోయించటమైనది. యీ పాలదానము పెద్దపిన్నయు విచక్షణము లేకుండా అడిగినవారి అందరికి పాలుదానముగా వింపబడెను.

## సా పా ట్లు

హిందూ హైస్కూలులో ఆగంతకులైన భక్తులందరికీ స్థానుకూలముగా పరమవిలక్షణమైన తదీయారాధన గావింపబడెను. నాల్గువర్ణముల వారు భోజనము చేసిన తరువాత బీదలకు విరివిగా అన్నదానము గావింపబడెను. బ్రాహ్మణులకు, వైశ్యులకు శ్రీవైష్ణవులకు వేరువేరు వంటలు చేయించిరి. అడిగిన వారికి లేదనకుండ అన్నదానములు గావింపబడెను.

## మ హి ళా స భ లు

పరిగా ఒంటి గంటన్నరకు మహిళాసభలు ప్రతిదినము ప్రారంభింపబడెను. సభాప్రారంభములలో శ్రీమతి నిడుముక్కల అన్నపూర్ణమ్మ దైవప్రార్థన సంగీతవాద్యలతో గావించెను. యీామె ఒకనాడు సభలో తమ శాస్త్రీయ సంగీతముత్తోత్యాగరాయ కృతులుపాడి రెండు గంటలు సేపు సభను ఆనందసముద్రములో ముంచియెత్తెను.

బ్రహ్మయజ్ఞములో పదిరోజులు జరిగిన మహిళాసభలకు మహిళలే అధ్యక్షులు, సభాప్రారంభకులు ఉపన్యాసకులుగా యుండిరి. ఈ సభల నన్నింటిని శ్రీ మైలవరం శ్రీ సూరానేని వరమంగయమ్మరావు రాణిగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా యుండి ఆహ్వానించిరి. మొదటరోజు మహిళాసభలో మైలవరం రాణిగారు ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము గావించిరి. ఆ యుపన్యాసము ఈ పత్రికలో ప్రచురించబడియున్నది.

ఈ క్రిందివారు మహిళాసభలకు అధ్యక్షత వహించిరి.

మహిళాసభాధ్యక్షులు.

1. శ్రీ వింజమూరి తాయారమ్మగారు (కాకినాడ)
2. శ్రీ కరి లక్ష్మీనరసమ్మగారు (మైలవరం)
3. శ్రీ అమరవాది లక్ష్మీనరసమ్మగారు (నరసాపురం)
4. శ్రీ మరంగంటి సీతమ్మగారు (బందరు)
5. శ్రీ వక్కలంక సుగుణమ్మగారు (బరంపురం)
6. మరంగంటి రంగనాయకమ్మగారు (రాజమండ్రి)
7. శ్రీ కోయిల్ కందాడ పెద్ద తాయారమ్మగారు (శ్రీకూర్మం)
8. శ్రీ నల్లందిఘళ్ లక్ష్మీనరసమ్మగారు (బందరు)
9. శ్రీమ త్తిరుమల భాగ్యలక్ష్మమ్మ అమ్మవార్లుంగారు (వెంటపాడు)

సభాప్రారంభకులు.

శ్రీ మైలవరం మూడవరాణిగారు

శ్రీ శాతలూరి చూడుకుడుత్తమ్మగారు (గుంటూరు)

శ్రీ కర్రా తాయారమ్మగారు (నరసాపురం)

శ్రీ దాసరి ఆండాళమ్మగారు (విశాఖపట్నం)

శ్రీ కంతేటి తాయారమ్మగారు (బందరు)

శ్రీ చూడామణిగారు (రాజమండ్రి)

శ్రీ చుండూరు రంగానాయకమ్మగారు (బందరు)

శ్రీ గాదె సీతారామమ్మగారు (విజయనగరం)

ఉపన్యాసకులు

శ్రీ దాసరి శ్రీదేవమ్మగారు (చావలి)

శ్రీ ఎలమంచిలి భగవన్నామంగారు (కల్వపాములు)

వీరుగాక పెక్కుమంది స్త్రీలు ఉపన్యసించిరి.

శ్రీ జియ్యర్ స్వామివారు చివరిరోజున అధ్యక్ష సభాప్రారంభ ఉపన్యాసకులకు మంగళశాసన పత్రములు సమర్పించిరి. ఆదరణతో శ్రీవారు ఇట్లు మంగళశాసనము కృపచేసిరి.

నిత్యశ్రీరభివర్ధతాం, విజయతా మాధ్యాత్మిక శ్రీకళా
జీయాత్, శ్రీయతిరాజ పాదయుగళీ సేవా విశేషోత్సవః
గీతానామపి, శుక్రవార కమలాపూజాసు, శిక్షామశే
ష్వాస్తాం తే మహిళామణే. కరుణయా విష్ణోస్సదా భావనా,

శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మగారికి శ్రీ స్వామివారు వెండిచట్టము కట్టిన ఫలకములో ఈ దిగువ శ్లోకముతోను, పద్యముతోను మంగళాశాసనమును కృపచేసిరి.

శ్రీ జియ్యర్ స్వామివారు, — శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మగారికి కృపచేసిన మంగళాశాసనము.

శ్లో॥ ఏషా, దిగంత విశ్రాంత భాగ్య రేఖాముపేయుషీ
విదుషీ, భాగ్యలక్ష్మీయం వర్ధతాం, భవ్య శేముషీ.

(సం) శ్రీమన్నారాయణ రామానుజ జీయర్.

చ॥ సిరిగల శ్రీనివాస పురసీమ విరాజిలు శాలవేంకటే
శ్వరుడు కృపాప్రసన్నుడయి నాకనుగాత నిత్యోఽధికంబుగా
తిరుమల వీరరాఘవ సుధీమణి పత్నిని భాగ్యలక్ష్మినా
బరగుసతీమతల్లినిన్ భాగ్యులపాలిటి భాగ్యలక్ష్మినిన్

చ॥ తిరుమల వంశమన్న మణి దీపమువంటిది, తద్భవుల్ స్వయం
గురువులు మామగారు బుధకోటికి గొంగుపసిండి భర్తయా
పరమపవిత్రమౌ గుడియు వైష్ణవపత్రిక పాఠశాల సు
స్థిరముగ నిల్పినట్టి మృతజీవియుకో సుకృతాత్ము లిద్దరున్

ఉ॥ పత్రికనిల్పి పండితసభల్ జరిపించి కృతుల్ గ్రహించి, పెన్
సత్రముగట్టి సన్నిధికి జక్కని శోభను బెంపుచేసి, స
త్పాత్రులనెంచి బీదలకు దానము ధర్మము లిచ్చి వివిహా
ముత్రతరించినావెపటి పుణ్యమొ నేడు ఫలించె ధీమతీ!

మ॥ యతిరాజాశ్రమ మంగనామణుల కీ వాత్సల్యయాగ్రిమంబులో
గుతుకంబొప్పగ కట్టగావలయు శ్రీ గోవింద రాచార్య సం
స్మర చిహ్నంబుగ పెద్దవారలకుగా నేటేట నేవో బహూ
కృతుల్ యందలె భాగ్యలక్ష్మి లివిగో రెన్ స్వామియక్లేగదా

మ॥ మనసిద్ధాంతముమీద మీకుగల ప్రేమ
స్ఫూర్తి వీక్షించితి
య్యని వాత్సల్యముతో త్రిదండియగు
జియ్యర్ స్వామివారియ్యదే
యనుకంపించిరి మంగళాశిషము నస్మాకె
యెన్నియేండ్లైన మా
యని పత్రించిరి భాగ్యలక్ష్మి విపుడీవైనావు
భావింపగన్.

శ్రీ. వి. ప్ర. సం. ప్రధాన కార్యదర్శి
విద్వాన్. తె. కం. గోపాలాచార్యులు.
సహాయ కార్యదర్శి,
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

1-7-57 వ తేదీనాడు శ్రీ జీయర్ వారి అధ్యక్షతతో కొత్తగా, శ్రీ యతిరాజ సేవామహిళా మండలికి, అధ్యక్షకార్యదర్శులు ఎన్నుకోబడిరి. అధ్యక్షులు. శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మగారు. ఉపాధ్యక్షులు. శ్రీ అమరవాది వెంకట నరసమ్మగారు కార్యదర్శి. శ్రీచాతలూరి పూడుకుడుత్తమ్మగారు సహాయకార్యదర్శి శ్రీ వక్కలంక సుగుణమ్మగారు కోశాధికారి శ్రీ మరంగంటి రంగనాయకమ్మగారు.

పం డి త స భ లు

గం 4 ల నుండి శ్రీ మహిళామండలి తరువాత పండితసభలు ఈ పదిరోజులు జరిగెను. ప్రతిదినము శ్రీయుత విద్వాన్ తె కం గోపాలాచార్యులుగారు వేదాంతసూత్రములలోసత్యం వద, ధర్మంచర, అను సూక్తులకు శాస్త్రీయముగా చక్కని గంభీరార్థమును ఉపన్యసించి వినువారిని విస్మితుల గావించిరి. శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు 4 రోజులు, భక్తియోగములను గురించి విద్యావిలాసమును గురించి పద్యరూపముగా ఉపన్యసించిరి. శ్రీ జియ్యర్ స్వామివారు ప్రతి దినము ముప్పావుగంట కాలము మృదుమధుర శైలితో బ్రహ్మయజ్ఞము తత్ప్రయోజనములను గురించి చక్కగా యుపన్యసించిరి. యీ పండితసభలో ఉపన్యసించినవారు శ్రీ యతీంద్రులవారు. ఒకనాడీ సభకు విచ్చేసి ఉపన్యసించిరి.

1. శ్రీ కృష్ణ నారాయణాచార్యులుగారు శ్రీ కందాడ అప్పలాచార్యులుగారు శ్రీ మైలవరం ధర్మపురి తిరుమలాచార్యులుగారు శ్రీ గోవర్ధనం నరసింహాచార్యులుగారు శ్రీ కొడమసింహం శ్రీమన్నారాయణాచార్యులుగారు ఇత్యాదులు ఉపన్యసించిరి. వెంటపాటు శ్రీ వైష్ణవపత్రికా సహాయసంపాదకులు గ్రంథకర్త గోవిందాచార్యులుగారు ఒకనాడు శ్రీజటావల్లభుల పురుషోత్తముగారి ప్రోత్సాహము చే శ్రీ జియ్యర్ స్వామి అధ్యక్షతక్రింద బ్రాహ్మణ వార్షికసభ జరిగినది. ఆనాటిసభలో ఉద్దండ పండితులగు శ్రీ తర్కవేదాంతవిశారద ముదిగొండ వేంకటరామశాస్త్రిగారు గంభీరోపన్యాసము గావించిరి. శ్రీ జి. పురుషోత్తముగారు వేదపారిశస్త్యములకు హిందూమతమును పరిశంశించుచు గతచరిత్రను సింహావలోకన సేయుచు ఈ సంవత్సరం బ్రాహ్మణసభకు శ్రీ జియ్యర్ స్వామివారిని అధ్యక్షులుగా నుండమని కోరిరి. శ్రీ స్వామివారు సమ్మతించిరి.

మరియొకనాడు, సనాతన శాస్త్ర ధర్మ ప్రచార సభలు జరిగినవి. ఆసభలో కలకత్తా నుండి వచ్చిన శ్రీ గోపాలదత్త శాస్త్రిగారు హిందీలో ఉపన్యసింపగా మన శ్రీ గోపాలా

చార్య స్వామివారు ఆంధ్రముతో అనువదించిరి. తరువాత శ్రీ సనకా రామా రావు నాయుడుగారు శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు ఆధ్యాత్మిక గ్రంథమండలి సంపాదకులు ఉపన్యసించిరి. మరియొకనాడు హిందూమహాసభలు జరిగినవి. ఆ సభతరపున శ్రీ పండిత ఉమామహేశ్వరపండితులుగారు వచ్చి ఉపన్యసించిరి.

### సాయంకాలము పండితసభానంతరము
### లక్ష్మి పూజలు

శ్రీ వేంకటేశ్వరస్వామివారి పందిరిలో శ్రీ లక్ష్మిపూజాపరులు విచ్చేసి, దంపతులుగాను, విడిగాను బారులుకట్టి కూర్చొని లక్ష్మి పూజ గావించిరి. శుక్రవారమునాడు ఈపూజ పరమ విలక్షణముగా జరిగినది. ప్రాణప్రతిష్ఠ గావింపబడిన పతకమీద శ్రీ చూర్ణముతోను తులసితోను శ్రీ జియ్యర్ స్వామివారు మైకులో నామములు చెప్పుచుండగా అందరు నోరార అనుసంధానము చేయుచూ లక్ష్మి అష్టోత్తర పూజలు గావించిరి.

### బేడా ఉత్సవము

పూజానంతరము, శ్రీ కోదండరామస్వామివారి అర్చామూర్తులను కేళియముపై వేంచేపుచేసి ఛత్రచామరాది లాంచనములతో వయ్యారినడకలు సన్నిధిచుట్టు ప్రదక్షిణోత్సవములు పదిరోజులు జరిగినవి. ఈ ఉత్సవముసేవించిన వారిదే జన్మము. స్వస్తివాచకము వేదవిద్వాంసులు. అహమహమికాయా ఉచ్చైస్స్వరములో చెప్పుచుండగా నాలాయిర ప్రబంధ విద్వాంసులు అమృతప్రవాహమువంటి శైలిలో పాశురములను అనుసంధించుచుండగా శ్రీ పెరుమాళ్లు వయ్యారి నడకలతో శైలిచుట్టు ప్రదక్షిణోత్సవము గావించిరి. శ్రీ జియ్యరుస్వామివారు త్రిదండకాషాయిధారులై గోష్ఠిమధ్య వేంచేసియుండి అనుజ్ఞల్యా నిర్వహించుచుండు దృశ్యము భగవన్నామ పరమపదమునుండి బయలుదేరిన భగవద్రామానుజులవారు వీరని అనిపించక తప్పదు. ప్రదక్షిణోత్సవానంతరము తీర్థప్రసాదగోష్ఠి జరిపించిరి.

12 వ రోజు వేలకొలది భక్తులు వెంటరా కృష్ణానదిలో అవబృధోత్సవము జరిగినది ఆపిదప ఒంటిగంటకు పూర్ణాహుతి పూర్తి అయ్యెను.

వేదవిద్వాంసులకు, నాలాయిర విద్వాంసులకు, శ్రీ జియ్యర్ స్వామివారు, అనుకొన్న మొత్తముకన్న హెచ్చుమొత్తం సంభావనలిచ్చిరి. వారుకోరిన ప్రకారం రాకపోకలకు ఖర్చులిచ్చిరి. పండితులను ఘనముగా సత్కరించిరి. ఆసమయమునకు విచ్చేసిన వేదపండితులకు సుమారు 100 మందికి కూడా శ్రీ స్వామివారు ఘనముగా సత్కరించిరి అడిగినవారికి లేదనకుండ సంభావనలిచ్చిరి. కొందరికి శాలువలు బహూకరించిరి. ఈ పదిరోజులు మధురముగా నాగస్వరము వాయించిన భజంత్రీలకు సంతృప్తికరముగా సత్కరించిరి. దేవస్థానం పరివారమునకు బ్రహ్మయజ్ఞములో భక్తిశ్రద్ధలతో పనిచేసిన ప్రతివానికి శ్రీ జియ్యర్ స్వామివారు అధికారానుగుణముగా సత్కరించిరి. దాదాపు 10,000-0-0/ పదివేల రూపాయిలు ఒక గంటకాలములో పండిత సత్కారములక్రింద వ్యయము చేయబడెను. అందరు శ్రీ స్వామివారి సత్కార సంభావనాదులకు ఆనందించిరి. ఈ బ్రహ్మయజ్ఞము పదిరోజులు విరివిగా అన్నదానము జరిగినది. వేదఘోష వియత్తల మంటినది. పండితోపన్యాసములు

పండిత పామరరంజకములయ్యెను. విదుషీ మణుల సభలు వీనులవిందయ్యెను. భగవత్పూజలు పరమానందకరము లయ్యెను. బ్రహ్మయజ్ఞ మిట్లు పరమ విలక్షణముగా పూర్తి అయ్యెను. శ్రీ జియ్యర్ స్వామివారు సంకల్ప సిద్ధులు. ఈ యజ్ఞములో అన్నివిధముల సహాయపడినవారికి శ్రీ స్వామివారు మంగళాశాసనములు కృపచేసిరి. శ్రీ స్వామివారి దివ్యాజ్ఞ సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు అవ్యాహతపరాక్రమమై ప్రవర్ధిల్లుగాక. బ్రహ్మయజ్ఞానంతరము శ్రీ స్వామివారు నడిగడ్డపాలెం ఆశ్రమమునకు విచ్చేసి చాతుర్మాస దీక్షలో వేంచేసియున్నారు.

శ్రీ పచ్చిపులుసు వెంకట సుబ్బారావుగారు, హిందూ హైస్కూలును, విజయవాడ మున్సిపల్ కమీషనరుగారు రెండు గరల్సు స్కూళ్లున్నూ యాత్రీకుల బసలు, భోజనముల నిమిత్తమై ఇచ్చిరి. శ్రీ బచ్చు వెంకటేశ్వర్లుగారు శ్రీ కన్యకా పరమేశ్వరీ సత్రమునుండి పాత్ర సామగ్రి సప్లైచేసిరి.

శ్రీ అప్పారావునాయుడుగారు, పాలపొడి సప్లైచేసిరి. మదరాసు శ్రీ మట్టపల్లి రంగనాథయ్య, శ్రీ కరాలపాటి రాధాకృష్ణయ్యగార్లు తులసి సప్లైచేయుటలో సహాయపడిరి వీరందరకు శ్రీయతిపతి మంగళమును ప్రసాదించుగాక.

(సంపాదకులు)

## సాంఘిక వార్తలు

బరంపురం,-ఇచ్చట శ్రీ యతిరాజ సేవా మహిళామండలివారు శుక్రవారపూజా కార్యక్రమమును అత్యంత విలక్షణముగా జరుపుచున్నారు. ఈ సందర్భములో శ్రీమతి వక్కలంక సుగుణమ్మగారు, ఒకనాటి శుక్రవార పూజ జరిపి సంఘమునకు 1-0-0 ఒకరూపాయి కట్నము సమర్పించిరి.

శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధి ధర్మకర్త శ్రీ ఆత్మకూరి వరదరాజశ్రేష్ఠిగారు, తమ సతీమణి పరమపదోత్సవములో సమర్పించిన సంభావన 5-0-0 లు. (లోగడపడిన పొరపాటును ఇట్లు సవరించుకొనవలెను)

కళింగపట్నం:-ఇచ్చట శ్రీ మహేంద్రవాడ వేంకటరామనరసింహాచార్యులుగారి ప్రోత్సాహముతో శుక్రవార పూజలు సన్నిధిలో చక్కగా జరుగుచున్నవి. గీతా పరీక్షలలో ఉత్తీర్ణులైనవారలకు శ్రీ నరసింహాచార్యులుగారు, పౌంటెన్ పెన్నులు బహూకరించిరి.

హిందూపురం:-ఇచ్చట శ్రీ విశిష్టాద్వైత సంవర్ధనీసభవారి, తృతీయ వార్షికోత్సవములు, వైభవముగా జరిగినవి. శ్రీమదిత్యాది శ్రీమాన్ కవిరాజ, కాంధూరు నరసింహచార్యులుగారు అధ్యక్షత వహించిరి.

నడిగడ్డపాలెం:-శ్రీ వాసుదాసాశ్రమములో హరేరామ క్రతువారంభమైనది దివారాత్రములు హరేరామ సంకీర్తన జరుగుచున్నది. శ్రీ జియ్యర్ స్వామివారు ఇచ్చట చాతుర్మాస్య దీక్షలో నున్నారు. ఆచార్యహృదయం కాలక్షేపము జరుగుచున్నది.

శ్రీరామతీర్థం:-ఇచ్చట శ్రీ జియ్యర్ స్వామివారు, వేసంగి పాఠశాలగా స్థాపించిన శ్రీ యతిరాజ శిక్షాశిబిరము నిర్విఘ్నముగా సాగినది. ఈ పాఠశాలలో అధ్యాపకస్వాములుగానున్న శ్రీమత్తిరుమల పర్లర్లమూడి రామానుజస్వామిగారికిన్నీ శ్రీమాన్ అయ్యవార్లంగారికిన్నీ, సంఘముతరపున కృతజ్ఞత చూపించుచున్నాము. ఈ పాఠశాలలో అన్వయించి వేదాంత విషయములను గ్రహించిన విద్యార్థులకు, శ్రీ జియ్యర్ స్వామివారు అనంత మంగళాశాసనములు అనుగ్రహించిరి.

శ్రీ మహిళామండలివారి తీర్మానములు

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతక్రింద విజయవాడలో 1-7-57 వ తేది శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి విరాట్ సమావేశమందు తీర్మానింపబడిన తీర్మానములు.

ఈ తీర్మానములు. 30-6-57 వ తేదీన శ్రీ యతిరాజసేవా మహిళామండలివారి కార్య నిర్వాహకవర్గ సమావేశమందున్నూ మరియు విషయనిర్ణయ సమావేశమందున్నూ తీర్మానింపబడి యిందు విరాట్ సమావేశమందు ప్రవేశపెట్టబడినవి.

శ్రీ హేవిళంబినామ సంవత్సరమునకు ఈ క్రిందివారిని శ్రీ యతిరాజసేవా మహిళా మండలి కార్యనిర్వాహక వర్గముగా ఏర్పాటు చేసుకొనడమైనది.

అధ్యక్షులు: శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మ అమ్మవార్లంగారు, (తాళ్లముదునూరుపాడు అగ్రహారం)

ఉపాధ్యక్షులు: శ్రీ అమరవాది వెంకటనరసమ్మగారు (నరసాపురం)

కార్యదర్శులు: శ్రీ శాతలూరి చూడుకుడుత్తమ్మగారు, (గుంటూరు)

సహాయకార్యదర్శులు: శ్రీ వక్కలంక సుగుణమ్మగారు, (బరంపురం)

కోశాధికారులు: శ్రీ మరంగంటి రంగనాయకమ్మగారు,

కా ర్య స మి తి

1. శ్రీతి.వె తిరువెంగడమ్మగారు (బరంపురం)
2. ,, మంగుతాయారమ్మగారు (శ్రీకాకుళం)
3. ,, కరి లక్ష్మీనరసమ్మగారు, (మైలవరం)
4. ,, ముడుంబై రామానుజమ్మగారు, (రాజమండ్రి)
5. ,, కందాడ సీతమ్మగారు, (ఏలూరు)
6. ,, మరంగంటి సీతమ్మగారు, (బందరు)
7. ,, అద్దంకి అమ్మవార్లంగారు, (చీరాల)
8. ,, కృష్ణవేణమ్మగారు, (మదరాసు)

ని ర్వా హ క స మి తి

1. శ్రీ దాసరి ఆండాళమ్మగారు, (విశాఖపట్నం)
2. ,, దాసరి శ్రీదేవమ్మ (చావలి)
3. ,, ఎలమంచిలి భగవన్నామం, (కల్వపాములు)
4. ,, మాతంశెట్టి రాధాదేవి, (విజయవాడ)
5. ,, కూరపాటి గోదాదేవి, (విజయవాడ)
6. ,, చిన్నెం ఆదెమ్మ, (ఆర్తమూరు)
7. ,, చుండూరు రంగనాయకమ్మ, (బందరు)
8. ,, మట్లపల్లి చంద్రమ్మ, (మదరాసు)
9. ,, మండలి పద్మావతమ్మ, (ఏలూరు)
10. ,, సుగ్రీవు రామసుబ్బమ్మ, (మార్కాపురం)
11. ,, కర్రా తాయారమ్మ, (నరసాపురం)
12. ,, నిడుముక్కల అన్నపూర్ణమ్మ, (విజయవాడ)
13. ,, గాదె సీతారామమ్మ, (విజయనగరం)
14. ,, కంతేటి తాయారమ్మ, (బందరు)
15. ,, న్యాపతి కృష్ణమూర్తి, అడ్వకేటుగారి భార్య (శ్రీకాకుళం)
16. ,, మైలవరం శివ రాణిగారు, (మైలవరం)
17. ,, పాపాయమ్మగారు, (మదరాసు)
18. ,, అయినంపూడి రత్తమ్మగారు,
19. ,, ముడుంబై సింహాచలమ్మగారు,

శ్రీమతే రామానుజాయనమః





శ్లో॥ శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః । అఙ్గీకారిభి రాలోకై స్సార్థయన్త్యై కృతాఞ్జలిః॥

# శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి

వార్షిక విరాట్ సమావేశముయొక్క ఆహ్వాన సంఘాధ్యక్షురాలగు

## శ్రీమతి సూరానేని శ్రీవర మంగయ్యమ్మారావు

## బహద్దూర్ - జమీందారిణీవారి

# స్వాగతోపన్యాసము



నిరతిశయానందరూపమగు మోక్షమునకు సాధనము తత్త్వజ్ఞానము. అట్టి తత్త్వజ్ఞానము ప్రమాణాధీనము. ఆ ప్రమాణములలో నతీన్ద్రియార్థ సాధనమగు ప్రమాణ మూర్ధన్యము శ్రుతియే. ఇట్టి శ్రుతి పూర్వభాగము ఉత్తరభాగము అని రెండువిధములు. ఇట్టిశ్రుతిని సర్వాత్మనా ప్రమాణముగా పరిగ్రహించి యాదరించునది రామానుజ దర్శనమొక్కటియే. ఈపట్ల 'తదిహాఖిల శ్రుతిమతం రామానుజీయం మత'మ్మను నార్యోక్తి అక్షరశః తథ్యము. ఈ దర్శనమును రామానుజ దర్శనమనుటకు-

'ఎమ్బెరుమానార్ దర్శనమెన్రే యిదుక్కు, నమ్బెరుమాళ్ పేరిట్టు నాట్టివైత్తార్
అమ్బువియో రిన్దదరిశనత్తై ఎమ్బెరుమానార్ వళర్త్త అన్దచ్చెయ లఱిగైక్కా''

అనెడు శ్రీమణవాళ దేశికుల ఉపదేశరత్నమాల శ్రీ సూక్తియే ప్రమాణము. శ్రీ రామానుజులు యీ దర్శన ప్రవర్తనకై గావించిన కృషిని లోకమున కెఱుకపరచుటకే శ్రీరంగధాముడీ తిరునామముంచెను. ఇట్టి సిద్ధాంతము నాసేతు సీతాచలము నూటయిరువది సంవత్సరములు ప్రచారమును గావించి యంతమాత్రముచే తనివిదీరక తిరిగి వారే శ్రీ వరవర మునులుగా నవతరించి తమ పాదరేఖాప్రాయులగు అళగియ వరదముని యనంబరగు శ్రీవానమామలై రామానుజ జీయరువారిద్వారా యీ సిద్ధాంతమును జగత్తునందంతటను వ్యాపింప

జేసిరి. ఈ పరంపరలో రెండుసారులు మనదేశమునందంతటను పర్యటించి పరమత నిరసనపూర్వకముగ స్వమతమును స్థాపించిన మహాత్ములు-

ఈశ్వరాబ్దేఽశ్వినీతారే చైత్రే మాసికృతోద్భవః। జీయాద్వాన మహాశైల కలిజిద్యోగిరాట్సదా॥

యని శిష్యులచే స్తుతింపబడునట్టి అస్మదాచార్యులగు యిరువదిరెండవ పీఠస్థులు 1008 శ్రీ చిన్నకలియన రామానుజజీయర్ స్వామివారు, వారికి పిమ్మట ప్రస్తుత మాపీఠము నలంకరించు ఆచార్యపుంగవులు-

శ్రీమచ్ఛఠారి కలిజిద్యతి రాజసౌమ్య, జామాతృవానగిరి యోగి పదాబ్జభక్తమ్
శ్రుత్యన్త యుగ్మసుఖబోధన సంప్రవీణం, రామానుజం మునివరం గురుమాశ్రయామః।

యనెడు నిత్యతనయచే స్తుతింపబడు 1008 శ్రీ చిన్న రామానుజజీయర్ స్వామివారు శ్రీ వానమామలలో 27 వ పీఠాధిపతులుగా నాపీఠము నలంకరించి నిరంతరము ఉభయవేదాన్త ప్రచారమును సాగించుచు వేంచేసియున్నారు.

వారియాదేశమును శిరసావహించి బదరికాశ్రమమునుండి కన్యాకుమారివరకు అహోరాత్రములీ సిద్ధాంతమును ప్రచారముచేయుటకై బద్ధకంకణులై ఉత్తమాశ్రమమును స్వీకరించి మనల నుజ్జీవింపజేయుచు మనకిప్పుడు నేత్రపర్వమును శ్రోత్రపర్వమును గావించుచున్న యీ 1008 శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారిప్పుడు మనకొక శుభావకాశమును ప్రసాదించి యున్నారు. వారికి మనమెంతయో ఋణపడి యున్నారము. ఇందులకు కృతజ్ఞతాసూచకముగా శ్రీవారికిత్తరి నా హృదయపూర్వక శతశ్శత ప్రణామముల సందజేయుచున్నాను.

యుగములలో కలియుగమునకును, జన్మలలో స్త్రీ జన్మకును, పంచమవేద ప్రణీత యగు శ్రీ వ్యాసమహర్షి ఉత్కర్ష నొసంగెను. ముక్తికి సాధనము భక్తి. భక్తియనగా భగవంతుని ప్రీతితో ధ్యానించుట. ఆ ప్రీతి స్త్రీల కున్నంత యధికముగా పురుషులకుండుట దుర్ఘటము. కావుననే గదా మన యాళ్వారులలో పలువురు తమయందు స్త్రీత్వము నారోపించుకొనినది. అందులకే గదా అందరి ప్రబంధములకంటె శ్రీ ఆండాళ్ళు తల్లి తిరుప్పావై ప్రబంధమును హెచ్చుగా నాదరించి శ్రీ భాష్యకారులు 'తిరుప్పావై జీయ'రని ప్రసిద్ధిని గాంచినది. ధర్మ సంస్థాపన గావించ నెంచి పెక్కు యవతారములను పరిగ్రహించిన భగవంతుని కృషిని సార్థక పరచినది ఆ తల్లియొక్క స్త్రీ యవతారమేగదా! ఈ విషయమునే శ్రీ భట్టరువారు శ్రీగుణరత్నకోశమున -

శ్లో. యది మనుజ తిరశ్చాం లీలయా తుల్యవృత్తేః
అనుజనురనుపా దేవి! నావాతరిష్యః

అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః- అని సాయించిరి.

బిడ్డకు సాత్త్వికాహారమును సత్సహవాసమును సద్బుద్ధులును నొసంగి చక్కపరచునది స్త్రీయే. భర్తకు సదుపదేశము లొసంగియు తనకు విననిచో సద్బుద్ధిని ప్రసాదించి చక్కపరచమని శ్రియఃపతికి పూజలు సల్పియు వ్రతములు సల్పియు విద్దుబాటొనరించునది వనితామతల్లియే గదా! ఇప్పటికిని ఆసేతు సీతాచల మెచ్చట సత్సంగములు తిలకించినను మూడువంతులు స్త్రీలే గాన్పించుచుందురు. ఏసద్గోష్ఠిలోనైనను ఏ సత్కార్యములకైనను ముందంజ వారిదేగదా!

ఈ రహస్యమును గుర్తించియే మన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకర్తలు సుమారు 10 సంవత్సరములకు పూర్వమే శ్రీ యతిరాజ సేవా మహిళా మండలుల నేర్పరచి స్త్రీలకు ప్రత్యేకముగా విదుషీమణులచే నుపన్యాసము లిప్పించియు, శిక్షాశిబిరముల నెలకొల్పియు ఏకాదశీ గీతాప్రవచనముల నలవరచియు, జాతి వయోనియమములు లేక సవర్ణ సర్వహిందూ స్త్రీలకును ఆధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికై గీతాపరీక్షల నేర్పరచి అందుల కుచితమగు గీతాప్రశ్నోత్తరావళుల రచించి పరీక్షాభ్యర్థినుల కర్ధమూల్యమున కొసంగుచు సంవత్సరమునకు 3 పరీక్షలు జరుపుచు అందు త్తీర్ణులైనవారికి బహుమతులు యోగ్యతాపత్రికల నొసంగుచు ప్రచారముచేయించుచున్నారు. ఇంతవరకు మద్రాసునుండి బరంపురమువరకును నైజాం ప్రాంతములోను అనేక మహిళా సంఘము లేర్పడి పై విధముగా ప్రచారము సాగించుచున్న వివరములను కర్ణపేయముగా మన భక్తినివేదన మూలమున మనము వినుచున్నాముగాదా! ఈకృషికి మనమా కార్యకర్తల కెంతయో కృతజ్ఞులమై యున్నాము.

ఇప్పుడు స్త్రీలలో విద్యావ్యాప్తి బహుగుణముగా వ్యాపించుట ముదావహమే. గుమాస్తా పదవి మొదలు గవర్నరు పదవివరకు ప్రతి ఉద్యోగ స్థానమును ఆక్రమించుటకు తగిన మహిళలు తయారగుచుండుట మనము మిక్కిలియానందించదగినదే గాని దానితోపాటు ఆధ్యాత్మికదృష్టి సన్నగిలుట ఎంతయో విచారకరము. ప్రపంచమంతయు పశుప్రాయముగా నున్న సమయమున గూడ మనదేశ మెంతయో నాగరికతతో తులతూగి వన్నె కెక్కుటకు ముఖ్యకారణము మనపూర్వుల ఆధ్యాత్మిక తృష్ణయే. 'అధ్యాత్మ విద్యా విద్యానాం' అని భగవద్గీతలో భగవాను డానతిచ్చినట్లు ఆ విద్యకు గల గౌరవము మరియొక విద్యకు లేదనుట అసంగత ప్రసంగము కానేరదు. "సా విద్యా యా విముక్తయే. విద్యాన్యాశిల్పనైపుణం" అనెడు విష్ణుపురాణోక్తి దీనికి ప్రమాణము. సముద్రము నాచమించదగిన శక్తి యున్నను, సృష్టికి ప్రతి సృష్టి చేయగల తపస్సంపదయున్నను. నిమేష మాత్రమున భూలోకమును స్వర్గమును జేయగల మంత్రశక్తియున్నను ఆకులలములు మెసగుచు కౌపీనధారులై యడవుల నిడుములు గుడుచుచు నెగడుట ఆధ్యాత్మిక శక్తి సంపాదనకే గాదా! ఐహికభోగము లెన్నియొసంగెదనన్నను ఆశించక ఆముష్మికమునే యుపదేశింపమని పట్టు బట్టి కూర్చొన్న నచికేతుని చరిత్ర మీ సత్యమును సాటుటలేదా! వీరు తలంచిన జేయజాలనిది యున్నదా! అట్టి ఆధ్యాత్మిక శక్తి యీనాడేది? నాస్తిక దేశములవలె కళానైపుణ్యమునకై కాలమునంతను వెచ్చించుచున్నచో నిక ఆధ్యాత్మిక పతనమునకు కొరతయేమున్నది. ఎంతటి విజ్ఞులైనను జ్ఞానులకు గల శాంతిని బడయగలుగుదురా? ఎంతటి భౌతిక శాస్త్రవేత్తలైనను భోగో

లిక పరిజ్ఞాతలైనను, ఐతిహాసిక నిపుణులైనను, గణితశాస్త్ర ప్రవీణులైనను, ఒకనిశ్చల వేదాంతికి గల శాంతిని బడయగలుగుచున్నారా ?

యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయీకాత్యాయినులనెడు తన భార్యలకు తన యాస్తిని పంచనిశ్చయించి నప్పటి మైత్రేయి వాక్యములను స్మరింపుడు. ఎన్నటికిని తరుగని విద్యాధనము నాకు ప్రసాదించుమని ప్రార్థించి ఆధ్యాత్మోపదేశము నాయంగనామణి బడసినట్లు మనకు బృహదారణ్యోపనిషత్తు తెలుపుచున్నది గదా ! ఇప్పుడట్టి వాతావరణ మంతయు కలుషితమై మృగ్యమాన దశను పొందుట శోచనీయము కాదా!

ఎందరో స్త్రీలు బాలవితంతువులై తల్లిదండ్రుల యండనో అన్నదమ్ముల చేరికనో యుండి వారి సుఖదుఃఖములే తమ సుఖదుఃఖములుగా పాటించుచు తమ జీవితమునంతను వారిసేవలతో సరిపుచ్చుట మనము నిత్యమును జూచుచున్నాము. లేదా ఆధునిక విద్యావ్యాసంగములు స్వేచ్ఛగా పురుషులతో గలసి చేయుచు నిష్కళంక చరిత్రతో బయటపడుటయే దుర్లభము. అట్లు గడపి బయటపడినను ఉద్యోగములు చేసి కష్టించి ఆర్జించి తిరిగి ఆ దేహబంధువుల సేవలకే తన జీవితమునంతను వ్యర్థపరచవలసి వచ్చుచున్నది. బిడ్డలు పెద్దవారై కుటుంబనిర్వాహణమును గావించుకొనుచున్నను భర్తల నెడబాసిన భామినులు ఒక పుణ్యకథా శ్రవణమునకు గాని ఒక పుణ్యయాత్రా పర్యటనమునకు గాని బిడ్డల యనుమతిని బడయజాలక వంటయిండ్లలో నెందరు మ్రగ్గుట మనమెఱుంగము ? స్వేచ్ఛగా కృష్ణా ! రామా ! యనుకొనుటకైనను అవకాశములేక నిరంతరము వారియొక్కయు వారి బిడ్డలయొక్కయు సేవలకై తమ సర్వస్వమునే గాక తమ దుర్లభ మానవజీవితమునే నిరర్థకపరచవలసియుండుట మన మెఱుంగనిదా ?

ఈ యాపదల బాపుట కొక మార్గము నన్వేషించుట మనకర్తవ్యమని మీకు తోచుట లేదా ? దానికై నిరంతరకృషి సలుపుట మన విధికాదా !

ఇందులకై ఆధ్యాత్మిక శాంతినికేతనములు నచ్చటచ్చట పెక్కులు నెలకొల్పబడవలెనని నాయాశ. అన్నిటికిని కేంద్రస్థానమొకటి యంధ్రబాటలో నొక నదీతీరమున విశాలావరణలో నేర్పరచబడవలెను. అందు స్త్రీల కన్నివయస్సుల వారికిని వారివారి బుద్ధికుశలతకు తగినటుల విద్యావ్యాసంగము లభించవలెను. మూలభాషయగు సంస్కృతము, మాతృభాషయగు ఆంధ్రము, వేదాంత రహస్య విజ్ఞానమునకు ద్రావిడమున వ్యావహారిక కౌశలమునకు హిందీ కొలదిగా నాంగ్లము, లోకోపకారమునకు వైద్యము, జ్యోతిషము, ఆముష్మిక శాంతి సంపాదనకు వేదాంత ప్రవచనములును అందు లభించవలెను. తమ జీవిత శేషమును ప్రశాంతముగా గడుపదలంచిన వారి కాలక్షేపమునకు చక్కని పురాణగోష్ఠిప్రభృతులు అందరేర్పచబడవలెను. అన్నిటికు ప్రచారణశిక్షణ మొసంగబడుచుండవలెను. ప్రశాంతముగా ధ్యానించి భగవదనుగ్రహమును బడయుటకు అందొక భగవన్మందిరము నెలకొల్పబడవలయును. తమ

జీవితములో నేకొంత కాలమునైనను ఆధ్యాత్మిక వాతావరణములో గడపదలంచిన మహిళలకు తాత్కాలిక వసతిగృహములుండవలెను. లోకమున సజాతీయ వనితామతల్లులకు ఇహలోక సుఖజీవితమున కుపయోగపడు శిశుపోషణ, గృహకృత్య నిర్వహణ, ఆవశ్యకవైద్య శిక్షణాదు లొసంగబడవలెను. ఆముష్మికజీవితమున కుపయోగించు ఆధ్యాత్మిక ప్రబోధలకు యథావకాశముగా ప్రచారము జరిపించుచుండవలెను. సహనశక్తి పెంపొందింపబడవలెను. పరోపకారశీల మలవరచ బడవలెను. ఇట్టి యనేక కార్యముల నిర్వహించుటకై యొక కేంద్ర ఆధ్యాత్మిక శాంతినికేతన ముండుట ముఖ్యావసరము. దీనికంగములుగా నచ్చటచ్చట చిన్న చిన్న ఆశ్రమముల నంతటను నెలకొల్పి ఈకేంద్ర శిక్షణమున ఆరితేరిన నారీమణుల నందుంచి ప్రచారమును జరిగించుచుండ వలెను. వీలైనంతవరకు 3 నెలల కొకసారి అందరును సమావేశమై పరస్పరానుభవములను విమర్శించుకొనుచు చేసినపనిని చేయవలసిన పనులను పర్యవేక్షణ చేసుకొనుటకును ఇతర సమయములలో ఆధ్యాత్మిక ప్రవచనములు జరుపుటకును ఒక వారము దినములకు తక్కువ గాకుండా సత్సంగములు నేర్పరచవలెను. సమర్థులగు స్త్రీలచే గ్రామాంతరములయందుండు స్త్రీలలో కూడా నియత సమయములలో ప్రచారమును చేయించుచుండవలెను. బొత్తుగా జీవనో పాధి లేని స్త్రీల కాశ్రమమున వసతుల నేర్పరచి రోజునకొక ఝామునకాలము కృషిసల్పి తమ ఆవశ్యక ఆహారాది సంపాదన కవసరమైన ధనసంగ్రహణమునకు ఉచితమగు చేతిపనులను కల్పించవలెను. ఆవస్తువులనే యందరును కొనునటుల ప్రచారము చేయవలెను.

మన సంప్రదాయ మెంత యున్నతమైనదైనను యెంత శ్రుతిసమ్మతమైనదైనను తగినంత ప్రచారము లేకుండుటకు అందరకు నందుబాటుభాషలో వలయునన్ని మతగ్రంథములు లేకుండుటయే ప్రధానకారణము. కాబట్టి సమీచీన జీవితనిర్వహణమునకును సత్సంప్రదాయ విజ్ఞానమునకును అవసరమగు గ్రంథములను హెచ్చుగా సులభశైలిలో ప్రకటించుటకు తగిన కృషిని సలుపుట ముఖ్యతమము. ఉదాహరణకై చూడుడు. సామాన్యజ్ఞానము కలిగి వేదాంత ప్రావణ్యముతో మన సంప్రదాయమును చక్కగ నెఱుంగగోరిన యొకవ్యక్తికి మన మేగ్రంథ మును పాఠ్యగ్రంథముగా పురమాయింపగలమో చెప్పగలరా? ప్రపంచమునందలి యన్నిభాష లలోను యనువదింపబడిన ప్రమాణమూర్ధన్యమగు భగవద్గీతను మన సంప్రదాయానుసారముగా నర్థము నెఱుంగగోరినవారికి పాఠ్యగ్రంథ మేదియో చెప్పగలరా? అర్థముగాక, అనుభవమూరమై యున్న అన్యసాంప్రదాయములింత ప్రచారములో నుండుటకు నానాభాషలలో ప్రచురింపబడిన ఆ సంప్రదాయ గ్రంథములే ముఖ్యకారణ మనుట కేమి సంశయము. కావున మన సంప్రదాయ విశేషములన్నియు సులభమగు ఆంధ్రభాషలోను, అటుపిమ్మట హిందీభాషలోను పిదప ఆంగ్ల భాషలోను అనువదింపబడి విరివిగా ముద్రింపబడి ప్రచురింపబడుటకు మనము నిరంతర కృషిని సలుపవలసియున్నది. వీలైనంతవరకు ఉచితముగను గిట్టిన వెలకును కొన్ని గ్రంథములను పంచు టకుగూడా తగిన ప్రయత్నములు సాగించవలెను.

ఆధ్యాత్మికముగను శారీరకముగను ప్రజాసేవకు సర్వదా సన్నద్ధులై యుండ దగిన యొక స్త్రీ దళమునుకూడా నెలకొల్పుట ఉచితమని నాయభిప్రాయము. బీదలకు తిండి బట్టల నొసంగుటకు తగిన ఏర్పాటు చేయబడవలెను.

ఈ కార్యములకు వలయు ధనసేకరణకై తగు విధానము లాలోచించి కార్యాచరణ విధానమునకు గడంగవలెను. ఈ పనులు గావించిన నాడే మన యతిరాజసేవామహిళా మండలి నామధేయము సార్థకమగును. ఇదియే శ్రీయతిరాజులకు ప్రియమైనసేవగాదా!

## శుక్రవారపు పూజలు

వారమున కొకసారి గ్రామ-నగరాదులలోని స్త్రీలందురు సమావేశమై పవిత్రముగ భగవద్ధ్యానముతో నాధ్యాత్మికముగా సమయమును గడపుటకు శుక్రవార పూజావిధాన మొక ముఖ్యసాధనము. దాని మూలముననే పరస్పరపరిచయము సంప్రదాయవిజ్ఞానము ఆధ్యాత్మిక భావాభివృద్ధి ధనసేకరణాదులు సమకూరగలవు. కావున ప్రతిపల్లెయందును ఒకొక్కటిచొప్పునను పట్టణములలో పేట కొకటి చొప్పునను శ్రీ యతి రాజ సేవా మహిళా మండలుల నేర్పరచి శుక్రవార పూజలు ప్రవేశపెట్టవలెను. ప్రతి సభ్యురాలును ప్రతి శుక్రవారమునందును తన యింట లక్ష్మీనారాయణపూజ సలుపుకొని ఒకఅణా ను యొకడబ్బీలో నుంచుచుండవలెను. సంవత్సరమునకు 52 వారములకు రు 3-4-0 లుకూడును. అందు సుమారు రు 2-0-0 లు తన వంతు సమష్టి శుక్రవారపూజకు ఖర్చు చేసి మిగిలిన రు 1-4-0 చొప్పున అందరినుండి వసూలు చేసిన మొత్తమును యథావకాశముగా ప్రచార ప్రజాహిత కార్యములకు వినియోగించు చుండవచ్చును.

ఇట్లే ప్రతి సభ్యురాలును ప్రతి ధనుర్మాసమునకును అందరితో కలిసి ఒక పెరుమాళ్ల సన్నిధిలోగాని, ఒక ప్రసిద్ధసార్వజనీన భవనమందుగాని ఒకొక్కరి గృహమునందుగాని ధనుర్మాస వ్రతమును జరుపుచు ప్రబంధాధ్యయనాదులు జరుపవలెను గోదాకళ్యాణ దినమునందు మాత్ర మందరు నొకచోటనే కలిసి కళ్యాణమును జరిపి చివరకు యథాశక్తిగా గోదాకళ్యాణ కట్నములు చదివించి ఆ ధనమునంతను సేకరించి గ్రంథప్రచురణాది కార్యక్రమములకు పయోగించవలెను ఇట్టి కార్యక్రమములు ఐహికపారలౌకిక శ్రేయస్సాధనములనుట నిస్సంశయముగాదా! కావున- ఓ మహిళామతల్లులారా !

ఈ సదవకాశమును వ్యర్థపరచక తమరందరు లెస్సగ విమర్శించి యీ దివ్యబ్రహ్మ యజ్ఞమునకు స్మారకముగా నొక నిర్మాణ కార్యక్రమమును నిర్ణయించి రూపొందింతురని యాశించి ప్రార్థించుచున్నాను.

విజయవాడ,
24—6—1957.

ఇట్లు,
సూరానేని శ్రీవర మంగయమ్మారావు జమీందారిణి

# గీతా పరీక్షా ఫలితములు

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు 26-5-57 తేదీన జరిపిన భగవద్గీతా పరీక్షలో నుత్తీర్ణులైన అభ్యర్థుల నామములు, తరగతులు

**బరంపురం**

| | | తరగతి |
|---|---|---|
| 1 | కాఖ్యూరి సుశీలాకుమారి. | 1 |
| 2 | గోవిందు మంగమ్మ. | 1 |
| 3 | కుమారి న్యాయపతి లక్ష్మినరసమ్మ. | 1 |
| 4 | కాఖ్యూరి లక్ష్మినరసమ్మ. | 1 |
| 5 | గాదె యశోదలలిత | 1 |
| 6 | చౌటుపల్లి లక్ష్మమ్మ | 2 |
| 7 | గాదె చూడామణి | 2 |
| 8 | న్యాయపతి లక్ష్మినరసమ్మ | 3 |
| 9 | గోవిందు లక్ష్మినరసమ్మ | 3 |
| 10 | పరాంకుశం లక్ష్మినరసమ్మ | 3 |

**విజయనగరం**

| | | |
|---|---|---|
| 11 | అవసరాల వేదవల్లి. | 1 |
| 12 | M హనుమాయమ్మ | 2 |
| 13 | గుడూరు రంగనాయకమ్మ. | 2 |
| 14 | గుండుమళ్ల వెంకటలక్ష్మి | 2 |
| 15 | కొండుపర్తి శుభద్రమ్మ | 2 |
| 16 | గుండుమళ్ల సీతాలక్ష్మి | 3 |

**కళింగపట్టణం**

| | | తరగతి |
|---|---|---|
| 17 | మహేన్ద్రాడ లక్ష్మినరసమ్మ | 2 |
| 18 | కోయిల్‌కందాడై తయారమ్మ | 2 |
| 19 | ఆరవిల్లి సీతారామాచార్యులు | 2 |
| 20 | పరవటి లక్ష్మినారాయణమ్మ | 3 |
| 21 | మహేంద్రాడ వెంకటశేషాచార్యులు | 3 |
| 22 | మహేంద్రాడ కోదండ రామాచార్యులు | 3 |
| 23 | మహేంద్రాడ రామకృష్ణస్వామి | 3 |

**ఏలూరు**

| | | |
|---|---|---|
| 24 | వంగిపురం వెంకట పాండురంగస్వామి | 1 |
| 25 | వి అంజనాదేవి | 2 |
| 26 | న. చ. సుభద్రకుమారి | 2 |
| 27 | ముడుంబై చూడామణి | 3 |

**రాజమండ్రి**

| | | |
|---|---|---|
| 28 | కె. సూర్యకాంతం | 3 |

**చావలి**

| | | |
|---|---|---|
| 29 | కంచే కోటేశ్వరమ్మ | 3 |
| 30 | గోపాళం శ్రీ విఠల్ | 3 |
| 31 | పురం లక్ష్మినాంచారమ్మ | 3 |
| 32 | తాడికొండ పిచ్చెమ్మ | 3 |
| 33 | ఉలవకట్టు నాగేంద్రమ్మ | 3 |
| 34 | గోపిశెట్టి శేషారత్నం | 3 |

## రాజోప్య గీతా పరీక్షలు

రాజోప్య భగవద్గీతా పరీక్షలు 15-7-57వ తేదీని జరుపబడును.

### పాఠ్యక్రమము

ఆనాడు ఉదయము ప్రశ్నోత్తరావళి 1,2,3 [illegible] తాత్పర్యముతో వర్ణించవలసిన యీ దిగువ శ్లోకముల పరీక్షయు

మధ్యాహ్నము ప్రశ్నోత్తరావళి 4,5,6, అధ్యాయములున్ను తాత్పర్యముతో వర్ణించవలసిన యీ దిగువ శ్లోకముల పరీక్షయు జరుగును. ఆగష్టు నెలాఖరులోగా 0-8-0లతో దరఖాస్తులు కార్యాలయమునకుపంపవలెను. తాత్పర్యముతో వర్ణించవలసిన శ్లోకములు

| అధ్యా. | శ్లోకములు |
|---|---|
| 1. | 1, 10-14-40-41-42 |
| 2. | 7-11-12-17-22-27-38-45-46-47-48 55-56-57-58-62-63-69-70 |
| 3. | 8-13-14-15-16-21-22-23-24-27-30 33-37-42-43 |
| 4. | 5-6-7-8-9-11-13-14-15-18-28-35 |
| 5. | 5-10-13-17-18-20-26-29 |
| 6. | 5 6 9 17 26 34 35 40 41 42 43 44 47 శ్లోకములు |

---

శ్రీ తె. కం. గోపాలాచార్యస్వామివారి

### నూతన ప్రచురణములు

| | |
|---|---|
| రామరాజ్యము (శ్రీ మద్రామాయణము ననుసరించి) | 0—4—0 |
| అర్చావతార వైభవము | 0—4—0 |
| శ్రీ స్తవము గీతాస్తుతి | 0—1—0 |
| సాధుపరిత్రాణము | 0—2—0 |
| నవవిధభక్తులు | 0—8—0 |

**BOOK—POST**

"భక్తినివేదన" శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం (వయా) చుండూరు గుంటూరు జి॥

సాలు చందా **5-0-0** వేదాంత మాస పత్రిక ప్రచార విభాగం **1-4-0**

To



Edited and Published by Sri T. K. Gapalacharyulu Garu and Printed at Sri Satyanarayana Printing Works, Vijayawada for Sriman Press Nadigaddapalem.

శ్రీ హయగ్రీవాయ నమః



# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]


సంపాదకులు :
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ల రామానుజాచార్యులు



| సంపుటి ౧౦ | హేవళంబి - శ్రావణము | సంచిక ౫ |
|---|---|---|





సాలుచందా - అయిదురూపాయలు

శ్రీ హయగ్రీవాయనమః




శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు

మ. ఎవఁడో కారణమీ చరాచరజగత్సృష్టిస్థితిధ్వంస నా
దివిధానాప్తికిఁ బుష్పవంతులు యదాదేశానుసారంబుగాఁ
బవలున్ రేయిఁ జరింతురే విభుని దివ్యదృష్టిఁ బెంపొందు స
త్కవితాపద్ధతి వానితుష్టికొఱకై కైకొంటి నీ యంజలిన్.

మ. కవితన్ వ్రాయఁగఁ బోవువేళ నెద సాక్షాత్కారముం జెంది సం
స్తవనీయ ప్రతిభావిశేష విలసత్సాహిత్య సౌహిత్య వై
భవమున్ సంఘటనం బొనర్చుచు యశో భాగ్యంబు నా కిచ్చు వా
డెవఁడో వానికి నిచ్చుచుంటి నిదిగో యేతత్పవిత్రాంజలిన్.

మ. కలమున్ బట్టి కవిత్వమల్లుటకునై గావింప యత్నంబు లో
పల నేదో వచియింపరాని యొక భావస్ఫూర్తి వెల్గొందు త
త్ఫలవద్భావన సృష్టికర్త యెవఁడో భావింపగాలేక క
న్నుల వీక్షింపగలేక నే నిడెద నెన్నో మారు లీ యంజలిన్.

శా. శ్రీ లాస్యారెడు సత్కృపామృత రసస్నిగ్ధాతి గంభీర వి
క్షా లావణ్యముగుల్కు కన్నుగవతో సంధ్యాసముత్ఫుల్ల మ
ల్లీ లాతాంత సువాసనాభ గుణ లాలిత్యంబుతో నెవ్వఁడో
నాలోనన్ గలఁడంచు వాని కిడుదున్ నా యీ పవిత్రాంజలిన్.

మ. అరెరే మొన్నటిదాక పాల్గుడువనే కల్లాడు నీ పాప కె
వ్వరు నేర్పించిరొ! యింతలోన బలుకుల్ ప్రాపంచికస్ఫార స్పృ
ష్టిరహస్యంబున నే మహామహుఁడు దాచెన్ లోకకల్యాణ మా
ధురి నే నా పరమాత్మ మెప్పుకొఱ కిత్తున్ నేటికీ యంజలిన్

శ్రీ హయగ్రీవాయ నమః



# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]

సంపాదకులు :
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ల రామానుజాచార్యులు

సంపుటి ౧౦ || హేవళంబి - శ్రావణము || సంచిక ౫

శ్రీమతే రామానుజాయనమః

## సవినయనివేదన

ప్రియ మహాశయా !

శ్రియఃపతి కటాక్షముచేత మన భక్తినివేదన పత్రికా ప్రచురణ ప్రారంభమై ఇప్పటికి తొమ్మిది వత్సరములు గడిచినవి. ఇప్పుడు పదవ సంవత్సరము గడుచుచున్నది. పత్రికను ప్రారంభించునప్పుడు ఎన్నో మహాదాశయములను మనమున్న పిదుకొని ప్రారంభించితిమి. కాని వానిని నెరవేర్చలేకపోతిమి. అందులకు ప్రధానకారణము మన సంప్రదాయస్థుల యందు గల అలసత్వభావమే ప్రధానకారణ మని చెప్ప సాహసించినందులకు క్షమింతురుగాక.

ఎంతమంది ఎంత ఉచితసేవచేసినను పత్రికా నిర్వహణమునకు ఆర్థికసంబంధము తప్పదు. కాగితమును డబ్బిచ్చి కొనవలసినదేకదా. అచ్చునకు ఖర్చు తప్పదు కదా. పోస్టేజికి ధనము లేకుండగ సాగదుకదా. ఇది వరలో మొదటి ఆరు సంవత్సరములకు సుమారు ఎనిమిది వేల రూపాయలు నష్టము వచ్చినది. శ్రీ మన జీయరు స్వామివారి సహాయముతో దాని లోటులనో సర్దుబాటు చేసుకొంటిమి. అప్పటినుండి మూడువేల ప్రతుల నుండి సుమారు పదునెనిమిది వందల ప్రతుల మాత్రమే అచ్చు వేయించి పంపుచు పత్రికను స్వయంపోషకముగ నడుప ప్రయత్నించితిమి. కాని ఎంతమాత్రము ఫలించలేదు.

విజయ, జయ, మన్మథ, దుర్ముఖి ఈ నాలుగు సంవత్సరముల జమ ఖర్చులను యిందుతో ప్రచురించుచున్నాము చూడుడు. సంఘము నుండి శాశ్వత సభ్యత్వముగ వచ్చిన రూ. 7614-0-0 సన్మా? విరాళములుగ వచ్చిన రూ. 6832-11-3 మొత్తం 14446-11-3 లను, ఈ పత్రికా నిర్వహణమునకై ఈయగా కూడా ఈ నాలుగు సంవత్సరములకు మొత్తం రూ. 5007-11-9 నష్టము వచ్చినది. నిజానికి నష్టము రావలసినది కాదు. ఏలననగా చందాదారుల వలన ఇంకను సుమారు రూ. 6000/- పైగా చందాలు రావలసియున్నవి. గత యనుభవమును బట్టి ఆ చందాబాకీలు వసూలగుట దుర్లభము. దుర్లభమే కాదు, అసంభవమే యని అనుకొనవచ్చునేమో.

సుహృదయులారా ! మీ తాలూకు చందా బాకీ ఏమైన నున్నచో దయయుంచి వెంటనే ఆ బాకీ సొమ్మును మాకుపంపి ఈ సదుద్యమునకు తోడ్పడగోరుచున్నాము.

దీర్ఘమగునట్టియు, వసూలగుట దుర్లభమని తోచినట్టియు బాకీలుగల చందాదారులకు యికమీద పత్రికను పంపకుండగ నాపుజేసి, పత్రికా స్థాపనలో గల ప్రధానోద్దేశముల ప్రకారముగ యికమీద నుండి సాధ్యమైనంతవరకు పత్రికా ప్రచురణను అమలు జరుప ప్రయత్నించుచున్నాము. సంప్రదాయమునకు, ఆచారములకు, అనుష్ఠానమునకు అవసరమైన విషయముల ప్రమాణసహితముగ అధికప్రచురించుట, రహస్యగ్రంథముల ప్రచురించుట, పూర్వాచార్యుల శిష్యుల చరిత్రలను ప్రచురించుట, స్త్రీవిభాగము - బాలవిభాగముల ప్రచురించుట మున్నగువాని ద్వారా పత్రికను అవకాశమున్నంత వరకు హెచ్చు ఉపయోగకారిగ నుండునటుల ప్రచురించ ప్రయత్నింతుము. పెద్ద పెట్టుబడి ముందే పెట్టి పత్రికను సుందరముగ నుండునటుల ప్రచురించుచున్నచో యింతకంటెను హెచ్చు మంది దీనిని ఆదరించగలరను సంగతి మాకును తెలిసినదే. కాని ఈ పెట్టుబడి గతియె యిటుల నష్టమై యున్నచో, ఇంకను అప్పుజేసి పెట్టుబడి పెట్టుట సాధ్యముకాని పని. ఇంతకును ఇది వ్యాపారదృష్టితో గాని లాభకాంక్షతో గాని చేయునదికాదుగదా - కేవల స్వసంప్రదాయాభిమానముతో ప్రచారదృష్టితో మాత్రమే సాగవలసినదై యున్నది.

కాన తాము ఇంతవరకు బాకీయున్న పత్రిక చందా సొమ్మును, ఈ సంవత్సర చందాసొమ్మును వెంటనే మనియార్డరు ద్వారా యిచ్చుటకు పంపగోరుచున్నాము. కట్టుదిట్టము స్థిరము యగు సిబ్బంది లేకుండుటచే మీ చందాబాకీని మేము లెక్కకట్టి తెలుపుటలో తేడాలు పొరపాట్లు యుండిన యుండవచ్చును. అట్టివి యున్నచో క్షమించి మీ నిర్ణయప్రకారముగ మాత్రమే మీరెంతబాకీ యని తలంతురో అంతమాత్రమునే; మరియు ఆబాకీనంతను కూడ పూర్తిగ చెల్లించ నవకాశము లేనిచో యిపుడు మీరు చెల్లింప నవకాశమున్నంత మాత్రమునే తప్పక వెంటనే మాకు పంపించగోరుచున్నాము. తాముపేక్ష వహించినచో ఈ మా ఉద్యమమే నిలిచిపోవు ప్రమాదావస్థ తటస్థించగలదు.

మరియు తాము దయయుంచి తమ ప్రాంతీయ మందున్న పత్రికా చందాదారులను కూడ తమతమ బాకీలను మాకు వెంటనే పంపునటుల వారిని ప్రోత్సహించగోరుచున్నాము. మరియు ప్రతి చందాదారున్ను కనీసము మరియొక నూతన చందాదారునైనను చేర్పించగోరుచున్నాము. ఈ పత్రికకు యజమానులు - ప్రచారకులు - ప్రమరణకర్తలు - అధికారులు - ఫలానుభవకర్తలు వేరే ఎవరో కారు. అట్టివారు మీరే. ఈ విషయమును విస్మరించకుండగ మీరు సదా జ్ఞప్తియందుంచుకొని. స్వాభిమానముతో, స్వార్థదృష్టితో, ఈ భక్తినివేదన పత్రికను, నిలబెట్టి, పోషించి, ప్రచారముచేసి, స్వసంప్రదాయాభివృద్ధికి కారకులై యానందించగోరుచున్నాము. మీరు కలిగించు ఆర్థికాభివృద్ధి ననుసరించి మీ సలహాల ప్రకారముగనే విషయ - పుష్టిగలదై ఈ భక్తినివేదన పత్రిక వర్ధిల్లగలదు. ఇదియే నేను చేయు భక్తిపురస్సర నివేదన. భగవద్భాగవతాచార్య భక్తి నిరతులగు తమ పట్ల మా ఈ నివేదన వ్యర్థము కాదని నమ్ముచు చేయుచున్న సవినయ నివేదన.

మా చిఠా ప్రకారముగ తమ పేరుతో యున్న చందాబాకీ

రూ... ...............

ఈ హేవళంబి సంవత్సర చందా:- రూ...............

తామిపుడు మాకు పంపవలసి

యున్న మొత్తము సొమ్ము:- రూ...............

☞ ఇందుతో తమకు న్యాయమని తోచినంతమాత్రమునే పంపగోరుచున్నాము.

సూచన:—

భక్తినివేదన పత్రికకు అయిదుగురు నూతన చందాదారులను చేర్పించినవారికి ఒక సంవత్సరమువరకు ఈ పత్రికను ఉచితముగ పంపుచుండగలము. ముగ్గురు నూతన చందాదారులను చేర్పించిన వారికి ఆరుమాసముల వరకు ఈ పత్రికను ఉచితముగ పంపుచుండగలము.

కార్యాలయము
'భక్తినివేదన'
శ్రీ వాసుదాసాశ్రమము
వడిగడ్డ పాలెము
(వయా) చుండూరు - గుంటూరుజిల్లా

ఇట్లు
తె. కం. గోపాలాచార్యులు (సంపాదకులు)
గు. రామానుజాచార్యులు (సహాయసంపాదకులు

# భక్తినివేదన పత్రిక జమాఖర్చులు

విజయ - జయ - మన్మథ - దుర్ముఖి అను నాలుగు సంవత్సరముల

(1953 ఏప్రియల్ నుండి, 1954; 1955; 1956; 1957 మార్చి ఆఖరువరకు)

జమలు

| | విజయ - జయ 1953 - 1954 - 1955 | మన్మథ 1955 - 1956 | దుర్ముఖి 1956 - 1957 | |
|---|---|---|---|---|
| చందాదారుల వలన జమ. | 5244- 0-6 | 2302-15-0 | 2906-14-0 | 10453-13-6 |
| శాశ్వతచందాలు (శ్రీ వి. ప్రసంఘము వలన) జమ. | 648- 0-0 | ... | 116- 0-0 | 764- 0-0 |
| కట్నాలు - సంభావనలు జమ. | 318- 5-9 | 59-12-0 | 121- 0-0 | 499- 1-9 |
| శ్రీ అరంగ నగరప్పన్ ట్రష్టు విరాళములు } జమ. | 222- 0-0 | 160- 0-0 | 160- 0-0 | 542- 0-0 |
| ప్రమరణాదుల వలన (బదరి సంబంధమైన శ్రీహరినామ క్రతువుయొక్క) } జమ. | ... | 600- 0-0 | 200- 0-0 | 800- 0-0 |
| తదితర విరాళములు జమ. | 140-11-3 | ... | ... | 140-11-3 |
| | 6573- 1-6 | 2522-11-0 | 3303-14-0 | 13199-10-6 |

ఖర్చులు

| | | | | |
|---|---|---|---|---|
| కాగితము - అచ్చు - బైండింగుకు ఖ. | 6702-10-0 | 3542- 1-0 | 2736- 0-0 | 12980-11-0 |
| ప్రయాణములకు ఖ. | ... | 98- 6-0 | 365-15-3 | 464- 5-3 |
| జీతములకు వగైరా ఖ. | 1067-11-6 | 800- 0-0 | 900- 0-0 | 2767-11-6 |
| పోస్టేజి ఖ. | 767- 8-6 | 360- 0-0 | 360- 0-0 | 1487- 8-6 |
| చిల్లర ఖర్చులు | 260- 5-6 | 63-15-6 | 182-12-0 | 507- 1-0 |
| | 8798- 3-6 | 4864- 6-6 | 4544-11-3 | 18207- 5-3 |

| | |
|---|---|
| ఈ నాలుగు సంవత్సరములకు అయిన మొత్తం ఖర్చు | 18207- 5-3 |
| జమ- | 13199-10-6 |
| ఈనాలుగు సంవత్సరములకు వచ్చిన మొత్తం నష్టం | 5007-10-9 |

# ఆశ్రమవార్తలు

నడిగడ్డపాలెం శ్రీవాసుదాసాశ్రమంలో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు చాతుర్మాస్యదీక్షతో వేంచేసియున్నారు. వీరు కార్తీక శుద్ధద్వాదశివరకు ఆశ్రమమందేయుందురు ఆశ్రమములో ప్రభాతకాలమున ఆచార్యహృదయమును, శ్రీమాన్ ఉ వే మహావిద్వాన్ గొడవర్తి శఠగోపాచార్య స్వామివారు కాలక్షేపము సాయించుచున్నారు. మధ్యాహ్నము శ్రీజియ్యర్ స్వామివారు కణ్ణినుణ్ శిరుత్తాంబు, ఆచార్య హృదయమును, పునఃకాలక్షేపము సాయించుచున్నారు శ్రవణ కైంకర్యములో పరిసరములనుండి పలువురు భక్తులు విచ్చేసి అన్వయించియున్నారు.

మరియు పరమవిలక్షణముగా ఆశ్రమములో రేయింబవళ్ళు అఖండహరినామ స్మరణ జరుగుచున్నది.

ఇటీవల ఆశ్రమములో 3 రోజులు శ్రీ వాసుదాస స్వామివారి పరమపదోత్సవములు మహావైభవముగా జరిగినవి. ఆపిదప శ్రీకోదండ రామస్వామివారి సన్నిధిలో పవిత్రోత్సవములు త్రయాహ్నిక దీక్షలో వైదిక విధిలో చక్కగా జరిగినవి.

---

తదుపరి 14-8-57 వ తేది ఉత్తరాభాద్ర నక్షత్రము నాడు శ్రీత్రిదండి జియ్యర్ స్వామివారి తిరునక్షత్రోత్సవము సలక్షణముగా జరిగినది. ఆనాడు, సన్నిధిలో సహస్రనామపూజ తిరువాయి మొళి సేవాకాలము. శ్రీ వారికి పాదపూజలు జరిగినవి. పలువురు శ్రీవారి శిష్యులు పరిసరగ్రామములనుండి విచ్చేసిరి. ఆశ్రమములో అందరకు నూతనవస్త్రములు సమర్పింపబడెను. పండితులకు, కవులకు నూతన వస్త్రములు పండితశాలువలు సమర్పించిరి. పరమవిలక్షణమైన తదియారాధన జరిగినది. సాయంకాలము శ్రీ కవిగారు ఆచార్యవైభవమును (శ్రీ జియ్యర్ స్వామివారినిగురించి) ఉపన్యసించిరి.

## బదరీవార్తలు

శ్రీ బదరికాశ్రమములో శ్రీ జియ్యర్ స్వామివారు నిర్మించుచున్న అష్టాక్షరీ క్షేత్రము యొక్క కట్టడపు పని తిరిగి ప్రారంభింపబడి జరుగుచున్నది. ఇందునిమిత్తమై మన సంఘ ప్రధాన కార్యదర్శిగారగు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు వెంచేసినారు. శ్రీవారు బదరికి కులాసాగా చేరిరి. అచట పని జరుగుచున్నది.

బదరి శ్రీ నివాస రామానుజ స్వామివారల పూజల నిమిత్తముగాని, శ్రీ అష్టాక్షరీ క్షేత్రనిర్మాణమునకుగాని కైంకర్యార్థముగా పైకము పంపదలచినవారు నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమం శ్రీ జియ్యర్ స్వామివారికిగాని, లేక శ్రీ తె. కం. గోపాలాచార్య స్వామివారు, బదరీనాథ్, గర్వాలజిల్లా అనుచోటికి పంపవలెను. శాశ్వత, తాత్కాలిక, పూజలకు వాగ్దానములు గావించిన భక్తులందరు. తమతమ వాగ్దానములు త్వరలో తీర్చగలందులకు కోరుచున్నాము.

బ్రహ్మకపాలములో విశేషపూజలు జరిపింప దలచిన వారుకూడ ఏకేతరుణముగనుక త్వరపడవలెను.

కార్యాలయము:— శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డ పాలెము
వయా, చుండూరు
గుంటూరు జిల్లా

## సాంఘిక సమాచారములు

రాజమండ్రి వాస్తవ్యురాలగు శ్రీమతి జూపూడి వెంకటేశ్వరమ్మ గారు బదరీ నారాయణములో నిర్మింపబడుచున్న అష్టాక్షరీ క్షేత్రములో ఒకగది కట్టించుటకు 3500/ మూడువేల అయిదువందలు సమర్పించుటకు వాగ్దానముగావించి వెంటనే 3000/ మూడువేల రూపాయలు నగదు సమర్పించిరి.

రేపల్లె తాలూకా పెద్దవరం అగ్రహారం వాస్తవ్యులగు శ్రీమాన్ శ్రీ మత్తిరుమల గుదిమెళ్ల అంతర్వేది నృసింహాచార్యస్వామి వారు తమతండ్రి గారగు (చతుశ్శాస్త్ర వేత్తలును. పిఠాపురాస్థాన విద్వాంసులుగా నుండి విశేష ఖ్యాతినార్జించిన శ్రీమాన్ ధర్మన్యాయ వేదాంతవిద్వాన్ పండిత వేంకటరంగాచార్యస్వామి వారి శాశ్వత స్మృతి చిహ్నముగా బదరీ అష్టాక్షర క్షేత్రములో ఒకగది కట్టించుటకు వాగ్దానము గావించిరి, ఇట్టే బదరీ శ్రీనివాస రామానుజ శాశ్వత పూజకుకూడా 275/లు సమర్పించుటకు వాగ్దానము గావించిరి.

రేపల్లె తాలూకా పెద్దవరం అగ్రహారం వాస్తవ్యులగు శ్రీమాన్ వేదాల రామానుజచార్యస్వామివారు శ్రీరంగములో మనశ్రీజియ్యర్ స్వామివారు కట్టించుటకు సంకల్పించు కొన్న జియ్యర్ మఠములలో ఒకగది కట్టించుటకు 2000/ రెండువేల రూపాయలు సమర్పింతుమని వాగ్దానము గావించిరి. ఈమఠనిర్మాణ కార్యక్రమము ప్రారంభించుటకు వలయు స్థల సంపాదన వగైరా ప్రయత్నములు జరుగుచున్నవి. త్వరలో పని ప్రారంభమగును. ఈకైంకర్యమునందు ఉత్సాహము గలవారు ఈకార్యాలయమునకు తెలుపగోరుచున్నాము.

బందరు సర్కిలుపేటలో శ్రీ మంగివల్లి రంగనాయకమ్మ గారు తమ అవసానదశలో, ఆచార్య సంభావనగా శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారికి వెయ్యిరూపాయలు సమర్పించమని చెప్పి, నందున ఆ వాగ్దానమును ఆమె కోడలు సాధ్యమైనంత త్వరలో తీర్చివేయుదునని శ్రీ జియ్యర్ స్వామివారికి కవిగారిద్వారా కబురంపిరి. శ్రియఃపతి వీరికి సకల శుభములు ప్రసాదించుగాక !

"భక్తినివేదన"
హేవళంబి శ్రావణమాసము

రి. నెం. 195
విశేషానుబంధము

# భగవద్గీత

## (టీకాతాత్పర్య సహితము)




ప్రకాశకులు
విశిష్టాద్వైత ప్రచారక సంఘము

ప్రచురణకర్తలు
భక్తినివేదన కార్యాలయము

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెము (వయా) చుండూరు – గుంటూరు జిల్లా

Printed 1 to 6, 23 & 24 Pages at Bharathi Press, Tenali.



# వినతి

పరమకారుణికు డగు పరమాత్ముడు మన యుజ్జీవనార్థమై కృపజేసిన మంత్రవిశేషము గీతాశాస్త్రము. అందును ద్వాపరయుగాంతమున అర్జుని నిమిత్తముగ నొనరించుకొని సంజయుని ద్వారా ధృతరాష్ట్రమూలముగ శ్రీకృష్ణపరమాత్మ ఆనాడు నాటిన గీతాబీజము. దాదాపు ఈ అయిదువేల సంవత్సరములకు అంకురితమై, వృక్షమై, పల్లవితమై, పుష్పించి, ఫలింప మొదలిడినది. ఇట్టి ఫలానుభవ కాలమున జన్మించిన మనము దానిని అనుభవించి జీర్ణించుకొని ఆధ్యాత్మిక బల సంపన్నులము కాగలిగినచో ధన్యులము గదా.

కనుకనే ఈ సంఘము భగవద్గీతను అనేకరూపములలో ప్రచురించుచును, పరీక్షల నేర్పాటుచేసియు ప్రచారము నొనర్చు చున్నది.

సులభశైలిలో టీకాతాత్పర్యములు గల భగవద్గీతా కోశము ప్రస్తుతమున లేని కొరతను తీర్చు నుద్దేశముచే ఈ పుస్తకమును ప్రచురించుటకు సమకట్టితిమి. భక్తినివేదన పత్రిక చందాదారులకు వీనిని పంపించదలచుకొంటిమి. ఇది చాల వ్యయప్రయాసలతో కూడుకొనిన పని. పూర్తిగా గాకపోయినను కొంతవరకైనను ఉదారులగు దాతలు ఇందులకు ఆర్థికసహాయ మొనర్చిన గాని ఈ పుస్తకప్రచురణ కార్యక్రమము పూర్తికాజాలదు. కాన భగవద్గీతాభిమానులను, ఈ సదుద్యమమును ప్రోత్సహించ దలచినవారు నగు సహృదయులు తగువిధమున ఈ గ్రంథ ప్రచురణకై ఆర్థికసహాయ మొనర్చుదురు గాక.

ఇంతవరకును ఈ గ్రంథప్రచురణకై సహాయ మొనర్చినవారు:

| | |
|---|---|
| శ్రీ కూనంనేని బాపయ్యగారు, నడిగడ్డపాలెం | రూ. 150/- |
| శ్రీ నందిపాటి రామయ్యగారు, విజయవాడ | రూ. 190/- |

వీరికి మా కృతజ్ఞత. ప్రచురించినంతవరకు ఏ నెలకానెల భక్తినివేదన పత్రికా చందాదారులకు సంచికల క్రింద దీనిని పంపుచుండగలము. గ్రంథము పూర్తి అయిన పిమ్మట వారు దీనిని ఒకే బైండుగ చేర్చి బైండు చేయించు కొందురు గాక

శ్రీ వాసుదాసాశ్రమం
నడిగడ్డపాలెం
(వయా) గుంటూరు

ఇట్లు
కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు
సహాయ సంపాదకులు,
'భక్తినివేదన'

శ్రీ యామునాచార్యులవారు కృపచేసిన

# గీతార్థ సంగ్రహము

శ్లో॥ స్వధర్మ జ్ఞాన వైరాగ్య సాధ్య భక్త్యేక గోచరః
నారాయణః పరం బ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః॥

అర్థము:- స్వధర్మ...... ..........గోచరః

స్వ = తమతమ వర్ణాశ్రమములకు నియతములైన

ధర్మ = ధర్మములచేతను

జ్ఞాన = యథావస్థిత-ఆత్మ-విషయజ్ఞానము చేతను

వైరాగ్య = పరమాత్మ వ్యతిరిక్త వస్తువులయందు వైరాగ్యముచేతను

సాధ్య = సాధించబడిన

భక్త్యేక = భక్తియోగమునకు మాత్రమే

గోచరః = గోచరుఁడైన

పరంబ్రహ్మ = పరంబ్రహ్మవాచ్యుఁడైన

నారాయణః = నారాయణుఁడు

గీతాశాస్త్రే = గీతాశాస్త్రమందు

సమీరితః = చక్కగాఁ బ్రతిపాదింపబడెను.

తా॥ తమతమ వర్ణాశ్రమములకు నియతములైన ధర్మములచేతను యథావస్థిత, ఆత్మ-విషయజ్ఞానముచేతను, పరమాత్మ వ్యతిరిక్త వస్తువులయందు వైరాగ్యముచేతను, భక్తియోగము లభ్యమగును. అట్టి భక్తియోగమునకుమాత్రమే పరంబ్రహ్మస్వరూపుడగు నారాయణుడు గోచరుడగునని గీతాశాస్త్రములో నిరూపింపఁబడెను.

## ప్రథమషట్క ప్రతిపాదితార్థము

శ్లో॥ జ్ఞానకర్మాత్మికే నిష్ఠే యోగలక్ష్యే సుసంస్కృతే
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే పూర్వషట్కేన చోదితే.

అర్థము :- యోగలక్ష్యే = ఆత్మావలోకనమను యోగమే ఫలము గలదై
సుసంస్కృతే = ఫలసంగ కర్తృత్వాది రహితమగు బుద్ధివిశేషముచేఁ
జక్కగా సంస్కరింపబడిన.
జ్ఞానకర్మాత్మకే = జ్ఞానయోగము, కర్మయోగము, అనే
నిష్ఠే = నిష్ఠలు
ఆత్మానుభూతి సిద్ధ్యర్థే = ప్రత్యగాత్మ సాక్షాత్కారసిద్ధికొరకు
పూర్వషట్కేన = మొదట ఆరు అధ్యాయములచేత
ఉదితే = చెప్పబడినవి.

తా॥ యోగరూప-ఆత్మావలోకనమే లక్ష్యముగా గలిగినట్టియు ఫల సంగ కర్తృత్వాది రాహిత్యముగల బుద్ధివిశేషముచేతఁ జక్కగా సంస్కరింపబడిన జ్ఞానయోగ కర్మయోగ నిష్ఠలు ప్రత్యగాత్మ సాక్షాత్కారసిద్ధికొరకై మొదట ఆరు, అధ్యాయములచేతఁ జెప్పఁబడెను.

## ద్వితీయషట్క ప్రతిపాదితార్థము

శ్లో॥ మధ్యమే భగవత్తత్త్వ యాథాత్మ్యావాప్తి సిద్ధయే
జ్ఞానకర్మాభి నిర్వర్త్యో భక్తియోగః ప్రకీర్తితః

అర్థము:-
మధ్యమే= మధ్యమషట్కమగు ఏడవ అధ్యాయము మొదలు పండ్రెండవ అధ్యాయము వరకు గల భాగమందు
భగవత్తత్త్వ యాథాత్మ్యావాప్తి సిద్ధయే=భగవత్తత్త్వముయొక్క అనంభానుభవము కొరకు

జ్ఞానకర్మాభిః = జ్ఞానము, కర్మము (అంగములుగాగల) యోగములచేత, నిర్వర్త్యః ఒనగూర్పబడిన, భక్తియోగః = భక్తియోగము, ప్రకీర్తితః = తెన్నగా ప్రతిపాదింపబడెను.

తా॥ మధ్యషట్కమగు, ఏడవ అధ్యాయము మొదలు పండ్రెండవ అధ్యాయమువరకు గల భాగమందు భగవత్స్వరూపానుభవము సిద్ధించు కొరకు జ్ఞాన కర్మయోగములు అంగములుగా గల భక్తియోగము నిరూపించబడెను.

## తృతీయషట్క ప్రతిపాదితార్థము

శ్లో॥ ప్రధాన పురుష వ్యక్త సర్వేశ్వర విచింతనం
కర్మ ధీ ర్భక్తి రిత్యాది పూర్వ శేషో ంతిమోదితః.

అర్థము:-
ప్రధాన = మూలప్రకృతియు, పురుష = జీవులున్ను, వ్యక్త = కార్య, కారణావస్థలున్ను, సర్వేశ్వర = సర్వేశ్వరుడున్ను, చింతనం = వీనిని గురించి ఆలోచించుటయున్ను, కర్మ = కర్మయోగము, ధీః = జ్ఞానయోగము, భక్తిః = భక్తియోగము, ఇత్యాది పూర్వశేషః = ఇది మొదలుగా పూర్వాధ్యాయములలో జెప్పగా మిగిలిన యంశము, అంతిమోదితః = మిగిలిన ఆరధ్యాయములచేత (అనగా 13 వ అధ్యాయము మొదలు 18 వ అధ్యాయము వరకు చెప్పబడెను.

తా॥ కడపటి షట్కమున పదమూడవ యధ్యాయము మొదలు పదునెనిమిదవ యధ్యాయము వరకు ప్రకృతియొక్క వివిధావస్థలు, జీవాత్మలు, పరిశుద్ధాత్మలు, సర్వేశ్వరుడు, వీరలను గురించిన విశేషభాగములు, కర్మ, జ్ఞాన, భక్తి, యోగాదులను గూర్చి వెనుకటి యధ్యాయములలో చెప్పగా మిగిలిన విశేషములు వివరింపబడినవి.

# గీతార్థ సంగ్రహములో

# ప్రథమాధ్యాయ ప్రమేయము

శ్లో॥ అస్థాన స్నేహ కారుణ్య ధర్మాధర్మ ధియా కులం
పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతం॥

అర్థము:-

అస్థాన = వేదాంతోపదేశమునకు తగిన స్థానము కాని యుద్ధభూమిలో
స్నేహ = బంధువులయందు స్నేహముచేతను
కారుణ్య = దయచేతను
ధర్మాధర్మ ధియా = ధర్మమైన యుద్ధమును అధర్మముగా దలచిన బుద్ధిచేత
ఆకులం = కలతచెందినవాడై
ప్రపన్నం = శరణాగతుడైన
పార్థం = అర్జునుని
ఉద్దిశ్య = ఉద్దేశించి
శాస్త్రావతరణం = గీతాశాస్త్రములో ప్రథమాధ్యాయము
కృతం = ఒనరింపబడినది.

తా॥ స్థానముకాని స్థానమున, బంధుస్నేహముచేతను, దయచేతను, ధర్మములను, అధర్మములుగా దలచి కలతజెంది శరణాగతుడైన యర్జును నుద్దేశించి గీతాశాస్త్రములో మొదటియధ్యాయము జెప్ప బడినది.

ఓ మ్.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

జయతు జయతు దేవో దేవకీనందనో ఽ యం।
జయతు జయతు కృష్ణో వృష్ణి వంశ ప్రదీపః।
జయతు జయతు మేఘ శ్యామలః కోమలాంగో।
జయతు జయతు పృథ్వీ భారనాశో ముకుందః॥

కృష్ణో రక్షతు నో జగ త్త్రియగురుః
కృ ష్ణం న మ స్యా మ్య హం।
కృష్ణేనా మర శత్రవో వినిహతాః
కృ ష్ణా య త స్మై న మః।
కృష్ణా దేవ సముత్థితం జగ దిదం
కృ ష్ణ స్య దా సో ఽ స్మ్యహం।
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం
హే కృ ష్ణ! ర క్ష స్వ మా మ్।



# శ్రీ భగవద్గీత

యత్పదాంభోరుహధ్యాన।
విధ్వస్తాశేషకల్మషః।
వస్తుతాముపయాతోఽహం।
యామునేయం నమామి తమ్॥




శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ పార్థసారథయే నమః





# శ్రీ గీతాచార్యస్తుతి

{ శ్రీ భగవద్గీతా పారాయణ ప్రారంభమున
అనుసంధించవలసిన శ్లోకములు . }

శ్రీశైలేశ దయాపాత్రం.............................ప్రణతోఽస్మి నిత్యం.

సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ,
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే॥ 1

సారథ్య మర్జునస్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః॥ 2

ప్రపన్నపారిజాతాయ వేత్రతోత్త్రైక పాణయే।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥ 3

కరకమలనిదర్శితాత్మముద్రః। పరికలితోన్నత బర్హి
బర్హచూడః॥
ఇతరకరగృహీతవేత్రతోత్త్రః। మమ హృది సన్నిధి
మాతనోతు శౌరిః॥ 4

అగ్రే కృత్వైకమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయితసజుషా చక్షుషా వేక్షమాణః।
సవ్యే తోత్త్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు నస్సూతవేషః॥ 5

కృష్ణం కమల పత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనం।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్॥ 6

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే॥ 7

## న్యాసములు.

ఓం అస్య శ్రీ భగవద్గీతా మహామంత్రస్య

భగవాన్ వేదవ్యాసః ఋషిః

అనుష్టుప్ ఛందః

శ్రీకృష్ణః పరమాత్మా దేవతా,

అశోచ్యా నన్వశోచ స్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే } ఇతి బీజమ్

సర్వ - ధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ } ఇతి శక్తిః

అహం త్వా సర్వ-పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః } ఇతి కీలకమ్

నైనం ఛిందతి శస్త్రాణి ।
నైనం దహతి పావకః । } ఇత్యంగుష్ఠాభ్యాం నమః

న చైనం క్లేదయం త్యాపో
న శోషయతి మారుతః ॥ } ఇతి తర్జనీభ్యాంనమః

(కొందరు ఇవియేగాక యింకను అంగన్యాసములు, కరన్యాసములు; హృదయన్యాసములు; చెప్పుటయు చేయుటయు గలదు. ఇవి యేవియు ప్రపన్నులకు ఆవసరము లేదు.)





శ్రీరస్తు

# గీతా మాహాత్మ్యము

(గీతాపారాయణాంతమున అనుసంధించవలసిన శ్లోకములు)

గీతాశాస్త్ర మిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి భయశోకాది వర్జితః॥ 1

గీతాధ్యయన శీలస్య ప్రాణాయామ పరస్య చ।
నైవ సంతి హి పాపాని పూర్వజన్మకృతాని చ॥ 2

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే।
సకృద్గీతామ్భసి స్నానం సంసారమలనాశనం॥ 3

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యై శ్శాస్త్రసంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా॥ 4

భారతామృత సర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతం।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥ 5

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః।
పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతంమహత్॥ 6

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం ఏకో దేవో దేవకీపుత్ర ఏవ
ఏకో మంత్ర స్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య
దేవస్య సేవా॥ 7



— శ్రీ —

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

శ్రీ భగవద్గీత. ప్రథమో౽ధ్యాయము: —

# విషయసూచిక.

శ్లోకసంఖ్య



**ఈ అధ్యాయమున**

| | | | |
|---|---|---|---|
| ధృతరాష్ట్రుడు చెప్పిన శ్లోకము | 1 | దుర్యోధనుడు చెప్పిన శ్లోకములు | 9 |
| సంజయుడు చెప్పిన శ్లోకములు | 16 | అర్జునుడు చెప్పిన శ్లోకములు | 21 |
| మొత్తము శ్లోకములు | | | 47 |



శ్రీ భగవద్గీత



శ్రీమతే రామానుజాయ నమః

# అవతారిక

శ్రియఃపతియు, నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైక తానుడును, స్వేతర సమస్త వస్తు విలక్షణ అనంత జ్ఞానానందైక స్వరూపుడును,

స్వాభావికమైన అవధిలేని అతిశయ యుక్తములైన జ్ఞానము బలము ఐశ్వర్యము వీర్యము శక్తి తేజస్సు మున్నగు అసంఖ్యేయములైన కల్యాణ గుణ గణములకు మహాసముద్రుడు వంటివాడును తనకు అభిమతమైనదియు అనురూపమును ఏకరూపమును అచింత్యమును దివ్యమును, అద్భుతమును, నిత్యమును జరామరణాది దోషరహితమును, నిరతిశయమును అయిన ఔజ్జ్వల్యము సౌందర్యము సౌగంధ్యము సౌకుమార్యము లావణ్యము యౌవనము మున్నగు అనంతములైన గుణములకు నిధియగు దివ్యమైన రూపమును కలిగియుండు నట్టివాడును;

తనకు తగినట్టి వివిధములైన విచిత్రములైన అనంతములైన ఆశ్చర్యకరములైన నిత్యములు నిరవద్యములు అయిన, అపరిమితములైన దివ్యములైన భూషణములను కలిగినట్టి వాడును;

తనకు తగినట్టివియు అసంఖ్యేయములును అచింత్యమైన శక్తి సమన్వితములును నిత్యములు – నిరవద్యములును, నిరతిశయములును కల్యాణములును అగు దివ్యములైన ఆయుధముల కలిగినట్టివాడును;

తనకు అభిమతములును అనురూపములును నిత్యములు-నిరవద్యములును అగు దివ్యాత్మ స్వరూపము కల్యాణ గుణములు విభవము ఐశ్వర్యము శీలము మున్నగు అవధిలేనిదై అతిశయ యుక్తమైన అసంఖ్యేయములగు కల్యాణ గుణ గణములు గల శ్రీదేవికి వల్లభుడైనట్టి వాడును;

తనయొక్క సంకల్పమునకు అనుసరించి నడచునట్టి స్వరూపస్థితి ప్రవృత్తి భేదములు గలిగినట్టియు, అన్నివిధము లైన కైంకర్యముల యందు సంపూర్ణమై ప్రీతి గలిగినట్టియు నిత్యులైనట్టియు, క్లేశ, కర్మ - స్వాతంత్ర్య - అభిమానాది దోషములు లేనట్టియు, నిరతి శయములైన జ్ఞానము - శక్తి - క్రియా - ఐశ్వర్యము మున్నగు అనంతములైన గుణ గణ ములు గలిగినట్టియు, అపరిమితులైనట్టియు, నిత్యసూరులచే అనవరతము స్తుతింప బడుచుండు పాదద్వంద్వము గలిగినట్టి వాడును;

వాక్కునకు గాని మనస్సునకు గాని పరిచ్ఛేదింప శక్యముగాని స్వరూపము స్వభావము గలవాడును;

తనకు తగినట్టి వివిధములైన విచిత్రములైన అనంతము లైన శబ్దాది భోగ్యములు దేహేంద్రియాది భోగోప కరణ ములు సౌధ - ఆరామాది భోగస్థానములు అను వానిచే సమృద్ధములైనదియు, అనంత ఆశ్చర్యమైనదియు, అనంత మహావైభవము గలదియు, నిత్యమైనదియు, శుద్ధసత్త్వమయ మైనదియు, సృష్టి సంహారాదులు లేనిదియు, అగు పరమ పద మును వాసస్థానముగ గలవాడును, వివిధములైన విచిత్రము లైన అనంతములైన భోగ్యపదార్థములతోను, భోక్తృవర్గము తోను పరిపూర్ణమైన నిఖిల జగత్తు యొక్కయు ఉత్పత్తి-స్థితి నాశములను లీలగా కలవాడును,

# శ్రీ భగవద్గీత

పరబ్రహ్మయు, పురుషోత్తముడును, అగు నారాయణుడు చతుర్ముఖ బ్రహ్మ మొదలుకొని స్థావరముల వరకు గల, సమస్త జగత్తును సృజించి, తన స్వరూపముతో నుండి బ్రహ్మాది దేవతలకైనను మనుష్యులకైనను, ధ్యానించుటకు గాని ఆరాధించుటకు గాని అగోచరుడై, అపారమైన కారుణ్యము- సౌశీల్యము- వాత్సల్యము- ఔదార్యము అను కల్యాణగుణములకు మహా సముద్రము వంటి వాడు గాన తన స్వరూపమునే ఆయావానికి సమానమైన జాతీయముగు అవయవ సంఘాతమైన దానినిగ గావించుచు, తన యొక్క స్వభావమును ఏమాత్రమును విడువక ఆయా లోకముల యందు అనేక పర్యాయములు అవతరించుచు, అచ్చటి వారలచే ఆరాధింపబడుచు, వారి వారి యొక్క యిష్టమునకు తగినట్టి ధర్మము- అర్థము- కామము- మోక్షము అను ఫలములను ప్రసాదించుచున్నవాడై, భూమియొక్క భారమును తగ్గించు నెపమున అస్మదాదులను కూడ చక్కగ ఆశ్రయింప జేసుకొనుటకై అవతరించి భూమి యందలి సమస్త మానవుల యొక్క నేత్రములకు విషయభూతుడై బ్రహ్మ రుద్ర భీష్మ అక్రూరాదుల యొక్కయు గోపికలు గోపాలురు మున్నగు సమస్త జనుల యొక్కయు, మనములను నేత్రములను ఆకర్షించు నట్టి దివ్య చేష్టితములను సలుపుచు, పూతన శకట యమలార్జునారిష్ట ప్రలంబ ధేనుక కాలియ కేశి కువలయాపీడ చాణూర ముష్టిక కౌసల కంసాదులను సంహరించి, నిరతిశయమైన సౌందర్యము సౌశీల్యము మున్నగు కల్యాణ గుణ గణముల యొక్క ఆవిష్కారముచే అక్రూరుడు, మాలాకారుడు మున్నగు వారిని పరమ భాగవతులను గావించి పాండుతనయుడగు అర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించు నెపమున పరమ పురుషార్థ లక్షణమగు మోక్షమునకు సాధనముగా వేదాంతములచే ప్రతిపాదింపబడి నదియు, తన విషయమైనదియు నగు భక్తియోగమును అవతరింప జేసెను.

అట్టి స్థితిలో పాండవులకును, కౌరవులకును యుద్ధము ప్రారంభము కాగా పురుషోత్తముడును, సర్వేశ్వరేశ్వరుడును, జగదుపకృతిమర్త్యుడును అగు నా భగవంతుడు, ఆశ్రితుల యందలి వాత్సల్యముచే వివశుడై పార్థుని రథికుని గాను, తనను సారథిగను సమస్త లోకములకు కనుపించు నటుల జేసెను.

ఈ విషయముల నెరింగి యుండియు మనస్సనెడు లోపల నేత్రము చేతను జాత్యంధుడగుటచే బయటి నేత్రముల చేతను కూడ అన్నివిధములచే గ్రుడ్డివాడగు ధృత రాష్ట్రుడు తన కుమారుడగు సుయోధనుని విజయమును వినుట యందలి ఆసక్తిచే సంజయుని ఇటుల నడిగెను.

అవతారిక సమాప్తము






అస్మద్గురుభ్యో నమః

## శ్రీమత్ భగవద్గీతా- ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

(శ్లో. 47 = 1-47.)

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రుడు పలికెను.

1. శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే ।
సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ।
కిమకుర్వత సంజయ ॥ 1

అర్థము:-

సంజయ - ఓ సంజయుడా!
ధర్మక్షేత్రే - ధర్మమునకు స్థానమైన.
కురుక్షేత్రే - కురుక్షేత్రమునందు;
యుయుత్సవః-యుద్ధముచేయగోరినవారై
సమవేతాః - సమావేశమైన.
మామకాః - నా సంబంధులున్ను
పాండవాః చ ఏవ - పాండవులున్ను
కిం - ఏమి?
అకుర్వత - చేసిరి.

ధృత రాష్ట్రుడు సంజయుని యుద్ధవార్తలను ప్రశ్నించుచున్నాడు.

తా॥ ఓసంజయుడా! కురుక్షేత్రము ధర్మమునకు నిలయమైనది. అట్టిస్థానమున యుద్ధము చేయుటకై నాకుమారులును నాఅన్నగారి కుమారులును కూడ సమావేశమైరే. వారు ఏమి చేసిరి?

2. శ్లో. దృష్ట్వా తు పాండవానీకం।
వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముప - సంగమ్య।
రాజా వచన మబ్రవీత్ ॥ 2

అర్థము:-

తదా - అప్పుడు;
రాజా - రాజైన;
దుర్యోధనః - దుర్యోధనుడు;
వ్యూఢం - వ్యూహముగా వన్నబడి యున్న
పాండవానీకం - పాండవుల సేనను-
దృష్ట్వాతు- చూచినవెనువెంటనే
ఆచార్యం - ద్రోణాచార్యులను;
ఉపసంగమ్య - సమీపించి;
వచనం - వాక్యమును;
అబ్రవీత్ - పలికెను.

సంజయుడు యుద్ధప్రారంభమునకు ముందు దుర్యోధనుని చిత్తవృత్తిని వర్ణించుచున్నాడు.

తా॥ అప్పుడు రాజైన దుర్యోధనుడు వ్యూహముగా వన్నబడి యున్న పాండవులయొక్క సేననుజూచి వెంటనే తన గురువైన ద్రోణాచార్యుల వద్దకువెళ్లి ఈప్రకారము పలికెను.

సుయోధన ఉవాచ:—

3. శ్లో. పశ్యైతాం పాండు - పుత్రాణాం।
ఆచార్య మహతీం చమూం।
వ్యూఢాం ద్రుపద - పుత్రేణ।
తవ శిష్యేణ ధీమతా ॥ 3

అర్థము:—

హే ఆచార్య - ఓ ద్రోణాచార్యా!
ధీమతా - బుద్ధిమంతుడును;
తవ - నీయొక్క;
శిష్యేణ - శిష్యుడును అయిన;
ద్రుపద పుత్రేణ - ధృష్టద్యుమ్నునిచే
వ్యూఢాం - వ్యూహముగ పేర్చబడి యున్న
పాండుపుత్రాణాం-పాండవులయొక్క;
ఏతాం - ఈ;
మహతీం - గొప్పదైన;
చమూం - సేనను
పశ్య - చూడుము.

తా॥ ఓద్రోణాచార్యా! పాంచాల రాజకుమారుడైన ధృష్టద్యుమ్నుడు బుద్ధిమంతుడును, నీకు శిష్యుడున్నూ అయియున్నాడు. అతనినాయకత్వమున వ్యూహముగ రచింపబడియున్న గొప్పదైన ఈ పాండవ సేనను చూడుము

6. శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాన్త
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వ ఏవ మహారథాః ॥ 6

అర్థము:-

విక్రాన్తః - పరాక్రమవంతుడైన
యుధామన్యుశ్చ - యుధామన్యువున్ను
వీర్యవాన్ - శూరుడైన;
ఉత్తమౌజాశ్చ - ఉత్తమౌజస్సున్ను;
సౌభద్రః - సుభద్ర పుత్రుడగు అభిమన్యుడున్ను;
ద్రౌపదేయాశ్చ - ద్రౌపది కుమారులైన ఉపపాండవులున్ను
(సన్తి - కలరు.)
సర్వే ఏవ - అందరున్ను;
మహారథాః ఏవ - మహారథులే
(భవన్తి - అగుచున్నారు.)

తా॥ ఈ పాండవ సేనయందు పరాక్రమవంతుడైన యుధామన్యువున్ను, శూరుడైన ఉత్తమౌజస్సున్ను, సుభద్ర కుమారుడైన అభిమన్యువున్ను, ద్రౌపది కుమారులైన ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులును కలరు. వీరందరును మహారథులై యున్నారు.

7. శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే ।
తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య ।
సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7

అర్థము:-

హే ద్విజోత్తమ - ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా;
అస్మాకం తు - మనలోనైతే;
యే - ఎవరు;
విశిష్టాః - ముఖ్యులో;
మమ - నాయొక్క
సైన్యస్య - సేనకు;
యే - ఎవరు;
నాయకాః - నాయకులో;
తాన్ - వారలను;
తే - నీకు;
సంజ్ఞార్థం - చక్కగా తెలియుటకొరకు
బ్రవీమి - చెప్పుచున్నాను.
నిబోధ - వినుము.

దుర్యోధనుడు తన సేనయందలి
వీరులను పేర్కొనుచున్నాడు.

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడవైన ద్రోణాచార్యా! మనలో ఎవరు ముఖ్యులో, మన సైన్యమునకు ఎవరు నాయకులో వారిని నీకు చక్కగా తెలియుటకై చెప్పుచున్నాను వినుము.

8. శ్లో. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ।
కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ।
సౌమదత్తి స్తథైవ చ॥ 8

అర్థము:-

భవాన్ - నీవున్నూ
భీష్మశ్చ - భీష్ముడున్నూ
కర్ణశ్చ - కర్ణుడున్నూ
సమితింజయః - యుద్ధమున జయశీలుడైన
కృపశ్చ - కృపాచార్యుడున్నూ.
అశ్వత్థామా - అశ్వత్థామయు
వికర్ణశ్చ - వికర్ణుడును
తథైవ - అవిధముగానే
సౌమదత్తిః - సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడున్నూ
(సన్తి - ఉన్నారు.)

తా॥ నీవు, భీష్మాచార్యులు, కర్ణుడు, యుద్ధమున జయశీలుడైన కృపాచార్యుడు అశ్వత్థామ వికర్ణుడు సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడున్నూ కలరు.

9. శ్లో. అన్యే చ బహవః శూరాః।
మదర్థే త్యక్త - జీవితాః।
నానా - శస్త్ర - ప్రహరణాః।
సర్వే యుద్ధ - విశారదాః॥ 9

అర్థము :-

మదర్థే - నానిమిత్తమై
త్యక్త - జీవితాః - ప్రాణములర్పింప సిద్ధపడిన వారున్నూ
నానా - శస్త్ర - ప్రహరణాః - అనేక విధములైన శస్త్రములను ఆయుధములను కలిగినట్టివారున్నూ
సర్వే - అందరున్నూ
యుద్ధవిశారదాః - యుద్ధ నైపుణ్యము గలవారునగు
అన్యే - ఇతరులైన
బహవః - అనేకమంది
శూరాశ్చ - శూరులున్నూ
(సంతి - కలరు)

తా॥ ఇంకను అనేకములైన శస్త్రములు - ఆయుధములు కలిగి నట్టి వారునై అందరును యుద్ధమునందు నేర్పుగలవారలేయగు ఇతరులు అనేకమంది శూరులు కలరు.

10. శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం।
బలం భీష్మాభి - రక్షితం।
పర్యాప్తం త్విద మేతేషాం।
బలం భీమాభి రక్షితం ॥ 10

అర్థము:-

తత్ - ఆ కారణమువలన
భీష్మాభిరక్షితం - భీష్మునిచే అంతటను రక్షింపబడుచున్న
అస్మాకం - మనయొక్క
బలం - సేన
అపర్యాప్తం - చాలినంతలేదు.
భీమాభిరక్షితం - భీమునిచే రక్షింపబడుచున్న
ఏతేషాం - ఈపాండవులయొక్క
ఇదం - ఈ
బలం - సేన
పర్యాప్తం - చాలినంత యున్నది.

తా॥ పాండవుల సేనలో శూరులు అధికముగ నున్నారు. మన సేనలో శూరులు తక్కువగ యున్నారు. గనుక భీష్మునిచే రక్షింపబడుచున్నదైనను మన సేన పాండవులను జయింప జాలినంతగ లేదు. భీమునిచే రక్షింపబడుచున్న ఈ పాండవుల సేన మనలను జయింపగలిగి యున్నది.

11. శ్లో॥ అయనేషు చ సర్వేషు।
యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభి రక్షంతు।
భవంత స్సర్వ ఏవ హి ॥ 11

అర్థము:-

భవంతః - మీరు
సర్వేఏవ - అందరున్ను.
సర్వేషు - సమస్తములైన
అయనేషుచ - (వ్యూహ) మార్గముల యందున్ను
యథాభాగం - ఏవరివరుస వారు తప్పక
అవస్థితాః - ఉంటున్నవారై
భీష్మం ఏవ - భీష్మునే
అభిరక్షంతు - అంతటను రక్షించుచుందురుగాక.

తా॥ మీరందరున్ను, అన్ని వ్యూహప్రవేశ మార్గముల యందును మీమీవరుసలుతప్పక నిలిచియుండి భీష్ముని అన్నివైపులనుండి రక్షించుచుందురు గాక,

12. శ్లో. తస్య సంజయన్ హర్షం।
కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః।
శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

అర్థము:-

ప్రతాపవాన్-పరాక్రమవంతుడును.
కురువృద్ధః-కౌరవులలో పెద్దయునగు
పితామహః-తాతయగు భీష్ముడు.
తస్య-అదుర్యోధనునికి.
హర్షం-సంతోషమును.
సంజయన్-బాగుగా పుట్టించుచున్నవాడై
ఉచ్చైః-గట్టిగా.
సింహనాదం-సింహధ్వనివంటిధ్వనిని
వినద్య-ధ్వనించేసి
శంఖం-శంఖమును.
దధ్మౌ-పూరించెను.

తా॥ దుర్యోధనుని ఈవిషాద సంభాషణను విని పరాక్రమవంతుడును కౌరవులలో వృద్ధుడును అయిన తాతయగు భీష్ముడు అతనికి సంతోషము కలుగునట్లుగా గట్టిగా సింహమువలె గర్జించి శంఖమును పూరించెను.

13. శ్లో. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ।
పణవానక - గోముఖాః।
సహసై వాభ్యహన్యంత।
సశబ్ద స్తుములో౽భవత్॥ 13

అర్థము:-

తతః-అటుపిమ్మట.
శంఖాశ్చ-శంఖములున్ను.
భేర్యశ్చ-దుందుభులున్ను.
పణవ-ఆనక - గోముఖాః - తప్పటలు-తమ్మటలు బూరలున్ను.
సహసైవ - ఒక్కమారుగనే.
అభ్యహన్యంత - కొట్టబడినవి.
సః - ఆ
శబ్దః శబ్దము.
తుములః - సంకులమైనది.
అభవత్ - ఆయెను.

తా॥ అటుపిమ్మట శంఖములున్ను దుందుభులున్ను, తప్పటలు తమ్మటలు - బూరలున్ను ఒక్కమారుగ వాయించ బడినవి. వీటివలన జనించిన శబ్దమొక్క పెట్టున దిక్కుల పిక్కటిల్ల జేసెను.

14. శ్లో॥ తతః శ్వేతైర్హయైర్యుక్తే
మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ
దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

అర్థము:-

తతః - అటుతరువాత
శ్వేతైః - తెల్లనైన
హయైః - గుర్రములతో
యుక్తే - కూడుకున్నట్టి
మహతి - గొప్పదైన.
స్యందనే - రథమునందు.
స్థితౌ - ఉన్నట్టి
మాధవః - శ్రీకృష్ణుడును
పాండవః చ ఏవ - అర్జునుడును
దివ్యౌ - దివ్యములైన
శంఖౌ - శంఖములను
ప్రదధ్మతుః - గట్టిగా పూరించిరి.

తా॥ అటుతరువాత తెల్లని గుర్రములు పూన్చిన గొప్పరథమునందు కూర్చున్న శ్రీకృష్ణుడును అర్జునుడును దివ్యములైన శంఖములను లెస్సగా పూరించిరి.

15. శ్లో॥ పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః॥ 15

అర్థము:-

హృషీకేశః - శ్రీకృష్ణుడు
పాంచజన్యం - పాంచజన్యమను శంఖమును
దధ్మౌ - పూరించెను.
ధనంజయః - అర్జునుడు
దేవదత్తం - దేవదత్తమను శంఖమును (దధ్మౌ - పూరించెను.)
(దధ్మౌ - ఊదెను.)
భీమకర్మా - భయంకర కృత్యములుగల
వృకోదరః - భీముడు
పౌండ్రం - పౌండ్రమను పెద్ద
మహాశంఖం - గొప్పశంఖమును

తా॥ శ్రీకృష్ణుడు పాంచజన్యమను పేరుగల శంఖమును, అర్జునుడు దేవదత్తమను పేరుగల శంఖమును భయంకర కృత్యములుగల భీముడు పౌండ్రమను పేరుగల పెద్దశంఖమును పూరించిరి.

16. శ్లో. అనంత - విజయం రాజా।
కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవ శ్చ।
సుఘోష - మణిపుష్పకౌ॥ 16

అర్థము:-

రాజా - రాజైన
కుంతీపుత్రః - కుంతీదేవి పుత్రుడైన
యుధిష్ఠిరః - ధర్మరాజు
అనంతవిజయం - అనంతవిజయమను పేరుగల శంఖమును
(దధ్మౌ - ఊదెను)

నకులః - నకులుడును
సహదేవః చ - సహదేవుడున్ను
సుఘోషమణిపుష్పకౌ - సుఘోషము మణిపుష్పకములను పేరుగల శంఖములను
(దధ్మతుః - పూరించిరి.)

తా॥ రాజును కుంతీదేవి పుత్రుడును అయిన ధర్మరాజు అనంతవిజయమను శంఖమును, నకులుడు సుఘోషమను శంఖమును, సహదేవుడు మణిపుష్పకమను శంఖమును పూరించిరి.

17. శ్లో. కాశ్యశ్చ పరమేష్వాసః।
శిఖండీచ మహారథః॥
ధృష్టద్యుమ్నో విరాటశ్చ।
సాత్యకి శ్చాపరాజితః॥ 17

అర్థము:-

పరమేష్వాసః - గొప్పవిలుకాడైన
కాశ్యః చ - కాశీరాజున్ను
మహారథః - మహారథుడైన
శిఖండీచ - శిఖండియున్ను
ధృష్టద్యుమ్నః - ధృష్టద్యుమ్నుడున్ను

విరాటః చ - విరాటుడున్ను
అపరాజితః - పరాజయమును చెందని
సాత్యకిః చ - సాత్యకియు.
(శంఖాన్ - శంఖములను,
దధ్ముః - పూరించిరి.)

తా॥ గొప్పవిలుకాడైన కాశీరాజున్ను, మహారథుడైన శిఖండియున్ను, ధృష్టద్యుమ్నుడున్ను విరాటుడున్ను, పరాజయమును చెందని సాత్యకియున్ను శంఖములను పూరించిరి.

18. శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ ।
సర్వతః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః ।
శంఖాన్ దధ్ముః పృథక్పృథక్ ।

అర్థము:-

హే పృథివీపతే - ఓ రాజా!
ద్రుపదః - ద్రుపదుడున్ను
ద్రౌపదేయాఃచ - ద్రౌపదీ పుత్రులును
మహాబాహుః - గొప్పబాహువులుగల
సౌభద్రఃచ - అభిమన్యుడున్ను
సర్వతః - సేనయందంతటను
పృథక్ పృథక్ - ప్రత్యేకి ప్రత్యేకముగా
శంఖాన్ - శంఖములను
దధ్ముః - పూరించిరి.

తా॥ ఓ ధృతరాష్ట్రమహారాజా! ద్రుపదుడున్ను ద్రౌపదికుమారులైన ఉపపాండవులున్ను, గొప్ప భుజములుగల సుభద్రాకుమారుడైన అభిమన్యుడున్ను సేనయందంతటను ప్రత్యేక ప్రత్యేకముగా శంఖముల పూరించిరి.

19. శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం ।
హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ ।
తుములో వ్యనునాదయన్ ॥ 19

అర్థము:-

సః - ఆ,
ఘోషః - శబ్దము.
తుములః - సంకులమైనదై
నభఃచ - ఆకాశమున్ను
పృథివీంచఏవ - భూమినికూడను
అనునాదయన్ అని - ప్రతిధ్వనింపజేయుచున్నదైనను
ధార్తరాష్ట్రాణాం - దుర్యోధనాదులయొక్క
హృదయాని - హృదయములను
వ్యదారయత్ - బ్రద్దలు చేసెను.

తా॥ పాండవ పక్షమువారు జేసిన ఆ శంఖధ్వని దశదిక్కులు పిక్కటిల్ల భూమ్యాకాశముల ప్రతిధ్వనింపజేయుచున్నను, దుర్యోధనాదులయొక్క హృదయములను మాత్రమే బ్రద్దలు జేసెను.

22. శ్లో. యావదేతా న్నిరీక్షేఽహం।
యోద్ధుకామా నవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్య।
మస్మిన్ రణ- సముద్యమే॥ 22

అర్థము:

అస్మిన్ - ఈ
రణ-సముద్యమే - యుద్ధమహోద్యమమున
కైః సహ - ఎవరితోకూడ
(స్థిత్వా- ఉండి)
మయా - నాచేత
యోద్ధవ్యం - యుద్ధము చేయబడ వలయునో
యోద్ధుకామాన్ - యుద్ధము చేయ కోరి-
గలవారై
అవస్థితాన్ - వచ్చినిలచియున్న
ఏతాన్ - వీరలను
అహం - నేను
యావత్ - ఎంతలో
నిరీక్షే - చూచునో

తా॥ ఈ యుద్ధమహోద్యమమున నేను ఎవరితో కూడియుండి శత్రువులతో యుద్ధము చేయవలసి యున్నదో, అట్టి యుద్ధకోరికతో వచ్చి నిలచియున్న వీరులను నేను చక్కగా జూచునంతవరకు నా రథమును రెండు సేనలమధ్య నిలుపుము.

23. శ్లో. యోత్స్యమానా నవేక్షేఽహం।
య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః।
యుద్ధే ప్రియ - చికీర్షవః॥ 23

అర్థము:-

దుర్బుద్ధేః - చెడ్డబుద్ధిగల
ధార్తరాష్ట్రస్య - దుర్యోధనునికి
యుద్ధే - యుద్ధమునందు
ప్రియచికీర్షవః - ప్రియమాచరింప గోరిన
వారై
యే - ఏ
ఏతే - ఈ భీష్మాదులు
అత్ర - ఈ యుద్ధస్థలమున
సమాగతాః - సమావేశమై యున్నారో,
(తాన్ - అట్టి)
యోత్స్యమానాన్ - యుద్ధమాచరించ గోరు
వారిని
అహం - నేను
అవేక్షే - చూచెదను.

తా॥ దుష్టచిత్తుడైన దుర్యోధనునకు యుద్ధమున ప్రియముచేయు గోరి ఈ యుద్ధభూమియందు నాకెదురు వచ్చి యుద్ధమాచరింప సమావేశమైయున్న ఈ భీష్మాదుల నేను జూచెదను,

24. శ్లో. ఏవ ముక్తో హృషీకేశో ।
గుడాకేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే।
స్థాపయిత్వా రథోత్తమం॥ 24

అర్థము:-

హే భారత - ఓ ధృతరాష్ట్రా!
హృషీకేశః - శ్రీకృష్ణుడు,
గుడాకేశేన - అర్జుననిచే,
ఏవం - ఈ విధముగా,
ఉక్తః - పలుకబడినవాడై.
ఉభయోః - రెండైన,
సేనయోః - సేనలయొక్క,
మధ్యే - మధ్యయందు,
రథోత్తమం - రథశ్రేష్ఠమును
స్థాపయిత్వా - నిలిపి,

—: శ్రీకృష్ణుని భక్తపరాధీనత :—

సంజయుడిట్లు తెలిపెను.

తా॥ ఓ ధృతరాష్ట్రా! శ్రీకృష్ణుడు అర్జుననిచే ఈ పైవిధముగా తెలుపబడినవాడై రెండుసేనల యొక్క మధ్యయందు ఉత్తమమైన రథమును నిలిపి,

25. శ్లో. భీష్మ-ద్రోణ - ప్రముఖతః।
సర్వేషాం చ మహీక్షితాం।
ఉవాచ పార్థ పశ్యై తాన్।
సమవేతాన్ కురూ నితి॥ 25

అర్థము:-

భీష్మ-ద్రోణప్రముఖతః - భీష్ముడు ద్రోణుడు మున్నగు
సర్వేషాం - సమస్తమైన
మహీక్షితాంచ - రాజులయొక్క
(పురతః - ఎదుట)
హేపార్థ -ఓఅర్జునా
సమవేతాన్-చేరియున్న
ఏతాన్ - ఈ
కురూన్ - కౌరవులను
పశ్య - చూడుమా
ఇతి - అని,
ఉవాచ - పలికెను.

తా॥ భీష్ముడు ద్రోణుడు మున్నగు సమస్తరాజులును చూచుచుండగనే ఓ అర్జునా! సమావేశమైయున్న ఈ కౌరవులను చూడుమాఅని శ్రీకృష్ణుడు పలికెను.

అర్థము:-

అథ - అటుపిమ్మట
పార్థః - అర్జునుడు
తత్ర - అచ్చట
స్థితాన్ - ఉన్నట్టి
పితౄన్ - భూరిశ్రవాది తండ్రివరుస వారిని
పితామహాన్ - భీష్మాదితాత వరుసవారిని
ఆచార్యాన్ - ద్రోణాది ఆచార్యవర్గము వారిని
మాతులాన్ - శల్యాది మేనమామ వరుస వారిని
భ్రాతౄన్ - దుర్యోధనాది అన్నవరుస వారిని
పుత్రాన్ - లక్ష్మణాదిపుత్ర వరుసవారిని
పౌత్రాన్ - మనుమలవరుసవారిని
తథా - అట్లే
సఖీన్ - కృతవర్మాది స్నేహితులను
అపశ్యత్ - చూచెను.

అర్జునుడు ఉభయ సేనలయందలి ఆప్తవర్గమును చూచుట.

తా॥ అటుపిమ్మట అర్జునుడు ఆ రణరంగమున భూరిశ్రవాది తండ్రి వరుసవారిని, భీష్మాది తాతవరుస వారిని, ద్రోణాది ఆచార్య వర్గము వారిని, శల్యాది మామ వరుసవారిని, దుర్యోధనాది అన్నదమ్ముల వరుసవారిని, లక్ష్మణాది కొడుకు వరుసవారిని, లక్ష్మణపుత్రాది మనుమల వరుసవారిని, కృతవర్మాది స్నేహితులను జూచెను.

27. శ్లో. శ్వశురాన్ సుహృదశ్చైవ ।
సేనయో రుభయో రపి ।
తాన్సమీక్ష్య స కౌంతేయః ।
సర్వాన్ బంధూ నవస్థితాన్ । 27

అర్థము:-

సః - ఆ
కౌంతేయః - అర్జునుడు
ఉభయోః - రెండైన
సేనయోఃఅపి - సేనలయందును
అవస్థితాన్ - ఉన్నట్టి
శ్వశురాన్ - మామలను
సుహృదః చ ఏవ - హితైషులను
తాన్ - అట్టి
సర్వాన్ - సమస్తమైన
బంధూన్ - బంధువులను
సమీక్ష్య - చక్కగా జూచి

అర్జునునకు యుద్ధవైముఖ్యమునకు కారణమైన దయ ఆవహించుట.

తా॥ ఆ అర్జునుడు రెండు సేనల మధ్యయందున్నట్టి పిల్లనిచ్చిన మామల వరుసవారిని స్నేహితులను, అట్టివారి వరుసగల సమస్త బంధు

28. శ్లో. కృపయా పరయాఽఽవిష్టో!
విషీద న్నిద మబ్రవీత్!
దృష్ట్వేమం స్వజనం కృష్ణ!
యుయుత్సుం సముపస్థితం! 28

అర్థము:-

| | |
|---|---|
| పరయా - అధికమైన | హే కృష్ణ - ఓ కృష్ణుడా! |
| కృపయా - దయచే | యుయుత్సుం - యుద్ధముచేయగోరి |
| ఆవిష్టః - ఆవరించబడినవాడై | సముపస్థితం - ఎదుటకు వచ్చియున్నట్టి |
| విషీదన్ - దుఃఖించుచు | ఇమం - ఈ |
| ఇదం - ఈ క్రిందివాక్యమును | స్వజనం - బంధుజనమును |
| అబ్రవీత్ - పలికెను. | దృష్ట్వా - చూచి |

తా॥ అర్జునుడు మిక్కిలి దయచే నవశుడై దుఃఖించుచు ఈ క్రింది వాక్యమును పలికెను. ఓ కృష్ణుడా! యుద్ధము చేయగోరి ఎదుటకు వచ్చి నిలబడియున్న ఈ బంధువులను జూచి,

29. శ్లో. సీదంతి మమ గాత్రాణి!
ముఖం చ పరిశుష్యతి!
వేపథు శ్చ శరీరే మే!
రోమహర్ష శ్చ జాయతే! 29

అర్థము:-

| | |
|---|---|
| మమ - నా యొక్క | మే - నా యొక్క |
| గాత్రాణి - అవయవములు | శరీరే - శరీరమునందు- |
| సీదంతి - శిథిలమగుచున్నవి. | వేపథుః చ - వణుకున్ను. |
| ముఖం చ - నోరున్ను. | రోమహర్షః చ - పులకరింతయును. |
| పరిశుష్యతి - ఎండిపోవుచున్నది. | జాయతే - పుట్టుచున్నది. |

—:దయా పారవశ్యమున అర్జునుని కపశకునములే గాన్పించుట:—

తా॥ నా యొక్క అవయవములు కృశించుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. నా శరీరమున వణుకు జనించుచున్నది. పులకరింత పొందుచున్నది.

30. శ్లో. గాండీవం స్రంసతే హస్తాత్ ।
త్వక్చైవ పరి దహ్యతే ।
న చ శక్నో మ్యవస్థాతుం ।
భ్రమతీవ చ మే మనః ॥ 30

అర్థము:-

గాండీవం - గాండీవమను ధనస్సు.
హస్తాత్ - చేతినుండి.
స్రంసతే - జారుచున్నది.
త్వక్ చ ఏవ - చర్మముకూడ
పరి దహ్యతే - అంతటను దహింప బడుచున్నది.
మే - నా యొక్క.
మనః చ - మనస్సున్ను.
భ్రమతీవ - తిరిగిపోవుచున్నట్లున్నది.
అవస్థాతుం చ - నిలబడియుండుటకైనను.
న చ శక్నోమి - శక్తిలేనివాడనైయున్నాను.

తా॥ నా ధనుస్సగు గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మము అంతటను మండిపోవుచున్నది. నా మనస్సు కూడా తిరిగి పోవుచున్నది. నిలబడుటకైనను, శక్తిహీనుడ నగుచున్నాను.

31. శ్లో. నిమిత్తాని చ పశ్యామి ।
విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి ।
హత్వా స్వజన మాహవే ॥ 31

అర్థము:-

హే కేశవ - ఓ కృష్ణా!
విపరీతాని - విరుద్ధములైన.
నిమిత్తాని చ - శకునములనున్ను
పశ్యామి - చూచుచున్నాను.
ఆహవే - యుద్ధమునందు.
స్వజనం - బంధుజనమును.
హత్వా - చంపి.
అను - పిమ్మట.
శ్రేయః చ - మేలునున్ను.
న పశ్యామి - చూడలేకున్నాను.

తా॥ ఓకృష్ణా! అపశకునములను కూడ చూచుచున్నాను. యుద్ధమునందు బంధువులను జంపిన పిమ్మట కలుగు శ్రేయస్సేదియో తెలుసుకొనలేకున్నాను.

32. శ్లో. న కాంక్షే విజయం కృష్ణ!
న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద ।
కిం భోగైర్జీవితేన వా ॥ 32

అర్థము:-

హే కృష్ణ - ఓ కృష్ణా!
విజయం - గెలుపును.
న కాంక్షే - కోరను.
రాజ్యం చ - రాజ్యమును న్ను.
న (కాంక్షే) - కోరను.
సుఖాని చ - సుఖములనున్ను.
న (కాంక్షే) - కోరను.
హే గోవింద - ఓ గోవిందుడా!
నః - మనకు.
రాజ్యేన - రాజ్యముతో
కిం - ఏమి ప్రయోజనము
భోగైః - సుఖాదిభోగములతోగాని.
జీవితేన వా - బ్రతుకియుండుటచేగాని.
కిం - ఏమి ప్రయోజనము.

—: అర్జునుడు తన నిర్వేదమును శ్రీకృష్ణున కెరింగించుట :—

తా॥ ఓ కృష్ణా! నేను జయమును కోరను, రాజ్యమును కోరను, సుఖములను కూడ కోరను, ఓ గోవిందా! మనకు రాజ్యముచే గాని భోగములచే గాని మన జీవితములచే గాని ఏమి ప్రయోజనము?

33. శ్లో. యేషా మర్థే కాంక్షితం నో।
రాజ్యం భోగా స్సుఖాని చ॥
త ఇమేఽ వస్థితా యుద్ధే।
ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥ 33

అర్థము:-

యేషాం అర్థే - ఎవరికొరకై.
నః - మనకు.
రాజ్యం - రాజ్యము.
కాంక్షితం - కోరబడినదో.
భోగాః చ - భోగములున్ను.
సుఖానిచ - సుఖములున్ను
(కాంక్షితాని - కోరబడినవో)
తే - అట్టి
ఇమే - వీరు
ప్రాణాన్ - ప్రాణములను
ధనాని చ - ధనములను
త్యక్త్వా - విడిచి
యుద్ధే - యుద్ధమునందు
అవస్థితాః - వచ్చినిలిచియున్నారు.

తా॥ ఎవరికొరకై మనకీ రాజ్యము, భోగములు సుఖములు కోరబడినవో అట్టివారందరు తమ ప్రాణములపై ఆశను ధనములపై ఆశను విడిచి యుద్ధమున వచ్చి నిలిచియున్నారు.

34. శ్లో. ఆచార్యాః పితరః పుత్రాః ।
తథైవ చ పితామహాః ।
మాతులాః శ్వశురాః పౌత్రాః ।
స్యాలాః సంబంధిన స్తథా ॥ 34

అర్థము:-

| | |
|---|---|
| ఆచార్యాః - గురువులున్ను | శ్వశురాః - మామలున్ను |
| పితరః - తండ్రులున్ను | పౌత్రాః - మనుమలున్ను |
| పుత్రాః - పుత్రులున్ను | స్యాలాః - భావమఱుదులున్ను |
| తథైవ - ఆవిధముగానే | తథా - అదేవిధముగా |
| పితామహాః చ - తాతలున్ను | సంబంధినః - బంధువులున్ను |
| మాతులాః - మేనమామలున్ను | (సంతి - కలరు.) |

తా॥ గురువులు తండ్రులు తాతలు మేనమామలు మామలు మనుమలు బావమఱుదులు బంధువులు ఇట్టి వారందరు యుద్ధమునకు వచ్చి యున్నారు.

35. శ్లో. ఏతా న్న హంతు మిచ్ఛామి।
ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్య - రాజ్యస్య।
హేతోః కిన్ను మహీకృతే॥ 35

అర్థము:-

| | |
|---|---|
| హే మధుసూదన - ఓ కృష్ణా | హేతోఃఅపి - నిమిత్తమైనను |
| ఘ్నతఃఅపి-హింసింపబడినవాడనైనప్పటికిన్ని | హంతుం - చంపుటకు |
| (అహం - నేను) | న ఇచ్ఛామి - కోరను. |
| ఏతాన్ - వీరలను | మహీకృతే - కేవలభూమికొరకై |
| త్రైలోక్య - రాజస్య - మూడు లోకముల రాజ్యాధిపత్యముయొక్క | కిన్ను - ఏమిచెప్పవలెను? |

తా॥ ఓ కృష్ణా! వీరు నన్ను హింసించినను, మూడు రాజ్యముల ఆధిపత్యమిచ్చినను కూడ నేను వీరలను చంపగోరను. ఇక కేవలము భూమికొరకై చంపజాలనని చెప్పవలెనా?

౩౮ శ్లో. యద్యప్యేతే న పశ్యన్తి।
లోభోపహత-చేతసః।
కుల-క్షయ-కృతం దోషం।
మిత్రద్రోహే చ పాతకం॥ ౩౮

అర్థము:-

లోభోపహత చేతసః - పేరాశచే చెడగొట్టబడిన చిత్తముగల
ఏతే - ఈ దుర్యోధనాదులు
కుల-క్షయ-కృతం - వంశనాశనము వలన కలుగు.
దోషం - దోషమును
మిత్రద్రోహే - మిత్రులకు ద్రోహము చేయుటయందలి
పాతకం చ - పాపమునున్ను
నపశ్యంతియదిఅపి - చూడనివారలైనప్పటికిని

తా॥ పేరాశచే చెడిపోయిన చిత్తములుగల ఈ దుర్యోధనాదులు వంశనాశనము వలన కలుగు దోషమును మిత్రులకు ద్రోహము చేయుట యందలి పాపమును తెలుసుకొనజాలని వారైనను

౩౯. శ్లో. కథం న జ్ఞేయ మస్మాభిః।
పాపా దస్మా న్నివర్తితుం।
కుల-క్షయ-కృతం దోషం।
ప్రపశ్యద్భి ర్జనార్దన॥ ౩౯

అర్థము:-

జనార్దన - ఓకృష్ణా
కుల-క్షయ-కృతం - వంశనాశనము వలన కలుగు
దోషం - దోషమును
ప్రపశ్యద్భిః - చక్కగా తెలుసుకొనుచున్న
అస్మాభిః - మనచే
అస్మాత్ - ఈ
పాపాత్ - పాపమునుండి
నివర్తితుం - మరలుటకు
కథం - ఎట్లు
న జ్ఞేయం - తెలియదగదు

తా॥ ఓ కృష్ణా! వంశనాశనము వలన కలుగు దోషము మనకు బాగుగా తెలియును. అట్టి మనము ఈ పాపమునుండి తొలగుట కేల ఆలోచింపరాదు?

40. శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి ।
కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నం ।
అధర్మోఽభి భవ త్యుత ॥ 40

అర్థము:-

కులక్షయే - వంశనాశనము కలుగగనే
సనాతనాః - శాశ్వతములైన
కులధర్మాః - కులధర్మములు
ప్రణశ్యంతి - పూర్తిగా నశించును
ధర్మే - ధర్మము
నష్టే (సతి) - నశించగానే
అధర్మః - అధర్మము
కులం - కులమును
కృత్స్నం - అంతను.
అభిభవతి ఉత - ఆక్రమించితీరును

తా॥ వంశనాశనము కలిగినచో వంశపరంపరగా వచ్చు శాశ్వతి ధర్మములు పూర్తిగా నశించును. ధర్మము నశించగా అధర్మము కులము నంతను ఆక్రమించి తీరును.

41. శ్లో॥ అధర్మాభి భవా త్కృష్ణ!
ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ!
జాయతే వర్ణ సంకరః ॥ 41

అర్థము:-

కృష్ణ - ఓ కృష్ణా
అధర్మాభిభవాత్ - అధర్మము ఆక్రమించుటవలన
కులస్త్రియః - కులకాంతలు
ప్రదుష్యంతి - పూర్తిగా చెడిపోవుదురు
వార్ష్ణేయ - ఓ కృష్ణుడా
స్త్రీషు - స్త్రీలు
దుష్టాసు (సతీషు) - చెడినవారలు కాగా
వర్ణ సంకరః - వర్ణములకు సాంకర్యము
జాయతే - కలుగుచున్నది.

తా॥ ఓ కృష్ణా! అధర్మము వ్యాపించినచో కులకాంతలు పూర్తిగా చెడుదురు. స్త్రీలు చెడినచో వర్ణసాంకర్యము కలుగును.

42. శ్లో॥ సంకరో నరకాయైవ।
కులఘ్నానాం కులస్య చ।
పతన్తి పితరో హ్యేషాం।
లుప్త-పిండోదకక్రియాః॥ 42

అర్థము:-

సంకరః - వర్ణసాంకర్యము
కులఘ్నానాం-కులమును పాడుచేసినవారలకును
కులస్య చ - కులమునకును కూడ
నరకాయ ఏవ - నరకము కొరకే
(భవతి - అగుచున్నది.)

ఏషాం - వీరలయొక్క
పితరః - పితృదేవతలు
లుప్త-పిండోదక -క్రియాః - లోపించినపిండములు, తర్పణములు గలవారలై
పతంతి - పడిపోవుచున్నారు.

తా॥ వర్ణసాంకర్యము కులఘాతకులకును, కులమునకును కూడ నరకమును కలిగించును. ఇట్టి వీరి పితృదేవతలు తమకు తద్దినములు పెట్టువారును, తర్పణము లిచ్చువారును లేక నరకమున పడుదురు.

43. శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం।
వర్ణ - సంకర - కారకైః।
ఉత్సాద్యంతే-జాతి ధర్మాః।
కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

అర్థము:-

ఏతైః - ఈ
కులఘ్నానాం-కులఘాతకులయొక్క
వర్ణసంకర- కారకైః- వర్ణములయొక్క సాంకర్యమును కలిగించునట్టి
ఏతైః - ఈ
దోషైః - దోషములచే

శాశ్వతాః - అనాదియైన
జాతిధర్మాః - వర్ణాచారములును
కులధర్మాశ్చ - కులాచారములును
ఉత్సాద్యంతే - నశింపచేయబడుచున్నవి.

తా॥ కులఘాతకులు వర్ణసాంకర్యమును కలిగింతురు. వారి ఈ దోషములచే పరంపరగ వచ్చు స్థిరమైన జాతి ధర్మములును, కులధర్మములును నశింప చేయబడును.

44. శ్లో. ఉత్సన్నకుల ధర్మాణాం - మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో - భవతీ త్యను శుశ్రుమ॥

అర్థము:- హే జనార్దనా॥ఓ కృష్ణా. ఉత్సన్నకుల ధర్మాణాం॥నశించిన కులధర్మములుగల. మనుష్యాణాం॥ మనుష్యులకు. నరకే॥ నరకమునందు. నియతం॥ఎల్లప్పుడు. వాసః॥నివాసము. భవతిఇతి॥కలుగుచున్నదని. అనుశుశ్రుమ॥వింటిమి.

తా॥ కృష్ణా! కులధర్మములు చెడిన మానవులకు ఎల్లప్పుడును నరకవాసము కలుగుచున్నదని వినియున్నాము.

45. శ్లో. అహో! బత! మహత్పాపం । కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్య సుఖలోభేన । హన్తుం స్వజన ముద్యతాః ॥

అర్థము:- అహో !॥అహో !. బత॥అయ్యో, యత్ ॥ ఏ కారణమువలన, వయం॥మనము, రాజ్యసుఖలోభేన॥ రాజ్యసుఖములయందలి పేరాశచే, స్వజనం ॥ బంధుజనమును.- హన్తుం॥ చంపుటకు, ఉద్యతాః ॥ యత్నించితిమో, (తత్ ॥అకారణమువలన). మహత్॥గొప్పదైన. పాపం॥ పాపమును, కర్తుం॥చేయుటకు, వ్యవసితాః॥సిద్ధపడితిమి,

తా॥ అయ్యయ్యో! మనము గొప్పపాపమునకు ఒడిగట్టికొంటిమి. రాజ్యసుఖమునందలి పేరాశతో మనబంధుజనమును చంప యత్నించితిమికదా!

46. శ్లో. యది మా మప్రతీకారం - అశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః - తన్మే క్షేమతరం భవేత్॥

అర్థము:-శస్త్రపాణయః॥ఆయుధము చేతిలోగల. ధార్తరాష్ట్రాః॥ దుర్యోధ నాదులు. అశస్త్రం॥శస్త్రములు లేనట్టియు, అప్రతీకారం॥ప్రతిక్రియ చేయునట్టియు, మాం॥నన్ను, రణే॥యుద్ధమునందు, హన్యుః॥యది॥ చంపుదురేని, తత్॥అమరణము, మే॥నాకు క్షేమతరం॥మరింత క్షేమము, భవేత్॥అగును.

తా॥ శస్త్రాస్త్రములను విడిచి దెబ్బకుదెబ్బ కొట్టని నన్ను శస్త్రధారులగు దుర్యోధనాదులు యుద్ధమునందు వధించిరేని అది నాకు మరింత క్షేమకరము.

సఞ్జయ ఉవాచ ॥సంజయుడు పలికెను.

47. శ్లో. ఏవముక్త్వాఽర్జున స్సఙ్ఖ్యే। రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం। శోకసంవిగ్నమానసః॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాద యోగో నామ ప్రథమోఽధ్యాయః॥

అర్థము:-సఙ్ఖ్యే = యుద్ధమునందు, అర్జునః = అర్జునుడు, ఏవం = ఇట్లు, ఉక్త్వా = పలికి, శోకసంవిగ్నమానసః = దుఃఖముచే మిక్కిలి చలించిన మనస్సు కలవాడగుచు, సశరం = బాణముతో కూడిన, చాపం = ధనుస్సును, విసృజ్య = విడిచి, రథోపస్థే = రథముపై, ఉపావిశత్ = కూర్చుండెను,

తా॥ అర్జును డీ విధమున పలికి, శోకముచే మనస్సు మిక్కిలి కలత నొందగా గాండీవమును క్రిందపడవైచి రథముపై చతికిలపడెను.

ఇదిఉపనిదర్థ ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జున సంవాద రూపంబును నగు శ్రీ భగవద్గీతలయందు అర్జున విషాదయోగం బను ప్రథమాధ్యాయము:

| | | | |
|---|---|---|---|
| ధృతరాష్ట్రుని శ్లోకము:-1. | | దుర్యోధనుని శ్లోకములు | 9 |
| సంజయుని శ్లోకములు | 16. | అర్జునుని శ్లోకములు | 21 |

### బదరి శ్రీనివాసరామానుజస్వామివారల శాశ్వత పూజలు

1. శ్రీ కందాడ రంగనాయకమ్మగారు. (మాధవరం) వాగ్దానం 275/లు -జమ- 100-0-0
2. శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ అంతర్వేది నృసింహాచార్యులుగారు (పెద్దవరం) వాగ్దానం 275-0-0
3. శ్రీమాన్ కాండూరు నరసింహాచార్యులు గారు (ముక్తిపల్లి) వాగ్దానం 275-0-0
4. శ్రీ భోజనపల్లి వెంకటనరసింహంగారు (మంగళగిరి) 29-0-0
5. శ్రీ వేములపల్లి సూర్యనారాయణగారి భార్య రామలక్ష్మమ్మ కుమారుడు రాజశేఖరరావుగారు (బీబీగూడెం) 29-0-0
6. శ్రీ విఠల్‌దాసు తాయారమ్మగారు (పాండురంగపురం) వయా బందరు) 29-0-0
7. శ్రీ జె. కృష్ణదాసుగారు లోగడ 20-0-0 గాక యిప్పుడు జమ 9-0-0
8. శ్రీకనుపర్తి జీవరత్నమ్మగారు (వేంకటగిరి) 116-0-0

### విశేషపూజలు

9. శ్రీ మంగుశ్రీ వేంకటేశ్వర్లుగారు (శ్రీకాళహస్తి) (తండ్రిగారిపేర) 29-0-0
10. శ్రీ డాక్టర్ B. లక్ష్మీకాంతశాస్త్రిగారు (శ్రీకాళహస్తి) (తండ్రిపేర) 25-0-0 ఈ శాస్త్రిగారే (తల్లిగారిపేర) 25-0-0

### తాత్కాలిక పూజలు

11. శ్రీ దోర్బల సత్యనారాయణగారు (బందరు) 11-0-0
12. శ్రీ పల్లపోతు రాజారావుగారు (బందరు) 11-0-0
13. శ్రీ చెరుకూరు వెంకటసుబ్బమ్మ (తామరకల్లు) 11-0-0
14. శ్రీ పొత్తూరు సుబ్బారావుగారు (బెజవాడ) 11-0-0
15. శ్రీ తటపర్తి రామమోహనరావుగారు (రేపల్లె) 11-0-0
16. శ్రీ వానమామలై శ్రీ పరమంగ తాయార్ గారు 11-0-0
17. శ్రీ జి. వి. యల్. పాపాయమ్మగారు (మదరాసు) 11-0-0

### శ్రీ జియ్యరుస్వామివారి జయంతి విరాళాలు

19. శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తిగారు అడ్వకేటు (శ్రీకాళహస్తి) 15-0-0
20. శ్రీ. తటపర్తి రామమోహనరావుగారు (రేపల్లె) 5-0-0
21. శ్రీ రావు లక్ష్మీనరసయమ్మారావురాణి గారు (తిమ్మాపురం) 5-0-0
22. శ్రీ మాతంశెట్టి సీతారామయ్యగారు (బెజవాడ) 1-0-0
23. శ్రీ వేదాల మంగతాయారమ్మగారు (ముక్తిపల్లి) 1-0-0
24. శ్రీ గుదిమెళ్ళ శ్రీనివాస తాయారమ్మ (ఆశ్రమం) 1-0-0
25. శ్రీ యలమంచి వెంకటసత్యవతమ్మగారు (గండిగుంట) 1-0-0
26. శ్రీ వల్లభనేని రుక్మిణమ్మగారు 1-0-0

శ్రీ శ్రీ శ్రీ సూరానేని పరమంగయ్యమ్మారాణిగారు (శ్రీ వానమామల మఠ శిష్యురాలు, (మైలవరం-రివరాణీగారు) తాము జీవించియున్నంతవరకు ప్రతి సంవత్సరము శ్రీ జియ్యరస్వామివారికి మఠకైంకర్య నిర్వహణార్థమై ఆరుబస్తాల ధాన్యమిచ్చుటకు వాగ్దానము గావించిరి. ఈ తల్లిగారు మన ప్రచారసంఘసౌధమునకు పునాదివంటి వారు.

### కట్నములు

1. శ్రీ శ్రీరంగం శఠగోపాలాచార్యులగారి కుమారుని వివాహకట్నం. 3-0-0
2. శ్రీ జక్కంపూడి రత్నమ్మగారు షష్టిపూర్తి దత్తత తీసుకొన్నప్పుడు సంఘమునకు కట్నం. 3-0-0
3. శ్రీ సేనాధిపత్యం వెంకటాచార్యులగారి కుమారుని వివాహకట్నం. 2-0-0
4. శ్రీ కోమూరు రంగాచార్యులగారి కుమారుని వివాహ కట్నం. 4-0-0
5. శ్రీ వెల్లంకి నాగరత్నమ్మ ఆచార్య జయంతికి కట్నం. 2-0-0
6. శ్రీ వేదాల సుభద్రమ్మగారి శుక్రవారం పూజా కట్నం. 1-0-0
7. శ్రీ వేదాల కోనమాచార్యులగారి కుమారుని వివాహ కట్నం. 1-0-0
8. శ్రీ గుదిమెళ్ల రాజగోపాలాచార్యులుగారు పంపిన వివాహ కట్నం. 1-0-0

10. శ్రీ మంగు శ్రీ వేంకటేశ్వర్లు, శ్రీ తాయారమ్మ గార్లు ఆండాళ్ తిరునక్షత్ర కట్నంగా ఇచ్చినది 5-0-0

11. శ్రీ (చావలి) మహిళామండలివారు. ఆండాళ్ తిరునక్షత్రకట్నంగా ఇచ్చినది. 1-0-0

## సంభావనలు

| | |
|---|---|
| శ్రీ శీలంశెట్టి గోవర్ధనరావుగారు తిరువధ్యయన సంభావన ఇచ్చినది | 2-0-0 |
| శ్రీ వైశ్యరాజు విశ్వనాధరాజుగారు పంపిన తిరువధ్యయన సంభావన | 1-0-0 |
| శ్రీ దరూరి వెంకటరామ నరసమ్మగారు తమతల్లిగారగు కోవెల ఆండాళమ్మగారి తీర్థతిరువధ్యయన సంభావన ఇచ్చినది. | 4-0-0 |
| శ్రీ కూరపాటిరామారావుగారు, తమతల్లిగారి పరమపద సంభావనకిచ్చినది. | 5-0-0 |
| శ్రీ మద్దినరసమ్మగారు పరమపదసందర్భమున సంభావన | 4-0-0 |

## ముఖ్య గమనిక

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు ఈ సంవత్సరం రాబోవు గీతాజయంతి ఎచ్చట జరుపుటాయని యోజించుచున్నారు. ఈ గీతాజయంతి మార్గశిరశుద్ధ ఏకాదశి డిసెంబరు 3-12-57 ప్రారంభించి 18 దినములు జరుపుదురు. ఈ జయంతి పెద్దపట్టణములో జరుగవలెను. ఆ 18 దినములు గీతా పారాయణ, ఉపన్యాసములు జరుగును. ఉత్సాహము గలవారు ఏపట్టణమైనా మాపట్టణములో జరుపుడని ఆహ్వానించినచో వీలునుబట్టి వసతిగల ప్రదేశమునకు వేంచేయవలెనని శ్రీ వారితిరువుళ్లమై యున్నది.

## ముఖ్య ప్రకటన

ప్రచారవిభాగమను పేరుతో మేము ప్రత్యేకముగా 1-4-0 చందాతో ప్రచురించుచున్న పత్రికను ఈ మాసమునుండి నిలిపి వేసినాము.

భక్తినివేదనపత్రిక చందాదారులలో దాదాపు 300 మంది బాకీలు బకాయి పడి ఎన్ని జాబులు వ్రాసినా, ఎన్నిమారులు మా ఏజెంటును పంపినా చందాలు ఇవ్వనందున కొందరిని చందాలిస్టునుండి తగ్గించినాము. పత్రికా నిర్వహణలో ఆర్థికదౌర్బల్య మధికమైనది. చందాలు సక్రమముగా రాని హేతువున నిట్లు మార్పు చేయవలసివచ్చినది. వేదాంతమం దభిరుచి యభిమానము గలవారు భక్తినివేదన కావలయునన్నచో సాలుచందా 5-0-0లు ముందుగా M. O. ద్వారా పంపగోరుచున్నాము.

**BOOK POST**

"భక్తినివేదన" శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం (వయా) చుండూరు గుంటూరు జి॥

To వేంకటేశ్వర



Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press, Nadigaddapalem.

# ఆశ్రమములో శ్రీ మన జియ్యర్‌స్వామివారి దినచర్య

వేగుజామున:- గం 4-30 ల నుండి గం 5.00 ల వరకు - శ్రియఃపతిగుణానుసంధానము

ఉదయం:- గం 6-00 ల మొదలు గం 7-30 ల వరకు - స్నాన, సంధ్య, జప, తిరువారాధనలు

గం 7-30 ల మొదలు గం 8-00 ల వరకు - తీర్థవినియోగము

గం 8.00 ల మొదలు గం 11-00 ల వరకు - ఆచార్యహృదయకాలక్షేపము

మధ్యాహ్నం:- గం 11-00 ల మొదలు గం 12-00 ల వరకు - భిక్షాస్వీకారము, విశ్రాంతి

గం 12-00 ల మొదలు గం 1-00 ల వరకు - ఉత్తర, ప్రత్యుత్తర, పరిశీలన, ఇష్టగోష్ఠి

గం 1.00 ల మొదలు గం 3-00 ల వరకు - శ్రీభాష్యకోశపరిశీలన, వేదాంతవ్యాసరచన

సాయంత్రం:- గం 3.00 ల మొదలు గం 5-00 ల వరకు - శ్రోతలకుసద్గ్రంథకాలక్షేపము

గం 5-30 ల మొదలు గం 7-30 ల వరకు - సాయంస్నానసంధ్యాజపతిరువారాధనలు

రాత్రి:- గం 8-00 ల మొదలు గం 10-00 ల వరకు శ్రీకోదండరామస్వామివారిసన్నిధిలో హరేరామ భజన, తదుపరి, భజయతి రాజస్తోత్రము, గోపికాగీతలు వీనినుండి ప్రతిదినము ఒక్కొక్క శ్లోకమును, అనుసంధానము చేయుచు విశేషార్థములతో నుపన్యసించుట.

రాత్రి గం. 10. 30 లకు విశ్రాంతి.

దసరా పండుగ తరువాత ఆశ్రమములో ఒకమాసము రోజులు శ్రీయతిరాజ శిక్షాశిబిరమును ఏర్పాటు చేయవలెనని శ్రీవారి సంకల్పమైయున్నది.

## బదరీ సమాచారము

### శ్రీ మదిత్యాది శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారి బదరీ ప్రచారము:-

బదరిలో అష్టాక్షరీ క్షేత్రనిర్మాణార్థమై వేంచేసిన మన శ్రీమాన్ విద్వాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారు, ఇటీవల ఋషీకేశములో శ్రీమదిత్యాది శ్రీమాన్ పరమహంస పరివ్రాజకాచార్య అహోబిలమఠాధీశ్వరుల సన్నిధిలో పండిత సమక్షమున శ్రీభాష్యములో శ్లోకవిషయమును గురించి సంస్కృతములో గంటన్నర కాలముపన్యసించి సన్మానమందుకొనిరి. మరియు, వీరు ప్రతిదినము బదరిలో శ్రీమదిత్యాది శ్రీమాన్ త్రిదండి వేదాంత రామానుజ పాదుకాసేవక జియ్యర్ స్వామివారికి భగవద్విషయ కాలక్షేపమున్ను, శ్రీమాన్ వం. రంగాచార్యులగారికి. గీతాభాష్య కాలక్షేపమున్ను మరియు బదరిలో ప్రతిదినము సాయంకాలము ఏర్పాటుచేయబడిన సత్సంగగోష్ఠిలో సంప్రదాయ విషయములను గురించి ఉపన్యాసములు గావించుచున్నారు.

అష్టాక్షరీ క్షేత్రములో క్రిందిగదులన్నియు పూర్తిచేసి పైగదులుకూడ దాదాపు సగమువరకు పనిపూర్తి చేయించినారు. సిమెంటు పర్మిషన్ సంపాదించినారు. పనిజరుగుచున్నది. బదరీ శ్రీనివాస రామానుజస్వామివారల అధ్యయనోత్సవము చాలవైభవముగ వీరి అధ్వర్యమున జరుపబడినది. శాశ్వత, తాత్కాలిక, విశేషపూజలను వీరు దగ్గరయుండి వారి వారి గోత్రనామములతో జరిపించుచున్నారు.

"భక్తినివేదన"
హేవళంబి, భాద్రపదము

రి. నెం. 195
విశేషానుబంధము

# భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

(టీకాతాత్పర్య సహితము)



ప్రకాశకులు
విశిష్టాద్వైత ప్రచారక సంఘము

పరిచురణకర్తలు
భక్తినివేదనపత్రికా కార్యాలయము

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెము (వయా) చుండూరు - గుంటూరు జిల్లా

# గీతార్థ సంగ్రహము

## ద్వితీయాధ్యాయ ప్రమేయము

శ్లో॥ నిత్యాత్మాఽసంగ కర్మేహా గోచరా సాంఖ్యయోగధీః
ద్వితయే స్థితధీలక్ష్యా, ప్రోక్తా తన్మోహ శాంతయే॥

**అర్థము:-**

నిత్యాత్మ = ఆత్మనిత్యత్వ విషయకమై

అసంగ కర్మేహా గోచరా = ఫలసంగరహిత కర్మానుష్ఠానమును గురించినదై

స్థితధీలక్ష్యా = స్థితప్రజ్ఞతయను జ్ఞానయోగము ఫలముగా గలదైన

సాంఖ్యయోగధీః = సాంఖ్య యోగము

తన్మోహ శాంతయే = అర్జునుని మోహశాంతికై

ద్వితీయే = ద్వితీయాధ్యాయమందు

ప్రోక్తా = చెప్పబడినది

తా॥ ఆత్మ నిత్యత్వమును దెలియజేయుచు, స్థితప్రజ్ఞావస్థలఫలమును నిరూపించుచు ఫలసంగరహిత కర్మానుష్ఠానమును బోధించు సాంఖ్యయోగము. అర్జునుని మోహశాంతికై ద్వితీయాధ్యాయములోఁ జెప్పఁబడెను.

సాంఖ్యధీః = అనగా ఆత్మతత్వవిషయమైన బుద్ధి.

ఆత్మ నిత్యత్వజ్ఞానపూర్వక ఫలసంగరహిత కర్మానుష్ఠానమే కర్మయోగము.
(తద్వారా లభ్యమైనది జ్ఞానయోగము)

# శ్రీ భగవద్గీత - ద్వితీయాధ్యాయము

## వి ష య సూ చి క



శ్లోక సంఖ్య

అస్మద్గురుభ్యో నమః

శ్రీ భగవద్గీతా - ద్వితీయోఽధ్యాయః

# సాంఖ్యయోగః

సంజయ ఉవాచ :-

1. శ్లో. తం తథా కృపయాఽఽవిష్టం ।
అశ్రు - పూర్ణా - కులేక్షణం ।
విషీదంత - మిదం - వాక్యం ।
ఉవాచ మధు - సూదనః ॥

అర్థము :-

తథా=ఆవిధముగా
కృపయా=కనికరముచే
ఆవిష్టం=ఆవేశింపబడిన వాడున్ను
అశ్రు-పూర్ణాకులేక్షణం=
కన్నీటితో నిండి వ్యాకులము లైన
నేత్రములు కలవాడునునై
విషీదంతం=దుఃఖించుచున్న
తం=ఆ అర్జునుని గూర్చి
మధుసూధనః=శ్రీకృష్ణుడు
ఇదం=ఈ (చెప్పబోవునట్టి)
వాక్యం=వాక్యమును
ఉవాచ=పలికెను.

తాత్పర్యము :-

సంజయుడు తెలుపుచున్నాడు :

ఈ విధముగా కనికరముచే నావేశింపబడినవాడై మిక్కిలి కన్నీరుగార్చుచు దుఃఖించుచున్న అర్జునునిగూర్చి శ్రీకృష్ణు డిట్లు పలికెను.

: అవ. శ్రీకృష్ణు డర్జునుని ఓదార్చు చున్నాడు :

శ్రీ భగవా నువాచ :-

2. శ్లో. కుత స్త్వా కశ్మల మిదం ।
విషమే సముపస్థితం ।
అనార్య-జుష్ట మస్వర్గ్యం ।
అకీర్తికర మర్జున ॥

అర్థము -

హే అర్జున = ఓ అర్జునా !
అనార్య-జుష్టం = ఆత్మ నెరుగని వారిచే అవలంబింపబడునట్టియు
అస్వర్గ్యం = పరలోకమునకు విరోధియు
అకీర్తికరం = అపకీర్తిని కలిగించునదియునగు
ఇదం = ఈ
కశ్మలం = దుఃఖము
విషమే = సంకట సమయమున
కుతః = ఎట్లుగా
త్వా = నిన్ను
సముపస్థితం = ఆవేశించినది

తా. ఓ అర్జునా ! శరీరాత్మ వివేకములేని వారిచే నవలంబింపబడు నట్టియు, పరలోక ప్రాప్తికి విరోధకరమైనట్టియు, అపకీర్తిని కలిగించు నట్టియు ఈ దుఃఖము ఏ విధముగా నీకు దాపరించినదోయి ?

3 శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ ।
నైత త్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయ-దౌర్బల్యం ।
త్యక్త్వో త్తిష్ఠ పరంతప ॥

అర్థము :-

హే పార్థ = ఓ అర్జునా!
క్లైబ్యం = అధైర్యమును
మాస్మగమః = పొందకుము.
ఏతత్ = ఈ దైన్యము
త్వయి = నీ యందు
న ఉపపద్యతే = తగదు.
హే పరంతప = శత్రుతాపకుడవైన ఓ అర్జునా !
క్షుద్రం = నీచమైన
హృదయ-దౌర్బల్యం = మానసిక దుర్బలత్వమును
త్యక్త్వా = విడిచి
ఉత్తిష్ఠ = లెమ్ము.

తా. ఓ అర్జునా ! అధైర్యమును చెందకుము. ఈ దైన్యము నీకు తగదు. నీవు శత్రువుల దపింపచేయువాడవు. ఈ మానసిక దుర్బల త్వమును విడిచి కర్తవ్యాచరణకై లెమ్ము.

: అవ. అర్జునుడు తిరిగి తన నిర్వేదము నుగ్గడించు చున్నాడు :

అర్జున ఉవాచ :-

4. శ్లో. కథం భీష్మ మహం సంఖ్యే ।
ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి ।
పూజార్హా వరిసూదన ॥

అర్థము :-
హే అరిసూదన=ఓ శత్రుసంహారకా!
హే మధుసూదన=ఓ కృష్ణా!
పూజార్హౌ = పూజించ దగిన
భీష్మం = భీష్ముని
ద్రోణం చ = ద్రోణుని
అహం = నేను
సంఖ్యే = యుద్ధమున
ఇషుభిః = బాణములచే
కథం = ఎట్లుగా
ప్రతియోత్స్యామి = ఎదుర్కొని యుద్ధము చేయగలను?

తా. ఆశ్రితుల శత్రువులను సంహరించు ఓ శ్రీకృష్ణా! పూజించవలశిన భీష్మ - ద్రోణాదులతో నేను యుద్ధమున బాణములతో నెటుల ఎదురు యుద్ధము చేయుదును?

5. శ్లో. గురూ నహత్వా హి మహానుభావాన్ ।
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే ।
హత్వార్థ - కామాంస్తు గురూ నిహైవ ।
భుంజీయ భోగాన్ రుధిర - ప్రదిగ్ధాన్ ॥

అర్థము :
మహానుభావాన్ = గొప్పవారైన
గురూన్ = పెద్దలను
అహత్వా = చంపకుండగ
ఇహ = ఈ
లోకే = లోకమున
భైక్షం అపి = బిచ్చమెత్తిన దానినైనను
భోక్తుం = అనుభవించుట
శ్రేయః హి = శ్రేయస్కరమైనదిగదా
అర్థకామాన్ = భోగార్థములను గోరు
గురూన్ = పెద్దలను
హత్వాతు = సంహరించిరైతే
ఇహ ఏవ = ఇచ్చటనే
రుధిర ప్రదిగ్ధాన్ = వారి రక్తము చేపూయబడి యుండు
భోగాన్ = భోగములను
కథం = ఎట్లుగా
భుంజీయ = అనుభవింతును.

తా. గొప్పవార్లైన పెద్దలను చంపకుండగ ఈ లోకములో బిచ్చమెత్తుకొని జీవించుట మంచిది. భోగార్థములనుకోరు గురువులను చంపి ఇచ్చట వారి రక్తసిక్తములగు భోగముల నే నెట్లనుభవింతును ?

6. శ్లో. న చైత ద్విద్మః కతర న్నో గరీయో ।
యద్వా జయేమ యది వా నో జయేయుః ।
యా నేవ హత్వా న జిజీవిషామః ।
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥

అర్థము:—

నః = మనకు
కతరత్ = ఏది
గరీయః = శ్రేష్ఠమైనదో
ఏతత్ = దీనిని
న విద్మః = తెలుసుకొన లేకున్నాము.
జయేమ యద్వా = మనమేజయింతుమో?
వా = లేక
నః = మనలను
జయేయుః యదివా=వారే జయింతురో ?
యాన్ = ఎవరిని
హత్వా = చంపి
న జిజీవిషామః = జీవించ కోరమో
తే = అట్టి
ధార్తరాష్ట్రాః ఏవ = దుర్యోధనాదులే
ప్రముఖే = ఎదుట
అవస్థితాః = వచ్చి నిలచియున్నారు.

తా. మనకు యుద్ధముచేయట మంచిదియో; మానుట మంచిదియో; తెలుసుకొన జాలకున్నాను. మనమే వారిని జయింతుమో; వారే మనల జయింతురో నెరుంగజాలము. *ఎవరిని చంపినచో మనము జీవించ నిచ్ఛయించమో అట్టి దుర్యోధనాదులు ఎదుటవచ్చి నిలచియున్నారు.

* దుర్యోధనాదులచే నతి ఘోరములైన లక్క యిల్లు కాల్చుట మొదలగు ఆతతాయి కృత్యములచేతను, నిండు సభలో తమ ఎదుట తమ భార్య నవమానించుట మొదలైన అమానుష కృత్యములచేతను మాటిమాటికి వంచింపబడియున్నవాడై "ఎవరిని చంపనిచో మనము జీవించ నిచ్ఛయించమో" యనుటకు బదులు యిట్లనుట యర్జునుని విశాలహృదయత్వమును, పరమ కారుణికత్వమును, దీర్ఘబంధుత్వమును, పరమ ధార్మికత్వమును చాటుచున్నది. ఇట్టి యోగ్యత కలవాడు గనుకనే సర్వగుహ్యతమమగు చరమశ్లోకోపదేశమునకు పాత్రుడయ్యెను.

7. శ్లో. కార్పణ్య - దోషో - పహత - స్వభావః ।
పృచ్ఛామి త్వాం ధర్మ-సమ్మూఢ-చేతాః ।
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే ।
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం ॥

అర్థము :-

కార్పణ్య-దోషో-పహత-స్వభావః -
కార్పణ్య=మనోదైన్యము అనెడు
దోష = దోషముచేత
ఉపహత = పోగొట్టబడిన
స్వభావః — ధైర్యముగలవాడనై
ధర్మ-సమ్మూఢ-చేతాః=ధర్మమునందు సందిగ్ధమైన మనస్సుగలవాడనై
త్వాం = నిన్ను
పృచ్ఛామి = అడుగుచున్నాను.
యత్ = ఏది
శ్రేయః = శ్రేయస్కరమైనదిగ
నిశ్చితం = నిర్ణయింపబడునది
స్యాత్ = అగునో
తత్ = అట్టిదానిని
మే = నాకు
బ్రూహి = తెలుపుమా.
అహం = నేను
తే = నీకు
శిష్యః = శిష్యుడను.
త్వాం = నిన్ను
ప్రపన్నం = శరణుజొచ్చిన
మాం = నన్ను
శాధి = శాసించుమా.

తా. మనోదైన్యము అనెడు దోషముచేత ధైర్యములేని వాడనై ధర్మనిర్ణయ విషయమున సందిగ్ధ చేతస్కుడనై నిన్ను అడుగుచున్నాను. ఏది మంచిగ నిర్ణయింపబడినదో దానిని నాకు తెలుపుము. నేను నీకు శిష్యుడను. నిన్ను శరణుజొచ్చిన నన్ను ఆజ్ఞాపించుము.

---

కార్పణ్యం - (1) విడువవలసిన దానిని విడువకుండుట, (2) దయను పుట్టించు దీన వృత్తి, (3) ఆత్మ వివేకము లేనివాడు అని యర్థములు.

ఈ శ్లోకమున శరణాగతుని యనుష్ఠానము శిక్షింపబడుచున్నది. ఆకించిన్య అనన్య గతిత్వముల దెలుపుచు పరమ విశ్వాసముతో ఆత్మోజ్జీవనసాధనమునకై పాదములపై నొరగుటయే కర్తవ్యమని న ధర్మనిష్ఠోఽస్మి.. యనెడు ఆళ్వందారుల శ్రీసూక్తి తెలుపుచున్నది గదా !

8. శ్లో. నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్ ।
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం ।
రాజ్యం సురాణా మపి చాధిపత్యం ॥

అర్థము :-

భూమౌ = భూమియందు
అసపత్నం = శత్రురహితమైన
ఋద్ధం = సమృద్ధమైన
రాజ్యం = రాజ్యమును
సురాణాం = దేవతలయొక్క
ఆధిపత్యంచ = అధికారమునున్న
అవాప్య అపి = పొందినప్పటికిన్ని

ఇంద్రియాణాం = ఇంద్రియములకు
ఉచ్ఛోషణం = అధిక సంతాపకరమైన
మమ = నాయొక్క
శోకం = దుఃఖమును
యత్ = ఏది
అపనుద్యాత్ = పోగొట్టునో
తత్ = దానిని
న ప్రపశ్యామి = చూడజాలకున్నాను.

తా. నిష్కంటకమై సమృద్ధమైన భూమియందలి రాజ్యమును దేవతాధిపత్యమును పొందినప్పటికిన్ని ఇంద్రియముల శోషింపజేయుచున్న నా దుఃఖమును ఏదినశింపజేయగలదో అట్టిదానిని తెలుసుకొనజాలకున్నాను.

అర్జునుడు శ్రీకృష్ణునకు తిరిగి తన నిశ్చయమును వినిపించుచున్నాడు

సంజయ ఉవాచ :

9 శ్లో. ఏవ ముక్త్వా హృషీకేశం ।
గుడాకేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవిందం ।
ఉక్త్వా తూష్ణీం బభూవ హ ॥

అర్థము :-

పరంతపః — శత్రువులను తపింపజేయు
గుడాకేశః — అర్జునుడు
హృషీకేశం — శ్రీకృష్ణుని గూర్చి
ఏవం — ఈ విధముగ
ఉక్త్వా — పలికి

న యోత్స్యే — యుద్ధమును చేయను
ఇతి — అని
గోవిందం — శ్రీకృష్ణుని గూర్చి
ఉక్త్వా — చెప్పి
తూష్ణీం బభూవ — ఊరకుండెను.
హ — ఆశ్చర్యము

తా. శత్రు సంహారకుడైన అర్జునుడు శ్రీకృష్ణునిగూర్చి యిటుల పలికి నేను యుద్ధమును చేయను అని శ్రీకృష్ణునికి చెప్పి ఊరకుండెను. ఆహా! ఎంత బంధు ప్రేమ! ఎంత భూతదయ!

10. శ్లో. త ముపాచ హృషీకేశః।
ప్రహసన్నివ భారత।
సేనయో రుభయో ర్మధ్యే।
విషీదంత మిదం వచః॥

అర్థము :-

హే భారత = ఓ ధృతరాష్ట్రా!
హృషీకేశః = శ్రీకృష్ణుడు
ఉభయోః = రెండైన
సేనయోః = సేనలయొక్క
మధ్యే = మధ్యయందు
విషీదంతం = దుఃఖించుచున్న
తం = ఆ అర్జునుని గూర్చి
ప్రహసన్ ఇవ = పరిహాసవాక్యములను పలుకుచున్న వానివలె
ఇదం = ఈ (చెప్పబోవు)
వచః = వాక్యమును
ఉవాచ = పలికెను.

తా. ఓ ధృతరాష్ట్రా! శ్రీకృష్ణుడు రెండు సేనల మధ్యయందు దుఃఖించుచున్న ఆ అర్జునునిగూర్చి పరిహాసవాక్యములను పలుకుచున్న వానివలె చెప్పబోవు గీతాశాస్త్ర రూపమగు వాక్యమును పలికెను.

శ్రీ భగవాన్ ఉవాచ :

11. శ్లో అశోచ్యా నన్వశోచ స్త్వం।
ప్రజ్ఞావాదాం శ్చ భాషసే।
గతాసూ నగతాసూం శ్చ।
నానుశోచంతి పండితాః॥

అర్థము :-

త్వం = నీవు
అశోచ్యాన్ = దుఃఖింపతగనివారినిగూర్చి
అన్వశోచః = దుఃఖించితివి.
ప్రజ్ఞవాదాన్ చ = జ్ఞానాధికులుపలుకుమాటలను
భాషసే = పలుకుచున్నావు.
పండితాః = జ్ఞానవంతులు
గతాసూన్ = శరీరములనుగూర్చి గాని
అగతాసూన్ చ = ఆత్మలను గూర్చి గాని
న అనుశోచంతి = దుఃఖించరు.

తా. నీవు దుఃఖించ తగని వారినిగూర్చి దుఃఖించుచున్నావు. జ్ఞానాధికులు పలుకు మాటలను పలుకుచున్నావు. ఆత్మ-అనాత్మ వివేకము గల జ్ఞానాధికులు అనిత్యములైన శరీరములను గురించిగాని నిత్యములైన ఆత్మలను గురించిగాని దుఃఖించరు.

## గీతా శాస్త్రి మీ శ్లోకమునుండి ప్రారంభ మగుచున్నది

శ్రీకృష్ణు డర్జునునకు కర్మయోగమునకు ప్రధానాంగముగా

జీవాత్మతత్వము నుపదేశించుచున్నాడు:

12. శ్లో. న త్వే వాహం జాతు నాసం ।
న త్వం, నేమే జనాధిపాః ॥
న చైవ న భ వి ష్యా మః ।
స ర్వే వయ మ తః ప ర o ॥

అర్థము :—
అహం — నేను
జాతు — ఒకప్పుడును
న ఆసం — లేకుంటిని
(ఇతి) తు — అనునదైతే
న ఏవ — లేనే లేదు.
త్వం — నీవు
న (ఆసీః) — లేకుంటివి
ఇతి — అనునది
న — లేదు.
ఇమే — ఈ
జనాధిపాః — రాజులు
న ఆసన్ — లేకుండిరి
ఇతి — అనునది
న — లేదు.
వయం — మనము
సర్వే — అందరము
అతఃపరం — ఇకముందు
న భవిష్యామః — ఉండబోము
ఇతి చ — అనునదియును
న — లేదు

తా. నేను ఇదివరలో ఒకప్పుడును లేను అనునది లేదు. నీవు లేవు అనునది లేదు. ఈ రాజులు లేరు అనునది లేదు. మనముఁపరము ఇక ముందు ఉండము అనునదియు లేదు. అనగా సర్వేశ్వరుడు నిత్యమగు నట్లు సమస్త జీవులును నిత్యమే యని భావము.

విశే :— దీనవృత్తితో శరణాగతుడగు నర్జునునకు దయామయుడగు సర్వేశ్వరుడు తత్వము నుపదేశించుటలో నీవు, నేను అనుటచే ఆత్మలకు పరమాత్మతోను, నీవును యీ రాజులున్న అనుటచే తమలో తమకున్న సత్యమగు భేదము కలదని యీ శ్లోకముచే స్ఫుటముగా సూచింపబడినది.

అవ. శ్రీకృష్ణుడు ఆత్మకు పుట్టుట గిట్టుట మొదలగు అవస్థలను దృష్టాంతముతో సమర్థించుచున్నాడు :

**13.** శ్లో. దేహినో ఽస్మిన్ యథా దేహే। కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిః । ధీర స్తత్ర న ముహ్యతి ॥

అర్థము :-
అస్మిన్ — ఈ
దేహే — దేహమున
దేహినః — ఆత్మకు
యథా — ఏవిధముగా
కౌమారం — బాల్యము
యౌవనం — యౌవనము
జరా — ముసలితనము
భవంతి — కలుగుచున్నవో
తథా — ఆ విధముగనే
దేహాంతర ప్రాప్తిః—మరియొక దేహమును పొందుటయు
భవతి — కలుగుచున్నది.
తత్ర — ఇట్టి విషయమున
ధీరః — బుద్ధిమంతుడు
న ముహ్యతి — మోహమును చెందడు.

తా. శరీరమునకు బాల్యావస్థ, యౌవనావస్థ, వృద్ధావస్థ కలుగుచున్నట్లే మరియొక శరీరమును పొందుటయు తటస్థించుచున్నది. ఇట్టి విషయమున జ్ఞాని భ్రమను చెందడు.

శ్రీకృష్ణుడు అర్జునునకు ద్వంద్వములను సహించమని విధించుచున్నాడు

**14.** శ్లో. మాత్రా-స్పర్శాస్తు కౌంతేయ ।
శీతోష్ణ - సుఖ - దుఃఖదాః ।
ఆగమా పాయినో ఽనిత్యాః ।
తాం స్తితిక్షస్వ భారత ॥

అర్థము :-
హే కౌంతేయ — ఓ అర్జునా!
మాత్రా-స్పర్శాః—శబ్దాది విషయములతో శ్రోత్రాది ఇంద్రియములకు గల సంబంధములు
శీతోష్ణ-సుఖ-దుఃఖదాః — చలి-వేడి సుఖము, దుఃఖము అనువానినికలుగజేయునవి
ఆగమాపాయినః—వచ్చుచుపోవుచు యుండునవి,
అనిత్యాః — శాశ్వతములైనవి కావు.
హే భారత — ఓ అర్జునా!
తాన్ — అట్టి వాటిని
తితిక్షస్వ — ఓర్చుకొనుము.

తా. ఓ అర్జునా! పంచతన్మాత్రలు వలన పుట్టిన శబ్దాది విషయములతో శ్రోత్రాది ఇంద్రియములకుగల సంబంధముల శీతోష్ణములను, సుఖ దుఃఖములను కలిగించునవి, అనిత్యములైనవి గాన ఓ అర్జునా! అట్టి వాటిని ఓర్చుకొనుము.

అవ. అట్లు సహించుట వలన కలుగు ఫలమును వివరించుచున్నాడు :

15 శ్లో. యం హి న వ్యథయన్త్యేతే ।
పురుషం పురుషర్షభ ।
సమ - దుఃఖ - సుఖం ధీరం ।
సో ఽమృతత్వాయ కల్పతే ॥

అర్థము :—

| | |
|---|---|
| హే పురుషర్షభ = పురుష శ్రేష్ఠుడవైన ఓ అర్జునా! | పురుషం = పురుషుని |
| ఏతే = ఈ శీతోష్ణ సుఖ దుఃఖాదులు | న వ్యథయంతి = బాధించవో |
| సమ-దుఃఖ-సుఖం=సుఖ దుఃఖములయందు సమబుద్ధిగల | సః హి = అట్టివాడే |
| ధీరం = ధైర్యవంతుడైన | అమృతత్వాయ = మోక్షముకొరకు |
| యం = ఏ | కల్పతే=తగినవాడగుచున్నాడు |

తా. పురుష శ్రేష్ఠుడవైన ఓ అర్జునా ! ఈ శీతోష్ణ సుఖదుఃఖాదులు వీటియందు సమబుద్ధిగల ఏ పురుషుని బాధించ జాలవో అట్టి పురుషుడు మోక్షమునకు యోగ్యుడగుచున్నాడు.

అవ. దేహాత్మల సహజస్వభావము నుపదేశించుచున్నాడు :

16. శ్లో. నాఽసతో విద్యతే భావో ।
నాఽభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽంతః ।
త్వనయో స్తత్త్వదర్శిభిః ॥

అర్థము :—

| | |
|---|---|
| అసతః = నశించునట్టి శరీరమునకు | అనయోః = ఈ |
| భావః = శాశ్వతముగ ఉండుట | ఉభయోః అపి = శరీర ఆత్మల రెండింటి యొక్కయును |
| న విద్యతే = లేదు. | |
| సతః = శాశ్వతముగనుండు జీవాత్మకు | అంతః = నిర్ణయము |
| అభావః = నాశనము | తత్త్వదర్శిభిః = తత్త్వవేత్తలచే |
| న విద్యతే = లేదు. | దృష్టః = చూడబడినది. |

తా. నశించు స్వభావముగల శరీరమునకు శాశ్వతమైన ఉనికి లేదు. శాశ్వతమైన జీవాత్మకు నాశనము లేదు. వీని రెండింటియొక్కయు నిర్ణయమును తత్త్వవేత్తలు తెలుసుకొను చున్నారు.

అవ. ఆత్మ నిత్యమనుటకు ముఖ్య కారణముల నుపదేశించు చున్నాడు:

17. శ్లో. అవినాశి తు తద్విద్ధి ।
యేన సర్వ మిదం తతం ।
వినాశ మవ్యయ స్యాస్య ।
న కశ్చి త్కర్తు మర్హతి ॥

అర్థము :-
యేన = ఏ ఆత్మతత్త్వముచే
ఇదం = ఈ
సర్వం = సమస్త ప్రపంచము
తతం = వ్యాపించబడి యున్నదో
తత్ తు = అట్టి ఆత్మతత్త్వమునైతే
అవినాశి = నాశనము లేని దానినిగా
విద్ధి = తెలుసుకొనుము.
అవ్యయస్య = వినాశనములేని
అస్య = ఈ ఆత్మతత్త్వమునకు
వినాశం = వినాశమును
కర్తుం = చేయుటకు
కశ్చిత్ = ఏదియు
న అర్హతి = తగినది కాదు.

తా. ఏ ఆత్మతత్త్వముచే ఈ సమస్త ప్రపంచము వ్యాపించబడి యున్నదో అట్టి ఆత్మతత్త్వము నాశనము లేనిదని తెలుసుకొనుము. వినాశ రహితమైన ఈ ఆత్మ తత్త్వమును ఏదియు నశింపచేయజాలదు.

అవ. దేహమునకు నశించుటయే స్వభావమని చెప్పుచున్నాడు :

18. శ్లో. అంతవంత ఇమే దేహాః । నిత్య స్యోక్తాః శరీరిణః ।
అనాశినో ఽప్రమేయస్య । తస్మా ద్యుధ్యస్వ భారత ॥

అర్థము:-
నిత్యస్య = నాశనమున కనర్హమైనదిగనుక నే
అనాశినః = నశించనట్టియు
అప్రమేయస్య=భోక్తగా తెలియబడునట్టియు
శరీరిణః = ఆత్మయొక్క
ఇమే = ఈ
దేహాః = దేహములు
అంతవంతః = నశించునట్టివిగా
ఉక్తాః = చెప్పబడినవి.
తస్మాత్ = అందువలన
హే భారత = ఓ అర్జునా !
యుధ్యస్వ = యుద్ధమును చేయుము.

తా. ఓ అర్జునా ! ఆత్మ, నాశనమునకు తగినదికాదు కావున నశించనిది. ఇది భోగ్యమగు శరీరమువలె గాక భోక్తగా తెలియబడునది. ఇట్టి ఆత్మను కలిగియున్న ఈ దేహములు నశించునవని ప్రత్యక్షముగా తెలియుచునేయున్నదిగాన (సంశయమును వదలి) యుద్ధమును చేయుము.

అవ. ఆత్మ నశించుననని తలంచుట యవివేక మనుచున్నాడు :

19. శ్లో. య ఏనం వేత్తి హంతారం । యశ్చైనం మన్యతే హతం ।
ఉభౌ తౌ న విజానీతో । నాయం హంతి న హన్యతే ॥

యః = ఎవడు
ఏనం — ఈ ఆత్మను గూర్చి
(కమపి = శస్త్రాది ఏ సాధనముచేనైనను)
హంతారం = చంపుదానినిగా
వేత్తి = తెలుసుకొనుచున్నాడో
యః చ = ఎవడైతే
ఏనం = ఈ ఆత్మను
హతం = చంపబడిన వానినిగా
మన్యతే = తలచుచున్నాడో
తౌ = అట్టి
ఉభౌ = ఇద్దరును
న విజానీతః = చక్కగా తెలిసిన వారు కారు.
అయం = ఈ ఆత్మ
న హంతి = చంపుటకు నిమిత్తము కాదు.
న హన్యతే = చంపబడదు.

తా. ఆత్మ నిత్యమైనదిగాన అట్టిదానిని నశింపజేయుటకు శస్త్రాదులు సాధనములని తలంచువాడును, ఏదోయొక సాధనముచే ఆత్మనశించుననని తలచువాడును ఈఇద్దరును ఆత్మయొక్క నిజస్వరూపమునెరుంగనివారలే.

ఉపనిషచ్ఛాయగా ఆత్మకు దేహధర్మములను నిరసించుచున్నాడు.

20. శ్లో. నజాయతే మ్రియతే వా కదాచిత్ ।
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతో౽యం పురాణో ।
న హన్యతే హన్యమానే శరీరే ॥

అర్థము :-
అయం = ఈ ఆత్మ
న జాయతే = పుట్టువాడునుకాడు.
న మ్రియతే వా = చచ్చువాడును కాడు.
కదాచిత్ = ఒకప్పుడు
భూత్వా = పుట్టి
భూయః = తిరిగి
న భవితా వా న = లేకపోవువాడును కాడు.
అయం = ఈ ఆత్మ
అజః = పుట్టుకలేనివాడు,
నిత్యః = త్రికాలములయందును ఉండువాడు.
శాశ్వతః = స్థిరముగ నుండువాడు.
పురాణః = ఎప్పుడును క్రొత్తగా అనుభవింపబడువాడు.
శరీరే = (ఇతనుండు) దేహము
హన్యమానే (సత్యపి) = చంపబడుచున్నను
న హన్యతే = చంపబడడు.

తా. ఈ ఆత్మ పుట్టదు. చావదు. ఒకప్పుడు పుట్టి మరొకప్పుడు లేకుండను పోదు. ఈ ఆత్మ జన్మరహితమైనది, నాశనరహితమైనది, పరిణామశూన్యమైనది; ఎప్పటికిని క్రొత్తగనే అనుభవనీయము. తానున్న శరీరము చంపబడినను తాను చంపబడదు.

అవ. ఆత్మను చంపుదునని తలంచువాడజ్ఞుడనుచున్నాడు :

21. శ్లో. వేదా వినాశినం నిత్యం । య ఏన మజ మవ్యయం ।
కథం స పురుషః పార్థ । కం ఘాతయతి హంతి కం ॥

అర్థము :-
హే పార్థ = ఓ అర్జునా!
యః = ఏవడు
ఏనం = ఈ ఆత్మను
అవినాశినం — నాశనములేని వానినిగను
అజం — పుట్టుకలేని వానినిగను
అవ్యయం — స్థిరమైన వానినిగను
నిత్యం — త్రికాలములయందుండు వానినిగను
వేద = తెలుసుకొనుచున్నాడో
సః — ఆ
పురుషః — పురుషుడు
కథం = ఎట్టుగా
కం — ఏ ఆత్మను
ఘాతయతి = చంపించును ?
కం = ఏ ఆత్మను
హంతి = చంపును?

తా. ఓ అర్జునా ! ఎవడు ఈ ఆత్మను నాశ రహితునిగను, పుట్టుకలేని వానినిగను, స్థిరరూపునిగను, నిత్యునిగను తెలుసుకొనుచున్నాడో, అట్టి పురుషుడు ఏ ఆత్మను ఎటుల ఎవరిచే చంపించును ? ఏ ఆత్మను తాను చంపకలుగును?

అవ. ఆనందించ దగిన దానినిగూర్చి దుఃఖించుట తగదనుచున్నాడు:

22.శ్లో.వాసాంసి జీర్ణాని యథా విహాయ।నవాని గృహ్ణాతి నరో௨పరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా।న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

అర్థము :-
నరః = నరుడు
యథా = ఏ విధముగా
జీర్ణాని = శిథిలములైన
వాసాంసి = వస్త్రములను
విహాయ = విడిచి
నవాని = క్రొత్తవియగు
అపరాణి = ఇతర వస్త్రములను
గృహ్ణాతి = స్వీకరించుచున్నాడో
తథా = అదే విధముగ
దేహీ = జీవుడు
జీర్ణాని = శిథిలములైన
శరీరాణి = దేహములను
విహాయ = విడిచి
నవాని = క్రొత్తవియగు
అన్యాని + ఇతర దేహములను
సంయాతి = చక్కగ పొందుచున్నాడు.

తా. మానవుడు శిథిలములైన వస్త్రములను వదలి వేరగు క్రొత్త వస్త్రముల ధరించుచున్నటులనే ఈ జీవుడును శిథిలములగు ఈ శరీరములను విడిచి నూతనమైన ఇతర దేహములను పొందును.

ఆత్మ అన్నిటికంటె సూక్ష్మమై అంతటను వ్యాపించియుండుటచే
నాశకములగు శస్త్రాదులు దీనిని నశింపచేయజాల వనుచున్నాడు.

23. శ్లో. నైనం ఛిందంతి శస్త్రాణి । నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయం త్యాపో।న శోషయతి మారుతః ॥

అర్థము :-
ఏనం = ఈ జీవుని
శస్త్రాణి = ఆయుధములు
న ఛిందంతి = నరుక లేవు.
పావకః = అగ్ని
ఏనం = ఈ జీవుని
న దహతి=కాల్పజాలదు.
ఏనం = ఈ జీవుని
ఆపః = ఉదకములు
న క్లేదయంతి =తడుపజాలవు.
మారుతః = వాయువు
న శోషయతి = ఆర్పివేయ జాలదు.

తా. ఈ జీవుని ఆయుధములు ఖండించ జాలవు. అగ్ని కాల్ప జాలదు. ఉదకములు తడుప జాలవు. వాయువు ఆర్పి వేయ జాలదు.

ఆత్మ నశించ దగిన యోగ్యతలేని దగుటచే నిది వేనిచేతను
నశింపజేయ బడదనుచున్నాడు :

24. శ్లో. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ।మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్య స్సర్వ గతః స్థాణు। రచలోఽయం సనాతనః ॥

అర్థము :-
అయం = ఈ యాత్మ
అచ్ఛేద్యః = ఖండింప తగనిది.
అయం = ఈ యాత్మ
అదాహ్యః = కాల్పతగనిదియు
అక్లేద్యః = తడుప తగనిదియు
అశోష్య ఏవచ = ఆర్పవేయ తగనిదియు
(భవతి = అగుచున్నది)
అయం = ఈ ఆత్మ
నిత్యః = నిత్యమైనది.
స్థాణుః = స్థిరమైనది.
అచలః = చలింపనిది.
సనాతనః = పురాతనమైనది.

తా: ఈ యాత్మ ఖండించుటకుగాని, కాల్చుటకుగాని, తడుపుటకుగాని, ఆర్పివేయుటకు గాని తగినది కాదు. ఏలనన ఇది నిత్యమై, స్థిరమై, చలించనిదై, అనాదియై యున్నది.

అవ. ఇట్లు ఆత్మ నిత్యమగుటచే శోకము తగదను ఉపదేశమును
విరమించు చున్నాడు:

24. శ్లో. అవ్యక్తోఽయ మచింత్యోఽయం । అవికార్యోఽయ ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం । నానుశోచితు మర్హసి ॥

అర్థము :-
అయం — ఈ ఆత్మ
అవ్యక్తః — అగోచరుడు.
అయం — ఈ ఆత్మ
అచింత్యః — ఊహాతీతుడు.
అయం — ఈ ఆత్మ
అవికార్యః — వికారముల చెందనివాడు(అని)
ఉచ్యతే — చెప్పబడుచున్నాడు.
తస్మాత్ — అందువలన
ఏనం — ఈ ఆత్మను
ఏవం — యిట్టివానినిగా
విదిత్వా — తెలుసుకొని
అనుశోచితుం — దుఃఖించుటకు
న అర్హసి — తగవు

తా. ఈ ఆత్మ జ్ఞానేంద్రియములకు గోచరించడు. మనస్సున కందడు. కర్మేంద్రియములచే వికారముల బొందింపబడడు అని చెప్పబడు చున్నాడు. గాన వీనినిగూర్చి నీవు దుఃఖించుట తగదు.

అవ. శరీరమునే యాత్మగా నంగీకరించినను ఈ దుఃఖము తగదనుచున్నాడు :

26. శ్లో. అథ చైనం నిత్య-జాతం । నిత్యం వా మన్యసే మృతం ।
తథాపి త్వం మహాబాహో। నైవం శోచితు మర్హసి ॥

అర్థము :-
నిత్యజాతం — ఎప్పుడునుపుట్టుచుండు నట్టియు
నిత్యం — ఎప్పుడును
మృతం వా—నశించుచున్నట్టి దేహమును
ఏనం — ఈ ఆత్మనుగా
అథ మన్యసే — తలంతువేని
తథాపి — అట్లైనను
హే మహాబాహో — గొప్పభుజములుగల ఓ అర్జునా !
త్వం — నీవు
ఏవం — ఈ విధముగా
శోచితుం — దుఃఖించుటకు
న అర్హసి — తగవు.

తా. బాహుబలముగల ఓ అర్జునా ! ఎల్లప్పుడు పుట్టుచుండునట్టియు ఎల్లప్పుడు నశించునట్టియు దేహమునే ఆత్మగా తలంతువా అట్లైనను ఈ విధముగా నీవు దుఃఖించ తగదు.

అవ. దానినే సమర్థించుచున్నాడు :

27. శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యుః ।
ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మా దపరిహార్యే ఽర్థే ।
న త్వం శోచితు మర్హసి ॥

అర్థము :-

| | |
|---|---|
| జాతస్య — పుట్టువానికి | తస్మాత్ — అందువలన |
| మృత్యుః — నాశనము | అపరిహార్యే — నివారింపబడజాలని |
| ధ్రువః హి — నిశ్చయముకదా. | అర్థే — వికారము విషయమై |
| మృతస్య — నశించినవానికి | త్వం — నీవు |
| జన్మ చ — పుట్టుకయు | శోచితుం — దుఃఖించుటకు |
| ధ్రువం — నిశ్చయము. | న అర్హసి — తగవు |

తా. పుట్టినవానికి చావు తప్పదు. చచ్చినవానికి పుట్టుక తప్పదు. గాన నివారించుటకు అవకాశము లేని దాని విషయమై నీవు దుఃఖించుట తగదు.

28. శ్లో. అవ్యక్తాదీని భూతాని ।
వ్యక్త-మధ్యాని భారత ।
అవ్యక్త-నిధనా న్యేవ ।
తత్ర కా పరిదేవనా ॥

అర్థము :-

| | |
|---|---|
| హే భారత — ఓ అర్జునా ! | అవ్యక్త నిధనాని ఏవ—తెలియబడని నాశావస్థ కలవియును |
| భూతాని — మనుష్యాది శరీరములు | (భవంతి — అగుచున్నవి) |
| అవ్యక్తాదీని — తెలియరాని ప్రారంభావస్థ కలవియు | తత్ర — అట్టివాని విషయమున |
| వ్యక్త మధ్యాని—తెలియబడు మధ్యావస్థకలవియు | పరిదేవనా — దుఃఖము |
| | కా — ఏమి ? |

తా. ఓ అర్జునా ! ఈ శరీరముల ప్రారంభావస్థ తెలియబడదు. మధ్యమావస్థ మాత్రము తెలియబడును. నాశావస్థయు తెలియబడదు. ఇట్టి వాని విషయమున దుఃఖ మెందులకు ?

అవ. ఆత్మ నెఱుంగు అధికారి దుర్లభమనుచున్నాడు :

28. శ్లో. ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనం ।
ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి ।
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥

ఆశ్చర్యవత్=అద్భుత వస్తువువలె నుండు
ఏనం = ఈ ఆత్మను
కశ్చిత్ = ఎవడో ఒకడు
పశ్యతి=చూచుచున్నాడు.
తథా ఏవ చ = ఆ విధముగానే
అన్యః = మరి యొకడు
ఆశ్చర్యవత్ = ఆశ్చర్యమునుకలిగించు వస్తువునుగూర్చివలె
వదతి = చెప్పుచున్నాడు.
అన్యః చ = మరియొకడున్ను
ఆశ్చర్యవత్ =ఆశ్చర్యమును కలిగించు వస్తువును వలె
ఏనం — ఈ ఆత్మను గూర్చి
శృణోతి — వినుచున్నాడు.
కశ్చిత్ చ = ఎవడు కూడ
ఏనం = ఈ ఆత్మనుగూర్చి
శ్రుత్వాపి = వినినను
న వేద ఏవ = ఎరుగనే ఎరుగడు.

తా. ఈ ఆత్మ ఆశ్చర్యభూతమైనది. దీనిని ఎవడో వకడు చూడ కలుగుచున్నాడు. అటులనే మరి యొకడు దీనినిగూర్చి చెప్ప కలుగుచున్నాడు. అటులనే మరి యొకడు దీనినిగూర్చి వినుచున్నాడు. గాని ఎవడును దీనినిగూర్చి వినిననూ పూర్తిగా ఎరుగనే ఎరుగడు.

అవ. ఇట్లు అర్జునుని దుఃఖము "అనార్యజుష్టం" అనెడు ఆక్షేపమును ఉపసంహరించు చున్నాడు :

30. శ్లో. దేహీ నిత్య మవధ్యోఽ యం । దేహే సర్వస్య భారత ।
తస్మా త్సర్వాణి భూతాని । న త్వం శోచితు మర్హసి ॥

హే భారత = ఓ అర్జునా !
సర్వస్య = ప్రతివానియొక్కయు
దేహే = దేహమందున్న
అయం = ఈ
దేహీ = ఆత్మ
నిత్యం = ఎప్పటికిన్ని
అవధ్యః = చంపబడనివాడు.
తస్మాత్ = అందువలన (త్వం=నీవు)
సర్వాణి = సమస్తమైన
భూతాని = జీవులను గూర్చియు
శోచితుం = దుఃఖించుటకు
న అర్హసి = తగవు.

తా. ఓ అర్జునా! దేహము వధింపబడుచున్నను అందున్న ఈ ఆత్మ ఎన్నటికిని చంపబడ జాలదు. గాన ఏ ఆత్మనుగూర్చియైనను నీవు దుఃఖించుట తగదు.

అర్జునుని దుఃఖము పరలోకవిరోధియను ఆక్షేపమును సమర్థించుచున్నాడు:

31. శ్లో. స్వధర్మమపి చావేక్ష్య।
న వికంపితుమర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్।
క్షత్రియస్య న విద్యతే॥

అర్థము :-

(త్వం = నీవు)
స్వధర్మం = స్వకీయ ధర్మమును
అవేక్ష్య అపి చ = పర్యాలోచించినను కూడ
వికంపితుం = చలించుటకు
న అర్హసి = తగవు
క్షత్రియస్య = క్షత్రియునికి
ధర్మ్యాత్ = న్యాయముగ ప్రవర్తించిన
యుద్ధాత్ = యుద్ధముకంటె
అన్యత్ = ఇతరమైన
శ్రేయః = మంచికార్యము
న విద్యతే హి = లేదు కదా.

తా. మరియు నీవు నీ స్వకీయ కర్తవ్యమును పర్యాలోచించినను యుద్ధమునుండి చలించుట తగదు. క్షత్రియునికి న్యాయముగ తటస్థించిన యుద్ధముకంటె వేరగు శ్రేయస్సు లేదు కదా?

32. శ్లో. యదృచ్ఛయా చోపపన్నం।
స్వర్గద్వారమపావృతం।
సుఖినః క్షత్రియాః పార్థ।
లభంతే యుద్ధమీదృశం॥

అర్థము :-

హే పార్థ = ఓ అర్జునా!
యదృచ్ఛయా = అదృష్టవశమున
ఉపపన్నం = లభించినట్టియు
అపావృతం = ఆటంకము తొలగించబడిన
స్వర్గద్వారం = స్వర్గప్రాప్తికి ద్వారమగునట్టి
ఈదృశం = ఇట్టి
యుద్ధం = యుద్ధమును
సుఖినః = సౌఖ్యవంతులైన
క్షత్రియాః = క్షత్రియులు
లభంతే = పొందుచున్నారు.

తా. ఓ అర్జునా! ఈ యుద్ధము నీకు అదృష్టవశమున లభించినది. స్వర్గ ప్రాప్తికి నిరాటంకముగు కారణమైనట్టి ఇట్టి యుద్ధమును పుణ్యశాలులైన క్షత్రియులు మాత్రమే పొందగలుగుచున్నారు.

అవ. అర్జునుని దుఃఖము అపకీర్తికరమను ఆక్షేపమును
సమర్థించుచున్నాడు :

33. శ్లో. అథ చే త్త్వం ధర్మ్య మిమం ।
సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తిం చ ।
హిత్వా పాప మవాప్స్యసి ॥

అర్థము :-

అథ = మరియు
త్వం = నీవు
ధర్మ్యం = ధర్మయుక్తమైన
ఇమం = ఈ
సంగ్రామం = యుద్ధమును
న కరిష్యసి చేత్ = చేయవైతివి వేని
తతః = ఆ కారణము వలన
స్వధర్మం = స్వకీయ క్షత్రియ ధర్మమును
కీర్తిం చ = కీర్తినిన్ని
హిత్వా = పోగొట్టుకొని
పాపం = పాపమును
అవాప్స్యసి — పొందెదవు.

తా. మరియు నీవు తనంతటతానే తటస్థించిన ఈ ధర్మయుద్ధమును చేయక పోతివేని అందువలన నీ క్షత్రియ ధర్మమును, కీర్తిని పోగొట్టుకొందువు. పైగా పాపమును పొందెదవు

34. శ్లో. అకీర్తిం చాపి భూతాని । కథయిష్యంతి తే ఽవ్యయాం ।
సంభావితస్య చాకీర్తిః । మరణా దతిరిచ్యతే ॥

అర్థము :-

అపి చ — ఇంతే గాక
భూతాని — ప్రాణులు
తే — నీయొక్క
అవ్యయాం — నాశ రహితమైన
అకీర్తిం — అపకీర్తిని
కథయిష్యంతి — చెప్పుచుండగలరు.
సంభావితస్య — గౌరవింప బడినవానికి
అకీర్తిః — అపకీర్తి
మరణాత్ చ — మరణముకంటెను
అతిరిచ్యతే = అధికమైన దగుచున్నది.

తా. ఇంతేగాక ప్రాణికోటి శాశ్వతమైన నీ అపకీర్తిని చెప్పుచుండ గలదు. గౌరవమును సంపాదించిన వానికి అపకీర్తి మరణము కంటెను గూడ అధిక బాధకరమైన దగుచున్నది,

35. శ్లో. భయా ద్రణా దుపరతం ।
మంస్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో ।
భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

అర్థము :-

| | |
|---|---|
| యేషాం — ఎవరికి | మహారథాః — దుర్యోధనాది మహారథులు |
| త్వం = నీవు | త్వాం — నిన్ను |
| బహుమతః—మిక్కిలికొనియాడబడినవాడవు | భయాత్ — భయము వలన |
| భూత్వా — అయియుండి | రణాత్ — యుద్ధమునుండి |
| లాఘవం — చులక తనమును | ఉపరతం — విరమించిన వానినిగా |
| యాస్యసి = పొందగలవో | మంస్యంతే = తలంతురు. |
| ( తే = అట్టి ) | |

తా. దుర్యోధనాది మహారథులు నిన్ను గొప్పగా తలంచి యున్నారు' వారే యిపుడు నిన్ను చులకనగ జూతురు. మరియు నిన్ను భయము వలన యుద్ధమునుండి విరమించిన వానినిగా తలంతురు.

36. శ్లో. అవాచ్యవాదాం శ్చ బహూన్ ।
వదిష్యంతి తవాహితాః ।
నిందంత స్తవ సామర్థ్యం ।
తతో దుఃఖతరం ను కిమ్ ॥

అర్థము :-

| | |
|---|---|
| తవ— నీ యొక్క | అవాచ్యవాదాన్ — ఆడరానిమాటలను |
| అహితాః — శత్రువులు | వదిష్యంతి — పలికెదరు. |
| తవ = నీ యొక్క | తతః — అంతకంటెను |
| సామర్థ్యం — శక్తిని | దుఃఖతరం — అధిక దుఃఖమును కలిగించునది |
| నిందంతః — నిందించుచున్నవారై | |
| బహూన్ — అనేకములైన | కిం ను — ఏమి కలదు? |

తా. నీ శత్రువులు నీ శక్తిని నిందించుచు అనరాని మాటల నందురు. అంత కంటెను దుఃఖమును కలిగించు విషయమేమి కలదు ?

అవ. యుద్ధమున చంపుటయు చచ్చుటయును శ్రేయస్సాధనములే యను చున్నాడు :

37. శ్లో. హతో వా ప్రాప్స్యసి స్వర్గం ।
జిత్వా వా భోక్ష్యసే మహీం ।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ ।
యుద్ధాయ కృత - నిశ్చయః ॥

అర్థము :-
హతః వా = చంపబడితివా
స్వర్గం = పరమ నిశ్శ్రేయసస్థానమును
ప్రాప్స్యసి = పొందగలవు.
జిత్వా వా = (శత్రుల) జయించియో
మహీం = భూమిని
భోక్ష్యసే = అనుభవింతువు.
తస్మాత్ = అందువలన
కౌంతేయ = వీరపుత్రా, అర్జునా !
యుద్ధాయ = యుద్ధము కొరకు
కృత నిశ్చయః = నిశ్చయించు కొనినవాడవై
ఉత్తిష్ఠ = లెమ్ము.

తా. ఓ అర్జునా ! శత్రువులచే నీవు చంపబడితివా, మోక్షమును పొందగలవు. శత్రువులను నీవేజయించితివా, రాజ్యమును అనుభవించ గలవు. కావున యుద్ధము జేయ నిశ్చయించుకొనిన వాడవై లెమ్ము.

అవ. ముముక్షువు తన వర్ణాశ్రమ ధర్మముల నాచరించవలసిన రీతి నుపదేశించుచున్నాడు :

38. శ్లో. సుఖ - దుఃఖే సమే కృత్వా ।
లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ ।
నైవం పాప మవాప్స్యసి ॥

అర్థము :-
సుఖ దుఃఖే = సుఖమును దుఃఖమును
సమే = సమమైన వాటినిగా
కృత్వా = చేసి
లాభా లాభౌ = లాభ నష్టములను
జయా జయౌ = గెలుపును ఓడుటను
(సమాకృత్వా = సమమైనవాటినిగాచేసి)
తతః = అందువలన
యుద్ధాయ = యుద్ధము కొరకు
యుజ్యస్వ = సిద్ధపడుము.
ఏవం = ఇట్లాచరింతు వేని
పాపం = సంసారమును
న అవాప్స్యసి = పొందకుందువు.

తా. సుఖ-దుఃఖములను, లాభ-నష్టములను; జయ-అపజయములను సమానమైనవిగా ఎంచి కర్తవ్యబుద్ధితో యుద్ధము నారంభింపుము. ఇట్లు చేసినచో పాప రూపమగు సంసారమును పొందవు.

అవ. ఆత్మతత్త్వోపదేశమును ముగించి దానిని పురస్కరించుకొని సాధింపదగు కర్మయోగము నుపదేశించుచున్నాడు :

39. శ్లో. ఏషా తే ఽభిహితా సాంఖ్యే । బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ । కర్మబంధం ప్రహాస్యసి ॥

అర్థము :—
పార్థ — అర్జునా !
సాంఖ్యే — ఆత్మతత్త్వము విషయమైన
ఏషా — ఈ చెప్పబడిన
బుద్ధిః — జ్ఞానము
తే — నీకు
అభిహితా — చెప్పబడినది.
యయా — ఎట్టి
బుద్ధ్యా — జ్ఞానముతో
యుక్తః — కూడినవాడవై
కర్మబంధం — సంసార బంధమును
ప్రహాస్యసి — విడిచెదవో.
యోగే తు—అట్టిబుద్ధియోగవిషయమైనదే
ఇమాం—ఈ చెప్పబోవునట్టి బుద్ధిని
శృణు — వినుము.

తా. ఓ అర్జునా ! కర్మయోగానుష్ఠానమునకు ముందు ఆత్మతత్త్వజ్ఞాన ముండవలెను, కావున దాని కవసరమైన జ్ఞానము "నత్వేవాహం (౨ అ, ౧౨ శ్లో) మొదలు "న త్వం శోచితుమర్హసి" (౨అ. ౩౦శ్లో) వరకు నీకు చెప్పబడినది. ఆత్మజ్ఞానముతో కూడుకున్నదై కర్మబంధ మును పూర్తిగా విడిపించు జ్ఞానము నికమీద చెప్పబోవుచున్నాను. దీనిని వినుము.

అవ. కర్మయోగ ప్రభావము నెరింగించుచున్నాడు :

40. శ్లో. నేహాభిక్రమనాశో ఽస్తి । ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య । త్రాయతే మహతో భయాత్ ॥

అర్థము —
ఇహ — ఈ కర్మయోగమునందు
అభిక్రమనాశః — ప్రారంభింపబడిన కర్మ ఫలమీయకుండుట (నిష్ఫలత్వము)
నాస్తి — లేదు.
ప్రత్యవాయః — పాపము
న విద్యతే — లేదు.
అస్య — ఈ
ధర్మస్య — కర్మయోగముయొక్క
స్వల్పమపి — కొద్ది భాగమైనను
మహతః — గొప్పదియగు
భయాత్ — సంసార భయమునుండి
త్రాయతే — కాపాడుచున్నది.

తా. ఈ కర్మయోగము నారంభించి కడవరకు నాచరించలేకపోయినను నిష్ఫలము కాదు, మధ్య చెడినందు వలన పాపము సంభవించదు. దీనిని కొలదిగ నాచరించినను ఆ మాత్రమే మహత్తరమైన సంసార భయము నుండి రక్షించును.

# సాంఘిక వార్తలు

## బదరీ అష్టాక్షరీక్షేత్రము

కృష్ణాజిల్లా కవుతరం గ్రామ వాస్తవ్యురాలగు శ్రీమతి కాజ దుర్గమ్మగారు బదరిలో శ్రీమన జియర్‌స్వామివారు కట్టించుచున్న అష్టాక్షరీక్షేత్రములో ఒకగది కట్టించుటకు 3500/లరూపాయలిత్తుమని వాగ్దానముచేసిరి. శ్రియఃపతి యీమెకుశుభములు ప్రసాదించుగాక !

**శ్రీకాకుళములో:—** ఇచ్చట శ్రీకోదండ రామస్వామివారి ఆలయప్రపన్నత కార్యనిర్వాహక వర్గమువారు 14-8-57 వతేదీనాడు శ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి తిరునక్షత్రమును మహావైభవముగా జరిపిరి. ఈ ఆలయముయొక్క ప్రపన్నత జేయు కార్యక్రమము చురుకుగా సాగుచున్నది. అవసరమగు విగ్రహములు తిరుపతిలో తయారు చేయబడుచున్నవి. శ్రీ రామపురములో ఉచితముగ సమర్పింపబడిన ధ్వజస్థంభమునకు దారసంస్కారోత్సవము జరుపబడినది.

**శ్రీ కూర్మము :—** ఇచ్చట ఆలయములో సమిష్టి శ్రీ విష్ణుసహస్రనామ పారాయణము, శ్రీ రామానుజ పారాయణము, హరేరామ నామసంకీర్తనము, శుక్రవారం పూజలు, స్త్రీలు, పురుషులు, వైశ్యులు, పిల్లలు కలసి ఉత్సాహముగా శ్రీ. వి. ప్ర. సం. సారముగా చేయుచున్నారు. శ్రీకూర్మనాధుని సన్నిధిలో ప్రతిష్ఠింప దలచిన గ్రామస్థులు సమర్పించిన ధ్వజస్థంభపు సంస్కారము జరుగుచున్నది.

**బందరు:—** ఇచ్చట చల్లరాస్తా శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలో శ్రీయతిరాజసేవా మండలి వారు సప్తమ శుక్రవారోత్సవ వార్షికసభలు మహావైభవముగా జరిపిరి. పెక్కురు విద్వాంసులు, విదుషీమణులు ఉపన్యసించిరి.

**బరంపురం :—** ఇచ్చట శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయములో శ్రీమతి తి. పె. అధ్యక్షతలో శ్రీ మహిళాసంఘమువారు శుక్రవారోత్సవ వార్షికసభలు జరిపిరి. పెక్కురు విదుషీమణులు ఉపన్యసించిరి.

**మదరాసు:—** గీతామందిరములో శ్రీ యతిరాజసేవా మహిళామండలి వారు కణ్ణన్ విలక్షణముగా జరిపిరి. గీతామందిరమును స్థానికభక్తుల సహాయముచే నింకను విశాలము, సుందరముగను కార్యకర్తలు శ్రోత్రజనము కూర్చొనుటకు వీలుగా హాలును సువిశాలముగావించిరి.

## శ్రీవరామానుజ స్వామివారల శాశ్వత, లిక, పూజా విరాళములు

ఏలూరు - శ్రీ ...శాళీ పార్థసారధిగారు, అడ్వకేటు. శ్రీ తల్లిగారి గోత్రనామములతో శాశ్వతపూజకు రు. 116-0-0

### తాత్కాలికపూజలు

| | |
|---|---|
| అనపర్తి - శ్రీసత్తి సూరారెడ్డిగారు, | 11-0-0 |
| అనపర్తి - శ్రీకర్రి అమ్మాయిగారు | 11-0-0 |
| విజయవాడ - శ్రీఇమ్మడిశెట్టి పుల్లయ్యగారు | 11-0-0 |
| రాజమండ్రి - శ్రీకోదాట వీరభద్రరావుగారు | 11-0-0 |
| చుండూరు - శ్రీగుడేటి సీతారామమ్మగారు | 11-0-0 |

### కట్నాలు

నెల్లూరు - శ్రీ. కనుమూరి శ్రీనివాసాచార్యులుగారు శుక్రవారపూజా కట్నం. 1-0-0

శ్రీకూర్మం: - శ్రీమహిళాసంఘమువారు. శ్రీ. కం. శ్రీనివాసాచార్యస్వామివారి ద్వారా పంపినశుక్రవారపూజకట్నం 14-0-0

ఇచ్ఛాపురం...దరు - శ్రీ యం. సీతమ్మగారు మహిళా సంఘము తరపున పంపిన కట్నం 5-0-0 పండిట్

సన్యాసిగారు, ఆశ్రమం - మహిళాసంఘము పాదుకాస్థాపన కట్నం. 2-8-0 భావ్య...



ఈమె కీ. శే. కవయిత్రి శ్రీమతి మామిడన్న సుభద్రమ్మగారు, వెలనాటి నియోగి బ్రాహ్మణ కుటుంబములో జన్మించెను. బరంపురంవాస్తవ్యులగు రిటైర్డుజడ్జి శ్రీమాన్ మామిడన్న వెంకటనారాయణగారు, ఈమె పౌత్రులు. ఈమె 16వయేట నే పతి, సుత, వియోగమునొందెను. తదాది జీవితము ఆధ్యాత్మికముగా గడుపుచు, అధ్యాత్మరామాయణమును, గీతను, గాయిత్రీ రామాయణము ద్విపదగా రచించెను. ఈమె రామాయణము మద్రాసుయూనివర్సిటీవారిచే B. A. కు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడెను. ఈమె 80 సంవత్సరములు జీవించి, తుదకు అనాయాస





# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]



| సంపుట ౧౦ | హేవళంబి – ఆశ్వయుజము | సంచిక ౭ |
| --- | --- | --- |

సంపాదకులు :
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు



# బదరినారాయణ మండలి

# శ్రీ శ్రీనివాస రామానుజస్వామివారి కైంకర్యము

శ్రీమతే రామానుజాయనమః

బదరి నారాయణ మండలి శ్రీ శ్రీనివాస రామానుజ స్వామివార్ల సన్నిధియందు తమ తమ గోత్ర నామములతో పూజలు తాత్కాలికముగ జరుగుటకుగాను కొంతమందియు, శాశ్వతముగ జరుగుటకుగాను కొంతమందియు విరాళములు నిచ్చియున్నారు. కొంతమంది యింతవరకు కొంత ద్రవ్యమును మాత్రమే యిచ్చి మిగతది వాయిదాలమీద నిచ్చుటకు వాగ్దానముల నొసర్చియున్నారు. ఈ సంవత్సరమున వీరందరి గోత్రనామములతోను బదరీనారాయణమున శ్రీ శ్రీనివాస రామానుజ స్వామి వారల పూజలను అర్చనారాధనాధికములను శ్రీ. ఉ. వే. శ్రీమాన్. తె. కం. గోపాలాచార్యులుగారు బదరినారాయణమున నే వేంచేసి యుండి స్వయముగా అతివైభవముగ జరిపించుచున్నారు.

మరియు ఈ మధ్యనే అయిదు రోజులు అచ్చట అధ్యయనోత్సవము, శ్రీ అండాళ్ తిరునక్షత్రము పిమ్మట కణ్ణన్ తిరునక్షత్రము అయిర సేవకాలము ఇత్యాదులు శ్రీ. తె. కం. గోపాలాచార్యులుగారి ఆధ్వర్యమున బహు చక్కగ జరిగినవి. శరన్నవరాత్రోత్సవములు వైభవముగా జరుపుట కేర్పాట్లు చేయబడినవి.

కాని ఈ సంవత్సరమున రావలసియుండిన తాత్కాలిక పూజ విరాళములుగాని, శాశ్వత పూజల నిధి మిగిలిన సొమ్మును గాని యింతవరకు మా వద్దకు చేరలేదు. అయినను అందరియొక్క పేర్లను మేము బదరి నారాయణకు పంపివేసితిమి. అందరియొక్క గోత్రనామములతోను పూజలు జరిగినవని, ఇంకను జరుగుచున్నవి. అందరి దాతలకును తమతమ విరాళములను పంపమని వ్రాయుచు అందులో కలిపి ఖాళీ మణియార్డరు ఫారములను కూడ పంపితిమి. గాన దాతలందరును తమతమ విరాళములను వెంటనే ఇచ్చుటకు మా వద్దకు గాని లేక శ్రీ. శ్రీ. శ్రీమాన్. తె. కం. గోపాలాచార్య స్వామివారు, బదరినాథ్ గార్వాలా జిల్లా. యు. పి. అను చిరునామాకు గాని వెంటనే పంపగోరుచున్నాము.

శ్రీ. ఉ. వె. శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారు బదరి నుండి యిచ్చటకు వేంచేయునప్పుడు శ్రీ శ్రీనివాస రామానుజ స్వామివారి ప్రసాదమును తీసుకొని వచ్చి దాతలందరకును పంపగలరు.

కార్యాలయము:—
శ్రీవాసుదాసాశ్రమము, నడిగడ్డపాలెము.
చుండూరుపోస్టు, గుంటూరుజిల్లా

శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయ్యర్
స్వామివారి అనుజ్ఞతో
కవిరత్న. గుదిమెళ్ల రామానుజాచార్యులు

అవ. కర్మయోగికి ముఖ్యతమమైన 'వ్యవసాయాత్మిక బుద్ధిని'
విధించుచున్నాడు.

41 శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధిః । ఏకేహ కురునందన ।
బహుశాఖా హ్యనంతాశ్చ। బుద్ధయో ఽవ్యవసాయినాం॥ 88

అర్థము :-

కురునందన — ఓ అర్జునా !
ఇహ — ఈ కర్మయోగమున
వ్యవసాయాత్మికా—నిశ్చయరూపమైన
బుద్ధిః — జ్ఞానము
ఏకా — ఒక్కటియే
(భవతి —అగుచున్నది.)
అవ్యవసాయినాం—అట్టి నిశ్చయజ్ఞానము లేని వారలయొక్క
బుద్ధయః — జ్ఞానములు
అనన్తాః — పెక్కులున్న
బహుశాఖాః చ — అనేక విధములైనవియు
(భవంతి — అగుచున్నవి)

తా. ఓ అర్జునా! ఈ కర్మానుష్ఠానమున ఆత్మస్వరూప యాథాత్మ్య నిశ్చయపూర్వకమైన ముముక్షుత్వ బుద్ధి ఒకే విధముగ నుండును. ఆత్మ స్వరూప నిశ్చయము లేనివారియొక్క బుద్ధులు వారు వారు కోరు ఫలముల ననుసరించి అనేకములై యుండును.

అవ. కామ్యకర్మాధికారులను నిందించుచున్నాడు :

42 శ్లో. యామిమాం పుష్పితాం వాచం ।
ప్రవదంత్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార ।
నాన్యదస్తీతి వాదినః ॥ 89

అర్థము :-

పార్థ — అర్జునా !
వేదవాదరతాః—వేదవాక్యములయందు అనురక్తిగలవారును
అన్యత్ — వేరొకఫలము
నాస్తి ఇతి — లేదని
వాదినః — పలుకువారున్న (అగు)
అవిపశ్చితః — అజ్ఞానులు
యాం — యే
ఇమాం — ఈ
పుష్పితాం — పైకి యింపుగా తోచెడు
వాచం — వాక్యమును
ప్రవదంతి — పలుకుచున్నారో

తా. ఓ అర్జునా!స్వర్గాది కామ్యములను గురించి తెలుపు వేదవాక్యముల యందనురక్తిగలిగి, స్వర్గాది ఫలముల కంటె వేరేదియు లేదనునట్టి యే అజ్ఞానులు స్థిరముగు ఫలమీాయ కున్నను వినుటకు మాత్రము యింపుగానుండెడు వేదమునందలి మాటలను పలుకుచున్నారో.

43 శ్లో. కామాత్మాన స్స్వర్గ పరాః ।
జన్మ - కర్మ - ఫల ప్రదాం ।
క్రియా-విశేష - బహుళాం ।
భోగైశ్వర్య - గతిం ప్రతి ॥ 90

అర్థము :-

కామాత్మానః — ఫలములయందు లగ్నచిత్తులును
స్వర్గపరాః — స్వర్గమునందే ఆసక్తిగలవారును అగు, ( నా కర్మఠులు )
జన్మకర్మఫలప్రదాం — జన్మను, కర్మను, ఫలముగా నిచ్చునట్టియు
క్రియావిశేషబహుళాం— పెక్కు క్రియాకలాపములతో నిండియున్నట్టియు
భోగైశ్వర్యగతిం ప్రతి — సుఖానుభవమును, ఐశ్వర్యమును పొందుటను
గూర్చినట్టియు

("వాచం ప్రవదంతి" అని చేర్చుకొని అన్వయించవలెను.)

తా. కామ్యవిషయములం దాసక్తిగలవారును, స్వర్గఫలాసురక్తులును అగు నా కర్మఠులు పునర్జన్మను, సజాతీయమగు కర్మలనే ఫలముగా నిచ్చునట్టియు అనేక క్రియావిశేషములతో కూడుకున్నట్టియు, స్వర్గాది సుఖభోగములకును, ఐశ్వర్యమునకు సాధనములను తెలుపునట్టియు ఈ వేదవాక్యములను పలుకుచుందురో.

44 శ్లో. భోగైశ్వర్య - ప్రసక్తానాం ।
తయా ఉపహృత - చేతసాం ।
వ్యవసాయాత్మికా బుద్ధిః ।
సమాధౌ న విధీయతే ॥ 91

అర్థము :-

భోగైశ్వర్యప్రసక్తానాం—సుఖానుభవము, ఐశ్వర్యములయందు ఆసక్తులై
తయా — అట్టిమాటచే
అపహృత చేతసాం—పోగొట్టబడిన జ్ఞానముగలవారికి
సమాధౌ — మనస్సునందు
వ్యవసాయాత్మికా — ఆత్మ నిశ్చయ రూపమైన
బుద్ధిః — జ్ఞానము  నవిధీయతే — పుట్టదు.

తా. సుఖానుభవములయందును, దానికి సాధనమగు ఐశ్వర్యమునందును మిక్కిలి ఆసక్తిగలిగి అట్టి కామ్యఫలములను బోధించు వేదవాక్యములచే ఆత్మజ్ఞానశూన్యులైనవారియొక్క మనస్సున ఆత్మస్వరూప నిశ్చయాత్మక బుద్ధి కలుగనేరదు.

అవ. వేదమున కామ్యకర్మలేల విధింపబడెనను ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాడు :

45 శ్లో. త్రైగుణ్య - విషయా వేదాః ।
నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో ।
నిర్యోగ క్షేమ ఆత్మవాన్ ॥ 92

అర్థము :-

అర్జున — అర్జునుడా!
వేదాః — వేదములు
త్రైగుణ్యవిషయాః— హెచ్చుగానుండుసత్త్వాది గుణములుగల పురుషులకు సంబంధించినవి
(భవంతి — అగుచున్నవి)
(త్వం — నీవు)
నిస్త్రైగుణ్యః — ఒకదానిని మించినదొక గుణముగా లేనివాడవును
నిర్ద్వంద్వః—శీతోష్ణాది సాంసారికస్వభావములు లేనివాడవును
నిత్యసత్త్వస్థః — సదా శుద్ధసత్త్వమునే ఆశ్రయించినవాడవును
నిర్యోగక్షేమః—ఆత్మేతరములను పొందుటను, కాపాడుటను లేనివాడవున్ను
ఆత్మవాన్—ఆత్మనే వెతుకుటలో తత్పరుడవున్ను
భవ — అగుము

తా. వేదములు సత్త్వ-రజ-స్తమోగుణములు హెచ్చుగా గల వారందరికిన్ని వారి వారికి వలయువాటినె నన్నింటిని తెలుపునట్టివి. ఓ అర్జునా! నీవు కలసిమెలసియున్న ఈ మూడుగుణముల యాధిక్యమును లేనివాడవున్ను పుణ్యపాపములవలన కలుగు సకలసాంసారిక ద్వంద్వరహితుడవున్ను, ఎల్లప్పుడు శుద్ధ సత్త్వగుణాశ్రియుడవున్ను ఆత్మకంటెవేరగు వానిని సంపాదించకయు, వాటిని సంరక్షింపకయు నుండువాడవున్ను, ఆత్మస్వరూపమునే వెతుకువాడవున్ను అగుమా!

అవ. వేదవిధులను విడువ తగునా? అనుటకు సమాధానమును చెప్పుచున్నాడు :

46 శ్లో. యావానర్థ ఉదపానే ।
సర్వతస్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు ।
బ్రాహ్మణస్య విజానతః ॥ 93

అర్థము :-

సర్వతః — అంతటను
సంప్లుతోదకే — నిండిన నీరుగల
ఉదపానే — చెరువునందు
(పిపాసోః — దాహముగలవానికి)
యావాన్, అర్థః — ఎంత ప్రయోజనమో
విజానతః — ఆత్మజ్ఞానముగల
బ్రాహ్మణస్య—వైదికునకు
సర్వేషు — సమస్తమైన
వేదేషు — వేదములయందు
తావాన్ (అర్థః)—అంతియే ప్రయోజనము
(అస్తి — కలదు)

తా. స్నానపానాది ప్రయోజనముల కుపయోగించునదై అంతటను పూర్తిగ జలముతో నిండియున్న తటాకమున దాహముగొన్న వానిచే తనకు త్రాగుటకు వలయునంత జలము మాత్రమే గ్రహింపబడు నటుల, బ్రహ్మజ్ఞాన విశిష్టుడైన ముముక్షువు చేతనున్ను సమస్త వేదములయందును తన కుపయోగించు భాగము మాత్రమే గ్రహించ తగినదై యున్నది.

---

ఇచ్చట క్షత్రియుడగు అర్జునుడు ఉపదేశపాత్రుడు కాని బ్రాహ్మణస్య అనుటచే చెప్పుచున్నది బ్రాహ్మణునకు ఇదియెట్లు సంగతమను శంక కలుగకుండుటకై శ్రీభాష్యకారులు ఇచ్చటి బ్రాహ్మణశబ్దమునకు బ్రహ్మ - అణ తీతి బ్రాహ్మణః. అణ - శబ్దే. అనగా (బ్రహ్మ) వేదమును అధ్యయనము చేయువాడని యర్థము. వేదాధికారము మొదటి మూడు వర్ణములకు కలదుగాన అర్జునుడుకూడ యిట్టి బ్రాహ్మణుడగుట కాక్షేపము లేదు.

అవ. ముముక్షువునకు నిత్యనైమిత్తికాది కర్మలయందు ఉపాదేయమగు అంశను వివరపరచు చున్నాడు:

47 శ్లో. కర్మణ్యే వాధికార స్తే । మా ఫలేషు కదాచన ।
మాఽకర్మఫల హేతుర్భూః । మా తే సఙ్గోఽస్త్వకర్మణి ॥ 94

తే = నీకు
కర్మణి ఏవ = కర్మస్వరూపమునందు మాత్రమే
అధికారః = హక్కు
( అస్తి = కలదు )
కదాచన = ఒకప్పుడును
ఫలేషు = స్వర్గాదిఫలములయందు
మా (భూత్) = హక్కు వలదు.
కర్మఫలహేతుః = కర్మలకును వాటిఫలములకును కారణమైనవాడవు
మాభూః = కావలదు
తే = నీకు
అకర్మణి = కర్మలు చేయకుండుటయందు
సఙ్గః = ఆసక్తి
మా అస్తు = వలదు

తా. అర్జునా! నీవు ముముక్షువుగాన నిత్యనైమిత్తికాది సకల శాస్త్రోక్త కర్మలను చేయుచు మాత్రముండుము, కాని వాటి ఫలమునం దెప్పుడును దృష్టి నిడకుము. ఆ కర్మలుచేయుచున్నను ప్రకృతియో పరమాత్మయో చేయించుచున్నట్లు తలంచుముగాని నిన్ను కర్తనుగా కల్పించుకొనకుము. ఈ పీడ నాకేల యని కర్మలనే మాని కూర్చొనకుము.

అవ. దీనినే మరింత స్పష్టముగా చెప్పుచున్నాడు :

48 శ్లో. యోగస్థః కురు కర్మాణి । సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా।సమత్వం యోగ ఉచ్యతే ॥ 95

హే ధనఞ్జయ = ఓ అర్జునా!
సఙ్గం = ఫలాసక్తిని
త్యక్త్వా = విడిచి
సిద్ధసిద్ధ్యోః = ఫలములభించుట లభించక కుండుటయు విషయమునందు
సమః = సమానుడవు
భూత్వా = అయి
యోగస్థః = కర్మయోగమునందున్నవాడవై
కర్మాణి = సకల కర్మలను
కురు = చేయుము.
సమత్వం = (ఇట్టి) సామ్యస్థితియే
యోగః (ఇతి) = యోగము (అని)
ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా. రాజ్య బంధుమిత్రాదులయందు ఆశను విడచి లాభనష్టములలో సమచిత్తుడవై కర్మయోగము నాచరింపుము, ఇట్లు లాభనష్టములలో మనస్సెంతమాత్రము వికలతజెందకుండుటయే యోగమనబడును.

అవ. కర్మయోగమునందలి జ్ఞానాంశను కొనియాడుచున్నాడు :

49 శ్లో. దూరేణ హ్యవరం కర్మ ।
బుద్ధియోగాత్ ధనంజయ ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ ।
కృపణాః ఫల - హేతవః ॥ 96

అర్థము :-

ధనంజయ — అర్జునా!
బుద్ధియోగాత్ — సమత్వబుద్ధితో చేయబడిన కర్మలకంటె
కర్మ — కేవల కామ్యకర్మ
దూరేణ అవరం — మిక్కిలి కనిష్టమైనది
బుద్ధౌ — సమత్వబుద్ధియందు
శరణం — నివాసమును
అన్విచ్ఛ — కోరుము.
ఫలహేతవః — ఫలమును కోరి కర్మలు చేయువారు
కృపణాః — సంసారులు
(భవంతి — అగుచున్నారు)

తా॥ ఓ అర్జునా! సమత్వబుద్ధితో కూడిన కర్మకంటె కామ్యకర్మ మిక్కిలియు తక్కువది. గాన నీవు సమత్వబుద్ధిని ఆశ్రయించుము. ఫలాపేక్షతో కర్మలజేయువారు సంసార సంబంధముకలిగి దీనులై యుందురు

50 శ్లో. బుద్ధియుక్తో జహాతీహ ।
ఉభే సుకృత - దుష్కృతే ॥
తస్మా ద్యోగాయ యుజ్యస్వ ।
యోగః కర్మసు కౌశలం ॥ 97

అర్థము :-

బుద్ధియుక్తః — సమత్వబుద్ధితో కర్మల చేయువాడు
ఉభే — రెండైన
సుకృతదుష్కృతే — పుణ్యపాపములను
ఇహ జహాతి — సాధనానుష్ఠానదశయందే విడిచిపెట్టుచున్నాడు.
తస్మాత్ — అందువలన
యోగాయ — సమత్వబుద్ధియోగముకొఱకు
యుంజ్యస్వ — సంసిద్ధుడవగుము.
కర్మసు — కర్మలుచేయుచుండగా
యోగః — సమత్వబుద్ధియోగము
కౌశలం — నేర్పుగా సంపాదించ తగినది
(భవతి — అగుచున్నది)

తా॥ ఆత్మయాథాత్మ్య జ్ఞానముతో కర్మల జేయువాడు ఈ జన్మమునసే పుణ్య-పాపముల రెండింటిని విడుచుచున్నాడు. గాన నీవు అట్టి సమత్వ బుద్ధియోగమునకై ప్రయత్నించుము. అట్టి సమత్వ బుద్ధి యోగమే కర్మాచరణయందలి కుశలత్వ మనబడును.

51 శ్లో. కర్మజం బుద్ధియుక్తా హి ।
ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మ - బంధ వినిర్ముక్తాః ।
పదం గచ్ఛంత్యనామయం ॥ 98

అర్థము -

బుద్ధియుక్తాః—సమత్వబుద్ధితో కూడినవారై
మనీషిణః—జ్ఞానులు
కర్మజం—కర్మవలన పుట్టెడు
ఫలం—సాంసారిక ఫలమును
త్యక్త్వా — విడిచిపెట్టి
జన్మబంధవినిర్ముక్తాః—జన్మ యనెడు బంధమునుండి విడువబడినవారై
అనామయం — నాశములేని
పదం — స్థానవిశేషమును
గచ్ఛంతి హి—పొందుచున్నారనిప్రసిద్ధమేగదా

తా. ఇట్టి బుద్ధియోగముగల ఆత్మజ్ఞానులు కర్మజన్యమైన ఫలమును విడిచి, జన్మ యను బంధమునుండి పూర్తిగ విడువబడినవారలై నిరుపద్రవమైన మోక్షపదవిని పొందగలరని శ్రుతులు స్పష్టముగా ఘోషించుచున్నవి.

అవ. ఈబుద్ధియే మోహమును నిర్మూలించునని చెప్పుచున్నాడు:

52 శ్లో. యదా తే మోహకలిలం ।
బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం ।
శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ 99

అర్థము :-

యదా — ఎప్పుడైతే
తే — నీయొక్క
బుద్ధిః—జ్ఞానము
మోహకలిలం—క్షుద్రఫలాశకు కారణమగు (కాలుష్యమును)
వ్యతితరిష్యతి—దాటగలదో
తదా — అప్పుడు
శ్రుతస్య (కృతే)—వినిన అర్థము (కొఱకు)
శ్రోతవ్యస్య (కృతే) — వినవలసిన అర్థముకొఱకును
నిర్వేదం—నిన్ను నీవే నిందించుకొనుటను
గంతాసి — పొందగలవు

తా. ఇట్టి నీ యొక్క బుద్ధి క్షుద్రఫలములకు కారణమగు కాలుష్యదోషమును పూర్తిగ పోగొట్టుకొనగలిగిన వెంటనే ఇదివరలో నీవు వినియున్న త్యాజ్యములైన ఫలములనుగూర్చియు, ఇకముందు నీవు వినబోవు విషయములగూర్చియు నిన్ను నీవే నిరసించుకొందువు.

అవ. కర్మయోగము స్థితప్రజ్ఞావస్థను కలుగజేసి దానిమూలమున
ఆత్మావలోకనమును కలుగజేయు ననుచున్నాడు :

53 శ్లో. శ్రుతి - విప్రతిపన్నా తే ।
యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధిః ।
తదా యోగ మవాప్స్యసి ॥ 100

అర్థము :—

శ్రుతివిప్రతిపన్నా :—
శ్రుతి — వినుటచే
విప్రతిపన్నా — మిక్కిలి తెలిసికొన బడినదై
అచలా — ఒకే విధమగు
తే — నీయొక్క
బుద్ధిః — జ్ఞానము
యదా — ఎప్పుడు
సమాధా — మనస్సు నందు
నిశ్చలా — చలించనిదై
స్థాస్యతి — ఉండగలదో
తదా — అప్పుడు
యోగం — ఆత్మావలోకమును
అవాప్స్యసి — పొందగలవు

తా. ఆప్తులవలన చక్కగా విని గ్రహించబడినదైన ఏకరూపమగు బుద్ధి నిర్మలమగు నీ మనస్సున నిశ్చలమై ఉండునప్పుడు నీవు ఆత్మావలోకనమును పొందగలవు.

అవ. స్థితప్రజ్ఞుని అవస్థాభేదములనుగూర్చి అర్జునుడు అడుగుచున్నాడు:

54 శ్లో. స్థితప్రజ్ఞస్య కా భాషా । సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత । కి మాసీత వ్రజేత కిం ॥ 101

అర్థము :—

కేశవ — శ్రీ కృష్ణా !
సమాధిస్థస్య—స్వాధీనమునందుండు మనస్సుగల
స్థితప్రజ్ఞస్య — స్థితప్రజ్ఞునకు
భాషా — పేరైన శబ్దము
కా — ఏది?
స్థితధీః — స్థితప్రజ్ఞుడు
కిం — దేనినిగూర్చి
ప్రభాషేత — మాటలాడును.
కిం ఆసీత — దేనిని ధ్యానించును?
కిం — దేనినిగూర్చి
ప్రవజేత - ప్రవర్తించును?

తా. ఓ కృష్ణా! మనోనిగ్రహాయుక్తుడైన స్థితప్రజ్ఞుని (జ్ఞాన నిష్ఠుని) స్వరూపమెట్టిది? ఆతను దేనినిగూర్చి సంభాషించుచుండును? ఎటుల కూర్చొని దేనిని ధ్యానించుచుండును? ఎట్టి నడవడిక కలిగి యుండును?

అవ. శ్రీకృష్ణుడు స్థితప్రజ్ఞునియొక్క నాల్గవదియగు "వశీకరావస్థ"ను గూర్చి చెప్పుచున్నాడు :

శ్రీ భగవాన్ ఉవాచ :

55 శ్లో. ప్రజహాతి యదా కామాన్ । సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్టః । స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥ 102

పార్థ = అర్జునా !
యదా = ఎప్పుడైతే
ఆత్మనా = ఆత్మయందు లగ్నమగు మనస్సుచే
ఆత్మని ఏవ = ఆత్మయందే
తుష్టః = తృప్తిచెందినవాడై
మనోగతాన్ = మనస్సునందున్న
సర్వాన్ = సకలమైన
కామాన్ = కోరికలను
ప్రజహాతి = మొలకెత్తనట్లుగా విడచుచున్నాడో
తదా = అప్పుడు
స్థితప్రజ్ఞః = స్థితప్రజ్ఞుడుగా
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. ఓ అర్జునా! ఆత్మయందే ఆనందించుచుండు మనస్సుగలవాడై ఆ తృప్తిచే ఆత్మాతిరిక్తములైన మనో-వాంఛల నన్నింటిని ఎపుడు సవాసనగా వదలగలుగుచున్నాడో, అపుడు అట్టి వాడు స్థితప్రజ్ఞుడనబడుచున్నాడు.

అవ. "ఏకేంద్రియ"మనెడు స్థితప్రజ్ఞుని మూడవ యవస్థనుగూర్చి చెప్పుచున్నాడు :

56 శ్లో. దుఃఖే ష్వనుద్విగ్నమనాః । సుఖేషు విగత - స్పృహః ॥
వీత-రాగ-భయ-క్రోధః । స్థిత ధీ ర్ముని రుచ్యతే ॥ 103

దుఃఖేషు = దుఃఖహేతువులు తటస్థించగా
అనుద్విగ్నమనాః=దుఃఖమును చెందని మనస్సుగల వాడును
సుఖేషు = ఇష్టములు సమీపించినను
విగత స్పృహః = ఆసక్తిలేనివాడును
వీతరాగభయక్రోధః = పోయిన అనురాగము, భయము, కోపము కల వాడును అగు
మునిః = ఆత్మను మననము చేయువాడు
స్థితధీః = స్థితప్రజ్ఞునిగా
ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. దుఃఖించతగు విషయములు తటస్థించినను దుఃఖించనట్టివాడును, సుఖించతగిన విషయములు తటస్థించినను వానియందు స్పృహను చెందనట్టివాడును, అనురాగముగాని, భయముగాని, కోపముగాని లేనివాడును, ఆత్మ మననశీలుడును అగువాడు స్థితప్రజ్ఞుడనబడును

అవ. ఈ శ్లోకమున "వ్యతిరేకము" అనబడు స్థితప్రజ్ఞుని రెండవ అవస్థ చెప్పబడుచున్నది :

57 శ్లో. యః సర్వత్రానభిస్నేహః । తత్తత్ప్రాప్య శుభాశుభం ।
నాభినందతి న ద్వేష్టి । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 104

యః = ఎవడు
సర్వత్ర=సకల ప్రియవస్తువులవిషయమై
అనభిస్నేహః = ఉదాసీనుడై
తత్ తత్ = ఆయా
శుభాశుభం = ఇష్టవస్తువుల లాభమును అలాభమును గాని
ప్రాప్య = పొంది
న అభినందతి = ప్రశంసించడో
న ద్వేష్టి = ద్వేషింపడో
తస్య = వానియొక్క
ప్రజ్ఞా = బుద్ధి
ప్రతిష్ఠితా = మిక్కిలి స్థిరమైనది
(భవతి = అగుచున్నది)

తా. ఎవడు ఆత్మాతిరిక్తములైన వేనియందును ప్రీతిని లేనివాడై ప్రియ సంయోగరూపశుభమును పొంది సంతోషించుటగాని ప్రియవియోగ రూప అశుభమును చెంది ద్వేషించుటగాని లేనివాడై యుండునో, వాని జ్ఞానము స్థిరమైయుండును. వాడు స్థితప్రజ్ఞుడనబడును.

అవ. ఈ శ్లోకమునందు "యతమాన"మనబడు స్థితప్రజ్ఞుని మొదటి యవస్థ చెప్పబడుచున్నది :

58 శ్లో. యదా సంహరతే చాయం । కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 105

అయం = ఈ కర్మయోగి
యదా చ = ఎప్పుడైతే
కూర్మః = తాబేలు
సర్వశః = అంతటి నుండియు
అంగాని ఇవ = తన అవయవములనువలెనే
(సర్వశః) ఇంద్రియార్థేభ్యః=(సమస్త) విషయముల నుండియు
ఇంద్రియాణి = (తన) ఇంద్రియములను
సంహరతే = మరలించుచున్నాడో
తదా = అప్పుడు
తస్య = ఆ కర్మయోగికి
ప్రజ్ఞా = బుద్ధి
ప్రతిష్ఠితా = స్థిరమైనది
(భవతి = అగుచున్నది)

తా. తాబేలు దాని యవయవములను వలెనే, ఈ యోగియు చక్షురాదీంద్రియములను రూపాదివిషయముల నుండి పూర్తిగా ఎప్పుడు మరలించుకొనగలడో, అప్పుడు వాని జ్ఞానము స్థిరమై యుండును. వాడు స్థితప్రజ్ఞుడనబడును.

అవ. ఈ జ్ఞాననిష్ఠ లభించువారు అరుదని చెప్పుచున్నాడు :

59 శ్లో. విషయా వినివర్తంతే । నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసో ప్యస్య । పరం దృష్ట్వా నివర్తతే॥ 105

అర్థము :-

నిరాహారస్య=ఇంద్రియములను విషయముల (నుండి మరలించిన
దేహినః=జీవునకు
విషయాః = శబ్దాది విషయములు
రసవర్జం = రాగము తప్ప
వినివర్తంతే = మరలిపోవుచున్నవి.
అస్య = ఈ కర్మయోగికి
రసః అపి = విషయాసక్తియున్న
పరం = అంతకంటె సుఖకరమగు ఆత్మను
దృష్ట్వా = చూచి
నివర్తతే = మరలిపోవుచున్నది.

తా. విషయానుభవము లేని జీవునికి శబ్దాదివిషయములు అనురాగము మినహాగా పూర్తిగా నివర్తించును. వీనియొక్క ఈ విషయాను రాగము కూడ ఉత్కృష్టమైన ఆత్మసాక్షాత్కారమైన పిమ్మట నివర్తించగలదు.

అవ. విషయరాగమున్నచో ఇంద్రియములు లొంగవనుచున్నాడు :

60 శ్లో. యతతో హ్యపి కౌంతేయ । పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని । హరంతి ప్రసభం మనః ॥ 107

అర్థము :-

కౌంతేయ = అర్జునా!
విపశ్చితః అపి = పండితుడైనను
యతతః = ప్రయత్నించుచున్నట్టి
పురుషస్య = పురుషునియొక్క
మనః = మనస్సును
ప్రమాథీని = కలతపెట్టునట్టి
ఇన్ద్రియాణి = ఇంద్రియములు
ప్రసభం = బలవంతముగా
హరంతి హి = ఆకర్షించుచున్నవి గదా.

తా. ఓ అర్జునా ! పురుషుడు వివేకవంతుడై ప్రయత్నము జేయుచున్నను ప్రమాదము కలిగించు స్వభావముగల ఇంద్రియములు మనస్సును బలాత్కారముగ ఆకర్షించుచున్నవి కదా!

అవ. ఇంద్రియముల జయించుటకు సుకరోపాయమును చెప్పుచున్నాడు :

61 శ్లో. తాని సర్వాణి సంయమ్య । యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి । తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 108

తాని = అటువంటి
సర్వాణి = అన్ని ఇంద్రియములను
సంయమ్య = అరికట్టి
మత్పరః = నాయందు మనస్సునుంచి
యుక్తః = స్వస్థ చిత్తుడవై
ఆసీత = ఉండవలెను.
యస్య = ఎవనియొక్క
ఇన్ద్రియాణి = ఇంద్రియములు
వశే (సంతి) = స్వాధీనమునందున్నవో
తస్య = వానియొక్క
ప్రజ్ఞా = బుద్ధి
ప్రతిష్ఠితా = స్థిరపడినది
(భవతి = అగుచున్నది)

తా. బలవంతములైన ఇట్టి ఇంద్రియముల నన్నింటిని విషయములం నంటకుండునట్లు మాత్రము అణచిపెట్టి మనస్సును శుభావలంబనమగు నాయందుంచి స్వస్థచిత్తుడై యుండవలయును. అప్పుడు యింద్రియములు స్వాధీనము నందుండును. అట్టి జితేంద్రియుని జ్ఞానము స్థిరమైనదై యుండగలదు.

అవ. భగవంతు నవలంబనముగా గొనక స్వప్రయత్నముచే యింద్రియములు జయించనెంచు వానికి అనర్థములను చెప్పుచున్నాడు.

62 శ్లో. ధ్యాయతో విషయాన్ పుంసః । సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః । కామాత్ క్రోధోఽభిజాయతే

విషయాన్ = శబ్దాదులను
ధ్యాయతః = తలంచునట్టి
పుంసః = పురుషునకు
తేషు = ఆవిషయములయందు
సంగః = ఆసక్తి
ఉపజాయతే=మిక్కిలి హెచ్చుగా పుట్టుచున్నది
సంగాత్ = ఆయాసక్తివలన
కామః = విషయముల ననుభవించంకబ్రతుకలేని యావేశము
సంజాయతే=పుట్టుచున్నది
కామాత్ = ఆ కామమువలన
క్రోధః = కోపము
అభిజాయతే = అందరియందును పుట్టుచున్నది

తా. విషయములను మనస్సుచే ధ్యానించుచుండు పురుషునికి ఆ విషయముల యందు అనురాగము అధికముగా కలుగుచున్నది. ఆ యనురాగముమే కామముగా మారుచున్నది. ఆ కామమే అడ్డబడినచో అందరియందును క్రోధముగా పరిణమించుచున్నది.

63 శ్లో. క్రోధా ద్భవతి సమ్మోహః ।
సమ్మోహాత్ స్మృతి-విభ్రమః ।
స్మృతి-భ్రంశాత్ బుద్ధినాశో ।
బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ 110

క్రోధాత్ = (ఆ) కోపమువలన
సమ్మోహః = అవివేకము
భవతి = కలుగుచున్నది
సమ్మోహాత్ =(అట్టి) అవివేకమువలన
స్మృతి విభ్రమః=(తన ప్రయత్నమునందు) మరపు
(భవతి = కలుగుచున్నది)
స్మృతిభ్రంశాత్ =(ఆ) మతిమరపువలన
బుద్ధినాశః=ఆ ఆత్మజ్ఞానమునకు గావించిన ప్రయత్న నాశము
(భవతి = కలుగుచున్నది)
బుద్ధినాశాత్ =అట్టి బుద్ధి నాశమువలన
ప్రణశ్యతి=నశించుచున్నాడు.

తా. క్రోధము వలన అవివేకము కలుగును. అవివేకమువలన తన ప్రయత్నమున మఱపు జనించును. ఆ మఱపువలన ఆత్మజ్ఞానార్థము చేసిన ప్రయత్నము చెడును. ఆత్మ జ్ఞాన - ప్రయత్న నాశనముచే సంసారమున మునిగి పూర్తిగ నశించును.

అవ. తాను చెప్పిన రీతిగా ఇంద్రియములను జయించుట వలన కలుగు ఫలమును చెప్పుచున్నాడు :

64 శ్లో. రాగ - ద్వేష - వియుక్తైస్తు ।
విషయా నింద్రియై శ్చరన్ ।
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ।
ప్రసాద మధిగచ్ఛతి ॥ 111

రాగద్వేషవియుక్తైః=రాగద్వేషములు లేనట్టియు
ఆత్మవశ్యైః = తనకు స్వాధీనము లైనట్టియు
ఇన్ద్రియైః = ఇంద్రియములచేత
విషయాన్ = శబ్దాదులను
చరన్ = అనుభవించుచు సంచరించెడు
విధేయాత్మా=స్వాధీనచిత్తుడు
ప్రసాదం=మనస్సుయొక్క నిర్మలత్వమును
అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా. రాగ-ద్వేషముల విడిచినట్టియు, తనకు స్వాధీనము లైనట్టి ఇంద్రియములచే శబ్దాది విషయముల తిరస్కరించి వర్తించుచున్న స్వాధీనమైన మనస్సు కలవాడు మనోనిర్మలత్వమును పొందుచున్నాడు.

65 శ్లో. ప్రసాదే సర్వ-దుఃఖానాం ।
హాని ర స్యోపజాయతే ।
ప్రసన్న-చేతసో హ్యాశు ।
బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 112

ప్రసాదే (సతి) - నిర్మలత్వముకలుగగానే
అస్య - ఇట్టి పురుషునియొక్క
సర్వదుఃఖానాం - అన్నిదుఃఖములయొక్కయు
హానిః - నాశము
ఉపజాయతే - పుట్టుచున్నది.
ప్రసన్నచేతసః - నిర్మలచిత్తునకు
ఆశు - శీఘ్రముగా
బుద్ధిః - శుద్ధాత్మజ్ఞానము
పర్యవతిష్ఠతి హి - స్థిరముగా నిలుచుచున్నదిగదా.

తా. మనస్సు నిర్మలముకాగా వీనియొక్క సమస్త దుఃఖములు నశించును. నిర్మలాంతఃకరణునికి ఆత్మజ్ఞానము శీఘ్రముగా స్థిరపడుచున్నది. కదా.

అవ. చెప్పిన రీతిగా ఇంద్రియముల జయించని వానికి ప్రధాన ప్రయోజనము లభింపనేరద నుచున్నాడు:

66 శ్లో. నాస్తి బుద్ధి రయుక్తస్య ।
న చా యుక్తస్య భావనా ।
న చా భావయతి శ్శాంతిః ।
అశాంతస్య కుత స్సుఖం ॥ 113

అయుక్తస్య—భగవంతునియందుమనస్సునుంచనివానికి
బుద్ధిః — శుద్ధాత్మజ్ఞానము
నాస్తి — లేదు.
అయుక్తస్య — అట్టివానికి
భావనా చ — ఆత్మమననమున్ను
నాస్తి — లేదు.
అభావయతః — ఆత్మను ధ్యానించనివానికి
శాంతిః—విషయవాంఛ లేకుండుటయు
నాస్తి — లేదు.
అశాంతస్య — విషయవాంఛపోనివానికి
సుఖం — సుఖము
కుతః — ఎక్కడిది?

తా. నా యందు మనస్సు నుంచని వానికి ఆత్మజ్ఞానము కలుగదు. అట్టి వానికి ఆత్మమననమున్ను కలుగదు. ఆత్మమననము లేనివానికి విషయము లందలి స్పృహ నివర్తించదు. విషయాభిలాష వదలని వానికి నిరతిశయసుఖప్రాప్తి ఎటుల కలుగును?

అవ. ఇంకను అట్టివానికి కలుగు అనర్థమునే చెప్పుచున్నాడు :

67 శ్లో. ఇంద్రియాణాం హి చరతాం ।
య న్మనో ఽ నువిధీయతే ।
త ద స్య హరతి ప్రజ్ఞాం ।
వాయు ర్నావ మి వాంభసి ॥ 114

ఇన్ద్రియాణాం — ఇంద్రియములు
చరతాం—విషయములందు ప్రవర్తించుచుండగా
యత్, మనః — ఏ, మనస్సు
అనువిధీయతే—వాటిని వెంబడింపచేయబడుచున్నదో
తత్ — ఆ మనస్సు
అస్య — వీనియొక్క
ప్రజ్ఞాం—ఆత్మనుగూర్చిన జ్ఞానమును
అమ్భసి — నీటియందు
నావం — ఓడను
వాయుః ఇవ — గాలివలె
హరతి హి — లాగుకొనిపోవుచున్నది గదా.

తా. స్వేచ్ఛగచరించు ఇంద్రియముల ననుసరించి నడుపబడుచున్న మనస్సు, ఈ పురుషుని ఆత్మజ్ఞానమును, నీటియందలి నావను ప్రతికూల వాయువు గమ్యస్థానము నుండి వేరుదెసకు గొనిపోవునటుల, విషయముల దెసకు మరలించును

అవ. ఇంద్రియ నిగ్రహ ఉపదేశమును విరమించుచున్నాడు :

68 శ్లో. తస్మా ద్యస్య మహాబాహో ।
ని గృ హీ తా ని స ర్వ శః ।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః ।
త స్య ప్ర జ్ఞా ప్రతిష్ఠితా ॥ 115

మహాబాహో = అర్జునా !
తస్మాత్ = అందువలన
యస్య = ఎవనియొక్క
ఇన్ద్రియాణి = ఇంద్రియములు
ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి
సర్వశః = అన్ని విధములచేతను
నిగృహీతాని = అరికట్టబడినవో
తస్య = వానియొక్క
ప్రజ్ఞా = బుద్ధి
ప్రతిష్ఠితా = స్థిరమైనది
(భవతి = అగుచున్నది)

తా. ఓ అర్జునా! మనస్సును నాయందు లగింపజేయుట వలన ఎవని ఇంద్రియములు విషయములనుండి పూర్తిగా మరలించి స్వాధీనపరచు

అవ. స్థితప్రజ్ఞునకు కలుగు ఫలమును చెప్పుచున్నాడు :

69 శ్లో. యా నిశా సర్వభూతానాం । తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని । సా నిశా పశ్యతో మునేః ॥1

సర్వభూతానాం = అన్ని ప్రాణులకును
యా = ఏ ఆత్మబుద్ధి
నిశా = రాత్రివలె ప్రకాశించనిదో
తస్యాం = ఆ యాత్మబుద్ధియందు
సంయమీ = నిర్మలచిత్తుడగు యోగి
జాగర్తి = జాగరూకుడైయుండును
యస్యాం = ఏశబ్దాది బుద్ధియందు
భూతాని = ప్రాణులు
జాగ్రతి = జాగరూకులైయుందురో
సా = ఆ బుద్ధి
పశ్యతః = ఆత్మను చూచునట్టి
మునేః = మననశీలునకు
నిశా = రాత్రివలె ప్రకాశించనిది
(భవతి = అగుచున్నది)

తా. సమస్త ప్రాణులకు ఆత్మవిషయకబుద్ధి రాత్రివలె అప్రకాశమై యుండును. గాని జితేంద్రియుడగు యోగి ఆ బుద్ధియందు జాగరూకుడై యుండును. ప్రాణికోటి శబ్దాది విషయములందు జాగరూకత కలిగి యుండును. ఆత్మదర్శనముచేయు, మననశీలునకు ఆ విషయానుభవము. రాత్రివలె అప్రకాశమై యుండును.

70 శ్లో. ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం ।
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే ।
స శాంతి మాప్నోతి న కామకామీ ॥ 117

ఆపూర్యమాణం=అంతటను నీటితోనిండి యున్నట్టియు
అచలప్రతిష్ఠం = గట్టునుమీరనట్టియు,
సముద్రం = సముద్రమును
ఆపః = నది నీరు
యద్వత్ = ఏ విధముగా
ప్రవిశన్తి — ప్రవేశించుచున్నవో
తద్వత్ = ఆ విధముగా
సర్వే = సమస్తమైన
కామాః — కోరికలు
యం — ఎవనిని
ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో
సః = వాడు, శాన్తిం = శాంతిని
ఆప్నోతి = పొందుచున్నాడు.
కామకామీ = విషయాసక్తుడు
న ఆప్నోతి = శాంతిని పొందడు.

తా. స్వయముగ పూర్ణమై, చలించనిదై యుండు సముద్రమును నదీ జలములు ప్రవేశించునటులనే ఆత్మావలోకనముచే తృప్తుడైనవానికి సమస్తకోరికలు నెరవేరుచున్నవి. అట్టివాడే శాంతిని పొందును. కోరి

71 శ్లో. విహాయ కామాన్ యస్సర్వాన్ ।
పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకారః ।
స శాంతి మధిగచ్ఛతి ॥ 118

అర్థము :-

| | |
|---|---|
| యః = ఏ | నిర్మమః =మమకారము లేనివాడును |
| పుమాన్ = పురుషుడు | నిరహఙ్కారః=దేహాత్మాభిమానము లేనివాడును(అయి) |
| సర్వాన్ = సమస్తమైన | చరతి = సంచరించుచున్నాడో |
| కామాన్ = కోరికలను | సః = వాడు |
| విహాయ = విడిచిపెట్టి | శాంతిం = శాంతిని |
| నిస్పృహః = ఆశలేనివాడును | అధిగచ్ఛతి = పొందుచున్నాడు. |

తా. ఏ పురుషుడు సమస్త కోరికలను విడిచి, విషయాభిలాష లేనివాడై, అహంకార, మమకారములు లేనివాడై యుండునో వాడు సమస్త దుఃఖ నివృత్తిని పొందకలుగును.

---

అహంకారమనగా — అహం శబ్దమునకు అర్థముకాని శరీరమును అహం శబ్దార్థముగా భావించుట. దీనికే దేహాత్మాభిమానమని పేరు, మమకారమనగా - వాస్తవముగా తనకెట్టి సంబంధముగాని లేనట్టి ఔపాధిక బంధువులయందు "నావారు" యనెడు బుద్ధిని కలిగి యుండుట. ఇవి రెండును మోక్షమార్గమునకు గొప్ప ప్రతిబంధకములు.

అవ. కర్మనిష్ఠను ప్రశంసించి, అధ్యాయార్థమును ముగించు చున్నాడు:

72 శ్లో. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ !
నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వా ఽస్యా మంతకాలే ఽపి !
బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి ॥ 119

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః॥

అర్థము :-

పార్థ = అర్జునా!
ఏషా = ఈ
స్థితిః = కర్మయోగమందు ఉనికి
బ్రాహ్మీ = బ్రహ్మనుపొందించునది
(భవతి = ఆగుచున్నది)
ఏనాం = దీనిని
ప్రాప్య = పొంది
న విముహ్యతి=తిరిగిసంసారమునుపొందడు.
అంతకాలేఅపి=చివరవయస్సునందుఅయినను
అస్యాం = ఈ స్థితియందు
స్థిత్వా = ఉండి
బ్రహ్మనిర్వాణం=బ్రహ్మానందమును
ఋచ్ఛతి = పొందుచున్నాడు:

తా. ఓ అర్జునా! ఆత్మజ్ఞానపూర్వక-కర్మానుష్ఠాన నిష్ఠ, బ్రహ్మప్రాప్తికి సాధనమైనది. ఈ స్థితిని కర్మయోగమున జీవుడు పొంది తిరిగి సంసారమున పడడు. అంతిమ కాలమున ఈ స్థితిలోనికి రాకలిగినను సుఖైక స్వరూపమైన ఆత్మప్రాప్తిని చెందగలడు.

ఇది ఉపనిషత్ స్వరూపమును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అగు శ్రీభవద్గీత
యందలి సాంఖ్యయోగ మనబడు
ద్వితీయాధ్యాయము.

| | | | |
|---|---|---|---|
| సంజయుని శ్లోకములు | 3 | ద్వితీయాధ్యాయ శ్లోక | |
| అర్జునుని శ్లోకములు | 6 | ములు | 72 |
| శ్రీకృష్ణుని శ్లోకములు | 63 | మొత్తముశ్లోకములు | 119 |

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# గీతా జయంత్యుత్సవము

ఈ సంవత్సరమున గీతాజయంతి మార్గశిర్ష శు॥ ౧౧ లు మంగళవారము దిం 3-12-1957 తేదీన అయినది. దీనిని ఎటుల జరుపవలెనని చాలమంది అడుగుచున్నారు. ఇందునుగురించి ప్రత్యేకమగు విధి యేదియును లేదు. శిష్టాచార మనుసరించి మేమాచరించుచున్న విధానమును తెలుపుచున్నాము. గాని ఇదియే సిద్ధాంతము కాదు. భక్తులు తమ తమ అవకాశ ఉత్సాహముల ననుసరించి, దేశకాల పరిస్థితులను బట్టి కార్యక్రమమును ఏర్పాటు చేసుకొనవచును.

మేము మద్రాసులో ఆచరించిన విధానము.

1. దీక్షాస్వీకారము :- మార్గశిర్ష శుద్ధ ఏకాదశిరోజున ఉదయమున గం 6 లకు విష్వక్సేనపూజ పుణ్యాహవచనములతో, విశ్వకల్యాణోద్దేశముతో భగవద్భాగవతాచార్య కైంకర్యరూప సంకల్పముతో కలశస్థాపన మొనరించి, 18 స్వాములు గీత సంపూర్ణపారాయణమునకు దీక్షవహించబడెను.
2. తిరువీధ్యుత్సవము :- ప్రతిదినము ఉదయము గం 7 మొదలు గం 8 వరకు, పిమ్మట అందరుకలిసి ఒక్కొక్కరోజున ఒక్కొక్క అధ్యాయము రోజునకొక్కొక్క ప్రాంతము చొప్పున 18రోజులు 18ప్రాంతములలో గీతాపారాయణముతో తిరువిధ్యుత్సవము జరుపబడెను. ఇందు స్త్రీ పురుషులందరు వరుసగా బారులుతీర్చి నడుచుచుండగా మధ్య స్వాములు కొందరుండి ఆనాటి గీతాధ్యాయమందలి శ్లోకమును నాలుగుపాదములుగ చేసి, ఒక్కొక్క పాదమును చెప్పుచుండగా మిగతవారందరు ఆపాదమును తిర్గి అనువాదముచేయుచు ఒక గంటకాలము అనగా గం 7 మొదలు గం 8 వరకు, ఈ గంటకాలములోను యెన్ని పర్యాయములు ఆవృత్తి చేయుటకవకాశముండునో అన్ని పర్యాయములు మాత్రమే ఆవృత్తి చేయుచు తిరువీధ్యుత్సవము జరుపబడెడిది.
3. సమిష్టిపారాయణము - గం 8 మొదలు గం 8-30 వరకు:-
   పిమ్మట నిర్ణీత ప్రదేశమునకు అందరును చేరిన తరువాత కూర్చొని ఆనాటి గీతాధ్యాయమునే తిర్గి ఒక పండితులు ఒక్కొక్క పాదమునే చెప్పుచుండగా, మిగతశ్రోతృజనులందరును దానిని అనువాదము చేయుచు, సమష్టిపారాయణము జరిగెడిది.
4. అనుష్ఠానము. గం 8-30 మొదలు గం 9 వరకు :-
   పిమ్మట, ముందుగ జపము - ధ్యానము - ఏకాగ్రత - మున్నగు వాని విధులను గూర్చిన నియమములను, అభ్యాసవిధానమును గూర్చి క్లుప్తముగా తెలుపబడి, అందరు కలిసి నిశ్శబ్దముగ కండ్లుమూసుకొని భగవధ్యానమును అభ్యాస మొనర్చుచుండిరి.
5. అధ్యాయ విశేషవివరణము, గం 9 నుండి 10-30వరకు :-
   పిమ్మట సభామంటపమున ఒక పండితులు ఆనాటిగీతాధ్యాయములోని శ్లోకముల అర్థతాత్పర్యములను ముఖ్యవిషయముల విశేషవివరణములను, మన నిత్యానుష్ఠానమున కవసరమగు విషయములను, అభ్యాసవిధానమును ఉపన్యాసరూపముగ వివరించుచుండిరి.
6. సమిష్టిరూప ఆసాంత పారాయణము, భాష్యపారాయణము గం 9 నుండి గం 10-30 వరకు,
   పిమ్మట పారాయణ మంటపమున 18 మందిస్వాములు కూర్చుని భగవద్గీత మొత్తము 18 అధ్యాయముల మూలమును పారాయణ మొనర్చుచుండిరి. అటుపిమ్మట వారే ఒక్కొక్కరు ఒక్కొక్క శ్లోకము యొక్క రామానుజ భాష్యమును చొప్పున 18 మంది స్వాములు కలిసి ఆనాటి అధ్యాయము యొక్క రామానుజ భాష్యమును పారాయణ మొనర్చుచుండిరి.
7. శాంతి గం 10-30 మొదలు గం 11 వరకు
   పిమ్మట శాంతి పాఠము హారతి జరుగుచుండెడిది.
8. పండితగోష్ఠి విశేషచర్చ :
   మధ్యాహ్నము గం 2 మొదలు గం 5 వరకు ప్రత్యేక పండితగోష్ఠిలో ప్రత్యేకముగ ఆహ్వానింపబడిన పండిత ప్రకాండులు ఆనాటి అధ్యాయముపై విశేషచర్చజరిపి, విశేషసారంశ విషయములను సంస్కృత ద్రావిడాది భాషలలో ఉపన్యసించుచుండిరి.

# కట్నాలు

బరంపురం మహిళామండలివారు సప్తమ వార్షికోత్సవసందర్భమున సంఘమునకిచ్చిన కట్నం రు5-0-0

నూజవీడు: పొలిశెట్టి కనకవల్లితాయారమ్మ పంపిన కట్నాలు

| | |
|---|---|
| శ్రీ స్వామివారి తిరునక్షత్ర కట్నం | 1-0-0 |
| కృష్ణాష్టమి విరాళం | 1-0-0 |
| శుక్రవారోత్సవ విరాళం | 6-8-0 |
| సి. హెచ్. శ్రీమన్నారాయణాచార్యులుగారు పంపిన కట్నం | 1-0-0 |
| శ్రీ ప్రతివాది భయంకరం వెంకటాచార్యులుగారు పంపిన మైసాఘండు | 1-0-0 |

శ్రీ బదరీనారాయణ శ్రీ శ్రీనివాసరామానుజస్వామివారి కైంకర్యము నిమిత్తము సమర్పించిన విరాళములు.

## బదరీ శాశ్వతపూజలు

| | |
|---|---|
| పేరాల: నేరళ్ళ జగన్నాథగుప్తగారు | రు. 116-0-0 |
| పేరాల: నేరళ్ళ సుబ్బయ్యగుప్తగారు | 116-0-0 |
| శ్రీ కొ. రంగాచార్యులుగారు తిరువనంతపురం (వాగ్దానము) | రు. 29-0-0 |

## తాత్కాలిక పూజలు

| | |
|---|---|
| గురజ: ఎర్నేని లక్ష్మీరత్నమ్మగారు | రు 11-0-0 |
| గుండ్రాలమడుగు బంది మాధవరెడ్డిగారు | 11-0-0 |
| బొబ్బిలి: చెలికాని సీతయ్యస్వామిరావుగారు | 12-0-0 |
| మచిలీపట్నం: మంగిన పెరుందేవి తాయారమ్మగారు | 11-0-0 |
| తుమ్మగూడెం: కోటగిరి శోభనాద్రియమ్మగారు | |
| యినుగంటి కమలాదేవిగారు. యినుగంటి రామలక్ష్మమ్మగారు | రు 11-0-0 |
| లింగాలవలస: శ్రీరామకృష్ణరామానుజదాసుగారు | 11-0-0 |
| మద్రాసు: జి. ఆర్. ఆదినారాయణగారు | 11-0-0 |
| ఇనుగంటి వెంకటశ్రీదేవమ్మగారు | |
| కోటగిరి లక్ష్మీవెంకాయమ్మగారు | |
| కోటగిరి వెంకటవరదయమ్మగారు | |
| కోటగిరి లలితమ్మగారు | 22-0-0 |
| పేరాల: మువ్వల లక్ష్మయ్యగారు | 11-0-0 |
| పేరాల: సంకా బాపనయ్యగారు మల్లిఖార్జునరావుగారు కలసి | 11-0-0 |
| శ్రీ మంగిన పెరుందేవితాయారమ్మగారు. మచిలీపట్నం | రు. 11-0-0 |
| శ్రీమతి చెలికాని చినసీతాయమ్మగారు. బొబ్బిలి | రు. 11-0-0 |

శ్రియఃపతి వీరికి మంగళము లొసంగుగాక!



శ్రీమతే రామానుజాయనమః

శ్రీ. ఉ. వే. శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణయతిసార్వభౌమానాం

శ్రీ ఉ వే. తె. కం. గోపాలాచార్యస్వామి నాఞ్చ

వైదిక కళాశాలా సందర్శనసమయే సమర్పితా

## "స్వాగత నివేదన పత్రికా"

సుమహద్భాగ్యమిదం పచేళిమం భగవద్రామానుజ దర్శనస్య అస్మదాదీనాఞ్చ। యత్; ఆజానపావనాన్తఃకరణైః పామరజనోద్ధరణే భగవద్రామానుజదర్శనప్రచారణేచ శ్రద్ధాభరసమిద్ధ శేముషీకైః, శ్రీ. ఉ. వే. శ్రీమన్నారాయణయతీశ్వరైః, తే. కం. గోపాలాచార్యవర్యైశ్చ, స్వసంచారేణ, మహితోపదేశనివహేనచ, సకలోపి దేశః పావనీక్రియతే; ఇతి॥

సన్తునామ, సంప్రతి బహవః యతీశ్వరాః ఆచార్యపూరుషాశ్చ; శ్రీరామానుజసిద్ధాన్తప్రవచనప్రవణాః। కిన్తు, విలక్షణోఽయ మనయో ర్వ్యక్తివిశేషయోః అనితరసాధారణః శ్రద్ధాదిగుణగరిమా, హృదయఙ్గమో మధురోపదేశశ్చేతి॥

దుర్లభాహి, ప్రాయః ప్రాణిషు మానవీ జనిః, తత్రచ ఆస్తికతా, తత్రాపి నిరవద్య శ్రుత్యర్థసామరస్య సద్గుణిని భగవద్రామానుజసిద్ధాన్తే గాఢావగాఢతా చేతి ఏషా గుణసంపత్తిః అత్ర మహనీయే వ్యక్తిద్వయే అనిర్వచనీయసుకృతపరిపాకసంభావనీయేతి స్పష్టమీక్ష్యతే సమగ్రైరాస్తికైః

మహారాజాధిరాజైరపి అనిర్వాహ్యే అసంభావనీయే చ, మహతి శ్రీ బదరీనారాయణ మహాయజ్ఞే తత్ర శ్రీ భగవద్రామానుజమూర్తిప్రతిష్ఠాపనేచ కృతోద్యమనాం సంపూర్ణమనోరథానాంచ అమీషాం సత్యం అతిమానుషశ్శక్తివిశేషః।

ఈదృశే బహుతరే జగతశ్శుభకరే చ అమీభి ర్నిర్వాహ్యే సత్కర్మణి సర్వేషామాస్తికానాం పరమభాగవతోత్తమానాం చ సహకారసంపత్తి స్సర్వవిధా అవశ్య మేతై రుపలభ్యేతేతి నాస్తి నస్సంశయ లేశోఽపి॥

శ్లో॥ సాక్షీ కోవా నజానాతి బుధయో రనయో ర్ద్వయోః
విశిష్టాద్వైత సిద్ధాన్త సౌధ స్తంభాయ మానతామ్.

శ్లో॥ జాయతాం జగత శ్శాన్తిః అనయోః పుణ్యకర్మభిః
జేజీయతాంచ భగవ ద్రామానుజ మతం చిరమ్

శ్లో॥ స్తవనీయ గుణగరిష్ఠౌ: కరణత్రయ విహిత
సుకృతయో రనయోః వైదికవిద్యాశాలా
హర్షభరా త్స్వాగతం సమర్పితం॥

ఇతి నివేదయతి
వైదిక కళాశాలా కార్యకర్తృసమితిః

సింహాద్రిబాగ్
వరంగల్
23-3-56

శ్రీ హయగ్రీవాయ నమః

# ఆచార్య హృదయం శాత్తుమొఱ.

ది28-9-57 వ తేదీ శ్రీవాసుదాసాశ్రమములో శ్రీ కోదండరామస్వామివారి సన్నిధియందు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజజీయర్ స్వామివారి సమక్షమున శ్రీమాన్ ఉ. వే. మహావిద్వాన్ గొడవర్తి శఠగోపాచార్యస్వామివారు రెండుమాసములనుండి సాయించుచున్న ఆచార్య హృదయ కాలక్షేపమునకు శాత్తుమొఱ విలక్షణముగా జరిగినది. ఆ సందర్భమున శ్రీ శఠగోపాచార్యస్వామివారికి విలువగల నూతన వస్త్రములతోను, తదితర బహుమతులతోను, సింహతలాటములు మురుగులతోను సత్కారము జరిగినది. ఆ సమయములో శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారి పద్యము లాశువుగా అనుసంధానము గావించిరి.

శ్లో॥ శ్రీమన్నారాయణాచార్య, రామానుజ యతిం భజే
యేన సంస్థాపితం భూయః విశిష్టాద్వైత దర్శనం॥

శ్లో॥ శ్రీమా నుభయ వేదాంత, విద్వాన్ తార్కిక కేసరీ
శఠగోపార్య వర్యోమే హృది జే జీయతాం సదా॥

శ్లో॥ వాచా, నిర్మలయా, సుధామధురయా, గంగేవ గంభీరయా
వీణేవ శ్రుతిపేయయా శ్రుతిశిర స్సిద్ధాంత సారజ్ఞయా
కాలక్షేపకథాసు సభ్యమనసా మానంద మవ్యాహతం
కుర్వన్ శ్రీ శఠగోప దేశికమణి ర్జీయా త్సతా మగ్రణీః॥

గీ॥ స్వాపదాచార్య హృదయకోశమున నున్న
పరమ భోగ్యంబులైన భావముల నెల్ల
విశదతమముగఁ దెలిపితి విబుధవర్య;
మరల మాకిట్టి భాగ్యంబు వరలుగాక !

ఉ॥ జీయరు స్వామివారి కృపచేతను, మీ యసమాన పాండితిన్
మీ యతుల ప్రభావమును, మీ తిరుసూక్తి పవిత్ర ధోరణిన్
హాయిగ నిన్నినాళ్ళు చెవులారఁగ వింటిమి మోదమయ్యె, మీ
తీయని సౌమనస్యమును దేశికవర్య! స్మరింతు మెప్పుడున్.

# బదరీ సమాచారము

బదరీలో మనము కట్టించుచున్న అష్టాక్షరీ క్షేత్రములో పైగదులు దాదాపు పూర్తి కావచ్చినవి. ఇందు నిమిత్తమై శ్రీమాన్ గోపాలాచార్యస్వామి వారు అచ్చటనే వేంచేసి యున్నారు. దాదాపు యీ నెల ప్రారంభంనుండి షుమారు 24 రోజులవర్కు అచ్చట అమితవర్షములు కురియుచు సూర్యరశ్మి లేకుండబోయినది. యీమధ్యనే 20 తారీఖునుండి వర్షములుతగ్గి సూర్యరశ్మి కనిపించినది. పైగ్రామములనుండి వచ్చిన పనివారలందరు జ్వరముచే బాధపడి వెళ్ళిపోయిరి. కాని స్థానికమైన పనివార్లకు ముందుగానే చాలా పెద్ద మొత్తములను అడ్వాన్సుగాయిచ్చియున్నందున వారు మాత్రమేయుండి మన అష్టాక్షరీ క్షేత్ర పనిని తిరిగి ప్రారంభించి చేయుచున్నారు. పైఅంతస్థు 12 గదులు గోడలు కట్టుబడి పూర్తి అయినది. కిటికిలు. గుమ్మములు పెట్టుటపూర్తిఅయినది. యింక ముందువైపు "గ్రేడార్ పర్తర్" పనిసాగుచున్నది. యిది అగుటతోడనే సిద్ధముగానున్న దూలములు. వాసములు బిగించబడి పైనకప్పు వేయబడగలదు.

యీ సంవత్సరము. కప్పుపని పూర్తికాగలదనియు. సిమెంటు గిలాబాలు కొంతవరకు పూర్తిచేయ బడగలవనియు నమ్ముచున్నాము. ఇందులకు కావలసినటువంటి సిమెంటు 200 బస్తాలు యీమధ్యనే ఢిల్లీ. సెక్రటరీ గవర్నమెంటునుండి స్పెషల్ పర్మిషన్ తీసుకొనబడినది. నిరుటిసంవత్సరమే 2 టన్నుల టిన్నురేకులు తెప్పించి సిద్ధముగా నిల్వయుంచబడినది. అవి చాలవను యుద్దేశముతో తిరిగి యిప్పుడుమరి 2 టన్నుల టిన్నురేకులు సెంట్రల్ గవర్నమెంటునుండి పర్మిషన్ తీసుకొనబడియున్నది. బహుశ నవంబరు మొదటి వారంలో బదరీ ద్వారబంధము జరుగవచ్చును. అప్పటివరకుకూడ మన అష్టాక్షరీ క్షేత్రనిర్మాణపు పనిని సాగించవలెననియే. పట్టుదలతోనున్నాము. శ్రియఃపతి కటాక్షముచేత వాతావరణము తోడ్పడినచో యీ సంవత్సరము చాలావరకు పని పూర్తికావచ్చును.

(2) బదరీలో మన శ్రీనివాస రామానుజస్వామి వారల అర్చనారాధనలు వైభవముగా జరుగుచున్నవి. యింతవరకు తాత్కాలిక పూజలకు. శాశ్వత పూజలకు విరాళములు సమర్పించిన దాతలయొక్క అందరి గోత్రనామములతోటి పూజలను శ్రీమాన్ గోపాలాచార్య స్వాము వారు స్వయముగా దగ్గరయుండి విధ్యుక్తముగా జరిపించినారు.

వారువచ్చినప్పుడు ప్రసాదమును తీసుకొనిరాగలరు. ఆ వెంటనే కైంకర్యపరులకందరకున్నూ ప్రసాదములు పంపగలము

3. తాత్కాలిక పూజలకు నిరుడు విరాళములు సమర్పించిన వారందరికిన్నీ యీసంవత్సరముకూడ విరాళములు సమర్పించ వలసినదిగా ఉత్తరములు వ్రాసియున్నాము. వారిపేర పూజలు జరిపించబడినవి. కాని యిప్పటికి కొద్దిమంది మాత్రమే విరాళములు పంపియున్నారు. యింక చాలమంది పంపవలసియున్నారు. పంపించవలసిన వారందరున్నూ త్వరగా తమ విరాళములను పంపవలసినదిగా కోరుచున్నాము.

శాశ్వత పూజలకు తాముచేసిన వాగ్దానములలో కొంతభాగము మాత్రమే యిచ్చి యింకాకొంత యివ్వవలసిన దాతలందరును కూడ త్వరగా తమ వాగ్దాన సొమ్మును పంపకోరుచున్నాము.

4. అష్టాక్షరీ క్షేత్ర నిర్మాణమునకై విరాళములను వాగ్దానము చేసినదాతలు చాలామంది యింక చాలా సొమ్మును పంపవలసియున్నారు. కట్టడముపని పూర్తి కావలసివచ్చినదిగాన యిందునిమిత్తమై చెల్లించవలసిన బాకీలన్నియు త్వరలో చెల్లించవలసియున్నవి. గాన యీ దాతలుకూడ త్వరలో తమ వాగ్దానపు తాలూకు బాకీలను పంపవలసినదిగా కోరుచున్నాము అష్టాక్షరీ క్షేత్రమునకట్టించుచున్న 24 గదులలో యింకను 4 గదులకు దాతలు యేర్పడియుండలేదు ఉత్సాహము. అవకాశముగలవారు. తమపేరుతో ఒక్కొక్కగదిని కట్టించుటకు విరాళములు సమర్పించవలసినదిగా కోరుచున్నాము మరియు అష్టాక్షరీక్షేత్రమును చేర్చియే కట్టించదలచిన సత్సంగ సదనమునకు రు 30000/- అగునని యస్టిమేటు వేయబడియున్నది. యింతవరకు దానికి కూడ దాతలు యేర్పడి ఉండలేదు. యీసంవత్సరమేదీనికికూడ పునాదులు వేయించి పని ప్రారంభించవలెననియున్నది ఎవరైన దాతలు విరాళములు సమర్పించినచో యీపని యిప్పుడే ప్రారంభం కాగలదు.

కాన యిందుకు ఉత్సాహము కలవారు తమ అభిప్రాయము తెలుపవలసినదిగా కోరుచున్నాము.

కార్యాలయము
శ్రీ వాసుదాసాశ్రమము, నడిగడ్డపాలెం
మండూరుపోష్టు, గుంటూరుజిల్లా

ఇట్లు
సహాయకార్యదర్శి
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

## బదరీ అష్టాక్షరీ క్షేత్ర కైంకర్యము

(1) విజయవాడ కాపురస్థులగు శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహంగారు, బదరిలో మనసంఘమువారు కట్టించుచున్న అష్టాక్షరీ క్షేత్రములో ఒక గదికట్టించుటకు రు 3500 లు ఇత్తుమని వాగ్దానము కావించిరి.

(2) కాకినాడ కాపురస్థురాలగు శ్రీమతి దామెరభావాయమ్మగారు బదరీలో మనసంఘము వారు కట్టించుచున్న అష్టాక్షరీ క్షేత్రములో ఒక గదికట్టించుటకు గాను రు 3500 లు ఇత్తుమని వాగ్దానము గావించిరి.

శ్రియఃపతి వీరికుటుంబములకు సకల శుభములు ప్రసాదించుగాక!

### ఆశ్రమ వార్తలు

శ్రీవాసు దాసాశ్రమములో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు ప్రస్తుతము, ఉదయము తిరుమంత్రార్థము, సాయంకాలము శ్రీవచనభూషణము కాలక్షేపమును కటాక్షించుచున్నారు.

శ్రీవారి చాతుర్మాస్య దీక్ష కార్తీకశుద్ధ ద్వాదశితో పూర్తి యగును, అపిమ్మట శ్రీస్వామివారు ప్రచారార్థమై ప్రతిపల్లీ పట్టణ గ్రామాదులకు బయలు దేరనున్నారు. శ్రీవారిని తమతమగ్రామములకు ఆహ్వానింపదలచిన వారు ముందుగా మా కార్యాలయమునకు తెలియగోరుచున్నాము.

### బదరీ శ్రీనివాస రామానుజస్వామివారల శాశ్వత, తాత్కాలిక, పూజలు

#### శాశ్వత పూజలు

శ్రీ కందాడ రంగనాయకమ్మగారు. 11-0-0
శ్రీ కొమాండూరి కనకవల్లి తాయారమ్మగారు. 29-0-0

#### తాత్కాలిక పూజలు

శ్రీ నందిపాటి రామయ్యగారు. 11-0-0
శ్రీ కుంతీపురం జగన్నాథాచార్యులు గారు. 5-0-0
శ్రీ శతపతి రామనరసింహంగారు. 11-0-00
శ్రీ రాచూరి జమీందారుగారు. 11-0-0

#### కట్నములు.

శ్రీ బరాటం శ్రీనివాసరావుగారు, శ్రీకాకుళం తమ కుమారునకు ఇంజనీర్ పదవిలో ప్రమోషన్ అయినందున సంఘ కట్నం 3-0-0

శ్రీ కర్ర తాయారమ్మగారు. విజయవాడలో జరిపిన 12వ శ్రీయతిరాజసేవామహిళా సంఘముల వార్షికోత్సవములో సంఘకట్నం. 2-0-0

శ్రీ కొత్తలూరి చూడుకుడుత్తమ్మ గారిచ్చిన సంఘకట్నం రు. 2-0-0

శ్రీ నందిపాటి రామయ్యగారు సమర్పించినకట్నం 4-0-0

## సంప్రదాయ రహస్య గ్రంథ పరీక్షలు

పాఠ్యగ్రంథము — ముముక్షుప్పడి (మూడుప్రకరణములు)

ప్రస్తుతము — కేవల సూత్రపరీక్షమాత్రమే— పరీక్షాతేది- 6-12-57

ఈ పరీక్షలో, సంప్రదాయ సిద్ధముగా చక్రాంకణ పరులైన స్త్రీ పురుషులందరు నాలుగు వర్ణములవారు వయస్సుతో నిమిత్తము లేకుండ పాల్గొనవచ్చును.

మూడు ప్రకరణముల సూత్రములన్నియు, క్షుణ్ణముగా, సుశిక్షితముగా ధారావాహినిగా ఎక్కడడిగిన యక్కడ ముఖ పరీక్ష ఇయ్యగలిగి యుండవలెను.

పరీక్షలో పాల్గొన దలచువారు 15 రోజులు ముందుగా తమ ఊరు, పేరు, కులము, గోత్రము, ఆచార్యులు, వివరముగా వ్రాయుచు అభ్యర్థి ఫారము అర్ధరూపాయి 0-8-0 రుసుముతో మా కార్యాలయమునకు పంపవలెను.

పరీక్షలో ఉత్తీర్ణులైన వారికి, బహుమతులు, బిరుదులు ఇవ్వబడును.

**గీతాపరీక్షలు:-** రాబోవు పత్రికలో గీతాపరీక్షల వివరములు ప్రకటింపబడును.

# భగవద్గీత

## తృతీయాధ్యాయము

## (టీకాతాత్పర్య సహితము)




ప్రకాశకులు
విశిష్టాద్వైత ప్రచారక సంఘము

పరిచారణకర్తలు
భక్తినివేదనపత్రికా కార్యాలయము

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెము - చుండూరుపోస్టు, గుంటూరుజిల్లా

# గీతార్థసంగ్రహము

## తృతీయాధ్యాయప్రమేయము

7, శ్లో. అసక్త్యా లోకరక్షాయై ।
గుణేష్వారోప్య కర్తృతామ్ ।
సర్వేశ్వరే వా న్యస్యోక్తా ।
తృతీయే కర్మకార్యతా ॥

అర్థము—

లోకరక్షాయై= లోకులను చెడకుండ కాపాడుట కొఱకు
అసక్త్యా=ఫలమునందలి ఆశలేకుండుటచే
కర్తృతాం=కర్తృత్వమును
గుణేషు=సత్వాదిగుణములయందు
ఆరోప్య=ఉంచిగాని
సర్వేశ్వరే=భగవంతునియందు
న్యస్యవా=ఉంచిగాని
కర్మకార్యతా=నిత్యనైమిత్తికాది కర్మలను చేయుట
తృతీయే=మూడవ అధ్యాయమునందు
ఉక్తా=చెప్పబడినది

తా. శిష్టుడగువాడు కర్మయోగమును విడిచి జ్ఞానయోగమును అవలంబించినచో అందులకధికారములేని సామాన్య ఆస్తిక ప్రజలు ఆతనిని జూచి తాముసు జ్ఞానము నవలంబించి కొనసాగించనేరక చెడిపోవుదురు గాన ఆ శిష్టుడును, అట్టిలోకమును కాపాడునిమిత్తమై ఫలమునందలి ఆశను వీడి కర్తృత్వమును సత్వాది గుణములయందుగాని సర్వేశ్వరుని యందుగాని ఉంచి కర్మలుచేయుచుండ వలెనని యీ మూడవ అధ్యాయమున చెప్పబడినది.

గుణములయందు కర్తృత్వమును ఉంచుటయనగా – ఆత్మకు పుణ్యాపాపములను చేయుట స్వాభావసిద్ధముకాదు. అది గిన్నెసంపర్కముచే నీటికి వేడికలిగినట్లు ప్రకృతి పరిణామమైన శరీరసంబంధముచే తనకు కలిగినది యని తలంచుట.

సర్వేశ్వరునియందు కర్తృత్వ ముంచుటయనగా - సర్వేశ్వరుడు సర్వస్వామిగాన తనకు శేషమగు ఆత్మను కర్తగాగైకొని, తనవియే యగు హవిస్సు మొదలగు ఉపకరణములచే తన యారాధనకై తానే తన కర్మలను చేయించుచున్నాడు అని తలంచుట.

# శ్రీ భగవద్గీత - తృతీయాధ్యాయము

## వి ష య సూ చ క



12. కర్మయోగమునాచరించుటలో పండితులకును పామరులకును గల తారతమ్యము నుపన్యసించుట. శ్లో. 27, 29.

13. కర్తృత్వమును తనయందుంచుకొనక సర్వేశ్వరుని యందే సమర్పించు రీతిని జెప్పుట శ్లో. 30.

14. ఇదియే ఉపనిషత్సారభూతమగు అర్థమగుటచే దీని ననుసరించుటలో గల ఫలవిశేషమును, అనాదరించుటలో గల అనర్థ విశేషమును బోధించుట శ్లో. 31, 32.

15. జ్ఞానయోగమింత కష్టమైనదగుటచే స్వప్రమాదము గూడ నగునని జెప్పుట. శ్లో. 33, 35.

16. జ్ఞాని తిరిగి విషయలోలుడగుటకు కారణమేమని అర్జునుడడుగుట.

17. కామము యొక్క క్రౌర్యమును సయుక్తికముగ బోధించి దానిని జయించు ఉపాయమును దెలిపి వెంటనే దానిని జయింపుమని హెచ్చరించుట. శ్లో. 36, 43.



12. కర్మయోగమునాచరించుటలో పండితులకును పామరులకును గల తారతమ్యము నుపన్యసించుట. శ్లో. 27, 29.

13. కర్తృత్వమును తనయందుంచుకొనక సర్వేశ్వరుని యందే సమర్పించు రీతిని జెప్పుట శ్లో. 30.

14. ఇదియే ఉపనిషత్సారభూతమగు అర్థమగుటచే దీని ననుసరించుటలో గల ఫలవిశేషమును, అనాదరించుటలో గల అనర్థ విశేషమును బోధించుట శ్లో. 31, 32.

15. జ్ఞానయోగమింత కష్టమైనదగుటచే స్వప్రమాదము గూడ నగునని జెప్పుట. శ్లో. 33, 35.

16. జ్ఞాని తిరిగి విషయలోలుడగుటకు కారణమేమని అర్జునుడడుగుట.

17. కామము యొక్క క్రౌర్యమును సయుక్తికముగ బోధించి దానిని జయించు ఉపాయమును దెలిపి వెంటనే దానిని జయింపుమని హెచ్చరించుట. శ్లో. 36, 43.



# శ్రీ భగవద్గీతా - తృతీయోఽధ్యాయః

## కర్మయోగః

అవ. ద్వితీయాధ్యాయోపదేశమువలన అర్జునునకు కలిగిన సందేహము.

అర్జున ఉవాచ:—

1. శ్లో. జ్యాయసీ చేత్కర్మణస్తే
మతా బుద్ధిః జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ॥ 120

అర్థము -
(హే) జనార్దన = ఓ శ్రీకృష్ణా!
బుద్ధిః = జ్ఞానము
కర్మణః = కర్మకంటె
జ్యాయసీ (ఇతి) = శ్రేష్ఠమైనదని
తే = నీయొక్క
మతా, చేత్ = అభిప్రాయమైనచో
(హే) కేశవ = ఓకృష్ణా!
తత్ = అప్పుడు
మాం = నన్ను
ఘోరే = భయంకరమగు
కర్మణి = కర్మయందు
కిం, నియోజయసి = ఏల ప్రవర్తింపజేయు [చున్నావు.

తా. కృష్ణా! కర్మయోగముకంటె జ్ఞానయోగమే మంచిదని నీకుతోచినచో నన్నేల ఆత్మసాక్షాత్కారమునకు విరోధియగు కర్మయోగమునే యవలంబింపమని నిర్బంధించుచున్నావు?

2. శ్లో. వ్యామిశ్రేణైవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య
యేన శ్రేయో ఽహమాప్నుయామ్॥ 121

అర్థము -
వ్యామిశ్రేణైవ = పరస్పర విరుద్ధమగునట్టి
వాక్యేన = మాటచేత
మే = నాయొక్క
బుద్ధిం = బుద్ధిని
మోహయసీవ = కలత పెట్టుచున్నట్లున్నావు
యేన = ఏ వాక్యముచేత
అహం = నేను
నిశ్చిత్య = (కర్తవ్యమును) నిశ్చయించుకొని
శ్రేయః = మేలును
అప్నుయాం = పొందుదునో
తత్ = అటువంటి
ఏకం = ఒకమాటను
వద = చెప్పుము

తా. కర్మ - జ్ఞాన మిశ్రమగుటచే విరుద్ధముగా గాన్పించునట్టి మాటను జెప్పి నన్ను మరింత భ్రమపెట్టుచున్నట్లు తోచుచున్నది. అట్లుగాక 'నేను చేయవలసినది ఇది' అని తేల్చుకొని దాని నాచరించి నేను మేలును పొందునట్టి ఒకే మాటను చెప్పుము.

శ్రీభగవానువాచ

అవ:—శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నకు అధికారిభేదముచే సమాధానమొసంగుట.

3. శ్లో. లోకే ౽స్మిన్ ద్వివిధా నిష్ఠా ।
పురా ప్రోక్తా మయా ౽నఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం ।
కర్మయోగేన యోగినాం ॥ 122

(హే) అనఘ=పాపములులేని ఓఅర్జునా!
అస్మిన్=ఈ
లోకే=ప్రపంచమున
సాంఖ్యానాం=జ్ఞానయోగమునకు తగినవారలకు
జ్ఞానయోగేన=జ్ఞానయోగముచేతను
యోగినాం=కర్మయోగమునకు తగినవారలకు
కర్మయోగేన=కర్మయోగముచేతను
(ఇతి)=(అని)
నిష్ఠా=అనుష్ఠానక్రమము
ద్వివిధా=రెండురీతులుగ
పురా=వెనుక
మయా=నాచేత
ప్రోక్తా=చక్కగాచెప్పబడినది

శ్రీకృష్ణుడు పలికెను

తా. ఓ అర్జునా! లోకమున రకరకములమనుష్యులుండుటచే జ్ఞానయోగము ననుష్ఠించు యోగ్యతకలవారు జ్ఞానయోగము ననుష్ఠించవలెననియు, కర్మయోగమునకు తగినవారు కర్మయోగము ననుష్ఠించవలెననియు, నేను వెనుక స్పష్టముగనే చెప్పితిని.

అవ:—సంసారికి మోక్షాపేక్ష కలిగినతోడనే జ్ఞాననిష్ఠ దుస్సాధ్యము అనుచున్నాడు.

4. శ్లో. న కర్మణా మనారంభాత్ ।
నైష్కర్మ్యం పురుషో౽శ్నుతే ।
న చ సన్న్యసనా దేవ ।
సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 123

కర్మణాం=(వేదోక్తములగు)కర్మలయొక్క
అనారంభాత్=చేయుటకు మొదలుపెట్టకుండుటవలన
పురుషః=మనుష్యుడు
నైష్కర్మ్యం=జ్ఞాననిష్ఠను
న అశ్నుతే=పొందడు
సన్న్యసనాత్ ఏవ=(ఆకర్మలనుఆరంభించి) విడుచుటవలననే
సిద్ధిం=జ్ఞాన నిష్ఠను
న సమధిగచ్ఛతి=పొందడు

తా. వేదవిహితములగు కర్మలను ప్రారంభించనంత మాత్రమున మనుష్యుడు జ్ఞాననిష్ఠను లభింపనేరడు. అట్లొకవేళ ప్రారంభించినను వాటిని పూర్తిచేయక విడిచిపెట్టుటచేతను జ్ఞాననిష్ఠను లభింపనేరడు.

అవ:- దానికి కారణమును చెప్పుచున్నాడు.

5. శ్లో. న హి కశ్చిత్ క్షణ మపి ।
జాతు తిష్ఠ త్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ ।
సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ 124

కశ్చిత్=ఏవాడును
జాతు=ఎప్పుడైనను
క్షణమపి=క్షణకాలమైనను కూడ
అకర్మకృత్=కర్మ చేయనివాడై
న హి తిష్ఠతి=ఉండలేడు
సర్వః=ప్రతివాడును
ప్రకృతిజైః=ప్రకృతివలనపుట్టిన
గుణైః=సత్వరజస్తమోగుణములచే
అవశః=అస్వతంత్రుడై
కర్మ(ప్రతి)=కర్మను(గూర్చి)
కార్యతే=ప్రేరేపించబడుచున్నాడు.

తా. ఈ లోకమున జీవించియున్న వాడెవ్వడును ఎప్పుడైనను ఒక క్షణకాలమైనను ఏదో యొక కర్మచేయక నుండజాలడు. అట్లుండదలచుకొన్నను (ప్రకృతిపరిణామమగు శరీరముయొక్క) సత్వ రజస్తమో గుణములు వానిని వశముజేసుకొని బలవంతముగా తమ తమ పనులు చేయించియే తీరును.

అవ. కర్మయోగికాకయే జ్ఞానయోగము నవలంబించువానిని నిందించుచున్నాడు

6. శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య ।
య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా ।
మిథ్యాచార స్స ఉచ్యతే ॥ 125

యః=ఎవడు
కర్మేంద్రియాణి=వాక్పాదపాణిపాయూపస్థ లనబడు కర్మేంద్రియములను
సంయమ్య=అరికట్టి
ఇంద్రియార్థాన్=రూప-రస-గంధ-స్పర్శ-శబ్దములను
మనసా=మనస్సులో
స్మరన్=తలచుచు
ఆస్తే=ఉండునో
విమూఢాత్మా=ఆత్మయందు ప్రవర్తించని మనస్సుగల
సః=వాడు
మిథ్యాచారః=(ఇతి) కపటప్రవర్తన గల వాడు (అని)
ఉచ్యతే=చెప్పబడుచున్నాడు

తా. ఆత్మజ్ఞానమును సంపాదించవలెనని కర్మేంద్రియములను బలవంతముగా బిగపెట్టుకొని కూర్చొని యుండియు విషయలంపటుడగుటచే మనస్సును ఆత్మయందు నిలుపలేక మనస్సుతో మాత్రము శబ్దాది విషయములను తలంచుచునే యుండువాడు మోసగాడనబడును.

అవ. కర్మయోగిని పొగడు చున్నాడు.

7. శ్లో॥ య స్త్వింద్రియాణి మనసా।
నియమ్యా ఽరభ తే ఽర్జున।
క ర్మేన్ద్రియైః కర్మయోగం ।
అసక్త స్స వి శి ష్య తే ॥ 126

అర్థము -
హే అర్జున = ఓ అర్జునుడా!
యః, తు = ఎవడైతే
మనసా = మనస్సుచేత
ఇన్ద్రియాణి = జ్ఞానేంద్రియములను
నియమ్య = అరికట్టి
అసక్తః = ఫలమునుకోరనివాడై
కర్మేన్ద్రియైః = వాగాదికర్మేన్ద్రియములచే
కర్మయోగం = కర్మయోగమును
ఆరభతే = చేయుచున్నాడో
సః = వాడు
విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు

తా. మనస్సు నాత్మయందుంచి దానిచే (చక్షురాది) జ్ఞానేంద్రియము లను స్వాధీనము గావించుకొని కర్మేంద్రియములచే ఫలమునపే క్షింపక కర్మయోగమునాచరించువాడు జ్ఞాన యోగికంటె ఉత్తముడు.

అవ. అర్జునుని ప్రశ్నకు సరియగు జవాబునిచ్చుచు సౌకర్యాది కారణము లచే కర్మయోగమే శ్రేష్ఠమనుచున్నాడు.

8. శ్లో॥ నియతం కురు కర్మ త్వం ।
కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీర యాత్రాపి చ తే ।
న ప్ర సి ద్ధ్యే ద క ర్మ ణః॥ 127

అర్థము -
త్వం = నీవు
నియతం = తప్పనిసరియగు
కర్మ = శాస్త్రీయమైనకర్మను
కురు = చేయుము
అకర్మణః = జ్ఞానయోగముకంటె
కర్మ = కర్మయోగము
జ్యాయః, హి = శ్రేష్ఠమైనదికదా!
అకర్మణః = ఊరకనే కర్మ నే చేయని
తే = నీకు
శరీరయాత్రాపిచ = జీవయాత్రకూడ
న, ప్రసిద్ధ్యేత్ = సాగదు

తా. శరీరముతోనున్నవానికి కర్మలుచేయుట తప్పనిసరి. అట్లుచేయని వానికి బ్రతుకు తెరువే కాన్పించదు. అందువలన జ్ఞాననిష్ఠకంటె కర్మ నిష్ఠయేమంచిది.

అవ. చేయదగిన కర్మ లెట్టివియో చేయరాని వెట్టివియో నిరూపించు
చున్నాడు.

9. శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణో ఽన్యత్ర ।
లోకో ఽయం కర్మ - బంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ।
ముక్త - సంగ స్సమాచర ॥ 128

అర్థము -
హే కౌంతేయ = ఓ అర్జునః
యజ్ఞార్థాత్ = వైదికకర్మలకొరకైన
కర్మణః = వ్యాపారముకంటె
అన్యత్ర = వేరైనకర్మయందే
అయం = ఈ
లోకః = జనము
కర్మబన్ధనః = కర్మబంధకముగాకలది
(భవతి) = అగుచున్నది.
తదర్థం = ఆవైదికకర్మకొరకే
కర్మ = ద్రవ్యసంపాదనాదికర్మను
ముక్తసంగః = కోరికనువిడిచినవాడవై
సమాచర = చేయుము

తా. వేదము విధించిన కర్మలను సాగించుటకు ద్రవ్యార్జనాదుల గావించినను అవి నీనిని సంసారమున బంధింపవు. కావున అర్జునా! నీవు వేదోక్త కర్మలకొరకే అట్టి ద్రవ్యార్జనాదుల గావింపుము.

అవ. యజ్ఞశేషముచే శరీరమును పోషించుకొనవలెను. లేనిచో మహా పాపము అనుచున్నాడు.

10. శ్లో. సహ యజ్ఞైః ప్రజా స్సృష్ట్వా । పురో వాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వం । ఏష వో ఽస్త్విష్ట కామధుక్॥

అర్థము -
పురా = సృష్టికాలమున
ప్రజాపతిః = నారాయణుడు
యజ్ఞైఃసహ = యజ్ఞములతోపాటు
ప్రజాః = ప్రజలను
సృష్ట్వా = పుట్టించి
అనేన = ఈయజ్ఞముతో
ప్రసవిష్యధ్వం = వృద్ధిపొందుడు
ఏషః = ఈయజ్ఞము
వః = మీకు
ఇష్టకామధుక్ = కావలసినకోర్కెల [నిచ్చునది
అస్తు = అగుగాక
(ఇతి) = (అని)
ఉవాచ = పలికెను

తా. శ్రీమన్నారాయణుడు లోకములనుసృష్టించునప్పుడే వారితోపాటుగా యజ్ఞములను కూడ సృష్టించి 'ఇవి మీకు మోక్షమును, దానికి కావలసినవాటి నన్నిటిని యిచ్చును గాన వీటి నాచరించి వృద్ధిపొందుడు, అనియానతిచ్చెను.

అవ. దానినే ఉపపాదించుచున్నాడు.

11. శ్లో. దేవాన్ భావయతానేన ।
తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః ।
శ్రేయః పరమవాప్స్యథ ॥ 130

(హే ప్రజాః=(ఓ! ప్రజలారా!)
అనేన=ఈయజ్ఞముచేత
దేవాన్=దేవతలను
భావయత=ఆరాధింపుడు
తే, దేవాః=ఆ, దేవతలు
వః=మిమ్ములను
భావయంతు=పోషింతురుగాక!

పరస్పరం=ఒకరినొకరు
భావయంతః=ఆదరించుకొనుచున్నవారగుచు
పరం=గొప్పదైన
శ్రేయః=వృద్ధిని (మోక్షమును)
అవాప్స్యథ=పొందగలరు

తా. ఈ యజ్ఞముల నాచరించి మీరు దేవతల నారాధించిన వారు, మీకు అనవరతము వాటి నొసంగి మిమ్ము పోషింతురు. ఇట్లొకరి నొకరు ఆదరించుకొనుచున్నచో మీకు తుదకు మోక్షముకూడ లభించును.

అవ: యజ్ఞములను నిరసించు వారిని చెప్పుచున్నాడు.

12. శ్లో. ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః ।
దాస్యంతే యజ్ఞ - భావితాః ।
తైర్దత్తాన ప్రదాయైభ్యో ।
యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 131

యజ్ఞ భావితాః=యజ్ఞములచే నారాధింపబడిన
దేవాః=దేవతలు
వః=మీకు
ఇష్టాన్=కావలసిన
భోగాన్=సుఖములను
దాస్యంతే హి=ఇత్తురుగదా!
తైః=వారిచే

దత్తాన్=ఇవ్వబడినవాటిని
ఏభ్యః=ఈదేవతలకొరకు
అప్రదాయ=ఈయక
యః=ఎవడు
భుంక్తే=అనుభవించుచున్నాడో
సః=వాడు
స్తేనఃఏవ=దొంగయే
భవతి=అగుచునాడు.

తా. మీరు యజ్ఞములచే దేవతల నారాధించినచో వారు మీకు సమస్త సుఖములనే గాక తిరిగి తమ నారాధించుటకు వలయు వాటినికూడ నొసంగుదురు. అట్టివాటిని తిరిగి యజ్ఞముల నాచరించి వారి కర్పింపక తానే యనుభవించినచో నట్టివాడు దొంగ యగును.

అవ:— యజ్ఞముల నాచరించిన ఫలమును జెప్పుచున్నాడు.

13 శ్లో. యజ్ఞ - శిష్టా - శిన స్సంతో
ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపాః ।
యే పచన్త్యాత్మ - కారణాత్ ॥ 13

యజ్ఞ-శిష్టాశినః=యజ్ఞమును చేయగామిగిలినవాటిని తినునట్టి
సంతః=సజ్జనులు
సర్వకిల్బిషైః=సకలపాపముల చే
ముచ్యన్తే=విడువబడుచున్నారు
యే, తు=ఎవరైతే
ఆత్మ కారణాత్=తమకొరకుమాత్రమే,
పచంతి=వండుకొనుచున్నారో
పాపాః=పాపాత్ములగు
తే=వారు
అఘం=పాపమును
భుంజతే=అనుభవించుచున్నారు.

తా. న్యాయార్జిత పదార్థములను భగవంతున కర్పించి తిను వారి పాపము లన్నియు పటాపంచలై పోవును. కాని అట్లుచేయక తమపొట్టను నింపుకొనువారు మహాపాపులు. వారు తినునది పాపమే గాని అన్నము కాదు.

అవ:—సమస్తమును యజ్ఞమూలమేగాన దాని నాదరించవలెననియు లేనిచో దోషమనియు చెప్పుచున్నాడు.

14. శ్లో. అన్నాత్ భవంతి భూతాని ।
పర్జన్యా దన్న సంభవః ।
యజ్ఞాత్ భవతి పర్జన్యో ।
యజ్ఞః కర్మ - సముద్భవః ॥ 133

అన్నాత్=అన్నమువలన
భూతాని=సజీవశరీరములు
భవంతి=కలుగుచున్నవి
పర్జన్యాత్=వర్షమువలన
అన్నసమ్భవః=అన్నముయొక్క పుట్టుక
(భవతి=కలుగుచున్నది)
పర్జన్యః=వర్షము
యజ్ఞాత్=యజ్ఞమువలన
(భవతి=కలుగుచున్నది)
యజ్ఞః=యజ్ఞము
కర్మసముద్భవః=కర్మవలన పుట్టుక కలది
(భవతి=అగుచున్నది)

తా. జీవునితో కూడి యున్న శరీరములు అన్నము వలనను, ఆ యన్నము వర్షము వలనను, ఆ వర్షము యజ్ఞము వలనను, ఆ యజ్ఞము ద్రవ్యార్జనాది కర్మముల వలనను. సిద్ధించును.

15. శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి ।
బ్రహ్మాక్షర - సముద్భవం ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ ।
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 134

అర్థము -
కర్మ = (అట్టి) కర్మ
బ్రహ్మోద్భవం = శరీరమువలనపుట్టి నదిగాను
బ్రహ్మ = శరీరము
అక్షరసముద్భవం = జీవునిచే కలిగినదిగాను
విద్ధి = తెలుసుకొనుము
తస్మాత్ = అందువలన
సర్వగతం = కర్మాధికారులందరకునుగల
బ్రహ్మ = శరీరము
నిత్యం = ఎల్లప్పుడును
యజ్ఞే = యజ్ఞమునందు
ప్రతిష్ఠితమ్ = ఆధారపడియున్నది
(భవతి = అగుచున్నది.)

తా॥ అట్టి కర్మ సజీవశరీరమువల్ల పుట్టును. అనగా అట్టి కర్మలు చేయు శక్తి అన్నపానాదులచే తృప్తిచెందిన జీవునివలనపుట్టును. కావున కర్మాధికారుల శరీరములు యజ్ఞమూలములు.

16. శ్లో. ఏవం ప్రవర్తితం చక్రం ।
నానువర్తయతీహ యః ।
అఘాయు రిన్ద్రియారామో ।
మోఘం పార్థ స జీవతి ॥ 135

అర్థము -
హే పార్థ = ఓ అర్జునా!
ఏవం = ఈవిధముగా
ప్రవర్తితం = నడుపబడిన
చక్రం = చక్రమును
యః = ఎవడు
ఇహ = ఈలోకమున
న, అనువర్తయతి = అనుసరించినడవడో
సః = వాడు
అఘాయుః = పాపములచే అగు ఆయువు కలవాడు
ఇన్ద్రియారామః = ఇన్ద్రియములే సుఖించు [తోటలుగా కలవాడు
మోఘం = వ్యర్థముగా
జీవతి = బ్రతుకుచున్నాడు

తా॥ ఈ విధముగ పరమాత్మచే నిర్దిష్టమైన కర్మచక్రమును అనుసరించి నడువనివాడు పాపజీవియు, ఇంద్రియ-భోగలాలసుడును, వ్యర్థమైన బ్రతుకు కలవాడు అగుచున్నాడు.

అవ:—సహజమగు ఆత్మదర్శనముకలుగు ఫలదశలో కర్మల నాచరింప నవసరము లేదనుచున్నాడు.

17. శ్లో. యస్త్వాత్మరతి రేవ స్యాత్ ।
ఆత్మ - తృప్త శ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టః ।
తస్య కార్యం న విద్యతే ॥ 136

అర్థము -

| | |
|---|---|
| యః=యే | ఆత్మని ఏవ=ఆత్మయందే |
| మానవఃతు=మనుష్యుడైతే | సంతుష్టఃచ=సంతోషించువాడును |
| ఆత్మరతిఃఏవ=ఆత్మయందాసక్తిగల వాడును | స్యాత్=అగునో, |
| | తస్య=వానికి |
| ఆత్మతృప్తఃచ=ఆత్మచేతనే తృప్తిచెందిన వాడును | కార్యం=చేయతగినది |
| | నవిద్యతే=లేదు |

తా. ఎవనికి పూర్వ - కర్మ - విశేషము వలన ఆత్మధ్యానమే ధారకము, పోషకము, భోగ్యము అగునో వాడు తిరిగి ఆత్మదర్శనము కొరకేమియు చేయ నవసరము లేదు.

18. శ్లో. నైవ తస్య కృతేనార్థో ।
నా కృతేనే హ కశ్చన ।
న చాస్య సర్వ-భూతేషు ।
కశ్చి దర్థ-వ్యపాశ్రయః ॥ 137

| | |
|---|---|
| తస్య=అట్టివానికి | న=లేదు |
| ఇహ=ఈలోకమున | అస్య=వీనికి |
| కృతేన=కర్మలు చేయుటచేత | సర్వభూతేషు=సకలభూతములయందును |
| అర్థః=ప్రయోజనము | అర్థవ్యపాశ్రయః=ప్రయోజనముకొరకు ఆశ్రయించదగినది |
| నైవ=లేనేలేదు | |
| అకృతేన=కర్మలుచేయకుండుటచేత | కశ్చిత్=ఒక్కటియు |
| కశ్చన=ఏఅనర్థము | న=లేదు |

తా. ఇట్లు సహజముగనే ఆత్మను చూడగల వీనికి, అందు నిమిత్తమై కర్మల నాచరించుట వలన వేరొండు లాభము గాని ఆచరించకుండుట వలన నష్టము గాని యుండదు. కావున వానికి ఆకాశాది భూతములతోను తత్కార్యములగు భౌతికములతోను పనిలేదు.

అవ:— అట్టిదశకు యోగ్యతలేనివాడు ఆత్మదర్శనమునకై కర్మయోగము నాచరించవలెననుచున్నాడు.

19. శ్లో. తస్మా దసక్త స్సతతం ।
కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యా చరన్ కర్మ ।
పర మాప్నోతి పూరుషః ॥ 138

తస్మాత్ =అందువలన
అసక్తః—ఫలాశ లేనివాడవగుచు
కార్యం(ఇతి) చేయవలసినది(అని)
సతతం=ఆత్మసాక్షాత్కారము లభించు వరకు
కర్మ=కర్మను
సమాచర=చక్కగా చేయుచుండుము
అసక్తః=సంగము లేనివాడవై
కర్మ=కర్మను
ఆచరన్=చేయునట్టి
పూరుషః=నరుడు
పరం=శుద్ధాత్మను
ఆప్నోతిహి=పొందునుగదా

తా. కనుక ఆత్మదర్శన మగువరకు తప్పనిసరి యని ఫలాదులనువిడిచి కర్మలను జేయుము. తప్పక దానివల్లనే ఆత్మప్రాప్తి కలిగి తీరును.

అవ:—జ్ఞానయోగాధికారులైనను లోకముకొరకు కర్మలనే చేయవలెననుచున్నాడు.

20. శ్లో. కర్మణైవ హి సంసిద్ధిం ।
ఆస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవా పి ।
సంపశ్య న్కర్తు మర్హసి ॥ 139

జనకాదయః=జనకుడు మొదలగువారు
కర్మణాఏవహి=కర్మల నాచరించుటచేతనే కదా!
సంసిద్ధిం=శుద్ధాత్మస్వరూపసిద్ధిని
ఆస్థితాః=పొందిరి
లోకసంగ్రహం =లోకరక్షణమును
సంపశ్యన్ అపి=చూచినవాడవైనను
కర్తుంఏవ=కర్మలనుచేయుటకే
అర్హసి=తగుచున్నావు

తా. జనకుడు మొదలగు మహాత్ములు జ్ఞానయోగాధికారులైనను కర్మల నాచరించుట వలననే శుద్ధాత్మస్వరూపమును పొందగలిగిరి. లోకము అనర్థముపాలు గాకుండుటకైనను ఉత్తముడగు జ్ఞానయోగాధికారి కూడ కర్మయోగమునే చేయవలెను.

అవ:—ఎందుల కట్లుచేయవలెనో చెప్పుచున్నాడు.

21. శ్లో. యద్య ద్దాచరతి శ్రేష్ఠః ।
తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే ।
లోక స్త దనువర్తతే ॥ 140

శ్రేష్ఠః=ఉత్తముడు
యత్ యత్=ఏయేకర్మను
ఆచరతి=చేయుచున్నాడో
తత్ తత్ ఏవ=ఆ యాకర్మనే
ఇతరః=సామాన్యుడగు
జనః=మనుష్యుడు
(ఆచరతి)=(చేయుచున్నాడు).
సః=ఆ ఉత్తముడు
యత్ ప్రమాణం=ఏ అంగములతోకూడిన దిగా
కురుతే=చేయుచున్నాడో
లోకః=పామరజనుడున్ను
తత్=ఆయంగములతోనే ఆ కర్మను
అనువర్తతే=అనుసరించి చేయుచున్నాడు.

తా. గొప్పవాడుగా ఎన్నబడినవాడు ఏ కర్మను ఎట్టి యంగములతో నాచరించునో దానిని జూచి లోకమున పామరుడు కూడా ఆకర్మనే ఆ యంగములతోనే ఆచరించును.

అవ:—ఏవిధమగు ప్రయోజనమునుగూడలేని భగవంతుడైనను కర్మయోగము నాచరించవలెను.

22. శ్లో. న మే పార్థాఽస్తి కర్తవ్యం ।
త్రిషు లోకేషు కించన ।
నాఽనవాప్త మవాప్తవ్యం ।
వర్త ఏవ చ కర్మణి ॥ 141

హేపార్థ=ఓఅర్జునా!
త్రిషు=మూడగు
లోకేషు=లోకములలోను
మే=నాకు
కర్తవ్యం=చేయవలసినపని
కించన=ఒక్కటియును
నాస్తి=లేదు
అనవాప్తం=పొందబడనిదై
అవాప్తవ్యం=పొందవలసినదియు
న=లేదు
(తథాపి)అయినప్పటికిని
కర్మణి=కర్మయందు
వర్తేఏవ=ప్రవర్తించుచునేయున్నాను

తా. మూడు లోకముల యందును స్వేచ్ఛారూపముతో సంచరించు నాకు ఇదివరకు లేక ఇప్పుడు కర్మల నాచరించి పొందవలసిన దేదియు లేదు. ఐనను లోకమును కాపాడుటకే కర్తలనుచేయుచున్నాను.

అవ:—భగవంతు డేల కర్మల నాచరించవలెనో చెప్పు మన్నాడు.

23. శ్లో. యది హ్యహం న వర్తేయం ।
జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః ॥ 142

హేపార్థ=ఓఅర్జునా!
అహం=నేను
జాతు=ఒకవేళ
అతంద్రితః=బద్ధకములేనివాడనై
కర్మణి=కర్మయందు
న వర్తేయంయది=ప్రవర్తించకపోతినేని
మనుష్యాః=మనుష్యులు
సర్వశః=అన్నివిధముల
మమ=నాయొక్క
వర్త్మ=దారినే
అనువర్తంతేహి=అనుసరింతురుగదా!

తా. అర్జునా! నేను బద్ధకించక కర్మలను చేయనేని, లోకులును పూర్తిగా నావలెనే కర్మల నాచరించకుండగ యుందురు.

24. శ్లో. ఉత్సీదేయు రిమే లోకాః ।
న కుర్యాం కర్మ చే దహం ।
సంకరస్య చ కర్తా స్యాం ।
ఉపహన్యా మిమాః ప్రజాః ॥ 143

అహం=నేను
కర్మ=కర్మను
నకుర్యాంచేత్=చేయనేని
ఇమేలోకాః=ఈజనులు
ఉత్సీదేయుః=చెడుదురు
సంకరస్య=సాంకర్యమునకు
కర్తా=కారకుడను
స్యాం=అగుదును
ఇమాఃప్రజాః=ఈలోకులను
ఉపహన్యాం=పాడుచేసినవాడనగుదును.

తా. నేను నాకులోచిత కర్మల నాచరించనిచో దానిని జూచి లోకులును తమ కర్మలను విడిచి చెడుదురు. దానిచే కులములు సంకరమై ప్రజలు నశింతురు' ఈ వినాశమునకు మూలము నేనగుదును.

అవ:—జ్ఞానయోగాధికారి కర్మలను చేయు విధానమును చెప్పుచున్నారు

25. శ్లో. సక్తాః కర్మ ణ్యవిద్వాంసో ।
యథా కుర్వంతి భారత ।
కుర్యా ద్విద్వాన్ తథా ఽసక్తః ।
చికీర్షు ర్లోక - సంగ్రహమ్ ॥ 144

హేభారత=ఓఅర్జునా!
అవిద్వాంసః=పామరులు
కర్మణి=కర్మయోగమునందు
సక్తాః=ఆసక్తికలవారై
యథా=ఎట్లు
కుర్వంతి=చేయుదురో
తథా=అటులనే
విద్వాన్=ఆత్మజ్ఞుడు
అసక్తః=ఫలాదులయందుసంబధములేని వాడై
లోకసంగ్రహం=లోకరక్షణను
చికీర్షుః=చేయగోరినవాడై,
కుర్యాత్=కర్మలను చేయవలెను

తా. ఆత్మజ్ఞానముకలిగి జ్ఞానయోగమున కర్హుడైన శిష్టుడు కూడ, ఆత్మజ్ఞానములేకుండుటచే కర్మయోగమునకు మాత్రమే తగిన వారు ఆ కర్మలనే చేయునట్లు, తాము కూడా ఫలాదుల నపేక్షింపక లోకరక్షణ కొఱకు కర్మలనే చేయవలెను.

26. శ్లో. న బుద్ధిభేదం జనయేత్ ।
అజ్ఞానాం కర్మ-సంగినాం ।
జోషయేత్ సర్వ-కర్మాణి ।
విద్వాన్ యుక్తస్సమాచరన్॥ 145

విద్వాన్=ఆత్మజ్ఞాని
అజ్ఞానాం=ఆత్మజ్ఞానములేని,
కర్మసంగినాం=కర్మయోగులగువారికి;
బుద్ధిభేదం=బుద్ధికి మార్పును;
నజనయేత్=పుట్టించరాదు
యుక్తః=జ్ఞానముతోకూడినవాడై
సమాచరన్=కర్మలనాచరించుచు
సర్వకర్మాణి=అన్నికర్మలనుగూర్చియు
జోషయేత్=ప్రేమను పుట్టించవలెను.

తా. ఆత్మను లెస్సగ నెఱుంగనివారు దానిని సాక్షాత్కరించు కొనుటకు కర్మయోగమునే యవలంబింతురు. ఆత్మజ్ఞానియగువాడు వారి బుద్ధిమారకుండునట్లు తానుకూడ కర్మయోగమే ఆత్మసాక్షాత్కారముకలుగ చేయునను బుద్ధితోకూడి వారికి ప్రేమను పుట్టించవలెను.

అవ:—ఇట్లు కర్మయోగము నాచరించు పండితునకును పామరునకును భేదమును తెలుపుచున్నాడు. అందు పామరుడు—

27\. శ్లో. ప్రకృతేః క్రియమాణాని ।
గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార-విమూఢాత్మా ।
కర్తా ఽహ మితి మన్యతే ॥ 145

అహంకార-విమూఢాత్మా= దేహాత్మాభిమానముచే ఆత్మస్వరూపము నెఱుగనివాడు
ప్రకృతేః=ప్రకృతియొక్క
గుణైః=సత్త్వరజస్తమోగుణములచే
సర్వశః=అనేకవిధములుగా
క్రియమాణాని=చేయబడుచున్న
కర్మాణి=కర్మలనుగూర్చి
అహం=నేను
కర్తా=చేయువాడను
ఇతి=అని
మన్యతే=తలంచుచున్నాడు

తా. ప్రకృతియొక్క సత్త్వ - రజ - స్తమోగుణములు, తమ స్వభావమునుబట్టి అనేక విధములుగ ఆయా కర్మలచేయించుచుండ, దేహాత్మాభిమానముచే ఆత్మ నెఱుంగనివాడు తానే కర్తనని తలంచును.

అవ:—పండితుడన్ననో

28\. శ్లో. తత్త్వవిత్తు మహాబాహో ।
గుణ - కర్మ-విభాగయోః ।
గుణాః గుణేషు వర్తంతే ।
ఇతి మత్వా న సజ్జతే ॥ 146

హే మహాబాహో=ఓ అర్జునా!
గుణ-కర్మ-విభాగయోః=సత్త్వాదిగుణములయొక్కయు, అవిచేయుకర్మలయొక్కయు విభాగముల విషయమై
తత్త్వవిత్తు=నిజస్వరూపము నెఱింగినవాడు
గుణాః=సత్త్వాదిగుణములు
గుణేషు=తమ కార్యములయందు
వర్తంతే=ప్రవర్తించుచున్నవి
ఇతి=అని
మత్వా=తలంచి
నసజ్జతే=లగ్నమైయుండడు

తా. సత్త్వాదిగుణములయొక్కయు, అవిచేయు పనులయొక్కయు తారతమ్యముల నెఱింగినవాడు, ఆ గుణములు తమ పనులను చేయుచున్నవని తలచి ఆ కర్మలయందు తాను కర్తనని తలంపడు.

అవ:—జ్ఞానికి కర్మయోగానుష్ఠానావశ్యకతను చెప్పుచున్నాడు

29. శ్లో. ప్రకృతేః గుణ-సమ్మూఢాః ।
సజ్జంతే గుణ - కర్మసు ।
తా నకృత్స్నవిదో మందాన్ ।
కృత్స్నవి న్న విచాలయేత్ ॥ 143

ప్రకృతేః=ప్రకృతియొక్క
గుణసమ్మూఢాః=సత్వాదిగుణములచే మోహమును చెందినవారు
గుణకర్మసు=సత్వాదుల క్రియలయందు
సజ్జంతే=ఆసక్తులగుచున్నారు
అకృత్స్నవిదః=పూర్ణజ్ఞానము లేని
తాన్=అటువంటి
మందాన్=మూర్ఖులను
కృత్స్నవిత్=పూర్ణజ్ఞానముకలవాడు
నవిచాలయేత్=చలింపజేయరాదు

తా. పూర్ణజ్ఞానములేనివారు ప్రకృతిగుణములచే ఆత్మస్వరూపమును వాస్తవముగ నెఱుంగక కర్మలనే ఆదరముతో నాచరించుచున్నారు. పూర్ణజ్ఞానముకలవాడు అట్టివారిబుద్ధిని చలింప జేయరాదు.

అవ:—తానాచరించు కర్మలకు పరమాత్మనే కర్తగాభావించు రీతిని చెప్పుచున్నాడు

30. శ్లో. మయి సర్వాణి కర్మాణి ।
సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా ।
యుద్ధ్యస్వ విగతజ్వరః ॥ 144

సర్వాణి=సమస్తమైన
కర్మాణి=కర్మలను
మయి=నాయందు
అధ్యాత్మచేతసా=ఆత్మయందులగ్నమైన మనస్సుతో
సన్న్యస్య=సమర్పించి
నిరాశీః=ఫలమునందాశ లేనివాడవును
నిర్మమః=మమకారము లేనివాడవును
భూత్వా=అయి
విగతజ్వరః=మానసిక సంతాపము లేనివాడవై
యుద్ధ్యస్వ=యుద్ధము చేయుము

తా. ఆత్మయొక్క వాస్తవజ్ఞానము కలవాడవై నీవు చేయు కర్మల నన్నిటిని మనసార అంతరాత్మనగు నాయందు సమర్పించి, ఫలము నందాశను ఈ కర్త నాదియనెడు మమకారమును విడిచి 'నే నేమగుదునో' యను బెంగ లేక యుద్ధాది శాస్త్రోక్తకర్మల నాచరింపుము.

అవ:—ఇదియే ఉపనిషత్తు కభిమతమైన సారతమమగు అర్థమనుచున్నాడు

31. శ్లో. యే మే మత మిదం నిత్యం ।
అను తిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతో ఽనసూయంతో ।
ముచ్యంతే ఽపి కర్మభిః ॥ 150

యేమానవాః=ఏమనుష్యులు
మే=నాయొక్క
ఇదంమతం=ఈయభిప్రాయమును
నిత్యం=ఎల్లప్పుడును
అనుతిష్ఠంతి=ఆచరించుచున్నారో
శ్రద్ధావంతః=శ్రద్ధనుకలిగియున్నారో
అనసూయంతః=అసూయలేకయుందురో
తేఽపి=వారుకూడ
కర్మభిః=కర్మలచే
ముచ్యన్తే=విడిచిపెట్టబడుచున్నారు

తా. ఆస్తికులై ఈ నామతమును ఆచరించినను, లేదా శ్రద్ధతో విశ్వసించినను, అదియునులేదా అసూయతో తప్పులెన్నకున్నను, వారందరును కర్మలచే బంధింపబడరు.

అవ—దీనిని నమ్మనివారిని నిందించుచున్నాడు

32. శ్లో. యే త్వేత దభ్యసూయంతో ।
నా నుతిష్ఠంతి మే మతం ।
సర్వజ్ఞాన-విమూఢాన్ తాన్ ।
విద్ధి నష్టా న చేతసః ॥ 151

యేతు=ఎవ్వరైతే
మే=నాయొక్క
ఏతత్ మతం=ఈయభిప్రాయమును
అభ్యసూయంతః=ద్వేషించువారై
నానుతిష్ఠంతి=ఆచరించరో
తాన్=వారిని
సర్వజ్ఞాన-విమూఢాన్=అన్నిజ్ఞానముల యందును ముక్కిలిమూఢులనుగాను
నష్టాన్=చెడినవారినిగాను
అచేతసః=మనస్సులేనివారినిగాను
విద్ధి=తెలుసుకొనుము

తా. సమస్త ఆత్మలును నాచేత నడుపబడుచున్నవనెడు నా సిద్ధాంతమును ఆదరించకయు, దానియందు శ్రద్ధలేకయు, అసూయపడు చుండువారికి ఎన్నడును వాస్తవజ్ఞానము కలుగక మూఢులై చెడుదురు,

33. శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి. 152

అర్థము:- జ్ఞానవాన్- అపి= ఆత్మ విషయక శాస్త్రజన్య జ్ఞానముకలవాడే యయినను; స్వస్యాః= తనయొక్క; ప్రకృతేః= ప్రాచీనవాసనకు; సదృశం= అనుగుణముగా; చేష్టతే= వ్యవహరించుచున్నాడు; భూతాని= ప్రాణములు; ప్రకృతిం= తమ యనాది కాల వాసనను; యాంతి= అనుసరించుచున్నవి; నిగ్రహః= శాస్త్రకృతనియమనము; కిం- కరిష్యతి= ఏమి చేయగలదు.

తా॥ శాస్త్రముల నెఱిగిన వాడైనను, తన ప్రాచీన కర్మవాసనను బట్టియే విషయములను బట్టి ప్రాకులాడుచుండును, ఇది ప్రకృతి సంబంధముగల ప్రాణుల స్వభావము. శాస్త్రజ్ఞాన మీ ప్రవాహము నడ్డజాలదు.

34. శ్లో॥ ఇంద్రియ స్యేన్ద్రియస్యార్థే
రాగ ద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్నవశ మాగచ్ఛేత్
తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 153

అర్థము:- ఇన్ద్రియస్య= జ్ఞానేంద్రియముయొక్క; అర్థే= విషయములగు శబ్దాదులందును ఇంద్రియస్య= కర్మేంద్రియముల యొక్క; అర్థే= విషయములగు వచనాదుల యందును రాగద్వేషౌ= అనురాగ క్రోధములు; వ్యవస్థితౌ= అవర్జనీయములుగ ఏర్పడియున్నవి; తయోః= ఆరాగద్వేషములకు; వశం= అధీనమైయుండుటను; న ఆగచ్ఛేత= పొందకూడదు; హి= ఎందుచేతననగా; తౌ= ఆ రెండును అస్య= ఈ సాధకునికి; పరిపంథినౌ= శత్రువులు.

తా॥ జ్ఞానేంద్రియములకు శబ్దాదులందును, కర్మేంద్రియములకు వాగాదుల యందును, పూర్వవాసనను బట్టి ఆదరమో అసహ్యమో. నిర్ణీతమై యుండును. అవి జ్ఞానమునకు ముఖ్య విరోధులు. జ్ఞాని వీటికి లొంగరాదు

35. శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః॥ 154

అర్థము:- స్వనుష్ఠితాత్ = సాంగముగ కొంత కాలము అనుష్ఠింపబడి, విచ్ఛేదము నంది సగుణమై యున్న; పరధర్మాత్ = అన్యధర్మమువంటి జ్ఞానయోగము కంటె; స్వధర్మః = తనధర్మమువంటిదైన కర్మయోగము, విగుణః = అపి = అంగవైకల్యముచే గుణములేనిదైనను శ్రేయాన్ = మేలైనది; స్వధర్మే = తనధర్మమగు కర్మయోగమునందు; నిధనం = అపి- ఫలము లభించుటకు ముందే మరణమైనను; శ్రేయః = మేలైనది; పరధర్మః = అన్యధర్మమగు జ్ఞానయోగము; భయావహః = భయమును కలిగించునది.

తా॥ మంచిదైనను కొంతచేసి విడిచిపెట్టిన జ్ఞానయోగము ఫలము నెన్నటికీ నీయజాలదు. దానికంటె ఇంద్రియముల కలవాటుగల కర్మయోగము కొంతయంగ వైకల్యము కలిగినను ఎన్నటి కైనను ఫలమొసంగును కావున కర్మయోగమే నిరపాయము జ్ఞానయోగము సాపాయము.

అర్జున ఉవాచ = అర్జునుఁడు పలికెను.

36. శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ!
బలాదివ నియోజితః. 155

అర్థము:- హే వార్ష్ణేయ = ఓ కృష్ణా; అథ = ఆటుపిమ్మట; అయం = ఈ; పూరుషః = జ్ఞానయోగియగు పురుషుఁడు; అనిచ్ఛన్నపి = విషయానుభవమందు ఇచ్ఛ లేనివాఁడేయయినను; కేన = ఏ కారణముచేత; ప్రయుక్తః = ప్రేరితుఁడై, బలాత్ = బలవంతముగా; నియోజిత ఇవ = నియోగింపబడినవానివలె. పాపం = విషయానుభవరూపపాపమును; చరతి = ఆచరించు చున్నాఁడు;

తా॥ కృష్ణా! మనుష్యుడు పాపమును అనుభవించవలెనని కోరకున్నను దేనిచే ప్రేరేపింపబడి బలాత్కారముగ కూర్చబడినట్లు కొందరు విషయములను ఆకాంక్షించుచుయును పాపమును జేయుచున్నాడు.

శ్రీభగవానువాచ = కృష్ణుడు పలికెను

37. శ్లో॥ కామ ఏష క్రోధ ఏష
రజోగుణ సముద్భవః
మహాశనో, మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణం 156

అర్థము॥- ఏషః = నీవడిగిన హేతువు; రజోగుణసముద్భవః॥ శబ్దాది విషయముల యందలి కోరిక; మహాశనః॥ అధికమైన తిండిపోతు; ఏషః॥ ఈ కామమే; క్రోధః॥ క్రోధరూపముగా పరిణమించినదై; మహాపాప్మా॥ మహాపాపమునకు కారణమైనది ఏనం॥ ఈ కామమును; ఇహ = ఈజ్ఞాన యోగమున వైరిణం॥ శత్రువుగా; విద్ధి = తెలుసుకొనుము.

తా॥ రజోగుణము వలన కామము పుట్టును. దీనికి ఎంత యనుభవించినను తృప్తిలేదు. ఇదియే అడ్డగింపబడి కోపముగా మారి ఘోరపాపములు చేయించును. ఇది జ్ఞానికి ముఖ్య శత్రువు.

38 శ్లో ధూమే నావ్రియతే వహ్నిః
యథా ఒదర్శో మలేన,చ
యథోల్బే నావృతో గర్భః
తథా తేనేద మావృతం. 157

అర్థము:-యథా॥ ఏవిధముగ; వహ్నిః॥ అగ్ని; ధూమేన॥ పొగచేత; ఆవ్రియతే= కప్పబడుచున్నదో; ఆదర్శః॥ అద్దము; మలేన॥ మురికిచేత; చ ॥ కప్పబడుచున్నదో; యథా ॥ ఏవిధముగ; గర్భః = గర్భస్థమైన పిండము; ఉల్బేన॥ మావిచేత; ఆవృతః = ఆవరింపబడియుండునో; తథా ॥ అవిధముగానే ఇదం; ఈప్రాణికోటియు = తేన = ఆ కామముచేత; ఆవృతం= ఆవరింప

తా॥ పొగచే నిప్పును, మురికిచే అద్దమును, మావిచే గర్భస్థపిండమును కప్పబడియున్నట్లు ఈ కామముచే నీ చేతనసముదాయమంతయు కప్పబడియున్నది.

39 శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన
జ్ఞానినో నిత్య వైరిణా
కామరూపేణ కౌంతేయ
దుష్పూరేణా నలేనచ 158

అర్థము :- హే కౌంతేయ = ఓ అర్జునా; నిత్యవైరిణా = నిత్య శత్రువైనట్టియు కామరూపేణ = ఆశారూపమైనట్టియు; దుష్పూరేణ = పొందనశక్యముకాని విషయముకలదియు; అనలేన = తృప్తి లేనట్టియు; ఏతేన = ఈ కామముచేత జ్ఞానినః = జ్ఞానస్వభావముగల ప్రాణియొక్క జ్ఞానం = ఆత్మవిషయమైన జ్ఞానము; ఆవృతం = ఆవరింపబడియుండును.

తా॥ జ్ఞానియొక్క ఆత్మజ్ఞానము, ఈతీరనియాశగల దుర్లభవిషయముల నపేక్షించు కామమనబడు అనాది శత్రువుచే ఆవరింపబడియుండును.

40 శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి
రస్యాధిష్ఠాన ముచ్యతే.
ఏతైర్విమోహయత్యేష
జ్ఞాన మావృత్య దేహినం 159

అర్థము:- అస్య = ఈ కామమునకు; ఇంద్రియాణి = ఇంద్రియములు మనః = మనస్సు; బుద్ధిః బుద్ధియును అధిష్ఠానం = ఆత్మను అధిష్ఠించుటకు ఉపకరణమైనదిగ; ఉచ్యతే = చెప్పబడుచున్నది; ఏషః = ఈ కామము; ఏతైః = ఈ యింద్రియ మనోబుద్ధులచేత; జ్ఞానం = ఆత్మస్వరూప యాథాత్మ్యవిషయమైన జ్ఞానమును; ఆవృత్య = కప్పి; దేహినం = ప్రకృతి సంసర్గముగల జీవుని; విమోహయతి = అనేకవిధములుగ మోహింపజేయుచున్నది.

తా॥ కామము జ్ఞానేంద్రియములను మనస్సును బుద్ధిని బట్టి

జీవుని జ్ఞానమును కప్పి యాతనిని స్వాధీనపరచుకొని ఆత్మ జ్ఞానము కలుగనీయక విషయలోలుని గావించుచున్నది.

41 శ్లో॥ తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం
జ్ఞాన విజ్ఞాన నాశనం 160

అర్థములు:- హేభరతర్షభ॥ ఓభరతవంశ శ్రేష్ఠుడా; తస్మాత్ = ఆకారణమువలన త్వం=నీవు=ఆదౌ=మొదట; ఇంద్రియాణి=ఇంద్రియములను; నియమ్య= కర్మయోగమున నియమించి; జ్ఞాన విజ్ఞాననాశనం = ఆత్మస్వరూపజ్ఞానమును; ఆత్మస్వరూప వివేకమునుగురించిన విజ్ఞానమును నశింపజేయు; పాప్మానం = పాపరూపమైన; ఏనం=ఈకామమును ప్రజహి = నశింపజేయుము-

తా॥ కాబట్టి నీ ఆత్మస్వరూపమును దానివివేకమును తెలియనీయక ఆటంకపరుచునట్టి యీపాపిష్ఠికామమును ముందుగ నశింపజేయుము.

42 శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిః
యోబుద్ధేః పరతస్తు సః 161

ఇతి శ్రీ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

అర్థములు:- ఇంద్రియాణి = ఇంద్రియములు పరాణి=జ్ఞాననాశన ప్రధానములని ఆహుః=శాస్త్రములు చెప్పుచున్నవి; ఇంద్రియేభ్యః=ఇంద్రియములకంటె; మనః=మనస్సు పరం=ప్రధానమైనది;- మనసః+తు=మనసుకంటెను; బుద్ధిః=విపరీతమైన యధ్యవసాయము; పరా=ప్రధానమైనది బుద్ధి+తు=బుద్ధికంటెనుకూడ; యః=ఏది: పరతః=ప్రధానమైనదియో: సః=అదికామము.

తా॥ జ్ఞానమును చెఱుచునట్టి ఇంద్రియములు ప్రధానములు. వాటికంటె గొప్పది మనస్సు, దానిని మించినది విపరీతబుద్ధి. వీటి నన్నింటిని మించినది కామము.

ఇది ఉపనిషత్ స్వరూపమును బ్రహ్మవిద్యయును యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అగు శ్రీభగవద్గీత యందలి కర్మయోగమనబడు తృతీయాధ్యాయము.

అర్జుని శ్లోకములు-3- శ్రీకృష్ణుని శ్లోకములు-39- తృతీయాధ్యాయశ్లోకములు -42- మొత్తం శ్లోకములు- 161-



భారతీ ప్రెస్, తెనాలి.

శ్రీ మతే రామానుజాయ నమః

# బ్రహ్మ యజ్ఞ నివేదిక

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ స్థాపకులగు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు సంకల్పించిన బ్రహ్మయజ్ఞము పవిత్రమైన కృష్ణానదీ పుష్కర సందర్భమున విశ్వశాంతికై వేదవేద్యుఁడు, వేదపురుషుఁడు, వేద స్వరూపుఁడును నగు విరాట్ పురుషుని యారాధనాత్మకముగా విజయవాడలో శ్రీ కోదండ రామస్వామి యొక్కయు శ్రీ వెంకటేశ్వర స్వామివారి యొక్కయు సన్నిధులయందు హేవళంబి నామ సంవత్సర అనగా తేదీ **23-6-57** లగాయితు తేదీ **4-7-57** వరకు మొత్తము పదిరెండు దినములు పరమ విలక్షణముగా జరుప బడినది.

దీనియొక్క ప్రధానాశయము:— ప్రజాసామాన్యమున ఆస్తికత్వమును అభివృద్ధి పరచి తద్వారా వేద వేద్యుని యారాధించి యానందించుట.

ప్రతి దినము

## ఇందులకై అవలంబించబడిన కార్యక్రమము

ప్రతిదినము ఉద. గం. 4-00 లగాయతు 5-00 ల వరకు సమిష్టిగ శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణముతో తిరువీధి గోష్ఠి

| | | | |
|---|---|---|---|
| ఉద. గం. | 6-00 | 7-00 | వ్యక్తిగతముగ ధ్యాన - జప - భగవదారాధనము. |
| ,, | 7-00 | 7-30 | భగవత్తీర్థ ప్రసాదగోష్ఠి. |
| ,, | 7-30 | 8-30 | వేదపారాయణములతో భజనలతో తిరువీధిగోష్ఠి |
| ,, | 8-30 | 11-00 | యాగశాలలో పంచాగ్నుల యందు హవనము. |
| | | | జపశాలలో చతుర్వేదముల అధ్యయనము. |
| | | | పారాయణశాలలో నాలాయిర ద్రావిడవేదాధ్యయనము |
| | | | పూజామంటపములలో, గర్భాలయములలో, పూజాశాలలో } శ్రీవిష్ణుసహస్రములతో తులసి అర్చనలు. |
| | | | ప్రసాదశాలలో ఉచితముగ భగవత్ప్రసాదవితరణము. |
| | | | క్షీరదానశాలలో శిశువులకు క్షీరప్రదానము. |
| ,, | 11-0 | 2-0 | భోజనశాలలో తదీయారాధనము. |
| | | | దరిద్రనారాయణులకు అన్నసేవ. |
| ,, | 2-0 | 4-0 | ఉపన్యాసమంటపమున మహిళామణుల వేదాంతోపన్యాసములు |
| ,, | 4-0 | 6-0 | పండితులవేద వేదాంతముల ఉపన్యాసములు. |
| ,, | 6-0 | 7-0 | వ్యక్తిగతముగ ధ్యాన - జప - భగవదారాధనాదికములు |
| ,, | 7-0 | 8-0 | పూజామంటపమున శ్రీమహాలక్ష్మి అర్చనలు |
| ,, | 8-0 | 8-0 | భగవంతుని శేడా ఉత్సవము. |
| ,, | 9-0 | 9-30 | శాంతిపాఠములు తీర్థ ప్రసాదగోష్ఠి. |

మొదటి రోజున, మృత్సంగ్రహణము, యాగశాలా ప్రవేశము. వాస్తుపూజాదికము అంకురార్పణము. ఋత్విగ్వరణము. ఇత్యాదులు జరుపబడినవి.

పిమ్మట పదిదినములు పైన జెప్పిన కార్యక్రమము. అనుసరింపబడెను. తరువాత పదిరెండవదినమున అవభృదోత్సవము, పూర్ణాహుతి, శాంతి ప్రవచనము. సన్మానములు, జరుపబడెను.

ఈ బ్రహ్మయజ్ఞమునకు దాదాపు 2800/ ఇరవై ఎనిమిది వందలు రూపాయలు ఖర్చు కాబడెను. ఇన్ని వేల ఖర్చుతో నీ బ్రహ్మయజ్ఞము ను నిర్వహించి నందువలన వచ్చిన ఫల మేమున్నదా? ఐహికములో మన కింతకన్న కావలసిన ఫలమేమున్నది. ఈ యజ్ఞముద్వారా యజ్ఞాతముగా నెచ్చట నెచ్చటనో యున్న పవిత్రమూర్తులగు వేదపురుషులు విచ్చేసిరి విజయవాడలో వీధివీధిన వేదగానములను వీనులవిందుగా వినిపించిరి. పవిత్ర వేదగోష్ఠిలో బ్రహ్మయజ్ఞము బ్రహ్మానంద కరముగా జరిగినది. బాహ్యాభ్యంతర శుచిగల పండితులు, భగవద్భక్తులు. సతీమతల్లులు. విచ్చేసిరి భగవత్కైంకర్య రూపముగా హోమములు, కోటితులసీపూజలు వేదగోష్ఠి, ద్రావిడ వేద పారాయణగోష్ఠి. ఉపన్యాసములు ఊరేగింపులు, తదీయారాధనలు. దరిద్రనారాయణులకు సంతర్పణలు మహిళామండలి వారి మధురోపన్యాస గోష్ఠులు జరిగినవి. ఎంతవరకు ఈ ప్రపంచములో వేదము, విప్రులు, గోవులు, సతీమ తల్లులు, సత్యవాక్పరి పాలకులు. త్యాగ మూర్తులు గౌరవింపబడుచుందురో, అంతవరకీ భూమి కామధేనువుగానుండును. ఈ బ్రహ్మ యజ్ఞము ఇందులకే ఏర్పడినది. అదికొంతవరకు సఫలమైనదని సంతసించుచున్నాము, మానవునకు ప్రధానముగా కావలసినది సత్సాంగత్యము అట్టిసాంగత్య మిట్టి పుణ్యకార్యములద్వారా లభించును. మహనీయులయొక్క పవిత్రద్రవ్య మిందుల కుపయోగించినది. ఏటేట నిట్టి యజ్ఞము లను సంకల్పించి తద్వారా సత్సాంగత్యము ప్రజలకు లంభింపజేయవలెననియే మన శ్రీజీయరు స్వామివారు. యజ్ఞములని, క్రతువులని, సభలని గీతాజయంతులని ప్రతిపల్లెపట్టణ గ్రామములలో గావించుచున్నారు మదరాసులో ఒకప్పుడు కొందరు శ్రీరామాయణము నవమానబరచుచు రామనామము పనికిరాదని ప్రచారముచేయు చుండగా అప్పుడు బ్రహ్మాండ ముగా శ్రీరామక్రతువును గావించిరి. రజాకార్ల దౌష్ట్యము చెలరేగినప్పుడు హైదరాబాదులో మరల శ్రీరామ క్రతువును గావించిరి. కమ్యూనిష్టుల దౌర్జన్యము చెలరేగినప్పుడు విజయ వాడలో శ్రీరామానుజ క్రతువుగావించిరి. రాజమండ్రిలో "లోకాస్స మస్తాస్సుఖినో భవంతు" అని సంకల్పముగావించి కోటి తులసీపూజలను గావించిరి అన్నిటి కన్న మిన్నగా ప్రపంచ శాంతికై బదరిలో అష్టాక్షరి క్రతువును గావించిరి. భగవద్భక్తి ప్రబోధకరముగా మదరాసు, ఢిల్లి, వగైరాచోట్ల గీతాజయంతులు జరిపిరి.ప్రస్తుతము మన సంఘాభివృద్ధికై బ్రహ్మయజ్ఞము గావించిరి.

మరియొక మనవి. ఈబ్రహ్మయజ్ఞములో గొప్ప మహిళామండలి సమావేశమును శ్రీస్వామివారు జరిపించిరి.

మహిళలలో ఏనాటికైనా అధ్యాత్మశక్తి యభివృద్ధి పరచియుంచినచో తద్వారా ప్రతి గృహము పావనమగునని శ్రీవారి యాశయము. అందు నిమిత్తమై యజ్ఞాతముగానున్న విదుషీ మణులైన సతీమతల్లులను ఆహ్వానించి వారిచే వేదాంతోపన్యాసము లిప్పించిరి.

యజ్ఞమనగా. పశువునిజంపి స్వర్గాది ఫలముల ననుభవించుటగాదు. యజ్ఞమనగా భగవత్కైంకర్యరూపమగు యొక విశిష్టమైన యారాధన. అదియే నేడు జరిగినది.

ఈ యజ్ఞనిర్వహణకై సర్వవిధముల సహాయపడి పనిచేసిన వారందరికీ మాహృదయ పూర్వకమైన ధన్యవాదములు.

యీయజ్ఞమునకైన జమాఖర్చులిందులో పొందుపరుచుచున్నాము.

విజయవాడ శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘంవారిద్వారా ది 23–6–1957 తేది మొదలు ది 4–7–1957 వరకు జరుపబడిన బ్రహ్మయజ్ఞము. కోటితులసి పూజలయొక్క

## జమ - ఖర్చులు

| | | |
|---|---|---|
| బ్రహ్మయజ్ఞమునకు నగదుగావసూలు అయిన మొత్తములు. | రు. | 14872- 1-9 |
| శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి భిక్షద్వారా వసూలు. | రు. | 2652-12-9 |
| పూజలుద్వారా వసూలుఅయిన మొత్తం. | రు. | 2454-15-3 |
| ధర్మం డబ్బీలుద్వారా వసూలు. | రు. | 381- 6-9 |
| తదియారాధనకై వసూలు అయిన బియ్యం పప్పు ఉప్పుబెల్లం చింతపండు వగైరాలు కిమ్మతు. | రు. | 5037-14-0 |
| శ్రీసీతారామమందిరము కాతానుండి ఈయబడినవిరాళములు | రు. | 1100- 0–0 |

### ఖర్చుల వివరములు.

| | | |
|---|---|---|
| యజ్ఞసంబారములకు తదియారాధనకు వసూలైన వస్తువులుగాక మిగత అయినఖర్చు తదియారాధనకై వస్తుసామగ్రీ | 8674- 8-9 | 13712- 6-9 |
| విరాళముల క్రిందవచ్చిన బియ్యం వచ్చినరొఖ్ఖం | 5037-14-0 | |
| మొత్తం | 13712-12-9 | |
| పోస్టేజి ఖాతా ఖర్చు | | 292-14-6 |
| స్టేషనరీ ఖాతా ఖర్చు. | | 250- 4-3 |
| ప్రయాణముల ఖాతా ఖర్చు | | 1259-12-3 |
| సాదరు ఖాతా ఖర్చు | | 248-15-6 |
| పందిళ్ళు అలంకార ఖాతా ఖర్చు | | 2050- 8-0 |
| జీతముల ఖాతా | | 781-14-0 |
| బియ్యం వగైరా సామానులుకు రైలు చార్జిలు. | | 138- 1-0 |
| అచ్చు ఖాతా ప్రకటనలు ప్రచురణతోకలపి | | 2312- 0-0 |
| పండితులకు ఋత్విక్కులకు-సదస్యులకు సత్కారములుదక్షిణ వగైరాలు-ఖర్చు | | 4868- 8-0 |
| బ్రహ్మ యజ్ఞము రిపోర్టు ప్రచురణకు అడ్వాన్సు ఖర్చు. | | 500- 0-0 |
| పొటోలు ఖాతా ఖర్చు | | 84- 0-0 |
| | రు. 26499- 4-3 | 26499- 4-3 |

ఊళ్ళవారిగా దాతల యొక్క నామములను, వారి విరాళవివరములను కూడ ప్రచురింపదలచి తయారు చేయించితిమి గాని ఆర్థికముగా చాల ఖర్చు అగుననియు యిప్పటికే ఖర్చులధికమగుటచే లోటు ఏర్పడుట చేతను ఆప్రయత్నమును విరమించితిమి. సహృదయులగు దాతలు మన్నింతురుగాక.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము,
తె. కం. గోపాలాచార్యులు.
ప్రధాన కార్యదర్శి

శ్రీవాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం.
చుండూరు P O
గుంటూరుజిల్లా.

శ్రీమతే రామానుజాయ నమః

# "ఈశావాస్య మిదగ్ం సర్వం"

## శ్రీ జియ్యర్‌స్వామివారి బ్రహ్మయజ్ఞ సందేశము

మానవునికి ప్రపంచము స్వాధీనమై యున్నదా ? ప్రపంచమునకు మానవుడు స్వాధీనుడై యున్నాడా ?

ఈ ప్రశ్న సామాన్యముగా ప్రతి మానవునికి యెప్పుడో యొకప్పుడు కలుగుచుండును. తమ తమ యనుభవము ననుసరించి యిందులకు జవాబును తెలుప ప్రతి మానవుడు ప్రయత్నించుచుండును. కాని అసలు యదార్థమైన స్థితి ఏదో విచారింతము. ఈశావాస్యోపనిషత్తునందు మొదటి యనువాకమున యిటుల తెలుపబడి యున్నది.

"ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్."

పరిదృశ్యమానమగు ఈ జగత్తు యంతయు, యిందలి పరమాణువు మొదలు పర్వతము వరకు గల ప్రతి పదార్థమున్ను భగవంతుడగు సర్వేశ్వరునిచే నియమితమై, వ్యాప్తమై పాలింపబడుచున్నదని దీనివలన తెలియుచున్నది. దీనివలన జ్ఞాన స్వరూపుడు, జ్ఞాన గుణకుడు నగు జీవుడును, జ్ఞాన రహితమైన ప్రకృతియును కూడ స్వతంత్రములు కావు. ఇవి రెండునుకూడ పరమాత్మకు పరతంత్రములై యున్నవి. ఇవి నియామకములు కావు. సర్వేశ్వరునికి నియామ్యములు మాత్రమే యని తెలియుచున్నది.

జీవ - ప్రకృతులు రెండింటియందును గల భేదమును గూర్చి విచారింతము.

జీవుడు జ్ఞానస్వరూపుడును, జ్ఞానగుణకుడును అగుటచే జ్ఞానరహితమైన ప్రకృతిని స్వాధీనపరచుకొనుచున్నాడు. అందుచే కేవలము పరతంత్రమైన దగుచున్నది. జీవుడు భగవంతుని యపేక్షయా పరతంత్రుడే యైనను, ప్రకృతి యపేక్షయా స్వతంత్రు డనబడుచున్నాడు. ప్రకృతి మాత్రము యెప్పటికిని పరతంత్రమైనదే యగుచున్నది.

గాని ఏజీవుడైతే జ్ఞానవికాసములేక జ్ఞానసంకోచమునుకలిగి అజ్ఞాన - అన్యథాజ్ఞాన - విపరీత జ్ఞానములకులోనై యుండునో అట్టివాడు పరతంత్ర పాశబద్ధుడై ప్రకృతి స్వాధీనుడై యుండును.

భగవత్ జ్ఞానములేనిదే ఈప్రకృతి పాశము విడదు.

భగవద్భక్తి కలిగిననేగాని భగవత్ జ్ఞానము గలుగదు.

ఆచార్య సమాశ్రయణము జేసిననేగాని భగవద్భక్తి యుద్భవించదు.

భాగవత కటాక్షము ప్రసరించిననేగాని ఆచార్యసమాశ్రయణము తటస్థించదు యోగియే గాని భోగియేగాని, బాలుడేగాని వృద్ధుడేగాని, స్త్రీయేగాని పురుషుడేగాని, బ్రాహ్మణుడే గాని పతితుడేగాని, పామరుడేగాని, పండితుడేగాని, శాస్త్రవేత్తేగాని శస్త్రవేత్తేగాని ఎవడైనను సరియే భాగవతకటాక్షముద్వారా ఆచార్యసమాశ్రయణమును పొంది భగవద్భక్తిపూర్వకముగ భగవత్ జ్ఞానమునుజెంది భగవంతునికి శేషభూతుడై ఆయనను ప్రీతిపూర్వకముగ భజించునో అట్టివాడు ప్రకృతి పాశనిర్ముక్తుడు కాగలడు - అట్టివానికి మాత్రమే మోక్షము లభించగలదు.

అట్టివానికి ప్రకృతి. (ప్రపంచము) యంతయు నిస్సంశయముగ స్వాధీనమై యుండగలదు.



బ్రహ్మయజ్ఞము - విజయవాడ.

శ్రీ జియ్యర్‌స్వామివారు బ్రహ్మయజ్ఞము ప్రారంభించుటకు
బసనుండి పండితగోష్ఠితో బయలుదేరుచున్నారు.



బ్రహ్మయజ్ఞము:
విజయవాడ.

కోటి తులసిపూజలను చేయించుచు, శ్రీవిష్ణు సహస్రనామములు చెప్పు చుండుట. బ్రహ్మయజ్ఞ నిర్వాహకులు, శ్రీజియ్యర్ స్వామివారు.



బ్రహ్మయజ్ఞము:
విజయవాడ

భక్తులు స్వయముగ శ్రీవిష్ణు సహస్రనామార్చ నలను చేయుచున్నారు.

BHAKTI NIVEDANA

Regd. No. A195

బ్రహ్మయజ్ఞము:
విజయవాడ.
పంచాగ్నులతో చేయబడుచున్న హోమములు.



బ్రహ్మయజ్ఞము
విజయవాడ.
వేదపారాయణగోష్ఠితో తిరువిధ్యుత్సవము.

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and printed at Bharathi Press, Tenali. For Sriman Press, Nadigaddapalem.





# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]




| సంపుటి ౧౦ | హేవిళంబి మార్గశిరము | సంచిక ౯ |
|---|---|---|



సంపాదకులు :
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ళ రామానుజాచార్యులు

# తిరుప్పావై కాలక్షేపము

రాజమహేంద్రవరమున ట్రైనింగు కాలేజి సందులోని శ్రీ తులసీ రామానుజ కూటమున ఈ సంవత్సరం 15-12-57 తేదీనుండి నెలదినములు శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులుగారిచే ధనుర్మాస అత్యంతవైభవముగా జరుపబడి శిక్షణ విధానముగా తిరుప్పావై కాలక్షేప మనేక విశేషార్థములతోను స్వాపదేశార్థ విశేషములతోను గావింపబడును. దీనితోపాటుగా ఒకపూట శ్రీవచనభూషణ కాలక్షేపము శ్రీమద్భాగవత దశమస్కంద పురాణ ప్రవచనము కూడా వారిచే గావింపబడును. ఈ శిక్షణలో పాల్గొన దలంచిన స్త్రీలుగాని, పురుషులుగాని తమ యోగ్యతలను తెలుపుచు డిశంబరు మొదటివారములోగా యీ క్రింది యడ్రసునకు తెలిపినచో వారి అర్హతలనారసి ఆహ్వానము పంపగలరు. అట్లు ఆహ్వానింపబడినవారికి ఉచితబస, భోజనములు ఏర్పరచబడును.

ఇట్లు,

శ్రీ తులసీ రామానుజకూట కార్యనిర్వాహక వర్గము,

శ్రీ తులసీ రామానుజకూటము,

రాజమండ్రి, (తూ. గో. జిల్లా.)



# భక్తినివేదన

# ప్రచారవిభాగము

## శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి

## ఆంధ్రదేశ పర్యటన :

స్వస్తి శ్రీ హేవిళంబి సంవత్సర కార్తీక శుద్ధ ద్వాదశీనాడు (4-11-57) వ తేది మధ్యాహ్నమునకు మన శ్రీ జియ్యర్ స్వామివారు తమ చాతుర్మాస్య దీక్షను శ్రీ వాసుదాసాశ్రమములో యథావిధిగా పూర్తిగావించిరి.

ఆనాడు ఉదయం గం. 5-0 లకు శ్రీ కోదండరామ పెరుమాళ్ళను, ఆస్థాన మంటపములో వేంచేపుచేసి సహస్రనామార్చన పురస్సరముగా కైశికద్వాదశీ మహోత్సవమంతయు సక్రమముగా జరిపింపబడెను. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు, వరాహపురాణాంతర్గతమగు కైశికమహాత్మ్యమును చదివి, తదర్థమును విశదముగా నుపన్యసించిరి. పిమ్మట ఆరగింపు, మంగళాశాసనము, తీర్థప్రసాద గోష్ఠి జరిగెను. పరిసర గ్రామములనుండి స్త్రీలు, పురుషులు పెక్కురు యీ మహోత్సవసందర్శనమునకు విచ్చేసిరి. ఈ సందర్భములో శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారు, యతిరాజవింశతిని పోలిన శ్రీ త్రిదండి వింశతిని శ్రీజియ్యర్స్వామి విషయమై రచించివినిపించిరి. ఈస్తోత్రమును శ్రీతట్టసీతారామాచార్యులుగారు ముద్రించుటకు వాగ్దానము గావించిరి. తరువాత భక్తబృందమంతయు హరేరామ మంత్రానుసంధానముతో ననుగమింపగా శ్రీ జియ్యర్స్వామివారు తుంగభద్రా నదీతీరమునకు ఛత్రచామరాది లాంఛనములతో విచ్చేసి, శాస్త్రవిధిగా దీక్షావిసర్జనముగావించిరి. తరువాత

## బదరీశాశ్వతనిధి భిక్షాకార్యక్రమము

బదరీలో ప్రతిష్ఠించిన శ్రీనివాస రామానుజస్వామివారల అర్చనాశాశ్వతనిధికై లక్ష రూపాయల నిధిని సేకరించుటకు వెనుక సంకల్పించిన భిక్షాకార్యక్రమమును శ్రీ జియ్యర్ స్వామివారు నేడు ప్రారంభించిరి. భక్తులందఱు వెంటనే వారి కరకమలముల నలంకరించిన భిక్షాపాత్రలో రొఖ్ఖముగా రు. 351-4-6 లున్ను, వాగ్దానరూపకముగా రు. 1434-0-0 లున్ను సమర్పించి కృతార్థులైరి.

# సంచార కార్యక్రమము

## (1) చుండూరు :-

తరువాత శ్రీ జియ్యర్‌స్వామివారు సాయంకాలం గం. 4 లకు ఆశ్రమము నుండి ప్రధాన కార్యదర్శులగు శ్రీ మాన్. తె. కం. గోపాలాచార్యస్వామివారితోను, శ్రీమాన్ కవిపంత్ని గుదిమెళ్ల రామానుజాచార్యుల వారితోను తదితర పరివారముతోను బయలుదేరి చుండూరు గ్రామమునకు, పాదయాత్రగా బయలుదేరిరి. చుండూరు గ్రామప్రముఖులు పెద్దలు శ్రీ స్వామి వారిని ఛత్రచామర మంగళవాద్యములతో స్వాగతమిచ్చి, ఊరేగింపుతో ఇంటింట సువాసినులు హారతులొసంగుచుండగా వెంటభక్తబృందము హరేరామమంత్రమును సంధానము చేయుచుండగా-గ్రామములోనికి తోడ్కొని సువిశాలమైన శ్రీ గాదె నాగభూషణం రెడ్డిగారి దివ్యభవనమున వేంచేపుచేసిరి. రాత్రి విడిదియందె శ్రీ స్వామివారు ఉపన్యసించిరి. తాముప్రక్రమించిన బదరీ భిక్షా కార్యక్రమావశ్యకతను, ప్రజలబాధ్యతను, విశదీకరించిరి. అందరును, వారివారి సంప్రదాయాను గుణ్యముగా తిలకమును ధరించవలసినదిగా ఉద్బోధించిరి. చుండూరు గ్రామములో 5,6,7, తేదీలలో మూడురోజులు వేంచేసియుండి, బదరీ శాశ్వతనిధిభిక్షా కార్యక్రమమును సాగించిరి. ఈమూడు రోజులలో భిక్షాపాత్రలో రొఖ్ఖరూపముగా రు. 572-14-9 లను, వాగ్దానరూపముగా 572-0-0 లున్ను భక్తులుసమర్పించిరి. 5, 6, తేదీలలో శ్రీ కోదండరామ స్వామివారి కోవెలవద్దను, నడి బజారులోను, పెద్దబహిరంగసభ జరిగెను. శ్రీ స్వామివారు అర్థపంచకమును గురించియు, శ్రీ తె. కం. గోపాలాచార్యస్వామివారు గీతారామాయణములను గురించి, శ్రీ కవిగారు భక్తి శబరినిగురించియు ఉపన్యసించిరి.

తరువాత 7-11-57 వ తేది సాయంకాలము. శ్రీ స్వామివారు తమ కార్యదర్శులిరువురి తోను, కొందరు పరిజనముతోను బయలుదేరి కాలినడకతో ఆరుమైళ్ళు నడచి రాత్రికి పెదపూడి గ్రామమునకు విచ్చేసిరి.

## (2) పెదపూడి:-

ఈనాటి రాత్రి చంద్రగ్రహణము గనుక శ్రోవణ కృష్ణకాలవవద్ద స్నాన సంధ్యా జప ములు పూర్తిగావించుకొనిరి. ఆనాటిరాత్రి శ్రీ సుబ్బారావుగారు ఆతిథ్యమిచ్చిరి. మరునాడు 8-11-57 వ తేది ఉదయము తీర్థప్రసాద గోష్టిని జరిపి శ్రీ స్వామివారు బదరీభిక్షా కార్యక్రమమును జరిపిరి. రాత్రి బహిరంగసభ జరిగెను. ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలిని శ్రీ స్వామి వారు స్థాపించి శుక్రవారపూజ జరిపించిరి. శ్రీ స్వామివారు ఆస్తిక్యమును గురించి విపులముగా చర్చించిరి. ఆమరునాడు గ్రామములోనున్న ప్రముఖులందరు విచ్చేసి శ్రీ స్వామివారిని సేవించి తమ సందేహముల పెక్కింటిని తీర్చుకొనిరి. ఈనాడుదయముకూడ గ్రామములో భిక్ష జరిగెను. భిక్షపాత్రలోకు 52-15-6 రొఖ్ఖమున్ను, శాశ్వత తాత్కాలిక పూజలరూపముగా 40-0-0 లున్ను భక్తులు సమర్పించిరి. 9, వ తేది మధ్యాహ్నం బయలుదేరి తమయనుచరులతో శ్రీ స్వామి వారు చావలికి వేంచేసిరి.

(?) చావలి:-

చావలిలో నున్న భక్తులు పెక్కురు ఊరివెలుపల (శ్రీ) స్వామివారిరాకను నిరీక్షించుచు ఛత్ర చామర మంగళవాద్య భజన రూపమహా వైభవముతో (శ్రీ) స్వామివారిని గ్రామములోనికి వేంచేపు చేసిరి. రాత్రి సత్రంవద్ద సభజరిగెను. సభలో (శ్రీ) స్వామివారున్ను, (శ్రీ) తె. కం. గోపాలాచార్య స్వామివారున్ను, (శ్రీ) కవిగారున్ను వేదాంతవిషయమును గురించి ఉపన్యసించిరి. 10, 11, 12 తేదీలలో ఉదయం భిక్షాకార్యక్రమము జరిగెను. ఈ 3 రోజులలో (శ్రీ) స్వామివారి భిక్షాపాత్రలో రొఖ్ఖరూపముగా రు. 171-10-9 లున్ను, వాగ్దానముగా రు. 1058-0-0 లున్ను (శ్రీ) బదరీ (శ్రీ)నివాసరామానుజ స్వామివారల అర్చనకు సమర్పించి భక్తులు కృతార్థులైరి. ఇచ్చటకూడ (శ్రీ) స్వామివారు యతిరాజ మహిళామండలిని స్థాపించి శుక్రవారపూజలను ఏర్పాటు గావించిరి. 12వ తేదీ మధ్యాహ్నం బయలుదేరి 8 మైళ్లు నడచి కొల్లూరునకు వేంచేసిరి.

## విషాదవార్తలు

(1) శ్రీ పెరుంబూదూర్ వాస్తవ్యులగు, మహా విద్వాన్ శ్రీమాన్. ఉ. వె. ఆసూరి రామానుజాచార్యస్వామివారు, హేవళంబినామ సంవత్సర ఆశ్వయుజ బహుళ పాడ్యమీ బుధవారం 9-10-57 వ తేదీ, పగలు గం .3 లకు పరమ పదించిరని వ్రాయుటకు విచారించుచున్నాము.

శ్రీ వారిచరమతనియ

అబ్దేఽస్మిన్ హేవిళంబ్యాహ్వ ఉపవతి
మిహిరే యాతి కన్యాం సితాన్యే
పక్షే పూర్వాహ్నముక్తే ప్రతిపదిచతిథౌ
వాసరే సోమసూనోః ॥
శ్రీమద్ధారీతవంశామృతజలధి సుధాదీధితి
ర్దేశికేంద్ర
శ్శ్రీమాన్ రామానుజార్య స్స్వగురు
చరణయో ర్వైష్ణవం ధామ భేజే ॥

హేవిళంబ్యబ్దకన్యాయా మసితప్రథమతిథౌ
హారీతరామానుజార్యో గురుస్సార్థపదం యయౌ॥

---

(2) నరసాపురం వాస్తవ్యులగు శ్రీమాన్ డాక్టర్ కె. శేషాచార్యులుగారు 7-10-57 వతేదిన తమస్వగృహమందు 69 వఏట పరమపదించిరి. వీరుగొప్ప ఆభిజాత్యముగల కుటుంబములో జన్మించిరి.

వీరు గవర్నమెంటు డాక్టరుగాR. M. O. పదవిలోను, అసిస్టెంటు సర్జనుగానుండి మంచికీర్తి ప్రతిష్టల నార్జించిరి. వీరిఆత్మకు శ్రీయఃపతి శాంతిని చేకూర్చుగాక !



(3) తెనాలితాలూకా చావలిగ్రామవాస్తవ్యులగు శ్రీ విష్ణుమొలకల వీర రాఘవయ్య దాసుగారు 22-10-57 వతేది మధ్యాహ్నము పరమపదించిరని తెలుపుటకు చాల విచారించుచున్నాము.

వీరు 5సంవత్సరములనుండి నిస్స్వార్థబుద్ధితో ఈసంఘసేవ చేసినారు. వీరుచేసినసేవ సంఘమునకు మరపురానిది. వీరిఆత్మకు శ్రీయఃపతి శాంతిని ప్రసాదించుగాక !

## గీతాపరీక్షా ఫలితాలు

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారు 15-7-57వతేది జరిపిన భగవదీతా పరీక్షలో ఉత్తీర్ణులైన అభ్యర్థుల నామములు.

నామములు

1. శ్రీమతి సంకాసీతామహాలక్ష్మమ్మ (తెనాలి) మొదటితరగతి.
2. శ్రీమతి న్యాపతి రంగనాయకమ్మ (శ్రీకాకుళం) రెండవతరగతి
3. శ్రీమతి న్యాపతి కన్నతల్లి ( ,, ) మూడవతరగతి
4. శ్రీమతి న్యాపతి జానకిరాం ( ,, ) మూడవతరగతి

## రాబోవు గీతాపరీక్షలు

**19-1-58 వతేది ఆదివారం జరుపబడును.**

పాఠ్యగ్రంథము - గీతాప్రశ్నోత్తరావళి - 7,8,9, అధ్యాయములు

7, వ, అధ్యాయములో(తాత్పర్యములో వల్లించవలసినశ్లోకములు) 2, 3, 4, 5, 6, 7, 14, 15, 16, 17, 18,19, 20, 21, 22, 23, 26, 27, 28, శ్లోకములు.

8, వ, అధ్యాయములో, ( ,, ) 3, 4, 5, 6, 7, 10, 13, 14, 15, 16, 24, 25,26, 27, 28, శ్లోకములు.

9, వ, అధ్యాయములో, ( ,, ) 1, 2, 4, 7, 9, 11, 12, 13, 14, 17, 19, 20, 21, 2,223, 26, 27, 28, 29, 30. 31, 32, 33, 34, శ్లోకములు.

# కట్నములు

శ్రీ దాసరి ఆండాళమ్మగారు, (విశాఖపట్నం) పంపిన శుక్రవారపూజా కట్నం 5-0-0
,, ఆండాళ్ తిరునక్షత్ర కట్నం. 2-0-0
,, కణ్ణన్ తిరునక్షత్ర కట్నం. 2-0-0

శ్రీ యమ్. జగన్నాథాచార్యులుగారు, పంపిన శరన్నవరాత్ర తులసీపూజా కట్నం. 1-0-0

శ్రీ బోయిన సీతారామానుజదాసుగారు, (బేతవోలు) మోటూరు వాస్తవ్యులగు శ్రీ మచ్ఛ్రీరంగం నల్లానిచక్రవర్తుల తిరుమలాచార్యుల అయ్యవార్లంగారి వలన తాము శ్రీవచనభూషణ కాలక్షేపము అయిన సందర్భములో పంపిన సంఘ కట్నం. 2-0-0

శ్రీ జియ్యర్‌స్వామివారి దీక్షా విరమణ సందర్భములో (చావలి) శ్రీ యతిరాజ సేవామహిళా మండలివారు సమర్పించిన కట్నం. 10-0-0

శ్రీ ఇనగంటి వెంకటరంగ సీతారామారావుగారు, పంపిన (ఏలూరు) గీతా ముద్రణ కట్నం. 15-0-0

శ్రీ నాగుబండి రంగయ్యశ్రేష్ఠిగారు, తమ స్వగృహమందు జరిపిన కణ్ణన్ తిరునక్షత్ర కట్నం. 3-0-0

శ్రీ తుమ్మల బసవమ్మగారు, (కొల్లూరు) శుక్రవారపూజా కట్నం. 1-0-0

శ్రీ గుమ్మడి పున్నమ్మగారు, (కొల్లూరు) శుక్రవార కట్నం. 1-0-0

శ్రీ పర్లపల్లి శ్రీనివాసాచార్యులుగారు, (మాచరాజవల్లి) తమ కుమారుని బారసాల కట్నం. 1-0-0

శ్రీ భాష్యం కూర్మాచార్యులుగారు, 3 వ కుమార్తె కట్నం. 2-0-0

శ్రీ మోటుమర్రి చూడామణిగారు, పంపిన హారేరామ కట్నం. 10-0-0

శ్రీ వేదాల సుభద్రమ్మగారు, పంపిన శుక్రవార కట్నం. 2-0-0

శ్రీ సుగ్రీవు శివయ్యగారు, పంపిన శుక్రవార కట్నం. 4-0-0

శ్రీ న్యాపతి బాలకృష్ణమూర్తిగారు, (అడ్డకేటు) శ్రీకాకుళం. 15-0-0

శ్రీ యమ్. సీతారామాంజనేయాచార్యులుగారు, పంపిన కట్నం. 2-0-0

# సంభావనలు

శ్రీ ఆత్మకూరి వరదరాజశ్రేష్ఠిగారు, (బరంపురం) తమ 3 వ కుమార్తె పరమపదించిన సందర్భములో పంపిన సంఘ సంభావన. 3-0-0

శ్రీ మరిగంటి నరసింహాచార్యులుగారు, (రిటైర్డు తాశీలుదారు) 16-6-57, వ తేది పరమపదించినప్పుడు సంఘమునకు పంపిన సంభావన. 5-0-0

శ్రీ డాక్టర్ శ్రీ కె. శేషాచార్యులుగారు, (నరసాపురం) పరమపదించిన సందర్భములో సంఘమునకు పంపిన సంభావన. 5-0-0

శ్రీ తోట పెదచెంచయ్యశ్రేష్ఠిగారు, తమ తల్లిగారి పరమపదోత్సవ సందర్భములో సంఘమునకు పంపిన సంభావన. 2-0-0

## కొత్తూరు

ఈ గ్రామంలో శ్రీ సీతారామాలయము నందు కార్తీకశుద్ధ ఏకాదశినాడు అఖండ హరినామసంకీర్తన, 24 సహస్రనామపూజలు, శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర సమిష్ఠిపారాయణలు, రాత్రికి పెరుమాళ్లకు తిరువీధి ఉత్సవము, ద్వాదశినాడు, బీదలకు అన్నదానము, గ్రామంలో నున్న భక్తులు అత్యుత్సాహముతో జరిపించిరి. ఈ భగవద్గోష్ఠిలో శ్రీ కూర్మం వాస్తవ్యులగు శ్రీమాన్ శ్రీ భాష్యం కూర్మాచార్యులవారు శ్రీకూర్మనాథుని ధ్వజ కైంకర్యము నిమిత్తమై కొత్తూరులో వేంచేసియుండుటచే యీ కార్యక్రమము అత్యంత విలక్షణముగా జరిగెను.

శ్రీ హయగ్రీవాయనమః

# సాంఘిక వార్తలు

## పత్రికాపాఠకులకు — ఒకమనవి.

ఇంతవరకు భగవద్గీత మూడధ్యాయములు ప్రతిపదార్థ టీకా తాత్పర్యముతో ప్రతికా ముఖమున ప్రకటించితిమి. ఈ మూడధ్యాయములకు ముగ్గురుదాతలు ముద్రణవ్యయము భరించుటచే వీటిని ప్రకటించ గలిగితిమి. మిగిలిన 15 అధ్యాయములట్లే వ్రాసి సిద్ధముగా యుంచితిమి. అవకాశము కలిగినప్పుడు ప్రకటింతుము.

ఇటీవల ఆశ్రమములో శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీ వచనభూషణ కాలక్షేపమును కటాక్షించిన సందర్భములో పెక్కురు శ్రోతలు శ్రీ వచనభూషణము, ఆంధ్రానువాద సహితముగా కావలెనని కోరుటచే అదిప్రస్తుతము పత్రికద్వారా ప్రకటించుచున్నాము.

ఇట్లే శ్రీ జియ్యర్ స్వామివారు అష్టాదశరహస్యములకు ఆంధ్రానువాదమును కృషిచేసియున్నారు. కొన్నింటిని ముద్రించితిమి. మిగిలినవి క్రమక్రమముగా ముద్రింపబోవుచున్నాము.

బదరి కాశ్రమములో అష్టాక్షరీక్షేత్ర నిర్మాణార్థమై బదరికి వేంచేసిన మనసంఘ కార్యదర్శులు శ్రీమాన్ విద్వాన్, తె. కం. గోపాలాచార్యస్వామివారు కులాసగా తమ అనుచరులతోసహా ఆశ్రమమునకు వేంచేసిరి.

శ్రీమతే రామానుజాయ నమః

## బదరీనారాయణమందలి.

# శ్రీ అష్టాక్షరీ క్షేత్ర నిర్మాణ నివేదిక.

కార్యదర్శి:- తె. కం. గోపాలాచార్యులచే ప్రచురింపబడుచున్నది.

బదరీనారాయణ మందలి మన శ్రీ అష్టాక్షరీక్షేత్రము నిర్మాణము యొక్క పర్యవేక్షణ నిమిత్తమై నేను, అచ్చటి మన శ్రీ శ్రీనివాస రామానుజ స్వామివారి యొక్క అధ్యాపకులగు శ్రీమాన్ వం. రంగాచార్యులు గారితో సహా నడిగడ్డపాలెము శ్రీ వాసుదాసాశ్రమమునుండి ది. 22-7-1957 న బయలుదేరి ది 9-8-1957 కి బదరినారాయణమునకు చేరితిమి. ఈసంవత్సరమున బదరి నారాయణమున కోవెల ద్వారోద్ఘాటన అయిన రెండవరోజున అమితముగ మంచు పడి కొండలు పడిపోయి త్రోవలు పూర్తిగ పాడైనవి. చాలమంది యాత్రికులు కొండలు పడి మరణించిరి. సుమారు 25 శవములు దొరికినటులను, 33 మందితో ఒక మోటరు బస్సు పడిపోయి అందరు మరణించినటులను అధికారులు తెలిపిరి. అందుచే కోవెల ద్వారోద్ఘాటన సమయమునకే వెళ్లమని పంపిన మన సంఘ ప్రచారకులగు శ్రీమాన్ కే. సుబ్బరాజుగారు ఋషికేశములోనే ఉండిపోయి, త్రోవలు తిర్గి బాగుచేయబడిన పిమ్మట బదరి చేరిరి. అచ్చట అష్టాక్షరీక్షేత్రము,(ధర్మశాల) క్రిందిఅంతస్థు మాత్రము అయినది. ఈసంవత్సరమునమిగత పనితిర్గి జూను రెండవ వారమునుండి ప్రారంభింపబడినది.

మన కంట్రాక్టరగు శ్రీశంకర దత్తు బహుగుణసేఠ్ ఇదివరలోనే ఈసంవత్సరమున కట్టుబడికై కావలశిన రాయిని, కలపను సమకూర్చి యుండెను. మరియు కోతలకు, మేస్త్రీలకు పెద్దపెద్ద మొత్తములను అడ్వాన్సుగాయిచ్చియుండెను. అందుచే మన ధర్మశాలపని చురుకుగా జరుగప్రారంభమాయెను. ఈసంవత్సరమున బదరిలో బిర్లామహాశయుడు లక్షాపాతిక వేల రూపాయలతో ఒక సత్రమును, శ్రీ కిచడి స్వామివారు మరొక రామానుజకూటమును, గవర్నమెంటువారు కొన్ని బిల్డింగులను, మందిరమువారు లక్షరూపాయలతో నారాయణభవనమను ధర్మశాలను నిర్మించుచుండుటచే కూలీలకు, మేస్త్రీలకు చాల యిబ్బందిగనే యున్నను, మనకు మాత్రము ముందుగనే అడ్వాన్సులు తీసుకొన్న కూలీలు పనిని చురుకుగ చేయుచుండిరి. యిటుల ఒక నెల పని బాగుగ జరిగినది అటుపిమ్మట 24 దినములు ఏకధాటిగ వానకురియుచు, సూర్యరశ్మియే లేకుండగ అయిపోయినది. మనిషిబయటకు వచ్చుటయె కష్టమాయెను. అప్పుడు,యిక నిర్మాణముపని విషయమెక్కడ? తిర్గి ప్రకృతి నిర్మలమై అవకాశము కలిగిన వెంటనే పనిచురుకుగ ప్రారంభింపబడి అక్టోబరు రెండవవారమునకు పై అంతస్థు 12 గదులున్ను, గోడల కట్టుబడి పూర్తి అయినది. ఇచ్చట సిమెంటు, యినుపరేకులు దొరకుట చాల కష్టము. అందుచే నిరుటి సంవత్సరమే రెండు టన్నుల యినుపరేకులకు పరిమిటుపై తెప్పించి బదరికి చేర్చియుంటిమి. యింకను కావలశియున్న యినుపరేకులు, సిమెంటు కొరకై నేను ఢిల్లీలో ఒకవారమురోజులుండి సెంట్రల్ గవర్నమెంటు వల్ల ప్రత్యేక పరిమిటును తీసుకొని యుంటిని. ఆ సామానులను కొని, బదరి చేర్పించుట కొరకై నేను ది 9-10-57 న బదరిలో బయలుదేరి ఢిల్లీవచ్చితిని. నేను వచ్చి వేసిన తరువాత ది 20-10 57 తేదీన బదరిలో నిరుటికంటెను కూడ విపరీతముగ రెండురోజులు సుమారు ఆరడుగుల ఎత్తున మంచుపడినది. దానితో బదరి గ్రామస్థులు, కూలీలు అందరు వెళ్లిపోయిరి. పని

ఆగిపోయినది. అందుచే నేను తిర్గి బదరికి వెళ్ళలేదు. గాని కంట్రాక్టరు మాత్రము అచ్చటనే ఉండ పోయి, 15రోజులు గడచినపిమ్మట మంచుకరిగిపోగా మిగిలిన మంచునుత్రవ్వించివేసి చాలహెచ్చు కూలీయిచ్చి క్రొత్తపనివారిని పిలిపించి వారిచే మనధర్మశాలకుపైన వాసములు నాటించి దానిపై బల్లకూర్పును వేయించి16గదులు వరకు పైకప్పును కూడవేయించి వేసెనని యిపుడే అచ్చటినుండి వార్త వచ్చినది. అసలు ఈసంవత్సరముననే గోడలకు, నేలకు సిమెంటుగిలాబాలు వగైరాలనుకూడ పూర్తిచేయించవలెనను కుంటిమి. గాని ఆపని మాత్రము పూర్తికాలేదు. శ్రియఃపతి కటాక్షమున్నచో వచ్చే సంవత్సరము ప్రారంభముననే తిర్గి పని ప్రారంభింపచేశి, సుమారొక మాసములో సిమెంటు వగైరా పనులను పూర్తిచేయించి ధర్మశాల ప్రవేశోత్సవమును జరిపి, యాత్రికులకు అందు బస లిచ్చుచుండునటుల చేయ నుత్సాహపడు చున్నాము, కాగా యిప్పటికి తయారైనది 24 వసతిగదులును, 8 స్నానగదులున్ను. అనగా మొత్తము 32 గదులు. యింతవరకు 20 గదులకు విరాళములు వసూలు, వాగ్దానములు జరిగినవి. లెఖలన్నియు చార్టెడు ఎక్కౌంటెంటుగారి అడిటు అగుచున్నవి. ఆడిటుపూర్తి అయినవెంటనే ప్రచురించగలము. శ్రీ శ్రీనివాస రామానుజ స్వామివార్లకై నిర్మించదలచిన "సత్సంగ సదనము"నకు శంఖుస్థాపనకూడ జరిగినది. ఆపనికూడవచ్చే సంవత్సరముననే ప్రారంభించి వీలైనంత త్వరలో దానినికూడ పూర్తిచేయువలెనని గోరుచున్నాము.

తే॥ కం॥ గోపాలాచార్యులు

20-10-57

కార్యదర్శి: శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘము.

శ్రీ మద్రామానుజాయ నమః

## బదరిలో అష్టాక్షరిక్షేత్ర కైంకర్యము

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు గ్రామవాస్తవ్యులగు శ్రీమాన్ మాచేపల్లి వెంకటరత్నంగారు, బదరీలో అష్టాక్షరీ క్షేత్రమందు ఒక గది కట్టించుటకు 3500-0-0 ముప్పైయయిదువందలు రూపాయలు సమర్పించిరి.

పశ్చిమగోదావరిజిల్లా, పెంటపాడు వాస్తవ్యులగు శ్రీమాన్ ప్రతివాది భయంకరం వెంకట నరసింహాచార్యులుగారు బదరీ అష్టాక్షరీ క్షేత్రములో ఒకగది కట్టించుటకు లోగడ 3000/ లు ఇచ్చి, శేషించిన 500/ రూపాయలు ఇపుడు పంపిరి.

రాజమండ్రి వాస్తవ్యురాలగు శ్రీమతి రామినీడి రాయలమ్మగారు, బదరీ అష్టాక్షరీ క్షేత్రములో ఒక గది కట్టించుటకు లోగడ 3000/ లు ఇచ్చి, శేషించిన 500/ లు ఇపుడు పంపిరి.

మదరాసు వాస్తవ్యులగు శ్రీమాన్ శ్రీనివాసయ్యగారు, బదరీ అష్టాక్షరీ క్షేత్రములో ఒక గది కట్టించుటకువాగ్దానము గావించి, ప్రస్తుతం 300/ మూడువందల రూపాయలు సమర్పించిరి!

వీరికి శ్రియఃపతి సమస్త శుభములు ప్రసాదించుగాక.

శ్రీమతే రామానుజాయ నమః



అస్మద్గురుభ్యో నమః
శ్రీమల్లోకగురవే నమః
శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు సాయిచిన

# శ్రీ వచన భూషణము

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే।
సంసారభోగి సందష్ట జీవ జీవాతవే నమః॥

## —: ప్రథమ ప్రకరణము :—

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| ౧. వేదార్థ మఱుదియిడువదు స్మృతీతిహాస పురాణఙ్గళాలే. | ౧. వేదార్థమును నిర్ణయించవలసినది స్మృతీతిహాస పురాణముల ద్వారా |
| ౨. స్మృతియాలే పూర్వభాగత్తిలర్థ మఱుది యిడక్కడవదు; మత్తై యిరణ్డాలుమ్ ఉత్తరభాగత్తిలర్థ మఱుదియిడక్కడవదు. | ౨. స్మృతివలన పూర్వభాగముయొక్క అర్థము నిర్ణయించబడవలెను. మిక్కిన రెండింటి వలనను ఉత్తరభాగము యొక్క అర్థము నిర్ణయింపబడగలదు. |
| 3. ఇవ్వైయిరణ్డిలుమ్ వైత్తుక్కొణ్డు ఇతిహాసమ్ ప్రబలమ్. | 3. ఈ రెండింటిలోను ఇతిహాసము ప్రబలమైనది. |
| ౪. అత్తాలే అదు ముఱ్పట్టదు. | ౪. అందువలననే యది ముందు పేర్కొనబడినది. |
| ౫ ఇతిహాసశ్రేష్ఠమాన శ్రీ రామాయణత్తాల్ శిఱైయిరున్దవళేత్తమ్ శొల్లుగిఱదు మహా భారతత్తాల్ తూదుపోనవనేత్తమ్ శొల్లుగిఱదు. | ౫. ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణముచే చెరసాల యందుండిన యామె యొక్క మహిమ తెలుపబడుచున్నది, మహాభారతముచే దూతగపోయినవాని యొక్క మహిమ తెలుపబడుచున్నది. |

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౬. ఇవై యిరణ్డాలుమ్ పురుషకారవైభవముమ్, ఉపాయవైభవముమ్ శొల్లిత్తాయిత్తు | ౬. ఈ రెండింటిచేతను పురుషకారవైభవమున్ను, ఉపాయవైభవమున్ను చెప్పబడినవాయెను. |
| ౭. పురుషకారమాంపోదు కృపైయుమ్ పారతన్త్ర్యముమ్ అనన్యార్హత్వముమ్ వేణుమ్ | ౭. పురుషకారభూతురాలగుటకు కృపయును, పారతంత్ర్యమును, అనన్యార్హత్వమును కావలయును. |
| ౮. పిరాట్టి మున్బుప్పిరిన్దదు తన్నుడైయ కృపైయై వెళియిడుగైక్కాగ. నడువిల్ పిరిన్దదు పారతన్త్ర్యత్తై వెళియిడుగైక్కాగ. అనన్తరమ్ పిరిన్దదు అనన్యార్హత్వత్తై వెళియిడుగైక్కాగ. | ౮. సీతాపిరాట్టి మొదట విశ్లేషించినది తనయొక్క కృపను ప్రకాశింపజేయుటకొరకు; మధ్యను విశ్లేషించినది పారతంత్ర్యమును ప్రకాశింపజేయుటకొరకు; తరువాత విశ్లేషించినది అనన్యార్హత్వమును ప్రకాశింపజేయుటకొరకు. |
| ౯. సంశ్లేషవిశ్లేషఙ్గళిరణ్డిలుమ్ పురుషకారత్వమ్ తోత్తుమ్. | ౯. సశ్లేషించియున్నను విశ్లేషించియున్నను ఈ రెండుస్థితులలోను పురుషకారత్వము ప్రకటితమగుచుండును. |
| ౧౦ సంశ్లేషదశైయిల్ ఈశ్వరనై త్తిరుత్తుమ్, విశ్లేషదశైయిల్ చేతననై త్తిరుత్తుమ్. | ౧౦. సంశ్లేషదశయందు ఈశ్వరుని దిద్దుబాటొనర్చును. విశ్లేష దశయందు చేతనుని దిదుబాటొనర్చును. |
| ౧౧. ఇరువరైయుమ్ తిరుత్తువదుముపదేశత్తాలే | ౧౧. ఇద్దరిని దిద్దుబాటొనర్చునది ఉపదేశము ద్వారా. |
| ౧౨. ఉపదేశత్తాలే ఇరువరుడైయవుమ్ కర్మపారతన్త్ర్యమ్ కులైయుమ్. | ౧౨. ఉపదేశముచే ఇద్దరియొక్కయు కర్మపారతంత్ర్యము నశించును. |
| ౧౩. ఉపదేశత్తాలే మీళాదపోదు చేతననై అరుళాలే తిరుత్తుమ్; ఈశ్వరనై అళగాలే తిరుత్తుమ్. | ౧౩. ఉపదేశముచే మరలనపుడు చేతనుని కృపచే దిద్దుబాటొనర్చును. ఈశ్వరుని సౌందర్యముచే దిద్దుబాటొనర్చును. |

౧౪. అఱియాదవర్థఙ్గళైయఱివిత్తు ఆచార్యకృత్యత్తైయుమ్ పురుషకారకృత్యత్తైయుమ్ ఉపాయకృత్యత్తైయుమ్ తానే ఏఱిట్టుక్కొళ్ళుగైయాలే మహాభారతత్తిలుపాయవైభవమ్ శొల్లిత్తాయిత్తు.

౧౪. తెలియని యర్థములనన్నింటిని క్రమేణ పూర్తిగా తెలిపి ఆచార్యకృత్యమును, పురుషకారకృత్యమును, ఉపాయకృత్యమును, తానే వహించుటవలన, మహాభారతమున ఉపాయవైభవము జెప్పబడినది.

౧౫. పురుషకారత్తుక్కు ముపాయత్తుక్కుమ్ వైభవమావదు-దోషత్తైయుమ్ గుణహానియైయుమ్ పార్త్తు, ఉపేక్షియాదవళవన్రిక్కే, అఙ్గీకారత్తుక్కు అవైతన్నైయేపచ్చైయాక్కుగై.

౧౫. పురుషకారమునకును, ఉపాయమునకును వైభవమేమియనగ - దోషమును, గుణహానిని జూచి, ఉపేక్షించియుండుట మాత్రమే గాకుండగ, అంగీకరించుటకు వానినే కానుకలుగ స్వీకరించుటయే.

౧౬. ఇరణ్డుమిరణ్డుమ్ కళైయవేణుమెన్రిరుక్కిల్ ఇరణ్డుక్కు మిరణ్డు ముణ్డాయిత్తామ్.

౧౬. చేతనుని దోషము - గుణహానియు ఈ రెండును, నశించవలెనని పిరాట్టియు ఈశ్వరుడును ఈ ఇద్దరును రక్షించకుండగ యున్న చో, పురుషకారభూతురాలగు పిరాట్టికిని, ఉపాయభూతుడగు ఈశ్వరునికిని ఈ యిద్దరికిని, దోషము-గుణహానియును రెండును సంభవించును.

౧౭. ఇరణ్డుమ్ కుళైన్దదెన్రిరుక్కిల్, ఇత్తలైక్కు ఇరణ్డుముణ్డాయిత్తదామ్.

౧౭. దోషము - గుణహానియు ఈ రెండును తనకు నశించినవని తలంచినచో, ఇట్టి చేతనునకు దోషము గుణహానియు ఈ రెండును యుండును.

౧౮. రాక్షసిగళ్ దోషమ్ ప్రసిద్ధమ్.

౧౮. రాక్షసస్త్రీలయొక్క దోషము ప్రసిద్ధము.

౧౯. జితేన్ద్రియరిల్ తలైవనాయ్, ఆస్తికాగ్రేసరనాయ్, "కేశవస్యాత్మా" ఎన్రు కృష్ణనుక్కు ధారకనాయిరుక్కుమ అర్జుననుక్కు

౧౯. జితేంద్రియులలో తలమానికమై, ఆస్తికాగ్రేసరుడునై, "కేశవస్యాత్మా" (కేశవునికి ఆత్మస్వరూపుడు) అని కృష్ణునకు

దోషమేదెన్నిల్; – బన్ధుక్కళ్ పక్కల్ స్నేహముమ్, కారుణ్యముమ్, వధభీతియుమ్,

ధారకుడునై యుండునట్టి అర్జునునకు దోషమేమియనగ–బంధువులపట్ల స్నేహమును, కారుణ్యమును, వధభీతియున్ను.

౨౦. ద్రౌపదీపరిభవమ్ కణ్డిరుక్కవుమ్ కృష్ణాభిప్రాయత్తాలే ప్రధానదోషమ్

౨౦ ద్రౌపదియొక్క అవమానమును జూచియు ఊరకుండుట కృష్ణుని యభిప్రాయానుసారముగ ప్రధానదోషము.

౨౧. పాణ్డవర్కళైయుమ్ నిరసిక్క ప్రాప్తమాయిరుక్క, వైత్తదు ద్రౌపదియుడైయ మఙ్గళసూత్రత్తుక్కాగ.

౨౧ పాండవులను కూడ నశింపజేయవలసియుండగ, రక్షించినది ద్రౌపదియొక్క మాంగళ్యసూత్రము నిమిత్తమైయ్యే.

౨౨. అర్జుననుక్కు దూత్యసారథ్యఙ్గళ్ పణ్ణిత్తుమ్ ప్రపత్త్యుపదేశమ్ పణ్ణిత్తుమ్ ఇవళుక్కాగ.

౨౨. అర్జునునకు దూతకృత్యమును, సారథ్యమును జేసినదియు, ప్రపత్తి నుపదేశించినదియు ఈమె నిమిత్తమైయ్యే.

పురుషకారవైభవ ప్రకరణం సమాప్తం.

౨౩. ప్రపత్తిక్కు దేశనియమముమ్ కాలనియమముమ్ ప్రకారనియమముమ్ అధికారినియమముమ్ ఫలనియమముమిల్లై.

౨౩ ప్రపత్తికి దేశనియమముగాని, కాలనియమముగాని, ప్రకారనియమముగాని, అధికారినియమముగాని, ఫలనియమముగాని లేవు.

౨౪. విషయనియమమే యుళ్ళదు.

౨౪. విషయనియమము మాత్రమే గలదు.

౨౫. కర్మత్తుక్కు పుణ్యక్షేత్రమ్ వసన్తాదికాలమ్ శాస్త్రోక్తఙ్గళాన తత్తత్ప్రకారఙ్గళ్ త్రైవర్ణికర్ ఎన్నివైయెల్లామ్ వ్యవస్థితఙ్గళాయిరుక్కుమ్.

౨౫. కర్మయోగమునకు పుణ్యక్షేత్రము, వసంతాదికాలము, శాస్త్రోక్తమైన ఆయావిధానములు, త్రైవర్ణికులగుట అను నవన్నియు నియతములై యుండును.

౨౬. "స ఏవ దేశః కాలః" ఎన్గైయాలే ఇదుక్కు దేశకాలనియమమిల్లై.

౨౬. "స ఏవ దేశః కాలః" అని శ్రీ ఆంజనేయులువారు తెలుపుటచే దీనికి దేశకాల నియమములేదు.

౨౭ ఇవ్వర్థమ్ మన్త్రరత్నత్తిల్ ప్రథమపదత్తిలేసుస్పష్టమ్.

౨౭. ఈ అర్థము మంత్రరత్న (ద్వయ) మందలి ప్రథమ పదమగు శ్రీమత్పదమున సుస్పష్టమగును.

౨౮ ప్రకారనియతియిల్లై ఎన్నుమిడమ్ ఎజ్గుమ్ కాణలామ్

౨౮. ప్రకారనియమము లేదను విషయము అంతటను చూడనగును.

౨౯ ద్రౌపది స్నానమ్ పణ్ణాతే ప్రపత్తి పణ్ణినాళ్; అర్జునన్ నీశర్ నడువే యిరున్దే ఇవ్వర్థమ్ కేట్టదు.

౨౯. ద్రౌపది స్నానము జేసినదై కాదుగదా ప్రపత్తిని జేసినది. అర్జునుడు నీచుల మధ్యను గదా ఈ అర్థమును వినినది.

౩౦ ఆగైయాల్ శుద్ధాశుద్ధగళిరణ్డుమ్ తేడ వేణ్డా; ఇరున్దపడియే అధికారియామిత్తనై.

౩౦. కావున పరిశుద్ధినిగాని అపరిశుద్ధినిగాని రెండింటిని వెదకుకొన నవసరము లేదు. ఎటుల యున్న వాడటులనే యిందులకు తగిన యోగ్యత గలవాడగును.

౩౧. ఇవ్విడత్తిలే వేల్వెట్టిప్పిళ్ళైక్కు ప్పిళ్ళై యరుళిచ్చెయ్దవార్తైయై స్మరిప్పదు.

౩౧. ఈ విషయమున వేల్వెట్టి పిళ్ళగారికి నంబిళ్ళగారు సాయించిన మాటలను స్మరించుకొన వలసినది.

౩౨. అధికారినియమమిన్ఱిక్కే యొళిన్దపడియెన్నెన్నిల్; ధర్మపుత్రాదిగళుమ్ ద్రౌపదియుమ్ కాకముమ్ కాళియనుమ్ శ్రీగజేన్ద్రాళ్వానుమ్ శ్రీవిభీషణాళ్వానుమ్ పెరుమాళుమ్ ఇళైయపెరుమాళుమ్ తొడక్కమానవర్గళ్ శరణమ్ పుగుగిఱైయాలే అధికారి నియమమిల్లై.

౩౨. అధికారి నియమము లేకపోవుట యెటుల యనగ ధర్మరాజాదులును, ద్రౌపతియును, కాకాసురుడును, కాళీయుడును, శ్రీగజేంద్రాళ్వానును, శ్రీవిభీషణాళ్వానును, శ్రీరామచంద్రుడును, శ్రీలక్ష్మణస్వామియును, మున్నగువారు శరణుజొచ్చుటచేఅధికారినియమము లేదు.

33. ఫలనియమమిన్ఱిక్కే యొళిన్దపడియెన్నెన్నిల్; ధర్మపుత్రాదిగళుక్కు ఫలమ్ రాజ్యమ్; ద్రౌపదిక్కు ఫలమ్ వస్త్రమ్; కాకత్తుక్కుమ్ కాళియనుక్కుమ్ ఫలమ్ ప్రాణమ్; శ్రీగజేంద్రాళ్వానుక్కు ఫలమ్ కైంకర్యమ్; శ్రీవిభీషణాళ్వానుక్కు ఫలమ్ రామప్రాప్తి;

33. ఫలనియమము లేకపోవుట యెటులయనగ ధర్మరాజాదులకు ఫలము రాజ్యము. ద్రౌపతికిఫలము వస్త్రములు. కాకాసురునకును – కాళీయునకును ఫలము ప్రాణము. శ్రీగజేంద్రాళ్వానులకు ఫలము కైంకర్యము, శ్రీవిభీషణాళ్వానుకు ఫలము

పెరుమాళుక్కు ఫలమ్ సముద్రతరణమ్; ఇళైయపెరుమాళుక్కు ఫలమ్ రామానువృత్తి.

శ్రీరాముని జేరుట. శ్రీరామచంద్రునకు ఫలము సముద్రమును దాటుట. శ్రీలక్ష్మణస్వామికి ఫలము శ్రీరాముని ననుసరించియుండుట.

౩౪. విషయనియమమావదు - గుణపూర్తియుళ్ళవిడమే విషయమాగై. పూర్తియుళ్ళదు అర్చావతారత్తిలే.

౩౪. విషయనియమమనగా - గుణములయొక్క పరిపూర్ణతగల తావే విషయము అట. అట్టి పరిపూర్ణత అర్చావతారమున గలదు.

౩౫. ఆళ్వార్గళ్ పలవిడజ్గళిలుమ్ ప్రపత్తిపణ్ణిత్తు అర్చావతారత్తిలే

౩౫. ఆళ్వారులు అనేక స్థలములయందు ప్రపత్తి జేసినది. అర్చావతారమునందే.

౩౬. “పూర్ణమ్” ఎన్గైయాలే ఎల్లాగుణజ్గళుమ్ పుష్కలజ్గళ్.

౩౬. “పూర్ణం” అను శ్రుతి తెలుపుటచే అన్ని గుణములు పుష్కలములుగ గలవు.

౩౭. ప్రపత్తిక్కు అపేక్షితజ్గళాన సౌలభ్యాదిగళ్ ఇరుట్టఱైయిల్ విళక్కుప్పోలే ప్రకాశిప్పదిజ్గే.

౩౭. ప్రపత్తి జేయుటకవసరమైన సౌలభ్యాదులు చీకటిగదిలో దీపమువలె ప్రకాశించునది యర్చావతారమునందే.

౩౮. పూర్తియైయుమ్ స్వాతన్త్ర్యత్తైయుమ్ కులైత్తుక్కొణ్డు తన్నై అనాదరిక్కుమవర్కళై త్తానాదరిత్తు నిఱ్కుమవిడమ్.

౩౮. పరిపూర్ణతను, స్వాతంత్ర్యమును, సంకుచితపరచుకొని తనను యనాదరించువారలను తానాదరించుచు యుండునట్టి స్థలము.

౩౯. భూగతజలమ్పోలే అన్తర్యామిత్వమ్; ఆవరణజలమ్పోలే పరత్వమ్; పాఱ్కడల్ పోలే వ్యూహమ్; పెరుక్కాఱుపోలే విభవజ్గళ్; అదిలే తేజ్గిన మడుక్కళ్ పోలే అర్చావతారమ్.

౩౯. భూమిలోనుండు జలమువంటిది అంతర్యామిత్వము. బ్రహ్మాండావరణము నందలి జలమువంటిది పరత్వము. పాలసముద్రమువంటిది వ్యూహము. నదిలోవరదనీటివంటివి విభవావతారములు. అందుమిగిలి నిలిచియున్న మడుగులవంటివి అర్చావతారము.

౪౦. ఇదుదాన్ శాస్త్రజ్గళాల్ తిరుత్తవొణ్ణాదే విషయాన్తరజ్గళిలే మణ్డి విముఖరాయ్ప్పోరుమ్ చేతనర్కు వైముఖ్యత్తైమాత్తి

౪౦. ఇది శాస్త్రములచే దిద్దుబాటు చేయనలవి గాకుండగ, ఇతర విషయముల యందు మఱిగి, భగవద్విముఖులై యుండు చేతను

| | |
|---|---|
| రుచియైప్పిళ్లెక్కు దవవాయ్ రుచివిఱ న్దాల్ ఉపాయమాయ్ ఉపాయపరిగ్రహమ్ పణ్ణినాల్ భోగ్యముమాయిరుక్కుమ్. | ..., వైష్ణవ్యముచుపోగొట్టి రుచిని గలి గింప జేయజాలినదై. రుచిగలిగిన పిమ్మట ఉపాయమై, ఉపాయముగ పరిగ్రహించిన పిమ్మట భోగ్యమై యుండును. |
| ౪౧. ఇదిల్ ప్రపత్తిపణ్ణు అధికారిగళ్ మూవర్ | ౪౧ అప్పావతారముగ ప్రపత్తిచేయు నధి కారులు ముగ్గురు. |
| ౪౨. అజ్ఞరుమ్ జ్ఞానాధికరుమ్ భక్తిపరవశరుమ్. | ౪౨ అజ్ఞులును, జ్ఞానాధికులును, భక్తిపర వశులును |
| ౪౩. అజ్ఞానత్తాలే ప్రపన్నర్ అస్మదాదిగళ్; జ్ఞానాధిక్యత్తాలే ప్రపన్నర్ పూర్వాచార్య ర్గళ్ ; భక్తిపారవశ్యత్తాలే ప్రపన్నర్ ఆళ్వార్గళ్. | ౪౩. అజ్ఞానము వలన ప్రపన్నులగు అస్మదాదు లము. జ్ఞానాధిక్యము వలన ప్రపన్నులు పూర్వాచార్యులు, భక్తిపారవశ్యము వలన ప్రపన్నులు ఆళ్వార్లు. |
| ౪౪. ఇప్పడిశొల్లుగిరదుమ్ ఊత్తైప్పత్తి. | ౪౪. ఊనికను బట్టి యిటుల చెప్పబడినది. |
| ౪౫. ఇమ్మూన్రుమ్ మూన్రుతత్త్వత్తైయుమ్ పత్తి వరుమ్. | ౪౫. ఈ మూడును మూడు తత్త్వముల నను సరించి సంభవించును. |
| ౪౬. "ఎన్నాన్ శెయ్గేన్" ఎన్ఱు అవిడత్తిలే ఇమ్మూ న్రుముణ్డు. | ౪౬ "ఎన్నాన్ శెయ్కేన్" అను తిరువాయ్మొళి (౫-౮-౩) పాశురమున ఈమూడును గలవు. |
| ౪౭. అజ్జు ఒన్రైప్పత్తియిరుక్కుమ్. | ౪౭. నమ్మాళ్వార్లు విషయమున భక్తిపార వశ్యము నొకదానిని బట్టియె యుండును. |
| ౪౮. ముఖ్యమదువే. | ౪౮. అదియే ముఖ్యము. |
| ౪౯. "అవిద్యాతః" ఎన్గిఱశ్లోకత్తిలే ఇమ్మూ న్రుమ్ శొల్లిత్తు. | ౪౯. "అవిద్యాతః" అను జితంతాస్తోత్ర శ్లోకమున ఈమూడును తెలుపబడినవి. |
| ౫౦. "ఇదం శరణమజ్ఞానామ్" | ౫౦. "ఇదం శరణ మజ్ఞానాం" అను లక్ష్మీతంత్ర మునను ఈవిషయము గలదు. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| ౫౧. భక్తి తన్నిలే అవస్థాభేదమ్ పిఱన్దాల్ ఇదుతాన్ కులైయక్కడవదాయిరుక్కుమ్. | ౫౧. భక్తియందు అవస్థాభేదములు కలుగుట తోడనే ఈప్రపత్తి చెడిపోవజాలియుండును. |
| ౫౨. తన్నైప్పేణవుమ్ పణ్ణుమ్ తరిక్కవుమ్ పణ్ణుమ్. | ౫౨. తనను ఆదరించుకొనునటుల జేయును. ప్రాణముల ధరించి యుండునటులను జేయును. |
| ౫౩. ఇన్దస్వభావవిశేషఙ్గళ్ కల్యాణగుణఙ్గళిలుమ్ తిరుచ్చరఙ్గళిలుమ్ తిరునామఙ్గళిలుమ్ తిరుక్కుళలోశైయిలుమ్ కాణలామ్. | ౫౩. ఇట్టి స్వభావవిశేషములు కల్యాణగుణముల యందును, దివ్యమైన బాణముల యందును, దివ్యనామముల యందును, దివ్యమైన వేణుగానధ్వని యందును జూడవచ్చును. |
| ౫౪. ఇదుతన్నైప్పార్త్తాల్ పితావుక్కుప్పుత్రనెళుత్తువాఙ్గుమాపోలే యిరుప్పదొన్ఱు. | ౫౪. ఈప్రపత్తిని ఉపాయముని తలంచినచో తండ్రికి పుత్రుడు వ్రాయించి పుచ్చుకొనునటుల యుండును. |
| ౫౫. ఇదుతనక్కుస్వరూపమ్ తన్నైప్పొఱాదొళిగై. | ౫౫. దీనియొక్క స్వరూపము తనను సాధనముగా దలంచుటను సహింపకుండుటయె. |
| ౫౬. అఙ్గమ్ తన్నై యొళిన్దవత్తైప్పొఱాదొళిగై. | ౫౬. దీనికంగము. తనను తప్ప యితరముల సంపర్కమును సహింపకుండుటయే. |
| ౫౭. ఉపాయమ్ తన్నైప్పొఱుక్కుమ్. | ౫౭. సిద్ధోపాయమనునది తనను ఉపాయముగా దలంచుటను సహించును. |
| ౫౮. ఉపాయాన్తరమిరణ్డైయుమ్ పొఱుక్కుమ్. | ౫౮. తదితరోపాయములు రెండువిధములైన తలంపులను సహించును. |
| ౫౯. ఇదు ఇరణ్డైయుమ్ పొఱాదు. | ౫౯. ప్రపత్తి రెండింటిని సహింపదు. |
| ౬౦. ఫలత్తుక్కు ఆత్మజ్ఞానముమ్ అప్రతిషేధముమే వేణ్డువదు. | ౬౦. ఫలించుటకు ఆత్మజ్ఞానమును, అప్రతిషేధమును మాత్రమే గావలయును. |

# బదరి శ్రీనివాస రామానుజ స్వామివారల
# శాశ్వత, తాత్కాలిక, పూజావిరాళములు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమతి కందాడ రంగనాయకమ్మగారు | మాధవరం | 175-0-0 (లోగడ 100/లు గాక) |
| 2. | శ్రీ న్యాపతి బాలకృష్ణమూర్తిగారు, అడ్వకేటు. | శ్రీకాకుళం | 29-0-0 (లోగడ 29/లుగాక) |
| 3. | శ్రీ యతిరాజ సేవామహిళా మండలి శ్రీ మరువాడ అండాళమ్మగారు, నరసన్నపేట | | 29-0-0 |
| 4 | శ్రీ టంకాల జగన్నాథ మూర్తిగారు | (టంకాల) | 29-0 0 (లోగడ 29/లుగాక) |
| 5. | శ్రీమతి అల్లూరి వెంకట రంగనాయకమ్మగారు | కవుతవరం | వాగ్దానం 275/లు జమ 20 |
| 6. | శ్రీ కటకనేని లక్ష్మీవెంకట శేషాచలపతిరావుగారు | నరసరావుపేట | „ 116/లు జమ 16 |
| 7. | శ్రీమతి మట్టపల్లి వెంకట రత్నమ్మగారు | తెనాలి | 29 |
| 8. | శ్రీమతి చీడేపూడి శేషమ్మగారు | చుండూరు | 29 |
| 9. | శ్రీ పడాల దేవుడు రాఘవయ్యగారు | „ | 29 |
| 10 | శ్రీమతి తాళ్ల సుబ్బమ్మగారు | „ | 29 |
| 11. | శ్రీ పడాల వెంకటేశ్వరరావుగారు | „ | 29 |
| 12. | శ్రీ పడాల అచ్చయ్యగారు | „ | 29 |
| 13. | శ్రీమతి మోదుగుల వెంకట సుబ్బమ్మగారు | „ | 29 |
| 14. | శ్రీ కారుమూరి అప్పిరెడ్డి కొ॥ కోటిరెడ్డిగారు | „ | 29 |
| 15. | శ్రీ దేవభక్తుని వీరభద్రయ్యగారి కుమార్డు వెంకటసుబ్బారావుగారు, పెదపూడి | | 29 |
| 16. | శ్రీ గుంటూరు పూర్ణచంద్రరావుగారు | „ | 11 |
| 17. | శ్రీమతి బొలిశెట్టి సీతారత్నమ్మగారు | తెనాలి | 11 |
| 18. | శ్రీ. న. చ. పార్థసారథి, శ్రీనివాసాచార్యులుగార్లు | హైదరాబాద్ | 22 |
| 19. | శ్రీ కారుమూరి గురవారెడ్డిగారిభార్య శేషమ్మగారు | చుండూరు | 11 |
| 20. | శ్రీమతి తూములూరి జయమ్మగారు | మదరాసు | 11 |
| 21. | శ్రీమతి నుసిపాకం తాయారమ్మగారు | „ | 11 |
| 22. | శ్రీ కె. శేషాచార్యులుగారు | విజయవాడ | 11 |
| 23. | శ్రీ వి. వి. వరదాచారి ఎంర్ గారు | సికిందరాబాద్ | 11 |
| 24. | శ్రీయతిరాజసేవా మహిళామండలి వారితరఫున C/o శ్రీమతి దాసరి అండాళమ్మగారు | విశాఖపట్నం | 11 |
| 25. | శ్రీమతి దామెర చెల్లాయమ్మగారు | పిఠాపురం | 11 |
| 26. | శ్రీమతి దామెర లక్ష్మీ వెంకాయమ్మగారు | „ | 11 |

## వాగ్దానములు

| | | | |
|---|---|---|---|
| 27. | శ్రీమతి కారుమూరి మాణిక్యమ్మగారు | కవుతవరం | 275 |
| 28. | ,, కటికెల రోశమ్మగారు | చుండూరు | 29 |
| 29. | ,, దొప్పలపూడి అనసూయమ్మగారు | శ్రీరంగపురం | 29 |
| 30. | శ్రీ తట్టా సీతారామాచార్యులుగారు | నడిగడ్డపాలెం | 29 |
| 31. | శ్రీమతి అన్నపురెడ్డి గోవిందమ్మగారు | చుండూరు | 29 |
| 32. | శ్రీమతి చింతల రాఘవమ్మగారు | పెదపర్తిపాలెం | 29 |
| 33. | శ్రీ గాజుల వెంకటరెడ్డయ్యగారు | చావలి | 29 |
| 34. | శ్రీమతి తుమ్మల భ్రమరాంబగారు | రిమ్మనపూడి | 116 |
| 35. | శ్రీమతి తుమ్మల సుబ్బమ్మగారు | „ | 116 |
| 36. | ,, పడాల రత్నమ్మగారు | చుండూరు | 29 |
| 37. | శ్రీ కురా పుల్లయ్యగారు | పడమటలంక | 29 |
| 38. | శ్రీమతి అన్నపురెడ్డి రామతులశమ్మగారు | చినగాదెలవర్రు | 29 |
| 39. | ,, కాజ సత్యవతమ్మగారు | బోడిమెట్ల | 275 |

| | | | |
|---|---|---|---|
| 40. | శ్రీమతి కొనగిపల్లి మహాలక్ష్మమ్మగారు | చుండూరు | 29 |
| 41. | ,, ఈమన బసమ్మగారు | ,, | 29 |
| 42. | ,, పడాల పిచ్చమ్మగారు | ,, | 29 |
| 43. | ,, మోదుగుల సీతారామమ్మగారు | ,, | 29 |
| 44. | ,, కారుమూరి మాణిక్యమ్మగారు | ,, | 29 |
| 45. | ,, జమ్ములమడక రామమ్మగారు | ,, | 29 |
| 46. | శ్రీ గురేటి సుబ్బారెడ్డిగారు | ,, | 116 |
| 47. | శ్రీ చుండూరు వేదాద్రి నరసింహారావుగారు | ,, | 29 |
| 48. | శ్రీమతి వట్టికూటి రాజమ్మగారు | ,, | 29 |
| 49. | శ్రీ ఈమని అంజిరెడ్డిగారు | ,, | 116 |
| 50. | శ్రీమతి ఉయ్యూరి నరసమ్మగారు | ,, | 29 |
| 51. | ,, గొర్రెపాటి తులశమ్మగారు | ,, | 29 |
| 52. | ,, ఆవుల సుశీలమ్మగారు | గుండాలగుంటపాలెం | 29 |
| 53. | ,, వోకూరి తులశమ్మ | కరవది | 29 |
| 54. | శ్రీ గాజుల తాతయ్యగారు | చావలి | 29 |
| 55. | శ్రీమతి దాసరి శ్రీదేవమ్మగారు | ,, | 29 |
| 56. | ,, తాటికొండ సుబ్బమ్మగారు | ,, | 29 |
| 57. | ,, తూసా రత్తమ్మగారు | ,, | 29 |
| 58. | ,, గోపాళం వెంకట సుబ్బమ్మగారు | ,, | 29 |
| 59. | శ్రీ గోపాళం పాపయ్యగారు | ,, | 29 |
| 60. | శ్రీమతి తాడిపాక నాంచారమ్మగారు | ,, | 29 |
| 61. | శ్రీ కంచె పిచ్చయ్యగారు | ,, | 29 |
| 62. | ,, బోడపాటి వెంకటరామయ్యగారు | ,, | 29 |
| 63. | ,, కంచె వెంకట కోటయ్యగారు | ,, | 29 |
| 64. | శ్రీమతి బోడపాటి సుచిత్రమ్మగారు | ,, | 29 |
| 65. | శ్రీ బోడపాటి పాపయ్యగారు | ,, | 29 |
| 66. | ,, గాజుల నాగేశ్వరరావుగారు | ,, | 29 |
| 67. | ,, గాజుల వెంకట సుబ్బారావుగారు | ,, | 29 |
| 68. | ,, గోపాళం వెంకటేశ్వర్లుగారు | ,, | 29 |
| 69 | ,, గాజుల కోటయ్యగారు | ,, | 29 |
| 70. | శ్రీమతి విష్ణుమొలకల కనకమ్మగారు | ,, | 29 |
| 71. | శ్రీ వెలివల వెంకటేశ్వర్లుగారు | ,, | 29 |
| 72. | శ్రీమతి గాజుల నాంచారమ్మగారు | ,, | 29 |
| 73. | ,, కన్నా బుల్లెమ్మగారు | ,, | 29 |
| 74. | శ్రీ విష్ణుమొలకల నాగేంద్రయ్యగారు | ,, | 29 |
| 75. | శ్రీమతి సోమశాతు అన్నమ్మగారు | ,, | 29 |
| 76. | శ్రీ గాళ్ల వెంకయ్యగారు | ,, | 29 |
| 77. | ,, విష్ణుమొలకల రామయ్యగారు, (జమ) (వాగ్దానం) 275/లు | | జమ 29 |
| 78. | ,, దాడి బసవయ్యగారి కుమారుడు పిచ్చయ్యగారు | పెరవలి | జమ 29 |
| 79 | ,, దాసరి వెంకట సుబ్బారావుగారు | చావలి | వాగ్దానం 29 |
| 80. | శ్రీమతి విష్ణుమొలకల శీతమ్మగారు | ,, | ,, 29 |
| 81. | శ్రీ వెలవల గోపాల కృష్ణయ్యగారు | ,, | ,, 29 |

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press,



# భక్తినివేదన

[వేదాంతమాసపత్రిక]




| సంపుటి ౧౦ | హేవిళంబి - పుష్యం | సంచిక ౧౦ |
| --- | --- | --- |



సంపాదకులు :
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ళ రామానుజాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః

# బదరీ శ్రీనివాసరామానుజస్వామివారల శాశ్వత, తాత్కాలిక పూజా విరాళాలు

**కొల్లూరు**

శ్రీ అంచా అంజయ్యగారిభార్య పిచ్చెమ్మగారు 116/-
,, గుమ్మడి హనుమాయమ్మగారు 116/-
,, తుమ్మల బసవమ్మగారు 116/-
,, నన్నపనేని భాస్కరరావుగారు 58/-
,, గుమ్మడి విజయమోహనరావుగారు 58/-
,, పొట్లూరి బాపమ్మగారు 29/-
,, గుమ్మడి నాగభూషణంగారు 29/-
,, ఉప్పు వెంకయ్యగారు 29/-
,, బైసాని వెంకటసుబ్బమ్మగారు 29/-
,, చెరుకూరి చిననాగయ్యగారు 29/-
,, గుమ్మడి సుబ్బారాయుడుగారు 11/-
,, గుమ్మడి వరసయ్యగారు 11/-
,, గుమ్మడి వీరయ్యగారు 11/-
,, మునగాల సత్యనారాయణమూర్తిగారు 11/-
,, బైసాని సుబ్బారావుగారు 11/-
,, తుమ్మల వెంకటసుబ్బయ్యగారు 11/-
,, మునగాల లక్ష్మయ్యగారు 11/-
,, గుమ్మడి వెంకటకృష్ణారావుగారు 11/-
,, గుమ్మడి రత్తమ్మగారు (మందిరం) 11/-
,, గుమ్మడి పున్నమ్మగారు 29/-
,, తుమ్మల బసవపున్నయ్యగారు 29/-

**అవనిగడ్డ**

శ్రీ మోపిదేవి యతిరాజమ్మగారు 275/- లు వాగ్దానం
శ్రీ పోతురాజు సుందరమ్మగారు 116/- ( ,, )
,, యార్లగడ్డ వె. శివరామకృష్ణయ్యగారు 275/- )
,, పోతురాజు పాపాయమ్మగారు 116/- లు ( ,, )
,, గొత్తిరామమోహనరావుగారు 29/- లు ( ,, )
,, యార్లగడ్డ లక్ష్మీనరసమ్మగారి పూజనిమిత్తం 25/-
(అ. య. వెం. శి. రా. కృష్ణయ్యగారు)

**చిట్టిగూడూరు**

శ్రీ చేబాలరామానుజమ్మగారి పేరుతో
,, నదిమెళ్ళ రంగాచార్యులుగారు 275/- లు వాగ్దానం
,, బ్రహ్మకపాళం పూజకు 25/- లు ( ,, )

**పెద్దవరం అగ్రహారం**

శ్రీ సముద్రాల లక్ష్మణాచార్యులుగారు 116/- వాగ్దానం

**బందలాయి చెరువు**

శ్రీ పర్చూరి మస్తానుగారు 29/- లు వాగ్దానం

**కొక్కిలిగడ్డ**

శ్రీ జొట్టా రామానుజమ్మగారు 116/- లు వాగ్దానం
ఈమెయే (జొట్టా వీరభద్రయ్యగారి పూజనిమిత్తం) 25/- లు ,,

(సశేషము)

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ గీతాజయంతి మహోత్సవము

## తులసీరామానుజకూటం – రాజమండ్రి

---

శ్రీ విశిష్టాద్వైతప్రచారకసంఘ ప్రధానకార్యదర్శులగు శ్రీ మదిత్యాది శ్రీమాన్ న్యాయవేదాంతవిద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు, రాజమండ్రిలో తులసీరామానుజకూటమున 3-12-57 వ తేది మొదలు 20-12-57 వ తేది వరకు గీతాజయంతిని జరుపుచున్నారు. 18 మంది దీక్షాపరులచే ప్రతిదినము గీత 18 అధ్యాయములు పారాయణ జరుగును. ప్రతిదినము గీత ఒక్కొక్క అధ్యాయము పారాయణముచేయుచు తిరువీధిగోష్ఠి జరుపుదురు. ఉపన్యాసకులు పెక్కురు ప్రముఖులైన విద్వాంసులు ఆహ్వానింపబడిరి. ప్రతిదినం గీతనుగురించి అధ్యాయసారమును సమిష్టి పారాయణానంతరము శ్రీ గోపాలాచార్యస్వామివారు వివరింతురు. గీతా తత్త్వార్థులందరు యీ గోష్ఠిలో అన్వయించ గోరుచున్నాము. ఈ జయంతికి కార్యదర్శిగా శ్రీమత్తిరుమల పురిమెళ్ళ వెంకటాచార్యులుగారున్ను, శ్రీ రంప శంకరశాస్త్రిగారు జనరల్ శక్రటరీగానున్ను, శ్రీ గ్రంధి లక్ష్మీనారాయణగారు కోశాధికారిగానున్ను ఉన్నారు.

శ్రీ హయగ్రీవాయ నమః

# త్రిదండివింశతి

శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు ఆశ్రమములో తిరుమంత్రార్థ శ్రీవచనభూషణ కాలక్షేపములుకృపచేసి శాత్తుమొర జరిపినపుడు శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు శ్రీ జియ్యర్ స్వామివారివిషయమై రచించినది.

యస్సదా విజయతే త్రిదండినా
శైశవప్రభృతి సౌహృదశ్రియా
తం భజామి నిగమాంత వేదినం
తెల్కచర్లకుల గోపదేశికం.

(1)

శ్రీ శ్రీనివాస యతి శేఖర నిత్యపూజా
కైంకర్య నిర్వహణధుర్య మహార్య ధైర్యం
అజ్ఞానినాం, భవజుషాం శరణం త్రిదండి
నారాయణార్య గురు చందిర మాశ్రయామి

(2)

తోతాద్రిపీఠ గురువర్య నిదేశలబ్ధ
కాషాయదండ ముఖసూత్ర శిఖాభిరామం
బద్ధాత్మనాం హృదయతాపహరం శరణ్యం
నారాయణార్యయమినం మనసాస్మరామి.

(3)

స్వామిన్ త్రిదండి కులభూషణ! వాసుదాస
దివ్యాశ్రమ స్థల కుటీరతటీ నివాస!
సంసారకర్దమ గళావధిమగ్న మేన
ముద్ధృత్య పాహి కృపయా పరయా మహాత్మన్.

(4)

విద్వన్ గురూత్తమ! బహిర్విషయాభిలాష
గాఢాంధకార నిబిడీకృత దుష్టమార్గే
సంసారరూపగహనే విషమే చరంతం
మామేత్య దేహి భవదీయ కటాక్షదీపం.

(5)

ఆకస్మిక ప్రణయశీతల వీక్షణేన
నారాయణేన, కలితో హి తవావతారః
తత్తాదృశస్య భవతః పదయో ర్నివేశ్య
భారం - చరామి - యతిశేఖర! యావదాయుః

(6)

స్వామిన్ హిమాద్రిశిఖరే, బదరీప్రదేశే
యత్తప్త మార్గవిధినా కఠినవ్రతేన
తన్మంత్రతత్త్వ ముపదిశ్య భవార్తిభాజాం
నారాయణో మునిరివాసి కలౌ మహాత్మన్.

(7)

జాత్వా ద్విజత్వ ముపగమ్య గురోస్సమీపే
శ్రీభాష్యమేత్య భగవద్విషయం ప్రపద్య
గార్హస్థ్యధర్మ మవలంబ్య విసృజ్య పశ్చాత్
శ్రీభాష్యకార ఇవ భాతి భవాన్ త్రిదండీ.

(8)

కందాడ వంశకలశోదధి పూర్ణిమేందు
రామానుజార్య కరుణా విదితాగ మాంతం
గోపాల సూరి సుహృదాశయ బద్ధభావం
నారాయణార్య యతివర్య మహం నమామి.

(9)

అష్టాక్షర స్మరణ సౌరభపూరితేన
దివ్యేన, భక్తిమకరంద రసాంచితేన
చిత్తాంబుజేన మృదునా పరిశీలితేన
సోఽయం మదీయ ఇతి భావయ దేశికేంద్ర.

(10)

సోఽహం పశుస్త్రివిధ దోష పరీత చేతా
స్సర్వేశ్వరో వదతి మాం ప్రతి నక్షమామి
కృత్వా రమాపి ఘటనాం విఫలా బభూవ
కిం వాకరోమి భగవన్! శరణంత్వమేవ.

(11)

నానాజనుష్కృత దురంత మహౌఘ రూవ
పంకే మమాస్య హృదయం స్ఖలితం నితాంతం
తత్, క్షాళయామి యతిరాజ! భవత్పవిత్ర
శ్రీపాదతీర్థ మధునా మయిసంప్రసీద

(12)

తత్వం శ్రియః పతి రితి ప్రతిబోధ్య లోకా
నాసేతు శీతనగ పర్యటనం కరోషి
తస్మా త్పునర్జను రవాప స భాప్యకర్తే
త్యాలోచ్య, తే పదయుగం శరణంగతోఽస్మి

(13)

కృత్వాక్రతూన్ బహూంవిధాం సఫలాం విశిష్టా
ద్వైతప్రచారక సభామపి కల్పయిత్వా
భక్తిప్రభావ మభితః కలయం ప్రజానా
ముత్తారకో భవసి సంయమి సార్వభౌమ

(14)

మంత్రోపదేశ విధినా, చ, సుదర్శనాంక
దానేన, పండిత సభా విషయ ప్రచారైః
గీతా రఘూత్తమ చరిత్ర మహాత్మ్యవాద్యైః
విభ్రాజతే భవదమానుష శక్తిరద్య

(15)

ధన్యోహమద్య గురుశేఖర! యుష్మదంఘ్రి
సంసేవనాశ్రయణ దర్శన తీర్థపానైః
మంత్రార్థదాతరి గురౌ మనుజత్వబుద్ధి
ర్నష్టైవ సా వినిహతా – హృదయం ప్రశాంతం

(16)

సత్యం వదామి యతిభూషణ! కింబహూక్త్యా
సంసారభోగవిషయా ననుభూయ చేతః
విఘ్నం నకాంక్షతి నచేచ్ఛతి విఘ్నభక్తాన్
ప్రారబ్ధ కర్మవశత శ్శరణం త్వమేవ

(17)

అస్మాదృశాం విషయదోషమ లీ మసానాం
స్వప్నే ప్యలభ్య విషయం బదరీప్రయాణం
తత్తాదృశం యతికులోత్తమ! న స్త్వదీయ
పాదాబ్జసంశ్రయవశా త్సఫలం బభూవ

(18)

విద్యార్థినాం, చ, విదుషాం, విదుషీమణీనాం
పూర్వార్జితేన, సుకృతేన, భవాన్ ప్రసన్నః
తజ్జ్ఞానసంపదఖిలా భవతా గృహీతా
తత్వప్రచార విషయే సఫలా బభూవ

(19)

స్వామిన్ శుచిస్మిత ముఖోల్లసదూర్ధ్వ పుండ్ర!
కాషాయవేష మృదుభాష సుహృత్వభావ!
శ్రీమత్త్రిదండ! గురుదేవ! నరాయణార్య
రామానుజాఖ్య యతిరాజమయి ప్రసీద.

(20)

అస్మిన్ కలౌ గురుకులోచిత ధర్మశాలీ
జ్ఞానోచితా చరణభాక్, విజితేంద్రియశ్చ
నారాయణార్యయతిశేఖర ఏకఏవ
సత్యం బ్రవీమి సుజనా శ్శృణుతాస్మదుక్తిం.

విజ్ఞప్తి రిత్థ మకరోత్ కవిరత్ననామా
విజ్ఞానరత్నరుచిరాయ, యతీశ్వరాయ
అజ్ఞానతః ప్రతిపదస్ఖలితాపచారాన్
పరిజ్ఞాఘునా స్నహృదయాః కృపయా క్షమధ్వం.

ఇతి గురుకులరాణ్ణారాయణార్య
స్తుతి మిహ వింశతి మాదరా చ్ఛ్రితానాం
వితరతి భగవా నఖండలక్ష్మీం
మతి మతులాంచ శుభాస్పదం ప్రసాదం.

౬౧. అల్లాదపోదు బన్ధత్తుక్కుమ్ పూర్త్తిక్కుమ్ కొత్తైయామ్.

౬౧. అటులగానిచో నిరుపాధిక శేషిత్వరూప సంబంధమునకును, నిరపేక్షోపాయత్వమునకును లోపము కలుగును.

౬౨. ఆగత్తైప్పోక్కిక్కొళ్ళుగిఱోమెన్ఱు భ్రమిత్తు అత్తైవిలైక్కుక్కొళ్ళాదొళిగైయే వేణ్డువదు.

౬౨. తపదను పోగొట్టుకొనుచున్నామని భ్రమించి, దానిని తెచ్చిపెట్టుకొనకుండుట మాత్రమే కావలసినది.

౬౩. రక్షణత్తుక్కపేక్షితమ్ రక్ష్యత్తిన్ అనుమతియే.

౬౩. సర్వేశ్వరుడు రక్షించుటకు వలయునది రక్షించబడవలసిన చేతనుని అనుమతి మాత్రమే.

౬౪. ఎల్లావుపాయత్తుక్కుమ్ పొదువాగైయాలుమ్ చైతన్యకార్యమాగైయాలుమ్, ప్రాప్తిదశైయిలు మనువర్త్తిక్కైయాలుమ్ స్వరూపాతిరేకియల్లామైయాలుమ్, అచిద్వ్యావృత్తవేషత్తై సాధనమాక్క వొణ్ణాదు.

౬౪ అన్ని ఉపాయములకును పొదువైనదగుట వలనను, జ్ఞానమున్నందులకు ప్రయోజనమగుటవలనను, మోక్షదశయందు కూడ అనువర్తించుట వలనను, స్వరూపముకంటె అతిరిక్తమైనది గాకుండుట వలనను, జ్ఞాతృత్వరూప స్వరూపమును సాధనముగ దలంచరాదు.

౬౫. అచిద్వ్యావృత్తిక్కు ప్రయోజనమ్ ఉపాయత్తిలుపకార స్మృతియుమ్ ఉపేయత్తిలు గప్పుమ్.

౬౫. అచేతనవస్తువుకంటెను విలక్షణమైనందులకు ప్రయోజనము ఉపాయభూతుడైన సర్వేశ్వరుని విషయమున ఉపకారస్మృతియు, ఉపేయమగు తత్కైంకర్యమున సంతోషమున్ను.

౬౬. “ఉన్మనత్తాలెన్నినైన్దిరున్దాయ్” ఎన్గిఱపడియే ప్రాప్తిక్కుపాయ మవన్నినైవు. తిరువాయ్. ౨. ౭. ౧.

౬౬. “ఉన్మనత్తా లెన్నినైందిరుందాయ్” అను తిరువాయ్మొళి ౨-౭-౮ పాశురమున నున్నటుల భగవత్ప్రాప్తి కుపాయము ఆయన సంకల్పము.

౬౭. అదుతానెప్పోదుముణ్డు.

౬౭. అది యెల్లప్పుడును కలదు.

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౧౮. అవ ఫలిప్పదు ఇవన్ నినైవు మాఱినాల్. | ౧౮. అది వీని సంకల్పము మారినచో ఫలించును. |
| ౧౯. "అన్తిమకాలత్తుక్కు త్తఞ్జమ్ ఇప్పోదు త్తఞ్జమెన్ ఎన్ఱిఱ నినైవు కులైగై" ఎన్ఱు జీయర్ అరుళిచ్చెయ్యువర్. | ౧౯. "అంతిమకాలమునకు రక్షకము - ఇప్పుడు రక్షకమేది? అను తలంపులేకుండుటయే" అని నంజీయరు సాయించుచుండెడివారు. |
| ౨౦. ప్రాప్తావుమ్ ప్రాపకనుమ్ ప్రాప్తిక్కు ఉగప్పానుమ్ అవనే. | ౨౦. పొందువాడు - పొందించువాడు - పొందుటచే యానందించువాడును ఆ సర్వేశ్వరుడే. |
| ౨౧. స్వయత్ననివృత్తి పారతన్త్ర్యఫలమ్; స్వప్రయోజననివృత్తి శేషత్వఫలమ్. | ౨౧. స్వప్రయత్నమును మానుకొనుట పారతంత్ర్యముయొక్క ఫలము. స్వప్రయోజనమును లేకుండుట శేషత్వముయొక్క ఫలము. |
| ౨౨. పరప్రయోజనప్రవృత్తి ప్రయత్నఫలమ్; తద్విషయప్రీతి చైతన్యఫలమ్. | ౨౨. పరాత్పరుని యానందరూప ప్రయోజనమునకై పాటుపడుటయే స్వప్రయత్నముయొక్క ఫలము. సర్వేశ్వరుని విషయమున ప్రీతికలిగియుండుటయే చైతన్యమున్నందులకు ఫలము. |
| ౨౩. అహమర్థత్తుక్కు జ్ఞానానన్దఙ్గళ్ తటస్థమెన్నుమ్పడి దాస్యమిఱే అన్తరఙ్గనిరూపకమ్. | ౨౩. అహమర్థమగు ఆత్మకు జ్ఞానానందములు తటస్థలక్షణములు. దాస్యమే అంతరంగ నిరూపకమైనది. (ప్రధానలక్షణము) |
| ౨౪. ఇదుతాన్ వన్దేఱియన్ఱు. | ౨౪. ఇది యాగంతుకము గాదు. |
| ౨౫. స్వాతన్త్ర్యముమ్ అన్య శేషత్వముమ్ వన్దేఱి. | ౨౫. స్వాతంత్ర్యమును, ఇతరులకు శేషభూతుడై యుండుటయు ఆగంతుకములు. |
| ౨౬. శేషత్వవిరోధి స్వాతన్త్ర్యమ్; తచ్ఛేషత్వ విరోధి తదితర శేషత్వమ్. | ౨౬. శేషత్వమునకు విరోధి స్వాతంత్ర్యము. భగవచ్ఛేషత్వవిరోధి - తదితర శేషత్వము. |

౭౭. అహంకారమాగిఱ అర్ ప్పైత్తుడైత్తాల్ ఆత్మావుక్కుళియాద పేర్ అడియాన్ ఎన్ఱితే

౭౭. అహంకారమను విషమునను తొలగించి నచో ఆత్మకు నాశనములేనిపేరు "అడియేన్-దాసుడను" అనియేకదా.

౭౮. గ్రామకులాదిగళాల్ వరుమ్పేర్ అనర్థ హేతు.

౭౮. గ్రామ కులాలాదులచే వచ్చు పేరు అనర్థములకు హేతువు.

౭౯. "ఏకాన్తీ వ్యపదేష్టవ్యః"

౭౯. "ఏకాంతీ వ్యపదేష్టవ్యః"

౮౦. ఉపాయత్తుక్కు పిరాట్టియైయుమ్ ద్రౌపదియైయుమ్ తిరుక్కణ్ణమఙ్గైయాణ్డానై యుమ్పోలే యిరుక్కవేణుమ్; ఉపేయత్తుక్కు ఇళైయపెరుమాళైయుమ్ పెరియవుడైయారైయుమ్పిళ్ళైతిరునఱైయూరరైయరైయుమ్ చిన్తయన్తియైయుమ్పో లే యిరుక్కవేణుమ్.

౮౦. ఉపాయమును పరిగ్రహించుటకు సీతా పిరాట్టివలెను, ద్రౌపతివలెను, తిరుక్కణ్ణమంగై యాండానువలెను ఉండవలయును. ఉపేయమగు కైంకర్యమునకు శ్రీలక్ష్మణస్వామివలెను, జటాయువు వలెను, తిరునఱైయూరరైయరువలెను, చింతయంతివలెను ఉండవలయును.

౮౧. పిరాట్టిక్కుమ్ ద్రౌపదిక్కుమ్వాశి శక్తి యు మశక్తియుమ్.

౮౧ సీతాపిరాట్టికిని - ద్రౌపతికిని తారతమ్యము - శక్తియు అశక్తియును.

౮౨. పిరాట్టి స్వశక్తియై విట్టాళ్; ద్రౌపది లజ్జైయై విట్టాళ్; తిరుక్కణ్ణమఙ్గైయాణ్డాన్ స్వవ్యాపారత్తై విట్టాన్.

౮౨. సీతాపిరాట్టి స్వశక్తిని వదలుకొనినది. ద్రౌపతిలజ్జను వదలుకొనినది. తిరుక్కణ్ణమంగైయాండాన్ తన ప్రయత్నమును విడిచెను.

౮౩. పశియరాయిరుప్పార్ అట్టశోఱుము ణ్ణవేణుమ్, అడుగిఱశోఱు ముణ్ణవేణుం ఎన్నుమాపోలే కాట్టుక్కుప్పోగిఱపోదు ఇళైయపెరుమాళ్ పిరియిల్ తరియామైయై మున్నిట్టు అడిమైశెయ్యవేణుమ్, ఎల్లావడిమైయుమ్ శెయ్యవేణుమ్, ఏవి

౮౩. ఆకలిగొనియున్నవారు ఉడికిన యన్నము తినవలెను, ఉడుకుచున్న యన్నము తినవలయునని గోరునటుల అడవికి జనునపుడు శ్రీలక్ష్మణస్వామివారు, విశ్లేషమును సహించజాలక పోవుటను పురస్కరించుకొని, కైంకర్యమును జేయ

కొళ్ళవుమ్ వేణుమ్ ఎన్బార్; పడైవీట్టిల్ పుగున్దపిన్బు కాట్టిల్ తనియిడత్తిల్ స్వయమ్బాకత్తిలే వయిత్తై పెరుక్కినపడియాలే ఒప్పూణుణ్ణమాట్టాదే ఒరు తిరుక్కైయాలే తిరువెణ్కొత్తుక్కుడైయైయుమ్, ఒరు తిరుక్కైయాలే తిరువెణ్శామరత్తైయుమ్ తరిత్తడిమైశెయ్దార్.

వలయును. సకలవిధ కైంకర్యపరులను జేయకలయును. ఆజ్ఞాపింపబడి చేయించుకొనవలయును అనిరి.

రాజధానికి ప్రవేశించిన పిమ్మట, వనమున వంటరిగ స్వయంపాకమున కడుపు నింపుకొనినందుపిలన, పంక్తిభోజనమును భుజించజాలక, ఒక శ్రీహస్తముతో దివ్యమైన శ్వేతచ్ఛత్రమును, మరియొక శ్రీహస్తముతో దివ్యమైన తెల్లనివింజామరమును ధరించి కైంకర్యము నాచరించిరి.

౮౪. పెరియవుడైయారుమ్ పిళ్ళైతిరునరైయూరరైయరుమ్ ఉడమ్బై ఉపేక్షిత్తార్గళ్; చిన్తయన్తిక్కుడమ్బుతన్నడైయేపోయిత్తు.

౮౪. శ్రీజటాయువున్ను, పిళ్ళైతిరునరైయూరరైయరున్ను శరీరమును ఉపేక్షించిరి. చింతయంతికి శరీరము తనంతట తానే పోయినది.

౮౫. ఉపాయత్తుక్కు శక్తియుమ్ లజ్జైయుమ్ యత్నముమ్ కులైయవేణుమ్; ఉపేయత్తుక్కు ప్రేమముమ్ తన్నై పేణామైయుమ్ తరియామైయుమ్ వేణుమ్.

౮౫. సర్వేశ్వరుని ఉపాయముగ గొనుటకు శక్తిని, లజ్జను, ప్రయత్నమును విడిచివేయవలయును.

కైంకర్య రూపోపేయమునకు ప్రేమయు, స్వాత్మగౌరవ దృష్టిరాహిత్యము, తద్వినా సహించి యూరకుండలేక పోవుటయును కావలయును.

౮౬. ఇవనుక్కు వైధమాయ్ వరుమదిత్తేత్యజిక్కలావదు; రాగప్రాప్తమాయ్ వరుమదు త్యజిక్కవొణ్ణాదిఱే.

౮౬ వీనికి ఆజ్ఞా ప్రాప్తమై వచ్చినదగుచో కదా విడువ వలనుపడును. అనురాగ ప్రాప్తమై వచ్చినదానిని విడువ శక్యముకాదుగదా.

౮౭. ఉపాయత్వానుసన్ధానమ్ నివర్తకమ్; ఉపేయత్వానుసన్ధానమ్ ప్రవర్తకమ్.

౮౭. సర్వేశ్వరునేఉపాయముగయనుసంధించుట నివృత్తికి కారణము. కైంకర్య రూపోపేయత్వాను సంధానము ప్రవృత్తికి కారణము.

౭౮. అవాప్తవిషయఙ్గళిలే సక్తనానవన్ అదు లభిక్కవేణు మెన్ఱిరానిన్ఱాల్ ప్రాప్తవిషయప్రవణనుక్కుచ్చొల్లవేణ్డావితే.

౭౮. స్వరూప విరోధములగు విషయముల యందాసక్తి గలవాఁడు "దానిని పొంద వలయు" నని పట్టు పట్టుచుండగ, స్వరూపానుగుణ విషయమున ప్రీతిగలవాని విషయమై చెప్పనవసరము లేదుకదా.

౭౯. అనుష్ఠానముమ్ అననుష్ఠానముమ్ ఉపాయకోటియిల్ న్వాయియాదు.

౭౯. అనుష్ఠానమే గాని అననుష్ఠానమే గాని ఉపాయకోటిలో చేరవు.

౮౦. అనన్యోపాయత్వముమ్ అనన్యోపేయత్వముమ్ అనన్యదైవత్వముమ్ కులైయుమ్బడియాన ప్రవృత్తి కాణానిన్ఱోమిఱే.

౮౦. అనన్యోపాయత్వము, అనన్యోపేయత్వము అనన్య దైవత్వము కూడ భంగపాటు జెందునట్టు ప్రవృత్తిని జూచుచున్నారము కదా.

౮౧. జ్ఞానవిపాక కార్యమాన అజ్ఞానత్తాలే వరుమవై యెల్లామ్ అడిక్కళిఞ్జు పెఱుమ్.

౮౧. జ్ఞాన పరిపక్వముచే తటస్థించునట్టి అజ్ఞానముచే సంభవించునవన్నియు స్వరూప ప్రకాశములేయగును.

౮౨. ఉపాయఫలమాయ్ ఉపేయాన్తర్భూతమాయిరుక్కుమదు ఉపాయప్రతిబన్ధకమాగాదు.

౮౨. ఉపాయమునకు ఫలమై, ఉపేయమున అంతర్భూతమై యుండునట్టివి, ఉపాయమునకు ప్రతిబంధకములు కాజాలవు.

౮౩. సాధ్యసమానమ్ విళమ్బాసహామ్ ఎన్ఱిఱే సాధనత్తుక్కేత్తమ్. సాధ్యప్రావణ్యమడియాగవిఱే సాధనత్తిలిళిగిఱదు.

౮౩. సాధ్యమైనదానితో సమానమైయుండుట ఆసల్యముగాకుండుట, ఇవియే కదా సాధనమునకు గౌరవాపాదకములు. సాధ్యమందలి ప్రేమవలననే కదా సాధనమును స్వీకరించుట

౮౪. ఇవనుక్కుప్పిఱక్కుమాత్మగుణఙ్గళెల్లా వత్తుక్కుమ్ ప్రధానహేతు ఇన్దప్రావణ్యమ్.

౮౪. వీనికి జనించు ఆత్మగుణము లన్నింటికిని ప్రధానకారణము ఈ ప్రేమయే.

౮౫. "మాఱ్ఱాళ్ మనమ్ శుళిప్ప". 'పర

౮౫. 'మాఱ్ఱాళ్ మనశ్శుళిప్ప' అను మూన్ఱాంతిరువందాదిలోని ౧౮ పాశురమును, "పర

మాత్మని యోరక్తః". 'కణ్ణికేట్టిత్తుమోన్దు'.

మాత్మని యోరక్తః అను శ్లోకమును, "కణ్ణికేటుత్తుమోందు" అనుతిరువాయ్ మొళియందలి ౪. ౯. ౧౦. పాశురమును యిందులకు నిదానము.

౯౬. ఆత్మగుణజ్గళిల్ ప్రధానమ్ శమముమ్ దమముమ్.

౯౬. ఆత్మగుణములయందు ప్రధానములైనవి శమము, దమమును.

౯౭. ఇవై ఇరణ్డుముణ్డానాల్ ఆచార్యన్ కైపుగుమ్; ఆచార్యన్ కైపుకున్దవాతే తిరుమన్త్రమ్ కైపుగురుమ్; తిరుమన్త్రమ్ కైపుగున్దవాతే ఈశ్వరన్ కైపుగురుమ్; ఈశ్వరన్ కైపుగున్దవాతే "వైకున్దమానగర్ మత్తదు కైయదువే" ఎన్గిఅపడియే ప్రాప్యభూమి కైపుగురుమ్.

౯౭. ఇవి రెండును యున్నచో ఆచార్యులు లభింతురు.
ఆచార్యులు లభించిన వెంటనే తిరుమంత్రము హస్తగతమగును.
తిరుమంత్రము హస్తగతమైన వెంటనే ఈశ్వరుడు కటాక్షించును. ఈశ్వరుడు కటాక్షించిన వెంటనే "వైకుంద మానకర్ మత్తు కైయదువే" అను తిరువాయ్ మొళిలోని ౪. ౧౦. ౧౧ పాశురమున తెలిపినటుల ప్రాప్యభూమి చేజిక్కగలదు.

౯౮. ప్రాప్యలాభమ్ ప్రాపకత్తాలే; ప్రాపకలాభమ్ తిరుమన్త్రత్తాలే; తిరుమన్త్రలాభమాచార్యనాలే; ఆచార్యలాభమాత్మగుణత్తాలే.

౯౮. ప్రాప్యలాభము ప్రాపకుని మూలమున. ప్రాపకుని లాభము తిరుమంత్రము మూలమున. తిరుమంత్ర లాభము ఆచార్యుని మూలమున. ఆచార్యలాభము ఆత్మగుణముల మూలమున.

౯౯. ఇదుతాన్ ఐశ్వర్యకామర్క్కుమ్ ఉపాసకర్క్కుమ్ ప్రపన్నర్క్కుమ్ వేణుమ్

౯౯. ఈ శమ, దమములు ఐశ్వర్యమును గోరువారికిని, ఉపాసకులకును, ప్రపన్నులకును కూడ గావలయును.

౧౦౦. మూవరిలుమ్ వైత్తుక్కొణ్డు మిగవుమ్ వేణ్డువదు ప్రపన్ననుక్కు.

౧౦౦. ముగ్గురిలోను ముఖ్యముగ కావలసినది ప్రపన్నులకు–

| | |
|---|---|
| ౧౦౧. మత్తైయిరువర్కుమ్ నిషిద్ధవిషయని వృత్తియే యమైయుమ్; ప్రపన్ననుక్కు విహితవిషయనివృత్తితన్నేత్తమ్. | ౧౦౧. మిగిలిన యిద్దరకును నిషిద్ధ విషయము లను విడుచుట మాత్రమే జాలును. ప్రపన్నునకు శాస్త్రప్రసిద్ధమైన విషయ మును కూడ విడుచుటయే ఆధిక్యము. |
| ౧౦౨. ఇదుతాన్ శిలర్క్కళగాలే పిఱక్కుమ్; శిలర్క్కరుళాలే పిఱక్కుమ్; శిలర్క్కాచారత్తాలే పిఱక్కుమ్. | ౧౦౨. ఇది కొందరికి భగవత్సౌందర్యమువలన జనించును. కొందరకు కృపావిశేషము వలన జనించును. కొందరకు అనుష్టానాను సంధానము వలన జనించును. |
| ౧౦౩. పిఱక్కుమ్ క్రమమెన్నెన్నిల్; అళగు అజ్ఞానత్తై విళైక్కుమ్; అరుళ్ అరుచియై విళైక్కుమ్; ఆచారమ్ అచ్చత్తై విళైక్కుమ్. | ౧౦౩. ఇవిలభించు క్రమ మేది యనగ - సౌందర్యము అజ్ఞానమును కలిగించును. కృప అరుచిని బుట్టించును. అనుష్టానము భయమును కలిగించును. |
| ౧౦౪. ఇవైయుమ్ ఊత్తత్తైపత్తచ్చొలుగిఱదు. | ౧౦౪. ఇవియు ఊనికను బట్టి చెప్పబడినవి. |
| ౧౦౫. అరుచి పిఱక్కవేణ్డైక్కు దోషదర్శనమపేక్షితమా యిరుక్కుమ్. | ౧౦౫. అరుచి జనించుటకు దోషదర్శనము ఆవశ్యకమై యుండును. |
| ౧౦౬. అదు ప్రధాన హేతువన్ఱు. | ౧౦౬. అది ప్రధాన హేతువు కాదు. |
| ౧౦౭. అప్రాప్తతైయే ప్రధాన హేతు. | ౧౦౭. స్వరూపమునకు విరుద్ధమై యుండుటయే ప్రధాన హేతువు. |
| ౧౦౮. భగవద్విషయత్తిలిళిగిఱదుమ్ గుణమ్ కణ్డన్ఱు; స్వరూపప్రాప్తమెన్ఱు. | ౧౦౮. భగవంతుని విషయమున ప్రవర్తించుటయు కూడ గుణములను జూచి కాదు. స్వరూపమునకు తగినదై యుండుట వలననే. |
| ౧౦౯. ఇప్పడి కొళ్ళాదపోదు గుణహీననెన్ఱు నినైత్తదశైయిల్ భగవద్విషయప్రవృత్తియుమ్, దోషానుసన్ధానదశైయిల్ సంసారత్తిల్ ప్రవృత్తియుమ్కూడాదు. | ౧౦౯. ఇటుల నంగీకరించకున్నచో గుణహీను డను దశయందు భగవంతుని విషయమున ప్రవృత్తియును, దోషములు నను సంధించు దశలో సంసారమున ప్రవృత్తియు సంభవించజాలవు. |

౧౧౦. "కొడియవెన్నెఞ్జమవనెన్తే కిడక్కుమ్" "అడియేన్ నాన్ పిన్నుమున్ శేవడి యన్ఱి నయవేన్" ఎన్ఱానిఱే ఆళ్వార్ కళిఱే.

౧౧౧. గుణకృతదాస్యత్తిలుజ్కాట్టిల్ స్వరూప ప్రయుక్తమాన దాస్యమిఱే ప్రధానమ్.

౧౧౨. అనసూయైక్కు ప్పిరాట్టి యరుళిచ్చెయ్దవార్త్తైయైస్మరిప్పదు.

౧౧౩. భగవద్విషయప్రవృత్తి ప్పిన్నై శేరుమో వెన్నిల్; అదుక్కడిప్రావణ్యమ్; అదుక్కడిసమ్బన్ధమ్; అదుతాన్ ఔపాధికమన్ఱు, సత్తాప్రయుక్తమ్.

౧౧౪. అన్ఱసత్తై ప్రావణ్యకార్యమానవనుభవ మిల్లాదపోదు కులైయుమ్; అదు కులైయామైక్కాగవఱుమవైయెల్లామ్ అవర్జనీయజ్గళుమాయ్ ప్రాప్తజ్గళుమాయిరుక్కుమ్; ఆగైయాలే భగవద్విషయ ప్రవృత్తి శేరుమ్.

ముదల్ ప్రకరణమ్ ముత్తిఱ్ఱు.
పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణమ్.

౧౧౦. "కొడియవెన్నెఞ్జమ్ అవనెన్తే కిడక్కుం" (క్రూరమైన నా మనస్సు ఆయననే అనుసరించియే యుండును) అని తిరువాయిమొళి ౫. ౩. ౫ పాశురమునను; "అడియేన్ నాన్ పిన్నుమ్ ఉన్ శేవడి యన్ఱి నయవేన్" (దాసుడనగు నేను నీ పాదపద్మములను తప్ప మరి దేనిని ఆశింపను.) అని తిరువాయ్మొళి ౭. ౧. ౪ పాశురమునను సాయించిరి కదా.

౧౧౧. గుణములచే ఆకర్షితుడై చేయు కైంకర్యము కంటెను స్వరూప ప్రయుక్తమైన దాస్యమే కదా ప్రధానమైనది.

౧౧౨. అనసూయకు సీతాపిరాట్టి సాయించిన వార్త్తలను స్మరించుకొన వలసినది.

౧౧౩. 'భగవద్విషయమున ప్రవృత్తి మరలగునా' అనినచో అందులకు కారణము ప్రేమాధిక్యము. అందులకు కారణము శేషశేషి సంబధము. అది కల్పితము కాదు. ఉనికిని బట్టి వచ్చినది.

౧౧౪. ఆ ఉనికి ప్రీతివలన జనించు యనుభవము లేనిచో నశించును, అది నశించకుండుటకు గాను తటస్థించునవి యన్నియును అవర్జనీయములై, స్వరూప ప్రాప్తములై యుండును. గాన భగవద్విషయమున ప్రవృత్తి సంభవించగలదు.

ప్రథమ ప్రకరణము సమాప్తము
శ్రీ పిళ్ళైలోకాచారియర్ తిరువడిగళేశరణం.

శ్రీమతే రామానుజాయ నమః



అస్మద్గురుభ్యో నమః
శ్రీమల్లోక గురువే నమః
శ్రీ పిళ్లై లోకాచార్యులవారు సాయించిన

# శ్రీ వచన భూషణము

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్యసూనవే।
సంసారభోగి సందష్ట జీవ జీవాతావే నమః॥

## —: ద్వితీయ ప్రకరణము :—

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౧౧౫. ప్రాపకాన్తరపరిత్యాగత్తుక్కుమ్ అజ్ఞానాశక్తిగళన్ఱు. స్వరూపవిరోధమే ప్రధానహేతు. | ౧౧౫. ఇతరోపాయములను విడుచుటకును అజ్ఞాన అశక్తులుగాక, స్వరూపమునకు విరుద్ధమై యుండుటయే ప్రధాన హేతువు. |
| ౧౧౬. ప్రాపకాన్తరమ్ అజ్ఞర్క్కు ఉపాయమ్ | ౧౧౬. ఇతరోపాయములు అజ్ఞానుల కుపకరించును. |
| ౧౧౭. జ్ఞానిగళుక్కు అపాయమ్. | ౧౧౭. జ్ఞానులకు అపాయము. |
| ౧౧౮. అపాయమాయిత్తదు స్వరూపనాశకమాగైయాలే. | ౧౧౮. అపాయమగుట స్వరూప నాశకము అగుట వలన. |
| ౧౧౯. "నెఱికాట్టినీక్కుదియో" ఎన్నానిఱ్ఱే. | ౧౧౯. "నెఱికాట్టి నీక్కుతియో" (ఇతరోపాయములను జూపి భ్రష్టునిగా జేయుదువా) అని తిరువాయ్మొళి పాశురమున తెలిపియున్నారుకదా. |
| ౧౨౦. "వర్తతే మే మహద్భయమ్" ఎన్గైయాలే భయజనకమ్ "మాశుచః" ఎన్గైయాలే శోకజనకమ్. | ౧౨౦. "వర్తతే మే మహద్భయం" (నాకు మిక్కిలి భయము కలుగుచున్నది.) అనుటచే భయమును కలిగించునట్టివి "మాశుచః" (దుఃఖించకుమా) అని భగవద్గీత ౧౮. ౬౬. శ్లోకమున తెలుపుటచే దుఃఖమును కలిగించునట్టివి. |

౧౨౧. ఇప్పడిక్కొళ్ళాదపోదు పతత్ప్రవృత్తి యిల్ ప్రాయశ్చిత్తవిధి కూడాదు.

౧౨౧. ఇటులనంగీకరించనిచో పాయాంతర ప్రవృత్తి కలిగినపుడు పునః ప్రవృత్తి రూప ప్రాయశ్చిత్తవిధి సంగతము కాజాలదు.

౧౨౨. తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ పణిక్కుమ్పడి "మదిరా బిన్దుమిశ్రమాన శాతకుమ్భమయకుమ్భగత తీర్థసలిలమ్పోలే అహఙ్కారమిశ్రమాన ఉపాయాన్తరమ్."

౧౨౨. తిరుకురుకైప్పిరాన్ పిళ్లాన్ యొక్క శ్రీసూక్తి సువర్ణ కలశములో మద్యమిశ్రితమైన గంగాజలము వంటిది అహంకార మిశ్రితమైన యుపాయాంతరములు.

౧౨౩. రత్నత్తుక్కు ప్పలగిఱైపోలేయుమ్ రాజ్యత్తుక్కు ఎలుమిచ్చమ్పళమ్పోలేయుమ్ ఫలత్తుక్కు సదృశమన్రు.

౧౨౩. రత్నములకు గవ్వలు వలెను, రాజ్యమునకు నిమ్మపండు వలెను, ఫలమునకు సదృశమైనది కాదు.

౧౨౪. తాన్ దరిద్రనాగైయాలే తనక్కుక్కొడుక్కలావదొన్రిల్లై.

౧౨౪. తాను దరిద్రుడగుటచే తనకు యివ్వ తగిన దొకటియు లేదు.

౧౨౫. అవన్ తన్దత్తై క్కొడుక్కుమిడత్తిల్ అదై విలక్కొడుక్కిల్ అనుపాయమామ్; అదైవుకెడక్కొడుక్కిల్ కళవు వెళిప్పడుమ్.

౧౨౫. ఆయన యిచ్చినదానినే సమర్పించు నపుడు సక్రమముగ సమర్పించుటవలన అనుపాయమగును. క్రమము తప్పి సమర్పించినచో దొంగతనము బయట పడును.

౧౨౬. భర్తృభోగత్తై వయిఱువళర్క్కైక్కు ఉఱుప్పాక్కుమా పోలే ఇరువర్క్కుమవద్యమ్.

౧౨౬. భర్తయొక్క భోగమును స్వోదరపోషణమునకై సాధనముగ కొనినటుల, ఇద్దరకును నింద్యము.

౧౨౭. వేదాన్తఙ్గళుపాయమాగ విధిక్కిఱపడి యెన్నెన్నిల్;

౧౨౭. ఉపనిషత్తులు ఉపాయములుగ వాటిని ఏలవిధించిన వనినచో

౧౨౮. ఔషధసేవైపణ్ణాదవర్గళుక్కు అభిమతవస్తుక్కళిలే అత్తైక్కలశియిడువారైప్పోలే ఈశ్వరనైక్కలన్దు విధిక్కిఱత్తనై.

౧౨౮. ఔషధము సేవించ నిష్టగించనివారికి, వారికిష్టమైన వస్తువులయందు ఆ ఔషధమును చేర్చి యిచ్చువారివలెనే ఈశ్వరుని కూడచేర్చి మాత్రమే విధించుచున్నది.

౧౨౯. ఇత్తై ప్రవర్త్తిప్పిత్తదు పరహింసైయై నివర్త్తిప్పిక్కైక్కాగ

౧౨౯. వీటిని ప్రవర్తింప జేయుట పరహింసను నివర్తింప జేయుటకొరకే.

౧౩౦. ఇదుదాన్ పూర్వవిహితహింసైయోలే; విధినిషేధఙ్గళిరణ్డుక్కుమ్ కుఱైయిల్లై.

౧౩౦. ఇది పూర్వవిహిత శ్యేనయాగాది హింసవలెనే. విధించుటకు నిషేధించుటకు ఈ రెండింటికిని కూడ బాధకము లేదు.

౧౩౧. అత్తై శాస్త్రవిశ్వాసత్తుక్కాగ విధిత్తదు; ఇత్తై స్వరూపవిశ్వాసత్తుక్కాగ విధిత్తదు.

౧౩౧. శ్యేనయాగాదులను శాస్త్రమందు విశ్వాసమును కలిగించుటకై విధించినవి. ఉపాయాంతరములను స్వరూపమునందు విశ్వాసము కలిగించుటకై విధించినవి.

౧౩౨. అదు తోల్ పురైయే పోమ్; ఇదు మర్మస్పర్శి.

౧౩౨. శ్యేనయాగాదులు శరీరావసానములు. ఇతరోపాయములు స్వరూపమును స్పృశించునట్టివి.

౧౩౩. అవైదాన్ కర్మసాధ్యమాగైయాలే దుష్కరముమాయిరుక్కుమ్.

౧౩౩. ఇతరోపాయములు కర్మసాధ్యములగుటచే దుష్కరములై యుండును.

౧౩౪. ప్రపత్త్యుపాయత్తుక్కు ఇక్కుత్తఙ్గళొన్ఱుమిల్లై.

౧౩౪. ప్రపత్త్యుపాయమునకు ఇట్టి దోషము లొక్కటి కూడ లేదు.

౧౩౫. ఆత్మయాథాత్మ్యజ్ఞానకార్యమాగైయాలే స్వరూపత్తుక్కు ఉచితముమాయ్ "శిత్తవేణ్డా" ఎన్గిఱపడియే నివృత్తిసాధ్యమాగైయాలే సుకరముమాయిరుక్కుమ్.

౧౩౫. ఆత్మయాథాత్మ్యజ్ఞాన సంజనితమైన దగుటచే స్వరూపమునకు తగినదై "శిత్త వేండా" (శ్రమను జెందనవసరము లేదు.) అను తిరువాయ్ మొళిలోని ౯. ౧. ౭ పాశురమున తెలిపినటుల స్వప్రయత్న నివృత్తిచే సాధించబడున దగుటచే సుకరమై యుండును.

౧౩౬. పూర్ణవిషయమాగైయాలే పెరుమైక్కీడాగ ప్పచ్చెయిడ వొణ్ణాదు.

౧౩౬. పరిపూర్ణుని విషయమున జేయబడున దగుటచే పరిపూర్ణతకు తగినటుల కానుకను సమర్పింప నవకాశము లేదు.

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౧౩౭. అభిముఖ్యసూచకమాత్రత్తిలే సన్తోషమ్ విళైయుమ్. | ౧౩౭. అభిముఖ్యమును సూచించుట మాత్రముననే సంతోషము కలుగును. |
| ౧౩౮. పూర్తి, కైవాజ్గాదే మేల్ విళుగైక్కు హేతువిత్తనై. | ౧౩౮. పరిపూర్ణత, చేయి జారవిడువకుండగ స్వీకరించుటకు మాత్రమే కారణము కాగలదు. |
| ౧౩౯. "పత్రం పుష్పమ్." "అన్యత్పూర్ణాత్" "పురివదువుమ్ పుగై పూవే." | ౧౩౯. "పత్రం పుష్పం"అని భగవద్గీతయందు, "అన్య త్పూర్ణాత్" అని భారతమున, "పురివతువుం పుకైపూవే" అని తిరువాయ్ మొళిలో ౧. ౬. ౧. పాశురమునను తెలుపబడినది కదా. |
| ౧౪౦ పుల్లైక్కాట్టి అళైత్తు పుల్లై యిడు మాపోలే ఫలసాధనజ్గళుక్కు భేదమిల్లై. | ౧౪౦. గడ్డిని జూపించి స్వాధీనపరచుకొని గడ్డిని మేయుట కిడునటులనే ఫలమునకును - తత్సాధనమునకును భేదములేదు. |
| ౧౪౧. ఆగైయాలే సుఖరూప మా యిరుక్కుమ్. | ౧౪౧. కావున సుఖరూపమై యుండును. |
| ౧౪౨. ఇవన్ అవనై ప్పెఱ నినైక్కుమ్బోదు ఇన్దప్రపత్తియు ముపా యమన్ఱు. | ౧౪౨. ఈ చేతనుడు ఆ సర్వేశ్వరుని పొంద దలచినపుడు ఈప్రపత్తియుకూడ ఉపాయము కాజాలదు. |
| ౧౪౩ అవన్ ఇవనై ప్పెఱ నినైక్కుమ్బోదు పాతకముమ్ విలక్కన్ఱు. | ౧౪౩. ఆయన వీనిని స్వీకరించ దలచినపుడు వీని పాతకమున్ను అటంకము కాజాలదు. |
| ౧౪౪. ఇవ్విరణ్డుమ్ శ్రీభరతాళ్వాన్ పక్కలిలుమ్ శ్రీగుహప్పెరుమాళ్ పక్కలిలుమ్ కాణలామ్. | ౧౪౪. వీనిని రెండింటిని శ్రీభరతాళ్వార్ల విషయముననను, శ్రీగుహప్పెరుమాళ్ విషయముననను చూడవచ్చును. |
| ౧౪౫ శ్రీభరతాళ్వానుక్కు నన్మైతానే తీమైయాయిత్తు. శ్రీగుహప్పెరుమాళుక్కు తీమైతానే నన్మైయాయిత్తు. | ౧౪౫. శ్రీభరతాళ్వార్లకు గుణమే దోషముగ పరిణమించినది. శ్రీగుహప్పెరుమాళుక్కు దోషమే గుణముగ పరిణమించినది. |

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౧౪౬. సర్వాపరాధఙ్గళుక్కుమ్ ప్రాయశ్చిత్తమాన ప్రపత్తితానుమ్ అపరాధకోటియిలేయాయ్, క్షామణమ్ పణ్ణవేణ్డుమ్పడి యల్లానిన్ఱదిఱే. | ౧౪౬. అపరాధములు అన్నింటికిని ప్రాయశ్చిత్తరూపమైన ప్రపత్తియును కూడ, అపరాధవర్గమున చేర్పబడినదై, అందులకై క్షమాపణమును కోరవలసినదిగ గదా అగుచున్నది. |
| ౧౪౭. నెడునాళ్ అన్యపరైయాయ్ప్పోన్ద భార్యై లజ్జాభయఙ్గళిన్ఱిక్కే భర్తృసకాశత్తిలే నిన్ఱు ఎన్నై అఙ్గీకరిక్కవేణుమ్ ఎన్ఱు అపేక్షిక్కుమాపోలే ఇరుప్పదొన్ఱిఱే ఇవన్ పణ్ణుమ్ ప్రపత్తి. | ౧౪౭. చాలాకాలము వ్యభిచారిణియై తిరిగిన భార్య లజ్జాభయములను లేకుండగ భర్త యెదుట నిలబడి "నన్ను ఏలుకొనవలయు" నని కోరినటుల యుండునట్టిది గదా ఈ చేతనుడు చేయు ప్రపత్తి. |
| ౧౪౮. కృపైయాలే వరుమ్ పారతన్త్ర్యత్తిల్ కాట్టిల్. స్వాతన్త్ర్యత్తాలే వరుమ్ పారతన్త్ర్యమ్ ప్రబలమ్. | ౧౪౮. కృపచే జనించు పారతంత్ర్యము కంటెను స్వాతంత్ర్యముచే జనించు పారతంత్ర్యము ప్రబలమైనది. |
| ౧౪౯. ఇవ్వర్థత్తై వేదపురుషన్ అపేక్షిత్తాన్. | ౧౪౯. ఈ విషయము వేదమున తెలుపబడినది. |
| ౧౫౦. అపేక్షానిరపేక్షమాగ తిరువడిక్కుమ్ శ్రీగుహప్పెరుమాళుక్కుమ్ ఇదుణ్డాయిత్తు. | ౧౫౦. కోరకుండగనే శ్రీ ఆంజనేయులవారికిని, శ్రీ గుహప్పెరుమాళుకును, అది కలిగినది. |
| ౧౫౧. ఇవన్ మున్నిడుమవర్గళై అవన్ మున్నిడుమెన్నుమిడమ్ అభయప్రదానత్తిలే కాణలామ్. | ౧౫౧. ఈ చేతనుడు ముందునుంచు పురుషకారులను, ఆ సర్వేశ్వరుడు ముందు ఉంచును "అను విషయము అభయప్రదాన సమయమున జూడవచ్చును. |
| ౧౫౨. ఇరువర్ మున్నిడుకిఱదుమ్ తన్నామ్ కుత్తఙ్గళై శమిప్పిక్కైక్కాగ. | ౧౫౨. ఇద్దరును కూడ పురుషకారులను ముందుంచుకొనుట తమ దోషములను శమింప జేసుకొనుటకు గాను. |
| ౧౫౩. స్వరూపసిద్ధియుమ్ అత్తాలే. | ౧౫౩. దానివలననే స్వరూపము సిద్ధించును. |

౧౫౪. ఔపాధికముమాయ్ నిత్యముమాహాన పారతన్త్ర్యమ్ ఇరువర్కుమ్ ఒణ్డిఱే.

౧౫౪. ఉపాధివలనను వలిగినట్టియు, నిత్యమైనట్టియు పారతంత్ర్యము ఇద్దరకును కూడ గలదు కదా.

౧౫౫. అనిత్యమాన ఇవర్ పారతన్త్ర్యముమ్ కులైవదు మత్తాలే

౧౫౫. అనిత్యమైన యిద్దరి పారతంత్ర్యమును నశించునదియు ఆ పురుషకార ప్రసంగమునకనే.

౧౫౬. సమ్బన్ధ జ్ఞానత్తాలే ఇవ్విరువరాలుమ్ శెయ్యప్పోగాదు.

౧౫౬. సామ్బన్ధజ్ఞానము వలన ఈ శేషశేషి సంబంధము ఇద్దరి వలనను కూడ పోగొట్టుకొన శక్యముగాదు.

౧౫౭. “ఎన్నై నెగిళ్క్కలుమే.” కోలమలర్ప్పావైక్కన్బాగియ.”

౧౫౭. “ఎన్నై నెగిళ్క్కలుం” అను తిరువాయ్మొళిలోని ౧ ౭. ౮. పాశురమున్ను, “కోలమలర్ ప్పావైక్కంబాకియ” అను తిరువాయ్మొళిలోని ౧౦. ౧౦. ౭. పాశురమున్ను యిందుకు ప్రమాణము.

౧౫౮. కర్మణివ్యుత్పత్తియిల్ స్వరూపగుణఙ్గళాల్ వరుగిఱ కర్తృసఙ్కోచరాహిత్యత్తై నినైప్పదు.

౧౫౮. “శ్రీయతే” అను కర్మణివ్యుత్పత్తి యందు స్వరూపగుణముల వలన కలుగునట్టి కర్తృత్వము యొక్క సంకోచ రాహిత్యరూప పారతంత్ర్యమును స్మరించుకొనవలసినది.

౧౫౯. అధికారిత్రయత్తుక్కుమ్ పురుషకార మవర్జనీయమ్.

౧౫౯. మూడురకముల ప్రపన్నులకును కూడ పురుషకారము తప్పదు.

౧౬౦. తనక్కుత్తాన్ తేడుమన్నన్మై తీమైయోపాది విలక్కాయిరుక్కుమ్.

౧౬౦. తనకై తాను ప్రయత్నించునట్టి మంచియు చెరుపువలెనే ఆటంకభూతమై యుండును.

౧౬౧. అళగుక్కిట్ట శట్టై అణైక్కైక్కు విరోధియామాప్పోలే.

౧౬౧. అందమునకై ధరించిన రవిక ఆలింగనమునకు విరోధి యగునటుల.

౧౬౨. "హారోఽపి"

౧౬౨. "హారోఽపి" అను శ్రీరామాయణ మందలి శ్లోకమును స్మరించుచున్నది.

౧౬౩. పుణ్యత్తైప్పోలే పారతన్త్ర్యముమ్ పరానుభవత్తుక్కు విలక్కు.

౧౬౩. పుణ్యమువలెనే పారతన్త్ర్యము కూడ భగవంతుని యనుభవమునకు కాటంకమగును.

౧౬౪. గుణమ్బోలే దోషమిక్కుత్తై.

౧౬౪. గుణము వంటిదే దోషమిక్కుత్తై.

౧౬౫. ఆభరణమనభిమతమాయ్ అళుక్కభిమతమాయిరానిన్ఱదిఱే.

౧౬౫. ఆభరణము లయిష్టములై మురికి యభిమతమై యుండును గదా.

౧౬౬. 'స్నానమ్రోషజనకం' ఎన్ఱిఱివార్త్తైయై స్మరిప్పదు.

౧౬౬. "స్నానంరోషజనకం" అను శ్రీ రామాయణమందలి శ్లోకమును స్మరించునది,

౧౬౭. "వఞ్జక్కళ్వన్." "మఙ్గవొట్టు."

౧౬౭. "వంజక్కళ్వన్" అను తిరువాయ్మొళి ౧౦. ౭. ౧. పాశురమును "మంగవొట్టు" అను తిరువాయ్మొ ౧౦౪ ౭. ౧౦. పాశురమును స్మరించునది.

౧౬౮. వేర్ శూడుమవర్ గళ్ మణ్ పత్తుక్కళత్తాప్పోలే జ్ఞానియై విగ్రహత్తోడే యాదరిక్కుమ్.

౧౬౮. కురువేరును ధరించువారు దానితో గలమట్టిని కడుగనటులనే జ్ఞానిని విగ్రహముతోనే యాదరించును.

౧౬౯. పరమార్త్తనాన ఇవనుడైయ శరీరస్థితిక్కు హేతు కేవల భగవదిచ్ఛైయిఱే

౧౬౯. పరమార్థుడైన ఈ చేతనుని శరీరస్థితి కారణము కేవలము భగవదిచ్ఛయే కద.

౧౭౦. "తిరుమాలిరుఞ్జోలై మలైయే" ఎన్ఱిఱపడియే ఉగన్దరుళిననిలఙ్గళిల్లావత్తిలుమ్ పణ్ణుమ్ విరుప్పత్తై ఇవనుడైయ శరీరైకదేశత్తిలే పణ్ణుమ్.

౧౭౦. "తిరుమాలిరుంజోలై మలైయే" అను తిరువాయ్మొళి ౧౦. ౭. ౮. పాశురమందు వలెను దివ్యదేశముల యందంతటను కలిగి యున్నట్టు ఆదరణను ఈ చేతనుని శరీరమందొక్క దాని యందే కలిగి యుండును.

౧౭౧. అజ్ఞుత్తైవాసమ్ సాధనమ్; ఇజ్ఞుత్తైవాసమ్ సాధ్యమ్

౧౭౧. అర్చావిగ్రహాదుల యందుండుట సాధనము. భక్తుని హృదయమందుండుట సాధ్యము

౧౭౨. "కల్లుమ్కనైకడలుమ్" ఎన్గిఅపడియే ఇదు సిద్ధిత్తాల్ అవత్తి ఆదరమ్ మట్టమాయిరుక్కుమ్.

౧౭౨. "కల్లుం కనైకడలుం" అని పెరియ తిరువందాది ౬౮ పాశురమున సాయించినటుల భక్తుని హృదయము దొరకినచో అర్చావిగ్రహాదుల యందునికి యందు ఆదరము తక్కువగును.

౧౭౩. "ఇళఙ్గోయిల్ కైవిడేల్" ఎన్రు ఇవన్ ప్రార్థిక్కవేణ్డుమ్పడి యాయిరుక్కుమ్

౧౭౩. "ఇళంకోయిల్ కైవిడేల్" అని ౨ తిరువందాది ౫౪ పాశురమున సాయించినటుల ఈ చేతనుడు ప్రార్థింపవలసినదిగనుండును.

౧౭౪. ప్రాప్యప్రీతివిషయత్వత్తాలుమ్ కృతజ్ఞతైయాలుమ్ పిన్బువై అభిమతఙ్గళాయిరుక్కుమ్.

౧౭౪. ప్రాప్యమగు ఈ చేతనుని ప్రీతికి విషయమగుట వలనను, కృతజ్ఞత వలనను, పిమ్మట అవి యభిమతములై యుండును.

౧౭౫. అగ్నైయాలే దోషనివృత్తిపోలే ఆన్తర గుణము మ్ విరోధియా యిరుక్కుమ్.

౧౭౫. కావున దోషనివృత్తివలెనే అంతరంగిక గుణమగు పారతంత్ర్యము కూడ విరోధి కాగలదు.

౧౭౬. దోషనివృత్తితానే దోషమామితే.

౧౭౬. దోషనివృత్తియే దోషమగు కదా.

౧౭౭. "తన్నాల్ వరమ్ నన్మై విలైపాల్ పోలే; అవనాల్ వరుమ్ నన్మైములైప్పాల్ పోలే" ఎన్రుపిళ్ళాన్ వార్తై.

౧౭౭. స్వప్రయత్నముచే సంపాదించుకొను 'మేలు' పోతపాలవంటిది. ఆ సర్వేశ్వరునిచే సిద్ధించునట్టి మేలు తల్లిస్తన్యము వంటిది. "అని తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్లాన్ గారి శ్రీసూక్తి.

౧౭౮. అవనైయొళియత్తాన్ తనక్కు నన్మై తేడుగై యావదు స్వస్వరూప ప్రకాశమై

౧౭౮. సర్వేశ్వరుని విడచి తాను తనకు మేలును సంపాదించుకొన జూచుట,

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రచార విభాగము

## శ్రీ జియ్యర్‌స్వామివారి - శ్రీపాదయాత్ర

### కొల్లూరు

శ్రీ జియర్ స్వామివారు శ్రీ ఉ. వె. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యులవారితోను, శ్రీ కవిరత్న శ్రీ ఉ. వె. శ్రీమాన్ కె. రామానుజాచార్యుల వారితోను కలసి 12-11-57 తేదీ సాయంకాలమునకు వాపలి గ్రామమునుండి కొల్లూరు గ్రామమునకు విచ్చేసిరి. పుర ప్రముఖులు ఊరుబైటనే మేళతాళములతో వీరికి స్వాగతమిచ్చిరి. 13, 14, 15. తేదీలలో శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలోను, శ్రీ సీతారామమందిరములోను వేదాంతసభలు జరుపబడినవి. మహిళామండలి నూతనముగ స్థాపింపబడి శ్రీ లక్ష్మీపూజ జరుపబడినది. ఇచ్చట శ్రీ పురుషుల భక్తిశ్రద్ధలు చాల ఆనందమును కలిగించినవి.

### భట్టిప్రోలు

15-11-57 తేదీ సాయంకాలమునకు భట్టిప్రోలు చేరి రెండురోజులుండి శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలో వేదాంతిసభలు జరిగినవి ఇచ్చటను శ్రీలకు ప్రత్యేకము మహిళామండలి స్థాపింపబడి లక్ష్మీపూజ జరుపబడినది. ఇచ్చట శ్రీకృష్ణమాచార్య దంపతులున్ను, వీరికి తోడుగ వైశ్యప్రముఖులున్ను చాల ఉత్సాహముతో పనిచేసిరి.

### రేపల్లె

17-11-57 తేది సాయంకాలమునకు శ్రీ తటవర్తి రామమోహనరావు దంపతులు, మున్నగవారు అత్యంత భక్తిపురస్సర స్వాగతాహ్వానములతో రేపల్లెకు విచ్చేసి శ్రీ పట్టాభిరామస్వామి వారి ఆలయమున 18, 19, 20 తేదీలవరకు ఉండి ప్రతిదినము వేదాంతిసభలను జరిపిరి. ఇచ్చటను నూతనముగ మహిళామండలి స్థాపింపబడి శ్రీ లక్ష్మీపూజలు జరుపబడినవి శ్రీ రామమోహనరావు దంపతుల శ్రద్ధాభక్తులు అత్యంత శ్లాఘనీయములు.

### ముక్తిపల్లి

20-11-57 తేది సాయంకాలమునకు ముక్తిపలికి వేంచేసి గ్రామములోని శ్రీ పురుషులందరియొక్క స్వాగతాహ్వానములతో శ్రీ సీతారామాలయమున వేదాంతోపన్యాసములగావించి, శ్రీమాన్ కాం. నరసింహాచార్యులవారి, ఇందిరామందిర భవనమున విడిదిచేసిరి. ఇచ్చటను నూతనముగా మహిళామండలి స్థాపింపబడి శ్రీలక్ష్మీపూజగావింపబడెను. ఇచ్చటి శ్రీపురుషుల భక్తిశ్రద్ధలు అపూర్వముగ నుండెను. ఇచ్చటినుండి రేపల్లె మీదుగా కృష్ణానదినిదాటి అవనిగడ్డకు విచ్చేసిరి.

### అవనిగడ్డ

22-11-57 వ తేది రాత్రి పెక్కుర గ్రామప్రముఖులు శ్రీ స్వామివారికి అఖండస్వాగతముతో శ్రీ గోపాలస్వామివారి ఆలయమునకు వేంచేపుచేసుకొనివచ్చిరి. ఇచ్చట రెండురోజులు వేదాంతసభలు జరిగినవి. శ్రీ ఇల్లా ప్రగడ వెంకట శివరామకృష్ణయ్యగారు, డాక్టరు గారు, మరికొందరు చూపిన శ్రద్ధాభక్తులు వాచామగోచరములు. ఇచ్చటకూడ మహిళామండలి స్థాపించి శుక్రవారపూజ జరిపింపబడెను.

### వేకనూరు

25-11-57 యీనాడు సాయంకాలము వేకనూరు గ్రామం స్వామివారు వేంచేసిరి. అచ్చట అగ్రాకరపు[ం] గారు. మరికొందరు భక్తులు పరమవిలక్షణమైన భక్తిశ్రద్ధలు చూపించిరి. ఇచ్చటనుండి రాత్రికి మోపిదేవి చేరిరి.

### మోపిదేవి

26-11-57 వ తేది ఇచ్చట వేంచేసియుండి శ్రీ స్వామివారు రాత్రిబహిరంగ సభలో భక్తినిగురించి ఉపన్యసించిరి. ఇచ్చటనుండి రాత్రికిచల్లపల్లికి విచ్చేసిరి.

### చల్లపల్లి

27-11-57 వ తేదికి చల్లపల్లిలో ఇచ్చటస్థానికవైశ్యప్రముఖులు పెక్కురు, గొప్పస్వాగతమీయగా రెండు రోజులు వేంచేసియుండిరి. రెండురాత్రులు పెద్దసభలు జరిగెను శ్రీ స్వామివారు. శ్రీకవిగారు. ఉపన్యసించిరి ఇచ్చటగూడ మహిళామండలినిస్థాపించి శ్రీ జియ్యర్ స్వామివారు శుక్రవారపూజ జరిపించిరి. యథావిధిగా ఇచ్చటకూడ సహస్రనామ పారాయణలో తిరువిధి గోష్ఠిలోభిక్షా కార్యము జరిగెను. ఇచ్చటవైశ్యులు చూపిన భక్తిశ్రద్ధలు మరువరానివి.

### లంకపల్లి

28-11-57 వ తేది సాయంకాలము చల్లపల్లినుండి శ్రీస్వామివారు శ్రీకవిగారు, తమపరివారముతో లంకపల్లి గ్రామమునకు విచ్చేసిరి. రాత్రి రామమందిరములో సభజరిపి శ్రీస్వామివారు భగవద్భక్తిని గురించియు ఉపన్యసించిరి. 29-11-57 వ తేది ఇచ్చట మహిళామండలిని స్థాపించి శుక్రవారపూజ జరిపించిరి. సాయంత్రం ఇక్కడనుండి బయలుదేరి చింతగుంటపాలెం మకామునకు దయచేసిరి.

### చింతగుంటపాలెం

29-11-57 యీనాటిసాయంత్రం ఇక్కడికి విచ్చేసి

శ్రీస్వామివారు అంజనేయ స్వామివారిసన్నిధిలో మకాంచేసిరి. 30-11-57 వ తేది ఇచ్చటనే యుండి ఈపేటలో బదరీ శ్రీనివాసరామానుజస్వామివారి అర్చనాభిషేకజరిగినది ఇచ్చటకి బందరు శ్రీవిశిష్టాద్వైత ప్రవర్తక సంఘమువారున్ను. శ్రీయతిరాజసేవా మహిళామండలి వారున్ను వచ్చి కావలసిన ఏర్పాట్లు అన్నిచేసిరి.

బందరు గొడుగుపేట

కన్యకాపరమేశ్వరీసత్రం

1-12-57 వ తేదినాడు ఉదయం 8 గంటలకు. శ్రీస్వామివారిని బందరు పౌరులు, పెక్కురు ఛత్రచామరాదిలాంఛనములో తిరువీధిమహోత్సవముతో గొడుగుపేట కన్యకాపరమేశ్వరీ సత్రములో వేంచేపు చేసుకొని వెళ్ళిరి.

సాంఘికవార్తలు

శ్రీ జియ్యర్‌స్వామివారు తమ కార్యదర్శుల యిరువురితో 4-11-57వ తేది ఆశ్రమమునుండి పాదయాత్రగా బయలుదేరి, పరిసరగ్రామములలో భక్తిప్రచారము గావించుకొనుచు 1.12-57వ తేదికి బందరు విచ్చేసిరి. శ్రీ తె. కం. గోపాలాచార్యస్వామివారు రాజమండ్రి పౌరుల నిర్బంధముచే అచ్చట గీతాజయంతి ధనుర్మాసం జరుపుటకు వేంచేసిరి.

గుమ్మడవెల్లి

ఇచ్చట కార్తీకశుద్ధ ఏకాదశి మొదలు 9 రోజులు గీతాజయంతి జరిగెను. సంకీర్తనలు, ఉత్సవములు, ఉపన్యాసములు. జరిగెను శ్రీమాన్ మరింగంటి సీతారామాచార్యులుగారు గీతాజయంతిని గురించి కొన్ని శ్లోకములు సాయించిరి.

శ్రీకూర్మం

ఇచ్చట శ్రీ భాష్యం కూర్మాచార్యులుగారు తమ శిష్యులను స్నేహితుల ప్రోత్సహించి కొన్నూరు పరిసర గ్రామములలో కొంతకలపను సంపాదించి శ్రీ కూర్మనాథునకు రథ నిర్మాణ కైంకర్యమునుచేయ బూను కొన్నారు.

మాధవరం

ఇచ్చట శ్రీమాన్ కందాళై వెంకటకృష్ణమాచార్యులుగారు, కార్తీకశుద్ధ ఏకాదశినాడు ఆలయములో విశేషోత్సవము జరిపిరి. శ్రీమాన్. తి. పు. వెంకటాచార్యులుగారు గీతోపన్యాసము గావించిరి.

బరంపురం

ఇచ్చట శుక్రవారం గోష్ఠి చాలా వైభవముగా జరుగుచున్నది. శ్రీ తి. పి. తిరువెంగడమ్మగారు ప్రతి శుక్రవారం ఆళ్వారాచార్య చరిత్రలు సాయించుచున్నారు.

శ్రీరామతీర్థం

ఇచ్చట కార్తీకబహుళ 8 అమావాస్య గురువారం విశాఖానక్షత్రమునాడు, శ్రీమాన్ ఉ. వే. ఉభయ వేదాంతమహోదధి, పండిత తి. స. 'రామానుజస్వామివారి' సప్తషష్టిపూర్తి తిరునక్షత్రము పరమవిలక్షణముగా జరిగినది.

శ్రీవారితనియన్

॥ కలౌ పంచసహస్రాంత వికృతౌ కార్తికేఽసితే.
చతుర్దశీవిశాఖర్క్షే జాతం, రామానుజం భజే.

కట్నాలు

| | |
|---|---|
| శ్రీ తంగుడు సుమిత్రమ్మగారు, తమ కుమారుని బారసాలనాడు పంపిన కట్నం— | రు. 2-0-0 |
| శ్రీ తి. పె. తిరువెంగడమ్మగారు, పంపిన ఆచార్యహృదయశాత్తుముఱ కట్నం— | 1-0-0 |
| శ్రీ వక్కలంక సుగుణమ్మగారు పంపిన కట్నం— | 1-0-0 |
| శ్రీ దరూరి వెంకటకృష్ణమాచార్యులుగారు పంపిన కట్నం— | 2-0-0 |
| శ్రీ ఉప్పుసూళ్ల చిలకమ్మదొరసానిగారు పంపిన కట్నం— | 2-0-0 |
| శ్రీ దూబా రామయ్యగారు పంపిన కట్నం— | 2-0-0 |

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharahit Press Tenali For Sriman Press, Nadigaddpalem.

# భక్తినివేదన

[వేదాంత మాస పత్రిక]



సంపుటి ౧౦ ] హేవిళంబి - ఫాల్గుణము [ సంచిక ౧౨

సంపాదకులు
పండిత
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు
పవిత్ర
గుదిమెళ్ల రామానుజాచార్యులు

# ఉచిత ఉపనయన-మహోత్సవము

(శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘముద్వారా)

కృష్ణాజిల్లా గుడివాడ గ్రామములో శ్రీ జనార్దనస్వామివారి ఆలయమున **9-3-58** వ తేదీ మొదలు వరుసగా నాలుగురోజులు సనాతన వైదిక సంప్రదాయానుసారముగా శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి అధ్వర్యమున వటువులకు ఉచితముగా ఉపనయనములు జరుపబడును.

రాదలచినవారు ముందుగా దరఖాస్తు ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

శ్రీ.వి.ప్ర. సం. సహాయకార్యదర్శి శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు
C/o శ్రీమాన్ చలమచర్ల వెంకటాచార్యులు శ్రీ జనార్దనస్వామివారి ఆలయము
గుడివాడ, కృష్ణాజిల్లా.

ఉపనయనమున కంగీకరించినవారు 8—3—58 వ తేదీనాటికే గుడివాడ
శ్రీ జనార్దనస్వామివారి ఆలయమునకు చేరుకోవలెను.

---

కృష్ణాజిల్లా చిన శ్రీరంగపురం అగ్రహారం వాస్తవ్యులగు శ్రీమదుభయవేదాంత గుదిమెళ్ల శ్రీనివాస రంగాచార్యులుగారు తమ తల్లిదండ్రులు కీ. శే. లగు శ్రీ ఉ. వే. వీర రాఘవాచార్యులుగారు వీరి సతీమణి శ్రీ వీరరాఘవమ్మగార్ల జ్ఞాపకార్థం పారాయణమునకు మన సంఘముద్వారా కట్టించనున్న "సత్సంగ సదనము"నకు విరాళముగా రు 1600/- లు సమర్పించిరి.

శ్రియఃపతి వీరికి సమస్త శుభములు ప్రసాదించుగాక.

---

* పుస్తక ప్రకటన *

గీత, శ్రీగీతామాహాత్మ్యములతో, గీతాసంగ్రహ నిక్షేప వివరణములతో, ప్రతి శ్లోకమునకు అవతారికలతో, అచ్చుపడి సిద్ధముగా నున్నది. వెల 3-0-0

మరియు శ్రీవిష్ణు సహస్రనామము, నిరుక్త్యనువాదముతో తేటగు సులభశైలిగా వ్రాయబడి అచ్చునకు సిద్ధముగానున్నది. దీని ముద్రణకు వెయ్యిరూపాయలగును.

ఉదారులగు భక్తులందులకు తోడ్పడుదురుగాక.

---

సూచన:- శ్రీవచనభూషణము, కట్నాలు, ఇతర విరాళాలుకూడ రామానుజ పత్రికలో వేయించబడును.





# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ఫాల్గుణమాస పండిత పరిషత్సమావేశము సత్సంగ సప్తాహ మహోత్సవాహ్వానము

గుడివాడ కృష్ణాజిల్లా

స్వస్తిశ్రీ హేవిళంబి నామసంవత్సర ఫాల్గుణ బహుళ పాడ్యమి (ది 6-3-58) గురువారము మొదలు వరుసగా వారమురోజులు అనగా (ది 12-3 58) బుధవారము వరకు గుడివాడ పట్టణములో నున్న శ్రీ జనార్దనస్వామివారి దేవాలయమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘాధ్యక్షులైన శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతక్రింద ఫాల్గుణమాస పండిత పరిషత్సమావేశమున్ను సత్సంగ సప్తాహ మహోత్సవమున్ను జరుపబడును.

మరియు ఈ కార్యక్రమములో ఈ ఫాల్గుణబహుళ చతు 9-3-58 తేది ఆదివారము ఉదయమున ఆ దేవాలయమునందే కొందరు వటువులకు ఉచితముగా ఉపనయన సంస్కార మహోత్సవమున్ను యథావిధిగా నాలుగు రోజులు జరుపబడును. నాలుగవ రోజున పంచసంస్కారములున్ను జరుపబడును.

కావున తాము తప్పక తమ బంధుమిత్రులతో విచ్చేసి ఈ కార్యక్రమములలో పాల్గొని యానందింప గోరుచున్నారము.

పండిత తె. కం. గోపాలాచార్యులు.
కవిరత్న గు. రామానుజాచార్యులు.

ఇట్లు,
ఆహ్వాన సంఘము

# సత్సంగ సప్తాహ కార్యక్రమము

ది 6-3-58 తేది లగాయతు ది 12-3-58 తేది వరకు
ప్రతినిత్యము ఈ క్రింది విధముగ జరుగును.

ఉదయం:— గం. 4-30 నుండి గం. 5-0వరకు అందరును కలసి ప్రాతస్సంధ్యాను సంధేయము ననుసంధించుట.

గం. 6-0 నుండి గం. 7-30వరకు సుప్రభాతారాధనము శ్రీకృష్ణ, గోదా అష్టోత్తర శతనామములతో [illegible] దివ్యప్రబంధాను సంధానము. మంగళాశాసనము. తీర్థప్రసాద వినియోగము.

గం. 7-30 నుండి గం. 8-30 వరకు శ్రీవిష్ణు సహస్రనామాను సంధానముతో తిరువీధి మహోత్సవము బదరి భిక్షాకార్యక్రమము.

గం. 8-30 నుండి గం. 10 30వరకు నిత్యానుష్ఠానవిధాన నియమములు తదుద్దేశముల గూర్చి శ్రీ [illegible] స్వామివారి యొక్కయు [illegible] పండితుల యొక్కయు ఉపదేశములు.

మధ్యాహ్నం:-గం. 1-0 నుండి గం. 3-0వరకు స్త్రీలకు ప్రత్యేకము. శ్రీ [illegible] సేనా మహిళా మండలి కార్యక్రమము ఉపన్యాసములు. లక్ష్మీ పూజలు సంకీర్తనము [illegible]లు.

3 0 నుండి 6-0 వరకు పండితుల ఉపన్యాసములు.

సాయం:— 7-0 నుండి గం. 8-30 వరకు స్తోత్రపాఠాను సంధానము.
దివ్యప్రబంధాను సంధానము.
మంగళాశాసనము.
తీర్థప్రసాద వినియోగము.

## —* ఉపనయన ముహూర్తము *—

స్వస్తిశ్రీ హేవిళంబి నామసంవత్సర ఫాల్గుణ బ ౮ ఆదివారము (9-3-1958 తేది) ఉదయము ఘ ౧-౮౦ వి.ఘ. (గం 6-56 ని॥కు వటువులకు ఉపనయనముహూర్తము)

# ఆహ్వానపత్రిక

## గుడివాడ - కృష్ణాజిల్లా

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క సాధారణమైన శాశ్వతమైన అందరు సభ్యులకును, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క అన్నివిధము లైన శాఖాసంఘములకును, శ్రీ యతిరాజసేవామహిళామండలియొక్క అన్నిశాఖ లకును. అందరు సభ్యురాండ్రకును సంచాలికసమితియొక్కయు పండిత పరిషత్తు యొక్కయు సభ్యులందరకును కార్యనిర్వాహక వర్గము వారికిని ఆహ్వానము.

అయ్యా!!!

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క హేవిళంబినామ సంవత్సరము యొక్క సర్వసభ్య వార్షికవిరాట్ సమావేశము, కృష్ణాజిల్లా గుడివాడ పట్టణమున శ్రీ జనార్ధనస్వామివారి ఆలయమున ది 10-3-1958 తేది మొదలు వరుసగ మూడు దినములును, శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతను జరుగగలదు.

## ఇందు చర్చించవలసిన విషయములు

(1) గత సంవత్సరము యొక్క నివేదికను పరామర్శించుట.

(2) నూతన సంవత్సరమునకై కేంద్రకార్య నిర్వాహకవర్గము నేర్పరచు కొనుట.

(3) నియమావళి సవరణము.

(4) తదితరములు

గాన తాము మెల్లరు తప్పక విచ్చేసి ఈ కార్యక్రమమున పాల్గొన గోరు చున్నాము.

**తే. కం. గోపాలాచార్యులు**

కార్యదర్శి.

**గు. రామానుజాచార్యులు**

సహాయ కార్యదర్శి.

శ్రీ యతిరాజ సేవా మహిళా మండలి వార్షిక విరాట్ సమావేశము (హేవిళంబి)

# ఆహ్వాన పత్రిక

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘముయొక్క శ్రీ శాఖయగు శ్రీయతిరాజ సేవా మహిళా మండలియొక్క సర్వసభ్యాంధ్ర వార్షిక విరాట్ సమావేశము, కృష్ణాజిల్లా, గుడివాడ పట్టణమున శ్రీ జనార్దనస్వామివారి ఆలయమున ది 10-3-58 తేది మొదలు వరుసగ మూడు దినములును, శ్రీమతి శ్రీమత్తిరుమల భాగ్యలక్ష్మమ్మ గారి అధ్యక్షతను జరుగగలదు. గాన తామెల్లరు తప్పక విచ్చేసి ఈ కార్యక్రమములో పాల్గొన గోరుచున్నాము.

శారలూరి చూడుకొడుతమ్మ, అమరవాది లక్ష్మీనరసమ్మ,

గుడివాడ | మరింగంటి రంగనాయకమ్మ, సూరానేని శ్రీవరమంగయమ్మ,

కృష్ణాజిల్లా | (జమీందారిణి) యలమంచిలి భగవన్నామము ఇట్లు,

ఆహ్వాన సంఘాధ్యక్షురాలు బోయిన రామానుజమ్మ

## ముఖ్యసూచన

గుడివాడలో ది 6-3-1958 తేదినుండి వరుసగ నారము దినములు సత్సంగ సప్తాహ మహోత్సవమను పేరుతో పండితసభలున్ను, నిత్యానుష్ఠాన విధానోపన్యాసములున్ను, జరుపుటకు నిర్ణయింపబడినది. నిత్యానుష్ఠాన విధానములను గురించి తెలుసుకొన దలచిన వారలకు ఇది మంచి అవకాశము గాన మీరు మీ ప్రాంతీయులందరుతోను ఈ విషయమును తెలిపి మీరందరును తప్పక సకాలములో వచ్చి ఈ కార్యక్రమములో పాల్గొన వలశినది.

ఈ ప్రాంతీయలందరికిని రాకపోకలకు గుడివాడ సౌకర్యముగ నుండునను ఉద్దేశముచే మాత్రమే ఇప్పుడిచ్చట ఈ కార్యక్రమ మేర్పాటు చేయడమైనదే కాని ఆర్థికాదివిషయములలో యిప్పటివరకు యిచ్చట ఎట్టి ఏర్పాటులు లేవు. అందుచే మీరందరు మీ భోజనాది ఏర్పాటులను గురించి మీరే స్వయముగ తగు సర్దుబాటులతో రావలశినది. మరియు వచ్చిన పండితుల యొక్కయు, గ్రామాంతరముల నుండి వచ్చు శ్రోతలయొక్కయు ఉపనయనములకై వచ్చు వారలయొక్కయు ఆతిథ్యమునకు వలయు ఏర్పాటులను మనమే చేసుకొనవలశి యున్నది. గాన అందులకుగాను మీమీ యవకాశముల ననుసరించి బియ్యము-పప్పు-చింతపండు, బెల్లము. నేయి, గుమ్మడికాయలు వగైరా కూరగాయలు మున్నగు వానిని మీరు తెచ్చి ఈ కైంకర్యమునందు వినియోగించకలిగినచో చాల సంతోషము.

శ్రీమన్నారాయణ రామానుజ జీయర్.

# సాధు పరిత్రాణము

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం।
వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ,
సమ్భవామి యుగేయుగే।

గీ. 4అ 8శ్లో.

తా॥ సజ్జనులనురక్షించుటకు దుర్జనులనుశిక్షించుటకు ధర్మమును స్థాపించుటకు నేను ప్రతి యుగమునందును అవతరించు చుందును.

ఈ శ్లోకము నాల్గవఅధ్యాయ ప్రారంభమున అర్జును డడుగదలంచిన ఆరు ప్రశ్నలలో 'నీవే ప్రయోజనమున కవతరింతు'వని యడిగిన ఆరవ ప్రశ్నకు సమాధానము... దీనికనేక లోకరీతిగా వ్యాఖ్యానమును గావించిరి. అందలి యర్థవిశేషము సామాన్య సాహిత్య పరులంద రన్వయించు రీతియే గాని విశేషమేమియులేదు.

కాని శ్రీ భాష్యకారు లీ శ్లోకమునకు సరస వైశాస్త్రసమ్మత మగు నొక విలక్షణార్థమును సాయించిరి.

అందు మొదటిచరణముయొక్క అర్థ విశేషమును విపులముగ విమర్శించుటయే యీ వ్యాస ముఖ్యాభిప్రాయము.

మొదటి చరణమునకు శ్రీ భాష్యకార శ్రీ సూక్తిని వినిపించి పిమ్మట దానిని వివరింతును.

ఇచ్చట సాధువు లనగా నెట్టివారో వారి పరిత్రాణ మెట్టిదో నిర్ణయించవలసియున్నది. అందులకై శ్రీభాష్యకారులు...

'సాధవ ఉక్తలక్షణధర్మశీలా మత్సమాశ్రయణే ప్రవృత్తా మన్నామకర్మస్వరూపాణాం వాఙ్మన సాగో

చరతయా మద్దర్శనాద్వినా స్వాత్మధారణపోషణాదిక మలభమానాః క్షణమాత్రకాలం కల్పసహస్రం మన్వానాః వైష్ణవాగ్రేసరాః॥ తేతావత్ ప్రశిథిల సర్వగాత్రా భవేయురితిమత్స్వరూప చేష్టితావలోక నాలాపాది దానేన తేషాం పరిత్రాణాయ."

అసమర్థులను కూడ సాధువులనుట కలదుకాని ముందు వీరికి ప్రతికోటిగా దుష్కృతులు అనగా పాపాత్ములు చెప్పబడుచున్నారు. గాన నిచ్చట సాధువులనగా పుణ్యాత్ము లనియే యర్థము చెప్పవలెను. వారెట్టివారనగా— 'యదాయదాహి ధర్మస్య' అనెడు వెనుకటి శ్లోకమున 'ధర్మ' శబ్దమున కర్థముగా చెప్పబడిన "నాలుగువర్ణములకు" నాలుగు ఆశ్రమము లకు సంబంధించినదిగా వేదమున జెప్పబడిన కర్తవ్యవిశేషమును నిరంతరము కడుంగడు శ్రద్ధతో నాచరించుట కలవాటుపడిన వైష్ణవాగ్రేసరులు. అనగా- భగవద్భక్తవర్యులు, వారి సంరక్షణకొఱ కవతరింతును అనిభావము. ఇచ్చట వైష్ణవాగ్రేసరుల సంరక్షణకొఱకే యవతరింతు ననుటచే నట్టి వైదిక ధర్మములతో ఇన్ద్రాది ఇతర దేవతల నర్చించు నవైష్ణవుల

కొఱకుగాని ఆయా దేవతల కంతర్యామిగానున్న భగవంతుని ఆ దేవతా విశిష్టునిగా నారాధించు వైష్ణవుల కొఱకుగాని తానవతరించిదే తీరవలె ననెడు నిర్బంధములేదు. ఏలయన—

అట్టివా రపేక్షించు కోరికలను 'రాత్రిసత్ర భోజనన్యాయముగా" "లభతేచ తతఃకామా న్మయైవ విహితాన్ హితాన్" అనినట్లు ఆయా దేవతా విశిష్టరూపముతోనే లభింపజేసినను వారి కీఫలమునందే దృష్టిగాన సంతృప్తి చెంది యూరకుందురు. కాని వైష్ణవాగ్రేసరు (విష్ణుభక్తవర్యు) లట్లుకాదు. ఇట్టివారని గుర్తించుటెట్లు?

శ్లో. నచలతి నిజవర్ణధర్మతో యః।
సమమతిరాత్మ సుహృద్విపక్షపక్షే।
న, హరతినచహన్తి కిఞ్చిదుచ్చైః।
సితమనసం తమవేహి విష్ణుభక్తమ్॥
(వి.పు.3.20)

'ఉచ్చైః సితమనసం విష్ణుభక్తం అవేహి'

అనగా—రాగద్వేషములకు కారణమైన రజస్తమోగుణములను మిక్కిలి దూరపరచు సత్త్వగుణముతో నిండియున్న స్వచ్ఛమనస్సుకలవాడే విష్ణుభక్తుడని యెఱుంగవలెను. ఇది బయటకు గోచరించులక్షణముకాదే! దాని నెఱుంగు టెట్లు? నేలసార మచ్చటి చెట్లుచెప్పునట్లు వారి మనస్సారమును వారి బాహ్యలక్షణములే జెప్పును. అవియేవి?

న చలతి.....నచహన్తి కిఞ్చిత్"

(1)తన వర్ణాశ్రమధర్మములనుండి గీటువాసియైనను తప్పకుండుట.

(2) శుద్ధ సత్త్వమయమైన మనస్సుకలవాడు. కావునరాగద్వేషములనుపుట్టించుచుగాజోగుణ తమోగుణములకుగంటును.అందుచే తనమిత్రుడని ప్రేమించుట, శత్రువని ద్వేషించుటయు లేకుండుట.

(3) 'నహరతి'

'తేన త్యక్తేన భుఞ్జీథాః మాగృధః కస్యస్విద్ధనమ్॥
(ఈశ. 1 మం)

అనినట్లు యదృచ్ఛాలాభసంతుష్టుడై ఇతరుల సొత్తున కాశపడి దాని నపహరించకుండుట.

లేక— "తైర్దత్తా నప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవసః' అని చెప్పబడినట్లు భగవంతుడు ప్రసాదించిన పదార్థములను ఆతనికినివేదించక తానే తిని కూర్చుండ కుండుట.

(4) న చ హన్తి- సర్వభూత హితేరతుడుగాన నేప్రాణికిని మనోవాక్కాయములతో హానిని కలిగించకుండుట.

లేక-

"అసూర్యానామ తే లోకాః, అన్ధేనతమసావృతాః।
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి, యేకేచాత్మహనో జనాః॥ (ఈశ-మం)

అనగా- "ఆత్మఘాతులగుజనులుయెన్నడును సూర్యరశ్మియే యెఱుంగని అన్ధతామిశ్రనరకములపాలగుదుర"న్నట్లుఆత్మఘాతులు కాకుండుట

ఆత్మ ఘాతమనగా- ఆత్మయే లేదనిగాని,ఉన్నను నది స్వతంత్రమైనదనిగాని, పరతంత్రమైనను దేవతాంతరపరమైనదనిగాని భావించుట.ఇవి భగవద్భక్తవర్యుల(వైష్ణవాగ్రేసరుల) లక్షణములు.

భగవంతుని ప్రసన్ను నిగా జేసుకొనుటకింతకు మించిన మార్గాంతరము లేనేలేదు.

"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్।
విష్ణురారాధ్యతేపన్థా, నాన్యస్తత్తోషకారకః॥
(వి.పు.3.8.9)

శ్రుతి, స్మృతులు, భగవదాజ్ఞ, అందు చెప్ప బడిన వర్ణాశ్రమధర్మములు 'స్వకర్మణాత మభ్యర్చ్య" అనినట్లు భగవదారాధనలే. కావున వాటిని నియమముగా నాచరించుటయే భగవత్ప్ర సాదమునకు ముఖ్యతమమైన మార్గము. కాని వాటిని విడిచిపెట్టి కేవలవైష్ణవబాహ్య లక్షణము లైన పుణ్డ్రశంఖచక్రాది లాంఛనాది ధారణముచే గాని, శ్రవణ కీర్తనాదులు జరుపుచుండుటచే గాని యాతడు సుతరాం ప్రసన్నుడుకాడు. సరి గదా—

శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా।
యస్తాముల్లఙ్ఘ్య వర్తతే।
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ।
మద్భక్తోఽపినవైష్ణవః॥

అనినటుల వాడు రాజశాస నోల్లంఘమును గావించిన వానివలె రాజద్రోహిగా పరిగణింప బడి తీవ్రముగా శిక్షింపబడునేగాని బాహ్యలక్షణ ములచే లోకమును వంచించినను భగవంతుడు వానిని తన భక్తుడని భావించడు.

ఇట్టివారలను రక్షించుటయే తన యవతార మునకు ముఖ్య ప్రయోజనము. దుష్టశిక్షణ, ధర్మస్థాపనాదు లానుషంగికములు. దంపినచో చెమట తనంతనే పుట్టునట్లు వీరిని రక్షించునుద్య మముతో నారెండుపనులు తమంతనేజరిగిపోవును

వీరిని రక్షించుట యనగా— రక్షణయనగా అనిష్టములను పారద్రోలి ఇష్టములు నొసం గుటకదా! ఆ యిష్టానిష్టము లధికారు లను బట్టి వేరువేరుగానున్నను సర్వజ్ఞున కవి యగోచరముకావు. కావున వీరి కిష్టమేమి? అనిష్ట మేమి యనగా- వీరు భగవంతునితో నిత్య సంబం ధము నపేక్షించు చుందురు. కాని పరినిష్పన్న యోగులకుగాని భగవద్దర్శన ప్రాప్తులు లభించవు.

'భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోర్జున।
జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచపరన్తప॥

అని సెలవిచ్చెను గదా!

వీరికింకను నట్టి పరిపక్వావస్థరాలేదు. కావున వాఙ్మనసా తీతమగు భగవంతుని నామకర్మ స్వరూపములే తమకు ధారక (నీరు) పోషక (అన్నము) భోగ్య (స్రక్చందనాదులు) ములు గాన నవి లభించునంతవరకు స్తిమితముగా నుండ జాలక

"అటతియద్భవానహ్ని కాననం।
తృటియుగాయతేత్వామపశ్యతామ్।
కుటిలకున్తలంశ్రీముఖంచతే।
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్॥

పద్యం- నీవడవిన్ పగల్దిరుగ నీకుటిలాలకలాలితా
స్యమి!
చ్చావిధిచూడకున్న నిముసంబులుమాకు
యుగంబులై చనున్।
గావున రాత్రులైననినుగన్నుల నెప్పుడు
గానకుండల।

క్షీనవరరెప్పలడ్డముగజేసె విధాతయదేల
కృపాపరుడై॥

శ్లో॥ యుగాయితం నిమేషేణ।
చక్షుషాప్రావృషాయితమ్।
శూన్యాయితం జగత్సర్వం।
గోవిందవిరహేణమే॥

నాకుగోవిందుడు కాన్పించుకుండుటచే నిమిష మొక యుగమగుచున్నది. కన్నులు వర్షర్తువగు చున్నవి. ప్రపంచమంతయు శూన్యమైనదని ప్రతి గోపికయు పరితపించుచుండును. అదర్శనమే దుఃఖ మగుటచే ననిష్టముగాను, దర్శనమే సుఖమగు టచే నిష్టముగాను భావించి యఘలమటించు చుందురు.

మీరు నేను గాన్పించువరకు ఒక క్షణకాలమై నను కన్నులుమూసికొని గడపగలిగినచో నేను కూడ నట్టివారి యవస్థను సహించియుండగల వాడనే. కాని యట్లు లేదే. ఆ దుఃఖమైనను సాధారణమా!

పద్యం— నీపాదకమలంబు నెమ్మిడగ్గరకాని
తరలిపోవంగ బాదములురావు
నీకరాబ్జంబులు నెటినంటితినిగాని
తక్కినపనికి హస్తములుసారవు
నీ వాగమృతధార నిండగోలగగాని
సెవులస్య భాషలుసేరివినవు
నీ సుందరాకృతి నియతిజూడగగాని
చూడవన్యంబులుజూడ్కికవలు
ఆ. వె. నిన్నకాని పలుకనేరవు మాజిహ్వా।
లొల్లననుచు బలుకనోడవీవు।
మామనంబులెల్ల మరపిదొంగిలితివి
యేమిచేయువారమింక కృష్ణ॥

అని నటుల శిథిలసర్వగాత్రులై ఏపనియు నేయ నేరక పడియుందురు.

కావున నిట్లు నా యడబాటునకు తాళజాలక తల్లడించు వీరలను జీవింపజేయుటకు వారల కను భవయోగ్యములైననా స్వరూపమును (దివ్యమం గళ శరీరమును) జూపుట, నాయాటలజూపుట, నాచూపులనెరపుట, నామాటల వినిపించుట, మొదలైనవి గావించవలెను. ఇదియేవారి కభీష్టము దీనిచే వారియనిష్టము తొలగును. ఈపనులు నేనవతరించనవసరము లేకుండ మోక్షసుఖాదు లొసంగి నటుల నా సంకల్పమాత్రముచే ప్రసా దించదగినవా! కావున నిదియే నాయవతారము నకు ముఖ్య ప్రయోజనము. అని భగవానుడాన తిచ్చెను.

సరి గోప గోపీజనులకు శ్రీకృష్ణుడెట్టియను భవముల ననుభవింప జేసెనదియు మన మొకింత యను సంధించి యానందింతము.

శ్లో. ఉపాసతా మాత్మవిదః పురాణాః।
పరం పుమాసం నిహితంగుహాయామ్।
వయం యశోదాశిశు బాలలీలా
కథాసుధాసిన్ధుషు లీలయామః॥ (కృష్ణ-క)

పద్యం— దహరాకాశనివాసమాపరమునాత్మజ్ఞాను
లీక్షించి ప్ర।
త్యహముంగాంతురుగాక, నేనలయశోదా
బాలలీలాసుధా।

లహారీవీచి పరంపరంగదిసి కొల్లల్ గాగక్రీడించుస|న్న హాన్యప్రౌఢిజెలంగుడెందమున నానందంబుసంధిం చెదన్|

ఈ వ్యాసమున శ్రీకృష్ణుడు

1 తల్లిదండ్రుల నానందింపజేయుట

2 గోవుల నానందింపజేయుట

3 గోపకుల నానందిపజేయుట

4 గోపికల నానందింపజేయుట

అను విషయములు మాత్రమే పెక్కురీతుల ప్రకటింపబడును. అందును శ్రీకృష్ణునిబాలలీల లో ముఖ్యముగ— తల్లి నానందపరచుటకు గావిం పబడిన నిజరూపదర్శన, మృద్భక్షణ, ఉలూఖల బంధన సందర్భమున్ను, గోపికల నానందపరచు టకు గావింపబడిన నవనీత చౌర్య రాసక్రీడాది కములున్ను, గోపకుల నానందపరచుటకు గావింప బడిన బాలక్రీడ వనభోజనాదికములున్ను ముఖ్య ముగా జూపబడును.

శ్రీ కృష్ణుని లీలారసము ననుభవింప నోచిన తల్లియగు యశోద చంటిబిడ్డను తనకాళ్లపై పరుండబెట్టుకొని స్నానమాడించుచు

పాశురం— కైయుమ్ కాలుం నిమిన్దుక్కడారనీర్॥

పైయవాట్టిపసుం శిరుమంజళాల్|

ఐయనావళిత్తాళుక్కంగాన్దిడ|

శైయఁమేఘుంకణ్ణాళ్ పిళ్లైవాయుళే॥

కాళ్లను చేతులను సాగిడింపజేసి గంగాళము నందలి వేడినీటిని నెమ్మదిగా దోసిలితో తీసి పోయుచు చిన్న పచ్చని పసుపుకొమ్ముతో సుంద రముగా నాలుకనువత్తగా శ్రీకృష్ణుడావలించెను. అప్పు డాపాపని నోట లోకముల నేడింటినిగాంచి దేవాది దేవుడే తనకు బిడ్డడయ్యెనని యానం దించెను.

పాకుట నేర్చిన వయస్సులో—

శ్లో. రత్నస్థలేజానుచరఃకుమారః|

సంక్రాన్తమాత్మీయముఖారవిన్దమ్|

అదాతుకామస్తదలాభఖేదాత్|

విలోక్యమాతుర్వదనంరురోద॥

యశోద శ్రీకృష్ణుని రత్నమయ భవనమున నాటకు విడచి చూచుచుండ, నాతడు గునగున ప్రాకుచు నేలపై రత్నములలో ప్రతిఫలించు చున్న తన ముఖకమలమును జూచి అదియొక యాటవస్తువుగా భ్రమించి దానిని తీసికొనవలె నని యెంత ప్రయత్నించినను రాకుండుటచే నవ్వు చు వెనుక నిలచియున్న తల్లిని జూచి బారున నేడ్వగా నామె యానందముతో బాలునెత్తికొని ముద్దిడి యానందించెను.

కొంచెము మాటలనేర్చి నిద్రించక మారము బెట్టుచున్న శ్రీ కృష్ణుని యశోద ఊయలలో పరుండబెట్టి నిద్రబుచ్చుటకై—

శ్లో. రామోనామబభూవహుం|తదబలాసీతేతిహుం|తౌపితు| ర్వాచా పఞ్చవటీవనేవిహరతస్తామాహర ద్రావణః|

నిద్రార్థంజననీకథామితిహరేశ్శృణ్వతః|సౌమిత్రే! క్వధనుర్ధనుర్ధనురితివ్యగ్రాగిరః పాతువః॥

"అనగనగా రామచంద్రుడను నొకబాలుడు

కలడట, అని కథను జెప్ప మొదలిడగనే శ్రీకృష్ణుడు ఊయని ఊకొట్టు చుండెను. ఆయనకు సీతమ్మయనే యొక భార్యకలదట. ఊ అనెను. ఆ శ్రీ రాముడా భార్యతో తండ్రియగు దశరథుని యాజ్ఞను శిరసావహించి యడవిని తిరుగాడుచుండగా నాసీతమ్మను రావణుడెత్తుకొనిపోయెనట. అని వినగనే శ్రీకృష్ణుడు తుళ్ళిపడి లేచి తొట్రుపాటుతో "ధనస్సెక్కడ,ధనస్సెక్కడ,ధనస్సెక్కడయని యరవజొచ్చెను.

ఆహా! ఏమి యీ యవతారసత్యత!

ఒక శ్రీకృష్ణభక్తుడు శ్రీరామచంద్రునిసేవించి ప్రార్థించుచున్నాడు.

శ్లో. విహాయకోదణ్డశరాముహూర్తం।
గృహాణపాణౌ మణిచారువేణున్।
మయూరబర్హంచ నిజోత్తమాఙ్గే।
సీతాపతే! త్వాంప్రణమామిపశ్చాత్॥

శ్రీరామచంద్రా! నీవు ముందు నీచేతి ధనుర్బాణములను ఒక్కక్షణ మావలబెట్టి ఆచేత సుందరమైన పిల్లనగ్రోవిని గ్రోలుము. ఆతలపై కిరీటమును తీసివైచి నెమలిపింఛమును ధరింపుము పిమ్మట నేను నీకు సమస్కరింతును.

ఇట్లు లోకములు నిదురపోవగ జోకొట్టుచు నిదురవోని సుభగుడు తల్లి జోకొట్టిపాడ నెట్టకేల కెట్లో నిదురించును. ఇక లేపుటయు తల్లి కొక యజ్ఞమే. కాని,కాలువచ్చినదిక యూరకొనునాతల్లి యెంతలేపినను లేవనివాడు—

శ్లో. దధిమథననినాదైస్త్యక్తనిద్రఃప్రభాతే।
నిభృతపదమగారంవల్లవీనాంప్రవిష్టః।
ముఖకమలసమీరైరాశునిర్వాప్యదీపాన్।
కబళితనవనీతః (పాతుగోపాలబాలః॥)

పెరుగు చిలుకున్న చవ్వుడు చెవినిబడెనో ఇక యెక్కడిది. వెంటనే లేచి చడి చప్పుడులేకుండ పిల్లివలె పొరిగిండ్లలో ప్రవేశించి వెంటనే ఊది దీపముల నార్పి 'అయ్యో! పాడు గాలి దీపముల నుండ నీయదని విసిగికొనుచు వారు తిరిగి దీపమును వెలిగించుసరికే "కబళితనవనీతః'

ఇంతటితో విడచునా? పదిగంటలకు కోర్టుతెరచుసరికి కలెక్టరుగారి బల్లపై దరఖాస్తు కట్టలవలె యశోద తన ప్రాతఃకృత్యములః తెముల్చుకొని కొడుకేమయ్యెనో చూడవచ్చుసరికి పరశ్రుతపిటీషనులతో గోపికలు సిద్ధము. "ఏమమ్మా! అను కదుపుసరికి నేరములు పరంపరలుగా కురియును.

ఒక గోపిక చూడవమ్మామీఅబ్బాయిఅల్లరి-

శ్లో. పీఠేపీఠనిషణ్ణబాలకగళేతిష్ఠన్ సగోపాలకో
యన్త్రాన్తస్థ్సితదుగ్ధభాండమపకృష్యాచ్ఛాద్య ఘంటారవం।
వక్త్రోపాన్తకృతాంజలిఃకృతశిరఃకంపం పిబన్ యః పయః
పాయాదాగతగోపికానయన యోర్గణ్డూషఫూత్కారకృత్॥

ఉట్టిమీదకుండలందక పీటమీద పీటవైచి అదియునందక దానిపై నొకబాలునెక్కించి (అయ్యయ్యో! ఏమి ఉపాయములమ్మాయ్) వాడి భుజములపై నెక్కి (ఇంకనేమున్నది) ఉట్టిమీదనున్న ఇంత పాలకుండను వంచెను. నేను ఊరిలో నందరికంటె కొంచెము గడుసుదానను. ఉట్టి కొకగంట

నుకట్టితిని. చప్పుడైన చట్టునవచ్చి పట్టవచ్చునని నాయూహా. నన్నుమించిన గడసరి నీకొడుకు.ఒక చేతిలో దానిని వాగకుండ గట్టిగపట్టినాడు. (ఇదేమి మాయయో ఆరెండుచేతులట్లుండగ) నోటిదగ్గర రెండు చేతులమ్మోయ్. బుజ్జినూపు కొనుచు గుటుకుగుటుకు మనుచుండగా ఆ, ఆ, అనుచు నేనేగితిని. అయ్యో నీ ఉపాయంచల్లగ నుండా. నోటినిండా పాలుపోసికొని తుబుక్కున నాకళ్లల్లో ఉమ్మి తురుగ్రిన పారిపోయెను. అయ్యయో! నీయల్లరి బంగారంగాను. ఇదియేమియల్లరమ్మోయ్.

మరియొక గోపిక. దానికేమి ఇదిచూడుము.

శ్లో. నిమీలితాక్షీ నిజదేవతాయై
నివేద్యభక్ష్యం విసృతేక్షణాసా,
తత్త్రత్రినాన్వైక్షత చిత్రిమేత
దదృశ్యతాస్యేబహిరఙ్గణేఽస్య॥

ఏకాదశిగదాయని మడిగా దీపారాధనచేసికొని వెన్నముద్ద ముందుపెట్టి కన్నుమూసికొని నివేదనచేసి కన్ను తెరచి చూచుసరికి ఏదీ వెన్న. నిజముగా (ఒట్టు) నాభక్తికిమెచ్చి దేవుడే తినెననుకొంటిని. ఊరుకొనవచ్చునా! అంతముద్దయు నోటిలోనుంచుకొని వీధిలో నిలచి ఆ, ఆ, అనుచున్నాడు. అయ్యోనీవు మ్రింగుచున్నావా? దేవుడే తినెననుకొనుచున్నాను నేను. అను సరికంతముద్దయు గుటుక్కునమ్రింగి నన్ను తప్పించుకొని లోపలికివచ్చి

కం॥ వేలుపులకెనాకంకెను
వేలుపు మరియెవ్వడనుచు వికవికనగిమా
వేలుపులగోడపైనో
హేలావతి నీ తనూజుడెంగిలిచేసెన్॥

ఇంక నొక గోపిక ఇంకను ఇదిబాగుగనేయున్నది. మాయింటికి వచ్చి రంగునరంగు కలసినట్లు చీకటిలోకూర్చుండి కుండలోని వెన్నను తినుచుండగ నేను చడికట్టి—

గో— కస్త్వంబాల?= నీపెవరబ్బాయి?

కృ—బలానుజః =నేనా!ఆబలరాముడంటారు...
ఆయనతమ్ముడను

గో—కిమిహాతే?=అటులనా? కృష్ణుడనరాదూ,
పేరుదాచుచున్నావా? సరే, నీకిక్కడనేమి
పని?

కృ—మన్మదిరాశఙ్కయా= అయ్యో ఇది మీ
యిల్లా, మాయిల్లనుకొన్నాను.

గో—యుక్తంతన్నవనీతపాత్రవివరేహస్తంకిమర్థం
న్యసేః=

(ఇట్లు మాట్లాడుచునేయున్నాడు. ఇంతంత ముద్దమ్రింగుచునేయున్నాడు ) ఆవెన్నకుండలో నా చేయి యెందులకు?

కృ—మాతః, కఞ్చనవత్సకంమృగయితుం మా
గావిషాదంక్షణాత్ =అబ్బే ఏమీలేదమ్మా మా తెల్లదూడ తప్పిపోయినది. వెతుకుకొనుచు రాగా ఈకుండలో తెల్లగా కాన్పించుసరికి మా దూడకాదుకదాయని చేయిపెట్టి చూచుచున్నానమ్మా, ఈమాత్రిముననకే నీకింతచింతయేల?

అనిజవాబు. ఊ.

మరియొక గోపిక- ఇదిచూడు. అన్నిటికిని మించిన యాశ్చర్యము.

పద్యం-సీ- కలకంఠి, మావాడ గరితలమెల్లనీ
పట్టి రాగలడని పాలుపెరుగు
లిండ్లలోపలనిడి యేమెల్లతనంత్రోవ
జూచుచో నెప్పుడు జొచ్చినాడో
తలుపులుముద్రలు తాళంబులును పెట్టి
యున్న చందంబునమున్న వరయ
నొకయింటిలోనాడు, నొకయింటిలోపాడు
నొకయింటిలోనవ్వు, నొకటదిట్టు
ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరగజేయు।
నిట్లుచేసి వెనుక నెక్కడబోవునో
కానరాడు రిత్తకడవలుండు।
అందరును యేకకంఠముతో —
క॥ ఓయమ్మనీకుమారుడు
మాయిండ్లనుపాలుపెరుగు మననీడమ్మా।
పోయెదమెక్కడికైనను
మాయన్న లసురభులానమంజులవాణీ॥
ఇది విని యశోద - ఇదియేమి నీలాపనింద
లమ్మా.
కం॥ చన్నువిడచియిట్టటుజన
డెన్నడుపొరుగిండ్లత్రోవ ఱెఁగడు నేడున్।
కన్నులు తెరువనిమాయీ
చిన్నకుమారకుని అన్యసేయందగునే॥
కం॥ అన్యమెఱుగడుతనయంతనాడుచుండు
మంచివాడీతడెగ్గులుమానరమ్మ।
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార॥
కానీ యీసారి పట్టి చూపింతుమని యాగోపి
కలు వెడలి పోయిరి.

ఒకనాడొక గోపిక-
శ్లో. అన్యత్రగృహే కృష్ణమవేక్ష్య చోరం
బద్ధ్వా కవాటం జననీంగతైకా।
ఉలూఖలే దామనిబద్ధమేనం।
తత్రాపి దృష్ట్వాస్తిమితా బభూవ॥

ఇంటిలో ప్రవేశించిన దొంగకృష్ణుని కనిపెట్టి టక్కున తలుపుగట్టిగమూసి పరుగుపరుగునయశో దచెంత కేగి ఆమె తలుపు తెరచి యీమె నోరు తెరచుసరి కచ్చటనే రోలునకుకట్టబడిబిక్కుబిక్కు మనుచున్నాడు. ఇంకేమి కేసు. తెల్లబోయి చల్లగ జారెను.

మరికొందరు గోపికలతిచాతుర్యముతో కృష్ణు నిబట్టి కట్టి యశోదకు జూపుటకీడ్చుకొనివచ్చు చుండిరి.

శ్లో. గోప్యఃకదాచన పృథక్ పృథగాహ్యకృష్ణం।
ఏత్యైకదైవగదితుం ప్రసృతాస్తదాగః।
తస్యాస్తదస్తికతమేవనిజానదృష్ట్వా
సర్వాస్తతోనివవృతాస్స్వగృహాన్ సలజ్జాః॥

ఒక్కొక్క గోపిక యొక్కొక్క కృష్ణునీడ్చు కొని యందరొక్కచోకలసి యిదేమిచిత్రము. ఇదేమిచిత్రమని యాశ్చర్యపడరి. సరి. గట్టిగా పట్టుకొనుడు. ఈచిత్రముగూడ నామెకు చూప వచ్చునని కృష్ణునిగట్టిగ పట్టుకొని అందరొక్క పెట్టున యశోదయింటిపైబడి తలుపుతట్టిరి. ఆమె శ్రీకృష్ణుని చంకబెట్టుకొని వచ్చియే తలుపు తీసి ఇదేమమ్మా అందరొక్కసారిగా నింత ప్రొద్దునే వచ్చిరి? అని ప్రశ్నించుసరికి వారామె చంకనున్న కృష్ణునిజూచి తమచేతిలో నాకృష్ణునిగానక సిగ్గు

పడి తెల్లబోయి ఏమిచెప్పుటకును తోచక పను లైనవా? యని పలకరించిపోయిరి.

శ్రీకృష్ణుడొకనాడు తనతోడి బాలుర నెల్లర చేరబిలిచి—

శ్లో. బాలాః క్రీడాం విశనుతమయా రాహుణా గ్రస్య తేఽయం। పర్వణ్యస్మిన్ మహతిసవనీ తాం మృతాంశుః క్షణేన।
యూయం భిన్నోన్నతఘటగళత్ క్షీరధారాఘు రీషు। స్నాతాః పూతాభవతసహసేత్యేషబా లోనవాదీత్॥

మన మీనా డొక క్రొత్తయాట యాడుద మనెను. ఆయాట యేమని వారందరు తనను చుట్టుముట్టదీనిపేరు గ్రహణం ఆటయందురు. దీని కేమి కావలయునో తెలియునా? ఒకచంద్రుడు ఒకరాహువు. స్నానమాచరించుటకు ప్రశస్తమగు నాకాశగంగ. తెలిసినదా? మన కసలుచంద్రుడు అసలురాహువు అసలాకాశగంగయు యిప్పు డెక్కడవచ్చును? కావున దానికి బదులు వేరొక నకలుసామగ్రిని సంపాదించవలెను చంద్రునకు పోలిన తెల్లని గుండ్రని వెన్నముద్ద ప్రత్యక్షమే కదా! నల్లని రాహువునకు బదులు మీ యందరి కంటె నల్లనివాడను నేనున్నాను కదా! అనుసరికి ఓహో! తెలిసినది. ఇక స్నానము వంతు మా దియా? చాలుచాలునని వారుపోబోగా నిలిపి చివరకు వినుడు. మీకిక స్నానమాడుట కాకాశ గంగనుకూడా నేనచ్చటనే కల్పింతును. గోపికలు తమయిండ్లలో ఎత్తుగగట్టిన ఉట్లలో బెట్టిన పాల కుండలకడుగున కఱ్ఱతో రంధ్రముగొట్టి అందుండి కారుచున్న పాలధారలలో యథేష్టముగా స్నాన మాడి పవిత్రులు కండని ప్రోత్సహించెను. అంత నందరును బాగుబాగనిచేరిరి' అందరును కలిసిపాడి సమృద్ధిగాగలనొక గృహస్థునియింటజేరి యిల్లంత యు చిందరవందరజేయగా నాయజమానురాలు "నీవు నాయకుడవు. నీకు శాస్తి జేసిన అందరకును బుద్ధివచ్చునని అతని వెంటదగుల ఆతడిల్లుచేరియేమి యు నెఱుంగనట్లు నటించగ తల్లి మూనోటి వెన్న కంపు ఆపాల తడిగుడ్డలు మొదలగునవి జూచి నేరము నిజమనినమ్మి—

సీ— బాలుడీతండనిభావింతునందునా
యేపెద్దలునుసేరరీక్రమంబు
వెఱపెఱుంగుటకునై వెఱపింతునందునా
కలిగివేరొక్కడుకానిలేదు
వెఱపుతో నాబుద్ధివినిపింతునందునా
తనదానయైబుద్ధితప్పకుండు
నొండెఱుంగకయింటనుండెడినందునా
జొచ్చిచూడనిదొకచోటులేదు

ఆ. తన్ను నెవ్వరైనతలపోయబాతెడి
యోజలేదు, భీతియొకటియెఱుగ
డెలమినూరకుండ డెక్కపక్కెములాడు
బట్టశాస్తి చేయుభంగియెట్లు?॥

అని వితర్కించి చేతనొక బెత్తమును తీసికొని పట్టుకొన వెంబడింప—

సీ. స్తంభాదికంబులు తనకునడ్డంబైన
యిట్టటుసనిపట్టనీనివాని
నీతప్పుసైరింపుమికదొంగిలిబోవ।
నేననిమునుముట్టనేడ్చువాని

గాటుక నెఱయంగ గన్నులునులుముచు
వెడలుకన్నీటితో పెగచువాని
నేదెసవచ్చునోయిదియని పలుమాఱు
నుసుగుచక్కనిబారచూచువాని
ఆ—గూడబాఱిపట్టుకొని
జిన్ని వెన్న దొంగజిక్కెననుచు
నలిగిగొట్టచేతులాడకపూబోడి
కరుణఁగోడబాలుగట్టదలచె।
కట్టుటమాత్రమా మెయధీనమా?
కం॥ తజ్జననిలోగిటంగల
రజ్జుపరంపరల గ్రిమ్మఱన్ సుతుగట్టన్।
బొజ్జతిరిగిరాదయ్యెజ
గజ్జాలములున్న బొజ్జ గట్టనవశమే॥
శ్లో॥ ప్రేమ్ణాథదామ పరిణామజుషాబబంధ॥

అనినట్లు తాడురూపమును దాల్చిన తల్లి ప్రేమచే గట్టబడెను. ఈకట్టు బాధించిన దెవ్వరిని? శ్రీకృష్ణునా? కాదు.

అతడాఱోలుతోనే ఆనందముగ సంచరించ దొడంగెను. మరియెవ్వరిని?

శ్లో. ఘోషప్రఘోషశమనాయమథోగుణేన।
మధ్యేబబంధజననీ నవనీత చోరమ్।
తద్బంధనం త్రిజగతాముదరాశ్రయాణా।
మాక్రోశకారణమహోనితరాంబభూవ॥

గోపికల యారాటమును మాన్పుటకై తల్లి వెన్న దొంగను త్రాటితో నడుము గట్టిగ గట్టెను. గాని యాకట్టాతని గర్భమునందున్న ముల్లోకముల యాక్రోశమునకు కారణమయ్యెను. కాని చో తాదృశ్య తేచరితమార్యజనాస్సహాస్తే” యనునట్లు దానిని తలంచుకొని ఆళ్వారు మొదలగు మహాత్ములేల దుఃఖభారముచే మూర్ఛిల్లుదురు. ఈ కట్టులో మరియొకచిత్రము.

శ్లో. బద్ధంతథాభావయతాం ముకుందం।
అయత్న విచ్ఛేదిని కర్మబన్ధే।
తపస్వినేతత్క్రతునీతిరాద్యా।
సవ్రీడమారణ్యా కణాసుతస్థౌ॥

తత్క్రతున్యాయము ధ్యానానురూప ఫల మని చెప్పును. కాని శ్రీకృష్ణుని యీబంధమును ధ్యానించినచో మన సంసారబంధముపోవుటచే ఫలము విపరీతమైనది. కావున ఆ న్యాయముసిగ్గు పడి అరణ్యములలోనేయుండిపోయెను. (అరణ్యాం= వేదములలో నొకభాగమందలి యుపనిషత్తు)

ఈయల్లరులు కొంత తగ్గునని మంచిముహూర్తమున నక్షరాభ్యాసమునుగావించి బడికిపంపగా ఆనాడెట్లో బడిలోగడిపి రెండవరోజు కొట్టిగో నాడుకొనుచు కూర్చున్న కృష్ణునిజూచి తల్లి “ఇదేమిరా! ద్వితీయ విఘ్న మా?బడికేలపో లేదు?

శ్లో. తల్లి కృష్ణ! త్వంపఠ= కృష్ణా! వెళ్లిచదువుకో.
కృష్ణ- కింపఠామి= ఏమిచదవవలెనమ్మా?
తల్లి—నను శేశాస్త్రమ్= అదేమిటిరా? శాస్త్రము
కృ- కిముజ్ఞాయతే= ఏమి తెలియునమ్మా?
త- తత్త్వం=వాస్తవజ్ఞానము.
కృ- కస్య= ఎవరితత్త్వమమ్మా?
త- విభోః త్రిభువనాధీశస్య=ముల్లోకాధిపతియైన సర్వవ్యాపకునిది.
కృ- తేనాపికిం= ఊ తెలిసినది. దానివలనలాభ మేమి?

త- జ్ఞానంభక్తి రధోవిరక్తిః= అయ్యో! దానివల్ల
నా!జ్ఞానము, భక్తి, అన్నిట వైరాగ్యము.
కృ- అనయాకిం= ఆవైరాగ్యంవల్ల?
త- ముక్తి రేవ= ఇంకేమున్నది? ముక్తి
కృ- అస్తుతే- (ఛీ, ఛీ, అబ్బే అదినాకువలదు.
అది నీకే లభించాలి.

(ఇది ఆశిస్సు. అట్టికృష్ణుని కన్నతల్లి కేగదా ముక్తి)

మరినీకేమి కావలెను. అని తల్లి యడుగగా)

దధ్యాదీనిభజామి=నాకా? పెరుగు, పాలు, వెన్న మీగడ వీటినాశించిగదా ఆతనుగొల్లవాడలో పుట్టినది)

(మాతురుదితం వాక్యహరేః పాతునః= ఇట్లుతల్లి తో పలికిన శ్రీకృష్ణుని శ్రీసూక్తిమనలను రక్షించుగాక!)

ఒకనాడు పరుగిడివచ్చి-

శ్లో. మాతః=అమ్మా (అనిపిలిచెను)
తల్లి- కింయదునాథ= ఏమినాతండ్రీ!
కృ-దేహిచషకం= గిన్నెనిమ్ము
త- కింతేన= ఇప్పుడెందులకు?
కృ- పాతుంపయః= ఇన్నిపాలుత్రాగి బడికిపోవు
దును ఆకలియగుచున్నది.
త- తన్నాస్త్యద్య= ఇప్పుడెక్కడివిపాలు?
(ఏదీకానివేళ గేదె యీనినదట. బడిబండలుచేయుచున్నావు.)
కృ- కదాస్తివా=(ఏడ్చుచు) మరియెుకప్పుడేమిటి?
త- నిశి=రాత్రి (ఆవు లింటికివచ్చినపిమ్మట)
కృ- నిశాకావా=రాత్రియనగా నేమిటమ్మా
త- అంధకారోదయో= అంతటను చీకటివ్యాపించి
ఏమియు కాన్పించకుండా అగునే అది.
కృ- ఆమీల్యాక్షియుగం= ఒకచేతితో రెండు
కన్నులనుమూసికొని
నిశాప్యుపగతా=అమ్మా! నాకు రాత్రివచ్చినదే
ఏమియు కాన్పించకుండ చీకటి అయి
పోయినది.

దేహీతి= గిన్నెయివ్వవే-గిన్నెయివ్వవేయని మాతుఃముహుః వక్షోజాంశుకకర్షణోద్యతకరః= తల్లి పమిటకొంగును రెండవచేతితో మాటిమాటికిని లాగుతు తే, తే, యని వెంబడించు (కృష్ణసస్పుష్టాతువః=ఆకృష్ణుడు మిమ్ముబ్రోచుగాత)

ఇట్లుతల్లినిగోపికలనుగోపకులను ఆనందాబ్ధినోలలాడించుచు ఒకనాడు ఇకనీను చదువురాదు.దూడలనైనా తోలుకొనిరా అని తల్లియనగా గోపబాలకులతో దూడలను తోలుకొని బృందారణ్యమునకేగి దూడలు మేయుచుండ ఒకచెట్టుపైకెక్కి-కూర్చొని బొడ్డునదోపిన పిల్లనగ్రోవినిదీసి

శ్లో. అధరే వినివేశ్యవంశనాళం
వివరాణ్యస్య సలీలమంగుళీభిః
ముహురంతరయన్ ముహుర్వివృణ్వన్।
మధురంగాయతిమాధవోవనాన్తే॥

పెదవిపై నిడికొని నోటితో గాలిని పూరించి దాని రంధ్రములను తన వ్రేళ్లతో విలాసముగ మాటిమాటికి మూయుచు తెరచుచు, నా వన మధ్య సీమయందు హృదయంగముగ పాడుచుండ గోవులకిక మేతవంట బట్టునా?

ప॥ మమతన్ మోములు మీదికెత్తుకొని రోమంధంబు సాలించివా!

త్కమలాగ్రంబునకృష్ణునిల్పి మురళీగానామృత
శ్రేణిక।
ర్ణములన్ గ్రోలుచు మేతమానిగళితానందా
శ్రులైచిత్రగో
పములైగోవులుచూచుచున్న వవిగో పద్మాక్షి!
వీక్షించితే॥

ఇట్లు వాటి నానందపరచుచు తోడిబాలు రతో పచ్చాకు, కోతికొమ్మచ్చి, చెడుగుడు మొద లగు నాటలనాడుచు వారు ఆనందమున నిమగ్ను లైక్షుత్పిపాసలెఱుంగకయుండ= తానేవ్వయముగ-

ప॥ఎండన్ మ్రగ్గితిరాకటంబడితిరింకేలావిలంబింపగా
రండో బాలకులార! చల్దిగుడువన్ రమ్యస్థలంబిక్కడీ
దండన్ లేగలునీరుద్రావి యిరువందంబచ్చికల్ మే
యుచున్।తండంబైవిహరించుచుండగనమంద్రప్రీతి
భక్షింతమే॥

యని వారిని పిలచెను. వారును ఔనుమర చితిమి చాలా ప్రొద్దెక్కినదని బిలబిల వచ్చి వారివారి చల్దిముంతలనన్నిటిని విప్పి శ్రీకృష్ణుని యెదుటపెట్టి "కృష్ణా. మాకందరికిని నీచేతితో బువ్వపెట్టవా! మాకది యమృతమువలె నుండు నని' బ్రతిమాలగా వల్లెయని ఒకపెద్ద ఆకున ఆ ప్రసాదమంతయు గుమ్మరించి వారినందరను గుండ్రముగా తనకు చుట్టునుగూర్చుండుడనినియో గించి తాను—

సీ.ప. కడుపునదిండుగాకట్టినవలువలో
లాలిత వంశనాళంబుజొనిపి
విమలశృంగంబును వేత్రదండంబును
జారిరానీకడాచంకనిరికి
మీగడపెరుగున మేళవించినచల్దిముద్ద
దాపలిచేత మొనయనునిచి
చెలరేగి కొసరితెచ్చినయూరగాయలు
వ్రేళ్ళసందుల నెల్ల నెలయనిరికి
తే.గీ. సంగడీలనడుమచక్కగకూర్చుండి
నర్మభాషణములనగవునెరపి
యాగభోక్తకృష్ణుడమరులు వెరగంద
శైశవంబు మెరచి చల్దిగుడిచె॥

ఆ కుడుచుటలోను ఆబాలకులు—

సీ- మాటిమాటికి వ్రేలుమడచియూరించుచు
నూరగాయలదినుచుండునొకడు
ఒకనికంచములోనిదొడిపిచయ్యనమ్రింగి
చూడలేదని నోరుచూపునొక్క
డేగురాగ్గురుచల్దులెలమిసన్నిదమాడి
కూర్కొనికూర్కొనిగుడుచునొక్క
డిన్నియుతగబంచియిడుట నెచ్చెలితన
మనుచుబంతెనగూడులాగునొకడు
ఆ. కృష్ణుచూడుమనుచుగికురించి
పరుల మ్రోలనేలిభక్ష్యరాశి మెసగునొకడు
నవ్వునొకడు పరుల నవ్వించునొకడు
ముచ్చటాడునొకడు మురియునొకడు॥

ఇదియేగదా మోక్షానందము. దీనినేకదా గోదాదేవియాశించి "కూడారై వెల్లుంశీర్ " లో ప్రార్థించినది.

'సోఽశ్నుతేసర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విప శ్చితే'తి అను శృతివాక్యము మోక్షానందమును వివరించుచు విపశ్చితాబ్రహ్మణాసహ సః సర్వాన్ కామాన్ అశ్నుతే అనిగదా ఆయనుభవమును

వర్ణించెను. దీనినే వ్యాసమహర్షి సంస్కృత భాగవతమున—

శ్లో. సర్వేమిథోదర్శయన్తః। స్వస్వభోగ్యరుచిం పృథక్।హసన్తోహసయన్తశ్చాభ్యవజహ్రు స్సహేశ్వరమ్॥

అను శ్లోకమున ఉపబృంహణము గావించెను. ఈ శ్లోకముపై శృతివాక్యముతో నెట్లు సరసముగ సమన్వయమగుచున్నదో గాంచుడు.

శృ- విపశ్చితాబ్రహ్మణాసహ (శ్లోక) సహేశ్వరమ్॥

శృ- సర్వాన్ కామాన్ (శ్లోకం) స్వస్వభోగ్యరుచిం।

శృ- సఃఅశ్నుతే (శ్లోకం) అభ్యవజహ్రుః

శృ-ఏతత్సామగాయన్నాస్తే, శ్లో.హసన్తోహస హా ఒ ఉహా ౩ ఉహా౩ ఉ=యన్తశ్చ

ఈహసన్తోహసయన్తశ్చఅనెడువాక్యమునేపోతనామాత్యుడు 'మాటిమాటికి'యనెడు పద్యముతో వివరించెను.

ఒక శరత్పూర్ణిమ నాటిరాత్రి యమునానదీతీరమున వేణువు నూదగా స్త్రీలందరును చేయుచున్న పనులను వీడి, పెద్దలను పిన్నలను లక్ష్యము సేయక ఉన్నవారున్నట్లుతని చెంతకు చేరగా నా కృష్ణుడు వీరినిజూచి వీరిహృదయములను పరీక్షింపనెంచి—

ప॥ ఏలవచ్చిరీతి నిశాసమయమందిచ్చోటవర్తింతురే। చాలుం జాలులతాంగులార చనుడాసంప్రీతి గోమందకున్॥

ప॥ ఇలువడిసున్నజేసి హృదయేశులసిగ్గులువుచ్చియత్తమా। మలనెరియించి సోదరులమానము నూరలువుచ్చితల్లితం। డ్రులరుచిమాన్చి బంధులకు రోతయొనర్చుచు జారవాంఛలన్। వలనతిసత్కులాంగనలువత్తురే లోకులుఃజూచి మెత్తురే॥

అనుసరికి పాపమా గోపికలు నిర్వీర్యనీరై అకటా! కృష్ణా! నిన్ను నమ్మి మాయిండ్లలోసకల వ్యాప్తులడంచినీపదసరోజాతంబులర్చింపనే తెంచిన మమ్ము ముముక్షాసక్తులం గాంచు పోలికగానందగునుగాని భ్రాంతలగు కాంతలనిట్లు విడచుట న్యాయమా? జాగివాంఛలని యాక్షేపించితివే పతిపుత్రాదిక నామము వగుచున్ భాసించు నీయందు పతిపుత్రాధిక వాంఛలన్ జలిపి సంభావించుటన్యాయమా? కాకున్నను మేమేమిచేయుదుము.

సీ. నీపాదకమలంబు- ఏమిచేయువారమింకకృష్ణ (ఈపద్యము మొదటలో వ్రాయబడెను.) అనివిలపింపగా వారియధ్యవసాయమున కాతడచ్చెరువొంది మిక్కిలి యానందించి వారితో రాసక్రీడసలిపి అందు వారి కానందము న్యస్తకముగా!— నొక్కసారి హఠాత్తుగా నంతర్ధానమయ్యెను. అంతనాగోపికల కాయానంద మంతయు దుఃఖముగమారి.

ప॥ నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై। జల్లెడువాడు మేళిపరిసర్పితపింఛము వాడునవ్వురా॥జిల్లెడుమోము వాడొకడుచెల్వల మానధనంబు తెచ్చెనో। మల్లియలార మీపొదలమాటునలేడు గదమ్మ తెల్పరే।

అని గుట్టలు. పుట్టలు, చెట్టులు, చామలు వెదకి వెదకి విసిగి వేసారి యొకచోటజేరి యావిరహతాపమునకు తాళజాలక యాతని కాళీయమర్ద

నాదివ్యాపారముల ననుకరించియనుకరించి శాంతించక ఒక్కపెట్టున వారందరు చేద్వసాగగ నా దయామయుడొక్కసారిగా—

సీ— విశ్వమోహనమైన వేణునినాదంబు
సరసగంభీర గర్జనముగాగ
మహనీయ నిర్మల మందహాసద్యుతి
లలితసౌదామినీలతికగాగ
తలచుట్టుబాగుగ దనపుపింఛపుదండ
శైలభేదనశరాసనముగాగ
కరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు
సలిలధారాప్రవర్షంబుగాగ
తే— జూడనే తెంచు గోపికాజనమునిండ్రి
చాతకంబులదురవస్థచక్కజేసె
కృష్ణమేఘంబుబహుతరకీర్తినొప్పె
విమలబృందావనాకాశవీధియందు॥

ఇట్లు సాక్షాత్కరించిన శ్రీకృష్ణుడు గోపికలకు చీకటి యింట దీపమై వెలుగొంద వారాతనిని చుట్టుముట్టి "కృష్ణా! లోకమున కొందరు తమ నాదరించువారి నాదరింతురు. కొందరాదరించ కున్నను ఆదరింతురు. మరికొందరాదరించినవారిని ఆదరించనివారిని కూడ నాదరించరు. వీరెట్టివారు? (వీరిలో నీ వెట్టివాడవని వారియభిప్రాయము.)

దాని తాత్పర్యమెఱింగి శ్రీకృష్ణుడు నవ్వుచు తన నాదరించినవారి నాదరించువారు కేవలస్వార్థ పరులు, అదిమిక్కిలి నీచకోటి. తననాదరించనివారి నాదరించువారు తల్లిదండ్రులవంటివారు. అది మిక్కిలియుచ్చకోటి. ఇకతన నాదరించువారినే తానాదరించనివాడు ఆదరించనివారి నాయాదరించునా? అట్టివారు ముత్తెరంగులు, వారు ఆత్మారాములు, ఆప్తకాములు, కృతఘ్నులు, మొదటి యిద్దరకును లోకముతో పని లేదు. కావున తుల్య నిందాస్తుతులు. మూడవకోటివారి నీచత్వమునకు హద్దులేదు.

అయిన నింక మీహృద్గతభావమునకుత్తరమొసం గవలసియున్నది. అదినేనేకోటికిచెందుదుమనికదా నేను మూడవకోటికి చెందుదుననిమీయభిప్రాయ ము అదియథార్థముకాదు. నాయభిప్రాయమును సావధానముగా వినుడు.

ప॥నను సేవించుచున్న వారలకు నేనాయూపముంజూప
జూ। చినజాలించి మదించివారుమరినన్ సేవిం
పరోయంచు ని। గ్ధనికుండాత్మధనంబు సెడ్డనె
పుడుం తత్పారవశ్యంబుదా। ల్చినభంగిన్నను
బాసిమత్ప్రియుడు దాజింతించు నాయూపమున్॥

కాని యీరహస్యము నారయజాలక మీరు దుఃఖించి నన్నన్యథా భావించితిరి. ఈ మాత్రి కష్టమునుమీకు కలిగించినందులకు—

ప॥ పాయనిగేహశృంఖలలబాసి, నిరంతర మత్ప
రత్వముం। జేయునున్న మీకు బ్రతిసేయయు
గంబులనైన నేరనన్। బాయక గొల్చుమానసము
ప్రత్యుపకారముగాదలంచినా। పాయుటతప్పు
గాగొనక భామినులారకృపన్ సెమింపరే॥

అని క్షమాపణ వేడుకొనెను.

ఇట్లెన్నియో బాల్యక్రీడలసలిపి మాతాపితృ గో గోప గోపికాజనములను ఆనందాబ్ధి నోలలాడించెను. ఇదియే పరిత్రాణమని శ్రీ భాష్యకారుల యాశయము.

శ్రీ మతే రామానుజాయ నమః

# ప్రచార విభాగము

## శ్రీ జియ్యర్ స్వామివారి - పాదయాత్ర

మన జియ్యర్ స్వామివారు కవిగారితో కాలినడగా కవుతవరంనుండి
7—1—58 వ తేదీ బయలుదేరిరి.

### గురజ

గురజకు 7 వ తేదీ రాత్రికి వేంచేసి మూడుదినములుండి భక్తి ప్రచారము, బదరీ ప్రచారము మహిళా మండలికి శుక్రవార పూజలు జరిపించిరి. శ్రీ ఉప్పలపాటి ఏమ అమ్మగారి భక్తిశ్రద్ధలు చాల శ్లాఘనీయములు.

### వాడపల్లి

వాడపల్లికి 10 వ తేదీ రాత్రికి చేరిరి. ఇచ్చట శ్రీ గూడాఅత్తుల వీరరాఘవదాసుగారు, మరికొందరు భక్తులు విలక్షణమైన భక్తిశ్రద్ధలు చూపుటచే తిరుప్పావుశాత్తుమొఱ అక్కడనే జరిగినది. పరిసరములనుండి పలువురు భక్తులు వచ్చిరి. శ్రీరామమందిరములో వేదాంతోపన్యాసములు, మహిళామండలి వారికి శుక్రవార పూజలు శ్రీ స్వామివారు జరిపించిరి.

### గుడ్లవల్లేరు

13 వ తేదీ రాత్రికి గుడ్లవల్లేరు చేరిరి. ఉదయం తిరువీధి భిక్షా కార్యక్రమము జరిగెను.

### పెంజెండ్ర

14 వ తేదీ రాత్రికి పెంజెండ్రకు శ్రీ స్వామివారు వేంచేసిరి. ఇచ్చట గ్రామస్థులు ఎక్కువ భక్తిశ్రద్ధ ప్రదర్శించిరి. సాధారణరీతిగా ఉపన్యాసములు, స్త్రీలకు శుక్రవారపూజలు శ్రీ జియ్యర్ స్వామివారు జరిపించిరి.

### జమిగొల్వేపల్లి

15 వ తేదీ రాత్రికి జమిగొల్వేపల్లికి చేరిరి. ఇచ్చట ఆలయములో సభలు, స్త్రీలకు శుక్రవారపూజలు శ్రీ జియ్యర్ స్వామివారు జరిపించిరి.

### పెదముద్దాలి

17 వ తేదీ సాయంకాలమునకు పెదముద్దాలి చేరిరి. ఇచ్చట ఆలయములో సభలు, స్త్రీలకు శుక్రవారపూజలు శ్రీ స్వామివారు జరిపించిరి.

### పెరిశేపల్లి

18 వ తేదీ రాత్రికి పెరిసేపల్లికి వేంచేసి ఉదయం తిరువీధి భిక్ష. రాత్రి సభలు, మధ్యాహ్నం స్త్రీలకు శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.

### పసుమర్రు

20 వ తేదీ సాయంత్రమునకు పసుమర్రుకు విచ్చేసి ఆలయములో సభ, బసలో స్త్రీలకు శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.

### జుఝ్ఝారం

21 వ తేదీ రాత్రికి జుఝ్ఝారం చేరిరి. ఆలయములో సభ, స్త్రీలకు శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.

### పామర్రు

22 వ తేదీ సాయంత్రం పామర్రుచేరిరి. శ్రీ కుర్లపాటి శేషాచలపంతులుగారు హృదయపూర్వకముగా స్వాగతమిచ్చిరి. ఆలయములో ఉపన్యాసములు మరునాడు మధ్యాహ్నము మహిళామండలికి శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.

### భట్లపెనుమర్రు

23 వ తేదీ రాత్రికి భట్లపెనుమర్రు చేరిరి. ఆలయము విలక్షణముగా నున్నది. సభలు, స్త్రీల శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.

### అగినపర్రు

24 వ తేదీ సాయంకాలమునకు అగినపర్రు వేంచేసిరి. ఆలయములో సభ, స్త్రీల శుక్రవారపూజలు జరిగెను.

### మేడూరు

26 వ తేదీ సాయంత్రమునకు మేడూరు విచ్చేసిరి. ఉదయం తిరువీధి భిక్ష. రాత్రి సభ, మధ్యాహ్నం స్త్రీల శుక్రవారపూజలు స్వామివారు జరిపించిరి.



# భక్తినివేదన

[వేదాంతమాసపత్రిక]




సంపాదకులు :

విద్వాన్

తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :

కవిరత్న

గుడిమెళ్ళ రామానుజాచార్యులు



సంపుటి ౧౦ | హేవిళంబి - మాఘమాసము | సంచిక ౧౧

# సంతోషవార్త

మన సంఘముద్వారా బదరికాశ్రమములో నిర్మింపబోవుచున్న "సత్సంగ సదనము" అను సంస్థకు (అ. 100) నూరు అడుగుల మేర తమ గోత్రనామములతో కట్టించవలసినదిగా బందరు తాలూకా గోపువానిపాలెం శివారు సంపత్కుమారపురం వాస్తవ్యులును, శ్రీ మేలుకోట జీయర్ స్వామివారి తిరువడి సంబంధులును, భగవద్భాగవతాచార్య కైంకర్య నిష్ఠాగరిష్ఠులును అగు శ్రీ పోతిరెడ్డి నరసింహారావు, ప్రసన్నభూషణ శ్రీ పోతిరెడ్డి సుబ్బారావు గారులు రు 1600/, పదారు వందల రూపాయిలు, విరాళ మొసంగుటకు వాగ్దానము గావించిరి.

శ్రీయఃపతి వీరి కుటుంబమునకు సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక !

# శ్రీ జీయర్ స్వామివారి ప్రచార వార్త

ప్రస్తుతము మన శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు తమ సహాయ కార్యదర్శులగు శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యుల గారితో కాలినడకగా కృష్ణాజిల్లాలో గుడివాడ తాలూకా ప్రాంతమున ప్రచారార్థమై పర్యటించుటకు బందరు ది 21-12-1957 తేది నుండి బయలుదేరినారు.

శ్రీమతే రామానుజాయనమః

# ప్రచార విభాగము

## శ్రీ జియ్యర్‌స్వామివారి - శ్రీ పాదయాత్ర

### బందరు.

ఇచ్చట 1-12-57 వ తేది మొదలు 20-12-57 వ తేదివరకు మన శ్రీ జీయర్ స్వామివారి ఆధ్వర్యమున స్థానిక శ్రీ విశిష్టాద్వైత ప్రవర్తక సంఘము మరియు శ్రీయతిరాజ సేవామహిళామండలివారలచే స్వామివారి గీతా జయంతి నిర్విఘ్నముగా, మహావైభవముగా పూర్తి గావింపబడినది. ప్రతిదినము మహిళలచే శ్రీలక్ష్మీ పూజలు విలక్షణముగా గావింపబడినవి. శ్రీశంకర మఠములోను, పౌనుశాలలలోను, దేవాలయములలోను శ్రీ స్వామివారు గీతా తత్వమును విశదతమముగా నుపన్యసించిరి. శ్రీ కవిగారున్ను తమ సహజ కవితాధోరణిలో గీతా రామాయణ విషయములను గురించి యుపన్యసించిరి.

ఈ గీతాజయంతి సభానిర్వహణములో శ్రీమాన్ సముద్రాల తిరువెంకటాచార్యులుగారెంతయో కృషి చేసిరి. స్థానిక శ్రీ యతిరాజ సేవామహిళా మండలి వారత్యంత భక్తిశ్రద్ధలతో జయంతి కార్యక్రమమును విలక్షణముగా జరిపించిరి. తుదినాడు అవబృథస్నానము, బీదలకు అన్న దానము సంతృప్తికరముగా జరిగినవి.

### శ్రీమన్నారాయణ పురం

బందరు నుండి శ్రీస్వామివారు 21-12-57 వ తేదీ మధ్యాహ్నము బయలు దేరి దివితాలూకా శ్రీమన్నారాయణ పురమునకు వేంచేసిరి. అచ్చట శ్రీకాండూరు లక్ష్మీ నరసమ్మగారు భక్తి శ్రద్ధలతో శ్రీస్వామివారికి హృదయపూర్వకముగా ఆతిథ్యమిచ్చిరి. వారి తండ్రిగారు నిర్మించిన ఆలయమును శ్రీ స్వామివారికి నివేదించి తదభివృద్ధికై మంగళాశాసనము కటాక్షించవలసినదిగా కోరిరి. ఇచ్చట మహిళామండలిని ఏర్పాటు గావించి శ్రీస్వామివారు శుక్రవార పూజావిధానమును ఏర్పాటు గావించిరి.

### సంపత్కుమార పురం

తరువాత శ్రీ మన్నారాయణ పురమునుండి శ్రీస్వామివారు, శ్రీ కవిగారు బందరు విచ్చేసి అచ్చట నుండి కాలినడకతో 22 వ తేదీ సాయంత్రమునకు సంపత్కుమార పురమునకు విచ్చేసిరి. ఇచ్చట ప్రశాంత రమణీయమైన వాతావరణమును జూచి శ్రీస్వామివారు విశ్రాంతి నిమిత్తమై వారము దినములిందే వేంచేసియుండిరి. ఈవారము దినములు శ్రీ పోతిరెడ్డి నరసింహారావు, శ్రీసుబ్బారావుగార్లు పరమ విలక్షణమైన శ్రద్ధలతో పరిచర్య గావించి శ్రీస్వామివారి కటాక్షమునకు పాత్రులైరి శ్రీవారు తెలిపినదే తడవుగా బదరీ సత్సంగ సదన నిర్మాణమునకు పదారువందల రూపాయలు సమర్పించుటకు సమ్మతించిరి. ఇచ్చట మహిళా మండలిని స్థాపించి శుక్రవారపూజ జరిపించిరి.

### గోకారం.

సంపత్కుమార పురంనుండి శ్రీస్వామివారు గోకవరం విచ్చేసిరి. అచ్చట వైశ్య బృందము శ్రీస్వామివారిని చక్కగా ఆరాధించిరి. ఒకనాటి సాయంకాలము మంగినపూడి రేవుగల సముద్రమునకు విచ్చేసి సముద్రస్నానము గావించిరి. ఇచ్చట మహిళా మండలిని స్థాపించి శుక్రవారపూజలు ఏర్పాటు చేసిరి.

### నందమూరు

గోపవరం నుండి శ్రీస్వామివారు తమపరివారముతో నందమూరు గ్రామమునకు విచ్చేసిరి. శ్రీస్వామివారిని గ్రామప్రముఖులు పెక్కురుఆదరించిరి. శ్రీస్వామివారిని ఆధ్యాత్మికముగా కొన్ని సంశయములడిగి సంతృప్తికరముగా సమాధానములు బడసి సంతోషించిరి. ఇచ్చట మహిళా మండలిని ఏర్పాటు చేసి శుక్రవారపూజ చేయించిరి.

### పెడన

నందమూరు నుండి శ్రీ స్వామివారు, శ్రీకవిగారు బయలు దేరి 30-12-57 వ తేది రాత్రికి పెడన గ్రామమునకు వేచ్చేసిరి. ఇచ్చట మహిళామండలిని ఏర్పాటు చేసి శుక్రవార పూజను జరిపించిరి.

### కవుతరం

పెడన నుండి 31 వ తేది సాయంత్రం బయలుదేరి. రాత్రికి కవుతరం చేరిరి. ఇచ్చట శబరివలె శ్రీ స్వామివారి రాకను నిరీక్షించుచున్న శ్రీ కాజ దుర్గమ్మగారు ఎంతయో పవిత్ర హృదయముతో స్వాగత మిచ్చెను. ఇచ్చట ముక్కోటిఏకాదశి ద్వాదశి వెంచేసి యుండి ప్రతిదినమురాత్రి వేదాంతవిషయములను గురించి శ్రీస్వామివారు ఉపన్యసించిరి. ఇచ్చటను మహిళామండలిని స్థాపించి శ్రీలక్ష్మీపూజను జరిపించిరి. ఇచ్చటనుండి గురుజకు శ్రీ స్వామివారు వెంచ్చేయుచున్నారు.

శ్రీమతే రామానుజాయ నమః

# బదరి శ్రీనివాస రామానుజస్వామివారల శాశ్వత, తాత్కాలిక, పూజా వివరాలు

## భట్టిప్రోలు

శ్రీ తూనుగుంట్ల బాలకృష్ణమూర్తి గారు 16/-
(సత్సంగసదనం)

## రేపల్లె

శ్రీ కోసరాజు సూరయ్యగారు 116/-
శ్రీ చిరుమామిళ్ల సత్యనారాయణ గారు 58/-
శ్రీ పల్లపోతు వీరభద్రయ్యగారు 58/-
శ్రీ బోలిశెట్టి హనుమంతరావుగారు. 29/-

## ముక్తిపల్లి అగ్రహారం

శ్రీ వేదాల వెంకటేశ్వరమ్మగారు 275/- లు (వాగ్దానం)
శ్రీ గుదిమెళ్ల రాఘవాచార్యులగారి భార్య రంగనాయకమ్మ } 29/-
శ్రీ వేదాల వెంకమ్మగారు 29/-
శ్రీ కొండూరు సీతమ్మగారు 29/-

## వేకనూరు

శ్రీ చామర్తి సూర్యనారాయణరావు గారు 29/-
(వాగ్దానం)
శ్రీ తుంగల గోపాలం గారు 29/- ,,
శ్రీ మాదివాడ సత్యనారాయణగారు 29/- లు (జమ)
శ్రీ ,, కృష్ణమూర్తి 29/- లు ,,
శ్రీ ,, వెంకటేశర్లు 29/- లు ,,
శ్రీ కూనపురెడ్డి వెంకట సుబ్బారావు 29/- లు ,,
(ఫ్యాక్టరీ ఓనరు)
శ్రీ బాడిగ చలపతిరావు 29/ లు ,,

## గాదివారి పాలెం

శ్రీ వాడపల్లి రామకోటయ్యగారు 29/- లు వాగ్దానం

## విజయవాడ

శ్రీ వెల్లి పుల్లమ్మ, నాగరత్నమ్మగార్లు 11/- లు జమ

## 29-0-0 లు ఇచ్చినవారు

శ్రీ ఆట్లూరి మల్లయ్యగారి భార్య రామానుజమ్మగారు, లోగడ జమ 26/రు గాక ఇప్పుడు జమ 3-0-0
,, దోరడ్ల లక్ష్మణరావుగారు, బందరు
,, తట్రాయతిరాజవల్లి తాయారమ్మగారు, చిట్టిగూడూరు
,, విస్సంశెట్టి మాణిక్యమ్మగారు, బందరు
,, కాట్లూరి చూడుకుడుత్తమ్మగారు, బందరు

శ్రీ మిట్టపల్లి రాజరత్నమ్మగారు, బందరు
,, చిన్నం రంగవల్లి తాయారమ్మ గారు, బందరు
,, పంచాంగం రంగనాయకమ్మ గారు, బందరు
,, తాళ్ళూరి నారాయణ మూర్తి గారు, కవుతరం
,, ఎక్కిరాజు సుందరమ్మగారు, హైదరాబాద్
,, పిళ్ళారిశెట్టి వెంకట రమణమ్మగారు, బందరు
,, రాజనాల వెంకటేశ్వర నాయుడు గారు, బందరు
,, బొర్రా పున్నమ్మగారు, బందరు, (వాగ్దానం 29/లో ఇప్పుడు జమ 11/-
,, తాతినేని గోపాలకృష్ణయ్యగారు, బందరు
,, పోలవరపు హనుమాయమ్మగారు, బందరు
,, గొట్టిపాటి పద్మనాభయ్య గారు,
,, తుమ్మల నాగయ్యగారు, గోసూరు
,, తుమ్మల కుటుంబరావుగారు, బందరు
,, పరుచూరి ప్రసాదరావుగారు, బందరు
,, చన్నగిరి ఆండాళమ్మగారు, బందరు
,, మల్లవోలు వెంకటసుబ్బారావుగారు, బందరు
,, తాడేపల్లి వెంకటరత్నమ్మగారు, బందరు
,, దోరడ్ల సత్యనారాయణమూర్తి గారు, బందరు
,, చిన్నం సోమయ్యగారు, బందరు
,, శెట్టిబలి వెంకటలక్ష్మీబాయమ్మగారు, బందరు
,, గుడిమెళ్ళ వెంకటనరసింహాచార్యులుగారు, బందరు
,, కొత్త పాండురంగ నంబెరుమాళ్లుగారు, బందరు
,, అన్నవరపు బంగారయ్యగారు, బందరు
,, తిటవర్తి చిట్టెమ్మగారు, బందరు
,, మట్టా వెంకటేశ్వరరావుగారు, బందరు
,, మట్టా చినకోటేశ్వరమ్మగారు, బందరు
,, పాలపర్తి నాంచారమ్మగారు, బందరు
,, ఎండూరు రంగనాయకమ్మగారు, బందరు
,, కొప్పర్తి ఆండాళమ్మగారు, బందరు
,, వంకాయల లక్ష్మమ్మగారు, బందరు
,, కంతేటి కనకమ్మగారు, బందరు
,, కంతేటి శ్రీనివాసరావుగారు, బందరు
,, తాడేపల్లి నాంచారమ్మగారు, బందరు
,, పల్లంపాటి ఆండాళమ్మగారు, బందరు
,, డారపురెడ్డి కృష్ణంస్వామిగారు, వాగ్దానం 29/-లో జమ ఉల్లిపాలెం 11/-
,, మండలి సీతారామయ్యగారు, డాక్టరు, ఉల్లిపాలెం
,, కొట్టి వెంకాయమ్మగారు, (సంపత్కుమారపురం)
,, జల్లూరి మాణిక్యయ్యగారు, తాళ్ళపాలెం

మాతాపితాక్కళ్ కైయిల్ నిన్ఱుమ్ వాఙ్గి ఘాతుకనాన అట్టువాణియన్ కైయిలే కాట్టిక్కొడుక్కుమాపోలే యిరుప్పదొన్ఱు.

పంటిబిడ్డను తల్లితండ్రుల చేతినుండి తీసుకొని ఘాతకుడగు కటికవాని చేతికి నప్పగించుటవంటిది.

౧౭౯. తన్నైత్తానేయిఱే ముడిప్పాన్.

౧౭౯. తనను తానేకదా నశింపజేసుకొనును.

౧౮౦ తన్నైత్తానే ముడిక్కైయావదు - అహఙ్కారత్తైయుమ్ విషయఙ్గళైయుమ్ విరుమ్బుగై.

౧౮౦. తనను తానే నశింపజేసుకొనుట యనగా అహంకారమును విషయములను ప్రేమించుట

౧౮౧. అహఙ్కార మగ్నిస్పర్శమ్బోలే.

౧౮౧. అహంకారము అగ్నిస్పర్శవంటిది.

౧౮౨. "న కామకలుషం చిత్తమ్." "నహి మే జీవితేనార్థః." "న దేహమ్" "ఎమ్మావీట్టుత్తిఱముమ్"

౧౮౨ "న కామకలుషం చిత్తం" అని జితంతాస్తోత్రమున తెలుపబడినదికదా. "నహిమే జీవితేనార్థః" అను సీతాపిరాట్టియొక్కయు, "న దేహం" అని ఆళ్వందార్లయొక్కయు. "ఎమ్మావీట్టుత్తిఱముం" అని నమ్మాళ్వార్లయొక్కయు, శ్రీసూక్తులను స్మరించుకొనునది.

౧౮౩. ప్రతికూలవిషయస్పర్శమ్ విషస్పర్శమ్బోలే; అనుకూల విషయస్పర్శమ్ విషమిశ్రభోజనమ్బోలే.

౧౮౩. ప్రతికూలములైన విషయముల యొక్క సంబంధము విషస్పర్శ వంటిది. అనుకూలములైన విషయముల యొక్క సంబంధము విషమిశ్రితమైన భోజనము వంటిది.

౧౮౪. అగ్నిజ్వాలైయై విళుఙ్గి విడాయ్ కెడ నినైక్కుమాపోలేయుమ్ ఆడుకిఱ పామ్బిన్ నిళలిలే యొదుఙ్గ నినైక్కుమాపోలేయుమ్ విషయప్రవణనాయ్ సుఖిక్కనినైక్కై.

౧౮౪. అగ్నిజ్వాలను మ్రింగి దాహమును పోగొట్టుకొనతలంచి నటులను, ఆడుచున్న పాము పడగ క్రింద ఒదుగియుండ తలంచి నటులను, విషయప్రవణుడై సుఖించ దలచుట.

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| ౧౮౫. ఆశుణమా ముడియుమాపోలే భగవదనుభవైకపరనాయ్ మృదుప్రకృతియాయిరుక్కుమవన్ విషయదర్శనత్తాలే ముడియుమ్బడి. | ౧౮౫. ఆశుణమను పక్షి ప్రాణముల విడుచునట్లు, భగవదనుభవైకపరుడై మృదుస్వభావుడై యుండువాడు విషయముల దర్శనముచే నశించుట. |
| ౧౮౬. "కాట్టిప్పడుప్పాయో" ఎన్నక్కడవదిఱే. | ౧౮౬. 'కాట్టిప్పడుప్పాయో" అను తిరువాయ్ మొళిలోని ౬.౯.౯. పాశురము నందువలనే అనవచ్చునుగదా. |
| ౧౮౭. అజ్ఞాన విషయప్రవణన్ కేవలనాస్తికనైపోలే. జ్ఞానవానాన విషయప్రవణన్ ఆస్తికనాస్తికనైప్పోలే. | ౧౮౭. అజ్ఞానియై విషయప్రావణ్యమును గలవాడు కేవల నాస్తికుని వంటివాడు. జ్ఞానవంతుడై విషయప్రావణ్యము గలవాడు ఆస్తికనాస్తికుని వంటివాడు. |
| ౧౮౮. కేవలనాస్తికనై త్తిరుత్తలామ్; ఆస్తికనాస్తికనై ఒరునాళుమ్ తిరుత్తవొణ్ణాదు. | ౧౮౮. కేవలనాస్తికుని దిద్దుబాటు చేయవచ్చును. ఆస్తికనాస్తికుని ఎన్నటికిని దిద్దుబాటు చేయవలనుకాదు. |
| ౧౮౯. ఇవ్వైయిరణ్డుమ్ స్వరూపేణ ముడిక్కుమళవన్ఱిక్కే, భాగవత విరోధత్తైయుమ్ విళైత్తుముడిక్కుమ్. | ౧౮౯. ఇవి రెండును స్వరూపముతోకూడ నశింపజేయుట మాత్రమే గాకుండగ భాగవత విరోధమునుకూడ కలిగించి నశింపజేయును. |
| ౧౯౦. నామరూపజ్ఞళైయుడైయరాయ్ భాగవత విరోధమ్బణ్ణిప్పోరు మవర్గళ్ దగ్ధపటమ్బోలే. | ౧౯౦. పేరుప్రతిష్టలు గలవారై భాగవత విరోధమును కలుగజేసుకొనువారలు దగ్ధపటము వంటివారు. |
| ౧౯౧. మడిప్పుడైవై వెన్దాల్ ఉడైయుమ్ పావు మొత్తుక్కిడక్కుమ్; కాత్తడిత్తవాఱే పఱన్దుపోమ్. | ౧౯౧. మడతలోనున్న బట్టకాలిపోయినను పడుగుపేకలుచెడకుండగనే కనపడును. గాలి వేసినవెంటనే బూడిదగ ఎగిరి పోవును. |

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ౧౯౨. "ఈశ్వరనవతరిత్తుప్పణ్ణిన అమానుషచేష్టితఙ్గళెల్లామ్ భాగవతాపచారమ్ పొఱామై" ఎన్ఱు జీయరరుళిచ్చెయ్‌వర్. | ౧౯౨. "సర్వేశ్వరు డవతరించి చేసిన అతిమానుష చేష్టితము లన్నియు భాగవతాపచారమును సహించజాలక" యని నంజీయరు సాయించెడువారు |
| ౧౯౩. "అవమానక్రియా" | ౧౯౩. "అవమానక్రియా" అని అనిరి కదా. |
| ౧౯౪. భాగవతాపచారన్దా ననేకవిధమ్, | ౧౯౪. భాగవతాపచారము అనేకవిధములు. |
| ౧౯౫. అదియోలేన్ఱు అవర్‌గళ్‌పక్కల్ జన్మనిరూపణమ్. | ౧౯౫. అందు వారలజన్మను గురించి నిరూపించుట యొక్కటి. |
| ౧౯౬. ఇదుదాన్ అర్చావతారత్తిలుపాదానస్మృతియిలుమ్ కాట్టిల్ క్రూరమ్. | ౧౯౬. ఇది అర్చావతారమందలి ఉపాదాన ద్రవ్యముయొక్క స్మరణకంటెను క్రూరమైనది. |
| ౧౯౭. అత్తై మాతృయోని పరీక్షైయోడొక్కు మెన్ఱు శాస్త్రమ్ శొల్లుమ్. | ౧౯౭. దానిని మాతృయోని పరీక్షతో సమానమని శాస్త్రము తెలుపుచున్నది. |
| ౧౯౮. త్రిశఙ్కువైప్పోలే కర్మచణ్డాలనాయ్ మార్విలిట్టయజ్ఞోపవీతమ్ తానే వారాయ్ విడుమ్. | ౧౯౮. త్రిశంకునికి వలెనే వక్షస్థలమునునున్న యజ్ఞోపవీతమున్ను తోలై పోవును. |
| ౧౯౯. జాతిచణ్డాలనుక్కు కాలాన్తరత్తిలే భాగవతనాగైక్కు యోగ్యతైయుణ్డు; అదువుమిల్లై యివనుక్కు. | ౧౯౯. జాతి చండాలునకు కాలాంతరమున భగవద్భక్తుడగుటకు అవకాశమున్నది, అదియుకూడ లేదు వీనికి. |
| ౨౦౦. ఆరూఢపతితనాగైయాలే. | ౨౦౦. ఆరూఢపతితుడగుటవలన. |
| ౨౦౧. ఇదుతనక్కు అధికారినియమమిల్లై | ౨౦౧. దీనికి అధికారినియమములేదు. |
| ౨౦౨. "తమర్‌గళిల్ తలైవరాయ శాదియన్దణర్‌గళేలుమ్" ఎన్గైయాలే. | ౨౦౨. "తమర్ కళిల్ తలైవరాయ్ శాతియందణర్ కళేలుం" అనితిరుమాలై ౪౩ వ పాశురమున తొండరడిప్పొడి యాళ్వార్లు సాయించినటులనే. |

౨౦౩. ఇవ్విడత్తిలే వైనతేయవృత్తాన్తత్తైయుమ్ పిళ్లైప్పిళ్లైయాళ్వానుక్కు ఆళ్వాన్ పణిత్తవార్త్తైయైయుమ్ స్మరిప్పదు.

౨౦౪ జ్ఞానానుష్ఠానఙ్గళై యొళిన్దాలుమ్ పేత్తుక్కు అవర్గళ్ పక్కల్ సమ్బన్ధమే అమైయుమాప్పోలే ఇవై యుణ్డానాలుమ్ ఇళవుక్కు అవర్గళ్ పక్కల్ అపచారమే పోరుమ్.

౨౦౫ ఇదిల్ జన్మవృత్తాదినియమమిల్లై.

౨౦౬. ఇవ్వర్థమ్ కైశికవృత్తాన్తత్తిలుమ్ ఉపరిచరవసువృత్తాన్తత్తిలుమ్ కాణలామ్.

౨౦౭. బ్రాహ్మణ్యమ్ విత్తైచ్చెల్లుగిఱదు వేదాధ్యయనాదిముఖత్తాలే భగవల్లాభహేతువెన్ఱు; అదుతానే ఇళవుక్కు ఉఱుప్పాగిల్ త్యాజ్యమామిఱే.

౨౦౮. జన్మవృత్తఙ్గళినుడైయ ఉత్కర్షమపకర్షముమ్ పేత్తుక్కుమ్ ఇళవుక్కుమ్ అప్రయోజకమ్.

౨౦౯. ప్రయోజకమ్ భగవత్సమ్బన్ధముమ్ తదసమ్బన్ధముమ్.

౨౧౦. భగవత్సమ్బన్ధ ముణ్డానాలిరణ్డుమొక్కుమోవెన్నిల్

౨౦౩. ఈసందర్భమున వైనతేయుని వృత్తాంతమును, పిళ్లైపిళ్లై యాళ్వానులకు కూరత్తాళ్వానులు సాయించిన శ్రీసూక్తిని స్మరించుకొన్నది.

౨౦౪. జ్ఞానానుష్ఠానములు లేకున్నను పురుషార్థమునకు వారితోఁగల సంబధమే చాలి యుండునటుల, అవి యున్నను నాశనమునకు వారి విషయమున అపచార పడుటయే చాలును.

౨౦౫. ఇందు జన్మము వృత్తి మున్నగు నియమములు లేవు.

౨౦౬. ఈ విషయమును కైశిక వృత్తాంతమునను, ఉపరిచరవసువు వృత్తాంతమునను జూడవచ్చును.

౨౦౭. బ్రాహ్మణ్యము గౌరవించబడునది, వేదాధ్యయనాదులద్వారా భగవత్ప్రాప్తికి హేతువని. అదియే నాశనమునకు హేతువగుచో త్యాజ్యమేకదా.

౨౦౮. జన్మము వృత్తి వీనియొక్క ఉత్కర్ష గాని అపకర్ష గాని పురుషార్థమునకు గాని నాశనమునకు గాని హేతువులు కావు.

౨౦౯. భగవత్సంబధమును, తద్రాహిత్యమును హేతువగును.

౨౧౦. భగవత్సంబంధమున్నచో రెండును సమానమగునా యనినచో.

౨౧౧ ఒన్ఱాను.

౨౧౨ ఉత్కృష్టమాగ భ్రమిత్త జన్మమ్ భ్రంశసంభావనైయాలే "శరీరేచ" ఎన్ఱు అపడియే భయజనకమ్.

౨౧౩. అదుక్కు స్వరూపప్రాప్తమాన నైచ్యమ్ భావిక్క వేణుమ్.

౨౧౪. అపకృష్టమాగ భ్రమిత్త ఉత్కృష్ట జన్మత్తుక్కు ఇరండు దోషముమిల్లై.

౨౧౫. నైచ్యమ్ జన్మసిద్ధమ్.

౨౧౬. ఆగైయాలే ఉత్కృష్టజన్మమే శ్రేష్ఠమ్

౨౧౭. "శ్వపచోఽపి మహీపాల."

౨౧౮. నికృష్టజన్మత్తాల్ వన్ద దోషమ్ శమిప్పదు విలక్షణసమ్బన్ధత్తాలే.

౨౧౯. సమ్బన్ధత్తుక్కు యోగ్యతైయుణ్డా వ్వాదు జన్మక్కొత్తై పోగవేణుమ్

౨౨౦. జన్మత్తుక్కుక్కొత్తైయుమ్ అదుక్కు ప్పరిహారముమ్ "పళుదిలావొళుగల్" ఎన్ఱుఅపాట్టిలే యరుళిచ్చెయ్దార్.

౨౨౧. వేదగప్పొన్ పోలే ఇవర్ గళోట్టై సమ్బ

౨౧౧. రాజాలవు.

౨౧౨. గొప్ప దిగ భ్రమించిన జన్మము, భ్రష్ట మగుటకు శవకాశము కలదిగాన "శరీరేచ" అను జితంతస్తోత్ర శ్లోకాను సారముగ భయమును కలిగించునది.

౨౧౩. అందులకు గాను స్వరూపతః ప్రాప్త మైన నైచ్యమును అను సంధించు కొనవలయును.

౨౧౪. నీచజన్మగా భ్రమపడుట ఉత్కృష్ట జన్మకు రెండు దోషములును కూడ ఉండవు.

౨౧౫. నైచ్యము జన్మసిద్ధమైనది.

౨౧౬. అనుక ఉత్కృష్ట జన్మమే శ్రేష్ఠమైనది.

౨౧౭. "శ్వపచోఽపి మహీపాల" అను శ్లోకమే ప్రమాణము.

౨౧౮. నీచజన్మచే వచ్చిన దోషము శమించుట విలక్షణుల సంబంధముచేత.

౨౧౯. సంబంధమునకు యోగ్యత కలుగుటకు జన్మాభిమానము నశించవలయును.

౨౨౦. జన్మయొక్క అభిమానమును గూర్చి యు, దానికి పరిహారమును గూర్చియు "పళుతిలావొళుకల్ 'అనితిరుమాలైలో ౪౨ పాశురమున తెలిపిరి.

౨౨౧. స్పర్శవేది బంగారమువంటిది నైచ్యాను

నమ్.

[illegible] ప్రధానములగల విశేషణముతోటి సంబంధము.

౨౨౨. ఇవర్ గళ్ పక్కల్ సామ్య బుద్ధియుమాధిక్య బుద్ధియుమ్ నడక్కవేణుమ్.

౨౨౨. వీరి విషయమున సామ్యబుద్ధియును, అధిక్యబుద్ధియు [illegible].

౨౨౩. ఎదానమ – ఆచార్యతుల్యర్ ఎన్నుమ్ సంసారికళిలుమ్ తన్నిలుమ్ ఈశ్వరనిలుమ్ అధికరెన్నుమ్ నినైక్కై.

౨౨౩. ఎనగా – ఆచార్యులతో సమానులనియు, సంసారుల కంటెను, తన కంటెను, ఈశ్వరుని కంటెను అధికులనియు తలచుట.

౨౨౪. ఆచార్యసామ్యత్తుక్కడి ఆచార్యవచనమ్.

౨౨౪. "ఆచార్యులతో సమానులుగ తలచుటకు కారణము ఆచార్యుల శ్రీసూక్తియే,

౨౨౫. ఇప్పడినినైయాదొళిగైయుమపచారమ్,

౨౨౫. ఈవిధముగ తలంచకుండుటయు అపచారమే.

౨౨౬. ఇవర్థమ్ఇతిహాసపురాణజ్గళిలుమ్, *'పయిలుమ్శుడరొళి'నెడుమాఱ్కడిమైయిలుమ్, *కణ్ శోర వెఙ్గురుదియిలుమ్, *నణ్ణాద వాళవుణరిలుమ్*తేట్టరుమ్ తిఱల్ తేనిలుమ్, * మేమ్పొరుళుక్కమేలిల్ పాట్టుక్కళిలుమ్ విశదమాగక్కాణలామ్

౨౨౬. ఈ యర్థము ఇతిహాస పురాణముల యందును, 'పయిలుంశుడరొళి,' (తిరు. 3. 2. ౧) "నెడుమార్కడిమై" (తిరు. ౮. ౧౦.) యందును "కణ్ శోర వెంకురుతి"; (తిరుమొళి. ౭. ౮.౧ యందును "నణ్ణాత వాళవుణమ్"(తిరు ౨.౬.౨.)యందును. "తేట్టరుం తిఱల్ తేనిఱమ్ "(పెరు. ౨. ౧) యందును " మేంబొరుళుక్క"(తిరుమాలై 3౮) అనుదాని పై పాశురములందును విశదముగ చూడవచ్చును

౨౨౭. క్షత్రియనాన విశ్వామిత్రన్ బ్రహ్మర్షియానాన్.

౨౨౭. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యాయెను.

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| ౨౨౮. శ్రీవిభీషణనై రావణన్ "కులపాంసనమ్" ఎన్ఱాన్; పెరుమాళ్ ఇక్ష్వాకు వంశ్యనాగవినైత్తు వార్త్తైఅరుళిచ్చెయ్దార్. | ౨౨౮. విభీషణుని రావణుడు "కులపాంసనం" అనెను. శ్రీరామచంద్రమూర్తి ఇక్ష్వాకు వంశునిగ భావించి కృపతో సంభాషించిరి |
| ౨౨౯. పెరియవుడైయార్క్కు పెరుమాళ్ బ్రహ్మమేధసంస్కారమ్ పణ్ణియరుళినార్. | ౨౨౯. జటాయువునకు శ్రీరామచంద్రమూర్తి కృపతో బ్రహ్మమేధ సంస్కారమును జేసిరి. |
| ౨౩౦. ధర్మపుత్రర్ అశరీరివాక్యత్తైయుమ్ జ్ఞానాధిక్యత్తైయుమ్ కొణ్డు శ్రీవిదురరై బ్రహ్మమేధత్తాలే సంస్కరిత్తార్. | ౨౩౦ ధర్మరాజు, అశరీరివాక్యమును, జ్ఞానాధిక్యమును బుచ్చుకొని శ్రీవిదురులను బ్రహ్మవిధిగా సంస్కారమును జరిపిరి. |
| ౨౩౧. ఋషికళ్ ధర్మవ్యాధన్ వాశలిలే తువణ్డు ధర్మసన్దేహఙ్గళై శమిప్పిత్తుక్కొణ్డార్గళ్. | ౨౩౧. ఋషులు ధర్మవ్యాధుని వాకిట కాచియుండి ధర్మసందేహములను బోగొట్టుకొనిరి. |
| ౨౩౨. కృష్ణన్ భీష్మద్రోణాదిగళ్ గృహఙ్గళై విట్టు శ్రీవిదురర్ తిరుమాళిగైయిలే అముదు శెయ్దాన్. | ౨౩౨. శ్రీకృష్ణుడు భీష్మద్రోణాదుల గృహములను విడిచి శ్రీవిదురుల గృహమున ఆరగించెను. |
| ౨౩౩. పెరుమాళ్ శ్రీశబరి కైయాలే అముదు శెయ్దరుళినార్. | ౨౩౩. శ్రీరామచంద్రమూర్తి శ్రీ శబరి హస్తముచే ప్రేమతో ఆరగించిరి. |
| ౨౩౪, మాఱనేరినమ్బి విషయమాగ పెరియనమ్బి ఉడైయవర్క్కు అరుళిచ్చెయ్ వార్త్తైయై స్మరిప్పదు. | ౨౩౪. మారనేరినంబిగారి విషయమున పెరియనంబిగారు ఉడయవరులకు సాయించిన శ్రీసూక్తిని స్మరించుకొనునది. |
| ౨౩౫. "ప్రాదుర్భావైః" ఇత్యాది . | ౨౩౫. "ప్రాదుర్భావై" ఇత్యాది శ్లోకముల స్మరించుకొనునది. |
| ౨౩౬. భాగవతసన్నిధిక్కే వేదార్థజ్ఞానాదిగళై యుడైయవన్ కోఙ్కుమమ్ శుమన్ద | ౨౩౬. "భగవద్భక్తి లేనివాడై వేదార్థజ్ఞానాదులు గలవాడు కుంకుమ పువ్వును |

కళుదైయోపాది ఎన్ఱు శొల్లానిన్ఱదిఱే.

౨౩౭. రాజావాన కులశేఖరప్పెరుమాళ్ తిర్యక్‌స్థావరజన్మజ్ఙళై ఆశైప్పట్టార్

౨౩౮. బ్రాహ్మణోత్తమరాన పెరియాళ్వారుమ్ తిరుమగళారుమ్ గోపజన్మత్తై ఆస్థానమ్ పణ్ణినార్గళ్.

౨౩౯ కన్దల్‌కళిన్దాల్ ఎల్లార్‌క్కుమ్ * నారీణాము త్తమైయిన్ అవస్థై వన్దేఱదాయిరుక్కుమ్

౨౪౦. ఆఱుప్రకారత్తాలే పరిశుద్ధాత్మస్వరూపత్తుక్కు తత్సామ్యముణ్డాయిరుక్కుమ్

౨౪౧. దృష్టత్తిలుత్కర్షమ్ అహఙ్కారత్తాలే, అదృష్టత్తిలుత్కర్షమ్ అహఙ్కార రాహిత్యత్తాలే.

౨౪౨. బ్రహ్మావాయిళన్దుపోదల్ ఇడైచ్చియాయ్ప్పెత్తు విడుదల్ శెయ్యుమ్బడియాయిరుక్కుమ్

౨౪౩. ఇప్పడి సర్వప్రకారత్తాలుమ్ నాశహేతువాన అహఙ్కారత్తుక్కుమ్ అదినుడైయ కార్యమాన విషయప్రావణ్యత్తుక్కుమ్ విళైనిలమ్ తానాగైయాలే తన్నైక్కణ్డాల్ శత్రువైక్కణ్డాప్పోలేయుమ్, అవత్తుక్కు వర్ధకరాన సంసారిగళైక్కణ్డాల్ సర్పత్తైక్కణ్డాప్పోలే

మోయుము గొడిదపంటివాడను" అని శాస్త్రము తెలుపుచున్నది కదా.

౨౩౭. రాజైన శ్రీ కులశేఖర పెరుమాళ్ జాతుజాలముల జన్మములకై ఆశపడిరి.

౨౩౮. బ్రాహ్మణోత్తములైన పెరియాళ్వారును వారికుమార్తెయును గొల్లజన్మమును ఆరోపించుకొనినారు.

౨౩౯. అవిద్యాదిదోషములు నశించినచో అందరికిని, శీతలమైన స్త్రీయొక్క అవస్థవచ్చును.

౨౪౦. ఆరువిధములుగ పరిశుద్ధమైన ఆత్మ స్వరూపమునకు వారితో సామ్యముంటూయున్నది.

౨౪౧. ఈలోకమున గొప్పతనము అహంకారముచే కలుగును, పరలోకమున గొప్పతనము అహంకార రాహిత్యముచే కలుగును.

౨౪౨. చతుర్ముఖబ్రహ్మయై సంసారమున బడుటకును, గోపికయై మోక్షమును బొందుటకును అనువైయుండును.

౨౪౩. ఇటుల అన్నివిధముల నాశనమునకు హేతువైన అహంకారమునకును, దానియొక్క కార్యమైన విషయప్రావణ్యమునకును మూలస్థానము తానగుట వలన, తనను జూచినచో శత్రువును జూచినటులను, వాటియభివృద్ధికి కారకులైన సంసారులను జూచినచో సర్ప

శ్రీ కోటమర్రి ఎర్రయ్యగారి, భార్య అనసూయమ్మగారు, తాళ్ళపాలెం
" జల్లూరి భావనారాయణస్వామిగారికుమారుడు సత్యనారాయణ అండ్ బ్రదర్స్
" తమ్మన సూర్యనారాయణగారు, గోకవరం
" కొప్పర్తి పుల్లయ్యశ్రేష్ఠిగారు, బందరు

చావలి ? ? మము

మహిళా సంఘమువారు శ్రీగోదా కల్యాణము జరిపిన సందర్భమున సంఘమునకు సమర్పించిన కట్నము 5-0-0

**58-0-0 లు ఇచ్చినవారు**

శ్రీ తాడేపల్లి వెంకటసుబ్బమ్మగారు, (బందరు) వాగ్దానం 58/ లో గడ జమ 50-0-0
" కంతేటి రామయ్యగారిభార్య తాయారమ్మగారు బందరు 58-0-0

**రు. 275-0-0 లు ఇచ్చినవారు**

" కాజ సత్యవతమ్మగారు, కోలిమెట్ల, వాగ్దానం 275/ లో జమ 50-0-0

**తాత్కాలికపూజలు**

శ్రీ దోరడ్ల రత్నమ్మగారు, బందరు రు. 10/-
" కుడిమెళ్ళ వెంకటరంగాచార్యులుగారు, శ్రీమన్నారాయణపురం 11/-
" తాళ్లూరి నారాయణమూర్తిగారు, (కవుతరం) 16/-

**116-0-0 లు ఇచ్చినవారు**

శ్రీ కానూరి వెంకటరామయ్యగారు, (కవుతరం) భార్య పున్నమ్మగారు, 100-0-0
" కాండూరు లక్ష్మీనరసమ్మగారు, శ్రీ మన్నారాయణపురం 116-0-0
" కానూరి రామమూర్తిగారు, కవుతరం, వాగ్దానం 116/లో జమ 29-0-0
" జంపాల సత్యవతమ్మగారు, (కవుతరం) వాగ్దానం 116/- లో జమ 100-0-0

## శ్రీ వారికి పాదపూజ

బందరులో ప్రముఖ్యవైశ్య శిఖామణులు భగవద్భాగవతాచార్యకైంకర్య పరులగు శ్రీ దోరెడ్ల సత్యనారాయణ దంపతులు శ్రీ జియ్యర్‌స్వామివారిని సగౌరవముగా తమగృహమునకు వేంచేపు చేసుకొని విశేషమైన పాదపూజ గావించిరి. పిదప శ్రీ కవిగారిని గూడ నూతనవస్త్రములతో సత్కరించిరి శ్రీయఃపతి యీ దంపతులకు సన్మంగళములు ప్రసాదించుగాక !

## విశేష వార్త

కృష్ణాజిల్లా కవుతరం గ్రామవాస్తవ్యురాలగు శ్రీమతి కాజ దుర్గమ్మగారు, తమ స్వంత గ్రామంలో రామానుజ కూటనిర్మాణార్థమై మంచివసతిగల ప్రదేశమునుకొని, రామానుజ కూటమును నిర్మింప బూనుకొన్నారు. శ్రీ జియ్యర్ స్వామివారు ఆస్థలరామణీయకమును చూచి చాలా సంతృప్తిబడిరి. శ్రీయఃపతి ఈతల్లిగారి సంకల్పమును త్వరలో సఫలముచేయుగాక !

## రాజమండ్రిలో కాలక్షేప గోష్ఠి

రాజమండ్రిలో తులసీ రామానుజ కూటమందు మనసంఘ ప్రధాన కార్యదర్శులగు ఉ. వే. శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు గీతాజయంతిని 18 దినములు మహావైభవముగా నిర్వహించి ప్రస్తుతము ధనుర్మాసోత్సవమును పరమ విలక్షణముగా జరిపించుచున్నారు.

తెల్లవారు ఝామున - శ్రీవిష్ణు సహస్రనామ, భజయతిరాజ స్తోత్రపారాయణ, ఉదయము - ధనుర్మాస గోష్ఠి, పిదప గీతాభాష్య కాలక్షేపము, తరువాత శ్రీవచనభూషణ కాలక్షేపము, మధ్యాహ్నము తిరుప్పావు కాలక్షేపము, సాయంకాలము శ్రీ కాకివారి భవనములో గీతోపన్యాస కార్యక్రమము క్షణమైన విశ్రాంతిలేకుండ శ్రీ గోపాలాచార్య స్వామివారు నిర్వహించుచున్నారు. వీరికి అన్ని విధముల చేదోడు వాదోడుగా "రామస్య దక్షిణోబాహుః లక్ష్మణః" అన్నట్లుగా శ్రీమత్తిరుమల పులిహొళ్ల వేంకటాచార్య స్వామివారు కృషి చేయుచున్నారు. ఈ కార్యక్రమములలో రాజమండ్రి పౌరులు పెక్కురు అత్యంతోత్సాహముతో పాల్గొనుచున్నారు.

## బందరులో గీతామందిరము

బందరులో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్వర్యమున 18 దినములు నిర్విఘ్నముగా గీతా జయంతి జరుపబడిన పిమ్మట శ్రీవారి సంకల్పానుసారముగా గీతా మందిరమును బందరులో ఏర్పాటు చేయుటకు స్థానిక శ్రీ యతిరాజ సేవామహిళామండలివారు ప్రయత్నించుచున్నారు. శ్రీ స్వామివారి సమక్షములో అప్పటి కప్పుడే దాదాపు రు. 5000/ లు వరకు విరాళములు వాగ్దానములు జరిగినవి.

శ్రీయఃపతి త్వరలో వీరి సంకల్పమును సిద్ధింప చేయుగాక!

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press, Nadigaddepalem.

# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]



సంపుటి ౧౧ ] విళంబి - చైత్రము [ సంచిక ౧

శ్రీ మతేరామానుజాయనమః



# భక్తినివేదన

సంపుటు ౧౧ | విళంబి - చైత్రము | సంచిక ౧

కృష్ణాజిల్లా గుడివాడ పట్టణమున శ్రీ జనార్ధనస్వామివారి ఆలయమున ది 6-3-1958 తేదీ లగాయతు ది 12-3-58 వరకు వారము దినములు జరిగిన సత్సంగ సప్తాహమహోత్సవముయొక్క-

## నివేదిక

ఈ సత్సంగ సప్తాహము శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము ద్వారా శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి అధ్వర్యమున ముఖ్యముగ కృష్ణాజిల్లావారి నుద్దేశించి ఏర్పాటుచేయబడినది. ఇందు కృష్ణాజిల్లాలోని అన్ని ప్రాంతములలోని భక్తులున్ను గుంటూరు, పశ్చిమ తూర్పుగోదావరి జిల్లాలులోని భక్తులున్ను మొత్తము సుమారు 600 మందివరకు పాల్గొనిరి. మా దృష్ట్యా ఈ కార్యక్రమము సక్రమముగను వైభవముగను చాల ఉత్సాహముగను జరిగినది. చాలమంది పండితులు వేంచేసి తమ యమూల్యోపదేశములు ప్రసాదించి ఈ సత్సాంగమును సఫలము నొనర్చిరి.

ఈ కార్యక్రమమునకై వేంచేసి యిందు పాల్గొనిన పండితులు.

శ్రీ. ఉ. వే. శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు. న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలచార్యస్వామివారు కవిరత్న గు. రామానుజాచార్యులువారు ఉపన్యాసకేసరి, సుబోధక సుధీమణి కో. కం. రంగాచార్యులవారు (వరంగల్లు) శ్రీనివాస రామానుజాచార్యస్వామి వారు (బాపట్ల) మహాభాష్యం చక్రవర్తుల

వరదాచార్యస్వామివారు (చీరాల) ధర్మపురి తిరుమల లక్ష్మీకుమార వేదాన్త తిరుమలాచార్యులయ్యవార్లంగారు (మైలవరంపాటూరు) గొట్టుముక్కల కృష్ణమాచార్యస్వామివారు (గుడివాడ) తూపురాణి వెంకటాచార్యస్వామివారు (తిరుపతిపురం) శ్రీమత్తిరుమలపరిపాళ్ళ వెంకటాచార్యులయ్యవార్లంగారు (మాధవరం) శ్రీమత్తిరుమల పురిపాళ్ళ ధర్మాచార్యులుగారు (ఏడిద) గంగాచార్యస్వామివారు (చినకీరంగపురం) శ్రీమతి అమరవాది వెంకట లక్ష్మీనరసమ్మగారు (నరసాపురం)

ఈ సత్సంగమున అనేకానేక సంప్రదాయ విషయములు గూర్చి ఉపన్యాసాదులు జరిగినవి అందు ముఖ్యమైన విషయము లేవియనగా

1 ప్రాతర్నిత్యానుసంధానము
2 దంతధావనాది కాలకృత్యములు
3 శౌచవిధి-స్నానవిధి
4 ఊర్ధ్వపుండ్రధారణవిధి
5 వస్త్రధారణవిధి
6 సంధ్యావందనము
7 తిరువారాధనము
8 భోజనవిధి
9 ధ్యానవిధి జపవిధి
10 భగవద్భాగవత సహ్యోపచారములు
11 ఆళ్వారాచార్య చరిత్రలు
12 మతత్రయములు
13 పురుషకార వైభవము
14 భగవద్భాగవతాచార్య వైభవము
15 అర్థపంచకము
16 తత్త్వత్రయము
ఇత్యాదులు

—: జరిగిన కార్యవిధానము :—

ప్రతి నిత్యము తెల్లవారు ఝామున గం॥ 4-30 నుండి గం॥ 5-0 వరకు అందరును కలిసి సమిష్టిగ ప్రాతర్నిత్యానుసంధానమును గావించుచుండిరి పిమ్మట ఒక అరగంట కాలము హితోపదేశము జరుగుచుండెడిది.

తరువాత ఉద॥ గం॥ 6-30 నుండి గం॥7-0 వరకు ప్రబంధాధ్యయనము పిమ్మట ఉద॥గం॥7-0 నుండి గం॥8-0వరకు మంగళాశాసనము-శాత్తుమొఱ తీర్థప్రసాదగోష్ఠి

అటు పిమ్మట ఉద॥ గం॥ 8-0 నుండి గం॥ 9-0 వరకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణముతో తిరువీధ్యుత్సవము శ్రీ జీయర్ స్వామివారి భిక్షా కార్యక్రమము

తరువాత ఉద గం॥ 9-30 నుండి గం॥11-0 వరకు హోమమంటపమున శ్రీ జీయర్ స్వామివారిచే పంచసంస్కార ప్రదానమును.

ఉపన్యాస మంటపమున పండితులచే ఉపన్యాసములు జరుగుచుండెడివి.

పిమ్మట మధ్యాహ్నము గం॥ 2-0 నుండి గం॥ 3-0 వరకు స్త్రీలచే శ్రీ లక్ష్మీపూజలును

తరువాత మధ్యా గం॥ 3-0 నుండి గం॥4-0 వరకు విదుషీమణుల ఉపన్యాసములు జరుపబడినవి.

తరువాత సాయం గం॥4-0 నుండి గం॥7-30 వరకు పండితోపన్యాసములు జరిగినవి.

పిమ్మట మంగళాశాసనము శాత్తుమొఱ స్తోత్రపాఠానుసంధానము తీర్థప్రసాదగోష్ఠి జరిగినవి.

ఇందలి ప్రతికార్యక్రమమునను సుమారు వందలకొలది స్త్రీలు పురుషులు అత్యుత్సాహముతో పాల్గొనుచుండిరి.

# బదరీశాశ్వతపూజలకు విరాళములు

| | | |
|---|---|---|
| శ్రీ గాజుల తాతయ్యగారు | చావలి | 29-0-0 |
| ,, మొక్కాలి వెంకటప్పగారు | మార్కాపురం | 29-0-0 |
| ,, లక్ష్మీ చెన్న కేశవ యతిరాజసమితివారితరఫున సుగ్రీవు వెంకటలక్ష్మమ్మగారు | మార్కాపురం | 29-0-0 |
| ,, జవ్వాజి అప్పారావుగుప్తగారిభార్య రాజరత్నమ్మగారు | ఏలూరు | 27-0-0 |
| ,, గుత్తా వెంకుబాయమ్మగారు | ఉనికిలి | 27-0-0 |
| ,, ఈమన్నగంటి రంగమ్మగారు | బూరుగడ్డ ఇదివరకు పంపినదిగాక | 159-0-0 |

# బదరీ తాత్కాలికపూజలకు విరాళములు

| | | |
|---|---|---|
| ,, రేచ్చేని లక్ష్మీకాంతమ్మగారు | గురజ | 11-0-0 |
| ,, చెలికాని చినసీతాయమ్మగారు | బొబ్బిలి | 11-0-0 |
| ,, మంగిన పేరుందేవి తాయారమ్మగారు | బందరు | 11-0-0 |
| ,, నల్లానిచక్రవర్తుల కస్తూరిరంగాచార్యులుగారు | తిరుపూరు | 11-0-0 |

# బదరీ కైంకర్యమునకు విరాళములు

| | | |
|---|---|---|
| ,, పద్మనాభుని వెంకటసుబ్బమ్మగారు | ఒంగోలు | 8-0-0 |
| ,, ఉల్చి సుబ్బమ్మగారు, కమలమ్మగారు | ఒంగోలు | 7-0-0 |
| ,, పబ్బిశెట్టి బా॥ గారి భార్య కమలమ్మగారు | ఒంగోలు | 7-0-0 |
| ,, అయితా హనుమంతిశెట్టిగారు | నెల్లూరు | 4-0-0 |
| ,, చుండూరు లీలావతమ్మగారు | నెల్లూరు | 4-0-0 |
| ,, చలువాది వెంకటసుబ్బమ్మగారు | మార్కాపురం | 3-0-0 |
| ,, చక్కా తాయారమ్మగారు | పాలకొల్లు | 4-0-0 |
| ,, ఉనికిలి మహిళాసంఘంవారి తరఫున గుత్తా వెంకుబాయమ్మగారు ఉనికిలి | | 11-0-0 |

# కట్నములు

శ్రీ రామతీర్థములో యతిరాజసేవామహిళామండలివారు శుక్రవారోత్సవార్షికోత్సవము జరిపిన సందర్భమున సంఘమునకుకట్నము. శ్రీ తి. వ. రామప్రియలక్ష్మీనరసమ్మగారిద్వారా సమర్పించినది 5-0-0

# సంభావనలు

26-6-58 ఇనుగంటివారిపేటలో మరింగంటి నరసింహాచార్యులుగారు పరమపదించినసందర్భములో భార్య మరింగంటి క్రిష్ణమ్మగారు సంఘమునకు సమర్పించినది. 2-0-0

22-7-58 బందరు బలభద్ర సుబ్బారావుగారితల్లి సూరమ్మగారు పరమపదించిన సందర్భములో చుండూరు రంగనాయకమ్మగారిద్వారా సమర్పించినది. 5-0-0

2-1-58 ద్వాదశినాడు బలభద్ర సుబ్బమ్మగారు పరమపదించిన సందర్భమున "భక్తినివేదన"కు 4-0-0







# భక్తినివేదన

[వేదాంతమాసపత్రిక]

శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మ




సంపాదకులు

[illegible]

తె. కం. గోపాలాచార్యులు





సహాయ సంపాదకులు.

కవిరత్న

గుదిమెళ్ళ రామానుజాచార్యులు





వికారి-నిజశ్రావణము

సంపుటి ౧౧ సంచిక ౬.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము,
శ్రీ వాసుదాసాశ్రమము - నడిగడ్డపాలెం
చుండూరు (పి. ఓ.) గుంటూరు జిల్లా.

# విళంబి — నిజశ్రావణము భక్తి నివేదన పత్రిక

1958 సం॥ ఆగస్టు 16 మొదలు సెప్టెంబరు 13వరకు

అనుబంధము

| | * విశేషములు * | | | | |
|---|---|---|---|---|---|
| ఆది | 17-8-58 మఖ ౧ వ పాదం<br>20-8-58 మఖ ౨ వ పాదం<br>24-8-58 మఖ 3 వ పాదం | **17**<br>తదియ రా. 2-46<br>పుబ్బ ఉ. 7-21 కు<br>వ. సా. 4-39 ల 6-9 కు | **24**<br>దశమి ప. 11-46 మూల<br>రా. 9-2 వ. శే.వ. ఉ.6-30<br>తిరిగి రా. 2-16 కు | **31**<br>విదియ సా. 3-2 కు<br>ఉత్తరాభాద్ర పూ 8<br>వ. సా. 4-14 ల 6-0 కు | **7**<br>నవమి రా. 12-41<br>మృగశిర రా. 11-47<br>వ. తె. 5-12 |
| సోమ | 25-8-58 సర్వేషాం ఏకాదశి<br>27-8-58 మఖ ౪ వ పాదం<br>ఈనాడు ఋగ్వేదీయులకు ఉపాకర్మ | **18**<br>చవితి రా. 9-27 కు<br>ఉత్తర తె. 5-10<br>వ. సా. 4-48 ల 6-18 కు | **25**<br>ఏకాదశి ప. 10-40<br>పూ.షా. రా. 9-21<br>వ. ప. 8-51 ల 10-27 కు | సెప్టెంబరు **1**<br>తదియ సా. 5-25<br>ఉ. భా 8-8 కు<br>వ. రా. 9-40 ల 11-28 కు | **8**<br>దశమి రా. 12-35<br>ఆర్ద్ర రా. 12-27<br>శేషవర్జ్యం 6-51 |
| మంగళ | 28-8-58 శ్రీ హయగ్రీవ స్వామి అవతారోత్సవము శ్రీ వాసుదాసాశ్రమములో పవిత్రోత్సవములు, శ్రీ వాసుదాసస్వామివారి పరమపదోత్సవములు | **19**<br>పంచమి రా. 9-53<br>హస్త ఉ.6-43 చిత్త తె.5-2<br>వ. ప. 2-10 ల 3 39 కు | **26**<br>ద్వాదశి ప. 10-1 ఉ. షా<br>రా. 10-5 వ. ప. 7-16 ల<br>8-54కు తిరిగి రా. 8-57 కు | **2**<br>చవితి రా. 8-0<br>రేవతి ప. 10-46<br>వర్జ్యంలేదు. | **9**<br>ఏకాదశి రా. 12 0<br>పునర్వసు రా. 9 24<br>వ. ప. 7-24 ల 9-4 కు |
| బుధ | 29-8-58 యజుర్వేదీయులకు ఉపాకర్మ - ◯ పూర్ణిమ | **20**<br>షష్ఠి రా. 8-24<br>స్వాతి తె. 3-26<br>వ. ప. 10-16 ల 11-46 కు | **27**<br>త్రయోదశి ప. 9-54<br>శ్రవణం రా. 11-14<br>వ. తె. 4-34 | **3**<br>పంచమి రా. 8-14<br>అశ్విని ప. 2-21<br>వ. ప. 10-41 ల 11-53 కు | **10**<br>ద్వాదశి రా. 10-57<br>పుష్యమి రా. 11-20<br>శేషవర్జ్యం ఉ. 6-53 కు |
| గురు | 30-8-58 పుబ్బ ౧ వ పాదం<br>3-9-58 పుబ్బ ౨ వ పాదం<br>6-9-58 కణ్ణన్ జయంతి (కృష్ణాష్టమి) పుబ్బ 3 వ పాదం | **21**<br>సప్తమి సా. 5-10<br>విశాఖ రా. 10-27<br>వ. 8-42 ల 10-12 కు | **28**<br>చతుర్దశి ప. 10-17<br>ధనిష్ఠ రా. 1-40<br>వర్జ్యంలేదు | **4**<br>షష్ఠి రా. 9-58<br>భరణి సా. 5-25<br>వ. రా. 3-2 ల 4-47 కు | **11**<br>త్రయోదశి రా. 9-31<br>ఆశ్లేష రా. 8 26<br>వ. రా. 11-17 ల 12.47కు |
| శుక్ర | 9-9-58 సర్వేషాం ఏకాదశి<br>10-9-58 పుబ్బ ౪ వ పాదం<br>13-9-58 ● అమావాస్య ఉత్తర ౧ వ పాదం | **22**<br>అష్టమి ప. 12-24<br>అనూరాధ రా. 12-47<br>వ. ఉ. 6-26 ల 7-56 కు | **29**<br>◯ పూర్ణిమ ప. 11-11 కు<br>శతభిషం రా. 2-50<br>వ. ప 9-29 ల 11-8 కు | **5**<br>సప్తమి రా. 11-20<br>కృత్తిక రా. 8-8<br>వర్జ్యంలేదు. | **12**<br>చతుర్దశి రా. 8-48<br>మఖ రా. 7-22<br>వ. ఉ. 8-40 ల 10-8 కు |
| శని | ఆగస్టు **16**<br>శ్రా. శు. పాడ్యమి ఉ. 6-17కు<br>విదియ మఖ ప. 11-16<br>వ. సా 4-47 మొ 6-14 కు | **23**<br>నవమి ప. 1-14<br>జ్యేష్ఠ రా. 9-58<br>వ. ఉ. 6-10 ల 7-42 కు | **30**<br>బ. పాడ్యమి ప. 12-30<br>పూ. భా. తె. 5-39<br>వ. ప. 9-58 ల 11-39 కు | **6**<br>అష్టమి రా. 12-15 రోహిణి<br>రా. 10-18 కు వ. 10-52 ల<br>12-34 వ. రా. 1-16 ల 2-57 కు | **13**<br>● అమావాస్య సా. 5-39<br>పుబ్బ రా. 6-4<br>వ. రా. 12-49 ల 2-19 కు |

అవ. ఇట్లు రెండు శ్లోకములచే సమష్టిదశను జెప్పి ఈ శ్లోకముచే వ్యష్టి దశను జెప్పుచున్నాడు

6. శ్లో. ఏతద్యోనీని భూతాని । సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః । ప్రభవః ప్రలయ స్తథా॥

అర్థము :— సర్వాణి = సమస్తమైన, భూతాని = బ్రహ్మాదిస్తంభపర్యన్తమైన పదార్థము లన్నియు, ఏతద్యోనీని = చేతనాచేతన ప్రకృతులు రెండింటివలనను పుట్టినవని, ఉపధారయ = నిశ్చయముగా నెఱుంగుము, (కావున) అహం = నేను, కృత్స్నస్య = సమస్తమైన, జగతః = ప్రపంచమునకున్ను, ప్రభవః = కారణమైనవాడను, తథా = అట్లే, ప్రలయః = సంహారకర్తను, (భవామి = అగుచున్నాను.)

తా॥ బ్రహ్మ మొదలు గడ్డిపరక వరకుగల సకల పదార్థములున్ను నా యధీనమైన సమష్టి చేతనాచేతన ప్రకృతులవలననే పుట్టుచున్నవి; గాన, నవియున్నియు నా యధీనమైనవియే. కావుననే నేను సమస్త ప్రపంచమునకును పుట్టుటకును, గిట్టుటకును కారణమైన యజమానినని నిశ్చయముగా నెఱుంగుము.

అవ. కావుననే తనను మించినది లేదనుచున్నాడు.

7. శ్లో. మత్తః పరతరం నాన్యత్ । కిఞ్చి దస్తి ధనఞ్జయ ।

అర్థము :— ధనఞ్జయ = అర్జునా ! మత్తః = నాకంటె, అన్యత్ = మరియొకటి, కిఞ్చిత్ అపి = ఒక్కటియు, పరతరం = గొప్పది, నాస్తి = లేదు.

తా॥ అన్నిటిని పుట్టించు రెండు ప్రకృతులకును కారణమైనవాడను గనుకను, అచేతన వస్తువుల కన్నిటికిని శేషియగు జీవునకును శేషిని గనుకను, నాకంటె గొప్పదియగు పదార్థమేదియును లేదు.

అవ. సకల పదార్థములకును తానే యాధారమని చెప్పుచున్నాడు.

7. శ్లో. మయి సర్వ మిదం ప్రోతం । సూత్రే మణిగణా ఇవ॥

అర్థము :— సూత్రే = దారమునందు, మణిగణాఇవ = మాణిక్య సముదాయమువలెనే, మయి = నాయందు, ఇదం = ఈ చేతనాచేతన సముదాయమంతయు, ప్రోతం = ఆధారపడియున్నది.

తా॥ హారమునందలి మాణిక్యము లన్నియు లోనున్న దారముపై ఆధారపడి యుండునట్లే చేతనాచేతనరూపమైన ప్రపంచ మంతయు నంతర్యామిగానుండు నాపై యాధారపడియుండును.

అవ. ఇట్లన్ని పదార్థములకును భగవంతు డంతర్యామి యగుటచే తనను విడిచి స్వతంత్రముగానుండు పదార్థమొక్కటియు లేనుగాన అన్ని శబ్ద ములకును తానే యర్థమగుమనని చెప్పుచున్నాడు

8. శ్లో. రసో ఽహ మప్సు కౌన్తేయ । ప్రభా ఽస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు । శబ్దః ఖే పౌరుషం నృషు॥

అర్థము - కౌన్తేయ ! = అర్జునా ! అహం = నేను, అప్సు = నీళ్ళయందలి, రసః = రుచిని. (అస్మి = అగుచున్నాను) శశిసూర్యయోః = చంద్రసూర్యుల యందున్న, ప్రభా = కాంతిని, (అస్మి = అగుచున్నాను) సర్వవేదేషు = వేదములన్నిటియందును (ప్రధానమైన). ప్రణవః = ఓమ్కారము. (అస్మి = అగుచున్నాను). ఖే = ఆకాశమునందు (ప్రధానమైన). శబ్దః = ధ్వని. (అస్మి = అగుచున్నాను) నృషు = జీవులయందు (ప్రధానమైన) పౌరుషం = పనిచేయుశక్తి. (అస్మి = అగుచున్నాను.)

తా॥ పరమాత్మలోన లేని పదార్థమే లేదుగాన నీరు పరమాత్మకు శరీరమువంటిది. రుచి యానీటిని విడిచియుండదు కావున రుచియు పరమాత్మకు శరీరమువంటిదే. శరీరమును చెప్పెడు శబ్దము లన్నియు సహజముగ నంతర్యామియైన శరీరినే ముఖ్యముగా జెప్పును. కావున నిచ్చట యంతటను ఆ యా రసాదిశబ్దములచే వాస్తముగ పరమాత్మయే చెప్పబడునుగాన నేనే యా రసాదు లని పరమాత్మ చెప్పుచున్నాడు.

(ఇచ్చట ఆ యా పదార్థములయందలి ప్రధానగుణములు తెలుప బడుచున్నవి).

మరియు ఏవస్తువు దేనివలన పుట్టించబడునో ఆ వస్తువు దానికి శరీరము ఆత్మకువలె పరతంత్రమై దాని నాశ్రయించుకొనియే యుండును. ఈ శ్లోకములలో జెప్పబడు విలక్షణభావములన్నియు పరమాత్మవలననే పుట్టింపబడినవిగాన పరమాత్మకు పరతంత్రమై యుండును. కావుననే, వాటికి వాచకములగు శబ్దములచే పరమాత్మ తెలుపబడును. ప్రకార వాచకశబ్దములు ప్రకారిని బోధించుట సహజమేకదా!

9. శ్లో. పుణ్యో గన్ధః పృథివ్యాం చ । తేజ శ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు । తప శ్చాస్మి తపస్విషు॥

అర్థము :- పృథివ్యాం = భూమియందలి, పుణ్యః గన్ధఃచ = పరిమళమున్ను. (అహం అస్మి = నేనే యగుచున్నాను). విభావసౌ = నిప్పునందలి. తేజశ్చ = కాల్చుశక్తియున్ను. (అహం అస్మి = నేనే యగుచున్నాను). సర్వభూతేషు = బ్రహ్మాది సకలజీవులయందలి, జీవనం = జీవనాధారము. అహం అస్మి = నేనేయగుచున్నాను). తపస్విషు = తపస్సంపన్నులయందలి, తపఃచ = తపస్సున్ను (అహం అస్మి = నేనే యగుచున్నాను.)

తాత్పర్యము సుగమము.

10. శ్లో. బీజం మాం సర్వభూతానాం । విద్ధి పార్థ సనాతనమ్
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి । తేజ స్తేజస్వినా మహమ్॥

అర్థము :- పార్థ! = అర్జునా!, మాం = నన్ను, సర్వభూతానాం = అన్నిస్థావరజంగమములకు, సనాతనం = నిత్యమైన, బీజం = ఉపాదానవస్తువుగా, విద్ధి = తెలుసుకొనుము, అహం = నేను, బుద్ధిమతాం = బుద్ధిమంతులయొక్క బుద్ధిః = జ్ఞానమున్ను, తేజస్వినాం = ప్రతాపవంతులయొక్క. తేజః = పరులనెదిరించుశక్తియున్ను, అస్మి = అగుచున్నాను.

తా॥ అర్జునా! సకల స్థావరజంగమ భూతములకును నేనే ఉపాదాన ద్రవ్యమగువాడను. బుద్ధిమంతులయొక్క వివేకశక్తియు నేనే; ప్రతాపశీలురయొక్క మనోధైర్యమును నేనే యగుచున్నాను.

11. శ్లో. బలం బలవతాం చాహం । కామరాగ వివర్జితమ్
ధర్మా విరుద్ధో భూతేషు । కామో ఽస్మి భరతర్షభ॥

అర్థము :— భరతర్షభ = అర్జునా ! అహం = నేను, బలవతాం = బలముగలవారియొక్క కామరాగవివర్జితం = కామరాగములులేని, బలం = ధారణశక్తియు, భూతేషు = ప్రాణులయందు, ధర్మావిరుద్ధః = ధర్మశాస్త్రమునకు విరుద్ధము కాని, కామఃచ = కామమున్ను, అస్మి = అగుచున్నాను.

తా॥ బలవంతులయందుండు కామరాగములు లేని బలమున్ను, ప్రాణులకు ధర్మవిరుద్ధకాని తన భార్యయందలి ప్రేమ మొదలగు కామమున్ను నేనే యగుచున్నాను.

[విలక్షణమైన పైవస్తువులన్నియు నావల్లనే పుట్టినాయందే నా శరీరమువలె విడువక యుండుటవలన (అనగా ఆయా గుణముల కాధారమైన వస్తువులను నేను విడువక అంతర్యామిగా నుండుటచే ఆయా గుణములున్ను నన్ను విడువక యుండును) వాటిపేరులన్నియు నాకే చెల్లునని భావము.]

అవ. తన వాస్తవస్వరూపోపదేశమును ముగించుచున్నాడు.

12. శ్లో. యే చైవ సాత్వికా భావాః । రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తా న్విద్ధి । న త్వహం తేషు తే మయి॥

అర్థము :— సాత్వికాః = సత్వగుణము ప్రధానముగా కలిగినట్టియు, రాజసాః = రజోగుణము ప్రధానముగా కలిగినట్టియు. తామసాఃచ = తమోగుణము ప్రధానముగాకలిగినట్టియు. యే యే భావాః = ఏ యే పదార్థములుకలవో, తాన్ = వాటిని, మత్తః ఏవఇతి = నానుండియే (పుట్టినవి) యని, విద్ధి = తెలుసుకొనుము. అహం = నేను, తేషు = వాటియందు, న = లేను, తే = అవి, మయి = నాయందు, (సన్తి = కలవు),

తా॥ లోకమున సత్వరజస్తమోగుణములలో నొకొక్కటి ప్రధానముగాగల దేహములు, ఇన్ద్రియములు, భోగ్యవస్తువులు, వాటికి కారణమగు పదార్థములు మొదలగునవి యన్నియు నావలననే పుట్టుచున్నవని యెఱుంగుము. అట్లు పుట్టినను అవి నా యధీనమై నిలుచుచున్నవిగాని నేను వాటి యధీనమునందెన్నడు నుండను.

అవ. ప్రకృతిచే భగవత్స్వరూపము మరుగుపరచబడియుండుననుట తెలుపుచున్నాడు.

13. శ్లో. త్రిభి ర్గుణమయై ర్భావై । రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి । మా మేభ్యః పర మవ్యయమ్॥

అర్థము :— త్రిభిః = మూడైన. గుణమయైః = సత్వరజస్తమోగుణములు ప్రధానముగాగల, ఏభిః = ఈ, భావైః = దేహాదిపదార్థములచే, మోహితం = భ్రమింపజేయబడిన, ఇదం = ఈ, సర్వం = సమస్తమైన, జగత్ = దేవమనుష్యాది ప్రాణిజాతము. మాం = నన్ను. ఏభ్యః = ఈపదార్థములన్నిటికంటె. పరం = మిక్కిలి గొప్పవానినిగాను. అవ్యయం = ఏవికారములులేనివానినిగాను, న అభిజానాతి = ఎఱుంగజాలకున్నది.

తా॥ పూర్వకర్మానుగుణముగ సంభవించిన దేహేంద్రియ భోగ్యపదార్థజాతములచే భ్రమింపజేయబడిన ఈ దేవతిర్యఙ్మనుష్యాది ప్రాణి సమూహమంతయు నన్ను కల్యాణ గుణములచేతను, అప్రాకృత భోగ్యపదార్థ సముదాయములచేతను మిక్కిలి గొప్పవాడననియు సదా నిర్వికారుడననియు నెఱుంగజాలదు.

అవ. ఇట్టి సహజమగు మహాతిశయముగల నీవుండగా, భోక్తలగు మానవులకందరకును నిహీనమగు అస్థిరప్రాకృత పదార్థములయందు ఆదరము మెండుగనుండుట కేమిహేతువనెడు ప్రశ్నకుత్తర మొసంగుచున్నాడు.

14. శ్లో. దైవీ హ్యేషా గుణమయీ । మమ మాయా దురత్యయా॥

అర్థము :— మమ = నాయధీనమైన, గుణమయీ = సత్వరజస్తమోగుణమయమైన, మాయా = ప్రకృతి, దైవీ = నాచే లీలార్థమై ఏర్పరచబడినదిగాన, దురత్యయా = అందరకును, తప్పించుకొనశక్యముకానిదై యున్నది.

తా॥ సత్వరజస్తమోగుణ ప్రచురమైన యీ ప్రకృతిని భగవానుడు లీలాప్రియుడుగాన తన యాట సాగుటకై ఏర్పరచియున్నాడు. కావున, నిది యాతని యధీనమై య్యేయుండును. అందువలననే ఏ లోకములోనున్న ఏ ప్రాణిగాని దీనిబారినుండి తప్పించుకొనజాలదు. ఇట్టి ప్రకృతిచే భ్రమింపజేయబడి లోకము అట్టి మహిమశాలియగు భగవంతుని యెఱుంగజాలకున్నది.

అవ. ఇట్టి మాయబారినుండి తప్పించుకొను నుపాయమును జెప్పుచున్నాడు.

14. శ్లో. మామేవ యే ప్రపద్యన్తే । మాయా మేతాం తరన్తి తే॥

అర్థము :- యే = ఎవరు, మాంఏవ = నన్నే, ప్రపద్యన్తే = ఉపాయముగా నమ్మియున్నారో, తే = వారు, ఏతాం = ఈ, మాయాం = ప్రకృతిని, తరన్తి = దాటుచున్నారు.

తా॥ భగవంతునే ఉపాయముగా నమ్మియుండు పుణ్యాత్ములు యీ మాయనవలీలగా దాటగలరు. అట్టివారే భగవంతు నుపాసింతురు.

అవ. ఇట్లు సులభముగ భగవదనుగ్రహమునకు సాధనమగు భగవదుపాసనను ప్రసాదించు ప్రపత్తినెల్లరును చేయకుండుట కేమికారణమో చెప్పుచున్నాడు—

15. శ్లో. న మాం దుష్కృతినో మూఢాః । ప్రపద్యన్తే నరాధమాః
మాయయా ఽపహృతజ్ఞానాః । ఆసురం భావ మాశ్రితాః॥

అర్థము :- మూఢాః = విపరీతజ్ఞానముకలవారున్ను, నరాధమాః = భగవంతునియందాసక్తి లేని వారున్ను, మాయయా = కూటయుక్తిచే, అపహృతజ్ఞానాః = ఉన్నజ్ఞానమునుపోగొట్టుకొనువారును, ఆసురం = తామసమైన, భావం = స్వభావమును, ఆశ్రితాః = పొందినవారును (అగు) దుష్కృతినః = పాపాత్ములు, మాం = నన్ను, న ప్రపద్యన్తే = ఉపాయముగానమ్మియుండరు.

తా॥ ఆత్మాత్మీయములు నిజముగ భగవదధీనమైనను తన యధీనమని విపరీతముగ తలంచువారును, ఏదోయొక విధముగ భగవంతుని నెఱింగినను ఆతనియందాసక్తి లేనివారును, లభించిన భగవజ్ఞానమును కుయుక్తులచే చెరచుకొనువారును, భగవంతుని బాగుగ నెఱింగియు నాతని ద్వేషించువారును నాలుగువిధములగు పాపాత్ములు. వీరు భగవంతుడే తనకు పురుషార్థము నొసంగు సాధనమని నమ్మజాలరు. (ఇట్లు నమ్మియుండుటయే ప్రపత్తి యనబడును. దీనికే శరణాగతియనియు పేరు)

అవ. ఇక భగవంతుని శరణుజొచ్చి భజించువారెవరో తెలుపుచున్నాడు.

16. శ్లో. చతుర్విధా భజన్తే మాం । జనా స్సుకృతినో ఽర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ । జ్ఞానీ చ భరతర్షభ ! ॥

అర్థము :- భరతర్షభ = భరతవంశమున నుత్తముడవగు, అర్జున! = ఓ యర్జునా ! ఆర్తః = పోయినఐశ్వర్యమునుపొందగోరువాడును, జిజ్ఞాసుః = శుద్ధాత్మ స్వరూపమును పొందగోరువాడును, అర్థార్థీ = నూతనైశ్వర్యము నాశపడు వాడును, జ్ఞానీచ = భగవంతునిపొందగోరువాడును(అను) చతుర్విధాః = నాలుగు రకములైన, సుకృతినః = పుణ్యాత్ములగు. జనాః = జనులు, మాం = నన్ను, భజన్తే = ఉపాసించుచున్నారు.

తా॥ పోయిన ఐశ్వర్యమును పొందగోరువారును, నూతనైశ్వర్యము నాశించువారును, శుద్ధాత్మానుభవరూపమైన కైవల్యమును పొందగోరువారును, భగవంతునే ముఖ్యముగా బడయగోరు వారును అను నీ నాలుగు విధములైన పుణ్యాత్ములు భగవంతుని ఉపాసింతురు. (వీరిలో మొదటి యిద్దరును పర్యవసానమును ధన మునే కోరువారుగాన ఒకటిగాచేర్చి భక్తులు ముత్తెరగులని భాష్యకారులు సాయించిరి.)

అవ. ఈ నలుగురిలోను జ్ఞానియొక్క అతిశయమును జెప్పుచున్నాడు.

17. శ్లో. తేషాం జ్ఞానీ నిత్యయుక్తః । ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినో త్యర్థ । మహం స చ మమ ప్రియః॥

అర్థము :- తేషాం = ఆ నలుగురుభక్తులలో, నిత్యయుక్తః = (నాతో) నిత్యసంబంధ ముకలిగినట్టియు, ఏకభక్తిః = నాయందుమాత్రమే భక్తికలవాడునుఅగు జ్ఞానీ = ఉపాసకుడు, విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు, అహం = నేను, జ్ఞానినః = ఉపాసకునకు, అత్యర్థం = నేనేచెప్పజాలనంత, ప్రియఃహి = ఇష్టుడనుగదా ! సఃచ = ఆ ఉపాసకుడును, మమ = నాకు, ప్రియః = (అంత) ఇష్టుడు. (భవతి = అగుచున్నాడు)

తా॥ ఈ నలుగురు భక్తులలో ఉపాసకు (జ్ఞాని) నకు నేనే ఫలముగాన నాతో సంబంధమాతనికి నిత్యము. ఆతనికి భక్తియు నాయొక్క నియందే యుండును. కావున నాతడుత్తముడు. నేను సర్వజ్ఞుడను సర్వశక్తికలవాడనైనను ఆతనికి నాయందుగల ప్రేమను చెప్ప జాలను. నేనుకూడ నాతని నంతగనే ప్రేమింతును.

అవ. ఇంకను జ్ఞానియొక్క అతిశయమునే జెప్పుచున్నాడు.

18. శ్లో. ఉదారా స్సర్వ ఏవైతే । జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్స హి యుక్తాత్మా । మామే వానుత్తమాం గతిమ్॥

అర్థము :— ఏతే-సర్వే = వీరందరును. మే = నాకు. ఉదారాః ఏవ = దాతలే. జ్ఞానీ తు = జ్ఞానియన్ననో, ఆత్మైవ = (నా) యాత్మయే (యని) మే = నాయొక్క. మతం = నిశ్చయము. హి = ఏమనగా. సః = వాడు, యుక్తాత్మా = నాసంబంధము నాశించు మనస్సుకలవాడై, మాం ఏవ = నన్నే. అనుత్తమాం = సర్వోత్తమమైన. గతిం = పొందదగినస్థానముగా, ఆస్థితః = నిశ్చయించినవాడు, (భవతి = అగుచున్నాడు)

తా॥ ఈ నలుగురును నన్నే ఉపాసించి నావలననే ఫలమును పొందు వారుగాన *నాకు దాతలేయగుచున్నారు. కాని జ్ఞానిమాత్రము ఆత్మ, శరీరమున కాధారమైనట్లు నా కాధారమైయున్నాడు. వాడు నన్నే సర్వోత్కృష్టమైన పొందదగిన స్థానమని నమ్మి యున్నాడు. కావున, వానిని విడిచి నేను నిలువజాలను; అందుచే వాడు నాకు ఆత్మయే.

*(ఆశ్రితులు కోరినదెల్లను యిచ్చుట భగవంతుని సర్వస్వము. అది వీరివలన ప్రకాశించుచున్నదిగాన వీరు భగవంతునకు సర్వస్వము నిచ్చుచున్నారు. కావున ఉదారులే.)

అవ. ఇట్టి జ్ఞాని యగుట కనేక జన్మలలో నార్జించిన పుణ్యమే కారణమనుచున్నాడు.

19. శ్లో. బహూనాం జన్మనా మన్తే । జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి । స మహాత్మా సుదుర్లభః॥

అర్థము :— బహూనాం = అనేకములైన. జన్మనాం = పుణ్యజన్మలయొక్క, అన్తే = చివరకు. జ్ఞానవాన్ = బుద్ధిమంతుడు. భూత్వా = అయి. వాసుదేవఃఏవ = వాసుదేవుడే. సర్వం = సమస్తమున్ను. ఇతి = అని, మాం = నన్ను. ప్రపద్యతే = ఉపాసించుచున్నాడు. సః = అట్టి. మహాత్మా = పుణ్యాత్ముడు. సుదుర్లభః = మిక్కిలి దుర్లభుడు, (భవతి = అగుచున్నాడు)

తా॥ అనేక పుణ్యజన్మల నెత్తగా నెత్తగా చివరకెప్పుడో జ్ఞానము కల వాడై నేనే తనకు ఫలమును, ఉపాయమును, సర్వస్వమును అని తలంచి నన్నాశ్రయించును. అట్టి మహాత్ముడు లోకమున మిక్కిలి దుర్లభుడు.

అవ. జ్ఞాని యంత దుర్లభుడగుటకు కారణమును జెప్పుచున్నాడు.

20. శ్లో. కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః । ప్రపద్యన్తే ఽన్యదేవతాః
తం తం నియమ మాస్థాయ । ప్రకృత్యా నియతా స్వయా॥

అర్థము :- స్వయా = తమదైన, ప్రకృత్యా = పాపవాసనతో, నియతాః = నిత్య సంబంధము కలవారును, తైః తైః = ఆయా, కామైః = కోరికలచేత, హృతజ్ఞానాః = అపహరింపబడిన జ్ఞానముకలవారునుఅయి, తంతం = ఆయా, నియమం = నియమమును, ఆస్థాయ = అవలంబించి, అన్య దేవతాః = ఇతర దేవతలను, ప్రపద్యన్తే = ఆశ్రయించి యర్చించు చున్నారు.

తా॥ లోకులందరును పాపవాసనతో తప్పక కూడియుందురు. వారా వాసనకు తగినట్లే సత్త్వాదిగుణమయములైన వస్తువులను కోరు చుందురు. దానిచే వారికి నా సంబంధమగు జ్ఞానము పోవును. అందుచే వారు ఇంద్రాది యితర దేవతలనే ఆ యా యారాధనా నియమములతో నాశ్రయించి యారాధింతురు.

అవ. ఇకముందు రెండుశ్లోకములచే ఆ దేవతాంతరారాధనయు వ్యర్థముగాకుండ ఫలపర్యవసాయి యగునట్లు తానే దయతో చేతునని చెప్పుచున్నాడు.

21. శ్లో. యోయోయాంయాం తనుంభక్తః । శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి
తస్య తస్యా చలాం శ్రద్ధాం । తా మేవ విదధా మ్యహమ్॥

అర్థము :- యః-యః = ఎవడెవడు, యాం యాం = ఏయే, తనుం = శరీరమును, భక్తః = భక్తికలవాడగుచు, శ్రద్ధయా = శ్రద్ధతో, అర్చితుం = పూజించు టకు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తస్య తస్య = ఆయా పురుషునకు, తాం = ఆ, శ్రద్ధాం ఏవ = శ్రద్ధనే, అచలాం = ఆటంకములులేనిదానినిగా, విదధామి = చేయుచున్నాను.

తా॥ బ్రహ్మాది దేవతలందరును నాకు శరీరమువంటివారే. ఏ భక్తుడు నా దేహమును ఏ రూపమున శ్రద్ధతో పూజింపగోరునో వానికి అట్టి నా దేహమునందే ఆ శ్రద్ధనే ఏవిధమైన విఘ్నములచేతను చెడకుండునట్లు చేయుదును.

22. శ్లో. స తయా శ్రద్ధయా యుక్తః । తస్యా రాధన మీహతే
లభతే చ తతః కామాన్ । మయైవ విహితాన్ హి తాన్॥

అర్థము :– సః = ఆభక్తుడు, తయా = ఆ (నిశ్చలమైన) శ్రద్ధయా = శ్రద్ధతో, యుక్తః = కూడినవాడై, తస్య = ఆదేవతయొక్క, ఆరాధనం = పూజను, ఈహతే = కోరుచున్నాడు. తతః = ఆ యారాధనవలన, తాన్కామాన్ హి = ఆ పదార్థములనే, మయాఏవ = నాచేతనే, విహితాన్ = ఇవ్వబడినవాటిని, లభతే = పొందుచున్నాడు

తా॥ ఆభక్తుడు నేనను గ్రహించిన ఆ నిశ్చలశ్రద్ధతో ఆ యింద్రాదుల నారాధించగోరును. ఆ యింద్రాదులు నాకు శరీరమువంటివారే గాన నిజమున కా యారాధన నాదియే. కావున, నే నా యారాధనవలన సంతుష్టుడనై వాడుకోరిన వస్తువులను ఆ దేవతల యధికారమునకు తగినట్లుగా ఆయా దేవతలచే నిప్పించుచుందును.

అవ. అయినచో భగవదుపాసకులకును దేవతోపాసకులకును తారతమ్యమేమి? ఉభయులకును ఫలమొసంగువాడు నిజమున కా భగవంతుడేగదా!

23. శ్లో. అన్తవత్తు ఫలం తేషాం । త ద్భవ త్యల్పమేధసామ్
దేవాన్దేవయజో యాన్తి । మద్భక్తా యాన్తి మా మపి॥

అర్థము :– అల్పమేధసాం = స్వల్పబుద్ధిగల, తేషాం = అట్టిభక్తులకు, తత్ఫలంతు = ఆ లభించు ఫలమన్ననో, అన్తవత్ = నాశముకలది, భవతి = అగుచున్నది. దేవయజః = దేవతలను పూజించువారు, దేవాన్ = ఆ దేవతలను, యాన్తి = పొందుచున్నారు, మద్భక్తాః అపి = నాభక్తులున్ను, మాం = నన్నే, యాన్తి = పొందుచున్నారు.

తా॥ అట్టి యల్పదేవతలను అల్పఫలములకై పూజించు అల్పులకు అల్పమును నశ్వరమునునగు ఫలమేలభించును. ఏల ననగా వారారాధించు దేవతలనుభవించు భోగములు పరిమితములే. అందువలన వారొసంగు భోగములును పరిమితములే యగుచున్నవి. ఇక నాభక్తులన్ననో నాభోగములతో సమానమైన భోగములనే యనుభవింతురు. నాభోగములు నిత్యములును అపారములును గాన వారును అట్లే యనుభవింతురు.

అవ. ఉత్తమపురుషార్థములనొసంగు భగవంతుడు కాన్పించకున్నగదా అల్పఫలముల నొసంగు ఇతరదేవతల నాశ్రయింతురు. అందరును తన నాశ్రయించ వలెననిగదా భగవంతు డవతరించి యందఱకును గోచరించు చున్నాడు. అట్టితరి ఆతనివిడిచి దేవతాంతరముల నేల యుపాసించుచున్నారో చెప్పుచున్నాడు

24. శ్లో. అవ్యక్తం వ్యక్తి మాపన్నం । మన్యన్తే మా మబుద్ధయః
పరం భావ మజానన్తో । మమా ఽవ్యయ మనుత్తమమ్॥

అర్థము ,– అబుద్ధయః = జ్ఞానహీనులు, మమ = నాయొక్క, అవ్యయం = నిత్య మైనదియు. అనుత్తమం = సర్వోత్కృష్టమైనదియునగు, పరంభావం = గొప్ప స్వభావమును. అజానన్తః = ఎఱుంగనివారై. మాం = నన్ను. అవ్యక్తం = (ఇంతకుపూర్వము) తెలియబడనివాడనై. వ్యక్తిం = (ఇప్పుడు) తెలియబడుటను. ఆపన్నం = పొందినవానినిగా, మన్యన్తే = తలంచుచున్నారు.

తా॥ నిత్యమై నిరతిశయమగు నా యుత్కృష్ట స్వభావమును ఎఱుంగని మూఢులు నన్ను తమవలెనే పూర్వము తెలియబడనివాడనైయుండి ఇప్పుడు కర్మవశమున పుట్టి తెలియబడుచున్న వానినిగా తలంతురు.

అవ. ఇట్లు వారు తన స్వభావము నెఱుంగకుండుటకు కారణమును జెప్పుచున్నాడు.

25. శ్లో. నా ఽహం ప్రకాశ స్సర్వస్య । యోగమాయాసమావృతః
మూఢోఽయంనాఽభిజానాతి । లోకో మా మజమవ్యయమ్॥

అర్థము :– యోగమాయా సమావృతః = శరీరసంబంధమనెడు మాయచే నావరింప బడిన, అహం = నేను, సర్వస్య = అందఱకును, ప్రకాశః = గోచరించువాడను, న = కాను, మూఢః = మోహమునుజెందిన, అయం, లోకః = ఈ జనము, మాం = నన్ను, అజం = పుట్టనివాడను, అవ్యయం = నశించనివాడను (అని) న అభిజానాతి = ఎఱుంగదు.

తా॥ మనుష్య శరీరముతో నవతరించినవాడ నగుటచే నాయుత్కృష్ట స్వభావ మెల్లరకు గోచరించదు. అందుచే లోకులు మూఢులై నన్ను పుట్టుట గిట్టుట మొదలగు వికారములు లేనివానినిగ నెఱుంగజాలకున్నారు.

అవ. ఈ లోకముననున్న మానవులేకాదు ముల్లోకములయందలి భూతములుకూడ నన్నెఱుంగజాలవని చెప్పుచున్నాడు.

26\. శ్లో. వేదా ఽహం సమతీతాని । వర్తమానాని చా ర్జున
భవిష్యాణి చ భూతాని । మాం తు వేద న కశ్చన॥

అర్థము :– అర్జున = అర్జునుడా ! అహం = నేను, సమతీతాని = పుట్టినట్టియు, వర్తమానాని = పుట్టుచున్నట్టియు, భవిష్యాణి = పుట్టబోవునట్టియు, భూతాని = ప్రాణులను, వేద = ఎఱుంగుదును, మాంతు = నన్నైతే, కశ్చన = ఒక ప్రాణియు, నవేద = ఎఱుంగజాలదు.

తా॥ అర్జునా! భూతభవిష్యద్వర్తమాన కాలములలో నుండు సకల ప్రాణులను నేనెఱుంగుదును. కాని, నాతత్త్వమెఱింగి నన్నే ఆశ్రయించు ప్రాణియొక్కటియు లేదు.

అవ. ఇట్లు ఏ ప్రాణియు భగవత్తత్త్వము నెఱుంగజాలకుండుటకు కారణమును జెప్పుచున్నాడు.

27\. శ్లో. ఇచ్ఛాద్వేషసముత్థేన । ద్వన్ద్వమోహేన భారత !
సర్వభూతాని సమ్మోహం । సర్గే యాన్తి పరన్తప ! ॥

అర్థము :– పరన్తప = శత్రువుల తపింపజేయు, భారత = అర్జునా ; సర్వభూతాని = ప్రాణులన్నియు, సర్గే = పుట్టునప్పుడే, ఇచ్ఛాద్వేషసముత్థేన = అభిలాష ద్వేషములవలన కలిగిన, ద్వన్ద్వమోహేన = శీతోష్ణాది ద్వంద్వములనెడు మోహసామగ్రిచేత, సమ్మోహం = భ్రాంతిని, యాన్తి = పొందుచున్నవి.

తా॥ అర్జునా ! పూర్వజన్మమున అభిలాష విద్వేషములు ఏద్వంద్వములయందు నెలకొనియుండెనో ఆ జీవుడు పుట్టినపుడు తిరిగి ఆద్వంద్వములయందలి ఇచ్ఛాద్వేషములతోనే పుట్టును. దానిచే వీనికి అభోగ్యములయందు భోగ్యములనెడు బుద్ధియు, అద్వేష్యములయందు ద్వేషింప తగినవనెడు బుద్ధియు (ఇదియే సంమోహము) పుట్టుచుండును. అందుచే భగవంతుని సంశ్లేషమే సుఖమనియు ఆతని నెడబాయుటయే దుఃఖమనియు తలంపజాలడు.

అవ. ఇట్టి సమ్మోహము ప్రతి ప్రాణికిని నియతమేగదా, అట్టితరి ఇక భగవదుపాసన చేయువాడెవడు ? అట్లగుచో 'చతుర్విధా భజన్తే మాం' అను శ్లోకమున కర్థమేమి ?

28. శ్లో. యేషాం త్వన్తగతం పాపం । జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వన్ద్వమోహ నిర్ముక్తా । భజన్తే మాం దృఢవ్రతాః॥

అర్థము :— పుణ్యకర్మణాం = పుణ్యకర్మల నాచరించునట్టి, యేషాం జనానాం = ఏ జనులయొక్క, పాపంతు = పాపమైతే, అన్తగతం = నశించినదో, తే = వారు, ద్వన్ద్వమోహవినిర్ముక్తాః = ద్వంద్వరూపమైన అజ్ఞానము నుండి విడువబడినవారై, దృఢవ్రతాః = చలించని సంకల్పముకలవారై, మాం = నన్ను, భజన్తే = ఉపాసించుచున్నారు.

తా॥ ఎవరికి అనాదియగు పాపరాశియంతయు పుణ్యకర్మానుష్ఠానముచే క్షీణించునో వారునన్ను శరణజొచ్చి గుణమయములగు ద్వంద్వములవలన కలుగునట్టి మోహామునువీడి ఐశ్వర్యకైవల్య భగవల్లాభములకొఱకు గట్టి పట్టుదలతో నన్నుపాసింతురు.

అవ. అర్థార్థీ, జిజ్ఞాసు, జ్ఞానీయనెడు ముగ్గురు భక్తులకును తెలుసుకొనవలసినట్టియు, పరిగ్రహించదగినట్టియు విషయములను చెప్పుచున్నాడు.

29. శ్లో. జరామరణమోక్షాయ । మా మాశ్రిత్య యతన్తి యే
తే బ్రహ్మతద్విదుః కృత్స్నం । అధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

అర్థము :— జరామరణ మోక్షాయ = ముసలితనము చావులేకుండుటకొఱకై, మాం = నన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, యే = ఎవరు, యతన్తి = ప్రయత్నించుచున్నారో, తే = వారు, తత్ బ్రహ్మ = ఆ బ్రహ్మను, కృత్స్నం = సంపూర్ణమైన, అధ్యాత్మం = అధ్యాత్మమును, అఖిలం = సమస్తమైన, కర్మ చ = కర్మనున్ను, విదుః = ఎఱుంగుదురు

తా॥ ఎవరు నన్నాశ్రయించి శుద్ధాత్మ స్వరూపము లభించుటకై ప్రయత్నింతురో వారా బ్రహ్మమును పూర్ణమైన అధ్యాత్మమును సకల కర్మలను ఎఱుంగవలెను.

30. శ్లో. సాధిభూతాధిదైవం మాం । సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలే ఽపి చ మాం । తే విదు ర్యుక్తచేతసః॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానవిజ్ఞాన యోగోనామ సప్తమోఽధ్యాయః

అర్థము :- యే = ఎవరు, మాం = నన్ను, సాధిభూతాధిదైవం = అధిభూతముతోను, అధిదైవముతోను కూడిన వానినిగాను, సాధియజ్ఞం = అధియజ్ఞముతో కూడినవానినిగాను, విదుః = ఎఱుంగుచున్నారో, తే చ = వారున్ను, ప్రయాణకాలేఽపి = మరణకాలమందుకూడ, యుక్తచేతసః = స్వాధీనమందున్న మనస్సుకలవారై, మాం = నన్ను, విదుః = ఎఱుంగుదురు.

తా॥ నన్ను అధిభూతముతో కూడినవానినిగాను, అధిదైవముతో కూడినవానినిగాను, అధియజ్ఞముతో కూడినవానినిగాను తెలుసుకొనినవారును, చనిపోవు సమయమందుకూడ నాయందే నియమింపబడిన మనస్సుకలవారును వారుకోరెడు ఫలములకు తగినట్లు నన్నెఱుంగవలెను.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి జ్ఞానవిజ్ఞానయోగమనెడు ఏడవ అధ్యాయము.

## అష్టమాధ్యాయార్థ సంగ్రహము

శ్లో. ఐశ్వర్యాక్షర యాథాత్మ్య । భగవచ్చరణార్థినామ్
వేద్యోపాదేయభావానా । మష్టమే భేద ఉచ్యతే॥

అర్థము - ఐశ్వర్య = ఐశ్వర్యమును, అక్షరయాథాత్మ్య = శుద్ధాత్మస్వరూపమును, భగవచ్చరణ = భగవచ్చరణమును, అర్థినాం = కోరువారలకు, వేద్య = తెలియదగినవాటియొక్కయు, ఉపాదేయ = చేయదగినవాటియొక్కయు, భేదః = భేదము, అష్టమే = ఎనిమిదవయధ్యాయమున, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా. భగవద్భక్తులు బ్రహ్మేంద్రేంద్రాది భోగములకు మించిన భోగములు కోరువారనియు, కైవల్యమనబడు ప్రకృతి గంధములేని పరిశుద్ధఆత్మ స్వరూపమును బడయగోరువారనియు, భగవత్సాయుజ్యమనబడు పరమపురుషార్థమైన మోక్షము నపేక్షించువారనియు మూడువిధములుగనుందురు. అట్టివారికి వారి వారి అధికారానుగుణముగ భగవదైశ్వర్యము, శుద్ధాత్మస్వరూపము, పరమపురుష స్వరూపము అర్చిరాదిమార్గముల నెఱుంగుటయు, వాటిని మరణసమయమువరకు దృఢముగ ధ్యానించుచుండుటయు ఆవశ్యకము. ఈ విషయములన్నియు నీ యెనిమిదవయధ్యాయమున వేరువేరుగా జెప్పబడుచున్నవి.

# శ్రీ భగవద్గీత - అష్టమాధ్యాయము

## వి ష య సూ చి క

శ్లోక సంఖ్య.



# ప్రథమరహస్యము




శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు



[పద్యరూపముగా రచించిన రహస్యత్రయమునుండి ప్రస్తుతము ప్రథమరహస్యమను తిరుమంత్ర భాగములోఁ గొన్ని పద్యములు మాత్రమే యిందు ప్రచురింపఁబడినవి.]

చం. ప్రణవపదంబులో- "అ-ఉ-మ-" వర్ణములున్నవి, వేదసారసం
జనితములవ్వి వానినిట సంమిళితంబును జేయనయ్యె "ఓ"
మనుచుఁ దదర్థవైభవము నారసి చూడఁగఁ దేలెనిట్లు, చే
తనుఁడు రమేశు కొక్కనికె తప్పక దాసుఁడు కాఁడిఁ కేరికిన్.

చం. అనఁగ- "అకార" శబ్దమున కర్థము, విష్ణువు, లోకసృష్టి ర
క్షణ లయకారి యాతఁడు- "మకార"ముచేతను వాచ్యుఁడయ్యెఁ జే
తనుఁడు- "ఉకార" మన్న నవధారణవాచకమై వచించు, న
న్యునకిది శేషవస్తు వగు టొప్పదు, వానికి గాక యెన్నఁడున్.

ఉ. తత్త్వము నెంచిచూడ పరతత్త్వము విష్ణువుగాన పై నశే
షత్వమె యాత్మకెప్డు సహజంబగునట్టి స్వరూపమౌట బం
ధుత్వము నీచిదీశులకు దోపఁగఁ జేయుచు నీ పదమ్మె శే
షత్వ మనన్యయోగ్యముగ జాటుచున్నది జీవకోటికిన్.

చం. ఉపకరణమ్మువోలె వినియోగము సేయఁగ నర్హుఁడైన వా
డెపుడిట జీవుఁడీశునకు నీవిధినుండుటె, శేషలక్షణం
"బుపరి" శరీరమెట్లు మనకున్నదొ లోబడి వీడకూడ, వి
శ్వపతి యథేష్టభోగతకుఁ జాలు స్వతంత్రత లేదు వీసమున్.

ఉ. ఆరయ బంధమోక్షములయందు స్వయమ్ముగ దాసభూతు లీ
శ్రీరమణీ హృదీశునకు జీవులు వేరొకలక్షణ మెంతమాత్ర మా
ధారము లేద- యిట్టి పరతంత్రత భాగవతోత్త మావధి
స్ఫారిత మాఫిరాట్టి యనపాయిని భర్తకుగాన యామెకున్.

చం. ప్రణవపదమ్ముచేతఁ బ్రతిపాదితమైన గభీరభావమే
మనఁగ- అకారవాచ్య పరమాత్మకు జీవుఁడు శేషభూతుఁడై
యునికి స్వరూపసిద్ధముగ నున్నదటంచును దేలెఁగానఁ జే
తనుఁడొక సొమ్ము, స్వామిహరి; దాచుట వాడుట వానికేగదా.

కం. ఒకసారి ప్రణవసన్నిధి
నొకతరి "నారాయణాయ" యొద్దకు, జని, వే
రొకతరి స్వస్థితి వీడక
ప్రకటించునిటన్ నమస్సు భావత్రయమున్.

ఉ. జీవుని స్వస్వరూపమును జెప్పి యుపాయము నానతిచ్చి యా
పై, వివరించు నీపదము ప్రాప్యము, నిట్లనఁగా, స్వతంత్రతా
భావము శేషియైన భగవంతునకే తగుగాని కూడదీ
జీవున కన్యులేరికిని జేర్చినచోఁ బ్రణవమ్ముతో "నమః"

ఉ. చేతన రక్షణమ్ము హరిచేత నిలంబడి యుండెగాని నా
చేత లవమ్ము లేదనుచుఁ జేతనుఁడెంచుచు నన్యదేవతా
ప్రీతిని మానగావలయు వీరికి రక్షణ శక్తి లేమి- యీ
రీతి "నమఃపదమ్ము" వివరించు "నమోనమ"యంచు స్వస్థితిన్.

కం. నాకైంకర్యము సర్వము
శ్రీ కమునకొప్ప పొత్తు చెల్లకపోగా
పోకూడ దన్యులేరికి
నాకును "నారాయణాయ నమ"యని తెలుపన్.

ఉ. పాపముగాదె! యిద్ది భగవద్విషయమ్మున దాను స్వామిసా
త్తై, పడియుండఁగా- "నితరథా" తలపోయుట, చోరుఁడన్న నీ
పాపి-కృతఘ్నుఁడన్న నిటువంటిదె స్వామితయున్, స్వతంత్రతల్
శ్రీపతిపూనె దాస్యమును జీవునకున్నవి పారతంత్ర్యమున్.

చం. పరులకు దాస్యమున్ సలుపు వారికి లేవు స్వతంత్రతల్, నమ
స్కరణము చేతఁ బోవు మమకారమహంకృతి, జీవుఁడెప్పు డీ
శ్వర పరతంత్రుఁడౌట, నిరుపాధిక బంధువువాడు కావునన్
భరము సమస్త మా విభునపై నిడి తాను తరింపఁగావలెన్.

ఉ. చేతనుఁడా శ్రియఃపతికె శేషుఁడు, నాకొఅకంచుఁజూడరా
దా-తరువాత- నారమననయ్యె రశబ్దము, ముందు "రక్షయే"
ధాతువుచే క్షయించను పదార్థము తెల్పు- నకారమన్న నా
రీతిగ గాదటంచు వివరింప- "నరా"యయి తత్సమూహామే

ఉ. ఆమెను "నారమంచును, తదర్థము, నిత్యసమూహమాట "త
స్యాయన" మిణ్గతా వయనశబ్దముపాయ "మనేన ఈయతే"
"ఈయత" ఇత్యుపేయమయి యేర్పడియుండుట, తెలెనిట్లు "నా
రాయణ'' నాపదంబగు సమన్వయమింక ననేకరీతులన్.

ఉ. ఆయనమహాత్మమూర్తి కొఱకయ్యెడుఁగావుత, నెల్ల వారికిన్
ధ్యేయములౌ సకలదేశదశాసమయమ్ములందు, నే
జేయు సమస్తసేవలును జేతన కృత్యము తప్పకుండ నా
రాయణమూర్తికే యనుచు, ''ఆయ'' చతుర్థియుఁగూడ తెల్పెడున్.

కం. "నారాణా'' మయనుండన
"నారా అయనం హి యస్య" నారాయణనా
నీ రెండింటను దెలుపును
శౌరిస్వామిత్వపరత్వ సౌలభ్యంబుల్

చం. తనువును దానుగాఁ దలచు తప్పడుత్రోవకు బోవగల్గుచో
''మన అవబోధనే'' యనెడు మాటను మాత్రము వీడరాదను
క్షణపరిణామశీలమగు కాయమదెక్కడ? జ్ఞానరూపమై
యణువగు నాత్మయేడ! యిటులారయ తద్భ్రమతీరకుండునే !

ఉ. పూని స్వతంత్రుడన్న భ్రమపుట్టి కనుంగవ కానరానిదో
తా ''నవరక్షణే''యనెడు ధాతువులోని ''అకారవాచ్యుఁడౌ
వాని స్మరింపగావలయు, వార్ధి తరంగము రీతినేను ల
క్ష్మీశుని వీడియుండిన నశించనె నాగతి పారతంత్ర్యమే.

కం. పరులకు శేషుఁడనను తరి
నరయుండవ ధారణార్థమైన, ''ఉకార''
స్ఫురదర్థశక్తి-హరికే
పరతంత్రుడగాని కాను పరులకు నెపుడున్.

గీ. స్వాత్మరక్షణమందుఁ బ్రయత్నమున్న
మదిని స్మరియింపవలయు నమః పదమ్ము
ఆయనకు నేనుదాసుండ నతఁడు స్వామి
నన్ను రక్షించుకొనుశక్తి నాకుగలదె.

కం. నారాయణ శబ్దార్థం
బారయ - ఆభాసబాంధ వ్యాసేయమున్నన్
వాసు, స్మరించిన తద్భ్రమ
తీరెడు నీకీతినుండె తిరుమంత్రమనన్

చం. గురువులయందు భక్తియొనగూడని కూళకు దీసిజెప్పగా
గరము నిరర్థకంబనధికారులు తాదృశులైనవారె యీ
పరమరహస్యదాత భగవంతుడుగా మదినెంచువాడె దు
స్తరభవఘోర వారిధిని దాటెడువాడని నమ్మగా వలెన్.

ఉ. మంత్రమునందు మంత్రమహిమ ప్రతిపాదితవస్తువందు, త
న్మంత్రము నిచ్చినట్టి గురునందున ప్రేముడి కల్గియున్న నీ
మంత్రము మోక్షకాములకు మంచి ఫలమ్మొనగూర్చు నెంతయున్
మంత్రముగాన గోప్యముగమాత్రము దీని స్మరింపగావలెన్.

ఉ. కాని, నరప్రణీతమునుగానిది "వేదయతీతి విగ్రహం"
బూని స్వతః ప్రమాణమయిపొల్చు శ్రుతిన్ గృపసేసినన్, రమా
జాని, తదర్థమున్ గనంగజాలక, పైన దురర్థమందు సం
ధానముసేయుచున్ దనువు తానను దుర్భ్రమతో మెలంగుచున్

ఉ. హీనను మాటలేక, విపరీతపుజ్ఞానము కల్గువారలై
శ్రీయుతునొక్కనాడయిన సేవయొనర్పక తాపవిచ్యుత
జ్ఞేయరహస్యులౌచుం గృపంజేసిన శాస్త్రములైనంజూడక
య్యో! యిది మీరియుంటిమను చుమ్మలికంబునులేక భ్రష్టులై

ఉ. పోవుచునుండంజూచి కృపమూర్తి ధరించిన రీతినున్న, ప
ద్మావనితామనోహరుండు తానె గురుండయి తానె శిష్యుడై
కావంగ లోకమున్ బదరికావనమందున వెళ్ళడించె నీ
పావనమంత్ర మెల్లరిటు వర్తిలగన్ గురుశిష్యులై ఖరిన్

* * * *

చం. విషయమపారమాట నరవీసములోని శతాంశమైన శే
ముషి శ్రమపెట్టికూడ బుధపుంగవులార! వచింపనైతి, నా
కృషి విషమింపనేని, ఫలియించిననేమి ఫలమ్ము సర్వమా
విషధరశాయికే విడచిపెట్టితి నేను నిమిత్తమాత్రమే.



# బదరీ వార్తలు

(శ్రీ వి. ప్ర. సం. కార్యదర్శి శ్రీమాన్ విద్వాన్ కె. కం. గోపాలాచార్యులు)

మేము బదరికి సురక్షితముగా చేరితిని. ఆ మరునాడు సూర్యోదయమే లేదు. చలికి అంతులేదు. రెండవనాడు 1/2 అంగుళం మంచు పగలంతయు కురిసినది. షుమారు బదరిచుట్టు 8 మైళ్ళు వెండి కరగిపోసినట్లైనది. పెద్ద పెద్ద వడగళ్ళు ఒకగంటకాలము కుప్పతెప్పలుగా పడినవి. ఇందుమూలమున జ్యేష్ఠమాసములో ఇదివరకెన్నడెఱుగనంత చలి ఆరంభించినది. ఈ చలిచే పనివారెవ్వరునూ రాక పనులన్నియు నిలచిపోయెను. ఇకనొక వారములో పని ప్రారంభమగుట ప్రారంభమగును. ఎండకాయుచున్నది. గాలికి శరీరభాగమంతయు పగిలి రక్తము స్రవించుచున్నది. ఇట్టి విపరీతపరస్థితులలో కూడ మే 11 వ తేది మొదలు మే నెల ఆఖరు వరకు 35 వేల యాత్రికులు వచ్చినట్లు గవర్నమెంటువారి లెక్కలవలన తేలినది. ఇందులో మన ఆంధ్రప్రాంతమునుండి వచ్చినవారే హెచ్చు. 7, 8 స్పెషల్ భోగీలలోను రైళ్ళలోను వివిధప్రాంతములనుండి వేరువేరుగా ఆంధ్రప్రాంతీయ యాత్రికులువచ్చిరి. ఇచ్చట మన అష్టాక్షరీమహాక్షేత్రము తయారైనపిమ్మట యాత్రావాసులు బదరికి స్వగృహమునకేగినంత ఉత్సాహములో రాగలరు. ఈ శ్రావణమాసమునకు శ్రీ అష్టాక్షరీ మహాక్షేత్రము యాత్రికులకు తెరువబడునని ఆశించుచున్నాము.

రాజమండ్రినుండి వచ్చిన శ్రీ తోట సత్యనారాయణదంపతులు, ఇందు నీట కుళాయిని 4 వేల ఖర్చుతో పెట్టించుటకు వాగ్దానము చేసిరి.

ఇక విద్యుద్దీపముల ఏర్పాటు మిగిలియున్నది. బహుశా దీనికి 2 వేలు ఖర్చులగునేమో. ఏ భక్తులు ఈ కొండ మీద దీపమును పెట్టించి లోకమునకంతయు ప్రకాశింపదలచియున్నారో ఇంకను తెలియలేదు. సత్సంగసదన నిర్మాణ కార్యక్రమమును కూడ త్వరలో ప్రారంభించి ముగింప ప్రయత్నించుచున్నాము.

ఇచ్చట శ్రీ శ్రీనివాస రామానుజుల నిత్యోత్సవములు విరాళము లొసంగినవారి గోత్రనామములతో అర్చనలు చక్కగా జరుగుచున్నవి. శ్రావణమాసములో అధ్యయనోత్సవము జరుగును.

కోవెలకెదురుగానున్న నారాయణభవనము ఈ నెలలోనే యాత్రికులకొరకు తెరువబడినది. అది అన్ని సౌకర్యములతోను అలరారుచున్నది.

కోవెలలో శ్రీ బదరీశుని ఉత్సవములు, సేవలు యథాపూర్వముగా సక్రమముగా జరుగుచున్నవి. యాత్రికుల ఉత్సాహమంతకంతకు ఇనుమడించుచున్నది.

ఇచ్చట బర్మా, నేపాల్ బృందావనాది నానాప్రాంతములనుండి 8 మంది శ్రీవైష్ణవవిద్యార్థులు ఉదయము మందిరమందున శ్రీ భాగవతపారాయణమును పరమార్థదృష్టితో జేయుచున్నారు. మధ్యాహ్నం గం. 2 లకు రామానుజకూటములో తిరుమంత్రార్థకాలక్షేపము చేయుచున్నారు. వీరికి రాత్రిసమయమున రొట్టె, కూర మన సంఘము తరపునుండి యొసంగబడుచున్నది.

మనరాజా హృషీకేశమునుండి సిమెంటు బస్తాలను, టన్నురేకులను పట్టించుకొని మహాప్రయాసబడి తుదకు సురక్షితముగా బదరికి చేరినాడు.

హృషీకేశమునుండి పిప్పలకోటవరకు డైరెక్టు బస్సులు 4 పడినవి. చార్జీ రు. 9–0–0 లు అగును. ఉదయం హృషీకేశంలో 8 గంటలకు బయలుదేరి రాత్రికి కర్ణప్రయాగలో ఆగిపోయి తిరిగి మరునాటి ఉదయము 6 గంటలకు బయలుదేరి 10 గంటలకు పిప్పల్ కోటకు చేరుచున్నవి. పాండుకేశ్వరమువరకు వచ్చేసంవత్సరమునకు రోడ్డు పడును. కొలతలు తయారైనట్లు ఎర్రజెండాలు పాతిరి. జోషీ, విష్ణుప్రయాగలమధ్య దిగుడులేకుండా పిప్పల్ కోటనుండి పాండుకేశ్వరమునకు సరియైన దారిపడును.

# ఒక అద్భుత సమాచారము

గత సంవత్సరము 1957 వ సంవత్సరము నవంబరు 11 వ తేదీన శ్రీ బదరీనాథుని తలుపులు మూసివేయబడి దేవతారాధనకై విడవబడెను. ఆ సమయములో దేవస్థానకార్యదర్శి గారియు పోలీసు అధికారుల ఉత్తర్వునుపొంది ఒక మహనీయుడు బదరీలోనే యుండిపోయెను. ఈయన కేరళ ప్రాంతీయుడు. పూర్వాశ్రమములో హైకోర్టు అడ్వకేటుగాను కొన్నాళ్లు మెంబరుగాను ఉండెను. బాలబ్రహ్మచారి వీరు బ్రాహ్మణోత్తములు. ఇప్పటి పేరు జ్ఞానానంద సరస్వతీస్వామివారు. అద్వైతమతము, వైష్ణవ ప్రతిపత్తి, అష్టాక్షరీనిష్ఠ, అలకనందా నది కవతలయొడ్డున నీటికి 20 గజముల ఎత్తులోనున్న కుటీరములో నివసించుచున్నారు. వీరు సర్వస్వమును విడచి సన్యాసులై 12 సంవత్సరముల క్రిందటనే యిచ్చటికి విచ్చేసిరి. వీరు కోవెల తలుపులుమూసినదినుండియు నిరాహారప్రాయమైనప్పటికిని ఉష్ణగుండమునకు ప్రక్కనున్న యొక గదిలోనికివచ్చి వేసిన మరునాడే 3 అడుగుల మంచుకురిసి కనుచూపుమేరంతయు రజతమయమైపోయెను. ఆ మంచు డిసెంబరు 11 వ తేదీవరకును నిలవయుండుటచే ఎటువెళ్ళుటకును వీలులేకపోయెను. ఉష్ణకుండపరిసరమంతయు వేడిగానుండుటచే అచ్చటమాత్రము స్వేచ్ఛగా విహరించుటకు అనుకూలముగానుండెను. సరిగా ఉదయము గం. 9-30లకు మొదలు మధ్యాహ్నం గం2ల వరకు సూర్యదర్శనమగుచుండెను. గాలిమాత్రము విపరీతముగా నుండెను. ఉష్ణగుండములో మునిగి తలయెత్తుటయే దుర్భరముగా నుండెను. ఈయన సర్వస్వము విడిచి వచ్చుటచే ధనాభావముచే సరిపడు ఆహారపదార్థము సేకరించియుంచుకొన జాలకపోయెను. ఏమైనను కొందరి సహాయమువల్ల కొద్దియైనను కొద్దిపప్పు కొన్ని బంగాళాదుంపలు కొద్దిగా గోధుమపిండి సరిపడ పాలడబ్బా, టీ మాత్రము సేకరించుకొని యుండిరి. వీరు కుట్టినబట్టలు వాడరు. ఎప్పుడు పొలుశాలువ కప్పుకొని కాలక్షేపము చేయుచుందురు. ఉష్ణగుండము నీటికుండకు 10 గజముల దూరమేయయినను కంఠదఘ్నమంచులో స్నానమునకు వెళ్ళవలసి వచ్చెడిది. పడిన మంచు మెత్తగా నుండునుగాన నడక సాగదు. గడ్డకట్టినచో వేడినీరు పైనపోసి మెత్తపడగానే దిమికద్దున్న కంపెనీ పారతో దానిని తీసివేయుచు దారిచేసుకొనిరి. మలమూత్ర విసర్జనమైననంతే. ఒకచేత పార ఒకచేత వేడినీరు తీసుకొని ఉపాయముగా దారిచేసుకొనుచు కాళ్ళు చలికి పీకినచో వేడినీరు పోసుకొనుచు పోవుచుండెడివారు. గంగనుండి అతి కష్టముతో 3 రోజులకు సరిపడు నీరు తెచ్చుకొని వాడుకొనిరి. ఒకప్పుడు అదియు దుస్సహమగుటచే ఒకడబ్బాలో మంచు గడ్డవేచి ఉష్ణగుండములో పెట్టిన కరిగి కొద్దినీరు లభించెడిది. బయట ఎంత చలిగానున్న ఉష్ణగుండ సొంత వేడిగానుండునుగాన కొంతయుపకరించెడిది. ఒకతరి ఆవేడి దుర్భరమగుటచే ఆ సహాయముకూడ లేకుండెడిది. ఏకకి (కిచిడీ) పొంగలి ఆహారము. ఆకలివేసినపుడెల్ల టీ త్రాగుచునిలచిరి. బొగ్గులుమాత్రము జాగ్రత్తపెట్టుకొనిరి. 19 3-58 వ తేదీ చౌకీదారు మంచుడ్రెస్సుతో పరిశీలకై వచ్చి 3 రోజులు ఉష్ణగుండమువద్ద తమ మకాములోనుండి యూనానికి సరిపడుతిండిని ఆ 3 రోజులు పెట్టి తమపని చూచుకొని వెళ్ళిపోయిరి. ఆ సంవత్సరము మచ్చటనున్న డాక్టరు సికిన్సుటె 6 మాసములుందువని చెప్పుటచే విటమిన్ మాత్రలు హెచ్చుగానిచ్చి వెళ్ళుటచే ఆకలి లేని నిరసనమునందు దేహము. ఆడాక్టరుపేరు రత్తీ.(పంజాబీ)చాలమంచివాడు. తరువాత ఈజ్ఞానానంద సరస్వతీస్వామివారు మొదట 1 నెల 15 రోజులు పగలుకూడా తలుపులు తీసుకొని బయటకు వచ్చుటకు భయపడి లోపలనే యుండెడివారు. దేవసంబంధమునకు ఆపూతిము కల్పించినవారమగుదుమని వారి భయమట. నిరంతరము అష్టాక్షరీజపము. శ్రీ భాగవతపారాయణధ్యానములలో కాలము గడచినది. చలిచే నిద్రపట్టకపోయినచో భజనచేయుచు కూర్చుండెడివారు.

# ఆధ్యాత్మికానుభవము

మనస్సు కొన్ని గంటలవరకు నిశ్చలముగా నుండెడిది. భగవంతుడెదుట తాండవమాడుచున్నట్లు విశదసాక్షాత్కారము కలుగుచుండెడిది. గాలికి అలకనంద కొవలిగట్టున ఎవరో మాట్లాడుచున్నట్లును, ఓం అని ధ్వనిచేయుచున్నట్లు వినవచ్చెడి. గాలికి ఉష్ణగుండము నీరు తరగించును. మధ్యమధ్య ఎవరో పరిశుద్ధస్నానము చేయుచున్నట్లు వినవచ్చెడిది. బయటకువచ్చి చూచిన ఎవరు కనిపింపరు. ఇట్లు నిజముగ మనుష్యులెవరో లేక చౌకీదారులో వచ్చియుందురని నిశ్చయించిరి. బయటకువచ్చి చూచిన ఎవరు కానిపింపరు. కోవెలలోనుండి యొక్కొకసమయమున సన్నాయిమేళముధ్వని వినవచ్చెడిది. ఒకదినము ఉత్తరమున మార్కండేయ శిలవైపునుండి తమ గదివద్దకెవరో వచ్చి

తామెన్నడు వినియెఱుగనంత మృదుమధురస్వరముతో తమ గుమ్మముకద్ద పెద్దగా "ఓం" అని యుచ్చరించగా "కౌన్" యని వీరు గట్టిగా ప్రశ్నించి తలుపు తెరచిచూచిన ఎవరును కనిపింపక పోవుటచే భయపడి వెంటనే తలుపువైచుకొని కూర్చుండిరి. ఆ అనుమానముల యనుభవము వీరికి తిరిగి యీ సంవత్సరముకూడ అంతికంటె జాగ్రత్తగానుండి యనుభవించవలెనని యుత్సాహమును కలిగించినది. దేశోద్ధారకులైన ఋషిపుంగవుల తపఃఫలములు గ్రహించదగిన సమయమిదియేనని యోచనకు తోచినదట. ఇంకను 20 రోజులు ద్వారము తెరుతురనగనే మంచు యేమాత్రము లేకుండ మాయమయ్యెను. దారులేర్పడెను. అంత ధామమున్న గ్రామప్రజలు వచ్చి యిప్పు బాగుచేయించుట యుష్ణకుండములో స్నానముచేయుట మొదలగు వ్యాపారములాచరించి యాత్రికులకు అంతరాయము కలిగించిరి.

మఱల క్రింపటి మే 11 వ తేదీకి తలుపులు తెరవబడెను.

## కట్నాలు

5–6–58 తేది పెనుగొండలో సంపూర్తి నరసింగరాచార్యులుగారి కుమార్తెను రఘుపేటపల్లి కా॥ వంగల సీతారామాచార్యులుగారి తమ్మునికిచ్చి వివాహము చేసిన సందర్భములో సంఘమునకు సాధనము సమర్పించిన కట్నం — రు 2–0–0

7–6–58 తేది నరసాపురం– వేదాల శోభనాచార్యులుగారు తమకుమారుని ఉపనయనము జరిగించిన సందర్భములో సంఘమునకు సమర్పించిన కట్నం. — రు 1–0–0

13–8–58 తేది శ్రీకాకుళం– ఐనాటం శ్రీనివాసాచార్యులుగారు తమ దేహారోగ్యం కొరకు పెరుమాళ్ళకు పుష్పం నిమిత్తం సమర్పించినది. — రు 1–0–0

29–7–58 తేది గొల్లప్రోలు– శ్రీమత్ప్రతివాది భయంకరం వెంకటాచార్యులుగారు పరిహారము సమర్పించినది. — రు 1–0–0

## బదరీ తాత్కాలిక పూజలు వివరాలు

| | | |
|---|---|---|
| తుమ్మగూడెం. | ఇనుగంటి వెంకట శ్రీదేవమ్మగారు | రు 11–0–0 |
| ,, | ఇనుగంటి రాజ్యలక్ష్మమ్మగారు | 11–0–0 |
| మద్రాసు. | గుగ్గిలం ఆదినారాయణ శ్రేష్టిగారు– 108 వరదాముత్తయప్పన్ వీధి | 11–0–0 |
| కొత్తపల్లి. | చెలికాని వెంకట పాపయ్యమ్మగారు– (వయా) ఉప్పాడ. | 11–0–0 |
| పింజనంపాడు. | కొండు వెంకటసుబ్బమ్మగారు– పింజనంపాడు. | 11–0–0 |

## శ్రీ భగవద్విషయ కాలక్షేపగోష్ఠి

శ్రీ మన జియ్యర్ స్వామివారు శ్రీకూర్మములో శ్రీకూర్మనాథ స్వామివారి సన్నిధిని 1–8–58 తేది నుండి ఉదయం గం. 7–0 ల మొదలు గం. 9–0 ల వరకు మధ్యాహ్నం గం. 2–0 ల మొదలు గం. 5–0 ల వరకు భగవద్విషయ కాలక్షేపమును కృపచేయుచున్నారు. స్థానికులైన స్వాములు అన్యగ్రామములనుండి వచ్చినవారు. స్త్రీలు, పురుషులు పెక్కురు యీగోష్ఠిలో నన్వయించి యున్నారు. కాలక్షేపగోష్ఠి పరమ విలక్షణముగానున్నది. మొదటిపత్తు అయినది, రెండవపత్తు జరుగుచున్నది.

## సాంఘిక వార్తలు

విశాఖజిల్లా కోటవురుట్ల గ్రామములో శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో గీతాప్రచారకులు శ్రీ యజ్ఞభగవాన్ శ్రీమాన్ అరవెల్లి సత్యనారాయణాచార్య స్వామివారు చాతుర్మాస్య దివశయనోత్సవమును 27–7–58 మొ॥ 23–11–58 వరకు జరుపుటకు దీక్షవహించిరి.

అముదాలవలసలో శ్రీ మహిళామండలివారు శుక్రవారపూజలు వైభవంగా జరుపుచున్నారు.

## ఒక అద్భుత సమాచారము

గత సంవత్సరము 1957 వ సంవత్సరము నవంబరు 11 వ తేదీన శ్రీ బదరీనాథుని తలుపులు మూసి వేయబడి దేవతారాధనకై విడవబడెను. ఆ సమయములో దేవస్థానకార్యదర్శి మరియు పోలీసుఅధికారుల ఉత్తర్వునుపొంది ఒక మహనీయుడు బదరీలోనే యుండిపోయెను. ఈయన కేరళ ప్రాంతీయుడు. పూర్వాశ్రమములో హైకోర్టు అడ్వకేటుగాను కౌన్సిలు మెంబరుగాను ఉండెను. బాలబ్రహ్మచారి వీరు బ్రాహ్మణేతరులు. ఇప్పటి పేరు జ్ఞానానంద సరస్వతీస్వామివారు. అద్వైతమతము, వైష్ణవ ప్రతిపత్తి, అష్టాక్షరీనిష్ఠ, అలకనందా నది కవతలయొడ్డున నీటికి 20 గజముల ఎత్తులోనున్న కుటీరములో నివసించుచున్నారు. తమ సర్వస్వమును విడచి సన్న్యాసులై 12 సంవత్సరముల క్రిందటనే యిచ్చటికి వచ్చేసిరి. వీరు కోవెల తలుపులుమూసి వేసియుంటేయు విగ్రహపూజ్యమైనప్పుడు ఉష్ణగుండమునకు ప్రక్కనున్న యొక గదిలోనికివచ్చి వేసిన మరునాడే 3 అంగుళముల మంచుకురిసి కనుచూపుమేరంతయు రజతమయమైపోయెను. ఆ మంచు డిసెంబరు 11 వ తేదీవరకును నిలవయుండుటచే ఎటువెళ్ళుటకును వీలులేకపోయెను. ఉష్ణగుండపరిసరములయందు వేడిగానుండుటచే అచ్చటమాత్రము స్వేచ్ఛగా విహరించుటకు అనుకూలముగానుండెను. సరిగా ఉదయం గం. 9-30లకు మొదలు మధ్యాహ్నం గం 2ల వరకు సూర్యదర్శనముండెను. గాలిమాత్రము విపరీతముగా నుండెను. ఉష్ణగుండములో మునిగి తలయెత్తుటయే దుర్భరముగా నుండెను. ఈయన సర్వస్వమువిడిచి వచ్చుటచే ధనాభావముచే సరిపడు ఆహారపదార్థము సేకరించియుంచుకొన జాలకపోయెను. అనువగు మూలల నష్టంపోవుభూమిచే కొద్దిబియ్యము. కొద్దిపప్పు కొన్ని బంగాళాదుంపలు కొద్దిగా గోధుమపిండి సరిపడ పాలడబ్బా. టీ మాత్రము సేకరించుకొని యుండిరి. వీరు కుట్టినబట్టలు వాడరు. ఎప్పుడు శాలుశాలువ కప్పుకొని కాలక్షేపము చేయుచుందురు. ఉష్ణగుండము వీరిబసకు 10 గజముల దూరమేయయినను కంఠదఘ్నమంచులో స్నానమునకు వెళ్ళవలసి వచ్చెడిది. పడిన మంచు మెత్తగా నుండునుగాన నడక సాగును. గడ్డ కట్టినచో వేడినీరు పైనపోసి మెత్తపడగానే తమవద్దనున్న కంపెనీ పారతో దానిని తీసివేయుచు దారిచేసుకొనిరి. మలమూత్ర విసర్జనమైననంతే. ఒకచేత పార ఒకచేత వేడినీరు తీసుకొని ఉపాయముగా దారిచేసుకొనుచు కాళ్ళు చలికి పీకినచో వేడినీరు పోసుకొనుచు పోవుచుండెడివారు. గంగనుండి అతి కష్టముతో 3 రోజులకు సరిపడు నీరు తెచ్చుకొని వాడుకొనిరి. ఒకప్పుడు అదియు దుస్సహముగుటచే ఒకడబ్బాలో మంచు గడ్డవేచి ఉష్ణగుండములో పెట్టిన కరిగి కొద్దినీరు లభించెడిది. బయట ఎంత చలిగానున్న ఉష్ణగుండ మంత వేడిగానుండునుగాన కొంతయుపకరించెడిది. ఒకతరి ఆవేడి దుర్భరమగుటచే ఆ సహాయముకూడ లేకుండెడిది. వీరికి (కిచిడీ) పొంగలి ఆహారము. ఆకలివేసినపుడెల్ల టీ త్రాగుచునిలచిరి. బొగ్గులుమాత్రము జాగ్రత్తపెట్టుకొనిరి. 19.3-58 వ తేదీ చౌకీదారు మంచుడ్రెస్సుతో పరిశీలనకై వచ్చి 3 రోజులు ఉష్ణగుండమువద్ద తమ గుడారములోనుండి యీయనకు సరిపడుతిండిని ఆ 3 రోజులుపెట్టి తమపని చూచుకొని వెళ్ళిపోయిరి. ఆ సంవత్సరమచ్చటనున్న డాక్టరు వీరచ్చట 6 మాసములుండుననని చెప్పుటచే విటమిన్ మాత్రలు హెచ్చుగానిచ్చి వేస్తుటచే అవి వీరిని నీరసపడకుండ చేసెను. ఆడాక్టరు పేరు రత్తీ. (పంజాబీ) చాలమంచివాడు. తరువాత ఈజ్ఞానానంద సరస్వతీ స్వామివారు మొదట 1 నెల 15 రోజులు పగలుకూడా తలుపులు తీసుకొని బయటకు వచ్చుటకు భయపడి లోపలనే యుండెడివారు. దేవసంచారమునకు ఆఘాతము కల్పించినవారమగుదుమని వారి భయమట. నిరంతరము అష్టాక్షరీజపము. శ్రీ భాగవతపారాయణధ్యానములలో కాలము గడచినది. చలిచే నిద్రపట్టకపోయినచో భజనచేయుచు కూర్చుండెడివారు.

## ఆధ్యాత్మికానుభవము

మనస్సు కొన్ని గంటలవరకు నిశ్చలముగా నుండెడిది. భగవంతుడెదుట తాండవమాడుచున్నట్లు విశదసాక్షాత్కారము కలుగుచుండెడిది. గాలికి అలకనందకావలిగట్టున ఎవరో మాట్లాడుచున్నట్లును, ఓం అని ధ్వనిచేయుచున్నట్లు వినవచ్చెడి. గాలికి ఉష్ణగుండము నీరు తరగించును. మధ్యమధ్య ఎవరో పవిత్రస్నానము చేయుచున్నట్లు వినవచ్చెడిది. బయటకువచ్చి చూచిన ఎవరు కనిపింపరు. ఇట్లు నిజముగ మనుష్యులెవరో లేక చౌకీదారులో వచ్చి యుందురని నిశ్చయించిరి. బయటకువచ్చి చూచిన ఎవరు కానిపింపరు. కోవెలలోనుండి యొక్కొకసమయమున సన్నాయిమేళముధ్వని వినవచ్చెడిది. ఒకదినము ఉత్తరముగ మార్కండేయ శిలవైపునుండి తమ గదివద్దకెవరో వచ్చి

తా మెన్నడు వినియెఱుగనంత మృదుమధురస్వరముతో తమ గుమ్మముకద్ద పెద్దగా "ఓం" అని యుచ్చరించగా "కౌన్" యని వీరు గట్టిగా ప్రశ్నించి తలుపు తెరచిచూచిన ఎవరును కనిపింపక పోవుటచే భయపడి వెంటనే తలుపువైచుకొని కూర్చుండిరి. ఆ ఆరుమాసముల యనుభవము వీరికి తిరిగి యీ సంవత్సరముకూడ అంతకంటె జాగ్రత్తగానుండి యనుభవించవలెననెడు యుత్సాహమును కలిగించినది. తపోభూమియనుటకు ఋషిపుంగవుల తపశ్శక్తులు గ్రహించదగిన సమయమదియేనని యీయనకు తోచినదట. ఇంకను 20 రోజులు ద్వారము తెరుతురనగనే మంచు యేమాత్రము లేకుండ మాయమయ్యెను. దారులేర్పడెను. అంత ఘామిపేగ్రామప్రజలు వచ్చి యిల్లు బాగుచేయించుట యుష్ణగుండములో స్నానముచేయుట మొదలగు వ్యాపరములాచరించి యాగ్రహరాంతకతకు అంతరాయము కలిగించిరి.

మఱల క్రిందటి మే 11 వ తేదీకి తలుపులు తెరవబడెను.

## కట్నాలు

5–6–58 తేది పెనుగొండలో నండూరి నరసింగరాచార్యులుగారి కుమార్తెను నక్షి సేటిపల్లి కా॥ వంగల సీతారామాచార్యులుగారి తమ్మునికియిచ్చి వివాహముచేసిన సందర్భములో సంఘమునకు ఉభయులు సమర్పించిన కట్నం రు 2–0–0

7–6–58 తేది నరసాపురం- చేవాల కోనమాచార్యులుగారు తమకుమారుని ఉపనయనము జరిగించిన సందర్భములో సంఘమునకు సమర్పించిన కట్నం. రు 2–0–0

13–8–58 తేది శ్రీకాకుళం- బరాటం శ్రీనివాసాచార్యులుగారు తన శరీరారోగ్యం కొరకు పెరుమాళ్ళకు మంత్రపుష్పం నిమిత్తం సమర్పించినది. రు 1–0–0

29–7–58 తేది గొల్లప్రోలు- శ్రీమద్భృతివాది భయంకరం వెంకటాచార్యులుగారు పయిసాలందు సమర్పించినది. రు 1–0–0

## బదరీ తాత్కాలిక పూజయి విరాళాలు

| | | |
|---|---|---|
| తుమ్మగూడెం. | ఇనుగంటి వెంకట శ్రీదేవమ్మగారు | రు 11–0–0 |
| ,, | ఇనుగంటి రాజ్యలక్ష్మమ్మగారు | 11–0–0 |
| మద్రాసు. | గుగ్గిలం ఆదినారాయణ శ్రేష్ఠిగారు- 108 వరదాముత్తయప్పన్ వీధి | 11–0–0 |
| కొత్తపల్లి. | చెలికాని వెంకట పాపయ్యమ్మగారు- (వయా) ఉప్పాడ. | 11–0–0 |
| వింజనంపాడు. | కొం(డు. వెంకటసుబ్బమ్మగారు- వింజనంపాడు. | 11–0–0 |

## శ్రీ భగవద్విషయ కాలక్షేపగోష్ఠి

శ్రీ మన జియ్యర్‌స్వామివారు శ్రీకూర్మములో శ్రీకూర్మనాథ స్వామివారి సన్నిధిని 1–8–58 తేది నుండి ఉదయం గం. 7–0 ల మొదలు గం. 9–0 ల వరకు మధ్యాహ్నం గం. 2–0 ల మొదలు గం. 5–0 ల వరకు భగవద్విషయ కాలక్షేపమును కృపచేయుచున్నారు. స్థానికులైన స్వాములు అన్యగ్రామములనుండి వచ్చినవారు. స్త్రీలు, పురుషులు పెక్కురు యీగోష్ఠిలో నన్వయించి యున్నారు. కాలక్షేపగోష్ఠి పరమ విలక్షణముగానున్నది. మొదటిపత్తు అయినది, రెండవపత్తు జరుగుచున్నది.

## సాంఘిక వార్తలు

విశాఖజిల్లా కోటవురట్ల గ్రామములో శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో గీతాప్రచారకులు శ్రీ యజ్ఞభగవాన్ శ్రీమాన్ అరవెల్లి సత్యనారాయణాచార్య స్వామివారు చాతుర్మాస్య దివ్యయనోత్సవము 27–7–58 మొ॥ 23-11-58 వరకు జరుపుటకు దీక్షవహించిరి.

ఆముదాలవలసలో శ్రీ మహిళామండలివారు శుక్రవారపూజలు వైభవంగా జరుపుచున్నారు.



# ఏలూరులో శ్రీ జనార్దనస్వామివారి ఆలయమున

## శ్రీశ్రీశ్రీ శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి

### ఆధ్వర్యమున 1958 జూన్ నెల 6 – 7 తేదీలయందు జరుపబడిన

## సమష్టి ఉపనయనమహోత్సవములగురించిన జమా ఖర్చులు

| | |
|---|---|
| నెం. 10 మొ॥ 15 రశీదు పుస్తకముల దాఖలా ఉపనయనవటువుల 13 దరఖాస్తులకు ఇచ్చినరొఖం | 310-00 |
| సమష్టిఉపనయన తదీయారాధన ఖర్చులకు భక్తులు, దాతలు సమర్పించిన రొఖమున్నూ సమష్టిఉపనయన నిర్వాహక సంఘముద్వారా శ్రీ ఆండాళ్ సేవా మహిళాసమితిద్వారా, | 224-10 |
| బియ్యం 132 శేర్లు కందిపప్పు, విస్తర్లు వగైరాలు ఆహ్వానసంఘంవారివల్ల | 30-00 |
| వెరశి జమ రొఖము | 564-10 |

### ఖర్చులు

| | |
|---|---|
| కుంకుమ | 0-37 |
| శుభలేఖలు 2000 పేపరు ప్రింటింగు | 27-70 |
| కవర్లు — పోస్టేజీలు | 20-48 |
| ఎకౌంటుబుక్కు | 0-50 |
| బోర్డులు వ్రాయుటకు | 8-50 |
| మోదుగసమిధలు-పాలాశదండములకు | 5-00 |
| యజ్ఞోపవీతములకు | 5-00 |
| యాజ్ఞిక సామానులు మూకుళ్ళు, ముంతలు | 11-00 |
| బుట్టలు, తాళ్ళు ప్రమిదెలు వగైరా | 1-25 |
| తదీయారాధనకువచ్చిన సరకులు గాక బజారులోకొన్న సరకులకు | 183-95 |
| 13 వటువులకు దీక్షావస్త్రములు, కొల్లాయిలు, మంత్రోపదేశం ఉత్తర్యాలు | 94-85 |
| వటువులకు పోగులు చేసి కుట్టిన కంసాలికి | 4-00 |
| సన్నాయిమేళం 2 రోజులకు | 27-50 |
| ఫలప్రదానములు | 18-25 |
| యాజ్ఞికులకు దక్షిణ | 103-00 |
| సభాపతుల, పండితుల సన్మానములకు శాలువలు | 18-00 |
| రిక్షాలకు — కూలీలకు | 6-88 |
| వంటస్వాములకు | 10-00 |
| వంటచెఱకు వగైరాలకు | 15-00 |
| ఖర్చు వెరశి | 561-23 |
| గాక నిల్వ రొఖము | 2-87 |

ఏలూరు.
**30-6-1958**

ఈదర వేంకట్రావు సమష్టిఉపనయన కమిటీ అధ్యక్షులు.

**N. C.** పట్టాభిరామాచార్యులు **M. A.**

కాలేజి లెక్చరరు. & సెక్రటరీ, సమష్టి ఉపనయన నిర్వాహక కమిటీ

మనవి :—ఆర్థికలోపమునను, స్థలాభావమునను యీ పత్రికయందు ప్రచురించిన జమాఖర్చును సంగ్రహరిపోర్టు దాఖలా విరాళములనొసంగిన భక్తులనామములు వివరముగ ప్రచురింపజాలనందుకు మన్నింపకోరెదము.

— ఆహ్వానసంఘము.



# బదరీ శ్రీనివాస రామానుజ స్వామివారల కైంకర్యములు

## శాశ్వత పూజా విరాళములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీ దాచేపల్లి పాపయ్యగుప్తగారు | హైదరాబాద్ | | 500-0-0 |
| 2. | శ్రీ శృంగారం నరసింహాచార్యులుగారు | శనివారపేట | వాగ్దానం 29/ లో | 2-0-0 |
| 3. | ,, దోరడ్ల జగన్నాథంగారిభార్య రత్నమాణిక్యంగారు | బందరు | మరల | 10-0-0 |
| 4. | ,, మన్నవ సత్యనారాయణగారు | కొర్నిపాడు | ,, | 29-0-0 |
| 5. | ,, ఎలమనేని సామ్రాజ్యమ్మగారు | ,, | ,, | 28-0-0 |
| 6. | ,, గోపపూడి సుబ్బారావుగారు | ,, | ,, | 30-0-0 |
| 7. | ,, రాయనేని సుబ్బమ్మగారు | ,, | ,, | 15-0-0 |
| 8. | ,, నెరెళ్ళ తిరుపతయ్యగారు | ,, | ,, | 20-0-0 |
| 9. | ,, మన్నవ ధర్మయ్యగారు | ,, | ,, | 15-0-0 |
| 10. | ,, మన్నవ వెంకటప్పయ్యగారు | ,, | ,, | 20-0-0 |
| 11. | ,, వక్కలగడ్డ వెంకటేశ్వర్లుగారు | ,, | ,, | 20-0-0 |
| 12. | ,, నన్నపనేని రామానుజదాసుగారు | ,, | ,, | 28-0-0 |
| 13. | ,, ఇరుకుట్ల శ్రీశైలంగారు | పడిగశిల | ,, | 21-0-0 |
| 14. | ,, పుల్చి సుబ్బమ్మ, కమలమ్మగార్లు | వంగవోలు | ,, | 7-0-0 |
| 15. | ,, జవ్వాజి అప్పారావుగుప్తగారి భార్యరాజరత్నమ్మగారు | ఏలూరు | ,, | 27-0 0 |
| 16. | ,, పద్మనాభుని వెంకటసుబ్బమ్మగారు | వంగవోలు | ,, | 3-0-0 |
| 17. | ,, అయివా హనుమంతశెట్టిగారు | నెల్లూరు | ,, | 4-0-0 |
| 18. | ,, పబ్బిశెట్టి బాపయ్యగారిభార్య కనులమ్మగారు | వంగవోలు | ,, | 7-0-0 |
| 19. | ,, రాపోలు వెంకటచలం పంతులుగారు<br>వీరి కుమార్తె శ్రీరంగరాజు తాయారమ్మగారు | శ్రీకూర్మం | ,, | 29-0-0 |
| 20. | ,, కోట నరసింహంగారు | విజయవాడ | వాగ్దానం 1000/ లో జమ | 30-0-0 |

## తాత్కాలిక పూజా విరాళములు

| | | | |
|---|---|---|---|
| 21. | శ్రీ రామకృష్ణరామానుజదాసుగారు | అంగాలవలస | 11-0-0 |
| 22. | ,, గుత్తా వెంకుబాయమ్మగారు | ఉనికిలి | 11-0 0 |
| 23. | ,, ఎర్నేని లక్ష్మీకాంతమ్మగారు | గురజ | 11-0-0 |
| 24. | ,, చెలసాని చినసీతాయమ్మగారు | బొబ్బిలి | 11 0-0 |
| 25. | ,, రంగరాజు అనంతమ్మగారు | శ్రీకూర్మం (పితృదేవతల పిండప్రదాననిమిత్తం) | 30-0-0 |

## శాశ్వత పూజలు

| | | | |
|---|---|---|---|
| 26. | శ్రీ గాజుల తాతయ్యగారు | చావలి | 29-0-0 |
| 27. | ,, ఈడ్పుగంటి గంగమ్మగారు | బూరుగడ్డ | 159-0-0 |
| 28. | ,, చక్కా తాయారమ్మగారు, | పాలకొల్లు | 4-0-0 |
| 29. | ,, చలువాది వెంకటసుబ్బమ్మగారు | మార్కాపురం | 3-0-0 |
| 30. | ,, చుండూరు శీలారతమ్మగారు | నెల్లూరు | |

## తాత్కాలిక పూజలు

| | | | |
|---|---|---|---|
| 31. | ,, చక్రవర్తుల కస్తూరి రంగాచార్యులుగారు | తిరువూరు | 11-0-0 |
| 32. | ,, మంగిన పెరుందేవి తాయారమ్మగారు | ,, | 11-0-0 |

| | | | |
|---|---|---|---|
| 33. ,, దామెర లక్ష్మీ వెంకయ్యమ్మగారు | పిఠాపురం | | 11-0.0 |
| 34. ,, చెలికాని వెంకటరమణమ్మగారు | చిత్రాడ | | 11-0.0 |
| 35. ,, బలిజేపల్లి లక్ష్మీకాంతశాస్త్రిగారు | పిఠాపురం | | 11-0.0 |
| 36. ,, దామెర శేల్లయ్యమ్మగారు | పిఠాపురం | సత్సంగసదన విరాళం | 16-0-0 |

## ఏలూరు

ఈ ఏలూరు పట్టణమున ది 12–5–1958 మొదలు 7–6–1958 వరకు 27 రోజులున్ను శ్రీ శ్రీ శ్రీ శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజియ్యరు స్వామివారు వేంచేసియున్న సందర్భమున శ్రీ జియ్యరు స్వామివారి సన్నిధిలో ఆహ్వానసంఘము వారిద్వారా ఈ పట్టణములో భక్తులు జరిపించిన తదీయారాధనాది కైంకర్యములకు సమర్పించిన విరాళములు వగైరా జమాఖర్చులు–

| | | |
|---|---|---|
| | | రు. న.పై. |
| నె 1 to 10 రశీదు పుస్తకములదాఖలా | జమనిల్వం | 743- 00 |
| తిరువీధి ఉత్సవములకు భజంత్రీమేళములకు, శ్రీచిహ్నములు ఈదినవానికి 27 రోజులకు | | 94. 00 |
| శ్రీ శ్రీ జియ్యరు స్వామివారి సన్నిధిలో జరిపిన నిత్య తదీయారాధన సామగ్రులు వగైరాలకు 27 రోజులకు | | 494- 19 |
| పనిచేసిన కూలీలకు | | 42- 00 |
| ఎలక్ట్రిసిటీ వగైరాలకు | | 14- 00 |
| పండిత సత్కారములకు | | 38- 50 |
| వంటస్వామికి | | 10. 00 |
| సమష్టి ఉపనయన మహోత్సవ ఖర్చులకు | | 30- 00 |
| పోస్టేజీలు | | 0- 31 |
| మహిళాసంఘ సన్మానములకు | | 20- 00 |
| | ఖర్చు వెరశి రు. | 743- 00 |

ఏలూరు.
12—6—'58

డాక్టరు సి. లక్ష్మణాచార్యులు.
ఆహ్వాన సంఘాధ్యక్షులు.

మరా:– ఆర్థికలోపమునను, స్థలాభావమునను యీ పత్రికయందు ప్రచురించిన జమాఖర్చు సంగ్రహరిపోర్టు దాఖలా విరాళముల నొసంగిన భక్తుల నామములు వివరముగ ప్రచురింపజాలనందుకు మన్నింపకోరెదను.

ఆహ్వాన సంఘము.

భక్తినివేదన
శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, చుండూరు పోస్టు, గుంటూరుజిల్లా.

BOOK-POST.

శ్రీమాన్

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Mumukshuvu





# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]





...ప్ర కామయే రాజ్యం
న స్వ... పునర్భవం
కామయే దుఃఖ తప్తానాం
ప్రాణినా మార్తి నాశనం





శ్రీ ... ఉభయవేదాంత ... తిరుమంత్రార్థ ...


| | | |
|---|---|---|
| సంపుటి ౧౧ | విళంబి - భాద్రపదము | సంచిక ౮ |



సంపాదకులు :
పండిత ...
పె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న
గుదిమెళ్ల రామానుజాచార్యులు

# శ్రీ కూర్మక్షేత్ర మాహాత్మ్యము



ఆంధ్రదేశపు యభిమానదైవము శ్రీకూర్మనాథస్వామివారు. శ్రీకూర్మక్షేత్రము శ్రీకాకుళమునకు పదిమైళ్ళదూరమునన్నది. శ్రీ మహావిష్ణుని దశావతారములలో రెండవదైన కూర్మావతారము (తాబేలు రూపముగల) సాలగ్రామము గర్భాలయమున బూజింపఁబడుచున్నది. పూర్వము చంద్రవంశమునందు జన్మించిన శ్వేతచక్రవర్తికి కూర్మావతారమున శ్రీహరి ప్రత్యక్షమై ఆతనిచే ఆలయప్రాకారాదులు నిర్మింపబడి చతుర్ముఖబ్రహ్మచే ప్రతిష్ఠితమై శ్వేతచక్రవర్తిచే ననేకసంవత్సరములు పూజింపఁబడినటుల పద్మపురాణాంతర్గతమగు క్షేత్రపురాణమున గలదు.

ఈ దేవాలయము గజ, తురగ, వృషభాది పంచశిల్పములతోను, లోపలి ప్రాకారస్తంభపంక్తి చిత్రవిచిత్ర శిల్పనైపుణ్యముతోనుండి యష్టదళపద్మాకారముగ నుండుటచే గాంధర్వవిమానమని జెప్పఁబడుచున్నది. దీని ననుసరించిన భోగమంటపము, పుష్పాంజలిమంటపము, యాస్థానమంటపము, శంఖనిధి, పద్మనిధి, వైష్ణవీదుర్గ మొదలగు విగ్రహములతో అష్టాక్షరమంత్రోద్ధార విన్యాసమున శ్రీ స్వామిసేవ సాయించుచున్నారు. యీ దేవాలయ తూర్పు ద్వారమునకెదురుగ కూర్మగుండమను చక్కని సరోవరముగలదు. దీనిని శ్వేతగుండమనికూడ అందురు. శ్రీ మహావిష్ణువు కూర్మావతారమున శ్వేతచక్రవర్తికి ప్రత్యక్షమై చక్రప్రయోగముఁజేసినంత యీ గుండమేర్పడినదని క్షేత్రపురాణమున గలదు. హిందూదేశమంగు చాలమంది ప్రజలు మృతులైనవారి అస్థికలను యీ కూర్మగుండమందుంచి గయాశ్రాద్ధము వలెనే పిండప్రదానములఁజేసి తమ పితృదేవతలను తృప్తులజేయుదురు. ఆ ప్రకారమందుంచిన యస్థికలు కొంతకాలము నకు గండకి నదియందు సాలగ్రామోత్పత్తివలెనే యిందుగూడ సాలగ్రామములుగా మారును. ఇది ప్రత్యక్షసిద్ధము.

ఇచ్చట ప్రధానోత్సవములు-కల్యాణము, డోలోత్సవము. కల్యాణము ప్రతిసంవత్సము వైశాఖశుక్ల ఏకాదశి రోజున జరుగును. కల్యాణమనగా జగత్కల్యాణార్థమై శ్రీ స్వామివారికి నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవములలో జరిగే యారాధనాదులలోగల లోపములను బూర్తిజేయుటకై తొమ్మిదిరోజులు దీక్షగా ధ్వజారోహణము, బలిహరణము మొదలగు క్రియలతో కల్యాణము జరుగును. దీనినే బ్రహ్మోత్సవమందురు. యీ యుత్సవము సేవించువారికిని యీ రాష్ట్రమునకును సర్వారిష్టములుపోయి జగత్కల్యాణమగునని యాగమశాస్త్రమందుండుటచే చాలమంది ప్రజలు యీ కల్యాణము సేవించి ధన్యులగుదురు.

డోలోత్సవము ప్రతిసంవత్సరము ఫాల్గుణశుక్ల పౌర్ణమిరోజున జరుగును. యీ శుద్ధ ఏకాదశిరోజున మంగళవాద్యములతో గ్రామప్రదక్షిణముగ భర్గుండను ఆలయమునకు తెచ్చి దేవతావిగ్రము అందరికి యర్చకులు సమర్పింతురు శేషమును భక్తులు శిరసునందు ధరింతురు.

త్రయోదశిరోజున మఘానక్షత్రశేషప్రధానముగా కామదహనోత్సవము జరుగును. మఘానక్షత్రమున శ్రీ మహావిష్ణువునకు జ్వాలాప్రదక్షిణము చేయవలయునని యాగమశాస్త్రమందు గలదు. ఇదిగాక దేవాలయములందు జరుగు యుత్సవములు రెండువిధములు. శాస్త్రవిహితము- శిష్టాచారమున్ను-కల్యాణము శాస్త్రవిహితము. డోలోత్సవ కామదహనోత్సవములు శిష్టాచారము. ఇయ్యది వైష్ణవదీక్షయందేగాక శైవ శాక్తేయాది దీక్షలందుగూడ గలదు. శ్రీవారి ధర్మకర్తలు నిర్మలులగు ప్రపన్నులగుటచే నరకహేతువులగు విషయాంతరములు ప్రవేశించే యింద్రియములను వాని యధిష్ఠానములతోఁజేర్చి భగవంతునియెదుట హోమముగావించి కామక్రోధాదులను దహించి తాము పునీతులై సేవించుటకు వచ్చిన భక్తులందరు తరించవలెనను పరశ్రేయోభిలాషచే యుత్సవరూపమున కామదహనము విస్తరింపఁజేసిరి.

మరుచటిరోజు పడియ యీరోజు మఘాస్నానమని రాత్రి కామదహనోత్సవము శేవించినవెంటనే సముద్ర స్నానముఁజేసి ఆలయములో శ్రీ కూర్మనాధుని సేవింతురు. ఆఖరుది డోలోత్సవము. ఉత్తరానక్షత్రశేషముతో గూడిన పూర్ణిమరోజున శ్రీ స్వామివారు అరుణోదయకాలమున గజవాహనముతో డోలామంటపమునకు వేంచేయుదురు. అచ్చట (డోలిక) ఊయలలో ఉత్తరముఖముననుండగా శ్రీ విజయనగరరాజావారి గోత్రనామములతో భర్గుండ సమర్పణ మంత్రపుష్పము జరుగును. పిమ్మట భక్తులంచరు స్వయముగ భర్గుండతో శ్రీవారిని పూజింతెదరు. [illegible] యీ ఆంధ్రదేశమునకు దివ్యాలంకారమై శ్రీ రామానుజాచార్యులవారిచే మంగళాశాసనము

చేయబడిన నూటయెనుబది దివ్యతిరుపతులలో ప్రధానక్షేత్రమై శ్రీ రామానుజాచార్యులవారికి స్వార్జితమగు అభిమాన స్థలమై మహత్తరవైభవము నొప్పుచున్నది.

శ్రీ భగవద్రామానుజాచార్యులవారు. భూప్రదక్షిణముఁ జేయుచు, బదరి కౌశ్రమము, అయోధ్య, నైమిశారణ్యము మొదలగు దివ్యక్షేత్రముల మంగళాశాసనముఁ జేయుచు పురుషోత్తమ క్షేత్రమునకువచ్చి తమ శిష్య బృందముతో శ్రీ జగన్నాధుని ఆలయ మంటప, గోపురాదులు, ఇంద్రద్యుమ్న, మార్కండేయ, రోహిణీ తీర్థములు మొదలగు దేవాలయ విశేషములను సేవించుచు శ్రీ సుభద్రా బలరాములతో వేంచేసియున్న శ్రీ జగన్నాధుని సేవించి, ఆశ్రమమునకుఁబోయి స్థలవైభవమంతయు దలంచి పరమసంతోషముతో, యీ స్థలమున పాంచరాత్ర ప్రసిద్ధ శ్రీవైష్ణవ ధర్మముల నెలకొల్పదలంచి నిద్రించినంత- శ్రీ జగన్నాథుఁడు స్వప్న సాక్షాత్కారముగ అత్యంత పతితుల నైనను పవిత్రులుగాజేయు సంకల్పముగల మాకు మీరు తలంచిన ధర్మములు సరిపడవుగాన, మీరిచ్చటకు వచ్చుటే సంతోషము. అని చెప్పినను, ఏవిధముగనైనను ఇది దివ్యదేశము గావింపవలెనని నిశ్చయించి నిద్రించినంత, శ్రీ జగన్నాధు నాజ్ఞచే గరుత్మంతుండు శ్రీ రామానుజాచార్యులవారిని శ్రీకూర్మ క్షేత్ర శ్వేత పుష్కరిణీ తీరమందు దించి అంతర్హితుండయ్యెను. పిమ్మట యతిరాజులకు మెలకువవచ్చి సత్యసంకల్పుండును సర్వస్వతంత్రుఁడైన యీ జగన్నాధు నాజ్ఞయిదియని దలంచి శ్వేతగుండమందు తీర్థమాడి తమ తిరుమణిపెట్టె తమతో లేనందువల జలమూర్ధ్వపుండ్రమను సంజ్ఞగా ధరించి నిత్యకర్మానుష్ఠానముఁ జేసుకొని ఒక చందనవృక్షచ్ఛాయకు వెళ్ళిరి. అంతి నచ్చట బంగారము వంటిశరీరఛాయయు, తెల్లని జన్నెదమును ద్వాదశోర్ధ్వపుండ్రములును, చిన్నశిఖయు బ్రహ్మ తేజముతో ప్రకాశించుచున్న అందమైన వటువునుఁ జూచిరి. అంత నా బ్రహ్మచారి మెల్లమెల్లగా రామానుజా చార్యులవారి వద్దకువచ్చి దండవత్ప్రణామముఁజేశి స్వామీ ? ఎచ్చటనుండి వచ్చితిరి. ఎచ్చటకి వెళ్లెదరు. తిరుప గూడ యేది, శిష్యులెక్కడ, త్రిదండ మెందున్నది. ఇచ్చట భిక్షకు శైవులున్నారు కాని శ్రీవైష్ణవులు లేరు. కాబట్టి దయయుంచి తమ యుదంతము చెప్పుటకు వీలయినచో సాయించ గోరుచున్నానని వినయముగా విన్నవించెను.

అంత యతిరాజులు వటువునుఁజూచి వినయవిధేయతలకు ఆనందించి తమ వృత్తాంతమంతయుఁ జెప్పి, వత్సా ? శ్రీవైష్ణవులకు ఊర్ధ్వపుండ్రము ముఖ్యము అదిలేక విచారించుచుంటిననగా, నా బ్రహ్మచారి కూర్మగుండ ప్రాంతమం దొకచోటుచూప అచ్చట దవ్వగా తిరుమణి దొరకెను. శ్రీచూర్ణమడుగ నింకొకచోట త్రవ్వగా దొరికినది. వాటిని ధరించినంత నా వటువు రామానుజాచార్యులవారిని భిక్షకై ఆహ్వానించెను. అంత యతిరాజులు త్రిదండము వినాభిక్ష చేయరాదనిరి.

పురుషోత్తమ క్షేత్రమందు శ్రీ జగన్నాధుండు అర్చకముఖముగా మీ గురుండు శ్రీకూర్మ క్షేత్రమునకు వెళ్లెను. కాబట్టి మీ రక్కడకు వెళ్ళుడని చెప్పగా వారందరు శ్రీకూర్మ క్షేత్రమునకు గురువుగాని తిరువారాధనము తిరుపగూడ, త్రిదండములను తీసుకొనివచ్చిరి. అంతవరకు నాలుగురోజు లా బ్రహ్మచారి శిష్యునివలె పరిచర్య చేయుచు అంతర్హితుండయ్యెను. అంత ఉడయవరులు వచ్చిన శ్రీవైష్ణవోత్తములనుజూచి సంతసించిరి. పిమ్మట శ్రీ రామానుజాచార్యులవారు శైవులందరను పిలచి సగౌరవముగా వారందరితో యీ శ్రీకూర్మనాధుడు శ్రీ మహావిష్ణుని రెండవ అవతారము పూర్వము ఋషికుల్యా నదీతీరమందు ఋషులందరు స్వామిని ప్రార్థించగా, వారి ప్రార్థనచే అవతరించిరి కాబట్టి శుద్ధసత్వ కూర్మాకారముగా దర్శనమిచ్చుచున్నారు. కాబట్టి వీరిని శ్రీవైష్ణవులు ఆరాధించుటకు ఈయుమని చెప్పిరి.

అంత నా శైవులు శ్రీభాష్యకారుల శ్రీసూక్తులనువిని, స్వామీ! మా పూర్వులనాటనుండియు మేము యీ స్వామిని శివలింగమని నమ్మి పూజించుచున్నాము. ఇక వేయిమాటలెందుకు ? ఒక నిశ్చయమునకు వత్తమని, తమరు కోవెలవెనుకభాగమందు భక్తిగానుండి ప్రార్థించుడు. యీ దేవుడు మీ కభిముఖముగా దిరిగినచో యీతఁడు మీ దేవుడే, లేనిచో ఈయన శివలింగమే. మేమర్చించకతప్పదు. మీకిచ్చుట కవకాశము లేదనిరి. వీరిద్దరికిని అప్పటి కళింగపట్టణపు రాజు మధ్యస్థుడుగానుండెను. అంత రామానుజులవారు కూర్మగుండమందు తీర్థమాడి ద్వాదశోర్ధ్వ పుండ్రములు. తిరుపవిత్రములు. తులసితావళములు, త్రిదండముతో పూర్ణచంద్రునివలె ప్రకాశించుచు మందహాస ముతో కోవెలకు వేంచేసిరి. వారు వెళ్ళునపుడు శ్రీవైష్ణవులకు వేయిపడగల శేషునివలెను, శైవులకు చక్రధరు డైన, శ్రీ మహావిష్ణువుగాను, సాధువులకు సన్యాసిగాను, పండితులకు హయగ్రీవునివలెను, బ్రాహ్మణులకు బ్రహ్మ దేవునివలె ప్రకాశించుచు ఆలయమున ప్రదక్షిణముఁజేసి శ్రీకూర్మనాధుని పృష్ఠభాగమందు మృదువగు ఆసనమున

పద్మాసనులై చేతులు జోడించి నిమీలితనేత్రులై భక్తితో ప్రార్థించిరి. అప్పుడు యతిపతికి అభిముఖముగా పశ్చిమమునకు తిరిగి శ్రీకూర్మనాథుడు శంఖ, చక్ర, తిరుమణి, శ్రీచూర్ణాలంకృతుండై, సేవసాయించెను. పిమ్మట యతిరాజులు పరమసంతోషముతో శ్రీకూర్మనాథుని స్తోత్రముఁజేయుచు శిష్యబృందముతో నీ వృత్తాంతము జెప్పెను. అప్పుడు అచ్చటనున్న రాజు, శైవులు, వైష్ణవులు అందరును సాష్టాంగము శిలాస్వరూపముతో వేంచేసియున్న శ్రీకూర్మనాథుని ధృవస్వరూపము యిటుల శ్రీరామానుజుల ప్రార్థనపై తూర్పునుండి ఒక క్షణములో అంతరిక్షమునను పశ్చిమమునకు తిరిగి పోవుటనుగాంచి సంభ్రమాశ్చర్యచకితులైరి. శ్రీకూర్మనాథునియొక్కయు భగవద్రామానుజులవారియొక్కయు ఈ సత్యతకు లొంగిపోయి ఆ రాజున్ను అర్చక పరిచారకాది శైవులున్ను, అందరు శ్రీ రామానుజులవారి శ్రీ పాదము లాశ్రయించి శిష్యులైరి. పిమ్మట రామానుజులవారు పాంచరాత్రాగమక్రమంబున సంప్రోక్షణచేసి వారి తిరువారాధనగా అర్చింపబడే శ్రీ గోవిందరాజస్వామి, శ్రీదేవి, భూదేవిమార్లతో వేంచేపుచేసి వారినికూడ నిచ్చట నుంచివేసి, ప్రసన్నతచేసి శ్రీవైష్ణవగోష్ఠితో తీర్థప్రసాద పరిగ్రహణముఁజేసి మంగళాశాసనము సమర్పించిరి. శ్రీరామానుజాచార్యుల వారు కూర్మనాథప్రకాశకులని ప్రసిద్ధిచెందిరి.

అప్పుడు శైవులు కొందరు జ్ఞాన భక్తి వైరాగ్యములతో రామానుజాచార్యులవారిని ప్రార్థించగా వారికి దేవయజనముచే చక్రాబ్జమండలదీక్షగా వైష్ణవేష్టిచేయించి చక్రాంకిత దీక్షయిచ్చి పాంచరాత్రాగమ పూజావిధానమును నిర్ణయించి శ్రీకూర్మనాథునికి అర్చక పరిచారక స్వాములుగా నిర్ణయించిరి. నాటనుండి నేటివరకు వారి కుటుంబములవారు శ్రీకూర్మనాథుని ప్రసాదమునే స్వీకరించుచు వేతనాపేక్షలేకుండా శ్రీకూర్మనాథుని సేవించుచున్నారు. అంత శ్రీ రామానుజాచార్యులవారి ప్రార్థనచే ఇదివరకు తూర్పునకభిముఖముగానున్న శ్రీకూర్మనాథుడు పశ్చిమాభి ముఖులయినందున శ్రీరామానుజులవారు పశ్చిమమునతిరిగి వేరే ధ్వజస్తంభమును జయస్తంభముగా ప్రతిష్ఠించిరి. (ప్రస్తుత మా స్తంభములేనందున అపరరామానుజాచార్యులవారగు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ స్వాములవారు వేంచేసి పశ్చిమ ధ్వజస్తంభములేని లోపమును పూర్తిచేయ సంకల్పించుటచే వారి సంకల్పానుసారముగా ధ్వజస్తంభమును ప్రతిష్ఠించుటకు ధనమున్ను సిద్ధమైనది. కొద్దిరోజులలో ధ్వజస్తంభప్రతిష్ఠ జరుగును.) అష్టతీర్థములు.

శ్లో॥ నారదంచ సుధాకుండం చక్రతీర్థంచ మాధవం
కౌటల్యంవక్రతీర్థంచ నారసింహా మహోదధి॥

1. అని యెనిమిది గుండములు గలవు. క్షేత్రమునకు ఉత్తరమున నారదగుండము నారదుడు తపముచేసిన పవిత్రస్థలము.
2. ఆలయమునకు ఎదురుగ కూర్మగుండమనే సుధాకుండము- శ్రీవారి చక్రప్రయోగముచే బయలువెడలిన పాతాళగంగ. దీనినుండి శ్రీ మహాలక్ష్మి అవతరించినది.
3. గ్రామమునకు తూర్పున 2 మైళ్ళలో చక్రతీర్థము, శ్రీకూర్మనాథులు శ్వేతచక్రవర్తికి దీనిలోనుండి తాతేలరూపముగావచ్చి దివ్యదర్శనమిచ్చిన పవిత్రతీర్థము.
4. గ్రామములోనే మాధవతీర్థమని, చిన్నగుండము గలదు.
5. గ్రామమునకు పశ్చిమదిక్కున మైలుదూరమున కీటల్య మహాముని శ్రీవారినిగురించి తపముచేసినచోటు ఇచ్చట విష్ణుపాదములతో ఆలయము, కౌటిల్యగుండము గలదు.
6. గ్రామమునకు తూర్పున 3 మైళ్ళ దూరమున వక్రతీర్థము. ఇచ్చట వక్రాంగమహాముని ఆశ్రమము, శ్వేతచక్రవర్తికి శ్రీకూర్మనాథుడు ప్రత్యక్షమైన పిమ్మట శ్రీవారు చక్రవర్తి నారదులవారు యీ ఆశ్రమమునకు పాదచారులై వచ్చిరి. పరమపవిత్ర తీర్థము మహాశివమిరోజున విద్యార్థులు మొదలగు చాలమంది ఇందు తీర్థాటనము చేతురు. విద్యార్థులు స్నానముచేసినచో విద్య బాగావచ్చునట.
7. నారసింహగుండం సముద్రమునకు దగ్గరగానున్నది. తిలోత్తమ తపస్సుచే కూర్మనాథులు నరసింహరూపముగా ప్రత్యక్షమయిన స్థలమున నరసింహగుండము.
8. మహోదధి సముద్రస్నానము.

యీ అష్టతీర్థమహాయోగమని మాఘమాసమున మకరరాశియందు సూర్యుడుండగా అష్టమి ఆదివారమును షష్ణమి ఆదివారమైనను నియమితదినములలో ప్రజలందరు యాత్రగా రెండుమూడురోజులు వచ్చుచు ఆయాగుండములలో వరుసగా రోజుకొకదానిలో స్నానదానాదులనుచేసి శ్రీకూర్మనాథుని సేవింతురు.

శ్లో॥ శ్వేతరాజప్రసన్నాయ శ్వేతాచల నివాసినే
శ్వేతపుష్కరిణీ తీరవాసాయ శుభమంగళమ్॥
భాష్యకారప్రసన్నాయ పరమానందరూపిణే
శ్వేతాచలనివాసాయ కూర్మనాథాయ మంగళమ్॥

విలేఖరి- శ్రీ భాష్యం వెంకటాచార్యులు, శ్రీకూర్మం.

---

శ్రీ మ తే రా మా ను జా య న మః

## భక్తినివేదనపత్రిక చందాదారులకు - ముఖ్యగమనిక.

మన భక్తినివేదన పత్రికకు చందాలు చాలా రావలసి యున్నది. రానికారణముచే ఆశ్రమములో ముద్రణాలయము తాత్కాలికముగ మూసివేయవలసి వచ్చినది. ఈ మధ్యకాలమునుండి యీ పత్రిక నచ్చట నచ్చట ప్రచురించుచుంటిమి. అందుచే పత్రికలో ప్రచురించదలచినవానిని సక్రమముగా ప్రచురించుటకు వీలు కలుగుటలేదు.

ప్రస్తుతము ఇవియన్నియు యోజించి పత్రిక ఇకనుండి సరియగు కాలమునకు సలక్షణముగ వెడలుటకును, చాల ముఖ్యమైనట్టియు, సంప్రదాయమునకు ప్రధానమైనట్టియు, వ్యాసములతోను, అనుష్ఠాన కార్య సూచికలతోను, గీతా ప్రచురణలతోను, నారీవిభాగము, బాల విభాగములు ఇత్యాదులతోను, ఏర్పాటు చేయుచున్నాము. ముద్రణాలయమునుకూడ, ప్రారంభించ ప్రయత్నించుచున్నాము. ఇకనుండి పత్రిక బాధ్యతలు సకాలమున నిర్వహించుటకు శ్రీమాన్ వంగిపురం రంగాచార్యులగారిని, మేనేజరుగా నియమించితిమి. వారు ఒకపర్యాయము చందాల వసూళ్ళకై చందాదారులవద్దకు రాగలరు. చందాదారులందరును తమతమ బాకీలనన్నింటిని పూర్తిగ వీరికి చెల్లించి, వీరి వల్ల తాత్కాలిక రసీదును తీసుకొనవలసినదిగ కోరుచున్నాము. చందాలు చెల్లించిన వారందరికిని, పత్రిక కార్యాలయమునుండి చందాచెల్లించిన, 15 దినములలో పక్కారసీదులు వేరేపోస్టులో, సహాయసంపాదకుల సంతకముతోను, కార్యాలయ ముద్రతోను, పంపబడగలవు. అటుల పక్కారసీదులు అందనివారు తెలియజేసినచో మేము ఆ విషయము విచారించగలము. ప్రతినెలయు మొదటి తారీఖుననే పత్రిక చాల జాగ్రత్తగ పోస్టు చేయబడును. సకాలములో తమకు పత్రిక అందనిచో వెంటనే మాకు తెలియజేసినచో అందును గురించియు విచారించగలము.

వాసుదాశ్రమము
వడిగడ్డపాలెం
చుండూరు. P. O.
గుంటూరు జిల్లా.

ఇట్లు,
శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజీయర్ స్వామివారి అనుమతితో
సహాయసంపాదకులు
కవిరత్న : గుదిమెళ్ళ రామానుజాచార్యులు.

---

## బరంపురం

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు. తమ శుక్రవారోత్సవ వార్షిక సభలను 3 రోజులు శ్రీ తిరుమల పెద్దింటి తిరువేంగళ తాయారమ్మగారి ఆధిపత్యంక్రింద మహావైభవముగా జరిపిరి.

చతుర్థాధ్యాయార్థ సంగ్రహము.

శ్లో. ప్రసఙ్గా త్స్వ స్వభావోక్తిః
కర్మణోఽకర్మతాస్య చ
భేదా జ్ఞానస్య మాహాత్మ్యం
చతుర్థాధ్యాయ ఉచ్యతే॥

అర్థము :- ప్రసఙ్గాత్ = ప్రసంగవశమున, స్వస్వభావోక్తిః = భగవదవతార యసాధారణ స్వరూపమును చెప్పుట, అస్య చ కర్మణః = ఈ కర్మకు, అకర్మతా = జ్ఞానాకారణమగుటయు, (కర్మణః = కర్మయొక్క), భేదాః = భేదములున్ను. జ్ఞానస్య = జ్ఞానముయొక్క, మాహాత్మ్యం = మహాత్మ్యమున్ను. చతుర్థాధ్యాయే = నాల్గవ అధ్యాయమున. ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ మాటల ప్రసంగములో అవతరించిన భగవంతుని యసాధారణ స్వభావమును చెప్పుటయు, కర్మజ్ఞానాకారమగుటయు, కర్మయోగముయొక్క ప్రభావమున్ను యీ నాల్గవ అధ్యాయమున చెప్పబడుచున్నది.



# శ్రీ భగవద్గీత - చతుర్థాధ్యాయము

# విషయసూచిక

శ్లోక సంఖ్య

అస్మద్గురుభ్యో నమః

# శ్రీ భగవద్గీతా - చతుర్థోఽధ్యాయః

# జ్ఞానయోగః

అవ. కర్మయోగ మాచరించవలసినదే యనుటను బలపరచుటకు అది సనాతనమైన దనుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ

శ్రీకృష్ణుడు పలికెను

1. శ్లో. ఇమం వివస్వతే యోగం । ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ । మను రిక్ష్వాకవేఽ బ్రవీత్॥

అర్థము :- అవ్యయం = శాశ్వతమైన, ఇమం = ఈ, యోగం = కర్మయోగమును, అహం = నేను, వివస్వతే = సూర్యునకు, ప్రోక్తవాన్ = చెప్పితిని, వివస్వాన్ = సూర్యుడు, మనవే = వైవస్వతమనువునకు, ప్రాహ = చెప్పెను, మనుః = మనువు, ఇక్ష్వాకవే = ఇక్ష్వాకునకు, అబ్రవీత్ = చెప్పెను.

తా॥ ఈ కర్మయోగము శాశ్వతమైనది. పూర్వము నేను దీనిని సూర్యునకు చెప్పితిని. ఆతడు మనువునకును, మనువు ఇక్ష్వాకునకును ఉపదేశించిరి. కర్మయోగ మాచరించవలసినదే యనుటను బలపరచుటకు అది సనాతనమైన దనుచున్నాడు.

2. శ్లో. ఏవం పరమ్పరా ప్రాప్త । మిమం రాజర్షయో విదుః
స కాలేనే హ మహతా । యోగో నష్టః పరన్తప॥

అర్థము :- పరన్తప = (శత్రువుల తపింపచేయు) ఓ అర్జునా !. ఏవం = ఇట్లు, పరమ్పరాప్రాప్తం = సంప్రదాయక్రమముగావచ్చిన, ఇమం = ఈ కర్మ యోగమును, రాజర్షయః = రాజర్షులు, విదుః = తెలుసుకొనిరి, సః యోగః = ఆ యోగము, మహతా, కాలేన = చాల, కాలమగుటచేత, ఇహ = ఈ లోకమున, నష్టః = నశించినట్లే అయినది.

తా॥ అర్జునా ! ఇట్లు ఒకరి నుండి ఒకరికి ఉపదేశ పరంపరగా వచ్చిన యీ కర్మయోగమును రాజర్షు లెఱింగిరి. ఇప్పటికి చాలకాల మగుటచే ఆ కర్మయోగ మీా లోకమున యించుమించుగ నశించినట్లే అయిపోయినది.

3. శ్లో. స ఏవా యం మయా తే ఽద్య । యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి । రహస్యం హ్యేత దుత్తమమ్॥

అర్థము :- పురాతనః = ప్రాచీనమైన, సఏవ = ఆ కర్మయోగమే, అయః, యోగః = ఈ కర్మయోగము, (త్వం) = (నీవు), మే = నాకు, భక్తః = భక్తుడవు, సఖా చ = స్నేహితుడవును, (ఇతి) = (అని), అద్య = ఇప్పుడు, మయా = నాచేత, తే = నీకు, ప్రోక్తః = చెప్పబడినది. ఏతత్ = ఇది, ఉత్తమం = శ్రేష్ఠమైన, రహస్యం హి = రహస్యముకదా !

తా॥ ఇప్పుడు నీ కుపదేశించునది ఆ సనాతన కర్మయోగమే. ఇది ఉత్తమ రహస్యమైనను నీవు నాకు భక్తుడవును, స్నేహితుడవును గాన ఇప్పుడు నీకు నేను ఉపదేశించుచున్నాను.

అవ. భగవంతుని యవతార రహస్యమును స్పష్టముగా ఆయనవల్ల
వినగోరి అర్జును డడుగుచున్నాడు.

అర్జున ఉవాచ : అర్జునుడు పలికెను.

4. శ్లో. అపరం భవతో జన్మ । పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం । త్వ మాదౌ ప్రోక్తవా నితి॥

అర్థము :— భవతః — నీయొక్క, జన్మ — పుట్టుక, అపరం — తక్కువకాలము క్రిందటిది, వివస్వతః — సూర్యునియొక్క, జన్మ — పుట్టుక, పరం — ఎక్కువకాలముక్రిందటిది, త్వం — నీవు, ఆదౌ — మొదట, ప్రోక్తవాన్ ఇతి — చెప్పితివనెడు, ఏ తత్ — ఈ మాటను, కథం — ఎట్లు విజానీయాం — నిజమనినమ్ముదును ?

తా॥ కృష్ణా ! నీ వీ మధ్య పుట్టితివి. సూర్యుని పుట్టుక యిరువది యెనిమిది చతుర్యుగముల క్రిందటిది. అట్టి తరి నీవు సూర్యున కీ యోగము నుపదేశించుట నిజమని నే నెట్లు నమ్మగలను ?

---

* ఈ ప్రశ్నలో 6 ప్రశ్న లిమిడియున్నవి :— (1) నీ యవతారము ఇంద్రజాలము వంటిదా, లేక మా జన్మవలె సత్యమా ? (2) సత్యమైనచో మావలె నీస్వభావములను విడిచి అవతరింతువా ? (3) నీశరీరము మాశరీరమువలె ప్రాకృతమా అప్రాకృతమా ? (4) మావలె నీవును పుణ్యపాపములను కల్గించుకొని యవతరింతువా లేక సంకల్పముచేతనే యవతరింతువా, (5) మావలె ఆకల్పిత పుణ్యపాపములు పండవలెనా ? లేక ధర్మము నశించి అధర్మము పెరిగినతరి యవతరింతువా ? (6) మావలె సుఖదుఃఖానుభవముకొఱ కవతరింతువా ? లేక సాధు పరిత్రాణాదుల కొఱకా ? అని—

అవ. శ్రీకృష్ణుడు అర్జునుని ఆశయము నెఱింగి ముందు తన యవతారము సత్యమైనదే యనుచున్నాడు.

శ్రీభగవాన్ ఉవాచ = శ్రీకృష్ణుడు చెప్పెను.

5. శ్లో. బహూని మే వ్యతీతాని । జన్మాని తవ చార్జున
తాన్య హం వేద సర్వాణి । న త్వం వేత్థ పరన్తప॥

అర్థము :- పరన్తప = శత్రుసంహారకుడవగు, అర్జున = ఓ అర్జునా !, మే = నాకును, తవచ = నీకును, బహూని = పెక్కులు, జన్మాని = జన్మలు, వ్యతీతాని = గడచినవి, అహం = నేను, తాని, సర్వాణి = వాటిని, అన్నింటిని, వేద = ఎఱుగుదును, త్వం = నీవు, నవేత్థ = ఎఱుగవు.

తా॥ అర్జునా ! నీవలెనే నాకును పెక్కుజన్మలు గడచినవి. కాని, నాకవి యన్నియు తెలియును ; నీ వెఱుగవు.

అవ. శ్రీకృష్ణుడు తన స్వభావమును విడువకయే తానవతరించురీతిని, అవతారమునగూడ తన దివ్యశరీరధారణమును, తన సంకల్పముచేత మాత్రమే తానవతరించుటను చెప్పుచున్నాడు.

6. శ్లో. అజో ఽపి సన్నవ్యయాత్మా । భూతానా మీశ్వరో ఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ । సమ్భవా మ్యాత్మమాయయా॥

అర్థము :- అజోఽపిసన్ = పుట్టుకలేనివాడనగుచున్నను, అవ్యయాత్మా (ఽపిసన్) = నశింపని స్వభావము కలవాడనగుచున్నను, భూతానాం ఈశ్వరో (ఽపిసన్) = ప్రాణులకు నియామకుడనగుచున్నను, స్వాం = నాస్వంతమగు, ప్రకృతిం = దివ్యశరీరమును, అధిష్ఠాయ = అవలంబించి, ఆత్మమాయయా = నా సంకల్పముచేత, సమ్భవామి = పుట్టుచున్నాను.

తా. నేను కర్మవలన కలుగునట్టి పుట్టుటయు గిట్టుటయు లేనివాడను. సర్వభూతములను శిక్షించువాడను. అయినను నా సంకల్పముచే నా పరమేశ్వర స్వభావమును విడువకయే యప్రాకృత దివ్యశరీరముతో పుట్టుచున్నాను.

అవ. శ్రీకృష్ణుడు తానవతరించు సమయమును చెప్పుచున్నాడు.

7. శ్లో. యదా యదా హి ధర్మస్య । గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య । తదాత్మానం సృజా మ్యహమ్॥

అర్థము :- భారత = అర్జునా ! ధర్మస్య = వేదోక్తధర్మమునకు, యదాయదాహి = ఎప్పుడెప్పుడైతే, గ్లానిః = నష్టము, భవతి = కలుగుచున్నదో, అధర్మస్య = అధర్మమునకు, అభ్యుత్థానం = అభివృద్ధి, భవతి = కలుగుచున్నదో, తదా = అప్పుడు, అహం = నేను, ఆత్మానం = నన్ను, సృజామి = సృజింతును.

తా॥ నా జన్మకు కాలనియమము లేదు. వేదోక్తమైన వర్ణాశ్రమ ధర్మములు నశించి అధర్మము ప్రబలినప్పుడెల్లను నేను నా సంకల్పముచే నవతరించుచుందును.

అవ. శ్రీకృష్ణుడు తన యవతార ప్రయోజనమును చెప్పుచున్నాడు.

8. శ్లో. పరిత్రాణాయ సాధూనాం । వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ । సమ్భవామి యుగే యుగే॥

అర్థము :- సాధూనాం = సజ్జనులయొక్క, పరిత్రాణాయ = రక్షణకొరకును, దుష్కృతాం = దుష్టులయొక్క, వినాశాయ చ = నాశముకొఱకున్ను, ధర్మసంస్థాపనార్థాయ = ధర్మమును చక్కగ స్థాపించుటకొఱకును, యుగేయుగే = ప్రతి యుగమందును, సమ్భవామి = పుట్టుచున్నాను.

తా॥ సజ్జనులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును, వైదిక వర్ణాశ్రమధర్మములను లెస్సగ నెలకొల్పుటకును ప్రతి యుగమందును అవతరించుచుందును.

అవ. ఇట్టి యవతార రహస్యము నెఱుంగుటకు ఫలమును చెప్పుచున్నాడు.

9. శ్లో. జన్మ కర్మ చ మే దివ్య। మేవం యో వేత్తి తత్త్వతః
తక్త్వా దేహం పునర్జన్మ। నైతి మా మేతి సో ఽర్జున॥

అర్థము :- అర్జున = అర్జునుడా! దివ్యం = అప్రాకృతమైన. మే = నాయొక్క. జన్మ = అవతారమును, కర్మ చ = అవతారకృత్యమును, యః = ఎవడు, ఏవం = ఈచెప్పినటుల, తత్త్వతః = వాస్తవముగ, వేత్తి = ఎఱుంగుచున్నాడో, సః = వాడు, దేహం = ప్రస్తుత దేహమును, త్యక్త్వా = విడిచిపెట్టి, పునఃజన్మ = తిరిగిపుట్టుకను, న ఏతి = పొందడు, మాం = నన్ను, ఏతి = పొందుచున్నాడు.

తా॥ అర్జునా! ఇప్పుడు నీకు నేను చెప్పినట్లు నా యప్రాకృతమైన అవతార రహస్యమును, నా అవతారకృత్యముల రహస్యమును చక్కగ నెఱుంగువాడు ఈ శరీరమును విడిచి తిరిగి పుట్టక పరమ పురుష సాయుజ్యమును పొందును.

అవ. ఈ యవతార రహస్యజ్ఞానమునకు శిష్టాచారమునుకూడ చూపుచున్నాడు.

10. శ్లో. వీతరాగభయక్రోధా। మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా। పూతామద్భావ మాగతాః॥

అర్థము :- వీతరాగభయక్రోధాః = పోగొట్టబడిన అనురాగము భయము కోపము కలవారును, మన్మయాః = నాయందే మనస్సు నుంచినవారును, మాం = నన్ను, ఉపాశ్రితాః = ఆశ్రయించినవారును అగు, బహవః = అనేకులు, జ్ఞానతపసా = నాయవతార తత్వజ్ఞాన మనెడు తపస్సుచేత, పూతాః = పవిత్రులై, మద్భావం = నాస్వభావమును, ఆగతాః = పొందిరి.

తా॥ నా యవతార రహస్యమును వాస్తవముగ నెఱుంగుట ఒక తపస్సువంటిది. తపస్సుచేతనువలె దీనిచే యనేకులు పవిత్రులై యితరవిషయములయందు ప్రీతిని విడిచి, భయములేక, క్రోధమును పోద్రోలి, నన్నాశ్రయించి, నాయందు చిత్తము లగ్నము చేసి, నా సాయుజ్యమును పొందిరి.

అవ. శ్రీకృష్ణుడు తన సౌలభ్యమునకు చివరహద్దగు అర్చావతార
వైభవమును ఉపదేశించుచున్నాడు.

11. శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే । తాం స్తథైవభజా మ్యహమ్
మమ వర్త్మానువర్తన్తే । మనుష్యాః పార్థ । సర్వశః॥

అర్థము :– పార్థ = అర్జునా ! యే = ఎవరు, యథా = ఏవిధముగా (భావించి) మాం = నన్ను, ప్రపద్యన్తే = ఆశ్రయింతురో, అహం = నేను, తాన్ = వారినిగూర్చి, తథైవ = ఆవిధముగనే, భజామి = (నన్ను) చూపుచున్నాను. మనుష్యాః = మనుష్యులు, మమ = నాయొక్క, వర్త్మ = స్వభావమును, సర్వశః = అన్నివిధములుగా, అనువర్తన్తే = అనుభవించుచు వర్తించు చున్నారు.

తా॥ నాభక్తులు నన్ను తమ కిష్టమగు ఏ రూపముతో భావించి యాశ్రయింతురో వారి కారూపముతోనే నా దర్శన మొసంగు దును. ఇట్టివారు నా సౌశీల్యాది స్వభావమునంతను తమ ఇంద్రి యములతో తాము కోరినట్లు అనుభవింతురు.

అవ. కర్మయోగాధికారులు అరుదుగ నుండుటకు కారణమును
చెప్పుచున్నాడు.

12. శ్లో. కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం । యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే । సిద్ధి ర్భవతి కర్మజా॥

అర్థము :– ఇహ = ఈలోకమునందు, కర్మణాం = (తాముచేసిన) కర్మలకు, సిద్ధిం = ఫలమును, కాఙ్క్షన్తః = కోరుచున్నవారై, దేవతాః = ఇంద్రాదులను, యజన్తే = ఆరాధించుచున్నారు. మానుషే, లోకే = మనుష్య, లోకము నందు, కర్మజా = కర్మలవలన పుట్టునట్టి, సిద్ధిః = ఫలము, క్షిప్రం = శీఘ్రముగా, భవతి హి = అగుచున్నదికదా !

తా॥ ఈ లోకమున కామ్యకర్మలకు ఫలము వెంటనే లభించును. కావున, తరుచు మనుష్యు లందరును ఆ క్షుద్రఐహికఫలాశతో ఇంద్రాది దేవతలనే పూజింతురు.

అవ. కర్మయోగము నారంభించుటకు అటంకములగు పాపములు పోవునట్టి ఉపాయము నుపదేశించుచున్నాడు.

13. శ్లో. చాతుర్వర్ణ్యం మయా సృష్టం । గుణ కర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం । విద్ధ్యకర్తార మవ్యయమ్॥

అర్థము :— మయా = నాచేత, చాతుర్వర్ణ్యం = నాలుగు వర్ణములును, గుణకర్మవిభాగశః = సత్వాదిగుణములయొక్కయు, శమాదికర్మలయొక్కయు విభాగము ననుసరించి, సృష్టం = సృజించబడెను. మాం = నన్ను, తస్య = ఆసృష్టికి, కర్తారమపి = కర్తనైనను, అకర్తారం = కర్తను కావనియు, అవ్యయం = నశించననియు, విద్ధి = తెలిసికొనుము.

తా॥ నేనే బ్రాహ్మణాది నాలుగు వర్ణములు మొదలుగాగల జగత్తునంతను, సత్వాదిగుణములను, వాటికి తగిన శమదమాదికర్మలను వారివారికి తగునట్లు విభాగించి సృజించితిని. కాని, నన్ను దానికి కర్తనని తలంచరాదు.

అవ. తానే చేసియు కర్తకాకుండుట ఎటులనో తెలుపుచున్నాడు.

14. శ్లో. న మాం కర్మాణి లిమ్పన్తి । న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యో ఽభిజానాతి । కర్మభి ర్న స బధ్యతే॥

అర్థము :— కర్మాణి = ఈసృష్ట్యాదికర్మలు, మాం = నన్ను, నలిమ్పన్తి = అంటవు, మే = నాకు, కర్మఫలే = ఆసృష్ట్యాది కర్మఫలమునందు, స్పృహా = కోరిక, న = లేదు, ఇతి = ఈలాగునని, మాం = నన్ను, యః = ఎవడు, అభిజానాతి = ఎఱుంగుచున్నాడో, సః = వాడు, కర్మభిః = కర్మలచే, నబధ్యతే = బంధింపబడడు.

తా॥ నాకు యీ సృష్ట్యాది కర్మఫలమున కోరిక లేదు. గాన, నన్నా కర్మలు సంసారమున బంధింపజాలవు. ఇట్లెఱింగినవాడు కూడా కర్మలచే నెన్నడును బద్ధుడు కాడు.

అవ. ఇందులకు శిష్టాచారమును ప్రమాణముగా జూపుచున్నాడు.

15. శ్లో. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ । పూర్వై రపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మా త్త్వం।పూర్వైః పూర్వతరం కృతమ్॥

అర్థము :— ఏవం = ఈవిధముగా, మాం = నన్ను, జ్ఞాత్వా = తెలిసికొని, పూర్వైః = ప్రాచీనులగు, ముముక్షుభిరపి = మోక్షకాంక్షులచేతనున్ను, కర్మ = కర్మ యోగము, కృతం = చేయబడినది, తస్మాత్ = కాబట్టి, త్వం = నీవు, పూర్వైః = పూర్వులచే, కృతం = చేయబడిన, పూర్వతరం = మిక్కిలి పురాతనమైన, కర్మైవ = కర్మయోగమునే, కురు = చేయుము.

తా॥ పూర్వము మోక్షమును కోరువారందరును పైవిధానము నెఱింగి కర్మయోగము నాచరించిరి. గాన, నీవు కూడ సనాతనమగు దీనినే యాచరింపుము.

అవ. మోక్ష సాధనమగు కర్మ నెఱుంగుట కష్టసాధ్యమనుచున్నాడు.

16. శ్లో. కిం కర్మ కి మకర్మేతి । కవయో ఽప్యత్ర మోహితాః
త త్తే కర్మ ప్రవక్ష్యామి । యజ్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్॥

అర్థము :— కర్మ = (ముముక్షువు చేయవలసిన) కర్మ, కిం = ఎట్టిది ? అకర్మ = ఆత్మతత్వజ్ఞానము, కిం = ఎట్టిది ? ఇత్యత్ర = అను నీవిషయమై, కవయః అపి = జ్ఞానులుకూడ, మోహితాః = భ్రమించిరి, యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలుసుకొని, అశుభాత్ = సంసారమునుండి, మోక్ష్యసే = విడువబడుదువో, తత్ = అట్టి, కర్మ = కర్మను, తే = నీకు, ప్రవక్ష్యామి = చెప్పెదను.

తా॥ ముముక్షు వెట్టి కర్మ ననుష్ఠించవలెను ? ఆ కర్మమునందలి ఆత్మ తత్వజ్ఞానాంశమెట్టిది ? అనెడు విషయములను గూర్చి పండితులు కూడ భ్రమించుచున్నారు. వాటిని నీకు చక్కగ బోధింతును. వాటి నెఱింగి నీవు మోక్షమును పొందగలవు.

17. శ్లో. కర్మణో హ్యపి బోద్ధవ్యం । బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం । గహనా కర్మణో గతిః॥

అర్థము :— హి = ఏకారణమువలన, కర్మణః = కర్మకు సంబంధించి, బోద్ధవ్యం = తెలియవలసినదియు, వికర్మణః = వివిధ కర్మలకు సంబంధించి, బోద్ధవ్యం = తెలియవలసినదియు, అకర్మణఃచ = జ్ఞానమునకు సంబంధించి; బోద్ధవ్యం = తెలియవలసినదియు, (అస్తి = కలదు), కర్మణః = కర్మ యొక్క, గతిః = విధము, గహనా = తెలియశక్యముకానిది.

తా॥ మోక్షసాధనమైన కర్మలనుగూర్చియు, నిత్యనైమిత్తిక కామ్య కర్మలను గూర్చియు, జ్ఞానమును గూర్చియు విస్తారముగ తెలియవలసిన యంశములు పెక్కులు గలవు. కాబట్టి, కర్మగతి తెలియ శక్యమైనది కాదు.

అవ. కర్మనుగూర్చియు, అకర్మనుగూర్చియు తెలిసికొనదగినదానిని చెప్పుచున్నాడు.

18. శ్లో. కర్మణ్యకర్మ యః పశ్యే । దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్మనుష్యేషు । సయుక్తః కృత్స్నకర్మకృత్॥

అర్థము :— యః = ఎవడు, కర్మణి = కర్మయందు, అకర్మ = ఆత్మజ్ఞానమును, పశ్యేత్ = చూచునో, యః = ఎవడు, అకర్మణి = జ్ఞానమునందు, కర్మచ = కర్మనున్ను, పశ్యేత్ = చూచునో. సః = వాడు, మనుష్యేషు = మనుష్యులలో, బుద్ధిమాన్ = బుద్ధిమంతుడు, సః = వాడు, యుక్తః = మోక్షార్హుడు, కృత్స్నకర్మకృత్ = సమస్తకర్మలను చేసినవాడు.

తా॥ కర్మల నాచరించుచుండగనే దానియందు ఆత్మజ్ఞానమును, ఆత్మ జ్ఞానము వర్తించుచుండగనే దానియందు కర్మను చూచువాడు మనుష్యులలో సకలశాస్త్రార్థముల నెఱింగినవాడు. వాడే మోక్షార్హుడు. వాడే సకలకర్మల నాచరించినవాడు అగును.

అవ. ప్రత్యక్షముగా చేయబడు కర్మ జ్ఞానరూప మెట్లగునో చెప్పుచున్నాడు.

19. శ్లో. యస్య సర్వే సమారమ్భాః । కామ సఙ్కల్పవర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం । త మాహుః పణ్డితంబుధాః॥

అర్థము :- యస్య = ఎవనియొక్క, సర్వే = సమస్తమైన, సమారమ్భాః = కర్మలు. కామసఙ్కల్పవర్జితాః = ఫలసంగ దేహాత్మాదిభ్రాంతులులేనివగుచున్నవో; తం = అట్టి, పణ్డితం = పండితుని, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం = ఆత్మయదార్థ జ్ఞానమనెడు అగ్నిచే దహింపబడి ప్రాచీనకర్మలు గలవానినిగా, బుధాః = జ్ఞానులు, ఆహుః = చెప్పెదరు.

తా॥ ఫలమందాశయు, దేహమే ఆత్మయను భ్రాంతియు, లేక కర్మలను చేయువానిని అట్టి కర్మయోగాంతర్గతమగు ఆత్మజ్ఞానముచే తన ప్రాచీన కర్మలను బంధహేతువులు కాకుండ చేసుకొనిన జ్ఞాని యని తెలిసినవారు చెప్పుదురు.

20. శ్లో. త్యక్త్వా కర్మ ఫలా సఙ్గం । నిత్య తృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తో ఽపి । నైవ కిఞ్చి త్కరోతి సః॥

అర్థము :- కర్మఫలాసఙ్గం = కర్మఫలమునందాసక్తిని, త్యక్త్వా = విడిచిపెట్టి, నిత్యతృప్తః = నిత్యమగుఆత్మయందుతృప్తిచెందినవాడును, నిరాశ్రయః = (ప్రకృతియందు) ఆశ్రయబుద్ధిలేనివాడును. కర్మణి = కర్మయందు, అభిప్రవృత్తోఽపి = అభిముఖముగా ప్రవర్తించినవాడైనను. సః = వాడు, కిఞ్చిత్ = ఒక్క, కర్మ = కర్మనైనను, న, కరోత్యేవ = చేయనివాడే.

తా॥ ఫలాశను వీడి, ఆత్మయందే తృప్తుడై ప్రకృతి తన కాశ్రయమని తలంచక కర్మలను చేయువాడు, వాటియందాభిముఖ్యముతో ప్రవర్తించినను వాడు ఒక్క కర్మనైనను చేయనివాడే యగును.

21. శ్లో. నిరాశీ ర్యతచిత్తాత్మా । త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ । కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥

అర్థము :- నిరాశీః = ఫలాశలేనివాడును, యతచిత్తాత్మా = చిత్తమును, మనస్సును నిగ్రహించినవాడును, త్యక్త సర్వపరిగ్రహః = అన్నిటియందును మమతను విడిచినవాడై, శారీరం = శరీరపోషణకుమాత్ర మపసరమగు, కర్మ కేవలం = కర్మనుమాత్రము, కుర్వన్ = చేయుచున్నవాడు, కిల్బిషం = పాపమును, నాఽఽప్నోతి = పొందడు.

తా॥ ఫలము నపేక్షింపక, మనస్సుతో నితరవిషయముల చింతించక, ఆత్మేతరములయందు మమకారమును వీడి, శరీరపోషణకు మాత్ర ముపయోగించు కర్మను చేయువానికి సంసారబంధముండదు.

22. శ్లో. యదృచ్ఛాలాభసన్తుష్టో । ద్వన్ద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధావసిద్ధౌ చ । కృత్వాఽపి న నిబధ్యతే॥

అర్థము :- యదృచ్ఛాలాభసన్తుష్టః = తనంతనే లభించినదానితో తృప్తిని చెందినవాడును, ద్వన్ద్వాతీతః = శీతోష్ణాది ద్వంద్వములకు లొంగనివాడును, విమత్సరః = మాత్సర్యము లేనివాడును, సిద్ధౌ = ఫలము లభించుటయందును, అసిద్ధౌచ = లభించకుండుటయందును, సమః = సమచిత్తుడును అగువాడు, కృత్వాఅపి = కర్మలను చేసినను, న నిబధ్యతే = సంసారమున బంధింపబడడు.

తా॥ శరీరపోషణకు అప్రయత్నముగా నొరికిన వాటితో తృప్తి నొందుచు, శీతోష్ణాములను సహించుచు, పరులయందు మాత్సర్యమును వీడి, తన పనులకు ఫలము లభించినను లభించకున్నను చిత్తమును చలింపనీయక కేవల కర్మల నాచరించు పురుషుడు సంసారబద్ధుడు కాడు.

అవ. కర్మయోగ ప్రభావముచే విరోధి కర్మలన్నియు నశించుననుచున్నాడు.

23. శ్లో. గతసఙ్గస్య ముక్తస్య । జ్ఞానావస్థితచేతసః
యజ్ఞా యాచరతః కర్మ । సమగ్రం ప్రవిలీయతే॥

అర్థము :– జ్ఞానావస్థితచేతసః = ఆత్మజ్ఞానమునందు లగ్నమైన మనస్సు కలవాడును, గతసఙ్గస్య = ఇతర వస్తువులయందు ఆసక్తిలేనివాడును, ముక్తస్య = భార్యా మొదలగు పరివారముచే విడువబడినవాడును. యజ్ఞాయ = యజ్ఞము కొరకు, ఆచరతః = వర్తించువానియొక్క, కర్మ = ప్రాచీనకర్మ, సమగ్రం = పూర్తిగ. ప్రవిలీయతే = నశించుచున్నది.

తా॥ ఆత్మజ్ఞానియగుటచే తదితరవస్తువులయందు ఆసక్తిని విడిచి, భార్యాపుత్రాది పరివారమునందు తగులుకొనక, యజ్ఞాదికముల నాచరించు వాని ప్రాచీనకర్మమంతయు పూర్తిగ నశించును.

అవ. ఇంతవరకు శుద్ధాత్మస్వరూపానుసంధానముచే కర్మలకు జ్ఞానాకారత్వమును చెప్పి, ఇప్పుడు కర్మలను పరమాత్మ స్వరూపములుగా భావించుటచే జ్ఞానాకారత్వమును చెప్పుచున్నాడు.

24. శ్లో. బ్రహ్మార్పణం బ్రహ్మహవిః। బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం । బ్రహ్మ కర్మ సమాధినా॥

అర్థము :– బ్రహ్మార్పణం = బ్రహ్మమేయైన హోమసాధనములు కలదియు. బ్రహ్మహవిః = బ్రహ్మమేయైన హవిస్సు, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమేయైన అగ్నియందు, బ్రహ్మణా = బ్రహ్మమేయైన కర్తచే, హుతం = హోమము చేయబడుచున్నది. (ఇతి) = (అని). బ్రహ్మకర్మ సమాధినా = కర్మలన్నియు బ్రహ్మమయమని తలంచునట్టి, తేన = వానిచేత, బ్రహ్మైవ = బ్రహ్మమగు తన ఆత్మస్వరూపమే. గన్తవ్యం = పొందతగినది.

తా॥ బ్రహ్మకార్యమగుటచే బ్రహ్మమగు హోమసాధనములచే, స్వతః బ్రహ్మమగు హవిస్సును బ్రహ్మమగు అగ్నిలో బ్రహ్మస్వరూపుడగు యజమానునిచే హోమము చేయబడుచున్నదని, యిట్లు కర్మలనన్నిటిని బ్రహ్మమయమని తలంచువాడు బ్రహ్మాత్మకమగు శుద్ధాత్మ స్వరూపమును పొందును. అనగా ముముక్షువు చేయు కర్మలన్నియు పరబ్రహ్మాత్మకములే యని తలంచబడును గావున అవి జ్ఞానాకారములే యగుటచే వేరుగ జ్ఞాననిష్ఠ లేకయే అవి ఆత్మసాక్షాత్కారమును కలిగించునని భావము.

అవ. ఈ శ్లోకము మొదలు 29 వ శ్లోకమువరకు కర్మయోగభేదములను చెప్పుచున్నాడు.

25. శ్లో. దైవ మేవా పరే యజ్ఞం । యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం । యజ్ఞే నైవోపజుహ్వతి॥

అర్థము :- అపరే = మరికొందఱు, యోగినః = కర్మయోగులు, దైవం = దేవతార్చన రూపమైన, యజ్ఞమేవ = యజ్ఞమునే, పర్యుపాసతే = సేవించుచున్నారు. అపరే = మరికొందఱు, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మరూపమగు అగ్నియందు, యజ్ఞేనైవ = యజ్ఞసాధనములచేతనే, యజ్ఞం = హవిస్సును, ఉపజుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా॥ కొందరు కర్మయోగులు దేవతార్చనమునే యజ్ఞముగా నిష్ఠతో నాచరింతురు. మరికొందరు బ్రహ్మార్పణమ్మను శ్లోకమున చెప్పినట్లు అగ్నిని బ్రహ్మగాభావించి సాధారణయజ్ఞముల నాచరించుచున్నారు.

అవ. ఇందు జ్ఞానేంద్రియములను నియమించుటను యజ్ఞముగా జెప్పుచున్నాడు.

26. శ్లో. శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే । సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయా నన్యే । ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥

అర్థము :- అన్యే = మరికొందరు, శ్రోత్రాదీని = చెవి మొదలగు, ఇంద్రియాణి = జ్ఞానేంద్రియములను, సంయమాగ్నిషు = నిగ్రహమనెడు అగ్నులయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు. అన్యే = ఇతరులు, శబ్దాదీన్ = శబ్దము మొదలైన విషయాన్ = విషయములను, ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియము లనెడు అగ్నులయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా॥ కొందరు కర్మయోగులు శ్రోత్రాది ఇంద్రియములను స్వాధీనపరచుకొనుటయందే ప్రయత్నము చేయుదురు. అనగా వాటిని విషయములవైపే ప్రవర్తింపనీయరు. మరికొందరు ఇంద్రియములకు శబ్దాదులయందు ఆసక్తిని నివారించుటకు ప్రయత్నించుచున్నారు. అనగా విషయములు సమీపించినను అవి ఏమియు పనిచేయజాలనట్లు గావింతురు.

అవ. ఈ శ్లోకమున కర్మేంద్రియనియమనములను యజ్ఞముగా చెప్పుచున్నాడు.

27. శ్లో. సర్వాణీన్ద్రియకర్మాణి । ప్రాణకర్మాణి చా పరే ;
ఆత్మసంయమయోగాగ్నౌ । జుహ్వతి జ్ఞానదీపితే॥

అర్థము :- అపరే = కొందరు, సర్వా = సమస్తములైన, ఇన్ద్రియకర్మాణి = ఇంద్రియ వ్యాపారములను, ప్రాణకర్మాణి = ప్రాణవ్యాపారములను, జ్ఞానదీపితే = జ్ఞానముచే ప్రకాశింప చేయబడుచున్న, ఆత్మసంయమ యోగాగ్నౌ = మనోనిగ్రహమనెడు అగ్నియందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా॥ కొందరుకర్మయోగులు చూచుట మొదలగు ఇంద్రియకార్యముల యందును, ఉచ్ఛ్వాసనిశ్వాసము లనెడు ప్రాణకార్యములయందును మనస్సునకుగల ఆసక్తినిఅరికట్టుటకు ప్రయత్నించుచున్నారు.

అవ. వేరు వేరు కర్మయోగనిష్ఠలిందు చెప్పబడుచున్నారు.

28. శ్లో. ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞాః । యోగయజ్ఞా స్తథాఽపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞా శ్చ । యతయ స్సంశితవ్రతాః॥

అర్థము :- సంశితవ్రతాః = దృఢసంకల్పముగల, అపరే = మరికొందరు, యతయః = కర్మయోగులు, ద్రవ్యయజ్ఞాః = న్యాయముగ ధనము నార్జించి సద్వినియోగపరచుటయే యజ్ఞముగా గలవారును, తపోయజ్ఞాః = ఉపవాసాది తపస్సులే యజ్ఞముగా కలవారును, తథా = అట్లే, అపరే = కొందరు, యోగయజ్ఞాః = తీర్థయాత్రాదులే యజ్ఞముగా కలవారును. (ఇతరే = ఇంకను కొందరు). స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ = వేదమును, దాని యర్థమును అభ్యసించుటయునే యజ్ఞముగా కలవారు, భవంతి = అగుచున్నారు.

తా॥ ద్రవ్యయజ్ఞులు కొందరు కర్మయోగులు, న్యాయముగ ద్రవ్యము నార్జించి దేవతార్చనము, దానము, యాగము మొదలగు పనుల కుపయోగింతురు. కొందరు ఉపవాసాదులయందు నిష్ఠ కలిగియుందురు. కొందరు పుణ్యనదీస్నాన, పుణ్యక్షేత్రదర్శనముల యందే ఆసక్తిని కలిగియుందురు. కొందరు వేదమును, దాని యర్థజ్ఞానమును అభ్యసించుటయందు ఆసక్తి కలిగియుందురు.

అవ. కొందరు పూరక రేచక కుంభక రూపమగు ప్రాణాయామమును యజ్ఞముగా చేయుచున్నారనుచున్నాడు

29. శ్లో. అపానే జుహ్వతి ప్రాణం । ప్రాణేఽపానం తథాఽపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా । ప్రాణాయామపరాయణాః॥

30. శ్లో. అపరే నియతాహారాః । ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి

అర్థము :- అపరే = కొందరు, ప్రాణాయామ పరాయణాః = ప్రాణాయామమునం దాసక్తులై, నియతాహారాః = పరిమితమైన ఆహారము కలవారై, ప్రాణం = ప్రాణవాయువును, అపానే = అపానవాయువునందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు. తథా = అట్లే, అపరే = మరికొందరు, అపానే = అపానవాయువును, ప్రాణే = ప్రాణవాయువునందు, అపరే = మరికొందరు, ప్రాణాపానగతీ = ప్రాణ, అపానవాయువులయొక్క ప్రసారమును, రుద్ధ్వా = బంధించి, ప్రాణాన్ = ప్రాణవృత్తులను, ప్రాణేషు = ప్రాణములయందు, జుహ్వతి = హోమము చేయుచున్నారు.

తా॥ కొందరు కర్మయోగులు ఆహారనియమముతో, పైకి ప్రసరించు ప్రాణవాయువును క్రిందికిపోనిచ్చి 'పూరక' నిష్ఠను, కొందరు క్రిందికిపోవు అపానవాయువును పైకిపోనిచ్చి 'రేచక' నిష్ఠను, మరికొందరు ప్రాణవాయువుయొక్క ఉచ్ఛ్వాసమును అపానవాయువుయొక్క నిశ్వాసమును నిలిపి కుంభకనిష్ఠను సలిపి ప్రాణాయామపరాయణు లగుదురు.

అవ. ఈ కర్మయోగు లందరకును ఫలమొక్కటియే యనుచున్నాడు.

30. శ్లో. సర్వే ప్యేతే యజ్ఞవిదో । యజ్ఞక్షపితకల్మషాః॥

31. శ్లో. యజ్ఞశిష్టామృతభుజో । యాన్తి బ్రహ్మ సనాతనమ్

అర్థము :- ఏతే, సర్వేఽపి = వీరందరున్ను, యజ్ఞవిదః = యజ్ఞముల నెఱింగినవారును, యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞములచే నశింప జేయబడిన పాపములు కలవారును, యజ్ఞశిష్టామృతభుజః = యజ్ఞమునందు మిగిలిన అమృతమనెడు అన్నమును భుజించువారై, సనాతనం = శాశ్వతమైన, బ్రహ్మ = ఆత్మస్వరూపమును, యాన్తి = పొందుచున్నారు.

తా॥ ఇట్లు కర్మయోగులు యజ్ఞములలో తాము కోరినవాటి నాచరించి పాపములను పారద్రోలి యజ్ఞశిష్టాన్నముచే శరీరమును నిలుపుకొనుచు శాశ్వతమైన ఆత్మస్వరూపమును పొందుదురు.

అవ. పై యజ్ఞములను పరిగ్రహించి నిత్యనైమిత్తికములను విడువరా దనుచున్నారు.

31. శ్లో. నాయం లోకోఽస్త్యయజ్ఞస్య । కుతోఽన్యః కురుసత్తమ॥

అర్థము :– కురుసత్తమ = అర్జునా !, అయజ్ఞస్య = కర్మయజ్ఞముల జేయనివానికి, అయం, లోకః = ఈ లోకము, నాస్తి = లేదు. అన్యః = మోక్షము, కుతః = ఎట్లు, (భవతి = కలుగుచున్నది.)

తా॥ నిత్యనైమిత్తికాదికర్మల నాచరించనివానికి ధర్మార్థకామములే సిద్ధించవుగదా ! ఇక మోక్షమెట్లు సిద్ధించును ?

అవ. ఈ చెప్పబడిన కర్మయోగభేదముల నన్నిటిని నిత్యనైమిత్తిక కర్మలద్వారా ఆచరించవలసిన విధిని తిరిగిచెప్పి యీ యర్థమును వివరించుచున్నాడు.

32. శ్లో. ఏవం బహువిధా యజ్ఞాః । వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్విద్ధి తాన్ సర్వా । నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

అర్థము :– ఏవం = ఈ ప్రకారము, బహువిధాః = అనేకవిధములైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః = శుద్ధాత్మ స్వరూపముయొక్క, ముఖే = ఉపాయమగుట విషయమై, వితతాః = విస్తరించియున్నవి. తాన్ సర్వాన్ = వాటి నన్నిటిని. కర్మజాన్ = కర్మలవలన పుట్టినవాటినిగా, విద్ధి = తెలుసుకొనుము. ఏవం = ఇట్లు, జ్ఞాత్వా = తెలుసుకొని, విమోక్ష్యసే = (సంసారమునుండి) విడవబడుదువు.

తా॥ ఇట్లు కర్మయోగము పెక్కురీతులుగా శుద్ధాత్మప్రాప్తికి సాధనమై యున్నది. ఇవి యన్నియు నిత్యనైమిత్తిక కర్మలవలననే నిర్వహింపబడునవి. ఇట్లెఱింగి వీటి నాచరించినచో సంసార బంధము విచ్ఛిన్నమగును.

అవ. కర్మయోగమునందలి కర్మభాగముకంటె దానిలోనున్న జ్ఞానభాగమే ప్రధానమనుచున్నాడు.

33. శ్లో. శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ । జ్ఞానయజ్ఞః పరన్తప
సర్వం కర్మాఖిలం పార్థ । జ్ఞానే పరిసమాప్యతే॥

అర్థము :- పరన్తప = శత్రువుల తపింపజేయు, పార్థ = అర్జునా !. ద్రవ్యమయాత్ = ద్రవ్యమయమైన, యజ్ఞాత్ = యజ్ఞముకంటె. జ్ఞానయజ్ఞః = జ్ఞానమయ యజ్ఞము, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది. సర్వం కర్మ = సమస్త విధమైన కర్మయు, అఖిలం = దానిసాధనములన్నియును. జ్ఞానే = జ్ఞానమునందు, పరిసమాప్యతే = పర్యవసించుచున్నవి.

తా॥ కర్మయోగము ద్రవ్యమయాంశమనియు, జ్ఞానమయాంశమనియు రెండంశలు గలిగియుండును. అందు సమస్త తర్పణము, దాని సాధనములును జ్ఞానాంశమందే పర్యవసించును గాన అదియే ద్రవ్యమయాంశముకంటె ప్రధానమైనది.

అవ. ఈ జ్ఞానమును అడుగడుగునకు జ్ఞానులవలన విని తెలుసుకొనవలయునని చెప్పుచున్నాడు.

34. శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన । పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం । జ్ఞానినస్తత్త్వదర్శినః॥

అర్థము :- తత్ = ఆ యాత్మజ్ఞానమును, ప్రణిపాతేన = సాష్టాంగ నమస్కారము చేతను. పరిప్రశ్నేన = అడుగుటచేతను. సేవయా = శుశ్రూషచేతను. విద్ధి = తెలిసికొనుము. తత్వదర్శినః = ఆత్మసాక్షాత్కారముగల, జ్ఞానినః = జ్ఞానులు, తే = నీకు, జ్ఞానం = జ్ఞానమును, ఉపదేక్ష్యన్తి = ఉపదేశింతురు.

తా॥ అర్జునా ! నే జెప్పిన ఆత్మజ్ఞానమును, ఆత్మస్వరూపమును సాక్షాత్కరించిన జ్ఞానులు నీకు చక్కగ నుపదేశింతురు. కావున, నీవు వారికి సాష్టాంగనమస్కారమాచరించి, శుశ్రూషచేసి అడిగి తెలుసుకొనుము.

అవ. ఆత్మసాక్షాత్కార జ్ఞానమునకు గుర్తులు చెప్పుచున్నాడు.

35. శ్లో. యత్ జ్ఞాత్వా న పున ర్మోహ । మేవం యాస్యసి పాణ్డవ
యేన భూతా న్యశేషేణ । ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి॥

అర్థము :- పాణ్డవ = అర్జునా !, యత్ = ఏ జ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొని, పునః = తిరిగి. ఏవం = ఈ విధముగ, మోహం = అజ్ఞానమును, నయాస్యసి = పొందవో, యేన = దేనిచేత, భూతాని = జీవులను, అశేషేణ = పూర్తిగా, ఆత్మని = నీయందును. అథః = పిమ్మట. మయి = నాయందును, ద్రక్ష్యసి = చూడగలవు

తా॥ ప్రకృతిబంధమును వీడిన పరిశుద్ధాత్మలన్నియు జ్ఞానాకారమనెడు ఒకేవిధమగు ఆకారముతో నుండియు, పరమాత్మతో సమానములుగ నుండును. కావుననే ఆత్మస్వరూపమును సాక్షాత్కరించిన జ్ఞానికి దేహాత్మభ్రాంతియు మమకారమును ఉండవు. గాన తనను చూడగనే తక్కిన ఆత్మలన్నియు తనవలెనే యుండుటను గాంచును. పరమాత్మను చూడగనే తక్కిన ఆత్మలన్నియు ఆతనివలెనే యుండుటను గాంచును.

అవ. కర్మయోగమునందలి జ్ఞానభాగము సకలపాపములను పోద్రోలునని దాని మహిమను చెప్పుచున్నాడు.

36. శ్లో. అపి చే దసి పాపేభ్య । స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవే నైవ । వృజినం సన్తరిష్యసి॥

అర్థము :- సర్వేభ్యః = సమస్తమైన, పాపేభ్యః = పాపాత్ములకంటె, పాపకృత్తమః = మిక్కిలిపాపాత్ముడు, అపిచేదసి = అయినప్పటికిన్ని. సర్వం = సకలమైన, వృజినం = పాపమును, జ్ఞానప్లవేనైవ = జ్ఞానమనెడు తెప్పచేతనే, సంతరిష్యసి = దాటగలవు.

తా॥ నీ వెంత పాపాత్ముడవైనను ఈ జ్ఞానమున్నచో తెప్పచే సముద్రమును దాటినట్లు సమస్త పాపములను ఈ జ్ఞానమనెడు తెప్పచేతనే దాటగలవు.

అవ. ఈ జన్మయందు మాత్రము ఉదయించిన యీకొద్దిపాటి జ్ఞానమొక్కటి మాత్రము అనాది కాలమునుండి వచ్చుచున్న అనంత పాపరాశి నెట్లు పోగొట్టునో దృష్టాంతముతో జూపుచున్నాడు.

37. శ్లో. యథైధాంసి సమిద్ధో ఽగ్ని । ర్భస్మసాత్కురుతే ఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి । భస్మసాత్కురుతే తథా॥

అర్థము :— అర్జున = అర్జునా ! సమిద్ధః = బాగుగా మండుచున్న, అగ్నిః = నిప్పు, యథా = ఎట్లు, ఏధాంసి = కట్టెలను, భస్మసాత్ కురుతే = బూడిదచేసి వేయునో, తథా = అట్లే, జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడునిప్పు; సర్వకర్మాణి = కర్మలనన్నిటిని, భస్మసాత్ కురుతే = భస్మమగునట్లు చేయును.

తా॥ ఓ అర్జునా ! లెస్సగా ప్రకాశించుచున్న అగ్నిదేవుడు కట్టెలను ఏ ప్రకారముగా భస్మము చేయుచున్నాడో, ఆ ప్రకారముగా జ్ఞానమనెడి అగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది.

అవ. అట్టిశక్తి జ్ఞానమున కుండుటకు హేతువు దాని పవిత్రతయే యనుచున్నాడు.

38. శ్లో. న హి జ్ఞానేన సదృశం । పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః । కాలేనాఽత్మని విన్దతి॥

అర్థము :- జ్ఞానేన = ఆత్మజ్ఞానముతో, సదృశం = సమానమైనదియు, పవిత్రం = పవిత్రమైనదియు, ఇహ = ఈలోకమున, నవిద్యతేహి = లేదుగదా ! తత్ = అజ్ఞానమును, యోగసంసిద్ధః = కర్మయోగసిద్ధినిపొందినవాడై, కాలేన = కాలక్రమమున, ఆత్మని = తనయాత్మయందు, స్వయం = ఉపదేశము లేకుండగనే, విన్దతి = పొందుచున్నాను.

తా॥ ఆత్మజ్ఞానముతో తుల్యమైన మరియొక పవిత్రవస్తువు లేదు. అది సకలపాపములను పోగొట్టును. కావున, జ్ఞానాకారమగు కర్మ యోగమును విడువక యాచరించువాడు క్రమముగ ఉపదేశము లేకనే జ్ఞానయోగి కాగలడు.

అవ. ఆ జ్ఞానమహిమనే మరింత స్పష్టముగా చెప్పుచున్నాడు.

39. శ్లో. శ్రద్ధావాన్ లభతే యోగం । తత్పర స్సంయతేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి । మచిరే ణాధిగచ్ఛతి॥

అర్థము :- శ్రద్ధావాన్ = జ్ఞానాభివృద్ధియందు త్వరగలవాడును, తత్పరః = దానియందే ఆసక్తికలవాడును; సంయతేన్ద్రియః = ఇంద్రియనిగ్రహము కలవాడును, జ్ఞానం = ఆత్మజ్ఞానమును, లభతే = పొందుచున్నాడు. జ్ఞానం = జ్ఞానమును లబ్ధ్వా = పొంది; అచిరేణ = వెంటనే, పరా = మిక్కిలి గొప్పదైన, శాన్తిం = ఆనందమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ ఆత్మజ్ఞానమును వృద్ధిచేసుకొనుట యందు త్వరకలవాడై, దాని యందే మనస్సును నిలిపి, తన ఇంద్రియములను ఇతరవిషయము లకు చేరనీయనివాడు త్వరలోనే జ్ఞానపరిపాకమును, దాని ఫల మగు పరమానందస్థానమును పొందగలడు.

అవ. ఇట్టి జ్ఞానము నార్జించు త్వరలేని వానికి కలుగు అనర్థములను చెప్పుచున్నాడు.

40. శ్లో. అజ్ఞ శ్చాశ్రద్దధాన శ్చ । సంశయాత్మా వినశ్యతి
నా యం లోకో ఽ స్తి న పరో । న సుఖం సంశయాత్మనః॥

అర్థము :- అజ్ఞ = జ్ఞానహీనుడును, అశ్రద్దధానశ్చ = త్వరలేనివాడును, సంశయాత్మా చ = సంశయముగలమనస్సుకలవాడును. వినశ్యతి = నశించుచున్నాడు. సంశయాత్మనః = సంశయించు మనస్సుగలవానికి, అయం. లోకః = ఈ లోకము, నాస్తి = లేదు. పరః = పరలోకము. న = లేదు. సుఖం = సుఖ మును. న = లేదు.

తా॥ ఉపదేశము వలన జ్ఞానము లభించనివాడును, ఉపదేశింపబడినను దాని వృద్ధియందు త్వరలేనివాడును, దానియందు సంశయము కలవాడును నశింతురు. అట్టి సంశయముకలవానికి చతుర్విధపురు షార్థములును సిద్ధింపవు ఇక సుఖమెక్కడిది ?

అవ. ఈయధ్యాయముయొక్క ప్రధానార్థమును ఉపసంహరించుచున్నాడు

41. శ్లో. యోగ సన్న్యస్త కర్మాణం । జ్ఞాన సఞ్ఛిన్న సంశయమ్
ఆత్మవన్తం న కర్మాణి । నిబధ్నన్తి ధనఞ్జయ॥

అర్థము :- ధనఞ్జయ = అర్జునా ! యోగసన్న్యస్తకర్మాణం = బుద్ధియోగముచే జ్ఞానాకారమునుపొందిన కర్మలు కలవాడును. జ్ఞానసఞ్ఛిన్నసంశయమ్ = ఆత్మజ్ఞానముచే పోగొట్టబడిన సంశయములు కలవాడును. ఆత్మవన్తం = దృఢమైన మనస్సుకలవాడును. అట్టివానిని. కర్మాణి = ప్రాచీనకర్మలు. న నిబధ్నన్తి = బంధించవు.

తా॥ ఓ ధనంజయా! యోగముచేత విడువబడిన సర్వకర్మములు గలిగినట్టి, బ్రహ్మజ్ఞానముచేత ఛేదింపబడిన సందేహము గలిగినట్టియు దృఢమనస్కుడయిన పురుషుని ప్రాచీనకర్మలు బంధించజాలవు.

అవ. ఇట్లు విస్తారముగా నుపదేశించిన అర్థమును అర్జునుని తప్పక ఆచరింపుమని విధించుచున్నాడు

42. శ్లో. తస్మా దజ్ఞాన సమ్భూతం । హృత్స్థం జ్ఞానాసినా ఽఽత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ । మాతిష్ఠోత్తిష్ఠ భారత॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగోనామ చతుర్థోఽధ్యాయః

అర్థము :- భారత = అర్జునా! తస్మాత్ = అందువలన. అజ్ఞానసమ్భూత = అజ్ఞానమువలనపుట్టిన. హృత్స్థం = హృదయమందున్న. ఆత్మనః = ఆత్మకు సంబంధించిన. ఏనం = ఈ. సంశయం = సంశయమును. జ్ఞానాసినా = ఆత్మజ్ఞానమనెడు కత్తితో. ఛిత్త్వా = ఖండించి. యోగం = కర్మయోగమును. ఆతిష్ఠ = ఆచరింపుము. ఉత్తిష్ఠ = లెమ్ము.

తా॥ అర్జునా! అందువలన అజ్ఞానమువలన బుట్టిన ఆత్మవిషయమైన సందేహమును ఆత్మజ్ఞానమనెడు కత్తితో ఖండించి నేనుపదేశించిన కర్మయోగము నాచరించుము. లెమ్ము.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును. శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన శ్రీభగవద్గీత యందలి జ్ఞానయోగమనెడి నాలుగవ అధ్యాయము.

| | | | |
|---|---|---|---|
| అర్జునుని శ్లోకములు | 1 | భగవంతుని శ్లోకములు | 41 |
| ఈ అధ్యాయమునందలి | | గీత ప్రారంభమునుండి | |
| శ్లోకముల సంఖ్య | 41 | ఇప్పటికైన శ్లోకసంఖ్య | 206 |

| | |
|---|---|
| 9 – 10 – 58 | భా॥ బ॥ గురువారం – సర్వేషాం ఏకాదశి |
| 12 – 10 – 58 | భా॥ బ॥ ఆదివారం – మహాలయ అమావాస్య |
| 21 – 10 – 58 | ఆశ్వయుజ॥ శు॥ మంగళవారం – పొయిఘాళ్వార్ తి॥ శమీపూజ |
| 22 – 10 – 58 | ఆ॥ శు॥ బుధవారం – పూదత్తాళ్వార్ తి॥ |
| 23 – 10 – 58 | ఆ॥ శు॥ గురువారం – సర్వేషాం ఏకాదశి పేయాళ్వార్ తి॥ |
| 27 – 10 – 58 | ఆ॥ శు॥ శనివారం – శరత్ పూర్ణిమ |

---

సూచిక :– కొన్ని అనివార్య కారణముల వలన ఈ సంవత్సరం పంచాంగం సకాలములో ప్రచురించలేకపోవుచున్నాము. ప్రస్తుతం ఇచ్చే కొన్ని పండగలు తిరునక్షత్రములు మాత్రం ఈ సంవత్సరం ప్రచురించుచున్నాము.

—సంపాదకులు.



శ్రీ మాన్ కరి వేంకటప్పలాచార్యులు.

వీరు శ్రీ కూర్మ క్షేత్ర వాస్తవ్యులు ఆభిజాత్య వంశీకులగు శ్రీ వైష్ణవస్వాములు. ఇటీవల తేది 8-6-'58లో శ్రీకాకుళం శ్రీ కోదండ రామస్వామివారి ఆలయములో శ్రీకృష్ణ విగ్రహమును సమర్పించిరి. వీరు ఇంగ్లీషులోను, సంస్కృతములోను, ఆంధ్రములోను చక్కగా కవిత్వము చెప్పగలరు. మరియు నాటక రంగస్థలములయందుకూడ అనుభవము కలదు. వీరికి శ్రియఃపతి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక.

— సంపాదకులు.

శ్రీమతే రామానుజాయ నమః





# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]

సంపుటి ౧౧ ‖ విళంబి - ఆశ్వయుజము ‖ సంచిక ౮

## శ్రీ భగవద్రామానుజ సిద్ధాంతము

శ్లో॥ నిత్యం హేయగుణావధూన నపరాః నైర్గుణ్యవాదాశ్శ్రుతా
సత్యార్థాస్సగుణోక్తయశ్శుభగుణప్రఖ్యాపనాద్బ్రహ్మణః
అద్వైతశ్రుతయో విశిష్టవిషయా నిష్కృష్టవేషాశ్రయాః
భేదోక్తిస్తదిహాఖిలశ్రుతిమతం రామానుజీయం మతం॥

తాత్పర్యము

పరబ్రహ్మ నిర్గుణుడని బోధించు, ఉపనిషద్వాక్యము లన్నియు నతనికి జన్మ, జరా, మృత్యు, క్షుత్, పిపాసాది దుఃఖజనకములైన దుర్గుణములు లేవని తెలుపును.

పరబ్రహ్మ సగుణుడు అను తెలుపు ఉపనిషద్వాక్యములన్నియు అతని కళ్యాణగుణములను దెలుపునవి గనుక వాస్తవమైన యర్థముకలవి.

బ్రహ్మము, ఒకటియేగాని మఱియొకటి లేదని తెలుపువాక్యములు చేతనాచేతనములను ఎన్నడును విడువనిసంబంధముచే వానిలో వ్యాపించియుండి వేరుగా నెఱుంగబడనిబ్రహ్మమొకటియేయని బోధించునవిగానున్నవి.

చేతనములను, అచేతనములను, పరమాత్మను, వేరు వేరుగా బోధించు వాక్యములు ప్రత్యేకముగా ఆ యా తత్వములై వాస్తవస్వరూపములను బోధించునవిగా నున్నవి.

కనుక శ్రీ భగవద్రామానుజ సిద్ధాంతమను పేరుతో
విశ్వ విఖ్యాతిగాంచిన యీ మతము
సకల శ్రుతిసమ్మతము

సంపాదకులు:
విద్వాన్
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు:
కవిరత్న
గుడిమెళ్ళ రామానుజాచార్యులు

# సాంఘిక వార్తలు

శ్రీకూర్మములో శ్రీ జియ్యర్ స్వామివారి భగవద్విషయ కాలక్షేపగోష్ఠి పరమ విలక్షణముగా సాగుచున్నది. ప్రస్తుతము ఈ భగవద్విషయకాలక్షేపము మొదలు కార్తీకశుద్ధ ఏకాదశికే జరుపవలెనను దీక్షతో కాలక్షేపగోష్ఠిని ఉదయం గం 7 ల మొదలు గం 9-30 ల వరకున్ను మధ్యాహ్నం గం. 2-0 మొదలు సాయంత్రం గం 5 ల వరకున్ను, తిరిగి రాత్రి గం 8 ల మొదలు 9-30 ల వరకున్ను శ్రీ జియ్యర్ స్వామివారు నిర్వహించుచున్నారు. భగీరథరథప్రధానుయాతభాగీరథీ ప్రవాహమువలె పరమానందకరముగా భగవద్విషయగోష్ఠి సాగుచున్నది. పరిసరప్రాంతములనుండియు మారుదేశములనుండియు పలువురు వైష్ణవస్వాములు భాగవతులు విచ్చేసి కాలక్షేపగోష్ఠిలో నన్వయించియున్నారు.

పవిత్రమైన శ్రీ కూర్మనాథ స్వామివారి సన్నిధిలో శ్రీ జియ్యర్ స్వామివారు చాతుర్మాస్యదీక్షావిధానముతోను భగవద్విషయానుసంధానముతోను నిత్యశ్రీర్నిత్యమంగళముగా వేంచేసియున్నారు

# గీతా పరీక్షలు

సెప్టెంబరు నెలఆఖరున 10, 11, 12, అధ్యాయములకుగా జరిపిన గీతాపరీక్షలలో ఈక్రిందివారు ఉత్తీర్ణులైరి.

1 శ్రీ న్యాపతి కన్నతల్లి ( శ్రీకాకుళం జిల్లా) - మొదటితరగతి
2 శ్రీ న్యాపతి రంగనాయకమ్మ - ( శ్రీకాకుళం జిల్లా) „ - మొదటితరగతి
3 శ్రీ న్యాపతి జానకిరాం ( శ్రీకాకుళం జిల్లా ) మొదటితరగతి
4 శ్రీ గురుమహంతి నారాయణమ్మ - ( శ్రీకాకుళం జిల్లా రెండవతరగతి

ఈ పరీక్షానిర్వహణములో సహాయకులైన శ్రీ మంగు శ్రీ వెంకటేశ్వర్లు B.A., B L., అడ్వకేటు గారికి శ్రీ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులుగారికి కృతజ్ఞులము.

ఈ గీతా పరీక్షలనుగురించి ఈసంవత్సరం గతజ్యేష్ఠమాస పత్రికలో విపులముగా ఉద్దేశములు, యోగ్యత, పరీక్షావిధానము, పాఠ్యక్రమము, పరీక్షలనుజరుపు సమయము పరీక్షలుజరుపువిధానము ఉత్తీర్ణత, దరఖాస్తులు, యోగ్యతాపత్రిక, టీకాతాత్పర్యములో వల్లించవలసిన శ్లోకములు వీనిని ప్రకటించితిమి. ఈపర్యాయము పరీక్షలు 13, 14, 15, అధ్యాయములకు జరుగును. వివరములు కోరువారు ఆశ్రమమునకు వ్రాయవలెను

# విషాదవార్త

కాశీవాస్తవ్యులు, ప్రముఖవిద్వాంసులు, శ్రీ వైష్ణవశిరోమణులగు శ్రీమాన్ దేవనాయకాచార్యస్వామివారు హఠాత్తుగా కలకత్తాలో జరిగిన మోటారుప్రమాదమునకు పాలై పరమపదించిరని తెలుపుటకు విచారించుచున్నాము.

## శ్రీ జియ్యర్ ఫండు - కట్నం - సంభావనలు

### జియ్యర్ ఫండు

శ్రీ ఇవటూరి నాగేశ్వరరావుగారు, బందరు — 10-0-0
శ్రీ మోతే పద్మావతమ్మగారు, ఏలూరు — 11-0 0
శ్రీ మట్లపల్లి అనసూయమ్మగారు, ఏలూరు — 11-0 0
శ్రీ గోపాళం భ్రమరాంబగారు, బాపట — 25-0-0

### కట్నం

బందరు శ్రీయతిరాజసేవా మహిళామండలివారు తమ సంఘవార్షికోత్సవములో సంఘమునకిచ్చిన కట్నం- 5-0-0

### కట్నం ఖాతా

శ్రీ పెండేకంటి రంగనాథంగారి పెద్దకుమారుడు వెంకటాద్రిగారికిన్ని శ్రీ రామినీడి వెంకటనూర్యనారాయణరావుగారి మూడోకుమార్తె చి॥సౌ॥ సీతాఫిరాట్టికిన్ని యిచ్చి వివాహముజరిపిన సందర్భములో సంఘమునకిచ్చిన కట్నం — 4-0-0

చావలి శ్రీ మహిళామండలివారు శ్రీ జియ్యర్ స్వామివారి తిరునక్షత్రములో పంపినకట్నం. 2-0-0
డిటో కణ్ణన్ తిరునక్షత్రకట్నం — 2-0-0
శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తిగారు, అడ్వకేటు శ్రీకాకుళం, తమజన్మదినోత్సవకట్నం — 5-0-0

### సంభావనలు

శ్రీ గ్రంధి వెంకటనరసయ్యగారు, మొగలితుర్రు తమభార్య పరమపదోత్సవంలో పంపినసంభావన - 2-0-0
శ్రీ మరింగంటి సీతారామాచార్యులుగారు, రాజమండ్రి తమపిన్నిగారు పేరుందేవమ్మగారు పరమపదించినసందర్భములో పంపినసంభావన — 1-0-0
శ్రీమాన్ కందాడ వెంకటకృష్ణమాచార్యులుగారు తమభార్య సీతమ్మఅనే సీతాలక్ష్మమ్మగారు పరమపదించినసందర్భంలో సంఘమునకుపంపిన సంభావన 10-0-0





శ్రీమతే రామానుజాయ నమః

# బదరీ అనుబంధము

మనసంఘ ప్రధానకార్యదర్శులగు శ్రీమాన్ ఉ. వే. తె. కం. గోపాలాచార్యులు గారు బదరిలో అష్టాక్షరీమహాక్షేత్ర నిర్మాణార్థమై నారాయణ ఉద్యానవనములకొరకై కొంచెము దగ్గరయుండి పనిచేయించుచున్నారు [illegible] పని యంతయు పూర్తియైనది. కాని క్రొత్తగా వేసిన [illegible] మిగిలి యున్నది. తలుపులకు ద్వారబంధములకు రంగులు వేయించవలెను. ఈ పనియంతయు సాధ్యమైనంతత్వరలో పూర్తికాగలదు.

మరియు శ్రీ గోపాలాచార్యస్వామివారు బదరిలో ఉభయవేదాంత కాలక్షేపములను పండితసభలను జరిపి పెక్కుమంది విద్యార్థులను, స్థానిక విద్వాంసులను, రంజింపజేయుచున్నారు విద్యార్థులకు తమబసలో ఉచితముగా సాపాటు ఏర్పాటుకూడా చేసియున్నారు. విద్యాలయము చక్కగా జరుగుచున్నది. "లక్ష్మణో లక్ష్మిసంపన్నః" అనునట్లు శ్రీ స్వామివారు పరమవిరక్తులుగా బదరికాశ్రమములో మనసంఘమునకు మనసా, వచసా, వపుషా, భగవద్భాగవతాచార్య కైంకర్యమును నిర్వహించుచున్నారు.

కించి. సత్సంగభవన నిర్మాణముకూడ యీ సంవత్సరమే ప్రారంభింపబడినది. పునాదులు లేచినవి. తలుపులు, ద్వారబంధములు పెట్టిరి. ఈ భవన నిర్మాణార్థమై 40,000 రూపాయలు ఎస్టిమేటు వేయబడినది. ఈ కైంకర్యమునకు 100 అరుసులకు విరాళమిచ్చువారు. రు 1600/లు సమర్పించవలెను. ఈప్రకారముగా ఇప్పటికి 10 మంది మాత్రమే లభించిరి.

ఇక, శ్రీబదరీ శ్రీనివాసరామానుజస్వామివారల శాశ్వత తాత్కాలిక పూజా విరాళములిచ్చిన వారందరి గోత్రనామములతో ఈసంవత్సరము యథావిధిగా పూజలు జరిపింపబడి వారివారికి ప్రసాదములుకూడ పంపబడినవి. ఈ మాసములో పంపని వారివేళ్లు మొన్ననే పంపినాము. వాటికికూడ పూజలుజరిపి ప్రసాదము రాగలదు. విరాళము లొసంగిన వారికెవరికైనను ప్రసాదములు రానిచో మాకు తెలియజేయగోరుచున్నాము.

"పాండిత్యం నిర్విద్య-బాల్యేన తిష్ఠాసేత్ అథమునిః"

వేదాంత పాండిత్య ఫలము బాల్యావస్థానుభవమే. అదికలిగిననే మునియగుచున్నాడనుచున్నదిఉపనిషత్తు.

వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములను మొదట బాలుడగు శ్రీశుకునకే గదా ఉపదేశించెను.

శ్రీకృష్ణభగవానుడు కూడ వయస్సుచే బాలుడు గాకపోయినను జ్ఞానముచే బాలుడై. లౌకికదృష్టిచే గృహస్థుడై, భోగాసక్తుడై, తనకేగకుండగ, తన సంతానము, జనులు మానవులందరికి కూడ సౌఖ్యము కావలెనని కోరు బహుకుటుంబీకుడై, రాజ్యకాంక్షితుడై, కీర్తి-ప్రతిష్ఠాసక్తుడై, అందుకై గురువులను, పితరులను, వంశీయులను యుద్ధమున నశింపజేయదలచివచ్చిన అర్జునునకే గదా, అతను కాంక్షించిన వాటి నన్నిటిని పూర్తిగ లభించుట కొరకే గదా గీతాశాస్త్రమును ఉపదేశించెను.

**భ.గీ. 11-33**...తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వాశత్రూన్ భుజ్క్ష్వరాజ్యం సమృద్ధ
**11-34**...యుధ్యస్వజేతాసి రణే సపత్నాన్.

వీటన్నిటివలన తెలియుచున్నదేమనగా వేదాంత శ్రవణము ముఖ్యముగా బాలురు, యువకులు అయినవారికి అవసరమైనదియే.

అసలు జీవితమునకంతకు గావలసిన విద్య యొక్క పునాదుల మానవుని నాలుగు మొదలు పన్నెండు సంవత్సరముల వయస్సుననే ఏర్పడును. ప్రహ్లాదునికివలెనే ప్రతివానికి కూడ మాతృగర్భముననే విద్యాబీజారోపణ జరిగినను అది అవ్యక్తావస్థ ఇక బీజారోపణయొక్క వ్యక్తావస్థ నాలుగు మొదలు పన్నెండు సంవత్సరముల వయస్సుమాత్రమే. అటు పిమ్మట అభ్యసించునదంతయు అంకురావస్థ-పల్లవిత - కోరకిత - పుష్పితావస్థలు మాత్రమే.

ఫలము బీజారోపణ ననుసరించియేగదా యుండును. మన జీవితములో సగము వంతు గత జీవితముల కర్మవాసనలబట్టియు మిగత సగము భాగము యిప్పటి మన శిక్షణబట్టియు జరుగుచుండును. ఈ బాల్యావస్థలో గతకర్మవాసనలు యింకను కార్యరూపమును దాల్చవు. గాన మంచిఅలవాట్లను, మంచి విషయములను శిక్షణనిచ్చినచో అవియె సులభముగ అలవాటుకు వీలుండును. వయస్సు మళ్ళి, విషయములు మనస్సుకెక్కిన పిమ్మట వ్యర్థమే- [illegible] ఇప్పటి వేదాంత శ్రవణము క్రియా రూపముపొంద జాలదు

ఇంకను వేదాంతమనగా ఇల్లు వాకిలి-భార్య బిడ్డలు, పెట్టిన పుట్టినవన్ని, కౌపీనధారియై అడవికో కొండలకో- గుహలకో వెళ్ళి నిరాహారులై ఎండ వానకు గురియై యొంటరిగ తలపటించుచుండ మనుటకాదు.

శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించినటుల రాజ్యమును, తన ఇల్లు-వాకిలి-పశువు-పంట, భార్య, బిడ్డలు, ధనము, ధాన్యము, మిత్రులు, పరివారము, ఆరోగ్యమును సంపాదించుకొని, కీర్తి, ప్రతిష్ఠలను గడించి, తాను తన వంశము, తనపరివారము సుఖముగా ఆనందముగ ఈజీవితమును నిశ్చింతతో పూర్ణముగ గడుపుట తిర్గి యిట్టి అప్రాప్యము అనిత్యము, అశాంతిదము, ఆనంద రహితము యగు జన్మమరణాదులు కలుగకుండగ ఈ దేహముతోనే ఈ కాలముననే ఈవస్తు సముదాయ ధారయుననే అనంతము నిత్యము శాన్తిదము అగు ఆనందస్థితిని పొందుటకు వలయు అర్థించక జ్ఞానము ను- తదనుష్ఠాన విధానమును తెలుపునట్టిదియే నిజమైన వేదాంతము.

నాయనలారా ఇప్పుడు మీరే చెప్పుడు. వేదాంతము ఎవరికి కావలయునో? మొగమునబొట్టు పెట్టుకొనుటకే అభిమానము సిగ్గులేక పరిహాసము తల్లిదండ్రులకుగాని, గురువులు- పెద్దలకుగాని దేవుని కిగాని నమస్కరించుటకు అవమానము. అభిమానము. దేవాలయములకు వెళ్ళుట వేదాంత గోష్ఠులలో పాల్గొనుట అసహ్యము లేక అసభ్యత ఇట్టిస్థితికి వచ్చినాము. ఇందులకు మన విద్యావిధానమున్ను, మన సాంఘికములైన కట్టుబాట్లు, మన ప్రభుత్వపరిపాలన, మనగురువులు- మఠాధిపతులు మున్నగువారి ప్రచారము కారణములు.

"తత్కర్మయన్నబంధాయనస విద్యాయావిముక్తయే

ఆయాసాయాపరం కర్మశీలాన్యాన్య త్రి నై పుణి"

మన చేయు ప్రతిపనియు మన బంధ హేతువై కారణము కావలెను. అటుగాని పను-పని ఆయాసముమాత్రమే ఫలమగును.

మనమభ్యసించు విద్యలన్నియు మన దుఃఖము పోగొట్టి ఆనందప్రాప్తికి కారణములు కావలెను లేనిచో అవన్నియు కేవలచాతుర్య ప్రదర్శనకు సాయితే యగును గదా.

వేదాంతమువలన ఎటులయానందమును పొందగలమో అదిలేనిచో ఎటుల కీడును పొందగలమో భారతములోని ఒక ఉదాహరణను తెలిపెదను.

ఒక చిట్టెలుక తనకన్నమునుండి బయటికి రాగా ఒక గ్రద్ద దానిని తన్నుకొని పోవుచుండెను. దారిలో ఒక డేగతో గ్రద్దకు పోట్లాటరాగా, ఆసందడిలో ఈ చిట్టెలుక గ్రద్దకాలిపట్టునుండి జారి అడవిలో ఒక మునికాలివద్ద ప్రాణావశిష్టయై పడెను. లేక కాలి మీదపడినదని, దానిని కరుణించి ముని బ్రతికించి బలిష్టమైనదానిగ జేసెను. ఒకనాడొక పిల్లి దానిని తరుమగా అది మునిని ఆశ్రయించెను. ముని దానిని ఒక పెద్దగండుపిల్లినిగ మార్చెను. దానినొకరోజున ఒక కుక్క తరుమగా ముని దానిని పెద్దకుక్కగ మార్చెను పిమ్మట దానిని తోడేలు తరుమగా ముని దానిని తోడేలునుగా జేసెను-దానిని సింహము తరుమగా ముని దానిని సింహముగ మార్చెను. దానినొక శరభము తరుమగా మునిదానిని శరభముగ మార్చెను. అది అవనమున స్వేచ్ఛగ తిరుగుచు మదించి అహంకారావిష్టుగాలై తన స్వరూప-స్వభావ-కర్తవ్యములను విస్మరించి, ముని యొక్క కృప- శక్తి- జ్ఞానములను మరచి ఒకనాడు మునినే మ్రింగబోయెను. సర్వజ్ఞుడు- సర్వశక్తి మంతుడగు ముని అదికని పెట్టి ఒసీ ఎలుకా, నీకీ దుర్బుద్ధి యేల అనెను. ఇంతలో శరభము చిట్టెలుకై పోయెను.

నాయనలారా! చూచితిరా- మనస్థితికూడ ఆచిట్టెలుకవలె గాకుండవలెను. రాయి, రప్ప రూపమునుండి క్రిమికీటక- మానవరూపమున ఆఖరి ఉత్కృష్టస్థితికి వచ్చితిమి. ఇప్పుడు మన యొక్క యీ ఆస్తిత్వ స్థితి-కారణ కారకుడైన సర్వేశ్వరుని యొక్క స్వరూప స్వభావముల మనము విస్మరించితిమా పునః అధోగతియే గాన అట్టి అధోగతి పొందకుండుటకై మనము తప్పక వేదాంతమును చిన్నతనమునుండియు వినవలెను, ఆచరించవలెను

బదరీ శ్రీనివాస, రామానుజ, స్వామివారల శాశ్వత, తాత్కాలిక, పూజావిరాళములు.

„ కాశి [illegible] గారు. కవుతరం బదరీ అష్టాక్షరీ మహాక్షేత్ర నిర్మాణార్థమై పంపినవిరాళం 600/-

శ్రీమాన్ కాకానిసత్యనారాయణ గారు. (బరంపురం) బదరికా అష్టాక్షరీ మహాక్షేత్ర నిర్మాణమునకు మరల సమర్పించినది, 300 -

శ్రీ చిన్న మంగయమ్మగారు విశాఖపట్నం 116/-

„ చింతపల్లి ఏకాదశమ్మగారు. వునికిలి 58/-

„ ఈమని అంజిరెడ్డిగారు. మండూరు వాగ్దానం 116/-

లో జమ 29/-

„ మండూరు శేషగిరి నరసింహారావుగారు. మండూరు. వాగ్దానం 29/ లో జమ 5/-

„ దామెర లక్ష్మీరామామమ్మగారు, విజయవాడ 29/

„ జాలూరి రుక్మిణమ్మగారు, మైలవరం 29/-

„ వల్లభనేని శ్రీరామమ్మగారు, అనుమనపూడి 29/-

„ తుమ్మల నరసమ్మగారు, అనుమనపూడి 29/-

„ గోనె పాపాయమ్మగారు మదరాసు 29/-

„ కొడకళ్ల సుందరవల్లి తాయారమ్మగారు, శనివారపేట 29/-

„ వల్లభనేని రత్నమ్మగారు. వునికిలి (సత్సంగం) 50/-

„ మరింగంటి రంగాచార్యులు గారు. పాలకొల్లు(తా) 12/

„ గరుడా బంగారమ్మగారు, విశాఖపట్నం 11/

„ తటవర్తి రామమోహనరావు గారు. (రేపల్లె(తా) 11/

„ గోపురాణి క్రిష్ణమాచార్యులు గారిభార్య సీతమ్మగారు నరసింహాపురం 29/-

„ కటికినేని వెంకటశేషాచలపతిరావుగారు పెట్లూరి పాలెం (నరసరావు పేట) 116/-

„ డాక్టరు నరసింహాచార్యులు గారు, హైద్రాబాద్ లో గడిచిదికాక/ 3-4-0

„ వి. సత్యవతీ దేవిగారు, అడయార్ మద్రాస్ 48-0-0

„ కందాడకృష్ణమాచార్యులు గారు, మాధవరం 11-0-0

„ వై.వి.యస్ ఆర్ కృష్ణయ్యగారు, అవనిగడ్డ 11-0-0

„ వి. భాష్యం అయ్యంగారు మద్రాస్ 5-0-0

„ చకిలం రత్నమ్మగారు, వరంగల్లు(తాత్కాలికం) 11-0-0

## శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ యతిరాజ సేవా మహిళా సంఘము, బాపట్ల

### 8వ సంవత్సర శుక్రవారోత్సవ వార్షికసభలు

శ్రీ విళంబినామ సంవత్సర నిజశ్రావణ శుద్ధ పౌర్ణమి గురువారమునుండి అనగా 28-8-1958 నుండి 31-8-1958 వరకు నాలుగుదినములు వార్షికసభలు ఈక్రింది కార్యక్రమము ప్రకారము మహావైభవముగా జరిగినవి. 28 వ తారీకు మధ్యాహ్నము మూడు గంటలనుండి శ్రీ శ్రోత్రపాండురంగ నంబెరుమాళ్లుగారి ఇంటివద్దనుండి శ్రీ యతిరాజులవారి పటమును వూరేగింపు చేసిరి అందు పలువురు భాగవతోత్తములు, స్త్రీలు పాల్గొనిరి. 29 నుండి ప్రతిదినము ఉదయము కన్యకాపరమేశ్వరీ వర్తకసంఘ ధర్మాదాయసత్రము నందు తిరువారాధన సేవాకాలం ఉపన్యాసములు పోటీ పరీక్షలు ప్రసాదములు వివరముగా జరిగినవి. ప్రతిదినము ఉదయము సాయంత్రము గుడివాడ కాపురస్థులు శ్రీమాన్ చలమచర్ల వెంకటాచార్యులవారు శ్రీమత్ భాగవతమును సంపూర్ణముగా ఉపన్యాస రూపకముగా సాయించి పలువురిచే మన్ననలనొంది సభలోని వారందరిని ఆనందపరచిరి. ఈ సభలకు ఉ. వే. బ్ర. శ్రీ వెం. నరసింహాచార్యుల వారును రామానుజ కీర్తికౌముది సంపాదకులు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారును శ్రీమాన్ డాక్టరు మరంగంటి నరసింహాచార్యుల వారును అధ్యక్షత వహించిరి. కార్యక్రమము చక్కగా నిర్వహించిరి. 29 వ తారీఖు చి. సౌ. కొప్పర్తి రంగనాయకమ్మ ప్రక్కవాద్యములచే వీణాజంత్రగాత్రములు పాడిరి. చి. సౌ. మాజేటి రత్న కుమారి 10 సం. బాలిక చక్కగా వీణాజంత్ర గాత్రములు పాడిరి. శ్రీమతి తడవర్తి చిట్టెమ్మగారు ప్రార్థనాగానము చేసిరి 30 వ తారీకున శ్రీమాన్ డాక్టరు మరంగంటి శేషాచార్యులవారిచే రచించబడిన వైకుంఠ విహార్ అను చక్కని స్వరూపసిద్ధమైన నాటకమును శ్రీ యతిరాజ మహిళామణులచే చక్కగా ప్రజారంజకముగా ప్రదర్శించ బడెను. ఈసంఘకార్యదర్శిని శ్రీమతి మరంగంటి సీతమ్మ గారు ఈనాటకనిర్వహణము చేసిరి. శ్రీమతి మం. సీతమ్మ గారు శ్రీమన్నారాయణుని పాత్రను చాలా చక్కగా నిర్వహించిరి. విష్వక్సేనులు నల్లందిఘళ్ లక్ష్మీనరసమ్మ గారు వహించిరి. అనంతశ్వాన్ గా శ్రీమతి చల్లా శేషు బాయిగారు అపరరామానుజులేవచ్చి గోపురమెక్కి అష్టాక్షరి వెదజల్లినట్లు ప్రేక్షకులు ఆనందించిరి. శ్రీదేవి భూదేవి పన్నిద్రాళ్వార్లు నారదులు ఆండాళ్లు జయవిజయులు ముక్తులు భక్తులు మొదలగు పాత్రలు ధరించినవారు వారి వారి పాత్రలను చక్కగా పోషించిరి. ప్రేక్షకులందరూ చూచి ఆనంద పరవశులై అప్పటికప్పుడు బహుమతుల కొరకు 40 రు. నిచ్చిరి. 31 వ తారీకున శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జియ్యరుస్వామివారి తిరునక్షత్రము శ్రీమతి యండూరి రామానుజమ్మగారి ప్రోత్సాహమువల్ల వారంతా ప్రతిసంవత్సరము భక్తిశ్రద్ధలతో జయప్రదముగాను ఈ సంవత్సరము వార్షికోత్సవములలో వచ్చినదిగాన అంద రినీ తిరునక్షత్రపు ఉత్సవమునందు అన్వయింపజేసి మహావైభవముగా జియ్యరుస్వామివారి పటమును వేంచేపుచేసి ఆనందముగా జరిపించిరి. సాయంత్రం నాటకం వేసినవారికి పాటకచేరీలు చేసినవారికి పోటీపరీక్షలలో ప్యాసైనవారికి బహుమతులు సంఘాధ్యక్షురాలు శ్రీమతి సీతమ్మగారు పంచి పెట్టిరి భాగవతోత్తములకు సత్కారములు చేసిరి. సంగీత పోటీపరీక్షలలో ఫస్టుప్రైజు వేంకటరత్నము, వైష్ణవ పత్రిక సంపాదకురాలు శ్రీమత్ తిరుమల లక్ష్మీకాంతమ్మ గారును సెకండుప్రైజు శ్రీమతి వింజమూరి జానికమ్మ గారును ప్రతిసంవత్సరము యిచ్చినట్లే వారు 20 రు పంపగా కొని యిచ్చినారము యేలూరునుండి మండలి పద్మావతి గారు, పాలపర్రునుండి శ్రీ యతిరాజసేవా మహిళామండలి కార్యదర్శిని నల్లాని చక్రవర్తుల అళ్వారమ్మగారు పాలకొల్లునుండి సత్తారు ఆండాళ్లమ్మగారి కోడలు కుమార్తె ఈ సభల ఆహ్వానము అందగానే వచ్చి సభలలో పాల్గొని మమ్మానందింపజేసిరి. ఈ సంఘమునందు మొదటినుండి ఉత్సాహముతో సేవచేయు శ్రీమతులు జవ్వాజి శేషారత్నమ్మ, కొత్త సత్తెమ్మ, వేముల దుర్గాంబగార్లు విశ్రమించక లేకుండా కార్యక్రమములను నిర్వహించి ధన్యులైరి.

---

### బదరికాశ్రమ సత్సంగ సదన విరాళములు

శ్రీ నేరెళ్ల జగన్నాథసత్యగారు (చీరాల) వీరు బదరికాశ్రమములో మహాసంఘముద్వారా నిర్మింపబడుచున్న సత్సంగసదనమునకు రు 1600/లు సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక.

శ్రీమాన్ డాక్టరు కాలయపల్లె చిలకమర్రి కృష్ణమాచార్యులుగారు, యిూ వెంకటాచార్యులు గారు, యిూ రంగయాచార్యులు గారు వీరు ముగ్గురు సోదరులు (ఆత్రమూరు) కలువల్లిగారి స్మృతిచిహ్నముగా బదరిలో నిర్మింపబడుచున్న సత్సంగసదనము నకు విరాళముగా రు 1600/లు సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సమస్త శుభములు ప్రసాదించుగాక.

శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల శఠకోపాచార్యులుగారు (రాజమండ్రి) తమతల్లిగారి స్మృతి చిహ్నముగా బదరీసత్సంగసదన నిర్మాణమునకు రు1600/లు సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సన్మంగళములు ప్రసాదించుగాక.

శ్రీమాన్ వంకదారు సత్యనారాయణగారు. (ఏలూరు) బదరీసత్సంగసదన నిర్మాణమునకు రు 1600/లు విరాళమిచ్చుటకు వాగ్దానము చేసి ప్రస్తుతము రు 1250-0-0 లు సమర్పించిరి. వీరికి శ్రియఃపతి సమస్త శుభములు ప్రసాదించుగాక.

| | ద్వైతము | అద్వైతము | విశిష్టాద్వైతము |
|---|---|---|---|
| (1) సత్యమైన తత్వసంఖ్య | ప్రకృతి జీవుడు ఈశ్వరుడు అనునవి మూడు | బ్రహ్మతత్వ మొక్కటిమాత్రమే సత్యము మిగత వన్నియు అసత్యములు, భ్రాంతికల్పితములుకాన మిథ్యామాత్రములు. | ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు అనునవి మూడు. |
| (2) ప్రకృతి | సత్యమైనది – భిన్నమైనది | అనాది భేదవాసనాది రూపమై, స్వరూపతిరోధాన రూపమై, వివిధవిచిత్ర విక్షేపకారియై సదా సదనిర్వచనీయమై, బ్రహ్మయందు పరికల్పితమై, భ్రాంతిరూపమైనది. | సర్వేశ్వరుని నిగ్రహ, అనుగ్రహ, రూపమై బంధ మోక్షములకు కారణమైన సత్య, నిత్య, స్వరూపమై చతుర్వింశతి తత్వాత్మకమైనది. |
| (3) జీవుడు | హరికన్న భిన్నులై,అనుచరులై, నీచోచ్చభావం గలవారై యుందురు. | పరబ్రహ్మయందు, అనాద్యవిద్యారూప దోషపరికల్పితమై, ఉపాధిప్రతిబింబితమైన, దేవ, తిర్యక్, మనుష్యాది భిన్నమైన మిథ్యాస్వరూపం. | పరమాత్మను శరీరభూతులై, జ్ఞానగుణకులై, జ్ఞానస్వరూపులై, పరస్పరభిన్నులై, సత్యనిత్యస్వరూపులు. |
| (4) ఈశ్వరుడు | వేదప్రతిపాద్యుడై పరాత్పరుడైన – హరి | అశేషవిశేషప్రత్యనీక, నిత్య, సత్య, శుద్ధముక్త, బుద్ధ, స్వప్రకాశ చిన్మాత్రుడు | వేదాంతప్రతిపాద్యుడై, నిఖిలప్రాయపత్యనీకుడై, అనంతకల్యాణగుణాకరుడై, చిదచిద్విశిష్టశరీరుడైన శ్రియఃపతియగు సర్వేశ్వరుడు. |
| (5) మోక్షము | నైజసుఖానుభూతి | బ్రహ్మాత్మైక్య ప్రతిపాదక మహావాక్య జన్యజ్ఞానము. ↑ | అర్చిరాదిమార్గముగ పొందగల పరమపదమున స్వస్వరూపావిర్భావముగలవాడై సర్వేశ్వరుని సాయుజ్యప్రాప్తి. |
| (6) మోక్ష సాధనము | నిర్మలమైన భక్తి | ↓ అవిద్యానివృత్తి | కర్మజ్ఞానాంగకమైన – భక్తి |
| (7) ప్రమాణములు | ప్రత్యక్ష - అనుమాన శబ్దములు అనుమూడు | ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి అనుఆరు | ప్రత్యక్ష అనుమాన శబ్దములు అను మూడు |



శ్రీమతే రామానుజాయ నమః

# అనుష్ఠాన విశేషములు

## (౧) ధనుర్మాసవ్రతము

## శ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారి ఉపన్యాససారము

సంగ్రహకర్త :- శ్రీ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు

శిష్టభక్తులందఱు విశిష్య అనుష్ఠించవలసిన యనుష్ఠానములలో ధనుర్మాస వ్రత మొకటి. సర్వలోకసాక్షి భూతుఁడై శ్రీమన్నారాయణుని యంతర్యామిగా గలిగిన శ్రీ సూర్యభగవానుఁడు ధనూరాశియందు ప్రవేశించినది మొదలు వరుసగా 30 దినములు అనగా సూర్యుఁడు ధనూరాశి నుండి మకరరాశికి ప్రవేశించువరకు నీ వ్రతము శ్రీ వైష్ణవులందఱు అవశ్య మాచరించవలసియున్నది.

ఈ వ్రతమును గుఱించి పారమార్ష్యగుహ్యసూత్రముల నందు విధి యున్నది. ప్రాచీనకాలమునుండియు శిష్టాగ్రేసరులచే ననుష్ఠింపబడుచున్నది.

ద్వాపరమున గోపికలచే నీ వ్రతమాచరింపబడి శ్రీకృష్ణ పరమాత్మ కటాక్షమునకుఁ బాత్రమయ్యెను. మరియు నీ యుగమున పెరియాళ్వార్ పుత్రికగా నవతరించిన శ్రీ గోదాదేవిచేగూడ నీ వ్రతమాచరింపబడి శ్రీ రంగ నాథుని కటాక్షమును బొందినదై యుండెను. ఆ సేతుశీతాచల పర్యంత మీ వ్రత మన్ని సంప్రదాయములకుఁ జెందినవారు కూడ తమతమ సంప్రదాయానుకూలముగాఁ గొలది భేదములతో నాచరించుచున్నారు.

అందు ముఖ్యముగ శ్రీ వైష్ణవత్వ ప్రతిపాదకమైన యీ వ్రతములు శ్రీ వైష్ణవులగు ప్రపన్నులందఱు యథాశక్తిగ, విధ్యుక్తముగ ననుష్ఠించుచున్నారు.

**ఈ వ్రతానుష్ఠానములో గొన్ని విశేషాంశములు.**

ప్రతిదినము సూర్యోదయాత్పూర్వము 4 ఘడియలు (అనగా గం. 2 ల) పూర్వమునుండి భగవదారాధన ప్రారంభించవలెను.

పెరుమాళ్ళకు అర్ఘ్యపాద్యాచమనాద్యుపచారములు సమర్పించిన పిమ్మట "వెణ్ణంగల శొళ్ళాదు" అను పదినీరాట్టు పాశురములతోను (వేదాధికారము గల వారీ పాశురములే గాక పంచసూక్తములతోను) తిరుమంజనము సమర్పించవలెను. పిమ్మట వస్త్ర, ఊర్ధ్వపుండ్ర, చందన, అలంకారాద్యుపచారములు సమర్పించవలెను. పిమ్మట నవకాశమున్నచో విష్ణుసహస్రనామములతోను, విధిగా రామ, కృష్ణ, లక్ష్మీ, అష్టోత్తరశతనామములతోను, తులసీ పుష్పములతో పూజించవలెను. కొందఱు గోదాదేవి అష్టోత్తరశత నామావళితో కూడ పూజించుట కలదు.

తరువాత ధూపదీపాద్యుపచారములు సమర్పించినపిమ్మట పొంగలిప్రసాదమును అరగింపు సమర్పించవలెను. అటు పిమ్మట తిరుప్పల్లాండు ౧౦ పాశురములను తిరుప్పావై ౩౦ పాశురములను భక్తులందఱు కలసి రెండు పంక్తులు గోష్ఠిగా కూర్చొని ప్రతి పాశురము యొక్క ౪ పాదములు (మున్నడి) ఒక పంక్తివారును, పిమ్మట ౪ పాదములు (పిన్నడి) రెండవపంక్తి వారును యీ ప్రకారము శ్రావ్యముగ సేవాకాలము గానించవలెను.

తిరుపళ్ళియెళుచ్చిలో మొదటి పాశురమును, తొమ్మిదవ పాశురమును, పదియవ పాశురమును రెండు పర్యాయములు సేవాకాలము చేయవలెను.

ఇట్లే తిరుప్పావులో కూడ 'మార్గళి త్తింగళ్' మొదట పాశురమును, 'ఓంగి ఉలగళంద' అను మూడవ పాశురమును, 'నాయకనాయ్' అను పదునారవ పాశురమును, 'ఉందుమదకళిత్త' అను పదునెనిమిదవ పాశురమును, 'మారిమలై ముళైంజిల్' అను ఇరువైమూడవ పాశురమును, 'అన్ఱు ఇవ్వులగమళందాయ్' అను ఇరువదినాల్గవ పాశురమును, 'కూడారై వెల్లుం శీర్' అను ఇరువైయేడవ పాశురమును, 'కఱవైగళ్ పిన్ శెన్ఱు' అను ఇరువైఎనిమిదవ పాశురమును రెండేసి పర్యాయములు అనుసంధించవలెను.

పిమ్మట దధ్యోదనము ఆరగింపు చేయవలెను. దధ్యోదనము ఆరగింపు చేయ లేనివారు పండ్లు గాని, క్షీరములు గాని, శర్కరను గాని అరగింపుచేయవచ్చును. పిమ్మట 'అన్ఱు ఇవ్వులగళందాయ్' అను ఇరువదినాల్గవ పాశురముతోను, శ్రియఃకాంతాయ కల్యాణ మంగళశ్లోకములతోను అందఱు ఏకకంఠముగా అనుసంధానము చేయుచు హారతి సమర్పించవలెను. పిమ్మట తిరుప్పావులో 'శిత్తంశిఱుకాలే' 'వంగక్కడల్' అను ఇరువైతొమ్మిది, ముప్పది పాశురములను రెండుపర్యాయముల చొప్పున సేవాకాల సమయమునందు వలెనే మున్నడి పిన్నడి విధముగా శాత్తుముఱై విన్నవించవలెను.

ప్రతిదినము తిరుప్పావులో నొక్కొక్క పాశురము వంతున అందఱుకలసి ఏక కంఠముతో ఆనాటి పాశురమును రెండు పర్యాయములు అనుసంధించుచు హారతి సమర్పించవలెను. పిమ్మట 'నీళాతుంగ స్తనగిరితటీ' అను తనియను, 'కోదైపిఱంద వూర్' అను పాశురమును, 'తిరువాడిప్పూరత్తిల్' అను గోదాదేవి వాళి తిరునామములను, పిదప గోదాచతుశ్శ్లోకి యనుసంధించవలెను. తరువాత సర్వదేశదశాకాలేతి శ్లోకావళి తిరునామాను సంధానముతో తీర్థప్రసాద వినియోగము గావింపవలెను.

స్వాములు ప్రసాదమును ఆరగించుచున్న సమయమున గోదాతనియ ననుసంధించవలెను. పిమ్మట తానుకూడ ప్రసాదస్వీకరణ చేయవలెను.

"మణిమాడత్తిల్" - "వెళ్ళత్తరవిల్" - "తుయిల్ అమరంద" - "శెల్వప్పెండాట్టి" - "తోట్టత్తిల్"
- "ఇళంకిళియే" - "మాత్తార్" - "పందడిత్త"
- "నప్పిన్నై కొంగైమేల్" - "కిడందరుంగుం"
- "ఉళగళంద గోవిందన్" - "పోన విడవన్ద"
- "చిఱు కాలత్తివే" - ఇరండుదరుం - పాడవేణుం.

శ్లో॥ రామానుజాంఘ్రిశరణోస్మి - కులప్రదీప-
స్త్వాసీ త్సయామునము నేస్సచనాథ వంశ్యః
వంశః పరాంకుశమునే స్సచసోపి దేవ్యా
దాసస్తవేతి వరదాస్మి తవేక్షణీయః

అను వానినిబట్టి యిందు సూచించుచున్న తిరుప్పావు పాశురములను రెండేసి పర్యాయములు అనుష్ఠించుటయు కొందఱ కాచారమైయున్నది.

" రామానుజాంఘ్రి శరణోస్మకుల ప్రదీపః" అనుదాని తాత్పర్యము, " తూమణిమాడ " అనుపాశురమును.

" ఆసీత్సయా మునమునేః " అనుదాని తాత్పర్యము " కత్తుక్కఱవై " యనుపాశురమును.

"సచనాథవంశ్యః" అనుదాని తాత్పర్యము. "ఉంగళ్ కొడక్కాళై" అనుపాశురమును.

" వంశః పరాంకుశమునే " అనుదాని తాత్పర్యము " ఎల్లేఇళం గిళియే " అనుపాశురమును.

" సచసోపి దేవ్యా " అనుదానికి తాత్పర్యము "ఉందుమదగళిత్త" అనుపాశురమును

"దాసస్తవేతి వరదాస్మి " అనుదాని తాత్పర్యము, కత్తు కఱవై, మారిమలైముళైయిల్ "అన్నివ్వుళగం అళందాయ్" కూడారై వెల్లుంశీర్, " కఱవైగళ్ పిన్ శెన్ఱు - అను ఏ పాశురములున్ను

ఈ విధముగానే - "లక్ష్మీనాథ సమారంభాం - నాథయామున మధ్యమాం । అస్మదాచార్య పర్యంతాం । వందే గురుపరంపరాం ॥ అను అవరోహణక్రమముగా అస్మదాచార్య పర్యంతాం" అనుదానికి పుళ్ళింకులంచిన గాణా "అనుపాశురం" తాత్పర్యమగుటచే 1వ పాశురము కూడా రెండేసి పర్యాయములు, అనుసంధించుటను కొందఱ కాచారముకలదు.

మఱియొక స్వాపదేశము

శ్లో॥ భూతం సరస్యమహదాహ్వాయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మి నిత్యం.

అను దీనిని ననుసరించి ఆళ్వార్ తిరుమఘళ్ యయిన శ్రీ గోదాదేవి "పుళ్ళుం శిలంబినగాణ్" యనుపాశురము మొదలుకొని "ఎల్లేఇళంగిళియే" అనుపాశురమువరకు మొత్తం ౧౦ పాశురములద్వారా 11 గురు ఆళ్వారులను ప్రబోధించుచున్నట్లుగా యోజించుకొనవలెను.

"ఉంగళ్ పుళైక్కడై" యనుపాశురముద్వారా మధురకవి గురు ళ్వారున్ను, మరియు తిరు మంగళయాళ్వారున్ను ప్రబోధింపబడుచున్నట్లు తెలుసుకొనవలెను.

మరియొక స్వాపదేశము!- "పుళ్ళుంశిలంబినగాణ్" అను పాశురము మొదలుకొని వరుసగా 13 పాశురములద్వారా గురుపరంపర వాక్యములలోని 13 గురువుల ప్రబోధించుచున్నట్లుగా యోజించుకొనవలెను.

ధనుర్మాస ప్రారంభమునుండి శాత్తుముఱు దీక్షతో నుండవలెను. బ్రహ్మచర్య మవలంబించవలెను. క్షౌరము చేయించుకొనరాదు. తలంటు కొనరాదు యథాశక్తిగా ప్రతిదినము ఒక శ్రీవైష్ణవదంపతులకు తప్పక తదీయారాధన జరిపిచవలెను. తదీయారాధన తిరువారాధనానంతరము జరుపవలెను. మొదటి 15 రోజులలోను సూర్యోదయాత్పూర్వమునందున్ను. తరువాత 15 రోజులలోను సూర్యోదయము తరువాతను పెరుమాళ్ళకు పొంగలి అరగింపు సమర్పించుచుటుల తిరువారాధన చేయవలెను. ఈ వ్రతము శేషద్వాదశినాటి యనుష్ఠానమువలె స్వామ్యనుష్ఠానమును విశేషరీత్యా జరుపుకొని తానుకూడ ప్రసాదస్వీకృతి చేయవలెను. సూర్యోదయానంతరము చేసుకొనవలసిన నిత్యకర్మానుష్ఠానమును యటుపిమ్మట జరుపుకొనవలెను. భగవద్భాగవతాచార్యుల యారాధనమే దీనికి వలయు ప్రమాణములు పాంచరాత్రాగమములలో విశేషించిగలదు. శాల్ మొఱ నాడు (భోగిపండుగనాడు) గోదాకళ్యాణము తమ ఉత్సాహము ననుసరించి శ్రీ గోదారంగనాథ స్వాములకు తిరుక్కళ్యాణము యథావిధిగా అచరించవలెను.

సంక్షేపముగా గొన్ని ప్రమాణశ్లోకము లిందు ప్రకటించుచున్నాము.

శ్లో॥ కోదండే భాస్కరే ప్రాప్తే । పూజాం కుర్యాత్తు వైష్ణవః ।
విష్ణోర్బ్రాహ్మముహూర్తేత్వం । ముద్గాన్నాది నివేదనైః ॥
శ్లో॥ బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ । స్నాత్వాఽచమ్య యథావిధి ।
ధారయిత్వోర్ధ్వపుండ్రాణి । విష్ణోరారాధన మాచరేత్ ॥
శ్లో॥ సుగంధైః కుసుమైర్ధూప । దీపాద్యై స్తులసీదళైః ।
గోక్షీరాద్యభిషేకేన । కుర్యాదారాధనం హరేః ॥
శ్లో॥ నివేదయిత్వా ముద్గాన్నం । శర్కరాజ్యాది సంయుతం ।
గోదాగాథాః పఠిత్వాఽథ । సర్వైశ్శ్రీవైష్ణవైస్సహ ॥
శ్లో॥ పఠేద్ద్వే నైగమనికే । గాథే తత్ఫలదే శుభే ।
తతో గాథాం పఠేన్నిత్యం । తదాభుంజీత వైష్ణవైస్సమం ॥
శ్లో॥ భానోరుదయ మాకాంక్షన్ । వైష్ణవాన్ కృతకర్మణః ।
భోజయిత్వా తతస్తూర్ణం । స్వయంభుంజీత వాగ్యతః ॥
శ్లో॥ రవావభ్యుదితేతూర్ణం । నిత్యనైమిత్తికాదికం ।
కృత్వా సర్వాం మహాభాగైః । స్వయంభుంజీత వైష్ణవైః ॥
శ్లో॥ భానౌ కోదండమాయాతే । కోదండే గృహముత్తమం ।
విష్ణోశ్చవైష్ణవానాంచ । పూజనం విధిచోదితః ॥
శ్లో॥ ముద్గాన్నాది ప్రదానేన । వస్త్రాద్యాభరణాదిభిః ।
తాంబూలాది ప్రదానేన । పూజయే ద్వైష్ణవోత్తమాన్ ॥
శ్లో॥ యః కోదండం సమాయాతే । కోదండే గృహ ఆదరాత్ ।
భోజయే ద్వైష్ణవాన్ ప్రాతః । సయాయా ద్వైష్ణవం పదం ॥
శ్లో॥ భానూదయే యదా విష్ణుం । పూజయిత్వా యథావిధి ।
సద్భాగాన్ భోజయేత్తత్ర । సోఽసౌ విష్ణుప్రియో భవేత్ ॥
శ్లో॥ మాసానాం మార్గశీర్షోహం । ఇత్యాహ భగవాన్ హరిః ।
తస్మాన్మాసే భోజయే ద్భక్తాన్ । యోఽసౌ ప్రీతికరో భవేత్ ॥
శ్లో॥ అన్నాద్యం పురతో న్యస్తం । దర్శనాత్ గృహ్యతే మయా ।
రసాన్ దాసస్య జిహ్వాయా మశ్నామి కమలోద్భవ ॥
శ్లో॥ తోషయిత్వా హృషీకేశం । నతోషయతి వైష్ణవాన్ ।
యదా తదా సవై విష్ణో ర్నసంతోషకరో భవేత్ ॥
శ్లో॥ దర్శయిత్వా ఇహాన్నద్యం । విష్ణవేరస సంయుతం ।
యదా దత్త్వావదపితు । వైష్ణవేభ్యః ప్రదాపయేత్ ॥
శ్లో॥ మార్గశీర్షే యథామాసి । దధ్యాజ్యగుడ సంయుతం ।
ముద్గాన్నం విష్ణవేదత్వా । వైష్ణవాన్ భోజయేత్తదా ॥
శ్లో॥ ప్రాతః కాలేతుసై నిత్యం । వైష్ణవాన్ భోజయేత్సుధీః ।
మాసమేకం ధనుః ప్రఖ్యం । సభతే ద్విష్ణునందనః ॥

శ్లో॥ యోనిత్యం కర్మలోపో౽త్ర । భవేత్సితిథి మాసకా ।
విష్ణుమారాధ్యవిధినా । ద్వ్యోనభుంక్తేన వైష్ణవః ॥
శ్లో॥ ద్వాదశీ శేషసంయుక్తా । తిథిద్వాదశ తేమతా
భానోరుదయ ఏవైషం । మాసిమార్గశిరే తథా ॥
శ్లో॥ తత్రోదయే ఒఖిలంకర్మ । నిత్యనైమిత్తికాదికం ।
ద్వాదశ్యాంతు యథాకార్యం । తథా గోదండగేరవా ॥
శ్లో॥ మార్గశీర్షేయథామాసి కోదండం యాతిభాస్కరే ।
భాస్కరోదయ ఏవైత । త్సర్వంకర్మ సమాచరేత్ ॥
శ్లో॥ తత్రారాధ్యహృషీకేశం । గోదాగాథాః పఠన్ ద్విజః ।
తదేవవైష్ణవైస్సార్క । మద్యాత్సన్నమయం హవిః ॥
శ్లో॥ శేషద్వాదశితోపిస్యా । న్మాస కోదండనామకః ।
వజుషన్యోనాపిసమః । పరమో వైష్ణవోభవేత్ ॥
శ్లో॥ యేతోషయంతి తద్భక్తాన్ । మాసేమార్గశిరేహరిం ।
సవనే ప్రథమేతేషాం । ప్రీతాగోదా భవేత్సదా ॥
శ్లో॥ గోదాదేవీప్రసాదాత్స్యా । ద్దైహికాముష్మికంఫలం ।
యేభోజయంతి తద్భక్తాన్ । ధనుర్మాసి లభంతితే ॥
శ్లో॥ ఉదయాత్ప్రాగర్ధమాసమర్థ । మాసం తదుత్తరే ।
విష్ణుం సంపూజయేత్తత్ర । సర్వదోత్తరత ప్రియాన్ ॥
శ్లో॥ మార్గశీర్షే యథామాసి । ప్రాగ్భానోరుదయాత్తదా ।
విష్ణుమారాధ్య మాసార్థం । పరతోభోజయేత్సదా ॥
శ్లో॥ ధనుర్మా సోత్సవః కార్యః । వైష్ణవశ్చ విశేషతః ।
శ్రీవైష్ణవవ్రతమిదం । వ్రతానాముత్తమంవ్రతం ॥
శ్లో॥ విష్ణుప్రియకరం దివ్యం । లక్ష్మీప్రియకరం తథా ।
తదాభాగవతానాంతు । ప్రీతిదంతు గురోస్తథా ॥
శ్లో॥ హరిభాగవతాచార్య । కైంకర్యమిదముత్తమం ।
కైంకర్యప్రార్థనాంవక్తి । మూలమంత్రి స్సనాతనః ॥
శ్లో॥ గోదసూక్తిరియంవక్తి । తదనుష్ఠానమేవచ
తథాష్టాక్షర సంసిద్ధై । ర్ధనుర్మాసోత్సవంచరేత్
హరిభాగవతార్యాణాం । పరత్రాత్రిచ సర్వదా ॥







శ్రీ మతే రామానుజాయ నమః

# బదరి – అనుబంధము

## సంఘ కైంకర్యము

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారిచే తెలుపబడుచున్నది.

---

శ్రీ బదరీనారాయణమున మన సంఘముద్వారా శ్రీ శ్రీనివాసరామానుజస్వామివారి ప్రతిష్ఠ జరిగిన సంగతి యందఱకు తెలిసినదే కదా!

శ్రీ భగవద్రామానుజస్వామివారు స్వయముగ బదరికాశ్రమమునకు వేంచేసి మంగళాశాసనము చేసినట్లులనే పెరియాళ్వారున్ను, తిరుమంగయాళ్వారున్ను కూడ, పెరియాళ్వార్ తిరుమొళి 4-7-9 ద్వారాను, మరియు పెరియతిరుమొళి 2-1-3 మరియు 2-1-4 ద్వారాను, మరియు శిరియతిరుమడల్ 4-2 4 ద్వారాను మంగళాశాసనమును కృపచేసియున్నారు. అందుచే భగవద్రామానుజులు వారితో పాటుగ పెరియాళ్వారును, తిరుమంగయాళ్వారున్ను, ప్రసన్నజనకూటస్థులగుటవలన నమ్మాళ్వార్లను, చక్రత్తాళ్వార్లను కూడ అర్చారూపమున బదరి కాశ్రమములో వేంచేపుచేయుటకు నిశ్చయింపబడినది.

ప్రస్తుత మీనలుగురు ఆళ్వార్ల యొక్క ఉత్సవ విగ్రహములు మాత్రమే చిన్న చిన్న మూర్తులుగ వేంచేపుచేయుట యగును.

ఇందులకుగాను ఒక్కొక్క విగ్రహమునకున్ను తయారుచేయుటకు రు. 100/లు, బదరికి చేర్చుటకు రు. 100/లు, ప్రతిష్ఠకు రు. 100/లు మొత్తము షుమారు రు. 300/లు చొప్పున మాత్రము ఖర్చు అగునని అంచనా వేయబడినది. ఈ సొమ్మును ఎవరు సమర్పింతురో వారి పేరుతో ఈ ఆళ్వార్ల ప్రతిష్ఠలు జరుపబడును. కాన ఉత్సాహము, అవకాశము గల వారందరును ఈ మహా కైంకర్యమును చేయుటకై ఉత్సాహపరచవలసినది. బదరికాశ్రమములో మనము కట్టింపదలసిన అష్టాక్షరీక్షేత్ర మందలి రామానుజ కూట నిర్మాణము పూర్తియైనది. ఇప్పుడు సత్సంగసదన నిర్మాణము జరుగుచున్నది. శ్రీ ఉ. వే. శ్రీమాన్ తే.కం.గోపాలాచార్యస్వామివారు స్వయముగ బదరీనారాయణమున వేంచేసి, యీ సత్సంగ సదన నిర్మాణమును జరుపుచున్నారు. ఇదియు కూడ రాబోవు శ్రావణమాసమునకు పూర్తి కాగలదు వీటి సంప్రోక్షణయున్ను, యీ ఆళ్వార్ల ప్రతిష్ఠయున్ను అప్పుడే అచ్చట చేయబడగలవు. ఆసమయమున మేము కూడ యచ్చటనే యుండగలము. బహుశా, జ్యేష్ఠమాసాంతమున ఈ ప్రాంతమునుండి స్పెషలు రైలులో యీ విగ్రహములను బదరికి వేంచేపుచేసుకొని వెళ్ళబడును. మహాపుణ్యస్థలమైన బదరికాశ్రమక్షేత్రములో ఆళ్వార్ల ప్రతిష్ఠా కైంకర్యము దొరుకుట చాలా దుర్లభమైన విషయము కదా. ఈ కైంకర్యము చాలా మహత్తరమైనది. ఈ కైంకర్యమును చేయదలచినవారు వెంటనే మాకు తెలియజేయవలసినది.

కార్యాలయము
శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం
(వయా) చుండూరు - తెనాలి తాలూకా
గుంటూరు జిల్లా

(సం) శ్రీమన్నారాయణ రామానుజజీయర్
మకాం : శ్రీకూర్మం, శ్రీకాకుళం జిల్లా
5-11-58

(1) బదరిలో శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘముద్వారా ఏర్పాటుచేయబడిన శ్రీ "ఉభయవేదాంతవిద్యాలయమున" శ్రీ ఉ. వే. శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు విద్యార్థులకు యీ విధముగా పాఠప్రవచనములు గావించిరి.

విద్యార్థులకు ముముక్షుప్పడి - యతీంద్రమతదీపిక - తత్త్వత్రయము - అర్థపంచకము - శ్రీవచనభూషణం - అష్టశ్లోకి - గద్యత్రయము - ఆళ్వందారుస్తోత్రము - గురుపరంపర - క్షమాషోడశి - ముకుంద మాల - ... - వైరాగ్యపంచకము - నారాయణాష్టకం - శ్రీగుణరత్నకోశము ఇత్యాదులు సవ్యాఖ్యానములుగా ప్రవచన గావింపబడెను.

పండితగోష్ఠిలో తనిశ్లోకి - తిరుప్పావు, ఉపన్యాసములద్వారా కాలక్షేపము గావింపబడెను.

బదరి శ్రీనివాసరామానుజస్వామివారల సన్నిధిలో శరన్నవరాత్రోత్సవములు వైభవముగా జరిగినవి.

(2) విజయవాడ వాస్తవ్యులగు శ్రీమాన్ వందిపాటి రామయ్యగారు తమ తల్లిదండ్రులగు శ్రీరామకృష్ణయ్య మాణిక్యాంబగార్ల స్మృతిచిహ్నముగా బదరిలో మన అష్టాక్షరీక్షేత్రములో యాత్రికులు నివసించుటకు తప్పాలలకుగాను రు. 300/ లు సమర్పించిరి, శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

(3) విజయవాడ వాస్తవ్యురాలగు శ్రీ ఎండూరు తాయారమ్మగారు బదరిలో నిర్మించుచున్న సత్సంగసదనములో అష్టాక్షరీ జపపరులకు ... కట్టించుటకు ప్రస్తుతము రు. 500/ లు సమర్పించుటకు వాగ్దానము, గావించిరి. శ్రియఃపతి యీమెకితోధికైంకర్యనిష్ఠ ప్రసాదించుగాక !

(4) కృష్ణాజిల్లా తాడేపల్లి వాస్తవ్యులగు శ్రీ నూరపనేని సీతారామానుజమ్మగారు బదరీ సత్సంగసదన నిర్మాణమునకుగాను మరల రు. 550/ లు సమర్పించిరి. శ్రియఃపతి యీమె కనేకమంగళములు ప్రసాదించుగాక!

(5) ఒంగోలు శ్రీ గొల్లపూడి అమ్మణ్ణమ్మగారు బదరీ శ్రీనివాసరామానుజకైంకర్యార్థమై రు. 116/ లు సమర్పించిరి. శ్రియఃపతి యీమె కనేకమంగళములు ప్రసాదించుగాక !

(6) తాళ్ళమూడు నూరుపాడు అగ్రహారం వాస్తవ్యురాలగు శ్రీమత్తిరుమల ...గ్యలక్ష్మమ్మ అమ్మవార్లంగారు బదరీ శ్రీనివాసరామానుజ శాశ్వత పూజని...త్తం రు. 11.../ లు సమర్పించిరి. శ్రియఃపతి యీమె కనేక సన్మంగళములు అనుగ్రహించుగాక !

(7) కాకినాడ వాస్తవ్యురాలగు శ్రీ దామెర భావాయమ్మగారు ఇటీవల తమ ఏకైక కుమారుడు హఠాత్తుగా పరమపదించిన సందర్భములో అతనికి పరమపదములో శాశ్వత నివాస నిమిత్తం బదరీ శ్రీనివాసరామానుజుల కైంకర్యము నిమిత్తం రు. 116/ లు సమర్పించిరి. శ్రియఃపతి యీమెగారికుటుంబమున కనేక మంగళప్రసాదములు ప్రసాదించి యనుగ్రహించుగాక !

(8) కపుతరంగ్రామ వాస్తవ్యురాలగు శ్రీ కానూరి జగన్నాయకులగారి భార్య మాణిక్యమ్మగారు బదరీ శ్రీనివాసరామానుజస్వామివారల శాశ్వతపూజ నిమిత్తం వాగ్దానం 275/ లో ఈనాడు రు. 200/ లు పంపిరి. శ్రియఃపతి యీమెకు సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

(9) శ్రీ రాపోలు వెంకటచలపతిరావుగారు, శ్రీ కూర్మం, బదరీ శ్రీనివాసరామానుజ కైంకర్యం నిమిత్తం సమర్పించినది రు. 275/ లు. శ్రియఃపతి వీరికి సమస్త మంగళములు ప్రసాదించుగాక!

శ్రీకృష్ణాయ నమః

# నారీపి భాగము

## భక్తియోగము

రచయిత్రి :- శ్రీ పూసపాటి నారాయణమ్మ (శ్రీకాకుళం)

[ఈవ్యాసము శ్రీకాకుళములో శ్రీకోదండరామస్వామి సన్నిధిలో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతక్రింద శ్రీకాకుళం మహిళామండలివారు జూన్ నెలలో జరిపిన వార్షికోత్సవములో ప్రకటింపబడినది.]

అమ్మా!, మోక్షసాధనములు మూడుగా చెప్పబడియున్నవి : 1 కర్మయోగము 2 జ్ఞానయోగము 3 భక్తియోగము. అట్లుగా చెప్పియున్నాడు శ్రీరాముడు కౌసల్యతో. "మార్గాస్త్రయో మయాప్రోక్తాః పురామోక్షాప్తి సాధకాః । కర్మయోగో జ్ఞానయోగో భక్తియోగశ్చ శాశ్వతః" అని శ్రీ భాగవతమందును అట్లుగానే శ్రీకృష్ణపరమాత్మ వచనమున్నది. 'భక్తియోగశ్చ శాశ్వతః' అని చెప్పుటచేత భక్తియోగమే సులభమని అర్థము తెలుచున్నది.

మోక్షసాధనములు మూడు : కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము అని తాత్పర్యము. కొందరు కర్మజ్ఞానములు రెండుమాత్రమే మోక్షసాధనములు, భక్తియను నొకటి లేదు. అని పలుకుచు తమమాటకు స్వాహంకారముతో భగవత్సేవారూపభక్తియొక్క రుచిని తెలుసుకొనక అట్లు చెప్పుచున్నారుగాని భక్తియనునది లేదని అర్థముగాదు. భక్తిలో ప్రథమ భాగము (సాధనరూపము) కర్మకాండలో అంతర్భూతము. 2 వ భాగము (ఫలరూపము అనగా పరమప్రేమరూపము) జ్ఞానమందు అంతర్భూతము గనుక రెండుగా చెప్పబడినదని భావము. అట్లుగానిచో శ్రీరామ శ్రీకృష్ణ వచన రూపములైన అధ్యాత్మరామాయణ భాగవతములకున్నూ భక్తియోగమను పేరుపొందిన భగవద్గీతా 12వ అధ్యాయమునకున్నూ, నారద శాండిల్య మునీంద్రులకున్నూ అప్రామాణ్యం సంభవించును. కనుక మోక్షసాధనములు మూడుగాని, రెండుగావు.

ఈ మూడు యోగములందును, కర్మలందును, ప్రపంచమందును నిర్వేదముపొందిన సన్యాసులకు జ్ఞానయోగము - కర్మలందును, ప్రపంచమందును నిర్వేదము గలగనివారికి కర్మయోగమున్నూ చెప్పబడినవి. నిర్వేదము అంతగాలేకయు, అతిగా ఆసక్తిలేకయు భగవత్కథాదులయందు శ్రద్ధగలవారికి భక్తియోగము చెప్పబడినది.

ఇందుకు ప్రమాణము శ్రీ భాగవతమందు వ్రాసినఅర్థము భగవంతుని తత్వమును తెలియ జేయునది జ్ఞానమనబడును. ఇందును పరోక్షము, అపరోక్షము అని రెండు విధములు. పరోక్షము జ్ఞానయోగము. అపరోక్షము భక్తిలో అంతర్భాగము. పరోక్షజ్ఞానము భక్తికిసాధనము. భక్తియు సాధనరూపము, పరమప్రేమరూపము అని రెండు విధములు. అందులో సాధనరూపభక్తి విజ్ఞాన సాధనము. ప్రేమరూప భక్తియు, విజ్ఞానమున్నూ ఏకరూపము లగుటవలన భేదములేదు.

దీనికిప్రమాణము భక్తివలన జ్ఞానముకలుగునని కొందరున్నూ, జ్ఞానమువలన భక్తికలుగు నని కొందరున్ను మహర్షులు చెప్పుచున్నారు. శాండిల్యమునీంద్రుడు జ్ఞానమువలనభక్తిగలుగునని చెప్పుచున్నారు. ఆ భక్తియే ముఖ్యమైనది. ఇతరములైన జ్ఞానాదులచేత అపేక్షించబడుచున్నందున ఆ పరమేశ్వరుని తెలుసుకొని భక్తినిపొందుచున్నారు. ఇంతకంటె వేరుమార్గములేదు అని భాష్యార్థమును వ్రాసినారు.

(1) శ్రీ భాగవతములో ప్రహ్లాదవచనం (1) శ్రవణము అంటే భగవంతుని రూపమును ఆయన గుణములను వినుట. (2) కీర్తనము – భగవన్నామమును కీర్తించుట (3) స్మరణము – భగత్స్వరూపాదికము స్మరించుట. (4) పాదసేవనము – పరిచర్య. (5) అర్చనము – భగవంతుని రూపమును పూజించుట. (6) వందనము – నమస్కారము. (7) దాస్యము–తను చేయు పనులను అర్పించుట. (8) స్నేహము – భగవంతునియందు నమ్మిక. (9) ఆత్మనివేదనము – శరీరభారమునందు చింతనమును విడిచియుండుట. నిష్కపటముగా యీతొమ్మిది సాధనములు కలిగిన భక్తిని హరియందుంచుటయే చదువులలో యుత్తమచదువు. అని ప్రహ్లాదులు చెప్పినారు.

(2) ఆధ్యాత్మరామాయణములో లక్ష్మణుని గురించి శ్రీరాముని వాక్యము: "లక్ష్మణా! నాభక్తికి కారణము వినుము. నాభక్తులను సేవించుట, ఏకాదశీ, శ్రీరామనవమీ మొదలగు నా పర్వములం దుపవాసముచేయుట, నాకథలు వినుట, చెప్పుట, నన్నుపూజించుట, నా నామము కీర్తించుట. ఇట్లు చేయువారికి నాయందు నిశ్చలమైన భక్తిగల్గును" అని చెప్పినట్లు వ్రాసినారు.

## శ్రీ భాగవతములో ఉద్ధవునిగురించి శ్రీకృష్ణవచనము

(3) నిరపేక్షుడై నాయందు సర్వకర్మలను సమర్పించవలెను. పవిత్రములైన నా కథలు, వినుచుండవలెను. ధర్మార్థ కామములను నాకొరకై చేయవలెను. నావిషయమై సంగీతము, నాట్యము, మృదంగాది వాద్యములు మొదలయిన వాటితో నాస్థానమందుత్సవము చేయుచుండ వలెను. స్వయంగాగాని, ఇతర సహాయముతోగాని నా అర్చనరూపమును స్థాపించవలెను. గర్వము, డాంబికము నుండగూడదు. చేసినపుణ్యమును చెప్పగూడదు. లోకమందు తనకేది యిష్టమో, యేదిప్రియమో దానిని నాకు నివేదించవలెను. ఇట్లుచేసినయెడల అతనికి నాయం

దచంచలభక్తి గల్గును. దానివలన ముక్తుడగును. యీవిధముగా శ్రీభాగవతకథలందు వ్రాసినారు.

## భక్తితో శరణాగతియు అంతర్గతము. అనగా ముఖ్యము

శ్రీ శరణాగతియు ఆరువిధములు : 1 భగవంతునకు అనుకూలముగానడుచుట 2 భగవంతునకు ప్రతికూలముగా వ్యాపారము చేయకుండుట 3 భగవంతుడు రక్షించగలడను గాఢమైన నమ్మకము 4 భగవంతుడే రక్షకుడని యిక దిక్కు నాకెవ్వరు లేరని ప్రేమించుట 5 తనను, తనసొమ్మును భగవంతునకు సమర్పించుట 6 దీనత్వము యీ విధమైన 6 లక్షణములు విభీషణుని శ్రీరాముని విషయమై జరిగి వర్తించినారు.

(1) భక్తిలక్షణములలో అనేకమతములున్నవి. భగవత్పూజాదికమని వ్యాసులవారి అభిప్రాయము.

(2) భగవత్కథాశ్రవణమని గర్గాచార్యులు చెప్పియున్నారు. అనగా ఒకక్షణముగాని వాసదేవుని మరచినయెడల అదియేహాని: అదియే ఛిద్రము; అదియే మోహము; అదియే భ్రాంతి అని చెప్పబడును. ఇత్యాదులు సాధనభక్తి యనబడును. ఈభక్తి మూడువిధములు. 1 తామసీభక్తి 2 రాజసీభక్తి. 3 సాత్వికీభక్తి. (1) ఇతరుల హింసయు, దంభము మొదలగు దుష్టచర్యలతో చేయబడునది తామసభక్తియనబడును. (2) ఫలమును కోరి అనగా ధనమునుకోరిగాని, భోగమును కోరిగాని పుత్రాదులనుకోరిగాని చేయబడుభక్తి రాజసభక్తియనబడును. (3) సాత్వికభక్తిలో పాపనాశనముకొరకు చేసినది—ఇది నాకు కర్తవ్యమనుబుద్ధితో చేసినది – ఇదం బ్రహ్మార్పణం అనుబుద్ధితో చేసినదిఒకటి.

నేను అస్వతంత్రుడను భగవంతుని అధీనుడను నాకుప్రభువు ఆభగవంతుడేను. కాబట్టి నేను యేమిచేసినను దానివల్ల ఆభగవంతుడే సంతోషించుగాక అనుబుద్ధిలో చేయబడుభక్తియొకటి – ఇట్లుగా మూడు విధములుగానుండును. సాత్వికభక్తి-ఇందులో తామసభక్తిగాని, రాజసభక్తిగాని మోక్షసాధనములు గానేరవు. ఆభక్తియందు మోక్షవాంఛగాని జ్ఞానవాంఛగాని లేనందున పైగా తామసభక్తివల్ల నరకపాతముగూడ సంభవించును. రాజసభక్తివల్ల పునరపిజననం పునరపిమరణము అనుప్రకారము స్వర్గము. తిరిగిభూలోకము గలుచుండును. సాత్వికభక్తియే మోక్షసాధనమగును.

కర్మజ్ఞానములు రెండు సాధనములనువారి పక్షమందు కర్మలో చివరిభాగమున్ను, జ్ఞానములో ప్రథమభాగమున్ను కలసిభక్తియోగమగును. అనగాభక్తిలో పూర్వార్ధము కర్మయందును, ఉత్తరార్ధము జ్ఞానయోగమందును అంతర్గతమగునని భావము. కర్మలో చివరభాగమనగా జనక మహారాజు, మయూరధ్వజమహారాజు మొదలగువారుచేయు యాగములువలె నిష్కామముతో చేయు భగవత్ప్రీతికర కర్మలుఅని అర్థము. జ్ఞానములో మొదటిభాగమనగా నారదుడు సనక,

సనందన, సనత్సుజాత, సనత్కుమారులు చేయు భగవన్నామ నామకీర్తనాదులు అనిఅర్థము. ప్రహ్లాదుడు మొదలగువారు చేయు జ్ఞానపూర్వక స్మరణాదికము అని అర్థము. అనగా భక్తిలో సాధనరూపభక్తి కర్మకాండయందును, పరమప్రేమరూప భక్తి జ్ఞానకాండయందును అంతర్భూతములు అని అర్థము. పద్మపురాణమందు వాలివచనము.

కాబట్టి భక్తి నివిడిచి కర్మజ్ఞానములు ఫలించవు. ఏలయన – భగవత్ప్రీతికొరకు యాగాది కర్మలు చేయుచు యజ్ఞఫలప్రదుడును యజ్ఞస్వరూపుడు అగు శ్రీవిష్ణువుయొక్క భజనమును (స్మరణ, కీర్తన, పూజాదికమును) విడిచినయెడల యాగఫలము నెవ్వడిచ్చును? అట్లుగానే మోక్షదాత యగు హరిని విడిచి జ్ఞానము చేత మోక్షము నొందవలయు ననుకొను వారికి జ్ఞానము ఫలవంతము గాదు. జ్ఞానముగాని, కర్మగాని అహంకార పూర్వకముగా నుండును. భక్తియో నిరహంకారముతో నుండును. భగవంతుడు అహంకార శూన్యునకు రక్షకుడుగాని సాహంకారునకు రక్షకుడు గాడు అని నారదసూత్ర ప్రమాణము. భగవంతుడు దీనజనులకు ప్రియుడు. అభిమానవంతులకు ద్వేషిఅని అర్థము. శ్రీభాగవతమందు ప్రథమస్కంధ పంచమాధ్యాయమందు నారదవచనము. అనగా ఉపాధినివర్తకమైన బ్రహ్మవిషయక జ్ఞానమున్ను హరియందలి భక్తిని విడిచినయెడల శోభించదు. అనగా అపరోక్షమును యిచ్చుటకుచాలదు. ఏవంస్థితే, సాధనకాలమందును, ఫలకాలమందును, దుఃఖరూపమైన కామ్యకర్మయు, నిష్కామ్యకర్మయు హరిభక్తిని విడిచినవానికి యెట్లుగా శోభించును ? శోభించదని అర్థము. కాబట్టి కర్మ భక్తిజ్ఞానములు మూడింటిలోను భక్తియే ప్రధానమనిభావము. ఇదిగాక "అన్యస్మాత్సౌలభ్యం భక్తౌ" అనుసూత్రము ప్రకారము కర్మజ్ఞానములకంటెను, భక్తియందే మోక్షసాధన సౌలభ్యముగలదు. అనగా సుఖముగా పొందుటకు శక్యమైనది సులభమనబడును. దానియొక్క ధర్మము సౌలభ్యము అనువ్యుత్పత్తివలన సులభముగా పొందదగుట. కర్తతే = (విశేషపదము) ఉంచును. ఇచ్చట భావము కర్మ యనగా అగ్నిష్టోమాది శ్రౌతకర్మ అని స్మార్తకర్మను నిత్యము ఏలాగైనను చేయవలెను. అది కర్మ యనబడును.

యాగాది కర్మకు ధనము వస్తుసామాగ్రి సహాయసంపత్తి నియమాచరణ సామర్థ్యము మొదలగు సాధనము చాలకావలయును. ఇందులో యేదైన లోపించినయెడల కర్మభ్రష్టునగుట గాక నరకపాతముగూడా సంభవించును. అందుకనియె యాగాధికారి లక్షణము చెప్పబడినది. ఇదిగాక దేశకాలానుకూల్యముండవలెను. భక్తికి యిట్టిసాధనములతో పనిలేదు. పైనివ్రాసిన నవవిధ సాధనములన్నియుగాని, అందులో కొన్నిగాని యుండినచాలును.

జ్ఞానమునకును కర్మకువలె కారకాపేక్ష లేదుగాని అష్టాంగయోగములు, సమాధిబలము, సన్యాసము, ఆహారనియమము మొదలగు నియమములుగలవు. ఆ నియమములు లేని యెడల జ్ఞానము ఫలవంతముగాదు. ఇదిగాక సాధన చతుష్టయ యుండవలెను. ఇవన్నియుగల్గినను సిద్ధి

గల్గునో గలగదో నమ్మకములేదు. భక్తికన్ననో ఏనియమములేదు. ఏఆశ్రమమైనను సరే - చాలును. తన మనస్సుచాలును, ఒక్క నారాయణ మంత్రమైన చాలును.

(1) ఇది శరదృతువర్ణనము. ఈ శరదృతువు ఆకాశమునకు మేఘసంబంధమువల్లనైన మాలిన్యమును తీసివేసినది.

(2) జంతువులకు వర్షాకాలమువల్ల గలిగిన సాంకర్యమును తొలగించి స్వాచ్ఛంద గమనమును యిచ్చినది.

(3) భూమికి బురదను యెండించినది ఉదకమునకు మలమున.

(4) అనగా ఒండునుహరించి స్వచ్ఛతను గలిగించినది. ఇట్లు నాల్గువస్తువులకు నాలుగు విధములైన కష్టములను తొలగించినది. ఇందుకు దృష్టాంతము. ఆశ్రమిణాం=బ్రహ్మచారీ, గృహస్థః, వానప్రస్థః సన్యాసీ అనునాలుగు ఆశ్రమవంతులను శ్రీకృష్ణునియందలి భక్తిహరించును. అనగా పరిపూర్ణ భక్తిగలవానికి బ్రహ్మచర్యమందలి గురుశుశ్రూషా, జలహరణాది కష్టము గలుగదు. గృహమందు దారాపుత్రాది పోషణకష్టము సాంకర్యకష్టము లేక ఏకాంతసుఖము ననుభవింపనగును.

వనమందు, మలధారణాది కష్టమును భక్తిహరించును. సన్యాసికి హోమాదివాసనా మలమును హరించును. అనగా భక్తునకు ఆశ్రమోచిత కష్టములుండ నవసరములేదు. భక్తివలననే ఆశ్రమధర్మములన్నియు చేసినవాడగును. భగవంతుడు భక్తునకు ఆశ్రమధర్మలోప దోషము రాకుండ రక్షించునని భావము. కాబట్టి పరిపూర్ణభక్తిగలవానికి యథాసుఖముగా వర్తించినను లోపములేదు. కర్మ జ్ఞానపరాయణలకు యథావిధిగా నుండి తీరవలెను. అందుకనియె, నారద మునీంద్రుడు చెప్పియున్నారు.

మధుసూధన సరస్వతీస్వాములవారు చెప్పిన భక్తిస్వరూపము నేనునీవాడనే నీవు నావాడవేను. నీవేనేను అనగా నేను నీవాడనేగాని, అన్యులవాడనుగాను. ఇది మొదటిమెట్టు. నీవు నావాడవే గాని ఇతరులకుగావు. ఇదిరెండవమెట్టు. నీవేనేను నీకున్ను నాకున్ను భేదములేదు. ఇది చివరమెట్టు. అనగా ఈస్థితి మహాభక్తునిది అనిభావము.

ఈప్రకారము భక్తియోగము అనుసంగ్రహముగా వ్రాసినాను. ఈ కలికాలమందు భక్తియోగమే మంచిది యని నాయభిప్రాయము.

త్రికాలమందు శ్రీ జీయర్‌స్వాములవారి పాదారవిందములకు నాసాష్టాంగ నమస్కారములు.



శ్రీమతే రామానుజాయనమః

# నారీ విభాగము

## శ్రీ ఆండాళ్ వైభవము

రచయిత్రి: శ్రీ దాసరి ఆండాళమ్మ. (విశాఖపట్నం)

ఈ వ్యాసము విశాఖపట్నం మహిళామండలివారి పత్రికా వార్షికోత్సవ సంచికలో ప్రకటించబడినది

భూదేవి భగవంతుని సేవాలేని చేతకోట్లజీవులను తాను సేవపడలించి అందుకు తగిన స్థానమును ఆలోచించెను. కల్యాణదాహారిణా శ్లో. ప్రకారము బడినట్లు సర్వేశ్వరుడు సృష్టికి ప్రారంభమున చేతనులు తరించుటకు మూడు కార్యములను నిర్ణయించెను.

1. తనను కీర్తించుట.
2. తనకు శరణాగతిచేయుట.
3. తనకు పుష్పకైంకర్యముగావించుట.

ఈ మూడు కార్యములను సర్వేశ్వరుడు తాను స్వయముగా ననుష్ఠించి లోకులచే అనుష్ఠింపజేయుటకు శక్యముయినవి కావుగదా! శ్రీరాములుగా అవతరించి సామాన్యమానవ ధర్మములను ఎన్నిటినో అనుష్ఠించెను. కాని పై మూడుపనులను కొంతవడియే యుండెను. కృష్ణుడై అవతరించి సతతం కీర్తయంతోమామ్. మామేకంశరణంవ్రజ, పత్రం, పుష్పం, ఫలం తోయం, మన్మనాభవ, మద్భక్తోమద్యాజీమాం నమస్కురు. 9అ, 12అ. మత్కర్మకృత్ మత్పరమో అనియు ఎన్నెన్నివిధములబోధించెను. గాని వాటిని ఆచరించువారు ఒక్కరును లేకుండెను. ఒకరు చేసినకదా చూచి మరియొకరు ఆచరించుటకు. అందుచే భూదేవి ఇట్టి సర్వసాధారణ మయినట్టియు, సులభమయినట్టియు, భగవంతునికి మిక్కిలి ప్రియమయినట్టియు పనులను తాను మనుష్యలోకమున మానవులిగా అవతరించి, అందులకు ఫలితమునుబడసి లోకులుకూడా అట్లా ఆచరించి ఆ ఫలితమును బడయవలెనని ఆశనుపుట్టించ సంకల్పించెను. భగవంతునివలె ఈమె గర్భవాసముగావించి అవతరించక సీతాదేవివలె అయోనిజగా అవతరించి తాను సంకల్పించిన మూడుపనులకును అనుకూలమయిన తండ్రి విష్ణుచిత్తులని నిశ్చయించుకొనెను.

పెరియాళ్వారుల్లు శ్రీవిల్లిభుత్తూరునందు వటపత్రశాయికి పుష్పకైంకర్యము చేయుచుండిరి. ఈ విల్లిభుత్తూరు పాండ్యదేశమునందున్నది. పూర్వకాలము హిరణ్యాక్షుని సంహరించిన వరాహమూర్తి వటపత్రశాయిగా సేవ సాయించిరి. అదిమొదలు 64 మహాయుగములవరకూ ఋషులును, దేవతలును ఆరాధించుచుండిరి. పిమ్మట అది మహాఅరణ్యమయి స్వామి కాన రాకుండెను. ఇట్లుండ ఒకనాడు సమీపము నందున్న పుత్తూరు అను గ్రామములో నున్న బోయలనాయకుడగు విల్లి అనువాడు కండుడు అను తన తమ్మునితో ఆ యడవికి వేటకు వెళ్ళెను. ఆ సమయమున ఒకపులి కండుని చంపెను. విల్లి అదిచూచి విచారముతో మూర్ఛపడియుండగా వటపత్రశాయి స్వప్నములో సేవ సాయించి నాకు యిచ్చట గోపుర మంటప ప్రకారాముల కట్టించుము. ఇదిగో మీతమ్ముని బ్రతికించుచున్నానని అతనిని బ్రతికించెను. అంత నా విల్లి ఆశ్చర్యపడి లేచి అడవినంతను నరకించి స్వామిని సేవించి ఆయన ఆజ్ఞప్రకారము గొప్ప ఆలయ మును కట్టించి ఉత్సవములు యథావిధిగా జరిపించెను. దానికే విల్లిపుత్తూరని పేరువచ్చెను.

ఇచ్చుటనే పెరియాళ్వార్లు తులసీతోటలో గొప్పులు త్రవ్వుచుండగా భూదేవి నళనామ సంవత్సర ఆషాఢ శుద్ధ చతుర్దశి మంగళవారం పూర్వఫల్గుణీ నక్షత్రమున అవతరించెను. ఈమెకు గోదాదేవి అనియు, ఆండాళ్ అనియు, శూడికొడుత్తాళ్ అనియు తిరునామములు కలిగెను.

(గోదా) గో శబ్దమునకు సరస్వతి, భూమి, పశువు, తేజస్సు, కన్ను, స్వర్గము మొదలగు ఎన్నియో అర్థములు కలవు వానినన్నిటిని యిచ్చునది గోదా యని పేరువచ్చినది.

సరస్వతి అనగా తిరుప్పావై నాంచియార్ తిరుమొழి పాటలను ఈమెయే రచించి లోకమునకు ప్రసాదించెను

(2) భూమి యనగా యిహలోకసుఖములు. ఈమె గావించిన ధనుర్మాస వ్రతమును [illegible] యిహలోకసుఖములు గోదాదేవి అనుగ్రహించును. అట్టి ఈ వ్రతమును చేసిన వారికి పశుసమృద్ధికలుగును. ఈ ప్రబంధముయొక్క అర్థమును తెలిసికొనుటచే అధ్యాత్మిక తేజస్సు వృద్ధిపొందును. [illegible] దర్శించుటకు తగు జ్ఞాననేత్రము ప్రకాశించును.

(3) స్వర్గమనగా పరమపదము. ఈ ప్రబంధములు అర్థముతో అధ్యయనముచేసి భక్తితో ఈ వ్రతమును చేసినవారికి పరమపదము లభించును. కావున ఈపేరు ఈమెకట్లు సార్థకమగుచున్నది.

పెరియాళ్వార్లు వటపత్రశాయి మూలముగా ఈమె వైభవమునెరింగి ఎన్నైఆండాళ్ నను యేలుకొనుటకువచ్చితివా అని ఆలింగనముచేసుకొనిరి. కావున అండాళు అని పేరువచ్చెను. తండ్రిగారు కట్టిన పుష్పమాలికలను తాను శిరస్సున ధరించి పిమ్మట పెరుమాళ్ళకు సమర్పించుటచే ఈమెకు చూడికొడుత్తాళ్ అని పేరువచ్చినది. సంసార్లు దేహమే ఆత్మయని భ్రమించి రాగద్వేషములతో జననమరణాది అవస్థలను అనుభవించుచుందురు. కాని ఋషులు అట్లుగాక ఆత్మ దేహముకంటె వేరు అని యెరింగి తమ యోగమహిమచే దానిని సాక్షాత్కరించి సుఖించిరి. సంసార్లకంటె గొప్పవారు అయినను వశిష్ఠమహాముని తన పిల్లలందరు ఒక్కసారిగా చనిపోవుటచే ఆ దుఃఖమును భరించలేక ప్రాణము పోగొట్టుకొనుటకు ప్రయత్నించెను విశ్వామిత్రుడు తపస్సు చేయుచు మేనకనుచూచి మోహించెను. గౌతముడు తన భార్యయగు అహల్యను రాయిగా శపించెను. భృగువు మొదలగు మహర్షులును కనకాంగి మొదలగు దేవతాస్త్రీలను మోహించిరి. ఆళ్వార్లు అట్లుగాక భగవంతుని సంశ్లేషచే సంతోషించుచు విశ్లేషచే దుఃఖించుచు కాలమును గడుపుచుండిరి. కావున వీరు ఋషులకంటె గొప్పవారు అయినను వీరు 'అనాదిమాయయాసుప్తః' అనునట్లు మాయయందు నిద్రించుచుండగా సర్వేశ్వరునిచే లేపబడిరి. మయర్వర, మదినల, మరుళిన్ అనునట్లు సర్వేశ్వరుడు ప్రసాదించిన జ్ఞానముతో జ్ఞానులయిరి. గోదాదేవి అట్లుగాక నీళాతుంగ నిద్రించుచున్నస్వామిని తానే లేపెను. 'శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయంతి' అనునట్లు భగవంతునికే ఉపనిషదర్థములను సంతచెప్పెను. అధ్యాపన మనగా గురువుచెప్పిన దానిని శిష్యుడు అనువదించుటయే. ఆళ్వార్లు ఉపాయాంతరములు స్వరూపవిరుద్ధములు. అని యెరింగియు మట్టలెక్కిరి. దానిని భక్తిపారవశ్యముచే వచ్చునని సమర్థించుచున్నాము. ఇట్టి జ్ఞానులు క్షుద్రదేవతల నారాధించుట అంతకన్నను భక్తి పారవశ్యమేకదా. గోదాదేవి నాంచియారు తిరుమొழிయందు మానిడవర్క్కెన్ఱు పేచ్చుపడిల్ వాడిగిడ్లన్ కండాయి మన్మదన్. ఓ మన్మథుడా మనుష్యులకుఅని మాటవినినచో, నేను బ్రతుకజాలను సుమా. అని మన్మథుని ఆరాధించుటచే ఈమె భక్తి ఆళ్వార్ల భక్తిని మించినదని చెప్పవలెను గదా.

పురుషుడు పురుషుని ప్రేమించుటకంటే స్త్రీ పురుషుని ప్రేమించుట నీరు పల్లమునకు పోయినట్లు సుకరము. కావుననే ఆళ్వార్లు అందరున్నూ, నాయికా అవస్థను ఆరోపించుకొనిరి. అట్లు తెచ్చి పెట్టుకున్నను చివరకు వచ్చుసరికి కురుగూరి శఠగోపన్ శొన్న అనియు, పట్టర్ పిరాన్ శొన్న అనియు, తమ పురుషత్వమే బయట పడుచుండెను. ఈమె అట్లుగాక సహజముగనే స్త్రీ అయి యుండుటచే ఆమెకు సర్వేశ్వరుని యందును, సర్వేశ్వరునికి ఆమెయందు, సహజమయిన ప్రేమ వుండుటచే ఈమె అళ్వార్లను మించినది. ఒక్క కుటుంబములోని నలుగురు అన్నదమ్ములలో ఒక్కనికే సంతానము వున్నచో ఆ నలుగురు ఆస్తియు ఆ ఒక్కనికే చెందునట్లు ప్రపన్న కుటుంబమునకు చెందిన ఆళ్వార్లు అందరిలోను అంజుక్కురు సుదతియాయ్ అనునట్లు ఈమె పెరియాళ్వార్లు బిడ్డయగుటచే ఈమెకే అందరి ఆళ్వార్ల యొక్క జ్ఞానమును పిత్రార్జితమువలె ఈమెకే సంక్రమించినది. కావుననే వుడయవర్లు నాలాయిరదివ్య ప్రబంధము లుండగా ఈమె రచించిన తిరుప్పావునే ఆదరించి తిరుప్పావు జియ్యరు నామము బడసిరి.

ఈమె అనేక విధములనే సీతాదేవి కంటెను అధికముగా గౌరవించబడున్నది. ఎట్లు అనగా.

1. సీతాదేవి సాధారణ భూమియందు అవతరించెను. గోదాదేవి నిత్యము వటపత్రశాయికి వుపయోగించబడు నందనవనమందు అవతరించెను.
2. సీతాదేవి కర్మయోగము ననుష్ఠించు జనకుని తండ్రిగా కలిగియుండెను. గోదాదేవి ఆకర్మ యోగము అంగముగా గల భక్తియోగముకంటె మించిన ప్రపత్తియోగము ననుష్ఠించు పెరియాళ్వార్లను తండ్రిగా లభించెను.
3. సీతాదేవి గుణపూర్తిలేని విభవావతారమయిన శ్రీరామచంద్రుని వరించెను. ఈమె ఇరుట్టరయిల్ విళక్కంబోలె అనునట్లు చీకటికొట్టులోని దీపమువలె ప్రకాశించు గుణపూర్తిగల అర్చామూర్తి అయిన రంగనాథుని వరించెను.
4. సీతాదేవి రాముని వరించెనుగాని, గోదాదేవి ఆరామునిచే ఆరాధింపబడు రంగనాథుని వరించెను.
5. సీత భర్తయగు రామునకు భక్తురాలైన శబరి ఉచ్ఛిష్టము ఎప్పుడో ఒక్కసారియే లభించెను. గాని గోదాదేవి భర్తయగు రంగనాథునకు తన భక్తురాలగు ఆండాళ్లు ఉచ్ఛిష్టము యిప్పటికీ యింకను ప్రతినిత్యము లభించుచునే వున్నది:
6. సీతాదేవి లంకయందు వున్న తనకు సజాతీయులగు స్త్రీలను మాత్రమే రావణ చెరసాలనుండి విడిపించెను. గాని గోదాదేవి తన వ్రత అనుష్ఠానముచేతను, తన దివ్య ప్రబంధము చేతను తనకు విజాతీయులగు పురుషులనుగూడా సంసారమను పెద్ద చెరసాలనుండి విడిపించెను.
7. సీతాదేవియొక్క అవతారదివసమును యవరును కొనియాడుటగాని, ఆమె తిరునక్షత్ర మహోత్సవమును జరుపుటగాని లేదు. గాని గోదాదేవియొక్క అవతార దివసమును ఆండాళ్ పిరంద తిరువాడి పూర్వ త్తిల్, ఒరునాళైకుండో అని మనవాళ మహామునులు ఉపదేశ రత్నమాలయందు మిక్కిలి ప్రశంసించిరి. ఏనోములు, ఏ వ్రతములు ఎరుగని వైష్ణవులందరును ఈమె ఆచరించిన ధనుర్మాస వ్రతమును ఇప్పటికిని ఆచరించుచున్నారు.

శ్రీయై నమః

# ధనుర్మాస వ్రతము

ఈ సంవత్సరం మార్గశీర్ష శుద్ధషష్ఠి మంగళవారము (16-12-58)వ తేది మంగళవారం (తెల్లవారితే మంగళవార మనగా) వేగుజామున గం 4-30 లకు ధనుర్మాసము ప్రారంభ మగుచున్నది. ఆ నాడు తిరుప్పావై మొదటి పాశురము విన్నవించ వలసియున్నది.

శ్రీ వైష్ణవులగు ప్రసన్నుల కందఱకీ వ్రతమవశ్యానుష్ఠేయమైయున్నది. మరియు నీవ్రతము స్వరూపయుక్తము. ముముక్షువులకింతకన్న సులభ, సులభతర, సులభతమమగు ఉపాయము వేరులేదు. కాన భక్తులందఱు నీవ్రతమును తమ తమ విభవ, శక్తి సామర్థ్యముల ననుసరించి మాసము రోజులు మహోత్సాహముగా జరుపవలసినది. మీకు కావలసినచో :—

| | | | |
|---|---|---|---|
| తిరుప్పావు మూలం పుస్తకం | 0- 4-0 | గోదాదేవి పటము 10-14 సైజు రంగుతో | 0-4-0 |
| అర్థము తాత్పర్యముతో | 0-10-0 | గోదా కళ్యాణపటం కార్డుసైజు | 0-0-6 |
| గోదాదేవి పటము చిన్నది | 0- 0-6 | గోదాదేవి 10-14 సైజు మూడురంగులతో | 0-4-0 |
| గోదాదేవి మూడురంగులది | 0- 1-0 | గోదా అష్టోత్తర శతనామావళి | 0-2-0 |

---

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# గీతా జయంతి

ఈ సంవత్సరం మార్గశీర్ష శుద్ధ ౧౧ ఆదివారం 21-12-58 వ తేదినాడు గీతా జయంతి అయియున్నది. ఈనాడే శ్రీ వైకుంఠ ఏకాదశికూడ వచ్చినది. కాన భక్తులందరీ గీతాజయంతిని తమ తమ ఉత్సాహశక్తిననుసరించి తప్పక జరుపవలసినది. ఈ నాడు గీతా ఏకాహాముగాని, లేక గీతా అఖండ పారాయణముకాని జరుపవలసినది. గీతా జయంతికి వెనుకగాని, లేక ముందుగాని యీ యుత్సవమును ప్రారంభించి, 18 రోజులలో, లేక 9 రోజులలో, లేక 7 రోజులలో, లేక 3 రోజులలో లేక ఆనాడొకరోజో జరుపవలెను.

జయంతినాడు, గీతా పారాయణము, గీతోపన్యాసములు, గీతా పరీక్షలు, గీతోపదేశములు క్రమముగ జీవితములో అనుష్ఠించుటకై యత్నించుట. అందులకై దీక్ష, ప్రతినలు పూనుట – ఇత్యాది స్వానుష్ఠాన ప్రచారాది కార్యక్రమమును జరుపవలసినది.

మీకు కావలసినచో—

| | |
|---|---|
| గీత ప్రతిపదార్థ టీకా తాత్పర్యములు – (క్యాలికోబైండు) | 4—0—0 |
| డిటో (సాదాబైండు) | 3—8—0 |
| గీతా ప్రశ్నోత్తరావళి—3 భాగములు | 3—0—0 |
| గీతోపదేశ హారము — (గీతను గురించిన వ్యాసములు) | 1—8—0 |
| గీతాచార్య పటము (రంగులు కలది) | 0—4—0 |
| గీతాచార్యస్తుతి | 0—0—6 |

ఇట్లు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము
శ్రీ వాసుదాసాశ్రమము-నడిగడ్డపాలెం. చుండూరు పోస్టు
తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా

భక్తి నివేదన — (సాలుచందా రు 5/ లు) Regd. No. A. 195

| | | | |
|---|---|---|---|
| తిరుమంత్రార్థము (ద్రావిడ వ్యాఖ్యానంతో, | 4- 0-0 | విష్ణు సహస్రనామ స్తోత్రం | 0- 2-0 |
| ముముక్షుప్పడి (ఆంధ్రానువాదముతో) | 1- 4-0 | విష్ణు సహస్రనామ వైభవము | 0- 2-0 |
| సారసంగ్రహము ( ,, ) | 0- 6-0 | శ్రీచూర్ణవిధానము | 0- 1-0 |
| యాదృచ్ఛికప్పడి ( ,, ) | 0- 6-0 | రామ అష్టోత్తర శతము | 0- 2-0 |
| తని ప్రణవము ( ,, ) | 0- 8-0 | కృష్ణ ,, | 0- 2-0 |
| అర్థపంచకము ( ,, ) | 0-12-0 | గోదా ,, | 0- 2-0 |
| నిగమనప్పడి ( ,, ) | 0- 8-0 | శఠగోప ,, | 0- 2-0 |
| ముముక్షుప్పడి మూలమంత్రము | 0- 2-0 | రామానుజ ,, | 0- 2-0 |
| గీత (ప్రతిపదార్థము టీకా తాత్పర్యముతో | | పారతత్త్వానుసంధానం | 0- 2-0 |
| క్యాలికో బైండు రు 4-0-0, సాదా బైండు రు | 3- 8-0 | గురుపరంపర | 0- 2-0 |
| గీతా ప్రశ్నోత్తరావళి 3 భాగాలు | 3- 0-0 | శుక్రవార లక్ష్మీపూజ | 0- 2-0 |
| తిరుప్పల్లాండు (అర్థముతో) | 0- 8-0 | సాధు పరిత్రాణము | 0- 2-0 |
| మాండవి | 0-10-0 | తిరునామ వైభవము | 0- 4-0 |
| శబరి | 0-12-0 | హరినామ వైభవము | 0- 4-0 |
| ఋష్యమూకము | 0-12-0 | యతిరాజ భజన కీర్తనలు | 0- 4-0 |
| శరద్రాత్రి | 1- 0-0 | రామరాజ్యం | 0- 2-0 |
| ధనుర్దాసుడు | 1- 0-0 | స్తోత్రరత్నం మూలం | 0- 2-0 |
| కవితా విహారము | 0- 2-0 | ముకుందమాల | 0- 2-0 |
| యతిరాజ విజయము | 0- 6-0 | రామాయణ తిథులు | 0- 2-0 |
| ద్వయ మంత్రార్థము | 0- 4-0 | రామాయణ గానము | 2- 0-0 |
| మంగళాశాసన వైభవము | 0- 8-0 | 82 వార్తలు | 0- 3-0 |
| పండితగోష్ఠి | 1- 0-0 | రంగరాజ వైభవము | 0- 6-0 |
| గీతా సందేశము | 0- 8-0 | రంగనాయకి వైభవము | 0- 4-0 |
| చరమార్థ దీపిక | 0- 4-0 | హనుమద్వైభవము | 0- 8-0 |
| చతుశ్శ్లోకి | 0- 2-0 | గోదా కళ్యాణము | 0- 6-0 |
| భజ యతిరాజ స్తోత్రం (అర్థం) | 0- 4-0 | హరిపాద వైభవము | 0- 6-0 |
| ప్రపన్న సంధ్యానుష్ఠానము | 0- 2-0 | అక్షర లక్ష్మీ వైభవము | 0- 4-0 |
| ప్రపన్న తిరువారాధన | 0- 2-0 | గీతార్థ సంగ్రహము | 0- 2-0 |
| పూర్ణమీమాంస | 0- 4-0 | గీతోపదేశ సారము | 1- 8 0 |

బదరీ మాహాత్మ్యము 1-0-0, ఆళ్వారాదుల చిన్న పటములు 0-1-0, డిటో పెద్ద పటములు 0-4-0, బదరీపతకాలు 1-8-0, బదరి వెండిరేకులు 0-3-0, లక్ష్మీపతకములు 0-4-0, బ్రహ్మకపాలానంతర పిండప్రదానము 0-2-0, అష్టశ్లోకి 0-4-0

వలయువారు :— శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము - శ్రీ వాసుదాసాశ్రమము - నడిగడ్డపాలెం, దుండూరు పోస్టు తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

సాలుచందా రు 5/ లు భక్తినివేదన— BOOK POOST రి. నెం. A. 195

శ్రీ వాసుదాసాశ్రమం - నడిగడ్డపాలెం - దుండూరుపోస్టు, గుంటూరు జిల్లా.

To

... ఓరియంటల్ లైబ్రరీ

Tirupathi, (Chithur dt.)



శ్రీమతే రామానుజాయ నమః







# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]

సంపుటి ౧౧ || విళంబి - పుష్యము || సంచిక ౧౧

ఏడుకొండలవాడా గోవిందా!



వేంకటరమణా గోవిందా!

సంపాదకులు:
విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయసంపాదకులు:
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

# బదరీ శ్రీనివాస రామానుజస్వామివారి శాశ్వత, తాత్కాలిక

## పూజావిరాళములు

శ్రీ జాలగంటి రాజరాజేశ్వరిగారు, మద్రాసు 275/
శ్రీ వి. సుబ్రహ్మణ్యం శెట్టిగారు, మద్రాసు
వాగ్దానం 116/ లో జమ 5/-
శ్రీ మట్టుపల్లి రంగనాథయ్యగారు, మద్రాసు. 116/-
శ్రీ ఏల్చూరు వెంకటేశం శెట్టిగారు, మద్రాసు
వాగ్దానం 116/ లో జమ 58/-
శ్రీ యడ్లపల్లి జయరామశెట్టిగారి భార్య
చెంచులక్ష్మమ్మగారు, నెల్లూరు. 116/-
శ్రీ పొత్తూరి సత్యనారాయణ శెట్టిగారి భార్య
లక్ష్మీకాంతమ్మగారు, నెల్లూరు. 116/-
శ్రీ రాచపూడి వెంకటసుబ్బయ్యగారు, మద్రాసు. 116/-
శ్రీ వింజమూరి వెంకటనరసింహాచార్యులుగారు, మద్రాసు 58/
శ్రీ పూరా సుబ్రాయశెట్టిగారు, మద్రాసు. 58/-
శ్రీ ఉప్పుటూరి కమలవల్లి తాయారమ్మగారు, మద్రాసు 29/-
శ్రీ పొత్తూరి కృష్ణవేణమ్మగారు. 29/-
శ్రీ నూరిశెట్టి పున్నమ్మగారు. 29/-
శ్రీ మల్లవోలు కనకదుర్గమ్మగారు. 28/-
శ్రీ చెరుకూరు వెంకటలక్ష్మీనారాయణగారు, 29/-
శ్రీ చిన్నం నారాయణరావుగారు. 29/-
శ్రీ పెనుగొండ పద్మనాభశెట్టిగారు. 29/-
శ్రీ నల్లమల్లి వరదరాజశెట్టిగారు. 29/-
శ్రీ పూరా శమంతకమ్మగారు. 29/-
శ్రీ మునగా కనకమ్మగారు. 29/-
శ్రీ మద్దాలి ఆండాళమ్మగారు. 29/-
శ్రీ గునుపాటి పారిజాతమ్మగారు. 29/-
శ్రీ చీదెళ్ళ కుడ్డెమ్మగారిద్వారా లోగడ 100/- లు
గాక ఇప్పుడు జమ 35/-
శ్రీ నాళం జగన్మోహనరావుగారు. 29/-
శ్రీ కొత్త రమాదేవిగారు. C/o 29/-
శ్రీ కొత్త నంజుండయ్యశెట్టిగారు.
శ్రీ బి. బాయమ్మగారు. 29/-
శ్రీ చలవాది వేదవల్లితాయారమ్మగారు. 29/-
శ్రీ మునగా వెంకటసుబ్బయ్యగారు. 29/-
శ్రీ ఇ. కమలాదేవిగారు. 29/-
శ్రీ సామా జయరామశెట్టిగారు. 11/-
శ్రీ కొత్తూరి వెంకటసుబ్బమ్మగారు. 29/-
శ్రీ మోపర్తి ఆంజనేయశెట్టిగారు. 29/-
శ్రీ యస్. వి. ప్రభాకరశెట్టిగారు. 29/-
శ్రీ తాళ్లూరి తాయారమ్మగారు. 29/-
శ్రీ వేదాల సీతమ్మగారు, శనివారప్పేట - లోగడ
రు 1/ గాక యిప్పుడిచ్చినది. 28/-
శ్రీ గొల్లపూడి కనకవల్లి తాయారమ్మగారు, మద్రాసు 116/-
శ్రీ గరుడా హనుమంతరావుగారు. 16/-
శ్రీ అగర్వాలాగారు, మద్రాసు. 30/-
శ్రీ జి. కన్నమ్మగారు, మద్రాసు. 29/-
శ్రీ యం. ఆర్. వేణుగోపాలశెట్టిగారు. 29/-
శ్రీ బాలిశెట్టి సీతారత్నమ్మగారు. 29/-
శ్రీ ఏల్చూరు ఉదయవరుల శెట్టిగారు. 116/-
శ్రీ ఉత్తరాది రాధాకృష్ణమందిరం మహంతు గారు 76.8.0
శ్రీ వి. భాష్యమయ్యంగారు. 30/-

## సత్సంగసదన విరాళములు

శ్రీ పి. వెంకట సుబ్బయ్యశ్రేష్టిగారు, మద్రాసు
వాగ్దానం 160/ లో జమ 1/
శ్రీ గుండా పార్వతమ్మగారు. 16/-
శ్రీ కూరపాటి మహాలక్ష్మమ్మగారు. 16/-
శ్రీ కృష్ణభక్తురాలు, వి. మంగమ్మగారు. 25/-
శ్రీ పొత్తూరి రంగనాథంగారు. 16/-
శ్రీ నల్లమల్లి కనకమ్మగారు. 16/-
శ్రీ పొట్టి మహాలక్ష్మమ్మగారు. 16/-
శ్రీ [illegible] కమలమ్మగారు. 16/-
శ్రీ హైదా ఆండాళమ్మగారు. 32/-
శ్రీ పుట్టా రాజమ్మగారు. 16/-
శ్రీ మద్దాళి చెంగవల్లి తాయారమ్మగారు. 16/-
శ్రీ అమరా సరస్వతమ్మగారు. 16/-
శ్రీ పోచర్ల రాఘయ్యగారి భార్య బాలమ్మగారు. 16/-
శ్రీ వరిశెట్టి ఆండాళమ్మగారు. 16/-
శ్రీ కొత్తూరి రంగనాయకమ్మగారు. 40/-
శ్రీ కోటి అమృతవల్లి తాయారమ్మగారు. 16/-
శ్రీ భువనగిరి రామానుజశెట్టిగారు. 16/-



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము వారిద్వారా బదరీనాథులో ప్రతిష్ఠింపబడిన
శ్రీ భూదేవీ సహిత శ్రీనివాసులు - రాజ్యలక్ష్మి గోదాదేవి
భగవద్రామానుజ స్వామివార్లు.



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము వారిద్వారా బదరినాథులో 1954 సంవత్సరమున జరుపబడిన శ్రీ మదష్టాక్షరికోటి హవన మహాక్రతువునకు వేంచేసిన శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు. శ్రీ తిరుమెయ్యం తిరువేంకట రామానుజ జీయర్ స్వామివారు. శ్రీ యతిరాజ సంపత్కుమార జీయర్ స్వామివార్లకు, అచ్చుటి త్రిదండి వేదాంత రామానుజ జీయర్ స్వామివారు బదరినారాయణ కోవిల శక్రిటరీ, కిచడిస్వామీ, శేఠ్ శ్రీ శంకరసింహ్ బహుగుణ, శ్రీ నరహరిశాస్త్రి మున్నగువారు కోవిలవద్ద స్వాగతమిచ్చుచున్నదృశ్యము.



(1) బదరీ నారాయణమున – శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము ద్వారా – అష్టాక్షరీ క్షేత్రమందున. నిర్మింపబడి పూర్తి గావింపబడిన. "రామానుజ కూటము"

(2) ప్రస్తుతము నిర్మాణము జరుగుచున్న "సత్సంగ సదనము"



1. బదరీ నారాయణమున శ్రీ. వి. ప్ర. సం. ద్వారా నిర్మాణము పూర్తి గావింపబడిన "రామానుజ కూటము" (వెనుక భాగము).

2 A. నిర్మాణములో నున్న సత్సంగ సదనమందలి "తిరువారాధనగది" "తళియకూటము"

B. సామానుగది —

శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారు శ్రీకూర్మక్షేత్రమున చాతుర్మాస్య దీక్షాసమయమున
సాయించిన భగవద్విషయ కాలక్షేపగోష్ఠి



## శుభ వార్త (బదరీనాథ్ స్పెషల్ రైలు)

### శ్రీ శ్రీ శ్రీ జియ్యరుస్వామివారిచే బదరీనాథ్‌లో సత్సంగసదనమున గృహప్రవేశము

స్వస్తిశ్రీ వికారినామ సం॥ర శ్రావణశుద్ధ చతుర్థీ స్థిరవారం ఘ. 29-1 అనంతరం పంచమీతిథి - ఉత్తరానక్షత్రం 31-52 అనంతరం హస్తానక్షత్రం 8-8-1959 సం॥రం॥ తేదీ రాత్రి గం. 12-15 ని. లు పైగా గం. 2-00 లోగా వృషభలగ్నమునందు శ్రీ అష్టాక్షరీక్షేత్ర సత్సంగసదనములకు శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ జీయర్‌స్వామివారు శ్రీ బదరీనాథ్ వేంచేసి స్వయముగ గృహప్రవేశమహోత్సవమును జరిపించుటకు నిశ్చయింపబడినది. ఇందులకై మద్రాసునుండి ఒకస్పెషల్‌రైలు వేయబడు ఏర్పాటులు చేయుట మంచిదని యోచించుచున్నారు. వివరములు ముందు నెలపత్రికలో ప్రకటింపబడును.

ఇట్లు
తె. కం. గోపాలాచార్యులు
ప్రధాన కార్యదర్శి



శ్రీమతే రామానుజాయనమః

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము వారిచే జరుపబడు

# సమష్టి ఉపనయనము మహోత్సవాహ్వానము

స్వస్తి శ్రీ విలంబినామ సంవత్సర మాఘశుద్ధ షష్ఠీ (13-2-1959) శుక్రవారం అశ్వినీ నక్షత్రయుక్త మేషలగ్నమందు ఉదయం గం 10-56 ని. లకు న్నూ

శ్రీ తిరుమల దేవస్థానం కొండపై శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళ సన్నిధిలో ఉచిత ఉపనయనములు జరుప నిశ్చయించితిమి.

ఈ ఉపనయన మూహూర్తములును శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్ స్వామివారి మంగళాశాసనములతో వారి ఆధ్వర్యమునసే ఏకరాత్రి దీక్షతో జరుపబడగలవు.

ఈ ఉపనయనములకు సమర్థులు తమఖర్చును తామే భరించి వచ్చిచేసుకొనవలెను. బీదవటువులకు ఒకవటువునకు రాకపోకలకు ఉపనయనమునకు రు 50/- ల చొప్పున సంఘముద్వారా ఖర్చుచేయ నిశ్చయింపబడినది.

కావున ఏవిధముగ ఉపనయనముల చేసుకొనగోరునది మాకు ఈక్రింది అడ్రసునకు వెంటనే తెలుపగోరుచున్నాము.

బీదవటువుల ఉపనయనములను చేయించదలంచిన ఉదారులగు మహాశయులు వటువు ఒక్కంటికి రూ 50/- ల చొప్పున ఈ క్రిందిఅడ్రసునకే మనియార్డరు వెంటనే చేసినచో వారిపేరుతో ఆ వటువులకు ఉపనయనములు మా ఖర్చుతో జరుపబడును.

తదీయారాధనఖర్చు వేరుగాన, దానికి విరాళములు యథాశక్తిగ నొసంగవచ్చును.

ఇట్లు
శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘము

అడ్రసు :-

తె. కం. గోపాలాచార్యులు
ప్రధాన కార్యదర్శి
గీతామందిరం, 107 వరదాముత్తియప్పన్‌వీధి, మద్రాసు 1.

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ వాసుదాసస్వామివారి జయంతిమహోత్సవ ఆహ్వానము





గుంటూరు జిల్లా తెనాలి తాలూకా నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమము శ్రీశ్రీశ్రీ వాసుదాస దేశికస్వామివారి జయంతీ మహోత్సవములు 9-2-59 మొదలు 11-2-59 వరకు వరుసగా మూడురోజులు జరుగును.

అంకురార్పణ 8-2-59 ప్రారంభం - 9-2-59 శ్రీస్వామివారి జయంతి - 11-2-59 అనాడే శ్రీ కోదండరామస్వామివారి తిరుకళ్యాణ మహోత్సవము.

కాన శ్రీవారి శిష్యులు, అభిమానులు తప్పక విచ్చేయ గోరుచున్నాను.

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం
చుండూరుపోస్టు
గుంటూరు జిల్లా

ఇట్లు
భగవద్భాగవతాచార్య విధేయుడు
కూనంనేని వెంకటప్పయ్యదాసు

## పుస్తక ప్రకటన

### "ధనుర్దాసుడు"

పద్యకావ్యము :- శ్రీ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారిచే రచింపబడినది. కవిగారి కావ్యరుచి నెఱుగనివారెవరు! ప్రతులు విక్రయమునకు సిద్ధముగా నున్నవి. ప్రతివెల 1/ రూపాయి. వి. పీ. పద్ధతిలేదు. పోష్టుఖర్చులతో వెల ముందుగా పంపినవారికి మాత్రమే పంపబడును.

### "భగవద్గీత"

శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారిచే ప్రతిపదార్థ టీకాతాత్పర్యములతో వ్రాయబడియున్నది. వెల 4/ లు. పోస్టేజి 1-2-0 అగును. వీ పి. పద్ధతి లేదు. పోష్టుఖర్చులతో వెల ముందుగా పంపవలెను.

# గీతోపన్యాస సంగ్రహము

మదాసులోని శ్రీ యతిరాజ సేవామహిళా మండలివారి గీతామందిరమున ఈసంవత్సరము శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి ఆధ్వర్యమున జరుపబడిన గీతాజయంతి 18 దినములలో శ్రీమాన్ న్యాయ వేదాంతవిద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామి వారు ఉపన్యసించిన గీతోపన్యాస సంగ్రహము.

శ్లో॥ యస్య ప్రసాద కళయా కవయో౽పి తేతే,
శాస్త్రాణ్యశాసు రిహ తన్మహిమాశ్రితాని
కృష్ణేన తేన యదిహ స్వయ మేవగీతం,
శాస్త్రస్యతస్య సదృశం కిమిహాస్తి శాస్త్రమ్॥

భగవత్సాక్షాత్కారమునకుగాని తత్త్వజ్ఞాన ప్రాప్తికిగాని తీవ్రవిషాదమే కారణమని శ్రుతీతిహాసపురాణాది ప్రమాణము లుద్ఘోషించుచున్నవి అటులనే యీభగవద్గీతోపనిష దావిష్కరణమునకును అర్జుని విషాదమే కారణము. వేదాంతశ్రవణమున కావశ్యకమగు తీవ్రనిర్వేదాదు లీతని కున్నట్లే యధ్యాయము సూచించుచున్నది. ఇందలి 'తతశ్శ్వేతైర్హయైర్యుక్తే' యను శ్లోకమున, ప్రణవార్థ ప్రతిపాదక మీగీతయని మన కావ్యార్థముకూడ సూచింపబడెను. దేహాత్మభ్రాంతి, స్వస్వాతంత్ర్యము అన్యశేషత్వము, స్వరక్షణేస్వాన్వయము, అబంధుసంగమము, విషయాసక్తియనెడు ఆత్మనాశకరములైన మహావ్యాధులారింటికిని మహౌషధ మీగీతయందుపన్యసింపబడెను. అర్థపంచకమున కిది యాటపట్టు. నారాయణపరత్వమునకిది విజయభేరీ. భక్తిసిద్ధాంతమున కిది ముంచేతికంకణము.

అర్జునుని ప్రశ్న 'శ్రేయోమార్గము ఉపదేశింపు' మని సామాన్యముగ నుండుటచే దానినే మిషగా జేసుకొని దయామయుడగు భగవాను డీ యుత్తమ రహస్యోపదేశమున కారంభించెను. దేహాత్మవివేక విహీనుని దుఃఖమును బాపుటకాయాత్మస్వరూపము నిరూపింప బడవలసియుండుటచేతను, 'తరతిశోక మాత్మవిత్'ని ఉపనిషదుపదేశముండుటచేతను, కర్మయోగము భక్తికి సన్నిహితోపాయమగు భక్తికి యంగమగు కర్మయోగమునకే యాత్మవిజ్ఞానమే ప్రథమసోపానమగుటచేతను, జడభరతుడు తత్త్వజిజ్ఞాసువగు రహూగణునకు 'కోహమిత్యేవ నిపుణో భూత్వాచింతయ పార్థివ'యని స్వస్వరూప పరిజ్ఞానము లేక తత్త్వవిచారమున కర్హుడుకాడని నుడువుటచేతను, రెండవ యధ్యాయారంభమున 12 వ శ్లోకమునుండియే శ్రీకృష్ణపరమాత్మ తన యుపదేశము నారంభించెను.

చెరసాలయందు మ్రగ్గుచున్నదోషి తానందుండి విడవడవలయుననిన తన కెవరి నిగ్రహముచే నీశిక్షను విధింపబడెనో యాతని యనుగ్రహమువల్లనే బయట పడగలిగినట్లే ఈ చేతనుడును తానే పరమాత్మ నిగ్రహముచే నీశరీరమున నుంచబడెనో యాతని యనుగ్రహలాభముచే విముక్తుడు కాగలడుగాన భగవదనుగ్రహము నార్జించవలెను. అందులకాతనిని నిరంతరము ప్రేమతో ననుసంధించుచుండవలెను. దీనినే భక్తియందురు. ఇట్టిభక్తి నిర్మల చిత్తమునందే యుదయించును. చిత్తశుద్ధికి నిష్కామకర్మయోగమావశ్యకము. దానిచే స్థితప్రజ్ఞుడగును. అదినాలుగంతరములతో నలరారును. ఇంద్రియములకు విషయప్రావీణ్యము వల్లను తూష్ణైనను మాటి మాటి కపాయానుసంధానముచే వాటి నరికట్ట యత్నించుట మొదటి కక్ష. మంచిచెడుగులకు పొంగుక్రుంగులు లేకుండుట రెండవకక్ష. అవి తనవియేకావని తలంచుట మూడవకక్ష. కామములు కామములనియే గోచరింపకుండుట నాల్గవకక్ష. ఈకక్షలో చేరినవాని కాత్మసాక్షాత్కారము

ఈకర్మయోగము అర్జునునివంటి సద్యోముక్షువునకును జనకునివంటి అజన్మముముక్షువగు శిష్యునకును, శ్రీకృష్ణునివంటి లోకాతీతుడగు నవతారపురుషునకును గూడ నవశ్యానుష్ఠేయము. అందులకు కారణము కర్మేంద్రియముల నరికట్టుట అస్వాభావికమగుటచేతను పుట్టుకతోడనే వీరి నుద్ధరించుట కీశ్వరుడు యజ్ఞములను కూడ కల్పించుటచేతను ఈయజ్ఞములు వృష్టికిని వృష్టిసస్యాభివృద్ధికిని సస్యాభివృద్ధి భూతాభివృద్ధికిని కారణమగుట చేతను, యజ్ఞశిష్టమగు నాహారము సకలపాపవినాశనమును అయజ్ఞశిష్టము పాపవర్ధకమగుట చేతను నీకర్మయోగమెల్లరకనివార్యము. ఈరాజసాహార విహారములచే రజోగుణాభివృద్ధియై దానిచే కామముదయించి అది ముదిరిక్రోధమై సకలానర్థముల బుట్టించును. ఇట్టి కామవిజయము సత్వగుణాభివృద్ధిపై నాధారపడి యున్నదిగాన దానికి నిష్కామకర్మయోగమే శరణ్యము.

ఇట్టికర్మయోగియగుట కవతారరహస్య జ్ఞానమును, అర్చావతారవైభవమును, సృష్టిరహస్యమును, కర్మాకర్మవికర్మరహస్యమును, కర్మయోగావాంతర విభాగమును, కర్మలజ్ఞానాకారతయు నెఱుంగవలసి యున్నది. భగవంతుని యవతారము సత్యమే, ఆతడు తన పరమేశ్వర స్వభావములతోనే యవతరించును, ఆతనియవతార శరీరమప్రాకృతము అదియాతని సంకల్పము మాత్రముచేతనే నిర్మింపబడును. ధర్మగ్లానియు అధర్మాభివృద్ధియునే దానికి నిదానములు, సాధుపరిత్రాణము ముఖ్యముగాగల దుష్టశిక్షణ ధర్మసంస్థాపనలే ప్రయోజనములని యెఱుంగుటయే యవతారరహస్యము. పరవ్యూహవిభవాంతర్యామి యర్చావతారములలో అర్చావతారమే సర్వసులభమును ఆశ్రితుల సకలపాప విమోచనపురస్సరముగ సకలాభీష్టప్రదమని యెఱుంగుటయే యారహస్యము, కర్మలఫలమునందు కోరికయు, మమతయు కర్తృత్వాభిమానమును లేకుండ జేసినచో నవి భంధకములుకావు. కావుననే శ్రియఃపతికి సృష్టిప్రయుక్తములైన నిర్దయత్వపక్షపాతాది దోషములాతని బంధింపవని యెఱుంగుటయే సృష్టిరహస్యము. నిత్యనైమిత్తిక కామ్యకర్మలు ఫలమునకొరకయే చేయబడవలెననియు, జ్ఞానగర్భితము కాని కర్మయు కర్మలేనిజ్ఞాన యోగమును లేవని యెఱుంగటయే కర్మాకర్మ వికర్మల రహస్యము. న్యాయార్జితధనమును భగవద్భాగవతుల కైంకర్యమున వినియోగించుట, ఏకాదశి యుపవాసాదులు, పుణ్యనదీ పుణ్యక్షేత్రముల సేవుట, వేదవేదాంగాధ్యయనము, తదర్థపరిజ్ఞానమువే కర్మయోగభేదములని గ్రహించుటయే నారహస్యము.

కర్మజ్ఞానయోగములు రెండును ఆత్మసాక్షాత్కారములకు స్వతంత్రమార్గములుగా కూడ నుండవచ్చును. అందు జ్ఞానమార్గము అపరిచితము కాబట్టి సప్రమాదమును గావున శ్రమయు ఆలస్యమును హెచ్చుగానుండును. కర్మయోగము ప్రహితమైన రాజబాటగావున నిరపాయము సుకరము, శీఘ్రఫలప్రదము. ఇందులకు కావలసిన ముఖ్యాంగ మాత్మలన్నిటియందును సమత్వబుద్ధి. దానికి సర్వభూత హితేరతి యావశ్యకము, ఇట్టి కర్మయోగి శ్రియఃపతియే సకలయజ్ఞ తపస్సులకును భోక్తయనియు, ఆతడు సకలలోకాధీశుడనియు, సకలభూతహిత చింతకుడనియు భావించి దాని నాచరింపవలెను.

ఇట్లాత్మనుగూర్చి గురుశుశ్రూషాది విధులతో చక్కగనెఱింగి యటపిమ్మట యుక్తాహార విహార యుక్తనిద్రాప్రబోధములనెడు ఆంతరబాహ్య సాధనములతో పరిశుద్ధప్రదేశమున చేలాజిన కుశోత్తర సంవృతంబగు పీఠముపై కూర్చొని నియతకాలమున మనస్సు నేకాగ్రపరచి నాత్మధ్యాన మొనరించిన

నది సాక్షాత్కరించి మహానందమును నందజేయును. ఈ మనోనిగ్రహమంత సుకరమైనది కాకున్నను అత్యంతావశ్యకమైనదగుటచే నిరంతర విషయ దోషానుసంధానముతో వాటిపై విరక్తియు ఆత్మగుణానుసంధానముతో దానిపై రక్తియు పెంపొందింపజేసుకొనుచు క్రమక్రమముగ దానినేకాగ్రపరచవలెను. ఇట్లాచరించుచు నారంభమున గాని పరిపక్వావస్థయందుగాని విచలితుడైనను జన్మాంతరమున తిరిగిదానియందే ప్రవిష్టుడై చివరకాత్మవలోకనపటుడై తీరును. ఈ యోగజిజ్ఞాసువుడే క్రమముగ తరించునన్న నిక నీయనుష్ఠాత తరించుటకేమి సంశయము.

కాని యీ కర్మయోగికంటె భక్తియోగి ఉత్తముడు. అట్టి భక్తియోగి కావలెననిన భగవంతుడే చేతనాచేతన ప్రకృతులకు నియంతయు సకలజగదుత్పత్తిస్థితి ప్రళయకర్తయు సకల కల్యాణ గుణాకరుడని లెస్సగ నెఱింగి ధ్యానించవలెను. ఇట్లు ధ్యానించువారు తమసుకృత తారతమ్యమునుబట్టి అర్థకామపరులు ఆత్మావలోకనపరులు, భగవత్ప్రాప్తికాములని మూడువిధములుగ నుందురు. వారిలో చివరివారే భక్తులనబడుదురు. వారు భగవంతున కాత్మవంటివారు. లోకమునందెవ్వరికేని యేఫలమునేని యిచ్చువాడు శ్రియఃపతియొక్కడేగాని ఇతరఫలము నితరదేవతలచే నిప్పించుచు తాను స్వయముగ మోక్షము నొసంగును. పాపతారతమ్యముచే నాలుగు విధములగు పాపాత్ములీతనికి దూరులై చెడుదురు. కాని భక్తులు తమయభీష్టములను తప్పక బడయగలరు. ఇందు కైవల్యార్థులకు తద్బ్రహ్మ, ఆధ్యాత్మికము కర్తలు నెరుంగదగినవి. ఐశ్వర్యార్థులకు అధిభూతము, అధిదైవము తెలుంగతగినవి. అధియజ్ఞము, అన్తిమస్మృతి యందరకు నావశ్యకములైనవి.

తద్బ్రహ్మయనగా జీవనమష్టి, అధ్యాత్మమనగా ఆత్మనువిడువక నంటియుండు భూతసూక్ష్మములు కర్మవాసనా రుచులు. కర్మయనగా మనుష్యాద్యాకృతులకు నిమిత్తమగు స్త్రీ పురుష సంయోగము. అధిభూతమనగా సకల విలక్షణమైన ఐశ్వర్యార్థు లభిలషించు శబ్దాదివిషయములు, అధిదైవమనగా సమస్తదేవత లనుభవించు భోగములకంటె గొప్పవగు భోగము లనుభవించు భగవదైశ్వర్యము. అధియజ్ఞమనగా సర్వయజ్ఞములచే నారాధింపబడుట. అంతిమస్మృతియనగా తాము కోరునట్టి ఫలమునకు తగినరీతిగా మరణసమయమున ధ్యానించుట. వీటి నేడింటిని వారివారి అధికారానుగుణముగా వివరించెను. ఇందైశ్వర్యార్థులు ధూమాదిమార్గమున చంద్రలోక పర్యంతమేగియచ్చట, పుణ్యఫలము నంతయు ననుభవించి తిరిగి భూమియందు జన్మింతురు. అర్చిరాదిమార్గమున నేగువారు పరమపురుషుని సాయుజ్యము బడిసి యికనెన్నటికి జన్మించరు. ఇట్టిఫలము ననుభవించదలచిన వారీయర్చిరాది మార్గముననే నిరంతరము స్మరించుచుండవలెను.

ఇక తొమ్మిదవ యధ్యాయమున భక్తియొక్క మహాత్మ్యము నెఱుకపరచుటకై భక్తిని దానిచే పొందబడు భగవంతుని, ఆభక్తిగల భక్తులను ప్రశంసించి అదిలేని నాస్తికులను కర్మార్థుల నిందించి అట్టిభక్తునకుగల ఆరాధనాసౌకర్యమును వారిపట్ల తన సౌసీల్యమును, జన్మవృత్తాది తారతమ్యము నారయకుండుటను తెలిపి తన భక్తులకు గలపితాచరతుక శ్శేషీ,భర్తా జ్ఞేయోప (రమాపతిః) స్వామ్యాధారో మమాత్మాచ భర్తాచార్యయ మహాదితః యనబడు నవవిధ సంబంధములను తనయందు భక్తివృద్ధిపొందుటకై తెలిపి శ్రవణం కీర్తనం స్మరణం పాదసేవనం అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్మనబడు నవవిధ భక్తిస్వరూ

వములను వివరించి భక్తులకు లభించు ఫల విశేషములను పొందుపరచి చివరకు మన్మనాభవయను శ్లోకమున భక్తిస్వరూపమును నిష్కరించెను.

ఇక నీ భక్తి వృద్ధిపొందించుటకై పరోక్షముగను అపరోక్షముగను తన నిరతిశయ వైభవము నీ దశమ ఏకాదశాధ్యాయములలో వినిపించి చూపించుచున్నాడు.

తొమ్మిదవ యధ్యాయార్థ శ్రవణ మాత్రముననే పూర్తిగా మారి 'పరంబ్రహ్మ పరంధామ' యని ప్రశంసించి భూయఃకథయతృప్తి శృణ్వతోనాస్తి మేఽమృతమ్మని ప్రార్థించిన యర్జును డీ రెండు అధ్యాయముల ఉపన్యాస దర్శనములతో నెట్టిభక్తుడగునో యోచించుడు. హిమవత్పర్వతముకూడ నూపజాలు మహా వాయువునకు ఒకగడ్డిపరక నూపుట కెంతశక్తి వినియోగించవలసియుండునో అంతమాత్రపు తన శక్తి నొసంగుటచేతనే లోకమున ఆయా జాతులలో నుత్కృష్టములై ఆయా వస్తువు లలరారుచున్నవని పదియవ అధ్యాయమున బోధించెను.

తన జయమునుగూర్చి సంశయించుచున్న యర్జునుని కాశంకనుపరిహరించుటకును, పాపమునకు పాల్పడుచునన్న యాతని భయమును తీర్చుటకును, దేవతాంతర పారమ్యభ్రాంతిని పారద్రోలుటకును, బంధుసంగమనర్థావహమని చూపుటకును, తన యుపదేశము నాదరించుటకు తనను జూచి రాక్షసులెట్లు భయపడుచున్నారో సిద్ధులెట్లు సేవించుచున్నారో జూపుటకును వారికిగూడ దివ్యచక్షుస్సునొసంగి తన ప్రభావమును జూపుటకును, యీ విశ్వరూపమున ఆయా ఘట్టముల నన్నిటిని జూపెను. చివరకిట్టి రూపమును జూచుటకును, తన తత్త్వము నెఱుంగుటకును, తనసాయుజ్యము బడయుటకును, భక్తియొక్కటియె ముఖ్య సాధనమని నిర్ధారణ గావించెను.

అట్టి భక్తుని తా నచిరకాలమున సంసారమునుండి యుద్ధరింతుననియు, కావున తననే మోక్షప్రదుడని నమ్మి ధ్యానింపమనియు, దానికి శక్తి లేనిచో సతతము నలవరచుకొనమనియు అందుకును శక్తిలేనిచో భక్తియోగమున కంకురమనదగు తనకర్మలు అనగా ఆలయనిర్మాణము, నందనవనారోహణము, ఆలయము నలుకుట, తుడుచుట, దీపము వెలిగించుట ప్రదక్షిణ నమస్కారములొనరించుట మొదలగువాటిని చేయుమనియు, దానికి సమర్థుడు కాడేని కర్మ దానికంగమగు నిష్కామకర్మయోగమున కంకురమనదగు సర్వకర్మఫలత్యాగమును గావింపమనియు నుపదేశించి దానికి కావలసిన గుణసంపదలను పూసగుచ్చినట్లుపదేశించి యట్టివాడే తనకు ప్రియుడని తెలిపెను

ఇంతటితో నావశ్యకమగు భక్తి యోగాఖ్యానము ముగిసినను తత్త్వత్రయజ్ఞానము ముముక్షువున కత్యంతావశ్యకమగుటచే పదమూడవ యధ్యాయమున శుద్ధాత్మస్వరూపమును, దేహస్వరూపస్వభావమును ఆయాత్మకుదేహసంబంధమునకు నిదానమును దానినుండి విముక్తినిచెందుటకు పాలింపవలసిన అమానిత్వాదిగుణ సంపత్తిని లెస్సగ నుపన్యసించెను.

పదునాల్గవ యధ్యాయమున అచిత్తత్త్వము, దానిగుణముల కార్యములు అవిచేతనుని బాధించురీతి వాటి ఉద్భవాభిభవములచే గలుగు ఫలములు వాటినెఱుంగు నుపాయములు వాటినుండి తప్పించుకొను మార్గములు అందుభక్తియోగ ప్రాధాన్యమును వర్ణించెను. ఇది వైద్యశాస్త్రమునందలి రోగనిదానగ్రంథమువలె ఆధ్యాత్మి ముముక్షువుల కాధ్యాత్మికరోగ నిదానముల నారయు గ్రంథమని నెఱుంగవలెను.

పదిహేనవ యధ్యాయమున ఈశ్వరతత్త్వము నెఱింగించెను. అందులకై మునుముందు సంసార

మను మోక్షఘంటాపథము నవరోధించు వృక్షముగ బోల్చి దీనిని చీల్చి చెండాట కసంగ శస్త్రమావశ్యమనియు అది లభించు సాధనమా పరమపురుషుని శరణాగతియే యనియు నుపదేశించి చంద్రుడు సూర్యుడు అగ్ని వరుణుడు మొదలగు వారి వ్యాపారములన్నియు తన యధీనములేయని పేర్కొనెను. పూర్ణానుస్వారమునకు వేరుగ విలువ లేకున్నను ఒకటి ప్రక్క చేరినకొలది తమవిలువ పెరిగినటుల నిర్వీర్యులగు జీవులను నారాయణుని ప్రక్కకు చేర్చినచో నిరుపమమగు విలువను గడింతురని యీ పురుషోత్తమప్రాప్తి యోగ మెఱింగించుచున్నది. జీవుడీశరీరమును వీడి శరీరాంతరమున ప్రవేశించుతరి వెనుకటి శరీరమునుండి సూక్ష్మమగు నింద్రియములను వాటికాశ్రయములగు భూతసూక్ష్మములను తనతో తోడ్కొని పోవునని జెప్పి కావుననే పూర్వసంసార మనువర్తించుచునే యుండునుగాన, 'నహి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతింతాత! గచ్ఛతి' యనునట్లు సత్కర్మలనాచరించు చేతకుడెన్నటికి చెడడని నుడివెను. భగవంతుడు త్రివిధ చేతనాచేతనవర్గముల కతీతుడగుటచే పురుషోత్తముడనబడుచున్నాడని జెప్పి జీవేశ్వరాభేదవాద వాదమును పూర్వపక్షము గావించెను.

పదునారవ యధ్యాయమున ప్రజలను దేవతలు రాక్షసులు అని రెండు కక్షలుగా విభజించి తామే కక్షకు చెందినవారమని స్వయముగ పరీక్షించుకొనుటకై గీటురాయివలె ఉభయుల గుణజాతమును వివరించెను. అర్జునుని దైవీసంపన్నునిగా నిశ్చయించి తానాతని రథమును స్వయముగ నడుపునటులనే లోకమున నెవ్వరిట్టివారైనను వారిశరీరమనెడు రథమునకు తానే సారథియైనడుపుదునని సూచించెను. ఉభయుల అర్థానర్థముల నెఱింగించెను. కామక్రోధలోభములు నరకద్వారములుగాన నాదారిని పట్టవలదని హెచ్చరించెను. శాస్త్రము నుల్లంఘించుట సకలానర్థ నిదానమని వక్కాణించెను.

పదునేడవ యధ్యాయమున ఔషధనిర్ణయశాస్త్రమువలె ముముక్షువుల కవసరమైన సత్త్వగుణాభివృద్ధికి సాధనములగు ఆహార యజ్ఞదాన తపస్సులయొక్క సాత్త్విక రాజస తామస స్వరూపములను వివరించెను. ఇందుమూలమున సత్త్వము నభివృద్ధిపరచుకొని రజస్తమస్సుల నణచి తరించు విధానము కరతలామలకమగును.

చివర యధ్యాయమున సారతమమగు 'సర్వధర్మాన్' అనెడు శ్లోకరత్నమున పరిత్యాగమునకు విపరీతార్థమున కల్పించకుండుటకై సన్యాసమును గనే దాని తత్త్వమును స్పష్టముగా నెఱింగించె. ఏపని చేసినను శరీరము, జీవుడు, ఇంద్రియము, వాటి వ్యాపారము భగవంతుడని ఐదు కారణములుండునుగాన తన నొక్కనినే కర్తనుగా భావించవలదని జెప్పెను. బ్రాహ్మణాది నాలుగువర్ణముల కర్తవ్యములను నిర్ణయించి ఇందు హెచ్చుతగ్గుల నారసి నిరుత్సాహపడవలదనియు, అన్నిటికి నొక్కటియే ఫలమనియు సహేతుకముగ సమర్థించెను. ఈవర్ణాశ్రమ ధర్మములెట్లు మోక్షమునకు సాధనములగుచున్నవను విషయమును సోపాన పరంపరగ నుపన్యసించి ఇంతవరకు గుహ్యతరము నుపన్యసించితిని. నే జెప్పిన చొప్పును నేర్పుతో నారసి యథేష్ట మనుష్ఠింపుమని విరమించగ నర్జును డతి భీతితో నేడ్వసాగెను. దానికా భగవానుని హృదయము కరిగి సర్వగుహ్యతమమగు శరణాగతియే ఇష్టప్రాప్తికిని అనిష్టపరిహారమునకును ముఖ్యతమ సాధనమని జెప్పి గీతోపదేశమును ముగించెను. చివరకు గీతార్థానుష్ఠాన ప్రచారములకును, అధ్యయనమునకును, అందలి శ్రద్ధకును, గీతార్థములవట్ల అసూయా రాహిత్యమునకును ఫలమును జెప్పెను.

శ్రీమతే రామానుజాయ నమః

# బదరి – అనుబంధము

## అష్టాక్షరీక్షేత్ర విరాళములు

(1) బదరికాశ్రమములో మన సంఘముద్వారా నిర్మింపబడుచున్న అష్టాక్షరీక్షేత్ర మనుపేరుగల శ్రీరామానుజ కూటములో ఒకగది కట్టించుటకుగాను రు. 3500/ లున్నూ,

(2) ఆ అష్టాక్షరీక్షేత్ర రామానుజ కూటములో శాశ్వత తదీయారాధన నిమిత్తం రు. 3500/ నున్నూ,

(3) బ్రహ్మకపాళములో తమతల్లిదండ్రులకు ప్రతిసంవత్సరము పిండప్రదానము గావించుటకు రు. 2000/ లును

శ్రీశ్రీశ్రీ భూదేవమ్మ అనే లక్ష్మీవెంకాయమ్మరావు రాణీగారు అనే మీరాపురం రాణిగారు పైమూడు మొత్తములు ఇచ్చుటకు వాగ్దానముగావించిరి.

శ్రియఃపతి యీమెగారి కుటుంబమునకు సమస్తసన్మంగళములు ప్రసాదించుగాక.

# సత్సంగసదనవిరాళములు

బదరికాశ్రమములో మన సంఘముద్వారా నిర్మింపబడుచున్న సత్సంగసదనములో ౧౦౦ అడుగులకుగాను

(1) శ్రీ ఎచ్చా ఆనందశెట్టిగారి కుమారులు శ్రీ పరోపకారశెట్టిగారు (మద్రాసు) రు 150/ లు సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సన్మంగళములు ప్రసాదించుగాక.

(2) శ్రీ దొడ్లా అండాళమ్మగారు (మద్రాసు) కూడా ౧౦౦ అడుగులకుగాను 1600/ లు వాగ్దానముగావించి ప్రస్తుతము 1 10 లు సమర్పించిరి.

శ్రియఃపతి ఈమెకితోఅధిక భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠ ప్రసాదించుగాక.

(3) శ్రీ గుగ్గిలం ఆదినారాయణగారుకూడ ౧౦౦ అడుగులుకు 1600/- లు వాగ్దానముగావించి అడ్వాన్సుగా 25/- లు సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

(4) శ్రీ మొగలి రాధాకృష్ణయ్యగారు మన బదరీ సత్సంగసదన నిర్మాణములో 100 అడుగులకు రు 1600 వాగ్దానము చేసి అడ్వాన్సుగా యిచ్చినది 600 ల రూపాయలు. శ్రియఃపతి వీరి కుటుంబమున కనేక మంగళములు ప్రసాదించుగాక!









శ్రీ హయగ్రీవాయనమః

# నారాయణపరత్వము

శ్లో॥ ఆత్మైక్యం - దేవతైక్యం - త్రికసమధికతా తుల్యతైక్యం - త్రయాణాం
అన్యత్రైశ్వర్య - మిత్యాద్యనిపుణభణితీ రాద్రియంతే నసన్తః
త్రయ్యన్తై - రేకకంఠస్తదనుగుణ మను వ్యాసముఖ్యోక్తిభిశ్చ
శ్రీమన్నారాయణోనః పతి రఖిలతను ర్ముక్తిదో - ముక్తభోగ్యః.

## తాత్పర్యము

ఆత్మైక్యమే పరమార్థమని కొందఱు - దైవతైక్యమే పరమార్థమని కొందఱు - బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మించిన పరదేవతా వేరుగా నొకటి కలదని కొందఱు, దేవతలందఱును సమానులే యనువారు కొందఱు శ్రీ మహావిష్ణువును మించిన పరదైవ మొకటి కలదని కొందఱు.

ఇట్లు అజ్ఞానముచే ప్రసంగించు శాస్త్రార్థములను దేవతాపారమార్థ్యమెఱిగిన పెద్ద లాదరింపరు.

వారు వేదాంతవాక్యములకు పైకిభాసించు పరస్పరవిరోధములను మీమాంసా శాస్త్రములతో పరిహరించి వానిని మనుస్మృతి, వ్యాసోక్తములగు బ్రహ్మసూత్రములు, భగవద్గీత, సాత్వికపురాణాదులతోను, ఇతిహాసములతోను, సమన్వయపరచి శ్రీమన్నారాయణుడే తమకుపతియనియు, అతడుచేతనాచేతన శరీరుడనియు ముక్తినొసంగువాడనియు, ముక్తులచే ననుభవింపబడువాడనియు నమ్మి యాతనినే భజించి తరింతురు.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 54. | స్థవిరః | కాలాతన్త్రితయా దుగ్ధ।<br>దధ్యాది భోగ్యవిలక్షణః।<br>విద్యతే యస్సర్వకాలం।<br>స్థవిరః పరికీర్తితః। | కాలమున కధీనమై పరిణమించు పాలు పెరుగు మొదలగు వాటివలెగాక కాలమునే తనవశపరచుకొని యన్నిటిని సృజించుచు సర్వదా యుండువాడు. |
| 55. | ధృతః | అప్రచ్యావ్య స్వస్వరూపాత్।<br>సదా యోఽసౌ ధృవస్మృతః। | అనంతపదార్థములుగ పరిణమించినను తనస్వరూపమును విడువక నిర్వికారుడై యెల్లప్పుడుండువాడు. |
| 56. | అగ్రాహ్యః | అగ్రాహ్యో యోఽనధిష్ఠేయో।<br>ముక్తిః కేవ కులాలకైః॥ | కారణమైన మన్ను కుమ్మరికి స్వాధీనమైనటుల తాను కారణమైనను ఎవరికిని స్వాధీనముకానివాడు. |
| 57. | శాశ్వతః | అవ్యుచ్ఛిన్నా స్తతస్త్వతే।<br>సర్గస్థిత్యన్త సంయమాః।<br>అతస్సదా ప్రవాహాత్వా।<br>న్నిత్యశ్శాశ్వత ఉచ్యతే। | జగత్తుయొక్క సృష్టిస్థితిలయాదులను ప్రవాహమువలె నెడతెగక నిరంతరముసాగించుండును. అట్లుసాగించుటకు తానును ఎల్లప్పుడును ఉండువాడు. |
| 58. | కృష్ణః | ఏకాన్తలీలారసతో।<br>నిర్వృతః కృష్ణఉచ్యతే।<br>కృషిర్భూవాచక శ్శబ్దః।<br>ణశ్చనిర్వృతివాచకః। | లీలారసముతో నిరంతర మానందించువాడు.<br>కృష్-అనగా భూమి-(అపరచ్ఛిన్నము)-అనగాఆనందము-అపరచ్ఛిన్నమైన ఆనందమే స్వభావముగా కలవాడు. |
| 59. | లోహితాక్షః | రక్తరాజీవనయనో।<br>లోహితాక్షః ప్రకీర్తితః। | ఇట్టి ఆనందమును సూచించునట్టి ఎఱ్ఱతామరలవంటి నేత్రములుకలవాడు. |
| 60. | ప్రతర్దనః | యస్యచ బ్రహ్మక్షతఞ్చ।<br>మెహ్యాదనం భవతస్సదా।<br>ప్రతర్దన స్సవిజ్ఞేయః।<br>సంహర్తృత్వ ప్రదోమనుః॥ | బ్రాహ్మణ-క్షత్రియాదిజీవరాసులతోకూడియున్నసమస్త ప్రపంచమును ఆహారముగా కలవాడు. సంహారకర్త. దీనిని ఓమ్ ప్రతర్దనాయనమః అని మంత్రముగానాదరించినచో అంతర బాహ్యసర్వశత్రుసంహారము నొసంగును. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 61. | ప్రభూతః | భోగోపకరణం నిత్యం।<br>నిర్మర్యాదం పరంపదమ్।<br>యస్య తేన సమృద్ధత్వాత్।<br>ప్రభూత ఇతికథ్యతే॥ | నిత్యమై హద్దుమీరనివై శాల్యముకలదైయున్న భోగ సాధనమగు పరమపదముతో సమృద్ధముగానుండువాడు |
| 62. | త్రికకుద్ధామ | త్రిపాద్విభూతిస్త్రికకుత్।<br>సైవస్థానం విశేషతః।<br>యస్య సత్రికకుద్ధామ। | త్రికకుత్ అనగా పరమపదము - ధామ అనగా దానిని ప్రధానమైన వాసస్థానముగా కలవాడు. |
| 63. | పవిత్రమ్ | గుణస్య విభవానాఞ్చ।<br>రూపస్యచ నిరన్తరమ్।<br>నిరూపకస్య సర్వైశ్చ।<br>తన్నిరూప్యం స్వరూపకమ్।<br>అనుప్రవిశ్యవసతి।<br>సపవిత్ర మితిస్మృతమ్॥ | జ్ఞానశక్త్యాది గుణములచేతను ఉభయవిభూతి నాయకత్వాదిమహిమ చేతను దివ్యమంగళ విగ్రహాదులచేతను క్రమముగా తెలుపబడుస్వరూపముకలవాడు.<br>అట్టి నిఖిల హేయగుణములకును ప్రతిభటమగురూపముతో నన్నింటను ప్రవేశించి యుండువాడు. |
| 64. | మఙ్గళం పరమ్ | సర్వహేయ ప్రత్యనీక।<br>మనన్తానన్ద లక్షణమ్।<br>వేదాన్తపారగ న్నిత్య।<br>ముచ్యతే మఙ్గళం పరమ్॥ | సమస్తదుర్గుణములకును సహజశత్రువును నిరవచ్ఛిన్నానందమే స్వరరూపముగాను కలవాడని ఉపనిషత్తులచే తెలుపబడువాడు. |
| 65. | ఈశానః | సర్వావస్థాసు సర్వేషాం।<br>వ్యవస్థాపన శీలతః।<br>వస్తూనాం భగవాన్ సాక్షాత్।<br>ఈశానః పరికీర్తితః। | సర్వావస్థలలోను సమస్తపదార్థములను వాటివాటి మేరను మీరకుండునట్లు నియమించియుంచునట్టి స్వభావముకలవాడు. |

# పూజా విరాళములు (తరువాయి)

శ్రీ జిల్లా కన్నయ్యశెట్టిగారు. 16/-
శ్రీ పలవాది వేదవల్లి తాయారమ్మగారు, కాంపౌండు గోడపై ఇనుపజంగరానికి 100/-
శ్రీ పొత్తూరి కాంతమ్మగారు. 16/-
శ్రీ ఎ. సౌందరరాజులు నాయుడుగారు. 32/-
శ్రీ మోదుగ కనకవల్లి తాయారమ్మగారు 32/-
శ్రీ గునుపాటి వెంకటసుబ్బయ్య శెట్టిగారు. 16/-
శ్రీ తడకండ్ల యతిరాజమ్మగారు. 16/-
శ్రీ ఓరుగంటి సుబ్రహ్మణ్యం శెట్టిగారు. సత్సంగ సదనంలో నిలువుటద్దం సమర్పించుటకు 100/ లు వాగ్దానంచేసి అడ్వాన్సుగా సమర్పించినది. 1/-
శ్రీ మల్లికొండు కమలమ్మగారు. 32/-
శ్రీ కేసరి రాజమాణిక్యమ్మగారు. 32/-
శ్రీ దేవు జగన్నాథం శెట్టిగారు. 11/-
శ్రీ ఓలేటి జగన్నాథాచార్యులుగారు, ప్లీడరు రాజమండ్రి 16/-
శ్రీ పద్మనాభం మురళీధరుడుగారు. 16/-
శ్రీ జాలగంటి రాజేశ్వరిగారు, మద్రాసు 16/-
శ్రీ పెనుగొండ పద్మనాభం శెట్టిగారు 16/-
శ్రీ కృష్ణాపురం ఆదినారాయణ శెట్టిగారు 16/-
శ్రీ నాళం రాజేశ్వరమ్మగారు. 75/-
శ్రీ గునుపాటి పారిజాతమ్మగారు. వాగ్దానం లో జమ 25/-
శ్రీ పొత్తూరు కృష్ణవేణమ్మగారు. సత్సంగసదనంలో నిలువుటద్దంవాగ్దానం చేసి అడ్వాన్సుగా ఇచ్చినది 1/-
శ్రీ వేమా అండాళమ్మగారు. 16/-
శ్రీ వరదా పట్టమ్మగారు. 16/-
శ్రీ ఇస్కాల కోటేశ్వరరావుగారు. 16/-

### సంభావనలు

శ్రీ రామినీడి అండాళమ్మగారు. పెనుగొండ పరమపదోత్సవ సందర్భములో శ్రీ క. శేషాచార్యులుగారి ద్వారా వచ్చిన సంఘసంభావన 2/-

# సాంఘిక వార్తలు

## గీతాజయంతులు

వరంగల్లు :- ఇచ్చట శ్రీ భగవద్గీతా ప్రచారకపరిషత్సేవా దళమువారు శ్రీమాన్ మాడుంబై రామానుజాచార్యులవారి నిర్వహణతో గీతాజయంతిని చాలా వైభవముగా జరిపిరి. కవిసమ్మేళనలు, సంగీతసాహిత్య గోష్ఠులు, గీతాపారాయణలు, గీతాయజ్ఞగానములు, గీతోపన్యాసములు, హరేరామమహాక్రతువున్నూ, మహోత్సాహపూరిత వాతావరణలో జరిగినవి.

రేపల్లె :- ఇచ్చట శ్రీ తటపర్తి రామమోహనరావుగారిచే ప్రతిష్ఠ గావింపబడిన శ్రీ పట్టాభిరామస్వామివారి ఆలయములో శ్రీమాన్ చిలకమర్రి వెంకటకృష్ణమాచార్యులుగారు గీతాజయంతిని పారాయణ, హోమ, ఉపన్యాస ఇత్యాది కార్యక్రమములతో పరమవిలక్షణముగా జరిపిరి.

పైలవరం :- ఇచ్చట శ్రీ మహిళాసంఘమువారు గీతాజయంతిని చక్కగా జరిపిరి. శ్రీ కాంతమ్మగారు శ్రీ లక్ష్మమ్మగారు గీతనుగురించి యుపన్యసించిరి శ్రీ నూరానేని వరమంగయమ్మారావు రాణీగారు మానవునకుండవలసిన లక్షణములనుగురించి యుపన్యసించిరి.

కొత్తూరు :- ఇచ్చట శ్రీ నైశ్వరాజా శ్రీ రామరాజుగారు, ముక్కోటి ఏకాదశినాడు శ్రీ సీతారామస్వామివారి సన్నిధిలో అఖండ కలిసంతరణ మంత్రసంకీర్తన 24గంటలు సమిష్టిగా జరిపిరి. గీతాపారాయణ 18 అధ్యాయములు పూర్తిగా జరిపిరి. ప్రతినిత్యము వారింటజరుగు శ్రీ రామాయణకాలక్షేప ఘట్టములో పాదుకాపట్టాభిషేక మహోత్సవము వైభవముగా జరిపిరి.

శ్రీకాకుళం :- ఇక్కడ శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో అధ్యయనోత్సవము గీతాజయంతి చాలా వైభవముగా జరిగెను. శ్రీమాన్ కంబా శ్రీమన్నాథాచార్యస్వామిగారున్ను శ్రీమాన్ మహేంద్రవాడ వెంకటరామనరసింహాచార్యులుగారు, ద్రావిడాధ్యయనము గీతోపన్యాసములు నిర్వహించిరి. యీ ఉత్సవములో విజయనగరం సంస్కృత కళాశాలా పండితులు సాహిత్యన్యాయమీమాంసా విద్యాప్రవీణ బ్రహ్మశ్రీ కొల్లూరు లక్ష్మణమూర్తి శాస్త్రిలుగారు ఉపన్యసించి సదస్యుల నానందపరచిరి.

బందరు :— ఇచ్చట శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారక సంఘమువారున్ను శ్రీయతిరాజ సేవామహిళామండలి వారున్ను గీతాజయంతి మహోత్సవమును వైభవముగా జరిపిరి.

భట్టిప్రోలు :— ఇచ్చట శ్రీ చిలకమర్తి శ్రీ రామానుజస్వామిగారి ప్రోత్సాహముతో శ్రీయతిరాజ సేవామహిళామండలి వారి వార్షికోత్సవము వైభవముగా జరిపి సంఘమునకు రూ. 5/లు సమర్పించిరి.

మద్రాసు :— ఇచ్చట గీతామందిరములో శ్రీయతిరాజసేవా మహిళామండలివారు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిని అహ్వానించి గీతాజయంతిని, ధనుర్మాసవ్రతమును మహావైభవముగా జరిపించిరి. ప్రతిదినము ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము జియ్యర్‌స్వామివారున్ను, శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామి వారున్ను, శ్రీ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారున్ను ఉపన్యాసములు గావించిరి.

మరియొక విశేషము :- ప్రతిదినము రాత్రి 8 గంటలనుండి శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు హిందీలో ఉత్తరాదివారిమఠములో తిరుప్పావు ఉపన్యాసములు గావించి భోగినాడు గోదాకళ్యాణ ఘట్టములో శ్రీస్వామివారికి మఠస్థులు సమర్పించిన సన్మానమును, శ్రీబదరీనాథు కైంకర్యమునకు సమర్పించిరి. గీతాపారాయణలు గావించిన స్వాములకు సంతృప్తికరముగా శ్రీ మహిళాసంఘమువారు సత్కరించిరి తిరుప్పావు చాత్మురనాడు శ్రీ శ్రీ శ్రీ భూదేవమ్మారావు రాణీగారు (మీర్జాపురం) శ్రీ జియ్యర్ స్వామివారిని, శ్రీ గోపాలాచార్య స్వామివారిని, శ్రీ కవిగారిని, పరివార స్వాములను విశేష నూతనవస్త్రములతో సత్కరించిరి. ఈ మహోత్సవములో నొకనాడు, శ్రీ బదరీనుండి శ్రీ త్రిదండి వేదాంతరామానుజ జీయర్‌స్వామివారున్ను, బదరీనాథుని అర్చించు శ్రీ రావల్ మహాశయులున్ను మద్రాసు విచ్చేయగా వారిని గీతామందిరమునకు ఆహ్వానించి శ్రీ జియ్యర్ స్వామివారు శ్రీ గోపాలాచార్యస్వామివారు, శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు విశేషసత్కారములుగావించిరి. ఇక్కడ శ్రీ జియ్యర్ స్వామివారు పుష్యశుద్ధపూర్ణిమదాక వేంచేసి యుండి పిదప బెంగుళూరు, కడప, తిరుపతిప్రాంతములకు వెంచేయదలచుచున్నారు.

---

సాలుచందా రు 5/లు **భక్తినివేదన—BOOK POST** రి. నెం. A. 195

శ్రీ వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం - చుండూరుపోష్టు, గుంటూరు జిల్లా.



---

Edited and Published by Sri T K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press Nadigaddapalem.

శ్రీమతే రామానుజాయ నమః



# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]

సంపుటి ౧౧ || విళంబి – మాఘము || సంచిక ౧౨

## చేతనా చేతనస్వభావ విశేషములు

శ్లో॥ పరస్మా దన్యస్మై యదపి, యదపి స్వేన పరతః
పరస్మై, స్వస్మైచ స్వత ఇతరతో వా స్ఫురతియత్
తదేత త్సర్వాత్మన్! తవ భవతి షాడ్గుణ్య జలధే
ర్విధేయం చాధేయం వివిధ వినియోగోచితమపి॥

### తాత్పర్యము

చేతనా చేతనములన్నింటియందు అంతర్యామివై వేంచేసియున్న ఓ సర్వేశ్వరా!

తనకన్న వేరైన చేతనునకు మాత్రమే ప్రమాణాంతరములచే గోచరించు ప్రకృతియు.

ప్రమాణాంతరములచేగాక తనంతతానున్నూ, తనకన్న వేరైన చేతనునకు మాత్రమే గోచరించు నిత్యవిభూతియు

ప్రమాణాంతరములచే తనువలె తనంతతానును తనకును ఇతరులకును కూడ ప్రకాశించునట్టి చేతనుడును

అను ఈ మూడు తత్త్వములును జ్ఞాన శక్త్యాదిషడ్గుణములకు రత్నాకరుడవగు నీచే ధరింపబడునవియు, నీకిష్టమైన విధముగా వినియోగించుకొనుటకును తగియున్నవి.

అనగా చేతనములు, అచేతనములు, నిత్యవిభూతియు నీకు శరీరములే. నీవు వాని కన్నింటికిని అంతరాత్మవై విరాజిల్లు చున్నావు.

సంపాదకులు:
విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు:
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

# సత్సంగసదన విరాళములు (మద్రాసువారు)

శ్రీ దొడ్డా అండాళ్ళమ్మగారు లోగడ ఇచ్చినది
రు. 1400/- గాక ఇప్పుడు ఇచ్చినది రు. 200/-
శ్రీ B. వెంకటసుబ్బయ్యగారు 160/-
శ్రీమతి పొత్తూరి కృష్ణవేణమ్మగారు 100/-
శ్రీ పువ్వాడ లక్ష్మీతాయమ్మగారు 64/-
శ్రీ వంకల లక్ష్మీనారాయణగారు 50/-
శ్రీ కీ. శే. అద్దంకి తిరుమలతాతాచార్యులుగారు
వీరి భార్యతరపున సమర్పించినది 32/-
శ్రీ వేవా కుప్పుస్వామిగారు అడ్వాన్సు 25/-
శ్రీ గుసుపాటి పారిజాతమ్మగారు 75/-
శ్రీ ముంజులూరి గోపాలశెట్టిగారు 16/-
శ్రీ రాధానాథమునిగారు 16/-
శ్రీ బైసాని కమలమ్మగారు 16/-
శ్రీ పబ్బిశెట్టి సీతమ్మగారు 16/-
శ్రీ ముత్యాల సుబ్బరంగయ్యశెట్టిగారు 16/-
శ్రీ మద్దాల పూలమ్మగారు 16/-
శ్రీ మద్దాల తేవప్పెరుమాళ్లశెట్టిగారు 16/-
శ్రీ చీదెళ్ళ పూలమ్మగారు 16/-
శ్రీ వేమా వీరరాఘవులుశెట్టిగారు 16/-
శ్రీ పువ్వాడ ఆంజనేయులుశెట్టిగారు 16/-
శ్రీ సత్రసాల కనకవల్లి తాయారమ్మగారు 16/-
శ్రీ P. చూడామణిఅమ్మాళ్‌గారు 16/-
శ్రీ పొత్తూరి వెంకటసుబ్బమ్మగారు 16/-
శ్రీ నిమ్మగడ్డ వరసమ్మగారు 12½/-

## శాశ్వతపూజలు

శ్రీ దేసురామయ్యగారు రు. 116/-
శ్రీ రామానుజరామశెట్టిగారు 101/-
శ్రీ రేపూరి కమలమ్మగారు 116/-
శ్రీ పెరుమాళ్లు వెంకటనరసయ్యగారు, భీమవరం 29/-
శ్రీ నీలకంఠం వెంకటరాయులు శెట్టి
" వరదరాజులుశెట్టిగారు } 30/-
శ్రీ పువ్వాడ లక్ష్మీతాయారమ్మగారు 29/-
శ్రీ N. మకరత్తమ్మగారు 29/-
శ్రీ పొత్తూరి వెంకటసుబ్బమ్మగారు 29/-
శ్రీ మవాలి వెంకటసుబ్బమ్మగారు 29/-
శ్రీ నంద్యాల శోభనాద్రిచార్యులుగారు 29/-
శ్రీ ఆలత్తూరి చిన్నకుట్టెమ్మగారు 29/-
శ్రీ యం. లక్ష్మీ కాంతమ్మగారు 29/-

శ్రీ సంతాని వేదవల్లితాయారమ్మగారు 30/-
శ్రీ కండ్లగుంట శ్రీనివాసాచార్యులుగారు 29/-
శ్రీ గోవర్ధనం వెంకటఅప్పలాచార్యులుగారు 29/-
శ్రీ పి. రాజమ్మగారు 58/-
శ్రీ మన్నారు శకుంతలమ్మగారు 29/-
శ్రీ కామేశ్వరమ్మగారు 29/-
శ్రీ మాడభూషి వేణుగోపాలకృష్ణమాచార్యులు
(తాత్కాలికం) 11/-
శ్రీ దేసు జగన్నాథంశెట్టిగారు, మద్రాసు 29/-
శ్రీ బండారు కాంతమ్మగారు, మద్రాసు 30/-
శ్రీ అకుల గోవిందమ్మగారు, మద్రాసు 30/-
శ్రీ గాదిరెడ్డి పద్మనాభంగారు, మద్రాసు 30/-
శ్రీ దేసు శ్రీరాములశెట్టిగారు " 29/-
శ్రీ కంకిపాటి శ్రీరాములుగారు " 29/-
శ్రీ యలమంచి వెంకటసీతమ్మగారు, పసుమర్రు
275/- లో పూర్తిగా ఇచ్చినది 46/-
శ్రీ అనుమాలశెట్టి మాణిక్యంగారు 29/-
అవసర్తిగ్రామంలో 1-12-58 తేదిని శ్రీశ్రీశ్రీ
జీయర్‌స్వామివారు వచ్చినప్పుడు శ్రీ వైష్ణవ
సంఘమువారు (అవసర్తి) సమర్పించినది 58/-
శ్రీ పసుమర్తి రంతిరాజులుశెట్టిగారు, మదరాసు 16/-
శ్రీ A. M. ముక్తకృష్ణగుప్తగారు, మద్రాసు 16/-
శ్రీ అన్నం సంపత్తు - శ్రీహరిగార్లు 32/-
శ్రీ పి. కనకవల్లి తాయారమ్మగారు 16/-
ఒకభక్తురాలు 16/-

## కట్నంకాతా

శ్రీ దొర్నాదుల కృష్ణవేణమ్మగారు 16/-
శ్రీ వోలేటి సుందరమ్మగారు 16/-
శ్రీ పెనుగొండ నారాయణశెట్టిగారు 32/-
శ్రీ ఉప్పుటూరి చెంగల్వరాయశెట్టిగారు 16/-
శ్రీ ముత్యాల సుబ్బరంగయ్యశెట్టిగారు 13/-
శ్రీ కృష్ణవేణిఅమ్మాళ్‌గారు 32/-
శ్రీ T. పద్మావతమ్మఅమ్మాళ్‌గారు 10/-
శ్రీ నూరిశెట్టి ధనలక్ష్మమ్మగారు 16/-

## సత్సంగంకాతా

శ్రీ కనుమూరి శ్రీనివాసాచార్యులుగారు, నెల్లూరు
తమకుమారైకు కుమారునకు కేశఖండన జరిపి
పంపిన కట్నం

# నవవిధ భక్తులు

న్యాయవేదాంతవిద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

భక్తాగ్రగణ్యునిచే సుశిక్షితుఁడై తల్లిచే చక్కఁగ నలంకరింపబడి తనచరణములకు మ్రొక్కినిలిచిన పుత్త్రుఁడగు ప్రహ్లాదుని హిరణ్యకశిపుఁడు రెండుచేతులతో నెత్తి తొడపై నిడుకొని ముద్దిడి ఆనందబాష్పములు రాల్చుచు

శ్లో. ప్రహ్లాదానూచ్యతాం తాత! స్వధీతం కించి దుత్తమం
(భాగ- 7 స్కం. 5 అ. 22 శ్లో.)

నాయనా! ప్రహ్లాదా! ఇంతవఱకు గురువులు నీకు నేర్పిన విద్యలలో నీకు బాగుగ వచ్చిన మంచి పద్యము నొకదానిని చదువు తండ్రీ! యని లాలనగ నడుగగ నే యాతఁడు-

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చేన్నవలక్షణా
క్రియతే భగవ త్యద్ధా! తన్మన్యే ఽధీత ముత్తమమ్॥

తండ్రీ! భగవత్కథలను వినుట, భగవద్గుణములను కీర్తించుట భగవంతుని ధ్యానించుట, అతని పాదారవిందములను సేవించుట, పూజించుట, నమస్కరించుట అతనికి కైంకర్యమును చేయుట, అతనితో సఖ్యమ్మైత్రి నెరపుట అతని కాత్మసమర్పణము గావించుట యనెడి తొమ్మిది విధములైన భక్తియు షడ్గుణసంపన్నుఁడగు సర్వేశ్వరుని విషయమై చేయబడుటయే ఉత్తమవిద్యకు సార్థకమని సవినయముగ విన్నవించెను.

భక్తియోగమును ప్రధానముగ ప్రతిపాదించు భగవద్గీతలో నీభక్తివిషయమై ప్రధానమగు తొమ్మిదవ యధ్యాయమునందు నవవిధభక్తియు నెట్లు ప్రతిపాదింపబడినదియు ఇవియన్నియు నవలంబింపబడవలెనా? దీనిలో నేయొక్కదానితోనైనను తరించవచ్చునా? అట్లైనచో ఏవిషయమును ప్రధానముగ గ్రహించి తరించిరను విషయము ఈవ్యాసమున విమర్శింపబడును.

(ఇందులకు కేవల శ్రీమద్రామాయణపురుషులచరిత్ర నుదాహరణముగ గ్రహించదలచితినిగాని ప్రత్యేకముగ రామాయణోపన్యాసములను ప్రకటించదలంచుటచే నిప్పుడీ విషయమై నానాగ్రంథములనుండి ఆయాపురుషుల చరిత్రల నుదాహరణముగ నెత్తిచూపుచున్నాను.) తొమ్మిదవ అధ్యాయమున భక్తుల కాలక్షేపప్రకారమును జెప్పెడు ప్రకరణములో-

శ్లో. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే॥
9 అ. 15 శ్లో.

జ్ఞానయజ్ఞముతో యజింతురనుటచే జ్ఞానయజ్ఞముచే నానందపరతురని యర్థము.

18 వ అధ్యాయమున ఫలశ్రుతిలో-

శ్లో. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్ట స్స్యా మితి మే మతిః

గీతాశాస్త్రమును గురుముఖతః అధ్యయనముచేయుటను జ్ఞానయజ్ఞముగా భగవానుడు పరిగణించెను. కావున భక్తుల యనుష్ఠానములందలి జ్ఞానయజ్ఞమనగా గురువునుండి భగవద్విషయమును వినుటయేగాన ప్రణిపాత, పరిప్రశ్న, సేవలచే లభించదగిన శ్రవణము చెప్పబడెను.

శ్లో. సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చ మాం భక్త్యా ......9 అ. 14 శ్లో.

ఆనెడు శ్లోకమున సతతం 'కీర్తయన్తః' అనుపదములను అత్యర్థ మత్ప్రియత్వేన మత్కీర్తనాదినా వినా క్షణాణుమాత్రే ఽప్యాత్మధారణ మలభమానాః మద్గుణ విశేష వాచీని, మన్నామాని స్మృత్వా పులకాంచిత సర్వాఙ్గాః హర్షగద్గదకణ్ఠాః, నారాయణ! కృష్ణ! వాసుదేవేత్యేవ మాదినీ సతతం కీర్తయంతః॥ - అని భాష్యకారులు వివరించిరి.

అనగా - నాయందత్యంత ప్రీతిగలవారగుటచే నా భక్తులు నన్ను కీర్తించక అత్యల్పకాలమైనను ధరించలేని వారై నాకల్యాణగుణ విశేషములను దెలుపునట్టి నా నామములను దలంచి ఒడలంతయు గగుర్పాటొనరింప ఆనందముచే నైన డగ్గుత్తికతో నారాయణా! కృష్ణా! వాసుదేవా! యని రహస్యముననేమి, పదిమందిలో నేమి సిగ్గును భయమును విడిచి కీర్తించుచుందురు. దీనిచే కీర్తనమున్ను అదిచేయవలసినరీతియు తెలుపబడినవి. 'యతంతశ్చ దృఢవ్రతాః' అనుభాగమునకు శ్రీ భాష్యకారులు 'మత్కర్మ స్వర్చనాదికేషు' తదుపకారకేషు భవన నన్దన వన కరణాదికేషు చ దృఢసంకల్పా యతమానాః అని వ్యాఖ్యానము చేసిరి. అనగా నాయర్చనాదికర్మలయందును వాటికుపయోగించు భవననిర్మాణము పూదోటలనాటుట మొదలగు కర్మలయందును చలించనిపట్టుదల కలవారై

ప్రయత్నింతురనుటచే అర్చనము దాస్యముల యొక్క స్వరూపము నిరూపింపబడెను.

'భజన్త్యనన్యమనసో' 9 అ. 13 శ్లో. అను శ్లోకాంశమునకు భాష్యకారులు - 'మత్ప్రియత్వాతిరేకేణ మద్భజనేన వినా మనసశ్చాత్మనశ్చ బాహ్యకరణానాంచ ధారణమలభమానాః మద్భజనైకప్రయోజనాః భజన్తే॥ అని వ్యాఖ్యానము చేసాయించిరి. అనగా నాయందలి అపారప్రీతితో నన్నుధ్యానించనిచో మనస్సుగాని ఆత్మగాని బహిరింద్రియములుగాని నిలువజాలవుగాన ధ్యానించుటయే ఫలముగా ధ్యానింతురు అనుటచే స్మరణము వివరింపబడెను.

ఈస్మరణయే 'అనన్యాశ్చింతయంతో మాం' అనెడు 22వ శ్లోకమునందును ఫలముతో చెప్పబడెను

'నమస్యన్తశ్చ మాం భక్త్యా' 9 అ-14 శ్లో అను వాక్యమునకు శ్రీభాష్యకారులు "భక్తిభారావనమిత మనోబుద్ధ్యభిమాన పదద్వయ కరద్వయ శిరోభి రష్టాఙ్గై రచన్తిత పాంసుకర్దమ శర్కరాదికే ధరాతలే దణ్డవత్ప్రణి పతంతః అని సాయించిరి.

అనగా - భక్తియనెడు బరువుచే నేలకంటిన మనస్సు, బుద్ధి, అభిమానము, రెండుచేతులు, రెండుకాళ్లు, తల, యనెడు యష్టాంగములతో దుమ్ము, ధూళి, రాయి, రప్ప, బురదయని యాలోచించక భూమిపై కఱ్ఱవలెపడి నమస్కరించుట యని వందనమును చేయవలసినరీతితో వివరించిరి.

దీనిచేతనే పాదసేవనము గూడ లభించుచున్నను శ్లో. మన్మనాభవ ...... 'యనెడు 34 వ శ్లోకమున మద్యాజీ' అను పదవ్యాఖ్యానసందర్భమున 'యజనంనామ - పరిపూర్ణశేషవృత్తిః' అనియు 'మాం నమస్కురు - అనుచోట మయ్యతిమాత్ర ప్రహ్వీభావంకురు' అనుటచే ప్రహ్వీభావమనగా "ప్రేక్షావతః ప్రవృత్తి ర్యా ప్రహ్వీభావాత్మికా మతా ఉత్కృష్టం పర ముద్దిశ్య అనగా-గొప్పవానినుద్దేశించి బుద్ధిమంతుడు చేయుశట్టి లేచి నిలచుట ఎదురేగుట పాదసేవనాది ప్రవృత్తులేయనియు' సూచింపబడుటచేతనుపాదసేవనము చెప్పబడెను ౯.శ్లో. యేభజన్తితుమాం భక్త్యామయితే తేషు చాప్యహం'అను 29 వ శ్లోకమున శ్రీభాష్యకారులు తే జాత్యాదిభిరుత్కృష్టా అపకృష్టా వా మత్సమానగుణవ ద్యథాసుఖం మయ్యేవ వర్తన్తే అని వ్యాఖ్యానించుటయు దానికి శ్రీదేశికులు 'తుల్యానామివాన్యోన్యమైకరస్య మిహ 'మయి' ఇత్యాదినా వివక్షిత మిత్యభిప్రాయేణోక్తం' (చంద్రిక) అని యవతరించుటయు సఖ్య - భావమును సూచించుచున్నది.

సమానగుణములు గల తుల్యకోటికి చెందినవారిచే సఖ్యవృత్తియే గదా పాటింపబడునది.

శ్రీ కృష్ణుడనేకసార్లు అర్జునుని సఖుడని వ్యవహరించుటయు, అర్జునుడున్ను "సఖేతి మత్వా ప్రసభం యదుక్తం" (గీత ॥ అ ॥ 41 శ్లో.) అనుశ్లోకమున శ్రీకృష్ణుని సఖునిగా భావించితిననియు చెప్పుటచే సఖ్యము చూపబడెను.

'యత్కరోషి' యనెడు 28 వ శ్లోకవ్యాఖ్యానమున శ్రీ భాష్యకారులు 'ఏతదుక్తంభవతి' అనిప్రారంభించిన గ్రంథమున 'కర్మకర్తుః భోక్తుః తవ చ మదీయతయా మత్సఙ్కల్పాయత్త స్వరూపస్థితిప్రవృత్తయా చ మయ్యేవ పరమశేషిపరమకర్తరి త్వాం చ కర్తారం భోక్తారం రాధకం ...సర్వం సమర్పయ" కర్మలనాచరించి ఫలముననుభవించు నీవు నాకు శరీరమువలె పరతంత్రుడవుగావున నీస్వరూపము స్థితి ప్రవృత్తి, యంతయు నాసంకల్పాధీనమైనవియే గదా కావునవాస్తవమున నీకు పరమశేషిని పరమకర్తను నేనే అందుచే కర్తయు భోక్తయు ఆరాధకుడవగు నిన్ను (ఆత్మను) నాయందు సమర్పింపుము అని ఆత్మసమర్పణము విధించెను.

కావున నీభక్తియోగపరమగు తొమ్మిదవయధ్యాయమునందే నవవిధభక్తులను యనుష్టించవలసినరీతులతో కొన్ని కంఠరవమునను కొన్ని సూచనామాత్రముగను ప్రతిపాదింపబడినవి.

ఈతొమ్మిదివిధములగు భక్తులలో నేయొక్కదానిని లెస్సగ ననుష్ఠించినను తక్కినవి తమంతనే దానికంగములుగ సిద్ధించును అట్టివారును భగవదనుగ్రహ పాత్రులై పరమపురుషార్థములను బడయగలుగుదురు. ఇకనీతొమ్మిదింటిని శ్రద్ధగనాచరించు వారినిగూర్చి చెప్పవలసినదేమున్నది? కావున నీతొమ్మిదివిధములైన భక్తులలో నొక్కొక్కదాని స్వరూపము ప్రమాణము సాధనము ఫలము ఉదాహరణములు వివరింపబడగలవు.

# "భూతం సరశ్చ"

శ్రీమతి తిరుమల పెద్దింటి తిరువేంగడ తాయారమ్మగారు, బరంపురం.

పాశురము:- పర్వమెణ త్తిగళ్ తైంగళిలుందియపల్లవమే లిరలుం పావనమాగియ పైందువరాడై పదింద మరు... ముప్పరినూలాడు మునైయి లేందియ ముక్కోల్ తన్నళగుమ్। ముప్పరినూలాడు ముగ్నైయి... ముక్కోల్ తన్నళగుమ్। మున్నకర్తం దిదు మొళిగళ్ నిరైందదుమురవల్ నిలావళగుమ్। కర్పగమేని కరుణై పొందదు కవలలముగ త్తళగుమ్। కారిసుతన్ కళకానూడియమున్యమ్। కననల్లశినైయళగుమ్। ఎట్టాటుశుమ్ యతిరాశన్ వడివళగెన్నిదయత్తిలుళదాన్ ఇల్లై యెనక్కెదిరిల్లై యెనక్కెదిరే॥

శ్లో॥ భూతం సరీశ్చమ హదాహ్వయ బట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖరా యోగివాహా
భక్తాంఘ్రిరేణుపరకాల య తీంద్రమిశ్రా
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మినిత్యం॥

అని భట్టరుసాయించిరి

పూదత్తాళ్వారే, పొయిగైయాళ్వార్లు, పేరియాళ్వార్లు, పెరియళ్వార్లు, తిరుడిశైఆల్వార్లు, కులసేఖరాళ్వార్లు, తిరుప్పాణియాళ్వార్లు, తొండరడిప్పొడియాళ్వార్లు, తిరుమంగైయాళ్వార్లు, ఉడయనరీ, నమ్మాళ్వార్లు మొదలైన వీరికి నిత్యము సేవించెదను అని యీశ్లోకార్దము. మనవారు, పన్నిద్దరాళ్వార్లని చెప్పుదురుకదా దీనియందు, ఆ లెఖసరిపడలేదేఅనిన దానియందు చెప్పబడిన యతిరాజులనుతప్ప తక్కినవారిలో ఆండాళమ్మగారిని మధురకవులను చేర్చినపన్నిద్దరుగురు అనిన యీశ్లోకమున వారినిచేప్పలేదే, వారినిచేర్చుట యెట్లు యెందుకు చేర్చవలెను? చెప్పబడిన ఉదయవీరులను చేర్చకపోవుట యేమిఅనగా యెంబెదరు మానార్లు ఆచార్యకోటిలోచేరి యితర మత నిరసనచేసి స్వమతస్థాపనచేసిన మతకర్తలు కాని ఆళ్వార్లకోటిలోచేరరు. పెరుమాళ్లను మఙ్గళాశాసనముచేసినవారే ఆళ్వార్లు. అయితే యీ శ్లోకములో శ్రీ భక్తిసారఅనునప్పుడు శ్రీ అనివేరుగచెప్పిన ఆండాళనిఅర్థము. యతీంద్రమిశ్రాన్ అనినప్పుడు మిశ్రాన్ వేరుగచెప్పిన మధురకవులని అర్థము. అట్లుచెప్పిన పన్నిద్దరు అయితే మనకుపురుషకారభూతురాలగుద్వయమంత్రమును కటాక్షించిన ప్రధాన మహిషియగు పెరియపిరాట్టియార్ వుండగా దీయయు వాత్సల్యము ప్రధానముగాగలవి "పాపానాం వాశుభానాంవా" అనిచరమశ్లోకమును సాయించిన సీతాపిరాట్టి యుండగా వీరిని చెప్పక అండాళ్‌ను చెప్పుటకు కారణమేమి అంటే "లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరఙ్గధామేశ్వరీం అనిచెప్పబడిన పెరియపిరాట్టి యారే తండ్రియగు సముద్రరాజు గంభీరుడు వృదారుడేగాని, ప్రసన్నుడు మాత్రము కాడు. పంచసంస్కారసరుడై ఒక్కపాశురముచేనైననూ పెరుమాళ్ళను మఙ్గళాశాసనము చేసినట్లు యెచ్చటనూ చెప్పబడలేదు. యికసీతాపిరాట్టి జనకుడైన జనకుడు అప్పటికి యిప్పటికీ అందరకూ జనకుడే. మనఅందరకు తల్లియగు లక్ష్మీదేవికి చంద్రుడుతోడబుట్టుచే మనఅందరకూ చంద్రుడు చందమామ అయినట్లే జనకుడు అయి

ననూ "కర్మణైవహిసంసిద్ధా అస్థితా జనకాదయః" అనట్లు మహాత్ముడు జ్ఞానయోగియైనను కర్మల నాచరించి శుద్ధాత్మస్వరూపమును పొందగలిగినట్టి జనకుడు ప్రసన్నుడుమాత్రముకాడు. కనుకనే స్త్రీప్రాప్తి? ఆ గోష్ఠిలో అధికరించలేము. అయితే ఆండాళ్ళమ్మగారిని చెప్పుటకు కారణము ముందు వారితండ్రిగారి విషయము అనుసంధించవలెను. భూతంశ్చసరశ్చమహదాహ్వయ అని మొదలాళ్వార్లను చెప్పగనే భట్టనాథయని పెరియాళ్వార్లనే చెప్పిరి. పెరియాళ్వార్లనగా పెద్ద ఆళ్వారు అనగా పెద్దభక్తులు అన్నమాట. మొదలాళ్వార్లు నమ్మాళ్వార్లు మొదలుగాగలవారందరూ వుండగా వీరినే పెద్దభక్తులనుటకు కారణము లనేకము. అందులో వీరుచేసిన పుష్పకైంకర్య మేతన్మాత్రమా! ఆ కైంకర్యమునకు ముదమందియే కదా శౌరి వీరిని పిలచి పండితసభకు వాదింపకోరిరి. అప్పుడు వీరు స్వామీ! నన్ను "నితః పరాపత శాస్త్రగ్రంధ జాత్యంధుడన్" అనుచు వీరుచెప్పిన నైచ్యానుసన్ధానము నిరుపమానమైనది. తదుపరి సభకు వేంచేసి యితరమతములను ఖండించి పరతత్త్వ నిర్ణయముచేసి పాణ్డియన్ కొణ్ణాడ పట్టరసిరానీ వద్దానెన్ను" అను రాజలాంఛనములతో వేంచేయునప్పుడు స్వామితమ ఆజ్ఞాకైంకర్యములు నెరవేర్చుకొని వచ్చుచున్నారను సంతోషముతో గరుడవాహనారూఢుడై దేవిమార్లతోకూడా వేంచేసి సేవసాయించగా ఆళ్వార్లు తమసమృద్ధినిచూచి యిరమాప్పచెంది నిరవధికమైన భక్తికలవారై వారిసర్వజ్ఞత్వ సర్వరక్షకత్వాదులను అనుసన్ధించక వారియందున్న సౌందర్యసౌకుమార్యాదులనుచూచి కాలాతీతమైన దేశమందున్న యివ్వస్తువు కాలము సామ్రాజ్యముచేయు దేశమందుసాక్షాత్కరించినదే యీ వస్తువుకు యేమిబాధ కలుగునోయను అస్థానేభయశంఖకలిగి వారు అదిష్ఠించియున్న యేనుగు మెడలోనున్న గంటలను తాళములుగా చేసి "పల్లాండు" అని మఙ్గళాశాసనము చేసిరి. వీరుపాడిన తిరుప్పల్లాండు "వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లాం శురుక్కాయ్ త్తాన్ మఙ్గళమాదలాల్" అన్నట్లు "ఉణ్డో తిరుప్పల్లాణ్డుక్కు ఒప్పదోర్ కలైదాన్" ఉణ్డో పెరియాళ్వార్క్కు ఒప్పొరువర్" అన్నట్లు వారును సాయించిన తిరుప్పల్లాణ్డుకూడా నిరుపమానమైనది. ఇదిని అనుసంధించనిదే యేదివ్య ప్రబంధమును అనుసంధించరు. వీరుచెప్పిన ప్రబంధమే మొదలాయిరమ్ కనుకనే వీరు పెరియాళ్వార్లు వీరి కుమార్తె అయిన ఆండాళమ్మగారు ఆర్చారూపియైన స్వామిని భర్తగా గోరి బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధ "అనునట్లు పింజాయ్ పదుత్తాళ్" కాత్యాయనవ్రతము ఆచరించిరి. కుళిరకుడైనన్దు. వాయినాల్ పాడి మన త్తినాల్ శిద్దిక్క అన్న అండాళ్‌కు పెరియాళ్వార్లకు పర్వత పరమాణువంత తారతమ్యమున్నది. తండ్రి కుమార్తెలలో అంతతారతమ్య మెట్లంటే "అనాది మాయయాసుప్తః" అన్నట్లు సంసారములోపడి నిద్రించుచున్నవారిని లేపి తననుకనసరచగా సేవించినవారు ఆళ్వారాదులు. యీమెతామేవెళ్లి "సుప్తముద్బోధ్య" మనునట్లు యెంబెరుమానాళ్వార్లను లేపి తమకోరతను విన్నవించినవారగుటచే ఆళ్వార్లకన్న ఆండాళ్ విలక్షణులు. "ప్రోక్తం స్వస్యచ కీర్తనమ్ ప్రసవనం సన్తైవ్రిసూనార్పణం" అని కైంకర్యమునే ప్రధానముగా గలిగి తమతండ్రిగారికి తమకు ఆరాధ్యదైవమగు మన్నారుస్వామిని భర్తగాకోరి కాత్యాయన వ్రతమాచరించి ముప్పదుంతిప్పావే అనే ముప్పది పాశురములచే భగవంతునిపాడి పురుషార్థమును లభించిరి. యీమె సాయించిన తిరుప్పావు శ్రీవైష్ణవుల కెల్లరకు నిత్యానుసన్ధేయమై యున్నది. నూటనలుబది పాశురములచే స్వామిననేకవిధములపాడి అనుభవించిరి.

గినే నాయిచ్చియార్ తిరుమొఴి యందురు. ళ్వార్ తిరుమగళ్వార్ అండాళ్ అనియు పెరి యాళ్వార్ పెణ్పిళ్ళైయాయ్ ఆండాళ్ పిఱన్దతిరునాడి గారత్తిన్ శిఱప్పై ఒరునాలుక్కుండో ఆండాళు క్కుండాక ఉండాకిల్ ఒప్పాయిరుక్కు మున్నో? నిన్నా ఆళ్వార్ కళ్ తంశెయలై విఞ్జి నిన్ఱ తన్మైయళాయ్ పిఞ్జాయ్ పళుత్తాళై అని మనవాళమహాముని నాయించిరి. తరువాత మధురమైన కవిత్వముగుటచే వీరికి మధురకవులని పేరు. వీరు పదిపాశురములచే "వేరొన్నుంనానరి యేన్ అని" ప్రారంభించి తెన్కురుగూర్ నబ్బి యన్నిక్కాళ్ అణ్ణిక్కుముదూరుకు" "ఎన్నావుక్కు" అని ఆచార్యభక్తిని వెల్లడించిరి. ఆ పాశురములకే "కణ్ణినుణ్ శిఱుత్తాంబని" పేరు. వాయిత్త తిరుమన్దిరత్తిన్ మత్తిమమాపదంపోల్ శీరియ మహాకవి శెయుకలైయె అరుళిచ్చెయలినుళ్ శీర్ఱ్త్రాగ్ మజ్గళాశాసనము చేసినవారే అన్వర్థనామముతో వారు పాయించిన దివ్యప్రబంధములనబడును. యీ దివ్యప్రబంధముల నద్యయము చేసినవారే ప్రపన్నులనబడుదురు. కనుక శ్రీ వైష్ణవులెల్లరు పైనచెప్పిన "భూతంసరశ్చ" మొదలుకొని తిరు వ్పైన కణ్ణినుణ్ శిఱుత్తాంబును విధిగా నిత్యము అనుసంధించు చుందురు.

# సాంఘిక వార్తలు

## శ్రీ పెరుంబూదూరు

మన శ్రీ జియ్యరుస్వామివారు విద్వాన్ శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు, శ్రీకవిగారు 10-2-59 వ తేది మద్రాసునుండి శ్రీ పెరుంబూదూరుకువిచ్చేసిరి. కొన్ని సంవత్సరముల క్రితము శ్రీ పెరుంబూదురులో శ్రీ కుండలిస్వామివారనే ప్రసిద్ధిగాంచిన చతుశ్శాస్త్ర విద్వాంసులగు శ్రీ మదిత్యాది శ్రీమాన్ ఉభయ వేదాన్త ప్రవర్తకులగు శ్రీ వేంకట నరసింహాచార్య స్వామివారు వేంచేసి శ్రీ భాష్యభగవద్విషయములను కృపచేసి దిగ్గంతులవంటి పండితులను తయారుచేసి నిత్యవిభూతి నలంకరించిరి.

ఆనాడు ఉభయవేదాంత ప్రవచనద్వారా పరమపవిత్రమైన శ్రీ వారి తిరుమాళిఘ క్రమక్రమముగా జీర్ణమై యన్యాక్రాంతమైయుండగా మన శ్రీ జియ్యరుస్వామివారు ఆతిరుమాళిఘను స్వాధీనపరచుకొని జీర్ణోద్ధరణగావించి 10-2-59 వ తేది నాడు ఆవిష్కరణోత్సవము గావించిరి.

ఆతిరుమాళిఘకు, "ఉభయవేదాన్త విద్యావిలాసము కుండలిస్వామి గురుకుటీరము" అను నామకరణముగావించిరి. శ్రీ పెరుంబూదూరులో శ్రీ కుండలిస్వామివారి తిరుమాళిఘ అనేక పండితఛాయాచిత్ర పరిశోభితమై యొకవిద్యానిలయముగా నుండవలెనని సంకల్పము. శ్రీ పెరుంబూదూరు విచ్చేయు విజ్ఞానవంతులైన తైర్థికులందఱు ఇదియేగదా శ్రీకుండలిస్వామివారి తిరుమాళిఘయని సాష్టాంగముగా దాసోహము సమర్పించుచుందురు. ఆవిష్కరణోత్సవమునాడు శ్రీకుండలిస్వామివారి ఛాయాచిత్రమునకు తిరువీధిమహోత్సవము గావింపబడెను. మధ్యాహ్నము పండితసభజరిగెను. మొదట మహావిద్వాన్ కాంచి శ్రీమాన్ ఉ. వే. అణ్ణంగరాచార్య స్వామివారు శ్రీ కుండలిస్వామివారి వైదుష్యమునుగురించి యుపన్యాసించిరి.

పిదప శ్రీమాన్ కవిరత్నగుదిమెళ్ళ రామానుజాచార్య స్వామివారు పద్యరూపముగా శ్రీ కుండలిస్వామివారి వైభవము నుపన్యసించిరి. పిదప విద్వాన్ శ్రీమాన్ ఉ. వే. తె. కం. గోపాలాచార్యస్వామివారు శ్రీ కుండలి స్వామివారి శిష్య వాత్సల్యమును వారిచెంత శ్రీ భాష్య భగవద్విషయములను సేవించిన మందసాసంస్థాన విద్వాంసులును తమకాచార్యులునునగు శ్రీ పరసాపురం వేదాన్తన్యాయవాచస్పతి రామానుజాచార్య స్వామివారియొక్క వైభవమును గురించి యుపన్యసించిరి. పిమ్మట శ్రీ జియ్యరుస్వామివారు శ్రీ కుండలిస్వామివారిని గురించియు వారి తిరుమాళిఘను జీర్ణోద్ధరణగావించుటలోగల తమ యభిప్రాయమును వారివిజ్ఞానసంపదను గురించి యుపన్యసించిరి పిదప పండితసన్మానములుజరిగెను. శ్రీ కుండలిస్వామివారి తిరుమాళిఘ కైంకర్యములో అధికముగా శ్రీ గొల్లపూడి అమ్మణ్ణమ్మగారు, శ్రీ ఊయ్యూరు రాణీగారు, శ్రీ మీర్జాపురం రాణీగారు, శ్రీ గొల్లపూడి కనకవల్లి తాయారమ్మగారు, శ్రీ కోటా సులోచనమ్మగారు, శ్రీ మట్టపల్లి నాదమ్మగారు, శ్రీ శొధలూరి లక్ష్మీనరమ్మగారు ఇత్యాదులు ఉపకరించిరి.

ఇట్టి శ్రీవారి తిరుమాళిఘ జీర్ణోద్ధరణ కైంకర్యమందు, విశిష్యఅన్వయించి, వాచికముగాను, శారీరకముగాను, అఖండసేవాదులు శ్రీమాన్ న. చ. శఠకోపాచార్యులు, శ్రీ చీదెళ్ల కుట్టెమ్మగారు గావించిరి.

ఈ విధముగా యీ కైంకర్యమందు అన్వయించిన యెల్లవారికిని శ్రియఃపతి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక.

శ్రీ కుండలి స్వామివారి తనియశ్లోకము

శ్లో. శ్రీశైల లక్ష్మణయతీన్ద్ర కృపాత్తబోధమ్
వేదాన్తయుగ్మ విశదీకరణైక దీక్షమ్
శ్రీరాఘవార్య పదపంకజ భృంగరాజమ్
శ్రీమన్నృసింహ గురువర్య మహంభజామి.

శ్లో. జీయా దుభయ వేదాన్త
విద్యావిలస నాహ్వయ
కుండలి స్వామిపాదానా
మిదం గురుకుటీరకమ్

# తిరుమలలో – ఉచిత – ఉపనయనములు

మద్రాసు గీతామందిరమునుండి 12-2-59 వ తేది ప్రభాతకాలములో శ్రీ జియ్యరు స్వామివారు, తమకార్యదర్శులతోను, పరివారముతోను బయలుదేరి తిరుమలకు వేంచేసిరి.

తిరుమలలో 12-2-59 వ తేది రాత్రి ఆగంతుకులైన వటువులకు శాస్త్రీయముగా ఉదక

ంతి జరిపింపబడెను. ఈ ఉపనయనముల నిమిత్తమై, మద్రాసు, బందరు, తెనాలి, రాజమండ్రి, రాల, మైసూరు, కడప, ప్రొద్దుటూరు ప్రాంతములనుండి 20 మందివటువులు విచ్చేసిరి.

శ్రీజియ్యరు స్వామివారి యాజమాన్యమున, యీ వటువులందఱకు 13-2-59 వ తేది డు పరమవిలక్షణముగా వైదిక సంప్రదాయముతో ఉపనయనములు గావింపబడెను. 14-2-59 దయము కోరినవారికి పంచసంస్కారదీక్ష గావింపబడెను. వచ్చిన ఆగంతుకులందఱకు విలక్షణముగా తదీయారాధనజరిగెను.

ఏకకాలములో ఒక్కసారిగా ఇంతమంది వటువులు పసుపువస్త్రములతో, పాలాశదండములతో, పంచశిఖలతో, నూత్నయజ్ఞోపవీతములతో, భవతి భిక్షాందేహియని భిక్షాకార్యక్రమము నుపక్రమించుచుండగా చూచుటకెంతయో ముచ్చటగానుండెను. వటువులందఱకు ఉపనయనములకు ముందు, ఉపనయనముల తరువాత తిరుమల శ్రీనివాససందర్శనము, తీర్థశఠకోప ప్రసాదములు శ్రీజియ్యర్ స్వామివారు స్వీకరింపజేయించిరి.

ఈ విధముగా అర్హతగలవటువు లందరకు ఉచితముగా సంవత్సరమునకు రెండువర్యాయములు శ్రీజియ్యర్ స్వామివారు ఉపనయనములు గావించుచుందురు.

రాత్రి వటువులందరకు సంధ్యావందన ప్రయోజనమునుగురించి శ్రీ జియ్యరుస్వామివారు ఉపన్యసించిరి.

## ఉపనీతులైనవటువులు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కాండూరు వరదరాజాచార్యులు | కడప |
| 2. | „ కాండూరు జగన్నాథాచార్యులు | „ |
| 3. | „ కాండూరు శ్రీనివాసాచార్యులు | „ |
| 4. | „ కాండూరు నారాయణాచార్యులు | „ |
| 5. | „ అద్దంకి నరసింహాచార్యులు | ప్రొద్దుటూరు |
| 6. | „ కాండూరు రాజమన్నారాచార్యులు | మద్రాసు |
| 7. | „ కాండూరు కృష్ణమాచార్యులు | దువ్వూరు |
| 8. | „ కాండూరు శ్రీనివాసాచార్యులు | ప్రొద్దుటూరు |
| 9. | „ శ్రీనివాసన్ | మద్రాసు |
| 10. | „ పంచాంగం మోహనకృష్ణమాచార్యులు | బందరు |
| 11. | „ నల్లానిచక్రవర్తుల గోపాలాచార్యులు | మద్రాసు |
| 12. | „ కోమాండూరు ఇళైవిల్లి వెంకటరామానుజాచార్యులు | „ |
| 13. | „ కనుమూరి రాజగోపాలాచార్యులు | చేబ్రోలు |
| 14. | „ ఉత్పల వెంకటశేషాచార్యులు | బాపట్ల |
| 15. | „ ఉత్పల రాజగోపాలాచార్యులు | „ |
| 16. | „ ముడుంబై నరసింహాచార్యులు | మద్రాసు |
| 17. | „ చిలకమర్రి వెంకటనారాయణాచార్యులు | రాజమండ్రి |
| 18. | „ శింగవరపు సీతారామాచార్యులు | సురపురం |
| 19. | „ మెదల్ రామచంద్రాచార్యులు | „ |
| 20. | „ చుండూరు వెంకటసుబ్బారావు | చీరాల |

